# శ్రీమదాంధ్ర

# మహాభాగవతము

## దశమ, ఏకాదశ, ద్వాదశ స్కంధములు

[బమ్మెర పోతనామాత్య ప్రణీతము]

విద్వాన్ వల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులుగారిచే

పరిష్కరింపబడి, లఘుటీక వ్రాయబడినది




ప్రకాశకులు :

వెంకట్రామ అండ్ కో.,

విజయవాడ - మద్రాసు.

౧౯౬౦

 [వెల రు 4-8-0

## —: శ్రీ సరస్వతీ ప్రార్థన :—

ఉ. క్షోణితలంబు నెన్నుదురు । సోఁకగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయ । సుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ । చిత్తవశీకరణైకవాణికిన్
వాణికి నక్షదామ శుక । వారిజ పుస్తకరమ్య పాణికిన్.

శా. తల్లీ నిన్నుఁ దలంచి పుస్తకము చేతంబూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా । నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లంబల్కుము నాదువాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ । పూర్ణేందు బింబాననా.

## శ్రీమద్భాగవతగ్రంథ ప్రణేతయగు వ్యాసమహర్షి ప్రార్థన

ఉ. ప్రాంశుపయోద నీలతను । భాసితు నుజ్జ్వల దండధారుఁ బిం
గాంశు జటాచ్ఛటాభరణు । నాగమపుంజ పదార్థతత్త్వ ని
స్సంశయకారుఁ గృష్ణమృగ । చర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశ । వందితు సాత్యవతేయుఁ గొల్చెదన్.

## —: శ్రీమద్భాగవతాద్యుపదేష్ట యగు :—
## శుకమహర్షి ప్రార్థన

మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై । సన్న్యాసియై యొంటి బో
వ మహాభీతి నొహోకుమార యనుచున్ వ్యాసుండు చీరంగ వృ
క్షములుం దన్మయతన్ బ్రతిధ్వనులు చక్కంజేసె మున్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్ ధీమణిన్

## —: శ్రీమద్భాగవత ప్రార్థన :—

ఆ. వేదకల్పవృక్ష । విగళితమయి శుక
ముఖ సుధాద్రవమున । మొనసియున్న
భాగవత పురాణ । ఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసిక । భావవిదులు.

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై.

—: శ్రీమద్భాగవతగ్రంథ నాయకుడగు :—

శ్రీరామచంద్ర స్తుతి

శ్రీకంఠ చాపఖండన
పాకారి ప్రముఖ వినుత భండన విలస
త్కాకుత్స్థ వంశమండన
రాకేందు యశోవిశాల రామనృపాలా!

# శ్రీమదాంధ్ర భాగవతము

## దశమస్కంధము - పూర్వభాగము

## విషయసూచిక

పేజీ.

## దశమస్కంధము - ఉత్తరభాగము

## ఏకాదశస్కంధము



## ద్వాదశస్కంధము

క. మా పెద్దలు మును వేల్పుల
నోపని భీష్మాది కురు కు ♦ లోత్తమసేనా
కూపారము నే [1]కోలము
ప్రాపున లంఘించి రొక్క ♦ బాలపదముగాన్. 6

క. మా యమ్మకుక్షిఁ గురుసుతు
సాయకపీడితుఁడ నైన ♦ జడుఁ నన్నును గాం
తేయకురుకులము మొదలుగ
నా యుత్తముఁ డాత్తచక్రుఁ ♦ డై రక్షించెన్. 7

ఆ. కలసి పురుషమూర్తి ♦ కాలరూపములను
లోకజనుల వెలిని ♦ లోననుండి
జన్మమృత్యువులను ♦ సంసారముక్తుల
నిచ్చు నతనిచరిత ♦ మెల్లఁ జెపుమ. 8

సీ. ఊహించి రాముఁడు ♦ రోహిణి కొడు కంచు
నెప్పుడు యోగీంద్ర ♦ చెప్పి తీవు
దేవకికడుపున ♦ నే వెరవున నాతఁ
డుండెను దేహంబె ♦ యొండు లేక
తనతండ్రి యిలు వాసి ♦ వనజాక్షుఁ డేరీతి
మందకుఁ బోయె నే ♦ మందిరమున
నుండి యెయ్యది సేయు ♦ చుండెను దశమేన
మామ కంసుని నేల ♦ నాఁడు మసఁజే

ఆ. నెన్నియేండ్లు మనియె ♦ నిలమీఁద మనుజుఁడై
యెందఱైరి భార్య ♦ లెట్లు మెలఁగె
మఱియు నేమి సేసె ♦ మాధవుచారిత్ర
మెంతగలదు నాకు ♦ నేర్పఱింపు. 9

వ. అని మఱియు నిట్లనియె. 10

ఆ. నీముఖాంబుజాత ♦ నిర్ముక్తహరికథా
మృతముఁ ద్రావఁ ద్రావ ♦ మేను వాఁదలె

1. తెప్ప.

క. మా పెద్దలు మును వేల్పుల
నోపని భీష్మాది కురు కు ♦ లోత్తమసేనా
కూపారము నే [1]కోలము
ప్రాపున లంఘించి రొక్క ♦ బాలపదముగాన్. 6

క. మా యమ్మకుక్షి గురుసుతు
సాయకపీడితుండ నైన ♦ జనుఁ నన్నును గాం
తేయకురుకులము మొదలుగ
నా యుత్తముఁ డాత్తచక్రుఁ ♦ డై రక్షించెన్. 7

ఆ. కలసి పురుషమూర్తి ♦ కాలరూపములను
లోకజనుల వెలిని ♦ లోననుండి
జన్మమృత్యువులను ♦ సంసారముక్తుల
నిచ్చు నతనిచరిత ♦ మెల్లఁ జెపుము. 8

సీ. ఊహించి రాముఁడు ♦ రోహిణి కొడు కంచు
నప్పుడు యోగీంద్ర ♦ చెప్పి తీవు
దేవకికడుపున ♦ నే వెరవున నాతఁ
డుండెను దేహంబె ♦ యొండు లేక
తనతండ్రి యిలువాసి ♦ వనజాక్షుఁ డేరీతి
మందకుఁ బోయె నే ♦ మందిరమున
నుండి యెయ్యది సేయు ♦ చుండెను దన మేన
మామ కంసుని నేల ♦ నాము డఁచె

ఆ. నెన్నియేండ్లు మనియె ♦ నిలమీఁద మనుజుఁడై
యెందఱైరి భార్య ♦ లెట్లు మెలఁగె
మఱియు నేమి సేసె ♦ మాధవుచారిత్ర
మెంతగలదు నాకు ♦ నేర్పరింపు. 9

వ. అని మఱియు నిట్లనియె. 10

ఆ. నీముఖాంబుజాత ♦ నిర్ముక్తహరికథా
మృతముఁ ద్రావఁ ద్రావ ♦ మేను వొదలె

1. తెప్ప.

సంసారమనె నీరు ♦ పట్టు నాకలియును
నూరిమర్యు మనము ♦ తొంగలించె. 11

వ. అని పలుకుచున్న రాజుమాటలు విని వైయాసి యిట్లనియె.

క. విష్ణుకథారతుఁ డగు నరు
విష్ణుకథల్ సెప్పు నరుని ♦ వినుచుండు నరున్
విష్ణుకథాసంప్రశ్నము
విష్ణుపదీజలముభంగి ♦ విమలులఁ జేయున్. 13

సీ. రాజేంద్ర విను తొల్లి ♦ రాజలాంఛనముల
వేలసంఖ్యల దైత్య ♦ విభులు దన్ను
నాక్రమించిన భార ♦ మాఁగఁజాలక భూమి
గోరూపయై బ్రహ్మఁ ♦ జేరఁ బోయి
కన్నీరు మున్నీరు ♦ గా రోదనము సేయఁ
గరుణతో భావించి ♦ కమలభవుఁడు
ధరణి నూఱడఁ బల్కి ♦ ధాత్రియు వేల్పులుఁ
గదలి రా విష్ణునిఁ ♦ గాన నేఁగి

తే. పురుషసూక్తంబుఁ జదివి య ♦ ద్భుతసమాధి
నుండి యొకమాట విని వారి ♦ జోద్భవుండు
వినుఁడు వేల్పులు ధరయు నే ♦ విన్నయట్టి
పలుకు వివరింతు నని ప్రీతిఁ ♦ బలికెఁ దెలియ. 14

క. యాదవకులమున నమరులు
మేదినిపైఁ బుట్టఁ జనుఁడు ♦ మీయంశములన్
శ్రీదయితుఁడు వసుదేవున
కాదరమునఁ బుట్టి భార ♦ మంతయుఁ బాపున్. 15

క. హరిపూజార్థము పుట్టుఁడు
సురకన్యలు భూమియందు ♦ సుందరతనులై
హరికగ్రజుఁడై శేషుఁడు
హరికళతోఁ బుట్టు ధాత్రి ♦ యారంభుండై. 16

ఆ. ఈ ప్రపంచ మెల్ల ♦ నే మాయచే మోహి
తాత్ముఁ జేయుచుందు ♦ నట్టిమాయ
కమలనాభునాజ్ఞఁ ♦ గార్యార్థియై నిజాం
శంబుతోడఁ బుట్టు ♦ జగతియందు. 17

వ. అని యిట్లు వేల్పుల నియ్యకొలిపి పుడమిముద్దియ నోడం బఱిచి తమ్మిచూలి దన మొదలి నెలవునకుం జనియె. అంత యదువిభుండయిన శూరసేనుం డనువాఁడు మథురాపురంబు తనకు రాజధానిగా మాథురంబులు శూరసేనంబులనియెడు దేశంబు లేలెం బూర్వకాలంబున. 18

క. ఏ మథురయందుఁ బ్రియమున
శ్రీమన్నారాయణుండు ♦ చెలు వగు నిత్యం
బా మథుర సకలయాదవ
భూమీశుల కెల్ల మొదలి ♦ పురియయ్యె నృపా. 19

సీ. ఆ శూరసేనున ♦ కాత్మజుండగు వసు
దేవుఁ డా పురి నొక్క ♦ దినమునందు
దేవకిఁ బెండ్లియై ♦ దేవకియును దానుఁ
గడువేడ్క రథమెక్కి ♦ కదలువేళ
నుగ్రసేనుని పుత్త్రుఁ ♦ డుల్లాసి గంసుండు
చెల్లెలి మఱఁదియు ♦ నుల్లసిల్ల
హరులపగ్గములఁ జే ♦ నంది రొప్పఁదొడంగె
ముందట భేరులు ♦ మురజములును

ఆ. శంఖపటహములును ♦ జడిగొని మ్రోయంగఁ
గూఁతుతోడి వేడ్క ♦ కొనలు సాఁగ
దేవకుండు సుతకు ♦ దేవకీదేవికి
నరణ మీఁదలంచి ♦ యాదరించి. 20

వ. సార్థంబు లయిన రథంబుల వేయునెనమన్నూటిని గనకదామసముత్తుంగంబులయిన మాతంగంబుల నన్నూటిని బది వేల తురంగంబులను విలాసవతు లయిన దాసీజనంబుల

నిమ్నాటిని నిచ్చి యనిచినంగదలి వరవధూయుగళంబు
చెరువునం జను సమయంబున. 21

క. పగ్గములు వదలి వేగిర
మగ్గలముగ రథముఁ గడపు ♦ నా కంసునకు లో
బెగ్గిలి యొగ్గని తలఁపఁగ
దిగ్గన నశరీరవాణి ♦ దివి నిట్లనియెన్. 22

క. తుష్ట యగు భగిని మెచ్చఁగ
నిష్టుఁడవై రథముగడపె ♦ దెఱుఁగవు, మీఁదన్
శిష్ట యగు నీ తలోదరి
యష్టమగర్భంబు నిన్ను ♦ హరియించుఁజుమీ. 23

వ. అని యిట్లాకాశవాణి పలికిన నులికిపడి భోజకులపాపకుండైన
పాపుండు కంసుండు సంచలదంసుండై యడిదంబు బెడిదంబుగాఁ
జేతికి జళిపించి దెప్పరంబుగ ననుజ కొప్పుఁబట్టి కప్పురపాటు
నొప్పులం దిగిచి మొగిసిపట్టి తోఁబుట్టువని తలంపక త్రెంపుసేసి
తెగ వ్రేయ గమకించు సమయంబున వసుదేవుండు డగ్గఱి. 24

క. ఆ పాపచిత్తు మత్తుం
గోపాగ్నిశిఖానుసృప్తుఁ ♦ గొనకొని తన స
ల్లాపామృతధారావి
క్షేపంబునఁ గొంత శాంతుఁ ♦ జేయుచుఁ బలికెన్. 25

ఉ. అన్నవు నీవు చెల్లెలికి ♦ నక్కట పండుగ చీర లిచ్చుటో
మన్ననసేయుటో మధుర ♦ మంజులభాషల నాదరించుటో
మిన్నులప్రోవఁతలే నిజము ♦ మేలని చంపకు మన్న మానిరా
వన్న సహింపుమన్న తగ ♦ దన్న వధింపకుమన్న వేఁడెదన్. 26

వ. అదియునుం గాక. 27

మ. చెలియల్ కన్నియ ముగ్ధ బాలిక యని ♦ సేమంబ చింతించు ని
ర్మల నీతిన్ బయలారసూనులకునై ♦ మర్యాదఁ బోఁదట్టి స
త్కులజాతుండవు పుణ్యమూర్తి నకటా ♦ కోపంబు పాపంబు నె
చ్చెలి నోహో తెగ వ్రేయ గాథిలుఁగునే ♦ చింతిపు భోజేశ్వరా. 28

నిచ్చె నాకీని నిచ్చి యనిచినంగదలి · వరవధూయుగళంబు
దెరువునం జను సమయంబున. 21

క. పగ్గములు వదలి వేగిర
మగ్గలముగ రథముఁ గడపు ♦ నా కంసుఁడు లో
బెగ్గిలి యొగ్గని తలఁపఁగ
దిగ్గన నశరీరవాణి ♦ దివి నిట్లనియెన్. 22

క. తుష్ట యగు భగిని మెచ్చఁగ
నిష్ఠుఁడవై రథముగడపె ♦ దెలియఁగవు, మీఁదన్
శిష్ట యగు నీ తలోదరి
యష్టమగర్భంబు నిన్ను ♦ హరియించుఁజుమీ. 23

వ. అని యిట్లాకాశవాణి పలికిన నులికిపడి · భోజకులనాశకుండైన
పాపుండగు కంసుండు సంచలదంసుండై యడిదంబు బెడిదంబుగాఁ
బెఱికి జళిపించి చెప్పరంబుగ ననుజ కొప్పుఁబట్టి కప్పరపాటు
నొప్పుచుండ దిగిచి మోడిసిపట్టి తోఁబుట్టువని తలంపక తెంపుసేసి
తెగ వ్రేయ గమకించు సమయంబున వసుదేవుండు డగ్గఱి. 24

క. ఆపాపచిత్తు మత్తుం
గోపాగ్నిశిఖాసుతప్తు ♦ గొనకొని తన స
ల్లాపామృతధారావి
క్షేపంబునఁ గొంత శాంతుఁ ♦ జేయుచుఁ బలికెన్. 25

ఉ. అన్నవు నీవు చెల్లెలికి ♦ సక్కట మండలు చీర లిచ్చుటో
మన్ననసేయుటో మధుర ♦ మంజులభాషల నాదరించుటో
మిన్నులఁ ద్రోఁతలే నిజము ♦ మేలని చంపకు మన్న మానిరా
వన్న సహింపుమన్న తగ ♦ దన్న వధింపకుమన్న వేఁడెదన్. 26

వ. అదియునుం గాక. 27

మ. చెలియల్ కన్నియ ముద్దరాలబల సీ ♦ సేమంబు చింతించు ని
ర్మలధీనిన్ బయలాసమాటలకునై ♦ మర్యాదఁ బోఁదట్టి స
త్కులజాతుండవు పుణ్యమూర్తి వకటా ♦ కోపంబు పాపంబు నె
చ్చెలి నోహో తెగ వ్రేయ రాఁడియగునే ♦ చింతింపు భోజేశ్వరా. 28

నిమ్నాటిని నిచ్చి యనిచినంగదలి వరవధూయుగళంబు
తెరువునం జను సమయంబున. 21

క. పగ్గములు వదలి వేగిర
మగ్గలముగ రథముఁ గడపు ♦ నా కంసుఁడు లో
బెగ్గిలి యెగ్గని తలఁపఁగ
దిగ్గన నశరీరవాణి ♦ దివి నిట్లనియెన్. 22

క. తుష్ట యగు భగిని మెచ్చఁగ
నిష్టుఁడవై రథముగడపె ♦ దెలియఁగవు, మీఁదన్
శిష్ట యగు నీ తలోదరి
యష్టమగర్భంబు నిన్ను ♦ హరియించుఁజుమీ. 23

వ. అని యిట్లాకాశవాణి పలికిన నులికిపడి భోజకులనాశకుండైన
పాపుండు కంసుండు సంచలదంసుండై యడిదంబు బెడిదంబుగాఁ
జేతికి జళిపించి దెప్పరంబుగ ననుజ కొప్పుఁబట్టి కప్పరపాటు
నొప్పుటం దిగిచి మొగిసిపట్టి తోఁబుట్టువని తలంపక తెంపుసేసి
తెగ వ్రేయఁ గమకించు సమయంబున వసుదేవుండు డగ్గఱి. 24

క. ఆ పాపచిత్తు మత్తుం
గోపాగ్నిశిఖానువృత్తుఁ ♦ గొనకొని తన స
ల్లాపామృతధారావి
క్షేపంబునఁ గొంత శాంతుఁ ♦ జేయుచుఁ బలికెన్. 25

ఉ. అన్నవు నీవు చెల్లెలికి ♦ నక్కట మాడలు చీర లిచ్చుటో
మన్ననసేయుటో మధుర ♦ మంజులభాషల నాదరించుటో.
మిన్నుల మ్రోఁతలే నిజము ♦ మేలని చంపకు మన్న మానిరా
వన్న సహింపుమన్న తగ ♦ దన్న వధింపకుమన్న వేఁడెదన్. 26

వ. అదియునుం గాక. 27

మ. చెలియల్ కన్నియ ముగ్ధురా లబల నీ ♦ సేమంబు చింతించు ని
ర్మల దీనిన్ బయలాడుమాటలకునై ♦ మర్యాదఁ జోఁదట్టి స
త్కుల జాతుండవు పుణ్యమూర్తి వకటా ♦ కోపంబు పాపంబు నె
చ్చెలి నోహో తెగ వ్రేయ బాడియగునే ♦ చింతింపు భోజేశ్వరా. 28

సీ. మేనితోడన పుట్టు ♦ మృత్యువు జనులకు
నెల్లి నేఁడైన నూ ♦ ఱేండ్లకైనఁ
దెల్లంబు మృత్యువు ♦ దేహంబు పంచత్వ
మందఁ గర్మానుగుం ♦ డై శరీరి
మాఱు దేహము నూఁది ♦ మఱితొంటి దేహంబు
బాయును దనపూర్వ ♦ భాగమెత్తి
వే ఱొంటిపైఁ బెట్టి ♦ వెనుకభాగం బెత్తి
గమనించు తృణజలూ ♦ కయునుబోలె

ఆ. వెంట వచ్చు కర్మ ♦ విసరంబు మును మేలు
గన్న వేళ నరుఁడు ♦ గన్న విన్న
తలఁపఁబడిన కార్య ♦ తంత్రంబు కలలోనఁ
జాడితోడఁ గానఁ ♦ బడినయట్లు. 29

క. తన తొంటి కర్మరాశికి
ననుచరమై బహువికార ♦ మై మనసు నడిం
జను నింద్రియముల తెరువులఁ
దనువులు పెక్కైనఁ జెడవు ♦ తనకర్మంబుల్. 30

ఆ. జలఘటాదులందు ♦ జంద్రసూర్యాదులు
గానఁబడుచు గాలిఁ ♦ గదలుభంగి
నాత్మకర్మనిర్మి ♦ తాంగంబులను బ్రాణి
గదలుచుండు రాగ ♦ కలితుఁ డగుచు. 31

క. కర్మములు మేలు నిచ్చును
గర్మంబులు గీడు నిచ్చుఁ ♦ గర్మలు దనకుం
గర్మములు బ్రహ్మకైనను
గర్మగుఁడై పరులఁ దడవఁ ♦ గా నేమిటికిన్. 32

క. కావునఁ బరులకు హింసలు
గావింపఁగ వలదు తనకుఁ ♦ గల్యాణముగా
భావించి పరుల నొంచినఁ
బోవునె తత్ఫలము పిదపఁ ♦ బొందక యున్నే. 33

మత్తకోకిలము.

వావిఁ జెల్లెలుగాని కూఁతురు ♦ వంటి దుత్తమురాలు సం
భావనీయచరిత్ర భీరువు ♦ బాల నూత్నవివాహ సు
శ్రీవిలాసిని దీనకంపిత ♦ చిత్త దీనిని మ్రొక్కెదం
గావవే కరుణామయాత్మక ♦ కంస మానవవల్లభా. 34

వ. అని మఱియు సామభేదంబు లగు పలుకులు పలికిన వినియు వాఁడు వేఁడిచూపుల రాలు నిప్పులు గుప్పలుగొన ననుకంప లేక తెంపుసేసి చంపకగంధిం జంపఁజూచుట యెఱింగి మొఱంగెడి తెఱంగు విచారించి తనలో నిట్లనియె. 35

క. ఎందును గాలము నిజ మని
పందతనంబునను బుద్ధి ♦ బాయక ఘనులై
యెందాఁక బుద్ధి నెగడెడి
నందాఁకఁ జరింపవలయు ♦ నాత్మబలమునన్. 36

వ. అని నిశ్చయించి. 37

సీ. ఆపన్నురాలైన ♦ యంగన రక్షించి
సుతుల నిచ్చెద నంట ♦ శుభము నేఁడు
మీఁ దెవ్వఁ డెఱుఁగును ♦ మెలఁత ప్రాణంబుతో
నిలిచిన మఱునాఁడు ♦ నేరరాదె
సుతులు పుట్టిరయేని ♦ సుతులకు మృత్యువు
వాలాయమై వెంట ♦ వచ్చెనేని
బ్రహ్మచేతను వీఁడు ♦ పాటిమియును లేక
యుండునే సదుపాయ ♦ మొకటి లేదె

తే. పొంతమ్రాకుల గాల్పక ♦ పోయి వహ్ని
యెగసి దవ్వులవాని ద ♦ హించు భంగి
గర్మవశమున భవమృతి ♦ కారణంబు
దూరగతిఁ బొందు నిదియేల ♦ తొట్రుపడఁగ. 38

క. కొడుకుల నిచ్చెద నని సతి
విడిపించుట నీతి వీఁడు ♦ విడిచిన మీఁదన్

కొడుకులు పుట్టినఁ గార్యము
దడఁబడదే నాఁటి కొక్క ♦ దైవము లేదే. 39

క. ఎనిమిదవచూలు వీనిం
దునుమాడెద నంచు మింటఁ ♦ దోరపుఁ బలుకుల్
వినఁబడియె నేల తప్పును
వనితను విశసించు టొప్పు ♦ వైశం బనుచున్. 40

క. తిన్నని పలుకులు పలుకుచుఁ
గ్రన్నన తగఁ బూజ చేసి ♦ కంసు నృశంసున్
మన్నించి చిత్త మెరియఁ బ్ర
సన్నాననుఁ డగుచుఁ బలికె ♦ శౌరి నయమునన్. 41

క. లలనకుఁ బుట్టిన కొమరుని
వలనం దెగె ననుచు గగన ♦ వాణి వలికె నం
చలిగెద వేని మృగాక్షికిఁ
గల కొడుకులఁ జంప నిత్తుఁ ♦ గ్రమమున నీకున్. 42

వ. అని యిట్లు పలికిన విని కంసుండు కంపితాననుండై సంత
సించి గుణగ్రాహిత్వంబు గైకొని కొండలపందు చెలియలి
మందల విడిచి చనియె. వసుదేవుండును డెందంబున నానం
దంబు నొందియుండె నంత గొంతకాలంబు సనిన సమ
యంబున. 43

క. విమవక కంసుని యొగ్గులఁ
బడి దేవకి నిఖిలదేవ ♦ భావము దనకే
ర్పడ నేఁట నొక్కని లెక్కను
గొడుకుల నెనమండ్ర నొక్క ♦ కూఁతుం గనియెన్. 44

వ. అంత, 45

ఆ. సుదతి మున్ను గన్న ♦ సుతుఁ గీర్తిమంతునిఁ
బుట్టు దడవ కంస ♦ భూవరునకుఁ
దెచ్చి యిచ్చెఁ జాల ♦ ధృతి గల్గి వసుదేవుఁ
డానపడక సత్య ♦ మందు నిలిచి, 46

క. పలికినపలుకులు దిరుగక
సొలయక వంచనము లేక ♦ సుతుల రిపునకుం
గలఁగక యిచ్చిన ధీరుం
డిల వసుదేవుండు దక్క ♦ నితరుఁడు గలఁడే. 47

ఆ. మానవేంద్ర సత్య ♦ మహికి దుష్కరమెయ్య
దెఱుఁగనేర్చువాని ♦ కిష్ట మెయ్య
దీశభక్తిరతుని ♦ కీరాని దెయ్యది
యెఱుక లేనివాని ♦ కేది కీడు. 48

వ. ఇట్లు సత్యంబుతప్పక కొడుకు నొప్పించిన వసుదేవుని పలుకు నిలుకడకు మెచ్చి కంసుం డిట్లనియె. 49

ఆ. కొడుకు నీవు మరలఁ ♦ గొనిపొమ్ము వసుదేవ
వెఱపు లేదు నాకు ♦ వీనివలన
నల్ల వీనికి భవ ♦ దష్టమపుత్త్రుండు
మృత్యువఁట వధింతు ♦ మీఁదసుతుని. 50

వ. అనిన నానకదుందుభి నందనుంగొని చనియె నానందంబు నొందకదుష్టస్వభావుండగు బావపలుకులు వినియు నులుకుచుండెనంత.

సీ. ఒకనాఁడు నారదుం ♦ డొయ్యన కంసుని
యింటికిఁ జనుదెంచి ♦ యేకతమున
మందలోపలనున్న ♦ నందాదులును వారి
భార్యలు బుత్త్రులు ♦ బాంధవులును
దేవకి మొదలగు ♦ చెలువలు వసుదేవుఁ
డాదిగాఁగల సర్వ ♦ యాదవులును
సురలుగాని నిజంబు ♦ నరులుగారని చెప్పి
కంసుండ నీవు ర ♦ క్కసుఁడ వనియు

ఆ. దేవమయుఁడు చక్రి ♦ దేవకీదేవికిఁ
బుత్త్రుఁడై జనించి ♦ భూతలంబు

సెఱుపఁ బుట్టినట్టి ♦ చెనఁటిదైత్యుల నెల్లఁ
జంపుననుచుఁ జెప్పి ♦ చనియె దివికి. 52

క. నారదుమాటలు విని పె
ల్లారాటముఁ బొంది యదువు ♦ లనిమిషు లనియున్
నారాయణకరఖడ్గ వి
దారితుఁ డగు కాలనేమి ♦ దా ననియు మదిన్. 53

మ. కలఁగం బాఱి మఱందిఁ జెల్లెల నుద ♦ గ్రక్రోధుఁడై పట్టి బ
ద్ధులఁ గావించి హరిం దలంచి వెసఁ దో ♦ డ్తో వారు గన్నట్టి పు
త్రులఁ జంపెన్ గురునుగ్రసేను యదుఁ ద ♦ ద్భోజాంధకాధీశు ని
ర్మలుఁ బట్టెం గడు వాలి యేలెఁ జలమా ♦ రన్ శూరసేనంబులన్.

ఆ. తల్లిఁ దండ్రి నైనఁ ♦ దమ్ముల నన్నల
సఖుల నైన బంధు ♦ జనుల నైన
రాజ్యకాంక్షఁ జేసి ♦ రాజులు-సంపుదు
రవనిఁ దఱచు జీవి ♦ తార్థు లగుచు. 55

వ. మఱియు బాణ భౌమ మాగధ మహాశన కేశి ధేనుక బక ప్రలంబ తృణావర్త చాణూర ముష్టి కారిష్ట ద్వివిద పూతనాది సహాయ సమేతుండై కంసుండు గదనంబున మదంబు లడంచిన వదనంబులు వంచికొని సదనంబులు విడిచి యదనలై యదువులు పదవులు విడిచి నిషధ కురు కోసల విదేహ విదర్భ కేకయ పాంచాల సాల్వ దేశంబులు సొచ్చిరి. మచ్చరంబులు విడిచి కొందఱు కంసునిం గొలిచి నిలిచి రంత. 56

క. తొడిఁ దొడిఁ గంసుఁడు దేవకి
కొడుకుల నార్వుర వధింప ♦ గురుశేషాఖ్యం
బొడ వగు హరిరుచి యాసతి
కడుపున నేడవది యైన ♦ గర్భం బయ్యెన్. 57

వ. అయ్యవసరంబున విశ్వరూపుం డగు హరి దన్ను నమ్మిన యదువులకుఁ గంసునివలన భయంబు గలుగునని యెఱింగి యోగమాయాదేవి కిట్లనియె. 58

సీ. గోపికాజనములు ♦ గోపాలకులు నున్న
పసులమందకుఁ బొమ్ము ♦ భద్ర నీవు
వసుదేవు భార్యలు ♦ వరుస గంసునిచేత
నాఁకలఁ బడియుండ ♦ నందుఁ జొరక
తలఁగి రోహిణి యను ♦ తరళాక్షి నందగో
కులమందు నున్నది ♦ గుణగణాఢ్య
దేవకికడుపున ♦ దీపించు శేషాఖ్య
మైన నా తేజ మీ ♦ వమరఁ బుచ్చి

ఆ. నేర్పు మెఱసి రోహి ♦ ణీదేవి కడుపునఁ
జొనుపు దేవకికిని ♦ సుతుఁడ నగుదు
నంశభాగయుతుఁడ ♦ నై యశోదకు నందు
పొలఁతి కంతమీఁదఁ ♦ బుట్టె దీవు. 59

క. నానావిధసంపదలకుఁ
దానకమై సర్వకామ ♦ దాయిని వగు నిన్
మానవులు భక్తిఁ గొలుతురు
కానికలును బలులు నిచ్చి ♦ కల్యాణమయీ. 60

వ. మఱియు నిన్ను మానవులు దుర్గ భద్రకాళి విజయ వైష్ణవి కుముద చండిక కృష్ణ మాధవి కన్యక మాయ నారాయణి యీశాన శారద యంబిక యను పదునాలుగు నామంబులం గొనియాడుదురు. రమ్యస్థానంబులయం దని యెఱింగించి సర్వేశ్వరుండగు హరి పొమ్మని యానతిచ్చిన మహాప్రసాదం బని యయ్యోగనిద్ర యియ్యకొని మ్రొక్కి చయ్యన నియ్యెల కయ్యెడ వాసి వచ్చి. 61

తే. దేవకీదేవికడుపులోఁ ♦ దేజరిల్లు
దీప్తగర్భంబు మెల్లన ♦ దిగిచి యోగ
నిద్ర రోహిణికడుపున ♦ నిలిపి చనియెఁ
గడుపుదిగెనంచుఁ బౌరులు ♦ గలఁగబడఁగ. 62

వ. అంత. 63

ఆ. బలము మిగులఁ గలుగ ♦ బలభద్రుఁ డన లోక
రమణుఁ డగుటఁ జేసి ♦ రాముఁ డనగ
సతికిఁ బుట్టె గర్భ ♦ సంకర్షణమున సం
కర్షణుఁ డనంగ ♦ ఘనుఁడు సుతుఁడు. 64

వ. తదనంతరంబ. 65

క. ఆనకదుందుభి మనమున
శ్రీనాథుం డంశభాగ ♦ శిష్టతఁ జొరగా
భాసురుచి నతఁడు వెలిఁగినఁ
గానఁగఁ బట్టయ్యె భూత ♦ గణములకు నృపా. 66

ఉ. ఆ వసుదేవుఁ డంతఁ దన ♦ యం దఖిలాత్మక మాత్మభూతముం
బావనరేఖయున్ భువన ♦ భద్రము నై వెలుగొందుచున్న ల
క్ష్మీవిభు తేజ మచ్చుపడఁ ♦ జేర్చినఁ దాల్చి నవీనకాంతితో
దేవకియొప్పెఁ బూర్వయను ♦ దిక్సతిచంద్రునిఁ దాల్చునై వడిన్. 67

వ. అనిన విని తరువాతివృత్తాంతం బెట్లయ్యె నని రాజడిగిన శుకుం
డిట్లనియె. 68

క. గురుతరముగఁ దనకడుపున
సరసిజగర్భాండభాండ ♦ చయములు గల యా
హరి దేవకికడుపున భూ
భరణార్థము వృద్ధిఁ బొందె ♦ బాలార్కు క్రియన్. 69

వ. అంత. 70

సీ. విమతులమోముల్ ♦ వెలవెలఁబాఱంగ
విమలాస్యమోము వె ♦ ల్లాఁబుకఁ బాఱె
మలయువైరులకీర్తి ♦ మాసి నల్లన గాఁగ
నాతిచూచుకములు ♦ నల్లనయ్యె
దుష్టాలయంబుల ♦ ధూమరేఖలు వుట్ట
లేమయారున రోమ ♦ రేఖ మెఱసె

నరిమానసముల కా ♦ హారవాంఛలు దప్పు
వనజాక్షి కాహార ♦ వాంఛ దప్పె

తే. శ్రమము సంధిల్లె రిపులకు ♦ శ్రమము గదుర
జడత వాటిల్లె శత్రులు ♦ జడమువడఁగ
మన్ను రుచి యయ్యెఁ బగతుర ♦ మన్ను సారఁగ
వెలఁదియుదరంబులో హరి ♦ వృద్ధిఁ బొంద. 71

వ. మఱియును. 72

సీ. సలిల మాయెలనాగ ♦ జఠరార్భకునిఁ గానఁ
జనినకై వడి ఘర్మ ♦ సలిల మొప్పె
నొగిఁ దేజ మాయింతి ♦ యుదరడింభకుఁ గొల్వ
గదిసిన క్రియ దేహ ♦ కాంతి మెఱసె
బవనుఁ డాకొమ్మగ ♦ ర్భస్థుని సేవింప
నొలసె నా మిక్కిలి ♦ యూర్పు లమరెఁ
గుంభిని యాలేమ ♦ కుక్షిగు నర్చింపఁ
జొచ్చుభంగిని మంటి ♦ చొరవ దనరె

ఆ. గగన మింతివదన ♦ కడుపులో బాలు సే
వలకు రూపు మెఱసి ♦ వచ్చినట్లు
బయలువంటి నడుము ♦ బహుళ మయ్యెను బంచ
భూతమయుఁడు లోనఁ ♦ బొదల సతికి. 73

వ. తదనంతరంబ. 74

సీ. అతివ కాంచీగుణం ♦ బల్లన బిగియంగ
వైరివధూగుణ ♦ వ్రజము వదలె
మెల్లన తన్వంగి ♦ మెయిదీవ మెఱుఁ గెక్క
దుష్టాంగనాతను ♦ ద్యుతు లడంగె
నాతి కల్లన భూష ♦ ణములు పల్వాలుకగాఁ
బరసతీభూషణ ♦ పంక్తు లెడలెఁ

గలకంక కొయ్యన ♦ గర్భంబు దొడ్డగాఁ
పరిపంథిదారగ ♦ ర్భములు వగలెఁ

తే. బాలతి కంతంత నీళ్ళాడఁ ♦ బ్రొద్దు లెమగ
సహోత్తవల్లభ తైమవ ♦ తై తసర్ప్ప
ప్రొద్దులన్నియు గ్రమమున ♦ బోవఁ దొడఁగ
నువిద కడుపున నసురారి ♦ యుంటఁ జేసి. 75

వ. ఇవ్విధంబున. 76

ఆ. జ్ఞానఖలునిలోని ♦ శారదయునుబోలె
ఘటములోని దీప ♦ కళికవోలె
భ్రాతయింట నాఁకఁ ♦ బడి యుండె దేవకీ
కాంత విశ్వగర్భ ♦ గర్భ యగుచు. 77

వ. అంత నక్కాంతాతిలకంబు నెమ్మొగంబు తెలివియును మేని
మెఱుంగును మెలంగెడి సొబగునుంజూచి వెఱఁగుపడి తఱచు
వెఱచుచుఁ గంసుండు తనలో నిట్లనియె. 78

క. కన్నులకుఁ జూడ బరువై
యున్నది యెలనాగగర్భ ♦ మల్లము గలఁగెఁ
ము న్నెన్నఁడు నిట్లుండదు
వెన్నుఁడు సొరనోపు గర్భ ♦ వివరములోనన్. 79

ఉ. ఏమి దలంచువాఁడ నిఁక ♦ నెయ్యది కార్యము నాఁడునాఁటికిం
గామినిచూలు పెం పెసగె ♦ గర్భిణిఁ జెల్లెలి నాఁడు పేద నే
నేమని చంపువాఁడఁ దగ ♦ వే లని చంపితినేని శ్రీయు ను
ద్దామయశంబు నాయువును ♦ ధర్మమునుం జెడిపోవకుండునే.

క. పావి యెఱుంగని క్రూరుని
జీవన్మృతుఁడనుచు నింద ♦ సేయుదు రతఁడుం
బోవును నరకేషులకు దు
ర్భావముతో బ్రదుకు టొక్క ♦ బ్రతుకే తలఁపన్. 81

వ. అని నిశ్చయించి క్రౌర్యంబువిడిచి ధైర్యంబునొంది గాంభీర్యంబు వాటించి శౌర్యంబు ప్రకటించుకొనుచు దిగ్గనం జెలియలిం జంపు నగ్గలిక యొగ్గని యుగ్గడించి వాని పోనియుం బోలె నూరకుండి వెండియు. 82

ఆ. పాపరాని దొడ్డ ♦ పగ పుట్టె నిఁక నెట్లు
లిందుముఖికిఁ జక్రి ♦ యెపుడు పుట్టు
బుట్టినపుడె పట్టి ♦ పురుటింటిలోఁ దెగఁ
జూతుననుచు నెదురు ♦ చూచుచుండె. 83

వ. మఱియు వైరానుబంధమున నన్యానుసంధానంబు మఱచి యతండు. 84

క. తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రావుచు
నరుగుచుఁ గూర్చుండి లేచు ♦ ననవరతంబున్
హరిఁ దలఁచి తలఁచి జగమా
హరిమయ మని చూచెఁ గంసుఁ ♦ డాఱని యలుకన్. 85

వ. వెండియు. 86

సీ. శ్రవణరంధ్రముల నే ♦ శబ్దంబు వినఁబడె
నది హరిపలు కని ♦ యాలకించు
నక్షిమార్గమున నె ♦ య్యది సూడబడె నది
హరిమూర్తిగానోపు ♦ నంచు జూచుఁ
దిరుగుచోఁ దేహంబు ♦ తృణమైనఁ జోఁకిన
హరికరాఘాతమో ♦ యనుచుఁ గదియు
గంధంబు లేమైన ♦ ఘ్రాణంబు సోఁచ్చిన
హరిమాలికాగంధ ♦ మనుచు నదరుఁ

తే. బలుకు లెవ్వియైనఁ ♦ బలుకుచో హరిపేరు
పలుకఁబడియె ననుచు ♦ భ్రమసి పలుకు
దలఁపు లెట్టివైనఁ ♦ దలఁచి యాతలఁపులు
హరితలంపు లనుచు ♦ నలుగఁగలఁచు. 87

వ. అయ్యవసరంబున ననుచరసమేతులైన దేవతలును నారదాదిమునులునుం గూడికొని నలువయును ముక్కంటియు నక్కడకువచ్చి దేవకీదేవిగర్భాభ్యంతరస్థుఁడై యున్న పురుషోత్తము నిట్లని స్తుతియించిరి. 88

—బ్రహ్మాదిదేవతలు దేవకీదేవిగర్భస్థుండగు శ్రీకృష్ణుని స్తుతించుట.—

సీ. సత్యవ్రతుని నిత్య ♦ సంప్రాప్తిసాధనుఁ
గాలత్రయమునందు ♦ గలుగువాని
భూతంబు లైదును ♦ బుట్టుచోటగువాని
నైదుభూతంబులం ♦ దమరువాని
నైదుభూతంబులు ♦ నడఁగినపిమ్మటఁ
బరఁగువానిని సత్య ♦ భాషణంబు
సమదర్శనంబును ♦ జలిపెడువానిని
నిన్నాశ్రయింతుము ♦ నీయధీన

ఆ. మాయచేత నెఱుక ♦ మాలినవారలు
పెక్కగతుల నిన్నుఁ ♦ బేరుకొందు
రెఱుఁగ నేర్చు విబుధు ♦ లేకచిత్తంబున
నిఖిలమూర్తులెల్ల ♦ నీవయండ్రు. 89

వ. ఆదియునుం గాక. 90

సీ. ప్రకృతియొక్కటి పాదు ♦ ఫలములు సుఖదుఃఖ
ములు రెండు గుణములు ♦ మూఁడువేళ్లు
తగురసంబులు నాల్గు ♦ ధర్మార్థముఖరంబు
లెఱిఁగెడి విధము లై ♦ దింద్రియంబు
లాఱు స్వభావంబు ♦ లాశోకమోహాదు
లూర్ములు ధాతువు ♦ లొక్కయేడు
పైపొర లెనిమిది ♦ ప్రంగలు భూతంబు
లైదు బుద్ధియు మనో ♦ హంకృతులును

తే. రంధ్రములు దొమ్మిదియుఁ గోట ♦ రములు ప్రాణ
పత్త్రదశకంబు జీవేశ ♦ పక్షియుగముఁ
గలుగు సంసారవృక్షంబు ♦ గలుగఁజేయఁ
గావ నడఁగింప రాజ వా ♦ క్కరుఁడ వీవ. 91

క. నీదెసఁ దమ చిత్తము లిడి
యేదెసలకుఁ బోక కడతు ♦ రెఱుక గలుగు వా
రాదూడయడుగుక్రియ నీ
పాదం బను నావకతన ♦ భవసాగరమున్. 92

ఆ. మంచివారి కెల్ల ♦ మంగళప్రదమయ్యుఁ
గల్లరులకు మేలు ♦ గానియట్టి
తనువు లెన్నియైనఁ ♦ దాల్చి లోకములకు
సేమ మెల్లప్రొద్దుఁ ♦ జేయు దీవు. 93

క. ఎఱిఁగినవారల మనుచును
గొఱమాలిన యెఱుక లెఱిఁగి ♦ కొందఱు నీపై
రెఱిఁగియుఁ దలఁపఁగ నొల్లరు
పఱతు రధోగతులజాడఁ ♦ బద్మదళాక్షా. 94

క. నీవారై నీదెసఁ దమ
భావంబులు నిలిపి ఘనులు ♦ భయవిరహితులై
యేవిఘ్నంబులఁ జెందక
నీవరలెడి మేటిచోట ♦ నెగడుదు రీశా. 95

క. నిను నాలుగాశ్రమంబుల
జనములు సేవింప నఖిల ♦ జగముల సత్త్వం
బును శుద్ధంబును శ్రేయం
బును నగు గాత్రంబు నీవు ♦ పొందుదువు హరీ. 96

సీ. నలినాక్ష సత్త్వగు ♦ ణంబు నీగాత్రంబు
గాదేని విజ్ఞాన ♦ కలిత మగుచు
నజ్ఞానభేదకం ♦ బగు టెట్లు గుణముల
బంధును వెలుఁగ నీ ♦ వనుమితింప

బడుదువు సత్త్వరూ ♦ పంబు సేవింపంగ
సాక్షాత్కరింతువు ♦ సాక్షి వగుచు
వాఙ్మానసముల క ♦ వ్వలి దైవమార్గంబు
గల్గు నీ గుణజన్మ ♦ కర్మరహిత

తే. మైన రూపును పేరు న ♦ త్యనఘబుద్ధి
దెలియఁగుదురు నిన్నుఁ గొల్వ నూ ♦ హించుకొనుచు
వినుచుఁ దలఁచుచుఁ బొగడుచు ♦ వెలయువాఁడు
భవము నొందఁడు నీపాద ♦ భక్తుఁ డగును. 97

క. ధరణీభారము వాసెను
బురుషోత్తమ యీశ నీదు ♦ పుట్టువున భవ
చ్చరణాంబుజముల ప్రాపున
ధరణియు నాకసముఁ గాం ♦ చెదము నీ కరుణన్. 98

ఉ. పుట్టువు లేని నీ కభవ ♦ పుట్టుట క్రీడయ కాక పుట్టుచే
నెట్టనుఁగాక భవాదిదశ ♦ లెల్లను జెప్పుటయుం దవిద్య దాఁ
జుట్టుచు నుండుఁ గాని నినుఁ ♦ జుట్టునదిం బలెఁ బొంతనుండియుం
జుట్టఁగలేమిఁ దత్క్రియలఁ ♦ జొక్కని యొక్కటిఁ గంటి మీశ్వరా.

మ. గురుపాఠీనమవై జలగ్రహమవై ♦ కోలంబవై శ్రీనృకే
సరివై భిక్షుఁడవై హయాననుఁడవై ♦ క్ష్మాదేవతాభర్తవై
ధరణీనాథుఁడవై దయాగుణగణో ♦ దారుండవై లోకముల్
బరిరక్షించిన నీకు మ్రొక్కెద మిలా ♦ భారంబు హరింపవే. 100

క. మ్రుచ్చిలి యున్నది లోకము
నిచ్చలుఁ గంసాదిఖలులు ♦ నిర్దయు లేఁపన్
మచ్చిగఁ గావఁగవలయును
విచ్చేయుము తల్లికడుపు ♦ వెడలి ముకుందా! 101

వ. అని విన్నవించి, మఱియు దేవకీదేవిం గనుంగొని. 102

మత్తకోకిలము

తల్లి నీయుదరంబులోనఁ బ్ర ♦ ధానపూరుషుఁ డున్నవాఁ
డెల్లి పుట్టెడిఁ గంసుచే భయ ♦ మింత లేదు నిజంబు మా

కెల్లవారికి భద్రమయ్యెడు ♦ నింక నీకడు వెప్పెడుం
జల్లగావలె యాదవావళి ♦ సంతసంబునుఁ బొందఁగన్. 103

వ. అని యివ్విధంబున హరిం బొగడి దేవకీదేవిని దీవించి దేవత
లీశానబ్రహ్మల మున్నిడుకొని చనిరంత. 104

—• శ్రీ కృ ష్ణా వ తా ర ఘ ట్ట ము •—

క. పంకజముఖి నీళ్ళాడను
సంకటపడ ఖలులమాన ♦ సంబుల నెల్లన్
సంకటము దోఁచె మెల్లన
సంకటములు లేమి దోఁచె ♦ సత్పురుషులకున్. 105

సీ. స్వచ్ఛంబులై పొంగె ♦ జలరాసు లేడును
గలఘోషణముల మే ♦ ఘంబు లుఱిమె
గ్రహతారకలతోడ ♦ గగనంబు రాజిల్లె
దిక్కులు మిక్కిలి ♦ తెలివి దాల్చెఁ
గమ్మనిచల్లని ♦ గాలి మెల్లన వీచె
హోమానలంబు సె ♦ న్నొంది వెలిఁగెఁ
గొలఁకులు కమలాళి ♦ కులములై సిరినొప్పెఁ
బ్రవిమలతోయలై ♦ పాఱె నదులు

తే. వరపురగ్రామఘోష లై ♦ వసుధ యొప్పె
విహగరవపుష్పఫలముల ♦ వెలసె వనము
లలరుసోనలు గురిసి ♦ రయ్యమరవరులు
దేవదేవుని దేవకీ ♦ దేవి గనఁగ. 106

క. పాడిరి గంధర్వోత్తము
లాడిరి రంభాదికాంత ♦ లానందమునం
గూడిరి సిద్ధులు భయముల
వీడిరి చారణులు మొరసె ♦ వేల్పులభేరుల్ 107

వ. అయ్యవసరంబున. 108

క. సుతుఁ గనె దేవకి నడురే
యతిశుభగతిఁ దారకను గ్ర ♦ హంబులు నున్నెడన్

దితిసుతనిరాకరిష్ణున్
శ్రితవదనాలంకరిష్ణు ♦ జిష్ణున్ విష్ణున్. 109

క. వెన్నుని నతిప్రసన్నునిఁ
గ్రన్నన గని మెఱుఁగుబోఁడి ♦ గడునొప్పారం
బున్నమనాఁడు కళానిధిఁ
గన్న మహేంద్రాశ చెలువు ♦ గలిగి నరేంద్రా. 110

వ. అప్పుడు. 111

సీ. జలధర దేహు నా ♦ జాను చతుర్బాహు
సరసీరుహాక్షు వి ♦ శాలవక్షుఁ
జారు గదా శంఖ ♦ చక్ర పద్మ విలాసుఁ
గంఠ కౌస్తుభమణి ♦ కాంతిభాసుఁ
గమనీయ కటిసూత్ర ♦ కంకణ కేయూరు
శ్రీవత్సలాంఛనాం ♦ చితవిహారు
నురుకుండలప్రభా ♦ యుతకుంతల లలాటు
వైడూర్య మణిగణ ♦ వరకిరీటు

తే. బాలుఁ బూర్ణేందు రుచిజాలు ♦ భక్తలోక
పాలు సుగుణాలవాలుఁ గృ ♦ పావిశాలుఁ
జూచి తిలకించి పులకించి ♦ చోద్యమంది
యుబ్బి చెలరేఁగి వసుదేవుఁ ♦ డుత్సహించె. 112

క. స్నానము సేయఁగ రామిని
నానందరసాబ్ధిమగ్నుఁ ♦ డై విప్రులకున్
ధేనువులం బదివేలను
మానసమున దారవోసె ♦ మఱి యిచ్చుటకున్. 113

వ. మఱియు వసుదేవుండు. 114

— వసుదేవుఁ డవతరించిన హరిని వినుతించుట —

క. ఈ పురిటియింటి కుడ్య
దీపంబును బోలెఁ జాల ♦ దీపించె నిజం
బీపాపఁడు నలుమొగముల
యాపాపనిఁ గనినమేటి ♦ యగునని భక్తిన్. 115

ఆ. సాఁగి మ్రొక్కి లేచి ♦ సరగున నొసలిపైఁ
గేలుఁదమ్మిదోయిఁ ♦ గీలుకొలిపి
పాపఁ డసక వెఱక ♦ పాపని మొదలింటి
పోక యెల్లఁ దలఁచి ♦ పొగడఁ దొడఁగె. 116

క. ఏనిన్ను నఖిలదర్శను
జ్ఞానానందస్వరూపు ♦ సంతతు నపరా
ధీనుని మాయాదూరుని
సూనునిఁగాఁ గంటి నిట్టి ♦ చోద్యము గలదే. 117

క. అచ్చుగ నీమాయను మును
చెచ్చెరఁ ద్రిగుణాత్మకముగఁ ♦ జేసిన జగముల్
సొచ్చిన క్రియఁ జొరకుందువు
చొచ్చుటయును లేదు లేదు ♦ చొరకుండుటయున్. 118

సీ. అదియునెట్లన మహ ♦ దాదులఁ బోలెడి
దై వేఱువేఱ యై ♦ యున్నవిధము
లగు [1]సూక్ష్మభూతంబు ♦ లమర [2]షోడశవికా
రములతోఁ [3]గూడి వి ♦ రాట్టనంగఁ
బరమాత్మునకు నీకుఁ ♦ [4]బఱపైనమేను [5]సం
పాదించి [6]యందులోఁ ♦ [7]బడియుఁ [8]బడక
[9]యుండు సృష్టికి మ్రోల ♦ నున్న కారణమున
వానికి లోని భ ♦ వంబు గలుగ

(1) సూక్ష్మభూతములు = శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు. (2) షోడశ వికారములతో = పంచప్రాణములు, అంతఃకరణము, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు అను వానితో. (3) కూడి = చేరి, అనగా త్రిగుణాత్మకములైన పంచభూతముల విభాగ సమ్మేళనములచేత గలిగిన ప్రాణాదులతోఁ గూడి. (4) పఱపైనమేను = విశాలము అయినట్టి దేహము అనగా ప్రపంచరూపమైన విరాట్శరీరము అనుట. (5) సంపాదించి = కలుగఁజేసికొని. (6) అందులోన = ప్రపంచరూపమైన యా విరాట్దేహమునందు. (7) పడియున్ = చిక్కియు, అనఁగా భోగసాధనమని ప్రవేశించియు. (8) పడక = చిక్కక-అనఁగా అతీతుఁడవగుటచేత ప్రవేశింపక. (9) ఉండు = ఉందువు.

ఆ. దట్లు బుద్ధి నెఱుఁగ ♦ ననువైనలాగునఁ
గలుగు [1]నింద్రియముల ♦ కడనయుండి
[2]వానిపట్టు లేక ♦ వరుస జగంబులఁ
గలసి యుండి యైనఁ ♦ గలయ వెపుడు. 119

క. సర్వము నీలోనిదిగా
సర్వాత్ముఁడ వాత్మవస్తు ♦ సంపన్నుఁడవై
సర్వమయుఁడవగు నీకును
సర్వేశ్వర లేవు లోను ♦ సంధులు వెలియున్. 120

ఆ. ఆత్మవలనఁ గలిగి ♦ యమరు దేహాదుల
నాత్మకంటె వేఱు ♦ లవి యటంచుఁ
దలఁచువాఁడు మూఢ ♦ తముఁడు గావున నీశ
విశ్వ మెల్ల నీవ ♦ వేఱులేదు. 121

వ. అదియునుం గాక. 122

సీ. గుణము వికారంబుఁ ♦ గోరికయును లేని
నీవలన జగంబు ♦ నెఱి జనించుఁ
బ్రబ్బు లేదగు నంచుఁ ♦ బలుకుట దప్పుగా
దీశుండవై బ్రహ్మ ♦ మీవ యైన
నినుఁ గొల్చు గుణములు ♦ నీ యానతులు సేయ
[3]భటుల శౌర్యంబులు [4]పతికి వచ్చు
పగిది నీ గుణముల ♦ బాగులు నీ వని
తోఁచును నీ మాయ ♦ తోడఁ గూడి

ఆ. నీవు రక్తధవళ ♦ నీలవర్ణంబుల
జగము సేయఁ గావ ♦ సమయఁ జూడఁ
దనరు దట్లు నేఁడు ♦ దైత్యుల దండింపఁ
బృథివిఁ గావ నవత ♦ రించి తీశ. 123

---

(1) ఇంద్రియముల కడనయుండి = పదునాలుగింద్రియముల విషయములయందు వర్తించి-అనఁగా చతుర్దశేంద్రియ వ్యాపారములు కలిగియుండియును. (2) వాని పట్టు = ఆ చతుర్దశేంద్రియముల సంబంధము. (3) భటుల శౌర్యంబులు = సాహసము, పరాక్రమము మొదలైన శూరగుణములచేత యుద్ధాదులయందు బంట్లు పొందిన జయాపజయాది చిహ్నములు. (4) పతికిన్ = రాజునకు,

శా. మింటన్ మ్రోసినమ్రోఁత దాళిమినిలో ♦ మేంద్రింపమున్ నీవునా
యింట బ్రాదుర్భవంచుఁ గంసుఁడు దోషిన్ ♦ హింసించె నీయన్నలన్
[1]గంటం గూరుకుఁ డేఁడు నీయుదయ మా ♦ కారాజనుల్ సెప్పఁగా
బంటింపం డెదు రేఁగుదెంచు వడి నీపై నేఁడు ♦ సన్నద్ధుఁడై. 124

—• దేవకీదేవి స్వామిని స్తుతించుట •—

వ. అనుచుండ దేవకీదేవి మహాపురుషలక్షణుండును విచక్షణుండును సుకుమారుండును నైన కుమారునిం గని కంసునివలని వెఱపున [2]శుచిస్మితయై యిట్లనియె. 125

* సీ. అట్టిట్టి దనరాని ♦ దై మొదలై నిండు
కొన్నదై వెలుఁగుచు ♦ గుణము లేని
దై యొక్క చందంబు ♦ దై కలదై నిర్వి
శేషమై క్రియలేక ♦ చెప్పరాని
దేరూప మని శ్రుతు ♦ లెప్పుడు నొడివెడి
నారూప మగుచు న ♦ ధ్యాత్మదీప
మై బ్రహ్మ రెండవ ♦ యర్థంబుతుది జగం
బులు నశింపఁగఁ బెద్ద ♦ భూతగణము

ఆ. సూక్ష్మభూతమందుఁ ♦ జొరఁగ నా భూతంబు
ప్రకృతిలోనఁ జొరఁగఁ ♦ బ్రకృతి పోయి
యవ్యక్తమందుఁ జొరఁగ ♦ వ్యక్త మడంగను
శేషసంజ్ఞ నీవు ♦ సెలువ మగుదు. 126

(1) కంటం గూరుకుఁ డేఁడు = కంటియందు నిద్రను పొందనేరఁడు, అనఁగా - నిద్రాహారములుమాని నీపుట్టుటనే యెదురుచూచుచున్నాఁడనుట. (2) శుచిస్మితయై = తెల్లనికాంతి ప్రసరించునట్లు చిఱునవ్వునవ్వినదై. * తా॥ ఇటువట్టిది అటువంటిది అని నిర్ణయముచేయ శక్యముకానిదియు, సర్వమునకు మూలకారణమైనదియు, సర్వమునందు వ్యాపించియుండునదియునై ప్రకాశించుచు, సత్త్వాదులైన త్రిగుణములును, షడ్భావవికారములును లేక భూతభవిష్యద్వర్తమానము లనెడు మూడు కాలములందును వృద్ధిక్షయాదులులేని స్థితిగలిగి శబ్దాది విషయాపేక్షలేనిదై (పుణ్యపాప మిశ్రరూపకర్మములు లేనిది) యు, నోట చెప్పుటకు అలవిగానిదియునై వేదములయందుఁ జెప్పఁబడిన రూపముతో ఆత్మవిషయజ్ఞానము నియ్యఁజాలి బ్రహ్మప్రళయానంతరము సర్వమును తనయందు లయింపఁగా, శేషసంజ్ఞచేత నీవు స్వయంజ్యోతివై ప్రకాశించుచుందువని తాత్పర్యము.

ఉ. [1]విశ్వము లీలఁ ద్రిప్పుచు న ♦ విద్యకుఁ జుట్టమ వైన నీకుఁ దా
శాశ్వత మైన కాల మిది ♦ సర్వము [2]వేడబమందు రట్టి వి
శ్వేశ్వర మేలుకుప్ప నిను ♦ నెవ్వఁడుఁ గోరి భజించువాఁడు పో
శాశ్వతలక్ష్మి మృత్యుజయ♦సౌఖ్యయుతుం డభయుండు మాధవా.

మత్త. ఒంటి నిల్చి పురాణ యోగులు ♦ యోగమార్గ నిగూఢులై
కంటి మందురు కాని నిక్కము ♦ కాన రీ భవదాకృతిం
గంటి భద్రము గంటి [3]మాంసపుఁ ♦ గన్నులం గనఁబోల దీ
తొంటిరూపుఁ దొలంగఁబెట్టుము ♦ తోయజేక్షణ మ్రొక్కెదన్.

ఆ. విలయకాలమందు ♦ విశ్వంబు నీ పెద్ద
కడుపులోన డాఁచు ♦ కడిమి మేటి
నటుఁడ వీవు నేఁడు ♦ నా గర్భజుఁడ వౌట
పరమపురుష వేడ ♦ బంబు గాదె. 129

తర. నలినలోచన నీవు నిక్కము ♦ నాకుఁ బుట్టెదవంచు నీ
ఖలుఁడుఁ గంసుఁడు పెద్దకాలము ♦ [4]కారయింట నడంచె దు
ర్మలిన చిత్తుని నాజ్ఞ సేయుము ♦ మమ్ముఁ గావుము భీతులన్
[5]నులుసు లేక ఫలించె నోఁచిన ♦ నోము లెల్లను నీవ యై. 130

— దేవకీ వసుదేవుల పూర్వజన్మ వృత్తాంతము —

వ. అని యిట్లు దేవకీదేవి విన్నవించిన నీశ్వరుం డిట్లనియె. అవ్వా నీవుదొల్లి స్వాయంభువ మన్వంతరంబునఁ బృశ్నియను పరమ పతివ్రతవు. వసుదేవుండును సుతపుండను ప్రజాపతి. మీ రిరువురును సృష్టికాలంబున బ్రహ్మపంపునం బెంపున నింద్రియంబుల జయించి తెంపున వాన గాలి యెండ మంచులకు సైరించి [6]యేకలములరై యాకలములు దిని యే కలంకంబును లేక వేండ్రంబుగఁ బండ్రెండు వేల దివ్య వర్షంబులు దపం

(1) విశ్వము లీలఁ ద్రిప్పుచు = ప్రపంచమును వినోదముగ సృష్టిస్థితి లయము లను మాఱుపాటులను గలుఁగఁ జేయుచు (మాటిమాటికి లోకమును పుట్టించుచు, పెంచుచు, త్రుంచుచు. (2) వేడబము = మాయ. (3) మాంసపుఁ గన్నులం గనఁబోలదు = ఈ నీయప్రాకృత దివ్యమంగళ విగ్రహమును చర్మచక్షుస్సులతో చూడఁదగినదానఁగాను. (4) కారయింటన్ = కారాగృహమందు, (5) నులుసు = న్యూనత (తక్కువ). (6) ఏకలములరై = మిక్కిలి అపేక్షపడినవారై.

బులు సేసిన నెపంబున మీహాపంబులు మెఱయనోజ
నాజపంబులు సేసి డాసి పేర్చి యర్చింప మీకు నాకుంగల
రూపుఁజూపి యేను దిరంబులగు వరంబులు వేఁడుండనిన
మీరు నామాయంబాయని మోహంబున బిడ్డలులేని దొడ్డ
యడ్డంబున [1]దుర్గమంబగు నపవర్గంబు గోరక నాయీడు
కొడుకు నడిగిన మెచ్చి యట వరంబిచ్చి మీకేను బృశ్ని
గర్భుండను నర్భకుండనయితి మఱియును. 131

క. అదితియుఁ గశ్యపు డనగా
విదితుల రగు మీకుఁ గుఱుచ ♦ వేషంబున నే
నుదయించితి వామనుఁ డనఁ
[2]త్రిదశేంద్రానుజుఁడ నై ద్వి ♦ తీయ భవమునన్. 132

క. ఇప్పుడు మూడవ భవమునఁ
దప్పక మీ కిరువురకును ♦ దనయుఁడనైతిన్
జెప్పితిఁ బూర్వము మీయం
దెప్పటికిని లేదు జన్మ ♦ మిటపై నాకున్. 133

క. నందనుఁ డనియుం బరమా
నందం బగు బ్రహ్మమనియు ♦ ననుఁ దలఁచుచు [3]నా
పెందెరువు నొందెదరు నా
యందుల ప్రేమమున భవము ♦ నందరు మీరల్. 134

వ. అని యిట్లు పలికి యీశ్వరుం డా రూపంబు విడిచి. 135

క. తెప్ప లిడక తలిదండ్రులు
దప్పక తనుఁ జూడ మాయఁ ♦ దనరి లలితుఁడై
యప్పు డటు గన్నపాపని
యొప్పున వేడుకలు సేసె ♦ నొకకొన్ని నృపా. 136



వ. అంత వసుదేవుండు దనకుం జేయువలసిన పను లీశ్వరుండైన
హరివలన నెఱింగినవాఁడు గావున. 137

(1) దుర్గమంబగు.....గోరక = పొందరానిది అయిన మోక్షమును అపేక్షింపక,
(2) త్రిదశేంద్రా...భవమునన్ = దేవేంద్రునకు తమ్ముఁడనై రెండవ జన్మమునందు. (అనగా వామనుఁడని భావము) (3) నా పెందెరువున్ = నాసంబంధమైన గొప్ప మార్గమును. అనఁగా అన్నిటికంటె ఉత్కృష్టస్థానమైన పరమపదమును.

— వసుదేవుఁడు శిశువును గోకులమునకుం గొంపోవుట

క. ఆ పురిటి యిల్లు వెలువడి
పాపనిఁ దరలించుకొనుచుఁ ♦ బఱచెద ననుచున్
రూపింప నందుభార్యకుఁ
బాపయగుచు యోగమాయ ♦ ప్రభవించె నృపా. 138

వ. ఆ సమయంబున. 139

క. బిడ్డనిఁ గరముల ఱొమ్మున
నడ్డంబుగఁ బట్టి పదము ♦ లల్లన యిడుచున్
జడ్డనఁ గావలివారల
యొడ్డు గడచి పురిటిసాల ♦ యొయ్యన వెడలెన్. 140

వ. అంత నట. 141

క. నందుని సతికి యశోదకుఁ
బొందుగ హరి యోగమాయ ♦ పుట్టిన [1]మాయా
స్పందమున నొక్క యెఱుఁగమి
క్రందుకొనియె సూరివారిఁ ♦ గావలివారిన్. 142

వ. అప్పుడు చప్పుడు గాకుండఁ దప్పటడుగులిడుచు నినుప గొలుసుల మెఱుసులవీడిన తాలంబులు [2]మహోత్తాలుండయిన బిడ్డనికి నడ్డంబు గాక కీలూడి వీడిపడ సరళంబులు విరళంబులయిన సరళంబులగు మొగసాలలం గడచి పాఁపఱేఁడు వ్రాకింపు మరల మూయుచుఁ బడగ లెడ గలుగ విప్పి కప్పి వేచి కాచికొని వెంటనంటి రాఁగఁ గడంగి నడచు నెడ.

క ఆ శౌరికిఁ దెరు వొసఁగెఁ ♦ బ్ర* (వర్షోద్ధత)
కాశోద్ధతతుంగభంగ ♦ కలిత ధరాశా
కాశ యగు యమున మును సీ
తేశునకుఁ బయోధి త్రోవ ♦ యిచ్చిన భంగిన్ 144

వ. ఇట్లు యమున దాఁటి [3]దాఁటిచని నందునిమందం జేరి యం
దమందనిద్రం బొంది యొడళ్ళెఱుంగని గొల్లలం దెలుప

(1) మాయాస్పందమున ... యెఱుఁగమి = ఆ మాయయొక్క మాంద్యముచేత ఇట్టిదని చెప్పరాని యొక మైకము. (2) మహోత్తాలుండు = మిక్కిలి గొప్పవాఁడు. (3) దాఁటిచని = త్వరితముగపోయి * బ్రవర్షోద్ధత (అని పాఠాంతరము)

నొల్లక నిత్యప్రసాద యగు యశోదశయ్యా నొయ్యన చిన్ని
నల్లనయ్యనునిచి చయ్యన నయ్యవ్వకూఁతు నెత్తుకొని మరల
నింటికిఁబంటింపకవచ్చియచ్చిఱుతపాపను దేవకిప్రక్కఁజక్కనిడి

క. పదముల సంకెల లిడుకొని
మదిఁ దలఁచుచు [1]శూరసుతుఁడు ♦ మందుఁడువోలెన్
బెదరు గల రీతి దేహము
గదలించుచు నొదిఁగి యుండె ♦ గఱువతనమునన్. 146

క. వనజాక్షునిఁ దెచ్చుటయును
దన సుతఁ గొనిపోవుటయును ♦ దా నెఱుఁగక మూఁ
గిన నిద్రఁ జొక్కియుండెను
వనజాక్షి యశోద రేయి ♦ వసుధాధీశా! 147

—♦ కంసుఁ డాడశిశువును జంపఁబోవుట ♦—

సీ. అంత బాలిక యేడ్పు ♦ రని యేడ్పు చిఱుచప్పు
డాలించి వేకన ♦ నాఁక యింటి
కావలివారు మే ♦ ల్కని చూచి తలుపుల
తాళముల్ తొంటి వి ♦ధమున నుండఁ
దెలిసి చక్కనవచ్చి ♦ దేవకి నీళ్ళాడె
రమ్మురమ్మని భోజ ♦ రాజుతోడఁ
జెప్పిన నాతఁడు ♦ సిడిముడిపాటుతోఁ
దల్పంబుపై లేచి ♦ తత్తఱమున

తే. వెండ్రుకలు వీడఁ బైచీర ♦ వ్రేలియాడఁ
[2]దాల్మి కీలూడ రోషాగ్ని ♦ దర్పమాడ
భూరి వైరంబుతోఁ గూడఁ ♦ బురిటియింటి
జాడ నేతెంచి యాపాపఁ ♦ జంపఁ గదియ. 148

వ. దేవకీదేవి యడ్డంబువచ్చి యిట్లనియె. 149

ఉ. అన్న శమింపుమన్న తగ ♦ దల్లుఁడు గాఁ డిది మేనగోడలా
మన్నన సేయుమన్న విను ♦ మానినిఁ జంపుట రాచపాడి గా

(1) శూరసుతుఁడు = వసుదేవుఁడు. (2) తాల్మికీలూడన్ = ధైర్యము చెదరిపోవఁగాను. (మూలమున "కాలోఽయమితి విహ్వలః = ఇదియే మృత్యువని ధైర్యము లేనివాఁడై) అని కలదు.

శా. బాపా! నీవచనంబు నిక్కము సుమీ ♦ ప్రాణుల్ గతజ్ఞానులై
నీవే నంచును లోభమోహమదభీ ♦ నిర్మిత్రతామోద శో
కావేశంబుల నొండొరుం బొడుతు రే[1] ♦ కాకారుఁడై సర్వరూ
పావిష్టుం డగు నీశ్వరుం దెలియ లే ♦ రన్యోన్య విభ్రాంతులై.

—♦ కంసుఁడు మంత్రులతో నాలోచన చేయుట ♦—

వ. అని యిట్లు ప్రసన్నులైన దేవకీవసుదేవుల యనుజ్ఞ వడసి కంసుం డింటికిం జని యా రేయి గడపి మఱునాఁడు గ్రద్దనం బ్రొద్దునఁ దనకుఁ బరతంత్రులగు మంత్రుల రావించి యోగనిద్ర వలనం దావినిన వృత్తాంతంబంతయు మంతనంబున నెఱింగించిన వారలతని కిట్లనిరి.

క. ఇట్టయినఁ దడయ నేటికిఁ
బట్టణముల మంద లందుఁ ♦ బల్లెల నెల్లం
బుట్టెడి పెరిఁగెడి శిశువుల
బట్టి వధించెదము మమ్ముఁ ♦ బంపు మధీశా! 164

మ. భవదీయోజ్జ్వల బాహుచాపవిలస ♦ ద్బాణావళీభగ్నులై
దివిజాధీశ్వరు లేక్రియం బడిరొ యే ♦ దేశంబులన్ డాఁగిరో
శివునిం జొచ్చిరొ బ్రహ్మఁ జెందిరొ హరిన్ ♦ సేవించిరో మౌని వృ
త్తి వనాంతంబుల నిల్చిరో మనకు శో ♦ ధింపం దగున్ వల్లభా.

క. నొచ్చిరి శాత్రవులనుచును
విచ్చలవిడిఁ దిరుగవలదు ♦ వివిధాకృతులన్
మ్రుచ్చిలి వత్తురు వారలు
సచ్చిన యందాఁక మఱవఁ ♦ జన దధిపునకున్. 166

క. ఒత్తిగొనుచు రాసీఁజన, దెత్తినరోగముల రిపుల♦నింద్రియముల ను
త్పత్తిసమయములఁ జెఱుపక, మెత్తనఁగారాదు రాదు♦మీఁదజయింపన్

మ. అమరశ్రేణికి నెల్లఁ జక్రి ముఖరుం ♦ డాచక్రిధర్మంబునం
దమరున్ గోవులు భూమిదేవులుఁ దితి ♦ క్షామ్నాయకారుణ్య స

(1) ఏకాకారుఁడై...విష్టుండు = ఎప్పుడును ఒక విధమైన యాకృతి గలవాఁడై స్థావరములు, క్రిములు, జలచరములు, పక్షులు, మృగములు, నరులు మొదలైన రూపములతోఁ గానవచ్చు సర్వప్రాణులందు నున్నవాఁడు (అట్టి భగవంతుని తెలియ లేరు)

త్యములుఁ యాగతపోదమంబులును శ్రీ ♦ ద్ధాశాంతులుఁ విష్ణుదే
హము లన్నింటిని సంహరించిన నతం ♦ డంతంబునుం బొందెడిన్.

వ. కావున. 169

ఉ. చంపుదుమే [1]నిలింపులను ♦ జంకెల నంకెలఁ దాపసావలిం
బంపుదుమే కృతాంతకుని ♦ పాలికిఁ గ్రేపులతోడి గోవులం
ద్రుంపుదుమే ధరామరులఁ ♦ దోల్తుదుమే నిగమంబులన్ విదా
రింపుదుమే వసుంధర హ ♦ రింపుదుమే జననాథ పంపుమా. 170

వ. అని పలుకు మంత్రుల మంత్రంబుల నిమంత్రితుండై బ్రాహ్మణ నిరోధంబు నిషేధంబని తలంపక కాలపాశబద్ధుండై విప్రాది సాధు మానవులఁ జంప దానవులం బంపి యంతిపురంబునకుం జనియె. అనంతరంబ యా రక్కసులు వెక్కసంబులగు మొక్కలంబుల సజ్జనుల పజ్జలం బడి తర్జన గర్జన భర్జనాది దౌర్జన్యంబులం జేసి నిర్జించి పాపంబు లార్జించిరి. 171

ఆ. వెదకి వెదకి దైత్య ♦ వీరులు సాధుల
నడఁప వారిబలము ♦ లడఁగి పోయె
యశము సిరియు ధర్మ ♦ మాయువు భద్రంబు
లార్యహింస సేయ ♦ నడఁగుఁగాదె. 172

— నందుఁడు శ్రీకృష్ణమూర్తికి జాతకర్మ పుణ్యాహవాచనాదులు చేయించుట. —

వ. అంత మందలో నందుండు నందనుండు పుట్టుట యెఱింగి మహానందంబున నెఱవాదులగు వేదవిదులం బిలిపించి జలకంబులాడి శుచియై శృంగారించుకొని స్వస్తి పుణ్యాహ వాచనంబులు సదివించి జాతకర్మంబులు సేయించి పితృదేవతల నర్చించి క్రేపులతోడం గూడఁ గైసేసిన పాఁడి మొదవుల రెండు లక్షలను కనక కలశ మణి వసన విశాలంబైన తిల శైలంబు లేడింటిని భూదేవతల కిచ్చిన

క. ఈ యాభీరకుమారుఁడు
శ్రీయుతుఁడై వీరవైరి ♦ జేతయు నై దీ

(1) నిలింపులన్ = దేవతలను, లేక స్వరూపసాక్షాత్కార బ్రహ్మవిద్యచేత జనన మరణరూపమైన సంసారసముద్రమును దాటిన బ్రహ్మవేత్తలను.

ర్ఘాయుష్మంతుండగునని
పాయక దీవించిరపుడు ♦ బ్రాహ్మణజనముల్.

క. దుందుభులు మొరసె గాయక
సందోహము పాడె సూత ♦ సముదాయముతోఁ
వందిజనులు కీర్తించిరి
క్రందుగ వీతెంచె భద్ర ♦ కాహళరవముల్. 175

క. పల్లవతోరణ సురుచిర, వల్లీధ్వజరాజ ధూప ♦ వాసనములతోఁ
సల్లలితములై యొప్పెను, వల్లవవల్లభులయిండ్ల ♦ వాకిండ్లెల్లన్.

క. పసుపులు నూనెలు నలదిన
బసఁ దనరి సువర్ణబర్హి ♦ బర్హాప్రభతోఁ
బసిమి గలిగి వెలుఁ గొందుచుఁ
బసులన్నియు మందలందుఁ ♦ బ్రసరించె నృపా. 177

క. క్రేళ్ళుఱికి మసలె లేఁగలు
మల్లడిగొని అంకెలిడియె ♦ మదవృషభంబుల్
పెల్లుగ మొదవుల పొదుఁగుల
జల్లించెం బాలు బాలు ♦ సంభవ వేళన్. 178

క. ఆరఁగఁ జదివెడి పొగడెడి,
వారికి విద్యలను బ్రదుకు ♦ వారికి లేమిం
జేరినవారికి నెల్లను గోరక
మును నందుఁ డిచ్చె ♦ గోధనచయముల్. 179

వ. ఆ సమయంబున. 180

క. కంచుకములుఁ దలచుట్టలు
కాంచన భూషాంబరములుఁ ♦ గను మెఱయఁగ నే
తెంచిరి గోపకు లందఱు
మంచిపదార్థములు గొనుచు ♦ మాధవుఁ జూడన్. 181

క. ఏతెంచి చూచి చెలఁగుచు
నేతులఁ బెరుఁగులను బాల ♦ నీళ్ళను వెన్నం

బ్రీతి వసంతము లాడిరి
యాతురులై సరసభాష ♦ లాడుచు గొల్లల్. 182

వ. తదనంతరంబ. 183

ఆ. ఏమినోము ఫలమొ ♦ యింత ప్రొద్దొకవార్త
వింటి మబలలార ♦ వీను లలర
మనయశోద చిన్ని ♦ మగవాని గనె నట
చూచివత్తమమ్మ ♦ సుదతులార. 184

వ. అని యొండొరుల లేపికొని గోపికలోపికలు లేని చిత్తంబుల నెత్తినతత్తఱంబులు ఉవ్వెత్తుకొన నుదారంబులగు శృంగారంబులతో నిండ్లు వెలువడి.

క. జడగతులును బలుపిఱుదులుఁ
బిడికెఁడు నడుములును వలుఁద ♦ బిగి చనుగవలున్
వెడఁద నయనములు సిరి దడఁ
బడు మొగములు భ్రమరచికుర ♦ భరములు నమరన్. 186

ఉ. వేడుకతోడఁ గ్రొమ్ముడులు ♦ వీడఁ గుచోపరి హారరేఖ ల
ల్లాడఁ గపోలపాలికల ♦ హాటకపత్త్రరుచుల్ వినోదనం
బాడఁ బటాంచలంబు లసి ♦ యాడఁగ జేరి యశోదయింటికిం
జేసియ లేఁగి చూచి రొగి ♦ జిష్ణుని విష్ణునిఁ జిన్నికృష్ణునిన్. 187

వ. చూచి సంతసించి తెచ్చిన కానిక లిచ్చి. 188

తే. పాపనికి నూనెఁ దలయంటి ♦ పసుపుఁ బూసి
జోరు కాడించి హరిరక్ష ♦ పొమ్మటంచు
జలము లొకకొన్ని చుట్టి రాఁ ♦ జల్లి తొట్ల
నునిచి దీవించి పాడి ర ♦ య్యువిద లెల్ల. 189

క. జోజో కమలదళేక్షణ జోజో మృగరాజమధ్య ♦ జోజో కృష్ణా
జోజో పల్లవకరపద జోజో పూర్ణేందువదన ♦ జోజో యనుచున్.

వ. ఇవ్విధంబున. 191

క. పలుతోయంబులజగముల [1]బలుతోయములందు ముంచి ♦ భాసిల్లెడి యా
పలుదోయగాఁడు వల్లవ లలనాకరతోయములఁ జె ♦ లంగుచుఁ దడియున్.

---

1 బలుతోయములందున్ = అధిక జలములయందు - ప్రళయసముద్రమునందనుట. ముంచి = మునిఁగించి, అనఁగా, లోకములను చతుర్ముఖబ్రహ్మరూపమున పుట్టించి, విష్ణు రూపమున రక్షించి, రుద్రరూపమున లయింపఁజేసి భాసిల్లెడి యా పలుతోయగాఁడు.

క. లోకములు నిదుర వోవఁగ
జో కొట్టుచు నిదురవోని ♦ [1]సుభగుఁడు రమణుల్
జో కొట్టి పాడ నిదురం
గై కొను క్రియ నూరకుండెఁ ♦ గను దెఱవకయున్. 193

సీ. ఏ బాముఁ గలుగక ♦ యేపారు గట్టికిఁ
బసుల కాపరియింట ♦ బాము గలిగె
నే కర్మములు లేక ♦ యెసఁగు చక్కటికిని
జాతకర్మంబులు ♦ సంభవించె
నే తల్లి చనుఁబాలు ♦ నెఱుఁగని ప్రోడ య
శోద చన్నులపాల ♦ చొరవ నెఱిఁగె
నే హానివృద్ధులు ♦ నెఱుఁగని బ్రహ్మంబు
పొదిఁగిటిలో వృద్ధిఁ ♦ బొందఁ జొచ్చె

ఆ. నే తపముల నైన ♦ నెలమిఁ బండని పంట
[2]వల్లవీజనముల ♦ వాడఁ బండె
నే చదువుల నైన ♦ నిట్టిట్టి దనరాని
యర్థ మవయవముల ♦ నంద మొందె. 194

✤ శ్రీ కృష్ణమూర్తి బ్రహ్మ, విష్ణు, రుద్ర, పరబ్రహ్మ రూపములతోఁ బ్రకాశించుట :-

మ. చెయువుల్ సేయుతఱిన్ విధాతకరణిం ♦ జెన్నొందు సంతోష దృ
ష్టియుతుండై నగుచున్ జనార్దనునిమా ♦ డ్కిం బొల్చు రోషించియు
న్న యెడన్ రుద్రునిభంగి నొప్పును సుఖా ♦ నందంబునం బొంది త
న్మయుఁడై [3]బ్రహ్మముభాతి బాలుఁడమరున్ ♦ బాహుళ్యబాల్యంబునన్.

వ. అయ్యవసరంబున. 196

ఆ. కొడుకుఁ గన్న వేడ్క ♦ గొనసాగ రోహిణిఁ
జీరఁ బంచి చిత్ర ♦ చేలములను
మండనముల నిచ్చి ♦ మన్నించె నందుఁ డా
యంబుజాక్షి ప్రీత ♦ యై చరింప. 197

(1) సుభగుఁడు=తానుమాత్రము నిద్రింపని అందగాఁడు. (2) వల్లవీ......బండె= గోపికా స్త్రీల యిండ్లయందు ఫలించెను. (3) బ్రహ్మము...డమరున్ = సచ్చిదానంద నిత్య నిర్మలత్వము లనెడు పంచ లక్షణములు గల పరబ్రహ్మము వలె నొప్పును.

వ. అది మొదలుగ నొదవుల కదుపులు పొదువులుఁ గలిగి యుండె. అంత నందుండు గోపకుల ననేకుల గోకులరక్షకు దక్షులైనవారిని నియమించి మధురకుం జని కంసునికి నేఁటీటం గట్టిషి [1]యరింబెట్టి వీడ్కొని వసుదేవుని కడకుం జని యథోచితంబుగ దర్శించిన; 198

—: నందవసుదేవుల సమాగమము :—

క. నందునిఁ గనుఁగొని ప్రాణముఁ
బొందిన బొందియును బోలెఁ ♦ బొలుపారుచు సా
నందాశ్రులు గడకన్నులఁ
గ్రందుకొనం గేలుసాఁచి ♦ కౌఁగిటఁ జేర్చెన్. 199

వ. మఱియుఁ గౌఁగిలించుకొని సుఖాసీనునిం జేసి వసుదేవుండు దన కొడుకువలని ప్రీతి దీపింప నందున కిట్లనియె. 200

క. సంతతి లేదనియెడు ఘన చింతనముల మునిఁగి ముదిసి♦చిక్కిన నీకున్
సంతతి గలిగెను భాగ్యము సంతతిహీనునికి సౌఖ్య ♦ సంతతి గలదే.

క. పొడగంటి నిన్ను బ్రదికితిఁ,గడచితి నాపదలసంకఁ♦గార్యంబుల నే
యెడమడుగులేని నెచ్చెలిఁ బొడగాంచుట చచ్చి మరల ♦ బుట్టుటగాదే!

క. పలుపాటులఁ బడు జనులకు
నిల నొకచో నుండఁ గలదె ♦ యేఱుల వెంటం
గలసి చను మ్రాఁకు లన్నియుఁ
బలు వెంటలఁ బోవుఁగాక ♦ పాయకయున్నే. 203

మ. బలురోగంబులనొంద కున్నవె పసుల్ ♦ పాలిచ్చునే ధేనువుల్
గొలఁకుల్ వాఁగులు వారిపూరితములే ♦ గోష్ఠప్రదేశంబులం
బులులున్ దుష్టులు సంచరింపవు గదా ♦ పొల్పారునే [3]ఘోషముల్
కలవే పచ్చని పూరి జొంపములు త ♦ త్కాంతారభాగంబులన్.

క. తన పుత్త్రి మిత్త్రి ముఖరులఁ
దనుపక చూడకయు వారు ♦ దఱిఁగి నశింపన్

(1) అరింబెట్టి = కప్పమును చెల్లించి. (2) ఎడమడుగు=వ్యత్యాసము, (3) ఘోషముల్ = గొల్లపల్లెలు.

మనుచు గృహమేధి యయ్యాశ్రమ
మున నుండెడివాని కొక్క ♦ మోదముఁ గలదే. 205

క. నీ కాంతయొద్ద నీవును, నీ కాంతయు గారవింప ♦ నినుఁ బండ్రిఁగ నా
లోకించుచు నీ మందను, నాకొడుకున్నాఁడు సంజ ♦ [1]సందాన్వితుఁడై.

వ. అనిన నందుం డిట్లనియె. 207

శా. నీకుం దేవకికిం జనించిన సుతా ♦ నీకంబుఁ దోడ్తోడ ము
న్నీకంసుండు వధించె మీసుతఁ దుదిన్ ♦ హింసింపఁ జే దప్పి తా
నాకాశంబున కేఁగె బాల యది దై ♦ వాధీన మాపద్దశన్
శోకం బందునె [2]తజ్జ్ఞుఁ డూఱడుము [3]నా ♦ సూనుండె నీసూనుఁడుఁగా.

వ. అనిన వసుదేవుం డిట్లనియె. 209

క. జనపతి కరి యుడిగితివి మముఁ
గనుఁగొంటివి మేము నిన్నుఁ ♦ గంటిమి మే ల
య్యెను బొమ్మింకను గోకుల
మున [4]నుత్పాతములుదోఁచె ♦ మునుకొనవలయున్. 210

—: కంసుని పంపునఁ బూతన యను రాక్షసి వ్రేపల్లెకుఁ జనుదెంచుట :—

వ. అని పలికి వసుదేవుండు నందాదు లయిన [5]వల్లవుల వీడ్కొలిపిన వారలు గొబ్బున వడిగల [6]గిబ్బలంబూనిన శకటంబులు ప్రకటంబులుగ నెక్కి తమ పల్లెత్రోవంబట్టి చని రా నందుండు ప్రతీతంబులైన యుత్పాతంబులు ముందటఁ బొడగని శౌరి దనతోఁ బలికిన పలుకులు దప్పవనుచుఁ దలంచుచు వచ్చుచుండె నంత. 211

---

(1) సందాన్వితుఁడై = సంతోషముతో కూడుకొన్నవాఁడై. (2) తజ్జ్ఞుఁడు = తెలివి గలవాఁడు. (3) నీసూనుఁడుఁగా = నీ కుమారుడు, నాసూనుండె = నా కుమారుఁడే (అనఁగా దైవికముగా నీకు పుత్ర, పుత్రికా వియోగము గల్గినది. కాని వ్రేపల్లెలో నున్న బలరాముడు నా కొడుకుఁగానే భావించి కాపాడుదును. ఊరడిల్లుమని నందుఁడు ఓదార్చినాఁడు; అంతరార్థములో నా కొడుకు, నీ కొడుకే, అనియు ధ్వని. ఇది సుహృద్భావముతో అన్నమాట.) (4) ఉత్పాతములు తోఁచె = ఆపద సంభవించునట్టి తొందరలు కనఁబడుచున్నవి. (5) వల్లవులు = గోపకులు, (6) గిబ్బలకా = ఎద్దులను.

సీ. కంసుపంపున బాల ♦ ఘాతిని పూతన
పల్లెల మందలఁ ♦ బట్టణముల
నిల నెల్లచో బాల ♦ హింసఁ గావించుచుఁ
జనుచు నెవ్వని పేరు ♦ శ్రవణవీథిఁ
బడినయంతన సర్వ ♦ భయ నివారణ మగు
నట్టి దైత్యాంతకుఁ ♦ డవతరించి
యున్న నందుని పల్లె ♦ కొకనాఁడు [1]ఖేచరి
యై వచ్చి యందు మా ♦ యారూపయుక్తిఁ
తే. గామరూపిణి యై చొచ్చి ♦ కానకుండ
నరిగి యిల్లిల్లుఁ దప్పక ♦ యరసికొనుచు
నందగృహమున బాలుని ♦ నాద మొకటి
విని ప్రమోదించి సుందరీ ♦ వేషయగుచు. 212

మత్తకోకిలము.

క్రాలుకన్నులు గుబ్బచన్నులుఁ ♦ గందు వొందని చందురుం
బోలు మోమును [2]గల్గు లేదను ♦ బుద్ధిఁ దూఱని కౌను నే
రాళ మైన పిఱుందుఁ [3]బల్లవ ♦ రాగ పాదకరంబులుం
జాల దొడ్డగు కొప్పునొప్పఁగ ♦ సర్వమోహన మూర్తితోన్.

మాలిని

కాంచన కుండల ♦ కాంతులు గండయు ♦ గంబునఁ గ్రేళ్ళుఱు♦కన్ జడపై
మించిన మల్లెల ♦ మేలిమి తావులు ♦ మెచ్చి మదాళులు ♦ మింటను రా
నంచితకంకణ ♦ హారరుచుల్ సెలు♦వారఁగఁ బైవలు♦వంచల నిం
చించుక జాఱఁగ ♦ నిందునిభానన ♦ యేఁగెఁ గుమారుని ♦ యింటికిన్. 214

వ. ఆ సమయంబున. 215

మ. సిరి మమ్మున్ బ్రతుకంగఁ జూచుకొఱకై ♦ శృంగార వేషంబుతో
నరుదేనొప్పు నటంచు గోపికలు జి ♦ హ్వాల్ రాక మోహించి త
త్పరలై చూడ లతాంగిపోయి కనియెం ♦ బర్యంకమధ్యంబునం
బరు భస్మానలతేజు దుర్జనవధ ♦ ప్రారంభకున్ డింభకున్. 216

---

1) ఖేచరియై = ఆకాశమార్గమున సంచరించునదై. (2) కల్గు.....కౌనుఁ = ఉన్నదో లేదో అని తలఁపఁపగిన సన్నని నడుమును (3) పల్లవ.....బులుఁ = చిగుళ్ళవలె మృదువై ఎఱ్ఱనిరంగు గల కాలుసేతులును. (4) భస్మానల తేజుఁ = నీఱు గప్పిన నిప్పువలె వెలుఁగుచున్నవానిని,

వ. కని కదియవచ్చు నపుడు. 217

శా. ఆ లోకేశ్వరుఁ డా చరాచరవిభుం ♦ డా బాలగోపాలుఁ డా
బాలధ్వంసిని గొంతుగంటిడి వెసన్ ♦ బాలెంత చందంబునం
బాలిండ్లన్ విసమూని వచ్చుట మదిన్ ♦ భావించి లో నవ్వుచుం
గాలుం గేలు నెఱుంగకున్న కరణిం♦ గన్మోడ్చి గుర్వెట్టగన్. 218

—: పూతన సుందరరూపము ధరించి శ్రీకృష్ణుని ముద్దాడుట :—

క. ఆ పాపజాతి సుందరి, యా పాపని పాన్పుఁజేర ♦ నరిగి కరమునన్
లేపి చనుంగవ శిశువుఁ, మోపుచు ముద్దాడిశిరము ♦ మూర్కొని పలికెన్.

క. చనునికు గుడుపఁజాలెడి, చనువారలు లేరు నీవు♦చనవలె ననుచుం
జనుగుడిపిమీఁద నిలుకడఁ జనుదాన ననంగ వేడ్కఁ♦జనుఁజనుగుడుపన్

క. నా చనుఁబా లొకగ్రుక్కెం
డో చిన్నికుమార త్రావు ♦ మెయ్యన పిదపన్
నీ చెలువ మెఱుఁగ వచ్చును
నా చెలువము సఫల మగును ♦ నలినదళాక్షా! 221

వ. అని బాలు నుద్దేశించి ముద్దాడెడిభంగి మాటలాడెడి చేడియంజూచి

మ. [1]వనితా ముట్టకుమమ్మ చన్నుగుడుపన్ ♦ వద్దమ్మ నీచన్ను మా
తనయుం డొల్లఁడు వాసిపొమ్మని యశో ♦ దారోహిణుల్ [2]సీరఁగై
కొన కీక్షించుచు మాయఁబన్ని పెలుచం ♦ గోశంబులో వాలు మె
ల్పున రాజిల్లుచు మాట మెత్తఁదనముం ♦ లోవాఁడియున్నేర్పడన్.

వ. కదిసి కలికి పలుకులు పలుకుచు నులుకుసెడి జళుకు సొరక యెదుర నిదుర గదిరిన ఫణిని ఫణి యని యెఱుంగక [3]గుణమతిం దిగుచు జడమతి బెడంగునఁ [4]గఱటి జఱభి తెఱవ వెరవునం జనుదెంచి పఱపు నడుమ నొఱపు గలిగి మెఱయుచుఁ గన్నుంగవ దెఱవక వెఱపు మఱపు నెఱుంగక కొమరుమిగులు చిఱుతకొమరునిం దిగిచి తొడల

1 మూలములో యశోదా రోహిణులు పూతనను చన్నివ్వవలదని నివారించ లేదు.' 'పర స్త్రియం తత్ర్పభయాచధర్షితే। నిరీక్షమాణే జననీహ్యతిష్ఠతాం'' అనఁగా పూతన సౌందర్యమున కాశ్చర్యపడి తల్లు లిద్దఱుంజూచుచు నూరకుండిరి అనిగలదు. (2) సీరఁగై = పిలిచి పిలిచి చెప్పగా. (3) గుణమతిఁ = త్రాడు అనెడి భావముతో. (4) కఱటి జఱభి తెఱవ = వంచకురాలైన యాదుష్టస్త్రీ.

నడుమ నిడుకొని యొడలు నివురుచు నెడనెడ మమతం గడలు
కొలుపుచు [1]నాఁకొన్న చిన్నియన్న చన్నుఁగుడువు మని చన్నిచ్చు
సమయంబున. 224

సీ. మేల్కాన్న తెఱఁగున ♦ మెల్లన కనువిచ్చి
క్రేఁగంటఁ జూచుచుఁ ♦ [2]గిదికి నీల్గి
యావులించుచుఁ జేతు ♦ లాదరంబునఁ జాచి
యొదికిలి యాఁకొన్న ♦ యోజ నూది
బిగిచన్నుఁగవఁ గేలఁ ♦ బీడించి కబళించి
గుక్క గుక్కకు గుటు ♦ గుటుకు మనుచు
నొక రెండుగుక్కల ♦ నునిదప్రాణంబులు
సైతము మేనిలో ♦ సత్త్వ మెల్ల
తే. ద్రావె నదియును గుండెలుఁ ♦ దల్లడిల్లఁ
జిమ్మఁ దిరుగుచు నిలువక ♦ శిరము ద్రాల
నితరబాలురక్రియ వాఁడ ♦ వీవు గావు
చన్ను విడువుము విడువుము ♦ చాలు ననుచు. 225

క. నిబ్బరపు దప్పి మంటలు, ప్రబ్బిన ధృతిలేక నేత్ర ♦ పదహస్తంబుల్
గొబ్బున[3]నివృతములుగ నా, గుబ్బొగుబ్బయినకూతఁ ♦ గూలెన్ నేలన్.

మ. అదరెం గొండలతోడ భూమి గ్రహతా ♦ రానీకముల్ మింటిపై
బెదరెన్ దిక్కుల మాఱుమ్రోఁత లెసఁగెన్ ♦ భీతిల్లి లోకంబులుం
గదలంబాఱెను [4]వజ్రభిన్నగిరిరే ♦ ఖం బూర్వదేహంబుతోఁ
[5]త్రిదశధ్వంసిని గూలి కుయ్యిడిన [6]త ♦ ద్దీర్ఘోరుఘోషంబునన్.

క. అప్పుడు దెప్పర మగు నా
చప్పుడు హృదయములఁ జొచ్చి ♦ సందడి వెట్టన్
ముప్పిరిగొని పడి రెఱుకలు
దప్పి ధరన్ గొల్లలెల్లఁ ♦ దల్లడపడుచున్. 228

(1) ఆఁకొన్న = ఆకలి గొన్న. (2) కిదికి నీల్గి = నిక్కి ఒడలు విఱుచుకొని (ఆవులించుచు) (3) నివృతము = సలుప్రక్కల చుట్టఁబడినదిగ. (4) వజ్రభిన్నగిరిరేఖం = వజ్రాయుధము చేత భేదింపఁబడిన కొండవలె. (5) త్రిదశధ్వంసిని = దేవతలను హింసించునది యైన పూతన. (6) తద్దీర్ఘోరు ఘోషంబునన్ = (పూతన) దాని కూయుటవలనైన దీర్ఘమైన పెద్ద ధ్వనిచేత.

క. ఆ [1]జటిభిరండ రక్కసి, నైజ శరీరంబు నేల ♦ నలియం బడినన్
యోజనమున్నర మేర [2]ధరాజంబులు నుగ్గులయ్యె ♦ రాజవరేణ్యా.

సీ. [3]దారుణలాంగూల ♦ దండ దంతంబులు
[4]నగగహ్వరముఁబోలు ♦ నాసికయును
గండశైలాకృతి ♦ గల కుచయుగమును
విరిసి తూలెడి [5]పల్ల ♦ వెంట్రుకలును
జీకటినూతులఁ ♦ జెనయు నేత్రంబులుఁ
బెనుదిబ్బఁ బోలెడి ♦ పెద్దపిఱుఁదుఁ
[6]జాఁగుకట్టలఁ బోలు ♦ చరణహస్తంబులు
నింకిన చెఱువుతో ♦ నెనయుకడుపుఁ
తే. గలిగి [7]షట్క్రోశదీర్ఘమై ♦ కదిసిచూడ
భయద మగు దాని ఘన కళే ♦ బరముఁజూచి
గోపగోపీజనంబులు ♦ గుంపుగూడి
బెగడుచుండిరి మనముల ♦ బెదరు గదిరి. 230

వ. ఇవ్విధంబున. 231

క. ఆతటిఁ గుడువఁగ నడచెన్
నూతన ఫుల్లాబ్జలోచ ♦ నుఁడు హరి [8]మృత్యు
ద్యోతనఁ [9]గృతమునిసముదయ
యాతనఁ బూతన నెఱింగి ♦ యాతన లీలన్. 232

కం. [10]విషధరరిపు గమనునికిని
[11]విషగళ సఖునికిని విమల ♦ విషశయనునికిన్

---

(1) జటిభి = వంచకురాలు. (2) ధరాజంబులు = వృక్షములు. (3) దారుణ... తంబులు = పెద్దతోక కఱ్ఱవలె భయంకరములైన పండ్లు. (4) నగగహ్వరముల్ = కొండగుహలు. *మూలము. ఈషామాత్రోగ్రదంష్ట్రాస్యం = వాడియైన బాణములవంటి దంతములు (అని గలదు). (5) పల్లవెంట్రుకలు=ఎఱ్ఱని వెంట్రుకలు. (6) జాఁగుకఱ్ఱలఁబోలు ఏటికట్టలతో తుల్యమైన. (7) షట్క్రోశదీర్ఘమై = ఆఱుక్రోసులమేర పొడుగు గలదై. (8) మృత్యువువలె కనబడుదానిని. (9) కృత...యాతనన్ = మునిసంఘమును కష్టపెట్టునది. (10) సర్పశత్రువగు గరుత్మంతు నెక్కువానికి. (11) విషము కంఠమునందు గల్గ శివునికి చెలికాఁడు,

[1]విషభవభవజనకునికిని
విషకుచచనువిషముఁ గొనుట ♦ విషమే తలఁపన్. 233

వ. అంత నా గోపకాంతలు దెలిసి రోహిణీ యశోదలం గూడుకొని బెగ్గడిలక డగ్గఱి.

శా. నేలం గూలినదాని పెన్నురముపై ♦ నిర్భీతిఁ గ్రీడించు నో
బాలా రమ్మని మ్రూఁపుఁ జిమ్ముకొని సం♦స్పర్శించి యూరార్చుచుం
గోలాంగూలముఁ ద్రిప్పి గోపురజమున్ ♦ గోమూత్రముం జల్లి త
ద్బాలాంగంబుల గోమయం బలఁది రా ♦ పం(డెండునామంబులన్.

వ. మఱియు నంతటం దనియక గోపిక లాచమనంబులు సేసి దక్షలయి మునుపుగాఁ దమకు *రక్షాకరంబగు బీజన్యాసంబు సేసికొని చిన్నియన్న నీయడుగు లజుండును జానువు లనిలుండును దొడలు యజ్ఞుండును గటితలం బచ్యుతుండును గడుపు హయాస్యుండును హృదయంబుఁ గేశవుండును నుర మీశుండును గంఠం బినుండును భుజంబులు చతుర్భుజుండును ముఖంబు త్రివిక్రముండును శిరం బీశ్వరుండును రక్షింతురు. ముందు చక్రియు వెనుక గదాధరుండైన హరియుఁ బార్శ్వంబుల ధనుర్ధరుండైన [2]మధువైరియు నసిధరుల డగు నజనుండును గోణంబుల శంఖధరుండైన యురగశయనుండును మీఁ దుపేంద్రుండును గ్రిందు [3]తార్క్ష్యుండును నంతటను హలధరుం డగు పురుషుండును గాతురు. నీ యింద్రియంబుల హృషీకేశుండును ప్రాణంబుల నారాయణుండును జిత్తంబును శ్వేతద్వీపపతియును మనంబును యోగీశ్వరుండైన కపిలుండును బుద్ధిని [4]పృశ్నిగర్భుండును నహంకారంబును భగవంతుండైన నరుండును పాలనంబు సేయుదురు. నీవు క్రీడించునెడ గోవిందుండును శయనించుతఱి మాధవుండును నడచువేళ వైకుంఠుండును గూర్చున్నసమయంబున శ్రీపతియును గుడుచుకాలంబున సర్వగ్రహభయంకరుండైన యజ్ఞభుజుం

(1) విషభవభవ = జలమునందు పుట్టిన కమలమునం దుద్భవించిన బ్రహ్మ. (2) మధువైరి = మధువను రాక్షసుని సంహరించిన విష్ణువు. (3) తార్క్ష్యుండును = గరుడుఁడును. (4) పృశ్నిగర్భుండు = పృశ్నిగర్భుఁడైన శ్రీహరియు. *రక్షాకరంబు = రక్షణచేయునది

డును నేమఱకుండుదురు. నిన్నుఁ జేర్కొనిన దుస్స్వప్నవృద్ధబాల
గ్రహంబులును గూశ్మాండడాకినీ యాతుధానులును భూతప్రేతయక్ష
రాక్షసపిశాచ వినాయకులును గోటరారేవతులును జ్యేష్ఠాపూతన
లును మాతృకాది గణంబులును నశియింతురు. నీయందుఁ బ్రాణేం
ద్రియ శరీరనిరోధంబు లయిన యున్మాదంబులును నపస్మారంబులును
మహోత్పాతంబులునుబొందకుండుం గావుతమని రక్ష సేసిదీవించిరంత.

క. ఆ పెద్ద [1]వేడబంబుల పాపనికిని జన్నుగుడిపి ♦ పానువుపై సం
స్థాపించి కప్పి కూరుకు మోపొప్పఁడయని యశోద♦యొయ్యనపాడెన్

వ. అంత నందుండును మొదలయిన గోపకులు మధురనుండి వచ్చి రక్కసి
మేను గని వెఱఁగుపడి మున్న వసుదేవుం డుత్పాతంబు లెఱింగి
చెప్పె. ఆతండు మహాయోగి యని పొగడి కఠోరంబగు పూతన
యొడలు కుఠారంబుల నఱికి తమకుటీరంబులకు దవ్వగు [2]వటారం
బున దహనంబు సంగ్రహించి దహించి రంత. 238

ఆ. పొగిలి పొగిలి కాలు ♦ మగువ దేహంబున
నగరు పరిమళముల ♦ పొగలు వెడలె
దేహకల్మషములు ♦ శ్రీహరిముఖమునఁ
ద్రావఁబడుటఁ జేసి ♦ భూవరేంద్ర. 239

క. హరి దనమీఁదం బదములు
గరములు నిడి చన్నుఁగుడిచి ♦ కదిసినమాత్రన్
హరిజనని పగిదిఁ బరగతి
కరిగెను దురితములఁ బాసి ♦ యసురాంగనయున్. 240

క. [3]వెన్నుని కొకపరి విషమగు
చన్నిచ్చిన [4]బాలహంత్రి ♦ చనె నఁట దివికిన్
వెన్నుఁ గని పెంచి భక్తిం
జన్నిచ్చిన సతికి మఱియు ♦ జన్మము గలదే. 241

(1) ఆ పెద్దవేడబంబుల పాపనికిన్ = ఎచ్చయిన మాయలుగల ఆ బిడ్డనికి. (2) వటారంబున = నగరంబున (3) వెన్నునికి = శ్రీవిష్ణుమూర్తికి (4) బాలహంత్రి = పిల్లలను చంపునది.

క. హరిఁ గని చన్నులు గుడిపెడి
తరుణులు ప్రాపించుగతులు ♦ దడవన్ వశమే
హరి యారగించుటకుఁ బా
ల్గురిసిన ధేనువులు ముక్తి ♦ కొనల జరించున్. 242

క. ఆపూతన మెయిగంధము గోపాలురెఱింగి యిట్టి ♦ కువనిత యొడలం
దీపాటి స్వాదుగంధము ప్రాపించునె యనుచుఁ జనిరి♦పల్లెకు నధిపా

వ. అంత నందుండు పరమానందంబున నింటికిం జని ప్రేతలచేత రక్కసి
చేఁతలన్నియు నెఱింగి వెఱఁగుపడి పాపని లేపి శిరంబు మూర్కొని
ముద్దాడిముదంబున నుండెనని చెప్పిన వినిపరీక్షిన్నరేంద్రుం డిట్లనియె

క. ఏయే యవతారంబుల, నేయే కర్మములు సేసె ♦ నీశుఁడుహరి [1]భ
ద్రాయతనములన్నియువినఁ బాయదు చిత్తంబుసెవుల♦పండువులయ్యెన్.

క. ఉరుసంసార పయోనిధి
తరణంబులు పాపపుంజ ♦ దళనంబులు శ్రీ
కరణంబులు ముక్తిసమా
చరణంబులు బాలకృష్ణు ♦ సంస్మరణంబుల్. 246

వ. అని తరువాత బాలకృష్ణుం డేమి సేసె నాయందుఁ గృప గలదేనిం
జెప్పవే యని యడిగిన రాజునకు శుకుం డిట్లనియె. 247

—♦ బాలకృష్ణుండు శకటము దనపాదమునఁ గూలఁ దన్నుట ♦—

సీ. బాలకుం డొదిగిలఁ ♦ బడనేర్చె నని జన్మ
నక్షత్రమం దొక్క ♦ నాఁడు నందు
పొలఁతి వేడుకతోడఁ ♦ బొరుగు ప్రేతలఁ జీరి
వాద్రిత్రగీతార ♦ వంబు సెలఁగ
విప్రులతోఁ గూడ ♦ వేదమంత్రంబుల
నభిషేచనాదిక ♦ మాచరించి
వారి దీవన లొంది ♦ వారికి మొదవుల
నన్నంబుఁ జీరల ♦ నడిగి నట్టు

(1) భద్రాయతనము = మంగళములకుస్థానమైనది.

ఆ. లిచ్చి బాలుఁ దియ్య ♦ మెసఁగఁ బానుపు సేర్చి
నిదురపుచ్చి గోప ♦ నివహమునకు
గోపికలకుఁ బూజ ♦ గొమరారఁ జేయుచు
జనని గొడుకు మఱచె ♦ సంభ్రమమున. 248

వ. ఆసమయంబున. 249

క. నిదురించిన శిశు వాఁకొని
[1]కిదుకుచుఁ జను గోరి [2]కెరలి ♦ కిసలయవిలస
న్మృదు చక్ర చాప రేఖా
స్పద పదమునఁ దన్నె నొక్క ♦ బండిన్ దండిన్. 250

క. శకటము హరి దన్నిన దివిఁ
బ్రకటంబై యెగసి యిరుసు భరమునఁ గండ్లున్
వికటంబుగ నేలం బడ
సకటా యని గోపబృంద ♦ మాశ్చర్యపడన్. 251

వ. అప్పు డందున్న సరసపదార్థంబులు వ్యర్థంబులై నేలం గూలుటం జూచి యశోదానందముఖ్యులైన గోపగోపికా జనంబులు పనులు మఱచి [3]ప్రబ్బంబులు మాని యుబ్బుసెడి వెఱపులు ఘనంబులుగ మనంబులందుఁ గదుర. 252

క. మిన్నున కూరక యెగయదు, తన్న సమర్థుండుగాఁడు ♦ తల్పగతుండీ
చిన్నికుమారుఁడు దే[4]రే. విన్ననువున నెగసె దీని ♦ విధ మెట్టిదియో.

వ. అని వితర్కించు సమయంబున. 254

క. బాలకుఁ డాఁకొని యేడ్చుచుఁ
గాలెత్తినఁ దాఁకి యెగసెఁ ♦ గాని శకటమే
మూలమున నెగయ దని య
బ్బాలుని కడ నాడుచుండి ♦ పలికిరి శిశువుల్. 255

వ. శిశువుల పలుకులు విని. 256

---

(1) కిదుకుచు = చేతులు కాళ్ళు చాఁచి ఒడలు విఱుచుకొనుచు (2) కెరలి...దన్నె = తత్తఱిల్లి, చక్రము ధనుస్సు మొదలైనరేఖలు కలిగి పల్లవమువలె మృదువయినపాదముతో ఒకానొక బండిని తన్నెను. (3) ప్రబ్బంబులు... చెడి = వేడుకలు - పండుగలు వదలి పెట్టి ఉత్సాహము లేనివారయి (4) ఏవిన్ననువునన్ = ఏయత్నముచేత, సరస పదార్థంబులు = రసవంతములైన మంచి వస్తువులు.

శా. బాలుం డెక్కడ బండి యెక్కడ నభో ♦ భాగంబుపైఁ జేడ్పడం
గాలం దన్నుట యెక్కడాటపడుచుల్ ♦ కల్లాడి [1]రీజడ్డుఁ బ
ల్కేలోకంబున నైనఁ జెప్పఁబడునే ♦ యేచందమో కాక యం
చాలాపించుచు వ్రేలు వ్రేతలుఁ బ్రభూ ♦ తాశ్చర్యలై రంతటన్.

వ. అప్పుడా బాలుని రోదనంబు విని యశోద పఱతెంచి. 258

ఆ. అలసితివి గదన్న ♦ యాఁకొంటివి గదన్న
మంచి యన్న యేడ్పు ♦ మాను మన్న
చన్ను గుడువు మన్న ♦ సంతసపడు మన్న
యనుచుఁ జన్ను గుడిపె ♦ నర్భకునకు. 259

వ. అంత నబ్బాలుని మేన బాలగ్రహంబు సోఁకును గదా యని శంకించి గోపకు లనేకు లనేక బలివిధానంబులు సేసిరి. బ్రాహ్మణులు [2]దధికుశాక్షతంబుల హోమంబు లాచరించిరి. ఋగ్యజుస్సామ మంత్రంబుల నభిషేచనంబులు సేయించి స్వస్తిపుణ్యాహవాచనంబులు సదివించి కొడుకున కభ్యుదయార్థంబు నందుం డలంకరించిన పాఁడిమొదవుల విద్వజ్జనంబులకిచ్చి వారల యాశీర్వాదంబులు గైకొని ప్రమోదించు చుండెనని చెప్పి శుకుం డిట్లనియె. 260

—♦ తృణావర్తుఁడను రాక్షసుఁడు సుడిగాలియై కృష్ణు నెత్తుకొని పోవుట ♦—

క. కొడుకు నొకనాఁడు దొడపై
నిడుకొని ముద్దాడి తల్లి ♦ యెలమి నివురుచోఁ
గడు దొడ్డ కొండశిఖరము
వడువున వ్రేఁ గయ్యె నతఁడు ♦ వసుధాధీశా. 261

క. బరువైన కొడుకు మోవను
[3]వెరవిడి యిలమీఁదఁ బెట్టి ♦ వెఱచి జనని దా
ధరఁ గావఁ బుట్టిన మహా
పురుషుఁడు గాఁబోలు ననుచు ♦ బుద్ధిఁ దలంచెన్. 262

వ. అప్పుడు.

(1) ఈ జడ్డుఁబల్కు = ఈ తెలివిమాలినమాట. (2) దధికుశాక్షతంబులన్ = పెరుగు, దర్భ, అక్షతలు వీనిచేత. (3) వెరవిడి = మోయనశక్తురాలనుట [నేర్పులేనిదై]

క. ఖరుఁ డగు కంసుని పంపున
నరిగి తృణావర్తుఁ డవని ♦ కవచాటముగా
[1]సురకరువలి యై బిసబిస
నరు దరు దన ముసరి విసరి ♦ హరిఁ గొనిపోయెన్. 264

క. సుడి యెఱుఁగని హరి సుడిగొన
సుడిగాలి తెఱంగు రక్క ♦ సుఁడు విసరెడి యా
సుడిగాలి ధూళి గన్నుల
సుడిసిన గోపకులు బెగడి ♦ సుడివడి రధిపా. 265

వ. మఱియు [2]నవ్వాలయపవనదనుజుండు [3]విలయపవనుని తెఱంగునం గసి మసంగి ముసరి మసరు గవిసి విసరెడి సురకరువలిం బొడమిన పుడమి రజంబు వడి నెగసి గగనమున మెఱసి తరణికిరణములకు మఱుఁగువడిన నిబిడమగు [4]బెడిదంపుఁ దిమిరమున దశదిశలు నెఱుంగఁబడక గోకులం బాకులత నొంద నొండొరుల నెఱుంగక బెండుపడుచున్న జనంబుల మనంబుల ఘనంబగు భయంబు రయంబునం జెంద నదభ్రపరిభ్రమణ శబ్దంబున దిగంతంబులు సెవుడుపడి పరిభ్రాంతంబులుగ నొక్క ముహూర్తమాత్రంబున భువనభయంకరత్వంబు దోఁచె నా సమయంబున. 266

ఉ. పాపనిఁ జూడఁ గానక వి ♦ పద్దశ నొంది కలంగి తల్లి యో
పాపఁడ బాలసూర్యనిభ ♦ బాలశిరోమణి నేఁడు గాలికిం
జేపడి పోయితే యనుచుఁ ♦ జీరుచు దైవముఁ జాల దూరుచుం
దాపమునొంది నెవ్వగల♦దయ్యుచుఁ గ్రుయ్యుచుఁ బిట్టుగూయుచున్.

క. సుడిగాలి వచ్చి నిన్నున్
సుడిగొని కొనిపోవ మింట ♦ సుడిసుడి గొనుచున్
బెడఁ గడరెడి నాముద్దుల
కొడుకా యేమంటి వనుచు ♦ ఘోరం బనుచున్. 268

ఉ. ఇక్కడఁ బెట్టితిం దనయుఁ ♦ డిక్కడ నాడుచు నుండె గాలి దా
నెక్కడనుండి వచ్చె శిశు ♦ వెక్కడిమార్గము వట్టిపోయె నే

(1) సురకరువలియై = సుడిగాలియై. (2) వలయపవన దనుజుఁడు = పయ్యెరగాలివలె పొలయువాఁడైన తృణావర్తుఁడు. (3) విలయపవను తెఱంగునన్ = ప్రళయకాలపు వాయువు వలెనే. (4) బెడిదంపుఁ దిమిరమున = భయంకరమైన చీఁకటిచేత.

నెక్కడఁ జొత్తునంచుఁ గమ ♦ లేక్షణ గ్రేపుఁ దొలంగి ఖిన్నయై
పొక్కుచు వ్రాలు గోవుక్రియ ♦ భూస్థలి వ్రాలె దురంతచింత నై.

క. ఆ పాపని కై పొగిలెడి
యా పాపనితల్లిఁ జూచి ♦ యారటపడుచున్
గోపాల సతులు బాష్పజ
లాపూరిత నయనలై రి ♦ యార్తిం బడుచున్. 270

శా. ఆలోఁ [1]జక్రసమీరదైత్యుఁడు మహా ♦ హంకారుఁడై మింటికిన్
బాలుం దాఁ గొనిపోయిపోయి తుదిఁ ద ♦ ద్భారంబు మోవన్ బల
శ్రీ లేమిం బరిశాంతవేగుఁ డగుచుం ♦ జేష్టింపఁగా లేక ము
[2]న్నీలా గర్భకుఁ జూడనంచు నిటమీఁ ♦ దెట్లంచుఁ జింతింపఁగన్.

వ. అట్లు దనుజుండు చింతించుచున్న సమయంబున. 272

క. బాలద్విరద కరంబులఁ
బోలెడి కరములను దనుజు ♦ బొండుగ బిగియం
గీలింప వ్రేలఁబడియెను
బాలకుఁ డొక కొండభంగి ♦ బరువై యధిపా. 273

క. మెడ బిగియఁబట్టుకొని డిగఁ
బడియెడి బాలకునిచేతఁ ♦ బర్వతనిభుచే
విడివడఁ జాలక వాఁ డురిఁ
బడి వెగడెడు ఖగము భంగి ♦ భయముం బొందెన్. 274

క. హరికరతల పీడనమునఁ,
బరవశుఁడై శాలమీఁద ♦ భగ్నాంగకుఁడై
సురవైరి భటుఁడు గూలెను
[3]బురభంజనుకోలఁ గూలు ♦ పురముం బోలెన్. 275

వ. అంత గోపకాంత లంతయుం గని రోదనంబులు మాని సమ్మోదం
బున విక్కవిరిసి రక్కసుని యురంబున మురువు గలిగి బరువులేక
వ్రేలు బాలుం గొనివచ్చి ముచ్చిరుచున్న తల్లి కిచ్చి రప్పుడు గోప
గోపికాజనంబు లందఱుఁ దమలో నిట్లనిరి. 276

---

(1) చక్రసమీర దైత్యుఁడు = సుడిగాలియైన రాక్షసుడు — తృణావర్తుడు. (2) ఈలాగు అర్భకున్ = ఇటువంటికుమారుని. (3) పురభంజనుకోలన్ = త్రిపురములను నాశనము చేసిన శివునియొక్క బాణముచేత.

క. రక్షణము లేక సాధుఁడు
రక్షితుఁడగు సమతఁజేసి • [1]రాయిడు లందున్
రక్షణములు వెయి గలిగిన
శిక్షితుఁడగు ఖలుఁడు పాప • చిత్తుం డగుటన్. 277

మ. గతజన్మంబుల నేమి నోచితిమొ యా • గశ్రేణు లేమేమి సే
సితిమో యెవ్వరి కేమి వెట్టితిమొ యే • చింతారతిం బ్రొద్దు పు
చ్చితిమో సత్యము లేమి వల్కితిమొ యే • సిద్ధప్రదేశంబుఁ ద్రొ
క్కితిమో యిప్పుడు సూడఁగంటి మిచటం • [2]గృష్ణార్భకున్ నిర్భయున్.

వ. అని పలికిరంత నందుఁడు మున్ను దనకు వసుదేవుండు చెప్పిన మాటలకు వెఱఁగుపడుచుండె మఱియును. 279

సీ. జననాథ యొకనాఁడు • చన్ను సేఁపినఁ దల్లి
చిన్నిముద్దుల కృష్ణుఁ • జేరఁ దిగిచి
యెత్తి పెందొడలపై • నిడుకొని ముద్దాడి
చన్నిచ్చి నెమ్మోము • సక్కనివిరి
యల్లని నగవుతో • నావులించిన బాలు
వదన గహ్వరమున • వారినిధులు
దిశలు భూమియు వన • ద్వీప శైలంబులు
నేఱులు గాలియు • నినుఁడు శశియు

ఆ. దహనుఁ డాకసంబుఁ • దారలు గ్రహములు
నఖిలలోకములుఁ జ • రాచరంబు
లైన భూతగణము • లన్నియు నుండుటఁ
జూచి కన్నుమోడ్చి • చోద్యపడియె. 280

—• వసుదేవుని పంపున గర్గమహాముని నందుని వద్దకు వచ్చి సంభాషించుట. •—

వ. అంత నొక్కనాఁడు వసుదేవు పంపున యాదవపురోహితుండైన గర్గుండు మందకుం జనుదెంచిన నందుం డతనిఁ గనుంగొని లేచి నిలిచి కృతాంజలి యై.

(1) రాయిడులు = ప్రమాదములు. (2) కృష్ణార్భకున్ = బాలకృష్ణుని చూడఁగంటిమి చూచునంత భాగ్యమును పొందితిమి. అనఁగా శ్రీకృష్ణపరబ్రహ్మదర్శనము పుణ్యకర్మ ఫలముచేత లభించును.

క. కోరి భజించెను నందుఁడు, [1]సారగుణాచారమార్గు ♦ [2]సత్సంసర్గు
[3]న్నారాధితభర్గున్ [4]మతి దూరితషడ్వర్గుఁ [5]గుజన ♦ దుర్గున్ గర్గున్.

వ. మఱియుఁ దగిన సత్కారంబులు సేసి యిట్లనియె. 283

క. ఊరక రారు మహాత్ములు, వారథములయిండ్లకడకు ♦ వచ్చుటలెల్లం
గారణము మంగళములకు, నీరాక శుభంబు మాకు ♦ నిజము మహాత్మా!

శా. జ్యోతిశ్శాస్త్రుల కెల్ల మేటివి గదే ♦ జోమూర్తి వాశాంత వి
ఖ్యాతస్ఫూర్తివి [6]బ్రహ్మబోధనుఁడ వా ♦ కర్ణింపు నాపల్కు ని
ర్ణీతుండైన గురుండు మానవులకున్ ♦ విప్రోత్తముం డంద్రు నీ
చాతుర్యంబున నీ కుమారులకు సం ♦ స్కారంబు సేయంగదే. 285

వ. అని రామకృష్ణులం జూపిన గర్గుండు మున్ను కంసునిచేత వ్రేటుపడి దివి కెగసిపోయిన తెఱవ (యోగమాయ) సెప్పిన తెఱంగు చేట పఱిచి దేవకీదేవి కొడుకని కృష్ణునిఁ గంసుండు దలంచుఁ గావున రహస్యంబున సంస్కారంబు సేయుట కార్యం బని నందానుమతంబున రోహిణీకుమారు నుద్దేశించి.

క. జనులు రమింపం దిరిగెడి
[7]యనువుకలిమి రాముఁ డనియు ♦ యదుసంకర్షం
బున సంకర్షణుఁ డనియును
ఘనబలమున బలుఁడు ననియు ♦ గణుతించె నృపా. 287

వ. మఱియుం గృష్ణు నుద్దేశించి తొల్లి యీశిశువు ధవళారుణపీతవర్ణుండై యిప్పుడు నల్లనైన కతంబునఁ గృష్ణుండయ్యె. వసుదేవునకు నొక్కెడ జన్మించిన కారణంబున వాసుదేవుండయ్యె నీ పాపనికి గుణరూపకర్మంబు లనేకంబులు గలుగుటంజేసి నామంబు లనేకంబు లగు నీబాలకునివలన మీరు దుఃఖంబులఁ దరియింతు రీ యర్భ

(1) సారగుణాచార = మంచిగుణముల యొక్కయు, ఆచారముల యొక్కయు. (2) సత్సంసర్గున్ = సత్పురుషులయొక్క చేరిక గలవానిని. (3) ఆరాధితభర్గున్ = పూజింపఁబడిన శివుఁడు గలవానిని. (4) మతిదూరిత షడ్వర్గున్ = బుద్ధిచే దూరముగాఁ జేయఁబడిన కామక్రోధాది షడ్వర్గములు గలవానిని. (5) కుజన దుర్గున్ = కుత్సితజనులకు పొందరానివానిని. (6) బ్రహ్మబోధనుఁడు = బ్రహ్మవేత్త. (7) అనువు కలిమిన్ = చక్కఁదనము మొదలైనవి కలిగియుండుటచేత.

కునిచేత దుర్జనశిక్షణంబును సజ్జనరక్షణంబు నగు నీ కుమారుండు నారాయణసమానుం డని చెప్పి తనగృహమ్మునకు నమ్మునీశ్వరుండు చనియె. నందుండును బరమానందంబున నుండె నంత.

-◆ శ్రీకృష్ణబలరాముల బాలక్రీడావర్ణనము ◆-

సీ. [1]జానుభాగముల హ ◆ స్తమ్ములు పెట్టడ
నిడుచు దిగ్గనఁ బోవు ◆ నంత నంత
నవ్వుల పయ్యెద ◆ లంది జవ్వాడుచు
రాల క్రేవ్రేలతోఁ గ ◆ [2]లమిపట్టి
విడువనేరక వాని ◆ వెనువెంట జరగుచు
రప్పంకముల మునుఁ ◆ గడచఁ బోవు
రెత్తి చన్నిచ్చుచో ◆ నిరుదెసఁ బాలింపు
చేతులఁ బుడుకుచుఁ ◆ జేవ గలుగ
తే. [3]దూఁటుదురు గుక్కగుక్కకుఁ ◆ [4]దోర మగుచు
నాడుదురు ముద్దుపలుకు ల ◆ వ్యక్తములుగఁ
గరము లంఘ్రులు నల్లార్చి ◆ కదలుచుందురు
రామకృష్ణులు శైశవ ◆ రతులఁ బెగిలి. 289

క. తడ వాడిరి బలకృష్ణులు
దడ వాడిరి వారిఁ జూచి ◆ తగ రంభాదుల్
[5]దడవాడి రరులు భయమునఁ
దడ వాడిరి మంతనములఁ ◆ దపసులు వేడ్కన్. 290

సీ. తలయెత్తి మెల్లన ◆ తడవి యాడెడువేళఁ
[6]బన్నగాధీశుల ◆ పగిదిఁ [7]దాల్తు
[8]రంగసమ్ముత్ప్రష్ట పం ◆ కాంగరాగంబుల
నేనుఁగు గున్నల ◆ యెత్తునెత్తు

---

(1) జానుభాగములన్ = మోకాళ్లయందుండి. (2) అలమిపట్టి = ఒడిసిపట్టి [గట్టిగాఁ గదలకుండఁ బట్టి] (3) దూఁటుదురు = పీల్చుకొందురు. [4] తోరముగ-చున్ = అధికముగ. (5) తడవాడిరి = (తడవి ఆడిరి) కనులు గానక వెదకుకొను తిరిగిరి. (6) పన్నగాధీశుల పగిదిన్ = ఆదిశేషుఁడు, అనంతుఁడు, వాసుకి మొదలైన సర్పరాజుల విధముగ. (7) తాలురు = ధరింతురు. (8) అంగసమ్ముత్ప్రష్ట పంకాంగరాగంబులన్ = దేహమునకు విపరీతముగా బురదగా గంధము పూఁతలచేత.

రసమంబులైన [1]జ ♦ వాతిరేకమ్ముల (జ♦వ్వాడు లేఖంబుల)
[2]సింగంపుఁగొదమల ♦ సిరి వహింతు
[3]రాననంబులఁ గాంతు ♦ లంతంత కెక్కఁగ
[4]బాలార్కచంద్రుల ♦ పగిదిఁ దోఁతు
తే. [5]ఎలమిఁ దల్లుల చన్నుఁబా ♦ లెల్లఁ ద్రావి
[6]పరమయోగోద్భవామృత ♦ పానలీల
బోలి యెఱుఁగని యోగుల ♦ పొంపు గంద
రా కుమారులు జనమనో ♦ హారు లగుచు. 291

వ. అందు.

క. చూడని వారల నెవ్వరుఁ
జూడక లోకములు మూఁడు ♦ చూపుల ననయం
బాడఁగ నేర్చిన బాలక
చూడామణి జనుల నెల్లఁ ♦ జూడఁగ నేర్చెన్. 293

క. [7]నగవుల [8]నవిద్యపోఁడిమి
నగుఁబాటుగఁ జేయ [9]నేర్చు ♦ నగవరి యంతన్
నగుమొగముతోడ మెల్లన
నగుమొగములు తల్లిఁ జూచి ♦ నగ నేర్చె నృపా. 294

క. అవ్వల నెఱుఁగక [10]మువ్వుర
యవ్వల వెలుఁగొందు [11]పరముఁ ♦ డర్భకుఁడై యా
యవ్వలకు సంతసంబుగ
నవ్వా యవ్వా యనంగ ♦ నల్లన నేర్చెన్. 295

---

(1) జవాతిరేకమ్ములన్ = (అనుపానమే సాధువు) గంతులయొక్క అతిశయముచేత. (2) సింగంపుఁగొదమల సిరిన్ = సింహపు పిల్లల మేలిమిని. (3) ఆననంబులన్ = మొగములందు. (4) బాలార్కచంద్రుల పగిదిన్ = అప్పుడుదయించిన సూర్యచంద్రబింబముల వలె. (5) ఎలమిన్ = సంతోషముతో. [6] పరమయోగోద్భవామృతపానలీలన్ = సర్వోత్కృష్టమైన బ్రహ్మనిష్ఠవలనఁబుట్టిన (మోక్షమనెడి) అమృతము త్రాగువిధమున. [7] నగవులన్ = నవ్వులచేత. [8] అవిద్యపోఁడిమిన్ = మాయయొక్క సమృద్ధతను. [9] నేర్చునగవరి = నేర్చునట్టి చిరునగవుగల మహాపురుషుఁడు [10] మువ్వుర = బ్రహ్మ, విష్ణు, శివుల. [11] పరముఁడు = వేరైనవాఁడు సర్వోత్కృష్టుఁడైన భగవంతుఁడు.

క. అడుఁగులు వే గలిగియు రెం
డడుఁగులనే మన్ను మిన్ను ♦ [1]నలమిన బాలుం
డడుఁగిడ దొరకొనె శాత్రవు
[2]లడుగులు సడుగులును వదలి ♦ యడుగ గననిఁ బడఁగన్.

వ. మఱియును. 297

సీ. తనువున నంటిన ధరణీపరాగంబు
పూసిన నెఱిభూతి పూఁత గాఁగ
ముందఱ నెలుఁగొందు ♦ [3]ముక్తాలలామంబు
[4]తొగలసంగడికాని ♦ తునుక గాఁగ
ఫాలభాగంబుపైఁ ♦ బరఁగు [5]కావిరిబొట్టు
కాముని గెల్చిన ♦ కన్ను గాఁగఁ
గంఠమాలికలోని ♦ ఘననీలరత్నంబు
కమనీయ మగు మెడ ♦ కప్పు గాఁగ

ఆ. హారవల్లు [6]లురగ ♦ హారవల్లులు గాఁగ
బాలలీలఁ బ్రౌఢ ♦ బాలకుండు
శివుని పగిది నొప్పె ♦ శివునికిఁ దనకును
వేఱు లేమిఁ దెల్ప ♦ వెలయునట్లు. 298

క. ఆ పాపలవిహారణములు, దీపులు పుట్టింప మరిగి ♦ [7]తేఁకువ లేకా
గోపాలసతులు మక్కువ, నే పనులను మఱచియుండి♦రీక్షణపరలై.

వ. ఆ సమయంబున బాలకుల తల్లులు గోరు, గోఱు, గొమ్ములు గల జంతువులవలన నేమఱక జలదహన కంటకాదులయెడ పాసపోక బాలసంరక్షణంబు సేయుచు నుల్లంబుల మొల్లంబులైన ప్రేమంబు లభిరామంబులుగా విహరించుచుండి రంత. 300

---

(1) అలమిన బాలుండు = ఆక్రమించిన సిన్నవాఁడు. (సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్) అను ప్రమాణముచేత వేయి అడుగులు గలిగి ప్రకాశించునట్టియు, బలి చక్రవర్తిని మూఁడడుఁగుల భూమి యాచించి రెండడుఁగుల చేతనే భూమ్యాకాశముల నాక్రమించిన వామనుఁడైనట్టి బాలకృష్ణమూర్తి. (2) అడుగులు సడుగులును వదలి = అవయవసంధులు వీడి. (3) ముక్తాలలామంబు = ముత్యాలచేరు అను నాభరణము. (4) తొగలసంగడికానితునుక = బాలచంద్రుని ఖండము (5) కావిరిబొట్టు = దృష్టిదోషమునకు పెట్టిన నల్లని కస్తూరి తిలకము. (6) ఉరగహారవల్లులు = హారముగా వ్రేలునట్టి సర్పములు. (7) తేఁకువ లేక = భయములేక.

క. తన యీడుగోప బాలుర
దను. గొలువఁగ రాముఁగూడి ♦ తనువు గలుగుచుం
[1]దనుగమనంబునఁ గృష్ణుఁడు
తనుమధ్యలు మెచ్చ *నీల♦తనురుచిఁ దనరెన్. (మొఱసెన్) 301

వ. మఱియు నాకుమారుండు దినదినంబునకు సంచారసంభాషణదక్షుండై.

ఉ. దప్పుడు సేయకుండు మని ♦ జంకెయొనర్చిన నల్గిపోవఁగా
నప్పుడు బారసాచి తన ♦ [2]యక్కిలి విందులు వచ్చిరంచు న
వ్వొప్పఁగఁ జీరు తల్లి దెస ♦ కొత్తిలి కృష్ణుఁడు రంతు సేయుచు
న్నెప్పటియట్ల చన్గుడుచు ♦ నింపొలయ న్మొలగంట మ్రోయఁగన్.

—♦ శ్రీకృష్ణుఁడు యశోదను బువ్వపెట్టు మని యడుగుట. ♦—

క. వల్లవగృహ నవనీతము
లెల్లను భక్షించి వచ్చి ♦ యెఱుఁగనిభంగిం
దల్లిఁ గదిసి [3]చిట్టాడుచు
నల్లన చను బువ్వఁబెట్టు ♦ మమ్మా యనుచున్. 304

వ. మఱియు గోపకుమారులం గూడికొని కృష్ణుండు. 305

సీ. గోవల్లభుఁడ నేను ♦ గోవులు మీరని
వడి ఱంకెవైచుచు ♦ వంగి యాడు
రాజు నే భటులు మీరా ♦ రలు రండు రండని
ప్రాభవంబునఁ బెక్కు ♦ పనులు పనుచు
నేఁ దస్కరుండ మీ ♦ రింటివారని నిద్ర
పుచ్చి సొమ్ములు గొని ♦ పోయి డాఁగు
నే సూత్రధారి మీ ♦ రింకఱు బహురూపు
లని చెలంగుచు నాట ♦ లాడఁ బెట్టు

తే. మూల లుఱుకును డాఁగురు ♦ మూఁత లాడు
నుయ్యెలల నూఁగుఁ జేబంతు ♦ లొనర వైచు
జారచోరుల జాడలఁ ♦ జాల నిగుడు
శౌరి బాలురతో నాడు ♦ సమయమందు.

(1) తను గమనంబున = చిన్న నడక చేత. (2) అక్కిలి విందులు = ప్రియమైన చుట్టాలు.
(3) చిట్టాడుచున్ = ఇటునటుతిరుగులాడుచు. * నీలతనురుచి = నల్లని శరీర కాంతి.

వ. మఱియు నాకుమారశేఖరుండు గపటశైశవంబున దొంగజాడలం
గ్రీడింప గోపిక లోపికలు లేక యశోదకడకు వచ్చి యిట్లనిరి. 307

—♦ గోపికలు శ్రీకృష్ణు నడవడిక యశోదాదేవితోఁ జెప్పుట ♦—

క. బాలురకుఁ బాలు లే వని
బాలెంతలు మొఱలు పెట్టఁ ♦ బకపక నగి మా
బాలుం డాలము సేయుచు
నాలకుఁ గ్రేపులను విడిచె ♦ [1]నంభోజాక్షీ. 308

క. పడఁతీ నీబిడ్డఁడు మా కడవలలో నున్న మంచి ♦ క్రాఁగినపా లా
పడుచులకుఁ బోసి చిక్కిన కడవలఁబో నడఁచె నాజ్ఞ ♦ గలదో లేదో.

క. మీ పాపఁడు మా గృహములనా పోవఁగఁ బాలు ద్రావ♦నగపడకున్నన్
గోపించి చిన్న పడుచుల వాపోవఁగఁ జిమ్ముకొనుచు♦వచ్చెన్ దల్లీ.

మత్తకోకిలము.

పుట్టి పుట్టఁడు నేఁడు దొంగలఁ ♦ బూని మాయిలు సొచ్చి తా
నట్టి యందక యుట్లఁ బీఁటలు ♦ నొక్కఁ ద్రోపి విడి యెక్కి చే
వెట్టఁజాలక కుండఁ గ్రిందఁ దొక ♦ పెద్దతూఁ టొనరించి మీ
పట్టి మీఁగడ పాలుఁ జేరలఁ ♦ బట్టి త్రావెఁ దలోదరీ. 311

క. ఆడం జని వీరల పెరుఁ గోడక నీసుతుఁడు ద్రావి♦యొకయించుకతాఁ
గోడలి మూతిం దుడిచినఁ గోడలు [2]ముచ్చనుచు నత్త♦గొట్టె లతాంగీ.

క. వారిల్లు సొచ్చి కడవలఁ దోరంబగు నెయ్యి ద్రావి ♦ తుది నాకడవల్
వీరింట నీ సుతుం డిడ వారికి వీరికిని దొడ్డ ♦ వాదయ్యె సతీ. 313

క. [3]వేలుపులఁట నా కంటెను
వేలుపు మఱి యెవ్వరనుచు ♦ వికవిక నగి మా
[4]వేలుపుల గోడపై నో
హేలావతి నీ తనూజుఁ ♦ డెంగిలిఁ జేసెన్. 314

క. వెన్నఁ దినఁగఁ బొడఁగని మా పిన్నది యడ్డంబువచ్చి♦పిఱిఁదికిఁ ద్రోవం
జన్నొడిసిపట్టి చీరెను జిన్నకుమారుండె యితఁడు ♦ శీతాంశుముఖీ.

(1) అంభోజాక్షీ = కమలములవంటి కన్నులు గల యశోదా! (2) ముచ్చనుచున్ = పెరుగును దొంగిలించి త్రాగిన దొంగ యని. (3) వేలుపులఁటె = దేవతలున్నారఁటె. (4) వేలుపులగోడ = గొల్లలఇండ్లలో దేవునిగోడ యని గోడకే పసుపువగైరా పూసి పూజించు నాచారము గలదు.

క. ఇమ్మగువ దన్ను వాకిటఁ
గ్రుమ్మరుచోఁ జేరి నిలిపి ♦ కొని పేరడుగం
గమ్మావిఁ గఱచి నడఁ జన
నమ్మా! యీ ముద్దుఁగుఱ్ఱఁ ♦ డల్లుఁడె చెపుమా. 316

క. చేబంతి దప్పి పడెనని. ప్రాబల్యముతోడ వచ్చి ♦ భవనము వెనుకన్
నా బిడ్డ జలకమాడఁగ. నీ బిడ్డఁడు వలువ దెచ్చె ♦ నెలఁతుక తగునే.

క. ఇచ్చెలువఁ జూచి ప్రియచ్చెలి
యచ్చుగ నుతికించుకొనుచు ♦ నదిగెద నాతో
వచ్చెదనా యని యన్నాఁ
డిచ్చిఱుతెఁడు సుదతి చిత్ర ♦ మిట్టిది గలదే. 318

క. కొడుకులు లేరని యొకసతి
గడు వగవఁగ దన్ను మగఁడు ♦ గాఁ గైకొనినం
గొడుకులు గలిగెద రని పైఁ
బడినాఁ డిది వినుము శిశువు ♦ పనులే తల్లీ. 319

క. తలఁగిన దానం దలు మనఁ
దలఁగక యా చెలికి నాన ♦ తల యెత్తఁగ నీ
తలఁచినచో చెయ్యది యని
తలయూఁచెన్ నీ సుతుండు ♦ దగునె మృగాక్షీ. 320

క. ప్రాలఁగ వచ్చిన నీ సతి
చూలాలం దలఁగు సుతుఁడు ♦ జూలగుటకు నే
మూలంబు చెప్పు మని నీ
బాలుఁడు సెప్పెను కెంతులు ♦ పర్వేందుముఖీ. 321

క. మగువా నీ కొమరుఁడు మా
మగవా రటు పోవఁజూచి ♦ [1]మంతనమునకుం
దగఁ జేరి పొంద నడిగెను
జగముల మున్నిట్టిశిశువు ♦ జదువంబడెనే. 322

ఆ. నమ్మి నిదుర పోవ ♦ నా పట్టిచుంచు మా
లేఁగతోకతోడ ♦ లీలఁ గట్టి

[1] మంతనమునకున్ = రహస్యమునకు,

వీథులందుఁ దోలె ♦ వెలఁది నీ కొమరుండు
రాచబిడ్డఁ డైన ♦ నవ్వ మేలె. 323

క. నా పట్టి పొట్టనిండఁగఁ బైపడి నీ పట్టి వెన్న ♦ బానెం డిడి నాఁ
డూపిరి వెడలదు వానిం జూపెద నేమైన నీవ ♦ చుమ్ము లతాంగి.

క. తెఱవ యొకతె నిద్రింపఁగ
నెఱిఁగట్టిన వలువ విడ్చి ♦ నేటగు తేలుం
గఱపించి నీ కుమారుఁడు
వెఱచుచు నది పఱవ నగియె (నగుట) ♦ విహితమె సాధ్వీ. 325

క. నా కొడుకును నా కోడలు
నేకశయమునఁ బెనగఁ బాము ♦ నీతఁడు నైవం
గోక లెఱుంగక పాఱెనఁ
గూఁకలిడెఁ నీ సుతుండు ♦ గుణమె గుణాఢ్యా. 326

ఆ. తరుణి యొకతె పెరుఁగు ♦ ద్రచ్చుచోఁ దూరి వంగి
వెన్నఁబుచ్చ నొదిగి ♦ వెనుకఁ గదిసి
మగువ నీ సుతుండు ♦ మగపోఁడుములు సేయ
సాఁగినాఁడు తగదె ♦ చక్కఁజేయ. 327

సీ. కలకంఠి మావాడ ♦ గరితల మెల్ల నీ
పట్టి రాఁగల డని ♦ పాలు పెరుఁగు
లిండ్లలోపల నిడి ♦ యే మెల్లఁ దన్మ్రోవఁ
జూచుచో నెప్పుడు ♦ చొచ్చినాఁడొ
తలుపుల మ్ముద్రలుఁ ♦ దాళంబులును బెట్టి
యున్న చందంబున ♦ నున్న వరయ
నొకయింటిలో నాడు ♦ నొక యింటిలోఁ బాడు
నొక యింటిలో నవ్వు ♦ నొకటఁ దిట్టు

ఆ. నొకట వెక్కిరించు ♦ నొక్కొక్కచో మృగ
పక్షి ఘోషణములు ♦ పరఁగఁజేయు
నిట్లు సేసి వెనుక ♦ నెక్కడఁ బోవునో
కానరాఁడు రిత్త ♦ కడవ లుండు. 328

---

పై పద్యము లన్నియు నతిశయ శృంగారముగలవి. వీనికి సంస్కృతమూలము కానరాదు.

క. కడు లచ్చి గలిగెనేనిం
గుడుతురు గట్టుదురుగాక ♦ కొడుకుల నగుచుం
బడుగుల వాడలపైఁ బడ
విడుతురె రాకాంత లెందు ♦ విమలేందుముఖీ. 329

క. ఓ యమ్మ నీ కుమారుఁడు
మా యిండ్లను బాలుఁ బెరుఁగు ♦ మననీఁ డమ్మా
పోయెద మెక్కడికైనను
మా యన్నల సురభులాన ♦ మంజులవాణీ. 330

వ. అని మఱియు ననేకవిధంబులైన బాలకృష్ణుని వినోదంబులు దమ యందుఁ జేయు మహాప్రసాదంబు లని యెఱుంగక దూఱుచున్న గోపికలకు యశోద యిట్లనియె. 331

క. చన్ను విడిచి యిట్టటు చనఁ
డెన్నఁడుఁ బొరుగిండ్ల త్రోవ ♦ లెఱుఁగఁడు నేఁడుం
గన్నులు దెఱవని మా యీ
చిన్ని కుమారకుని ఱవ్వ ♦ సేయం దగునే. 332

తే. [1]అన్య మెఱుఁగఁడు [2]తనయంత ♦ నాడు చుండు
మంచివాఁ డీతఁ డెగ్గులు ♦ మానరమ్మ
రామలార త్రిలోకాభి ♦ రామలార
తల్లులార గుణవతీమ ♦ తల్లులార.

వ. అని వారల నోడంబఱిచిపంపి కొడుకుం గోపింపంజాలక యుండెనిట్లు.

—♦ మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనాద్యభివర్ణనము ♦—

ఉ. కాంతలు తల్లితోఁ దన వి ♦ కారములెల్ల గణింప భీతుఁడై
శాంతుని సొంపునం బరమ ♦ సాధుని పెంపున గోలమూఁడ్కి వి
భ్రాంతుని కైవడిన్ [3]జడుని ♦ భంగిఁ గుమారకుఁ డూరకుండె నే
వింతయు లేక తల్లికుచ ♦ వేదిక నౌదల మోపి యాడుచున్. 335

(1) అన్య మెఱుఁగఁడు = తన కన్న వేఱువస్తువు నెఱుఁగఁడు. (అంతయుఁ దనయాత్మగాఁ జూచును.) (2) తనయంత నాడుచుండు = ఆత్మారాముఁడని భావము. (3) జడునిభంగి = మూఢుని వలె.

వ. అంత నొక్కనాఁడు బలభద్రప్రముఖులైన గోపకుమారులు వెన్నుండు మన్ను దినె నని చెప్పినఁ, యశోద బాలుని కేలు వట్టికొని యిట్లనియె.

క. మన్నేటికి భక్షించెదు [1]మన్నియమములేల నీవు ♦ మన్నింపవు చూ
యన్నయు సఖులును జెప్పెద రన్నా మన్నేల మఱి ప♦దార్థము లేదే.

వ. అని పలికిన ముగుదతల్లికి నెఱనాడెకంటయైన కొడు కిట్లనియె. 338

శా. అమ్మా! మన్ను దినంగ నే శిశువునో ♦ యాఁకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్ ♦ నన్నీవు గొట్టంగఁ దా
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కా ♦ దేనిన్ మదీయాస్య గం
ధ మ్మాఘ్రాణముచేసి నా వచనముల్ ♦ దప్పైన దండింపవే. 339

వ. అని పలికి నెయ్యంబున నయ్యవ్వ నియ్యకొలిపి [2]క్రీడామనుజబాలకుండైన యీశ్వరుండు తన నోరు దెఱచి ముఖంబుఁ జూపిన. 340

క. ఆ లలితాంగి గనుంగొనె
బాలుని ముఖమందు జలధి ♦ పర్వత వన భూ
గోళ శిఖి తరణి శశి ది
క్పాలాదికరండమైన ♦ బ్రహ్మాండంబున్. 341

వ. కనుంగొని. 342

మ. కలయో వైష్ణవమాయయో యితర సం ♦ కల్పార్థమో సత్యమో
తలఁపన్ నేరకయున్నదాననొ యశో ♦ దాదేవిఁ గానో పర
స్థలమో బాలకు డెంత యీతని ముఖ♦స్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువొ మహా♦శ్చర్యంబు చింతింపఁగన్.

ఆ. బాలమాత్రుఁడైన బాలుని ♦ ముఖమందు
విశ్వమెల్ల నెట్లు ♦ వెలసియుండు
బాలుభంగి నితఁడు ♦ భాసిల్లుఁ గాని స
ర్వాత్ముఁ డాదివిష్ణుఁ ♦ డగుట నిజము. 344

వ. అని నిశ్చయించి.

(1) మన్నియమములు = నా ఆజ్ఞలు. (2) క్రీడా మనుజబాలకుండైన ఈశ్వరుండు = విలాసార్థముగా మనుష్యబాలకుండై యవతరించిన శ్రీకృష్ణమూర్తి.

ఆ. ఏ మహాత్ము వలన ♦ నీ విశ్వమంతయుఁ (నీవిశ్వరూపంబు)
గానఁబడిన బుద్ధి ♦ కంప మయ్యె
నా మహాత్ము విష్ణు ♦ నఖిల లోకాధారు
[1]నార్తులెల్లఁ బాయ ♦ నాశ్రయింతు. 346

క. నా మగఁడు నేను గోపులు
నీ మందయు గోపజనులు ♦ నిబ్బాలుని నె
మ్మోమున నున్నవిధముఁ గని
యేమఱితిమి గాని యెఱుఁగ ♦ మీతఁడు మాయన్. 347

వ. అని తన్నుఁ బరమేశ్వరుం డని తలంచుచున్న యశోదయందు
నా కృష్ణుండు వైష్ణవమాయం బొందించిన. 348

క. [2]జడనుపడి యెఱుక సెడి యా
పడఁతుక పరమాత్ముఁ డనుచుఁ ♦ బలుకక యతనిం
గొడుకని తొడపై నిడుకొని
కడువేడుకతోడ మమత ♦ గావించె నృపా. 349

వ. అనిన విని రా జిట్లనియె. 350

ఆ. జగదధీశ్వరునకుఁ ♦ జన్నిచ్చు తల్లిగా
నేమి నోము నోఁచె ♦ నీ యశోద
పుత్త్రుఁ డనుచు నతనిఁ ♦ బోషించు తండ్రిగా
నందుఁ డేమి చేసె ♦ [3]నందితాత్మ. 351

క. [4]ప్రబ్బిన భక్తిని హరిపైఁ
[5]గబ్బంబులు సెప్పి కవులు ♦ కైవల్య శ్రీ
కబ్బుదు రఁట హరిపోషణ
మబ్బిన తలిదండ్రు లెచటి ♦ కబ్బుదురో శుధీ. 352

వ. అనిన విని రాజయోగికి శుకయోగి యిట్లనియె. 353

---

(1) ఆర్తులెల్లన్ = నన్నంటిన పీడలన్నియు. (2) జడనుపడి = మూఢత్వమునుబొంది. (3) నందితాత్మ = "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అని శ్రుతి ప్రతిపాద్యమైన సంతోషము నొందిన మనస్సుగల ఓ శుకయోగీ. (4) ప్రబ్బిన భక్తిన్ = అతిశయించిన భక్తితో. 5. కబ్బంబులు = కావ్యములు.

—◆ యశోదానందుల పూర్వజన్మ వృత్తాంతము ◆—

సీ. అవనీశ విను ద్రోణుఁ ◆ డను వాఁడు వసువుల
యందు ముఖ్యుఁడు ధర ◆ యతని భార్య
వారి ద్దఱు బ్రహ్మ ◆ వసుధపై జన్మింపుఁ
డంచుఁ బంచిన వార లతనిఁ జూచి
విశ్వేశ్వరుండైన ◆ విష్ణు సేవారతి
మా కిచ్చితేనియు ◆ మహి జనింతు
మనవుడు నట్ల కా ◆ కని యె వేల్పుల పెద్ద
యా ద్రోణుఁ డీ నందుఁ ◆ డై జనించె

ఆ. ధర యశోద యయ్యె ◆ దనుజేంద్రవైరియుఁ
గమలగర్భుమాట ◆ గారవించి
తల్లిదండ్రు లనుచుఁ ◆ దగ వారి మన్నించె
నధికభక్తి వారు ◆ నలరి రిట్లు. 354

వ. అంత నొక్కనాఁడు దనయింటి పాప లందఱు నన్యో పనులందుఁ బంపువడి పోయిన నందసుందరి సంరంభంబునం [1]తరికంబంబుకడఁ గుదురున నొక్క భాండంబు కుదురఁ బెట్టి మిసిమిగల మీఁగడ పెరుఁగు గూడం బోసి. వీఁకనాఁక త్రాఁడు కవ్వంబున నలంకరించి.

—◆ యశోద దధిభాండ వికలనాచులు సేసిన కృష్ణునిఁ బట్టుకొనుట ◆—

సీ. [2]కరకమలారుణ ◆ కాంతి గవ్వఁపుఁ ద్రాఁడు
పవడంపు నునుఁదీన ◆ పగిది నొఱయఁ
గ్రమముతోఁ [3]రజ్జువా ◆ కర్షింపఁ బాలిండ్లు
వీడ్వడి యొండొంటి ◆ వీఁక నొత్తఁ
గుచకుంభముల మీఁది ◆ కొంగు జాఱఁగఁ జిక్క
వడుచు హారావళి ◆ బయలు పడఁగఁ

(1) తరికంబంబుకడ = పెరుఁగు చిలికెడు స్తంభమునొద్ద. (2) కరకమలారుణకాంతిన్ = ఎఱ్ఱదామరలను బోలిన యఱచేతుల యెఱ్ఱనికాంతిచే. (3) రజ్జువు = కవ్వపుఁద్రాటిని.

బొడమిన చెమటతోఁ ♦ బొల్పారు నెమ్మోము
మంచు పైఁబడిన ప ♦ ద్మంబుఁ దెగడఁ
తే. [1]కౌను గునియంగఁ గంకణ ♦ క్వణన మెసఁగఁ
[2]దుఱుము బిగి వీడఁ [3]గర్ణికా ♦ ద్యుతులు మెఱయ
బాలు నంకించి పాడుచుఁ ♦ బాట బాటఁ (వలన)
[4]దరువు లిగురొత్త పెరుఁ గింతి ♦ దరువఁ జొచ్చె. 356

వ. ఆ సమయంబున. 357

క. సుడియుచు వ్రాలుచుఁ [5]గిదుకుచుఁ
సడిగొట్టుచు నమ్మ రమ్మ ♦ చన్నిమ్మనుచున్
వెడవెడ గంతులు వైచుచు
గడవఁ గదిసి బాలకుండు ♦ గవ్వముఁ బట్టెన్. 358

క. కవ్వముఁ బట్టిన ప్రియసుతు
[6]నవ్వనరుహనేత్ర [7]దిగిచి ♦ యంకతలమునన్
నవ్వుచు నిడుకొని కూఁకటి
దువ్వుచుఁ జన్నిచ్చె నతఁడు ♦ దూఁటుచుఁ గుడిచెన్. 359

మ. కడుపారం జనుబాలు ద్రావని సుతుం ♦ గంజాక్షి పీఠంబుపై
నిడి పొంగారెడి పాలు డించుటకునై ♦ యేఁగంగఁ దద్బాలుఁ డా
క్కడుఁగోపరిబున వాఁడిజాత [8]దధిమ ♦ త్కుంభంబు వోఁగొట్టి తెం
పడరం గుంభములోని వెన్నఁ దిని [9]మి ♦ థ్యాసంకులద్బాష్పుఁడై.

వ. అంత నా లోలలోచన పాలు డించి వచ్చి వికలంబు లయిన దధి కుంభ శకలంబులఁ బొడగని తుంటరి కొడుకు వెన్నదింట వెఱంగి నగుచు [10]నా కలభగామిని గానక చని చని. 361

ఆ. వికచ కమలనేత్ర ♦ వేఱొక యింటిలో
వెలయ ఱోలు దిరుగ ♦ వేసి యెక్కి

---

(1) కౌను = నడుము. (2) తుఱుముబిగి = కొప్పుయొక్క బిగువు. (3) కర్ణికా ద్యుతులు=కమ్మల యొక్క కాంతులు. (4) తరువు లిగురొత్త= వృక్షములు చిగుర్పఁగా. (5) కిదుకుచున్ = చిణుఁకుచు. (6) అవ్వనరుహనేత్ర = కమలములవంటి కన్నులు గలదయిన యాయశోద. (7) తిగిచి=తన పైపునకుఁ దీసికొని. (8) దధిమత్కుంభంబున్= పెరుఁగుతో నిండుకొన్న కుండను. (9) మిథ్యాసంకులద్బాష్పుఁడై = లేని కన్నీళ్ళు తెచ్చుకొన్న కన్నులుఁ గలవాఁడగుచు. (10) ఆ కలభగామిని = ఏనుఁగు గున్న వంటి నడకగల యా యశోద.

యుట్టిమీఁది వెన్న ♦ నులుకుచు నొక కోఁతి
పాలు సేయుచున్న ♦ బాలుఁ గనియె. 362

మ. కని చేతన్ ¹సెలగోలఁ బట్టికొనుచుం ♦ గానిమ్ము గానిమ్ము రా
తనయా! యెవ్వారియందుఁ జిక్కవడ నే ♦ నందంబునుం గాన ²నే
వినివారంబును బొంద నేనెఱుపు నే ♦ విభ్రాంతియుం జెంద ము
న్ననియో యీ విటు నన్నుఁ గైకొనమి నేఁ ♦ డారీతి సిద్ధించునే.

వ. అని యడలించుచుఁ గొడుకునడవడి దలంచి తనమున్య మనమనంబున.

సీ. బాలుఁ డీతం డని ♦ భావింతు నందునా
యే పెద్దలును నేర ♦ రీక్రమంబు
వెఱ వెఱుంగుటకునై ♦ వెఱపింతు నందునా
కలిగి లే కొక్కఁడు ♦ గాని లేఁడు
వెఱపుతో నా బుద్ధి ♦ వినిపింతు నందునా
తను దానయై బుద్ధిఁ ♦ దప్పకుండు
నొం డెఱుంగక యింట ♦ నుండెడి నందునా
చొచ్చి చూడని ♦ దొక్క చోటు లేదు
ఆ. తన్ను నెవ్వఁడైనఁ ♦ దలపోయఁ ³బాడడి
యోజ లేదు ఖ్యాతి ♦ యొకటి గలుగఁ
జెలిమి నూరకుండఁ ♦ జెక్కుచక్కములాడుఁ
బట్టి శాస్తి సేయు ♦ భంగి యెట్లు. 365

వ. అని వితర్కించి. 365

క. లాలనమున బహుదోషము
లోలిం బ్రాపించుఁ దాడ ♦ నోపాయములన్
జాల గుణంబులు గలుగును
బాలురకును ⁴దాడనంబ ♦ పథ్యం బరయన్. 367

---

(1) సెలగోలన్ = కొరడాను. (2) ఏ వివారంబును బొందను = ఏ నిర్బంధమును బొందినవాఁడను గాను. (3) పాఁడిడియోజ = పరుగొత్తి పోవునట్టి మార్గమును. (4) తాడనంబు = కొట్టుట-దండన పనుట.

వ. అని నిశ్చయించి [1]కేలనున్న కోల పాఱవైచి "[illegible] పోకు నిలు" మని బగ్గు బగ్గున నడచుచున్న తల్లి జూచి [2]బెగ్గడిలిన చందంబున [3]నగ్గలిక చెడి ఱోలు డిగ్గ నుఱికి.

క. గజ్జెలు గల్లని మ్రోయఁగ
[4]నజ్జలు ద్రొక్కుటలు మాని ♦ [5]యతిజవమున యో
షిజ్జనములు నగఁ దల్లియుఁ
[6]బజ్జం జనుదేర నతఁడు ♦ పరువిడె నభవా! 569

వ. అప్పుడు. 570

మ. స్తనభారంబున డస్సి [7]కృస్సి [8]యసదై ♦ జవ్వాడుమధ్యంబుతో
[9]జనితస్వేదముతోఁ [10]జలత్కబరితో ♦ [11]స్రస్తోత్తరీయంబుతో
వనజాతేక్షణ గూడఁ బాఱె నొయ్యనన్ ♦ వాంఛించుచున్ బాలకున్
మునియోగీంద్రమనంబులున్ [12]వెనుకొనం ♦ గాలేని లీలారతున్.

వ. ఇట్లు గూడం జని. 571

సీ. స్తంభాదికమ్ముల ♦ నడుమ నడ్డం బైన
నిట్టట్టు చని పట్టి ♦ నీవి వాని
నీ తప్పు సైరింపు ♦ మింక దొంగిలఁ బోన
నే నని మునుముట్టి ♦ నేడ్చువానిఁ
గాటుక నెఱయంగఁ ♦ గన్నులు నులుముచు
నెడలు కన్నీటితో ♦ వెగచువాని
నేదెస వచ్చునో ♦ యిది యని పలుమాఱు
నుఱుఁగుచుఁ గ్రేగంటఁ ♦ జూచువానిఁ

ఆ. గూడఁ బాఱి పట్టు ♦ కొని వెఱపించుచుఁ
జిన్ని వెన్నదొంగ ♦ చిక్కె ననుచు

---

(1) కేలనున్న కోల = చేతిలోనున్న కఱ్ఱ. (2) బెగ్గడిలిన చందంబునన్ = భయపడిన విధమున. (3) అగ్గలిక చెడి = ఉత్సాహము పోయి. (4) అజ్జలు ద్రొక్కుటలు = చిందులు ద్రొక్కునట్టి చేష్టలను. (5) అతిజవమునన్ = మిక్కిలి వడిగా. (6) పజ్జన్ = వెంటనే. (7) కృస్సి = సంకోచించి [illegible]. (8) అసదై = సూక్ష్మమై. (9) జనితస్వేదముతోన్ = పుట్టిన చెమటతోను. (10) చలత్కబరితోన్ = కదలుచున్న కొప్పుతోను. (11) స్రస్తోత్తరీయంబుతోన్ = జాఱిన పయ్యెదతోను. (12) వెనుకొనంగాలేని = వెంబడింపఁ జాలని.

నలిగి కొట్టఁ జేతు ♦ లాడక పూఁబోఁడి (యశోద)
కరుణతోడ బాలుఁ ♦ గట్టఁ దలఁచి. 373

వ. ఇట్లనియె. 374

క. ఏ రెవ్వరు శ్రీకృష్ణులు గారా యెన్నఁడును వెన్నఁ♦గానరఁట కదా
చోరత్వం బించుకయును. నేరరఁట ధరిత్రి నిట్టి ♦ నియతులు గలరే.

క. పట్టినఁ బట్టువడని నినుఁ బట్టెద నని చలముగొనినఁ ♦ బట్టుట [1]బెట్టే
పట్టువడవండ్రు పట్టీ పట్టుకొనఁగ నోపఁగాక ♦ పటులకు వశమే.

క. ఎక్కడ నైనను దిరిగెద
వొక్కెడ నెడ గుణము గలిగి ♦ యుండవు నియమం
బెక్కడిది నీకు మఱచినఁ
జక్కఁగఁ బోయెదవు నెక్క ♦ జాడలఁ బుత్త్రా. 377

ఈ క్రింది పద్యము దశావతారముల చర్యల నుగ్గడించి నిందాస్తుతిగాఁ జెప్పఁబడియున్నది.

సీ. [2]తోయంబు లివి యని ♦ తొలఁగక చొచ్చెదు
[3]తలఁచెదు గట్టైనఁ ♦ దరల నెత్త
మంటితో నాటలు ♦ మానవు [4]కోరాడ
[5]మున్నత స్తంభంబు ♦ లూఁపఁబోయె
దన్యుల నల్పంబు ♦ లడుగంగఁ బోయెదు
రాచ వేఁటలఁ జాల ♦ [6]అఖ్యా దెచ్చె

(1) బెట్టే = ఒక సునవమా - అతిసులభముగాఁ బట్టుకొనవచ్చుననుట. (2) తోయంబు లివియని తొలఁగక చొచ్చెదు = ఇవి నీళ్ళుగదా ఈ నీళ్ళలోఁ జొచ్చిన పక్షమున నపాయము వచ్చునని యెంచక కోనేళ్ళు మొదలగువానియందు దుడుకుతనముతోఁ జొచ్చుచున్నావు - మత్స్యావతారమెత్తి జలమయమగు మహాసముద్రమునందుఁ బ్రవేశించితివి. (3) తలఁచెదు గట్టైనఁ దరల నెత్తన్ = కొండనైన లేవనెత్తుటకుఁ బ్రయత్నము చేసెదవు - కూర్మావతారమెత్తి మందరపర్వతము నెత్తితివి. (4) కోరాడెదు = మట్టి యెగఁజిమ్మి నెత్తిని బోసికొనెదవు - వరాహావతారమెత్తి కోరలతో భూమిని బైకెత్తి క్రీడించితివి. (5) ఉన్నత స్తంభంబు లూఁపఁబోయెదు = మిక్కిలి పొడవులైన కంబముల నూగులాడింపఁ బోయెదవు. స్తంభమును బగులఁ దీసికొని నృసింహుఁడవై యుదయించితివి. (6) అఖ్య దెచ్చెదు = అపకీర్తిని దెచ్చుచున్నావు - పరశురాముఁడవై యవతరించి మృగముల వేఁటాడునట్టి బోయవానివలె రాచవారి నెల్ల వేఁటాడి చంపి యపఖ్యాతి దెచ్చుకొంటివి.

[1]దలయవు నీళ్ళకు ♦ నడ్డంబు గట్టెదు
ముసలివై హరివృత్తి ♦ [2]మొనయఁ జూచె

ఆ. [3]దంబరంబు మొలకు ♦ నడుగవు తిరిగెద
వింకఁ గల్కితనము ♦ లేల పుత్త్ర
నిన్ను నంప ద్రాల్ప ♦ [4]నే నేర ననియొ నీ
విట్లు ద్రిందుపఱుదు ♦ నెఱుఁగ కునికి. 378

— ♦ ఉలూఖల బంధన యమళార్జున భంజనాఖ్యాభివర్ణనము ♦ —

వ. అని మర్మంబు లెత్తి పలికి. 379

క. ఆ లలన గట్టె ఱోలన్ లీలన్ నవనీతచౌర్య ♦ లీలున్ బ్రియ వా
గ్జాలున్ బరివిస్మిత గో పాలున్ ముక్తాలలాము ♦ ఫాలున్ బాలున్.

క. ఱోలను గట్టువడియు న బ్బాలుఁడు విలసిల్లె భక్త ♦ పరతంత్రుండై
యాలాన సన్నిబద్ధ వి శాల [5]మదేభేంద్రకలభ ♦ సమరుచి నధిపా!

క. వెలి లోను మొదలు దుది నడు
ములు లేక జగంబు తుదియు ♦ మొదలున్ నడుమున్
వెలియును లోనగు నీశ్వరు
నలవడునే కట్టఁ బ్రణుతు ♦ ఱోల్ గా కున్నన్. 382

ఆ. పట్టి యెల్లకోఁటి ♦ పట్టి యీతం డని
గట్టె తల్లిఁ ఫుత్త్రుఁ డని ♦ గట్టెఁ గాక
పట్టెకడుపు పెక్కు ♦ బ్రహ్మాండములు పట్టు
జెట్టిఁ గనెనేనిఁ దల్లి ♦ యేల కట్టు? 383

క. చిక్కఁడు సిరికౌఁగిటిలోఁ
జిక్కఁడు [6]సనకాదియోగి ♦ చిత్తాబ్జములం

(1) అలయవు = ఎవ్వరుచూచిన నిది యేమిపనియని విసుగుకొనవు. (2) మొనయఁ జూచెదు = ప్రవేశింప యత్నించు చున్నావు. బలరాముఁడవై యవతరించి రోఁకలియు, నాఁగలియును నాయుధముగాఁ బూని వర్తించు చున్నావు. (3) అంబరంబు మొలకున్ = వస్త్రము మొలనుగట్టుకొనుటకు (బౌద్ధావతారమెత్తి దిగంబరివై తిరిగెదవు.) ; (4) నే నేర ననియొ = నేను సమర్థురాలను కానియా యేమి? (5) మదేభేంద్రకలభ సమరుచిన్ = మదముగల శ్రేష్ఠమైన యేనుఁగు గున్నతోడ - అనఁగా అష్టమదములుగల యేనుఁగు గున్నతో సమానమైన ప్రకాశముతో (6) సనకాదియోగి చిత్తాబ్జములన్ = సనకుఁడు మొదలయిన యోగీశ్వరులయొక్క హృదయ కమలములయందు.

జిక్కఁడు [1]శ్రుతిలతికావలిఁ
జిక్కె నతఁడు లీలఁ దల్లి ♦ చేతన్ బోలన్. 384

వ. ఇట్లు గ్రద్దన నా ముద్దియ ముద్దులకొడుకని యుదరంబు గట్టఁ జదురం బని చక్క నొక్క త్రాడు చుట్టిన నది రెండంగుళంబులు గడమ పడియె. మఱియు నొక్క బంధనంబు సంధించి వలగొనిన నంతియ కొఱంత యయ్యె. వెండియు నొక్క పాశంబు గూర్చి పరివేష్టించిన వెల్తిఁ జూపె నిట్లు. 385

క. తజ్జనని లోఁగిటం [2]గల రజ్జుపరంపరల గ్రమ్మ ♦ ఱన్ సుతుఁ గట్టన్
బొజ్జ దిరిగి రాదయ్యె [3]జగజ్జాలములున్న బొజ్జఁ ♦ గట్టన్ వశమే.

వ. అప్పుడా యవ్వయు గోపికలును వెఱంగుపడిరి: తదనంతరంబ,

ఆ. ఒడలఁ జెమట లెగయ ♦ నుత్తరీయము జాఱ
[4]వీడియున్న తుఱుము ♦ విరులు రాలఁ
గట్టరాని తనయుఁ ♦ గట్టెద నని చింతఁ
గట్టుకొనిన తల్లిఁ ♦ గరుణఁ జేసి. 388

క. బంధవిమోచనుఁ డీశుఁడు బంధింపఁబెనంగు జననిఁ♦బాలార్చి [5]సుహృ
ద్బంధుఁడు గావున జననీబంధంబునఁ గట్టువడియెఁ♦బాటించి నృపా.

క. సంగడిఁ దిరిగెడు శంభుఁడు
సంగాశ్రయ యైన సిరియు ♦ నాత్మజుఁడై యు
ప్పొంగెడి పద్మజుఁడును [6]గో
పాంగన క్రియఁ గరుణ వడయ ♦ రఖిలేశ్వరుచేన్. 390

క. జ్ఞానులచే మానులచే దానులచే [7]యోగసంవి ♦ ధానులచేతం
బూని నిబద్ధుం డగునే శ్రీనాథుఁడు భక్తియుతుల ♦ చేతంబోలెన్.

(1) శ్రుతిలతికావలిన్ = వేదములనెడు తీఁగల పంక్తియందు (2) కల రజ్జుపరంపరలన్ = ఉండునట్టి త్రాళ్ళసమూహములచేత - ఇంటిలోనున్న త్రాళ్ళన్నిటిచేత (3) జగజ్జాలములున్న బొజ్జన్ = ఎల్లలోకములు నిండినటువంటి పొట్టను (4) వీడియున్న......రాలన్ = వదలిపోయిన కొప్పునందలి పువ్వులు నేలరాలఁగా (5) సుహృద్బంధుఁడు గావునన్ = తాను ఆప్తులైనవారికి చుట్టమైనవాఁడు గనుక (6) గోపాంగనక్రియన్ = నందగోపకుని భార్యయైన యశోదవలె (7) యోగసంవిధానులచేతన్ = మంత్రలయ హఠ రాజయోగముల నభ్యసించినవారిచేతనైనను.

వ. అంత నయ్యశోద యింటికడం బసుల వెంటం దిరుఁగఁ గృష్ణుఁడు దొల్లి నారదు శాపంబున [1]నిరుమద్దులైయున్న నలకూబర మణిగ్రీవులను గుహ్యకుల నిద్దఱం గని ఱో లీడ్చుకొని చనియె నని చెప్పిన శుకయోగివరునకు భూవరుం డిట్లనియె. 392

క. నారదుఁ డేల శపించెను
వా రా వృక్షత్వమునకు ♦ వచ్చిన పనికిం
గారణ మెయ్యది యోగి కు
లారాధ్య యెఱుంగఁ జెప్పు ♦ మయ్య వినియెదన్. 393

–♦ నలకూబర మణిగ్రీవులను నారదమహాముని శపించుట. ♦–

వ. అనిన శుకుండిట్లనియె. మున్ను కుబేరుని కొడుకు లిరువురు శంకర కింకరులై యహంకరించి వెండికొండ మీఁద [2]విరులతోఁటలం దాఁటెడి చేడియలం గూడికొని కరేణు సంగతంబులైన యేనుంగుల భంగి సురంగంబులైన మందాకినీ తరంగంబులం గ్రీడింప నారదుండు వచ్చిన నచ్చెలువలు చెచ్చెర వలువలు ధరించిరి. మదిరాపాన పరవశులు గావున వార లిరువురు వివస్త్రులై మెలంగుచున్న నా మునీశ్వరుండు చూచి శపించువాఁడై ప్రతీతంబుగా నొక్క గీతంబు పాడె వినుము. 394

శా. సంపన్నుం డొరుఁ గానలేఁడు తనువున్ ♦ సంసారమున్ నమ్మి హిం
సింపంజూచు దరిద్రుఁ డెత్తువడి శు ♦ ష్కీభూతుఁడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సములుగాఁ ♦ జింతించు, నట్లౌటఁ [3]త
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ ♦ దారిద్ర్య మూహింపఁగన్.

వ. అని గీతంబు పాడి తన మనంబున. 396

క. కలవాని సుతుల మఱచును
గలకంఠులతోడఁ గూడి ♦ కానరు పరులన్
గలలోనైనను వీరికిఁ
గల క్రొవ్వడఁగించి బుధులఁ ♦ గలుపుట యొప్పున్. 397

---

(1) ఇరుమద్దులై = జంట మద్దిచెట్లయి. (2) విరులతోఁటలన్ = పువ్వుల తోఁటలందు
3) తత్సంపన్నాంధునకున్ = ఆ సంపన్నుఁడను గ్రుడ్డివానికి.

వ. అని చింతించి విజ్ఞానవిశారదుం డగు నారదుండు నలకూబర మణి
గ్రీవులం జూచి వీరలు శ్రీమదాంధులగు గావున భూలోకంబున
[1]నర్జునతరువులై నూఱు దివ్యవర్షంబు లుండుం డటమీఁద గోవింద
చరణారవింద [2]పరిస్పందంబున. 398

క. ముక్తులరై నారాయణ
భక్తులరై [3]పరమసాధు ♦ భావశ్రీ సం
సక్తులరై సురలోక
వ్యక్తుల రయ్యెదరు నాఁడు ♦ వాక్యము కతనన్. 399

వ. అని యిట్లు పలికి నారదుండు నారాయణాశ్రమంబునకుం జనియె.
వా రిరువురును సంగడిమ్రాఁకులైరి. పరమభాగవతుండైన నారదు
మాటలు వీటిం బుచ్చక పాటించి. 400

క. ముద్దుల తక్కరి బిడ్డఁడు
[4]మద్దులఁ గూల్పంగఁ దలఁచి ♦ మసలక తా నా
మద్దికవ యున్నచోటికి
గ్రద్దన ఱో లీడ్చుకొనుచుఁ ♦ గడఁకం జనియెన్. 401

వ. చని [5]యా యూర్జితమహాబలుండు [6]నిజోదరదామ సమాకృష్య
మాణతిర్యగ్భవదులూఖలుండై యా రెండుమ్రాఁకుల నడుమం
జొచ్చి ముందటికి నిగుడుచు. 402

క. బాలుఁడు ఱో లడ్డము దివ
మూలంబులు వెకలి [7]విటప ♦ ములు విఱిగి మహా
భీలధ్వనిఁ గూలెను [8]శా
పాలస్య వివర్జనములు ♦ [9]యమళార్జునముల్. 403

(1) అర్జునతరువులై = మద్దిమ్రాఁకులై. (2) పరిస్పందంబునన్ = తాఁకుడుచేత. (3) పరమసాధుభావ శ్రీసంసక్తులరై = మిగులమంచితనమను సంపత్తితోఁ గూడుకొన్నవారై (4) మద్దులన్ = మద్దిచెట్లను. (5) ఆ యూర్జితమహాబలుండు = చెరుపులేక వృద్ధి పొందిన యా బాలకృష్ణమూర్తి. (6) నిజోదర......ఉలూఖలుండై=తన కడుపుచుట్టు చుట్టిన త్రాటిచే నా లాగఁబడుచున్న ఱోటితో రెండు మద్దిచెట్లకు, నడ్డము వైచి లాగుచుండెను. (7) విటపములు = కొమ్మలు. (8) శాపాలస్యవివర్జనములు = శాపము తొలఁగినవి యనుట. (9) యమళార్జునములు = జంట మద్దిమ్రాఁకులు.

వ. ఇట్లు నిర్మూలంబులయి పడిన సాలంబులలోనుండి [1]కీలికీలలు వెల్వడు పోలిక నెక్కుడు తేజంబున దిక్కులు పిక్కటిల్లం బ్రసిద్ధులైన సిద్ధులిద్దఱు వెడలివచ్చి ప్రబుద్ధులై భక్తలోకపాలకుండైన బాలునకు మ్రొక్కి లేచి కరకమలంబులు మొగిడ్చి యిట్లనిరి. 404

క. బాలుఁడవె నీవు [2]పరుఁడవ [3]న
నాలంబుఁడ వధికయోగి ♦ [4]వాద్యుఁడవు తను
స్థూలాకృతి యగు విశ్వము
నీ లీలారూప మంద్రు ♦ నిపుణులు కృష్ణా! 405

సీ. ఎల్లభూతంబుల ♦ కింద్రియాహంకృతి
ప్రాణంబులకు నధి ♦ పతివి నీవ
ప్రకృతియుఁ బ్రకృతి సం ♦ భవమహత్తును నీవ
వీని కన్నిటికిని ♦ విభుఁడ వీవ
ప్రాకృతగుణవికా ♦ రములఁ బొందక పూర్వ
సిద్ధుఁడ వగు నిన్నుఁ ♦ జింతసేయ
గుణయుతుం డోపునే ♦ గుణహీన నీ యంద
కలగుణంబుల నీవ ♦ కప్పఁ బడుదు

తే. మొదల నెవ్వని యవతార ♦ ములు శరీరు
లందు సరిదొడ్డు లేని వీ ♦ ర్యములఁ దనువు
లడర జన్మించి వారల ♦ యందుఁ జిక్క
వట్టి పరమేశ మ్రొక్కెద ♦ మయ్య నీకు. 406

క. భువనములు సేయఁ గావఁగ
[5]నవతీర్ణుఁడ వైతి గాదె ♦ యఖిలేశ్వర యో
గివరేణ్యా విశ్వమంగళ
కవిసన్నుత వాసుదేవ ♦ కల్యాణనిధీ. 407

(1) కీలికీలలు వెల్వడు పోలికను = అగ్నిజ్వాలలు వెడలినట్లు. (2) పరుఁడవు = అందని వాఁడవు. (3) అనాలంబుఁడవు = పట్టుకొమ్మ లేనివాఁడవు. (4) ఆద్యుఁడవు = ప్రపంచ సృష్టిస్థితిలయ కారణభూతుఁడవు. (5) అవతీర్ణుఁడవు = బ్రహ్మ విష్ణు స్వరూపుఁడవై అవతరించినవాఁడవు.

ఉపేంద్రవజ్రము. తపస్వి వాక్యంబులు ♦ దప్పవయ్యెన్
నెపంబునం గంటిమి ♦ నిన్నుఁ జూడన్
దపంబు లొప్పెన్ మముఁ ♦ దావకీయ
ప్రపన్నులం జేయుము ♦ భక్తమిత్రా. 408

శా. నీపద్యావళు లాలకించు చెవులున్ ♦ నిన్నాడు వాక్యంబులున్
నీపేరం బనిసేయుహస్తయుగముల్ ♦ నీమూర్తిపైఁ జూపులున్
నీపాదంబులపొంత మ్రొక్కు శిరముల్ ♦ నీసేవపైఁ జిత్తముల్
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ ♦ నీరేజపత్త్రేక్షణా. 409

వ. అని యిట్లు కీర్తించి నమస్కరించిన [1]గుహ్యకులం జూచి నగుచు [2]నులూఖలబద్ధుండైన హరి యిట్లనియె. 410

క. తమ తమ ధర్మము దప్పక
సములై నను నమ్మి తిరుగు ♦ సభ్యులకును బం
ధము నన్నుఁ జూచిన విరియును
[3]కమలాప్తుఁడు వొడమ [4]విరియు ♦ [5]ఘనతమము క్రియన్. 411

క. [6]కారుణ్యమానసుం డగు
నారదు వచనమునఁ జేసి ♦ నన్నుఁ బొడఁగనుటన్
మీరు ప్రబుద్ధుల రైతిరి
చేరెన్ నామీఁది తలఁపు ♦ సిద్ధము మీకున్. 412

వ. అని యీశ్వరుండు మీరు మీ నెలవులకుం బొండని యానతిచ్చిన మహాప్రసాదం బని [7]వలగొని పెక్కు మ్రొక్కు లిడి వీడుకొని నలకూబర మణిగ్రీవు లుత్తరభాగంబున కరిగి రంత నందాదు లయిన గోపాలకులు నిర్మూలంబు లయి పడిన సాలంబుల చప్పుడు పిడుగు చప్పు డని శంకించి వచ్చి చూచి. 413

క. ఈపాదపములు గూలఁగ, నీపాపఁ డులూఖలమున ♦ నిటు బద్ధుండై
యేపగిది బ్రదికెఁ గంటిరె, వాపోవఁడు వెఱవఁ డెట్టి ♦ వాఁ డోయితఁడున్

(1) గుహ్యకులన్ = గుహ్యకులయిన నలకూబర మణిగ్రీవులను. (2) ఉలూఖల బద్ధుండై = ఱోటితోఁ జేర్చి కట్టఁబడినవాఁడై. (3) కమలాప్తుఁడు = సూర్యుఁడు. (4) విరియు = తొలఁగి పోవునట్టి. (5) ఘనతమము క్రియన్ = దట్టమైన చీఁకటివలెనే. (6) కారుణ్యమానసుండు = దయతోనున్న మనస్సుగలవాఁడు. (7) వలగొని = ప్రదక్షిణముచేసి.

ఆ. పిడుగు పడుట గాదు ♦ పెనుగాలి విసరదు
ఖండితంబు లగుట ♦ గానరాదు
బాలుఁ డితఁడు పట్టి ♦ పడఁ ద్రోవఁ జాలఁడు
దరువు లేల కూలె ♦ ధరణి మీఁద. 415

వ. అని పెక్కండ్రు పెక్కువిధంబుల నుత్పాతంబులు గావలయు నని శంకింప నక్కడ నున్న బాలకు లిట్లనిరి. 416

క. నందుని కొమరుఁడు వినుఁడీ
సందున నును దూఱి త్రోలు ♦ సరి నడ్డముగా
ముందటి కీడ్చిన మద్దులు
గ్రందుకొనం గూలె జనులఁ ♦ గంటి మిరువురన్. 417

వ. అని యిట్లు పలికిన బాలకాలాపంబులు విని కొందఱు మిథ్యారూపంబు లనిరి కొందఱు నానావిధంబుల సందేహించి రంత నందుండు వికసితముఖారవిందుండగుచుఁ బట్టి కట్టు విడిచె నట్టియెడఁ దన తెఱం గెవ్వరు నెఱుంగకుండవలె నని [1]శవరకుమారుండు. 418

శా. పాడున్ మందునిభంగి గోపవనితల్ ♦ [2] పాణిధ్వనుల్ సేయఁగా
నాడున్ [3]జంత్రము కైవడిం బరవశుం ♦ డై హస్తముల్ద్రిప్పుచుం
జూడన్ నేరనివానిభంగి జనులం ♦ జూచున్ నగున్ బాలురం
గూడుం బెద్దలపంపు సేయఁ జను డాఁ ♦ గున్ మట్టిఁజిట్టాడుచున్.

క. చుం చెదుగుఁ బాలు పుడిసెఁడు
దంచితముగ ద్రావు మనుడు ♦ ద్రావి జననితోఁ
జుం చెదుగ దనుచు లీలా
చుంచుండై యతఁడు చుంచుఁ ♦ జూపు నరేంద్రా. 420

క. సెలగోల పట్టుకొని జల
కలశములో నీడఁ జూచి ♦ కలశగతుండై
సెలగోలఁ బాపఁ డొకఁ డదె
తలఁచెన్ ననుఁ గొట్ట ననుచుఁ దల్లికిఁ జెప్పెన్. 421

---

(1) శవర = నేర్పరియైనబాలుఁడు (3) పాణిధ్వనుల్ సేయఁగాన్ = చప్పట్లు కొట్టఁగా. (3) జంత్రము కైవడిన్ = కీలుబొమ్మవలెనే. (4) మట్టిఁజిట్టాడుచున్ = త్రొక్కిత్రొక్కి చిట్టిమూటలాడుచును (దాగుడాట).

క. భిక్షులు వచ్చెద రేడ్చిన
భిక్షాపాత్రమున వైచి ♦ బెగడించి నినుం
శిక్షించెద రని చెప్పిన
భిక్షులఁ గని తల్లి నొదిఁగి ♦ భీతిల్లు నృపా. 422

—♦ నందాదులు బృందావనంబునకు నరుదెంచుట ♦—

వ. ఇట్లు కృష్ణుండు బహువిధంబులఁ గపటబాలలీలల వినోదింప బృహద్వనంబున నందాదులైన గోపవృద్ధులు మహోత్పాతంబు లగుటయు వానివలన బాలుఁ [1]డుత్తరించుటయుఁ జూచి యేకాంతంబున నొక్కనాఁడు విచారింప నుపనందుండను [2]వృద్ధగోపకుండు దన యెఱుక మెఱసి యిట్లనియె. 423

ఉ. ఇక్కడ నుండరే మనుజు ♦ లీ మనకృష్ణున కెగ్గు సేయఁగా
రక్కసురాలు చన్నొసఁగె ఱాలసయిన్ సుడిగాలి వైచెఁ బైఁ
గ్రిక్కిఱియం దరుల్ వడియెఁ ♦ గేశవుసత్కృపఁ దప్పెఁ జాలు నేఁ
డెక్కడికైన బోవలయు ♦ నింకిట గోపకులార వింటిరే. 424

క. కసవు గలదిరవు పసులకు [3]లసదద్రినదీమహీజ ♦ లతికావలి పెం
[4]పెసఁగును గాఁపురమునకును [5]బొసఁగును బృందావనంబు [6]పోదఁడచ్చటికిన్

—♦ నందాదులు బృందావనమునకుఁ బోవుట ♦—

వ. అని పలుకు నుపనందుని పలుకుల కార్యులైన గోపకు లియ్యది కార్యంబు మంచి యని కొందలపడక యాలమందల నమందగమనంబున ముందర నడవం బనిచి పిఱుందం గ్రందుకొనకుండ బాలవృద్ధనారు [7]లెక్కిన తేరుల సాగించి [8]తనుత్రాణతూణీర బాణధరులై విండ్లుఁ బట్టుకొని నడవ బండ్ల వెనుకం గొమ్ములిమ్ములం బూరించుచు నవార్యంబులగు [9]తూర్యరవంబుల నార్యపురోహితసతులై వేడుకలు

(1) ఉత్తరించుటయుఁ = వెడలఁ దాఁటుటయు. (2) వృద్ధగోపకుండు = ముసలిగొల్లవాఁడు. (3) లసదద్రి.....కావళిన్ = ఒప్పిదమయిన పర్వతములు, ఏఱులు, వృక్షములు, తీఁగలు వీని యొక్క పంక్తులచేత. (4) ఎసఁగుఁ = అతిశయించును. (5) పొసఁగును = సరిపడియుండును. (6) పోదఁడచ్చటికిన్ = అచటికిఁ బోవుదమురండు. (7) ఎక్కిన తేరులు = ఎక్కినట్టి రథములు. (8) తనుత్రాణ తూణీర బాణధరులై = కవచములు, అమ్ములపొదులు, బాణములు ధరించినవారై. (9) తూర్యరవంబులు = వాద్యధ్వనులు.

కొనలు నిగుడ మొనలేర్పరచుకొని పావనంబగు బృందావనంబునకుఁ
జని రప్పుడు. 426

తరలము. [1]పసుపులాడి యురోజకుంకుమ ♦ పంకశోభితలై [2]లస
ద్వసనలై [3]కచభారచంపక ♦ దామలై [4]సులలామలై
[5]పసిఁడిమాడలకాంతు లుబ్బులఁ ♦ బర్వఁ [6]దేరులమీఁదఁ [7]బెం
పెసఁగఁ బాడిరి వ్రేతలాహరి ♦ హేల లింపగు [8]నేలలన్.

వ. అప్పుడు రోహిణీయశోద లేకరథంబునఁ బరిపూర్ణమనోరథ లై
రామకృష్ణుల ముందట నిడుకొని వారల వినోదంబులకుఁ బ్రమో
దంబు నొందుచుండి రిట్లు గోపకులు బృందావనంబు సొచ్చి యం
దర్ధచంద్రాకారంబుగ శకటసందోహంబునిలిపి మందలు విడియించి
వసియించిరి. 428

–♦ బలరామకృష్ణ నందాదులు బృందావనంబుఁ బ్రవేశించుట. ♦–

క. చెందిరి బలమాధవు లభి
నందించుచుఁ బరమపావ ♦ న ముదంచిత కా
ళిందీ సంజీవనమున్
బృందావనమున్ మునీంద్ర.♦ బృందావనమున్ 429

వ. ఇట్లు బృందావనంబుఁ జెంది యందుఁ గొంతకాలంబునకు రామ
కృష్ణులు సమాన వయస్కులైన గోపబాలకులం గూడుకొని వేడుక
లూడుకొన దూడలఁ గాచుచు ననేక క్రీడలకుం జొచ్చి. 430

సీ. వేణువు లూఁదుచు ♦ వివిధరూపములతో
గంతులు వైతురు ♦ [9]కౌతుకమున

---

(1) పసుపు......శోభితలై = పసుపు పూసికొని స్నానములు చేసి బొమ్మలయందు పూయఁబడిన కుంకుమపువ్వుతోడి మంచిగంధము బురదబురదగాఁ బూసికొని ప్రకాశించు చున్నవారలై. (2) లసద్వసనలై = మంచి వస్త్రములు ధరించినవారలై. (3) కచభార చంపకదామలై = కొప్పులయందు అమర్చఁబడిన సంపెంగపూల దండలు గలవారలై (4) సులలామలై = మంచి ఆభరణము, తిలకమును ధరించిన వారలై. (5) పసిఁడి... బర్వన్ = బంగారు ఆభరణముల కాంతులు మెడలయందు వ్యాపింపఁగా. (6) తేరుల మీఁదన్ = రథములమీఁదనుండి. (7) పెంపెసఁగన్ = గౌరవము హెచ్చఁగా. (8) ఏలలన్ = ఏల పాటలచేతను, (పాడిరి) (9) కౌతుకమున = కుతూహలముతో; ఉత్సాహముతో.

1గురుకంబళాదుల ♦ గోవృషంబులఁ బన్ని
పరవృషభము లని ♦ ప్రతిఘటింతు
2రల్లులు దట్టించి ♦ 3యంఘ్రుల గజ్జెలు
మొరయఁ దన్నుదు 4రోలి ♦ 5ముమ్మరముగఁ
బన్నిదంబులు వైచి ♦ 6ఫలమంజరులు గూల్చి
వ్రేటులాడుదురు ప్రా ♦ వీణ్యమొప్ప

తే. వన్యజంతుచయంబుల ♦ వాని వాని
పదురు వదరుచు వంచించి ♦ పట్టఁబోదు
7రంబుజాకరములఁ 8జల్లు ♦ లాడఁ జనుదు
రాకుమారులు బాల్య వి ♦ హారులగుచు. 431

క. పోరుదురు 9గికురుపొడుచుచు
దూఱుదురు భయంబు లేక ♦ 10తోరపుటిరవుల్
జాఱుదురు ఘనశిలాతటి
మీఱుదు రెన్నంగ రాని ♦ మెలఁకువల నృపా. 432

వ. అంత నొక్కనాఁడు యమునాతీరమున నా కుమారులు గోపకుమారులుం దారుఁ గ్రేపులమేప నొక్కరక్కసుండు 11క్రేపురూపున వచ్చి వారల హింసింపం దలంచి. 433

-♦ వత్సాసుర బకాసురుల వధ ♦-

క. క్రేపుల యఱ్ఱులు నాకుచుఁ
గ్రేపులలో నదియె మంచి ♦ క్రే పనఁగఁ గడుం
జూపట్టి భక్తసంగతిఁ
గ్రేపై చనువాని మ్రోలఁ ♦ గ్రేపై తిరిగెన్, 434

వ. వాని నెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పి. 435

(1) గురుకంబళాదులన్ = గొప్పకంబళ్ళు మొదలగువానిచేత (2) అల్లులుదట్టించి = భుజములఁ జఱచుకొని (3) అంఘ్రులగజ్జెలు = పాదములగజ్జెలు (4) ఓలిన్ = వరుసగా (5) ముమ్మరముగన్ = అధికముగ. (6) ఫలమంజరులు = పండ్లపూవుల గుత్తులు. (7) అంబుజాకరములన్ = తామరకొలనులలో (8) చల్లులాడఁ జనుదురు = ఒకరిమీద నొకరు నీళ్ళను జిమ్ముకొనుచు నీదులాడుదురు. (9) కికురుపొడుచుచున్ = వెక్కిరించుచు. (10) తోరపుటిరవుల్ = గొప్ప పొదరిండ్లు (11) క్రేపురూపమున = దూడ స్వరూపమున,

చ. ఇది యొక మంచి లేఁగ వినుఁ ♦ డెంతయు నొప్పెడినంచు డాసి [1]త
త్పదములుఁ దోఁకయుం బిగియఁ ♦ బట్టి చెలంగి వెలంగమ్రానితోఁ
జడియఁగ నొక్క పెట్టుకొని ♦ చంపెఁ గుమారుఁడు [2]లేఁగరక్కసుం
గుదులుకొనంగ బాలకులు ♦ గో యని యార్వ [3]నఖర్వలీలతోన్.

వ. ఇట్లు రక్కసుండు వ్రేటువడి విశాలంబగు సాలంబుతో నేలం గూలె నప్పుడు. 437

క. గొంగడు లెగురఁగ వైచుచుఁ
జంగున దాఁటుచును జెలఁగి ♦ చప్పట్లిడుచుం
బొంగుచుఁ గృష్ణుని బొగడుచుఁ
[4]ద్రుంగిన రక్కసునిఁ జూచి ♦ త్రుళ్ళిరి కొమరుల్. 438

వ. ఆ సమయంబున వేలుపులు విరులవానలు గురియించి రిట్లు. 439

క. [5]వత్సముల పగిది జగముల
వత్సలతన్ మనుపఁ జూచు ♦ వాఁడై యుండున్
వత్సముల మేపుచుండియు
వత్సాసురుఁ జంపె భక్త ♦ వత్సలుఁ డధిపా. 440

వ. మఱియు నొకనాఁడు [6]రేపకడ గోపకుమారులు క్రేపులం గొంచు నడవికిం జని యెండంబడి మెండుకొనిన దప్పి బెండువడిన తమ తమ లేఁగకదుపుల నేర్పరించి నిలువరించుకొని [7]కలంకంబు లేని యొక్క కొలంకున నీరు ద్రావించి తారును జలపానంబు సేసి వచ్చి నెడ నందు.



క. [8]అకలంకులు బాలురు గని
రకుటిలదంభోళిహతసి ♦ తాద్రి శిఖరరూ
పకమున్ హరిహింసాకరం
బకమున్ నతవిశాల ♦ భయదాంబకమున్. 442

(1) తత్పదములన్ = దానికాళ్ళను (2) లేఁగరక్కసున్ - వత్సాసురుని. (3) అఖర్వలీలతోన్ = గొప్ప విలాసముతో (అవలీలగా) (4) ద్రుంగిన రక్కసునిన్ = చచ్చిన రాక్షసుని (5) వత్సముల పగిదిన్ = లేఁగదూడలవలెనే (6) రేపకడ = ప్రొద్దున. (7) కలంకంబులేని = ఒండుబురదలేని నిర్మలమైన (8) అకలంకులు = కపటమెఱుఁగనివారైన.

వ. కని దాని మొదలి పొడవునకు వెఱఁగుపడి చూచుచుండ. 443

ఆ. ఎల్లపనులు మాని ♦ యేకాగ్రచిత్తుఁడై
మౌనివృత్తి నితర ♦ మమత విడిచి
వనములోన నిలిచి ♦ వనజాక్షుపై దృష్టిఁ
జేర్చి [1]బకుఁడు దపసి చెలువుఁ దాల్చె. 444

వ. ఇవ్విధంబున గొదుఁగు వెట్టుకొనియుండి. 445

ఉ. [2]చంచువు దీటి పక్షములు ♦ [3]జల్లున విచ్చి పదంబు లెత్తి కు
ప్పించి నభంబుపై కెగసి ♦ [4]భీషణఘోషణవక్త్రుఁడై విజృం
భించి గరుత్సమీరమున ♦ భిన్నములై తరు లొలిఁ గూలఁగా
మించి బకాసురుం డొడిసి ♦ మ్రింగె సహిష్ణునిఁ జిన్నికృష్ణునిన్. 446

క. సంగడి లోకములన్నియు
మ్రింగుచుఁ గ్రక్కుచును బయల ♦ మెలఁగించుచు ను
ప్పొంగెడు వేడుకకాఁ డటు
మ్రింగుడువడె బకునిచేత ♦ మీఁ దెఱిఁగి నృపా! 447

క. దనుజుఁడు మ్రింగినఁ గృష్ణునిఁ
గనలేక బలాదిబాల ♦ కప్రముఖులచే
తనులై వెఱఁగందిరి చ
య్యనఁ బ్రాణములేని యింద్రి ♦ యంబుల భంగిన్. 448

వ. ఇట్లు మ్రింగుడువడి లోనికిం జనక. 449

శా. [5]కంఠోపాంతము దౌడలున్ మెరుముచుం ♦ [6]గాలాగ్నిచందంబునం
[7]గుంఠీభూతుఁడుగాక [8]వేండ్రమగు నా ♦ గోపాలబాలున్ [9]జయో
త్కంఠున్ బ్రహ్మగురున్ మహామహిముఁ జ♦క్కన్ మ్రింగరాదంచు [10]సో
ల్లుంఠం బాడుచు వాఁడు గ్రక్కె వెడలన్ ♦ లోకం బశోకంబుగన్.

---

(1) బకుఁడు = బకాసురుఁడు. (2) చంచువుదీటి - ముక్కును సవరించుకొని (3) జల్లునన్ = తటాలున. (4) భీషణఘోషణవక్త్రుఁడై = భయంకరధ్వనిగల నోరుగలవాఁడై (5) కంఠోపాంతము=అంగిలిలోపలిభాగము. (6) కాలాగ్నిచందంబునన్=ప్రళయకాలపు అగ్నివలె. (7) కుంఠీభూతుఁడుగాక = మొక్కపుచ్చఁబడినవాఁడుగాక. (8) వేండ్రమగు = అధికతాపము కలుగఁజేయుచున్న. (9) జయోత్కంఠున్ = గెలువనుత్సహించువానిని. (10) సోల్లుంఠంబాడుచున్ =తిరస్కారపూర్వకముగ నిందించుచు,

క. క్రక్కి మహాఘోషముతోఁ
జక్కనఁ దనుఁ బొడువరాఁగఁ ♦ [1]జంచులు రెండున్
స్రుక్కఁగఁ బట్టి తృణము క్రియఁ
గ్రక్కున హరి చీరె బకునిఁ ♦ [2]గలహోత్సుకునిన్. 451

వ. అప్పుడా నందనందనునిమీఁద వేలుపులు సాలుపులుగా నందనమల్లికాదికుసుమ వర్షంబులు హర్షంబునం గురియించిరి. దేవవాద్యంబులు మొరసె. రామాదిగోపకుమారులు ప్రాణంబులతోఁ గూడిన యింద్రియంబులుంబోలెఁ గ్రమ్మఱఁ గృష్ణునిం గని రమ్మని కౌఁగిలించుకొని కృష్ణసహితులయి [3]లేఁగ దాఁటుల మరల దాఁటించుకొని మందగమనంబున మంద కరిగిరి. వారలచేత నా వృత్తాంతం బంతయు విని వెఱఁగుపడి గోపగోపికాజనంబులు.

క. ఆపదలమీఁద నాపద లీ పాపనిఁ జెంది తొలఁగె ♦ నీ యర్భకునిం
బై పడిన ఖలులు దహనుని పై పడు శలభముల పగిదిఁ ♦ బడిరి ధరిత్రిన్.

వ. అని పలికిరి. మఱియు నా రామకృష్ణులు క్రేపులం గాచుతఱి. 454

సీ. కపులమై జలరాశిఁ ♦ గట్టుదమా యని
కట్టుదు రడ్డంబు ♦ గాలువలకు
మునులమై తపములు ♦ [4] మొనయుదమా యని
మౌనులై యుందురు ♦ మాటలేక
గంధర్వవరులమై ♦ గానవిద్యలు మీఱఁ
బాడుదమా యని ♦ పాడఁ జొత్తు
రప్సరోజనులమై ♦ యాడుదమా యని
యాఁడురూపులఁ దాల్చి ♦ యాడఁ జనుదు
ఆ. [5] రమర దైత్యవరుల ♦ మై యబ్ధిఁ [6]ద్రత్తమా
యని సరోవరముల ♦ యందు హస్త

(1) చంచులు రెండున్ = ముక్కులు రెండును. (2) కలహోత్సుకునిన్ = కయ్యమునకు కాలుద్రవ్వువానిని. (3) లేఁగదాఁటులన్ = పసిదూడల గుంపులను. (4) మొనయుదమా యని = ప్రయత్నింతుమా యని. (5) అమరదైత్యవరులమై = దేవతా శ్రేష్ఠులము, రాక్షస శ్రేష్ఠులము నై. (6) త్రత్తమా యని = చిలుకుదమా యని.

దండచయముఁ ద్రిప్పి ♦ తరుతురు తమయీడు
కొమరు లనుచరింపఁ ♦ [1]గొమరుమిగిలి. 455

—♦ శ్రీకృష్ణుఁడు గోపకులతో బంతిచల్దులు గుడువ వనమున కేఁగుట ♦—

వ. అంత నొక్కనాఁడు రామకృష్ణులుఁ గాంతారంబున [2]బంతిచలుదులు గుడువ నుద్యోగించి ప్రొద్దున లేచి [3]గ్రద్దనం దమయింటి లేఁగకదుపులఁ గదలించి [4]సురంగంబులగు శృంగంబులు పూరించిన విని మేలుకని సంరంభంబున గోపడింభకులు చలిదికావడులు మూఁపుల వహించి [5]సజ్జంబులగు కజ్జంబులు గట్టికొని [6]పదత్రాణవేత్రదండధరులై లెక్కలకు వెక్కసంబైన తమతమ క్రేపుకదుపులం జప్పుడించి రొప్పుకొనుచుఁ గాననంబు సొచ్చి కాంచన మణిపుంజగుంజాది భూషణ భూషితు లయ్యును ఫలకుసుమకోరకపల్లవవల్లరులు దొడవులుగా నిడికొని కొమ్ములిమ్ముగ మ్రోయించుచు వేణువులు పూరించుచుఁ దుమ్మెదలం గూడి పాడుచు మయూరంబులతోడం గూడి యాడుచుఁ [7]బికంబులం గలసి కూయుచు [8]శుకంబులఁ జేరి రొదలు సేయుచుఁ [9]బులుఁగులనీడలం బాఱుచు బొదరిండ్లం దూరుచు [10]సరాళంబులగు వాఁగులు గడచుచు [11]మరాళంబుల చెంతనడచుచు బకమ్ములంగని నిలుచుచు [12]సారసంబులం జోపి యలంచుచు నదీజలంబులం [13]దోఁగుచుం దీవియుయ్యెలల నూఁగుచుఁ బల్లంబులఁ దాఁగుచు దూరంబుల కేఁగుచుఁ గపులసంగడిఁ దరువు లెక్కుచు ఫలంబుల మెక్కుచు రసంబులకుఁ జొక్కుచు నింగికి నిక్కుచు నీడలు చూచి నవ్వుచుఁ గయ్యంబులకుఁ గాలు ద్రవ్వుచుఁ జెలంగుచు

(1) కొమరుమిగిలి = అందమతిశయించి (2) బంతిచల్దులు గుడువన్ = బంతులుగాఁ గూర్చుండి చల్దియన్నములు తినుటకు (3) గ్రద్దనన్ = శీఘ్రముగ. (4) సురంగంబులగు శృంగంబులు = పొడవైన బాకాలు మాదిరి కొమ్ములు (5) సజ్జంబులగు కజ్జంబులు = మంచిరుచిగల వయిన కజ్జాయములను (6) పదత్రాణవేత్రదండధరులై = చెప్పులు తొడిగికొని కఱ్ఱలు పట్టుకొన్నవారలై (7) పికంబులు = కోయిలలు. (8) శుకంబులు = చిలుకలు (9) పులుఁగుల నీడలఁ బాఱుచు = ఆకాశమునఁ దిరుగునట్టి పక్షులయొక్క నీడలక్రిందఁ బరుగెత్తుచు (10) సరాళంబు లగువాఁగులు = తిన్ననైన సెలయేఱులు (11) మరాళంబులు–హంసలు (12) సారసంబులం జోపియలంచుచు = బెగ్గురుపక్షుల నెగఁద్రోలి శ్రమపెట్టుచు. (13) తోఁగుచు = మునుంగుచు.

మెలంగుచు నాలుచు సోలుచు బహుప్రకారంబుల శరీర వికారం
బులు సేయుచు మఱియును. 456

క. ఒకనొకని చల్దికావడి
నొకఁడొకఁ డడకించి దాఁచు ♦ నొకఁడొకఁ డది వే
ఱొకనొకని మొఱఁగికొని చన
నొకఁడొకఁ డది దెచ్చి యిచ్చు ♦ నుర్వీనాథా. 457

క. ఒక్కఁడు ము న్నేమఱి చన
నొక్కఁడు బలుబొబ్బ వెట్టు ♦ నులికిపడన్ వే
ఱొక్కఁడు ముట్టి తటాలున
నొక్కని కనుదోయి మూయు ♦ నొక్కఁడు నగఁగన్. 458

క. తీఁపుగల శజ్జ మన్యుఁడు
గోపింపఁగ నొడిసి పుచ్చు ♦ కొని పో వాఁడుం
బైపడి యడుగఁగ నొక్కఁడు
క్రేపులలో నిట్టు నట్టుఁ ♦ [1]కికురించు నృపా. 459

క. వనజాక్షుఁడు ము న్నరిగిన
మునుపడఁగా నేనె యతని ♦ ముట్టెద ననుచుం
జను మును ముట్టనివానిన్
మును ముట్టినవాఁడు నవ్వు ♦ మొనసి నరేంద్రా. 460

వ. ఇవ్విధంబున.

ఉ. ఎన్నఁడు నైన యోగివిభు ♦ [2]లెవ్వనిపాదపరాగ మింతయున్
గన్నులఁగాన రట్టి హరిఁ ♦ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టబట్టుచున్
దన్నుచు గ్రుద్దుచున్ నగుచుఁ [3]దద్దయుఁ బైపడి కూడియాడుచున్
మన్ననసేయు [4]వల్లవ కు ♦ మారుల భాగ్యములింత యొప్పునే.

క. విందులకును బ్రహ్మసుఖా
నందంబై భక్తగణము ♦ నకు దైవతమై

---

(1) కికురించున్ = దాఁగఁబోవ యత్నించును. (2) ఎవ్వనిపాదపరాగము = ఏ మహాత్ముని కాలిదుమ్మును. (3) తద్దయున్ = మిక్కిలి. (4) వల్లవకుమారుల భాగ్యములు = గొల్లపిల్లకాయల యదృష్టములు.

మందులకు బాలుఁ డగు హరి
పొందు గనికి గొల్ల లిట్టి ♦ పుణ్యులు గలరే. 463

వ. అని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె. 464

—♦ అఘాసుర వృత్తాంతము. ♦—

క. అమరు లమృతపానంబున
నమరిన వారయ్యు [1]నే ని ♦ శాటుని పంచ
త్వమునకు నెదుళ్ళ సూతురు
తమ నమ్మిక యట్టి [2]యఘుఁడు ♦ [3]దర్పోద్ధతుఁడై. 465

క. బకునికిఁ దమ్ముఁడు గావున
బకమరణము దెలిసి కంసు ♦ పంపునఁ దా గో
పకబాలురతోఁ గూడను
బకవైరిని ద్రుంతు ననుచుఁ ♦ బటురోషమునన్. 466

క. బాలుర ప్రాణంబులు గో
పాలురకు, మదగ్రజాతు ♦ ప్రాణము మాఱీ
బాలురఁ జంపిన నంతియ
చాలును గోపాలు రెల్ల ♦ సమసినవారల్. 467

వ. అని నిశ్చయించి యోజనంబు నిడుపును మహాపర్వతంబు పొడవును గొండతుదల మీఱిన కోఱలును మిన్నుదన్ని పన్నిన నల్ల మొగిళ్ళ పెల్లు గల పెదవులును బిలంబులకు నగ్గలంబైన యిగుళ్ళ సంధులును నంధకార బంధురంబైన [4]వదనాంతరాళంబును దావానలజ్వాలాభీలంబైన దృష్టిజాలంబును వేఁడిమికి నివాసంబులైన యుచ్ఛ్వాస నిశ్శ్వాసంబులును మెఱయ నేల నాలుకలు పఱచుకొని ఘోరంబగు [5]నజగరాకారంబున. 468

(1) ఏ నిశాటుని పంచత్వమునకుఁ = ఏ రాక్షసునియొక్క చావునకు. (2) అఘుఁడు = అఘాసురుఁడు. (3) దర్పోద్ధతుఁడై = మదముచేత నిక్కుచున్నవాఁడై. (4) వదనాంతరాళంబును = చీఁకటిచేతఁ గ్రిందు మీఁదు తెలియని నోటిలోని భాగమును. (5) అజగరాకారంబున = కొండపాము రూపమున.

క. జాపిరము లేక యిప్పుడు
 క్రేపుల గోపాలసుతులఁ ♦ గృష్ణునితోడన్
 గీఁపెట్టఁగ మ్రింగెద నని
 పాపపు రక్కసుఁడు త్రోవఁ ♦ బడియుండె నృపా! 469

వ. ఆ సమయంబున. 470

మ. ఒకవన్యాజగరేంద్ర మల్లదె [1]గిరీం ♦ ద్రోత్సేధమై [2]దావ పా
 వక కీలాపరుష ప్రచండతర ని ♦ శ్శ్వాసంబుతో ఘోరవ
 హ్ని కరాళాతత జిహ్వతోడ మనలన్ ♦ హింసింప నీక్షించుచున్
 [3]వికటంబై పడి చాఁగియున్నది పురో ♦ వీథిం గనుంగొంటిరే. 471

వ. అని యొండొరులకుం జూపుచు. 472

మ. బకునిం జంపిన కృష్ణుఁడుండ మనకుం ♦ బాముంచుఁ జింతింప నే
 టికి రా పోదము దాఁటి కాక యది కౌ♦టిల్యంబుతో మ్రింగుడున్
 బకువెంటం జనుఁ గృష్ణుచేత ననుచుం ♦ బద్మాక్షు నీక్షించి యు
 త్సుకులై చేతులు వేసికొంచు నగుచున్ ♦ దుర్వారులై పోవఁగన్.

వ. వారలం జూచి హరి దనమనంబున. 474

ఉ. [4]అర్భకు లెల్లఁ బాము [5]దివి ♦ జాంతకుఁ డౌట యెఱుంగ రక్కటా
 నిర్భయులై యెదుర్కొనిరి ♦ నేఁ గలనంచు విమూఢులంచు [6]నా
 విర్భవదాగ్రహాత్మమున ♦ వెడదగులన్ దమ లేఁగపిండుతో
 దుర్భర ఘోరసర్పఘన ♦ తుండబిలాంతముఁ జొచ్చి రంతయున్.

వ. అయ్యవసరంబున. 476

శా. వేల్పుల్ సూచి భయంబునొంద గ్రసనా ♦ వేశంబుతో [7]నుజ్జ్వల
 త్కల్పాంతోజ్జ్వలమానజిహ్వాదహనా ♦ కారంబుతో మ్రింగె న

(1) గిరీంద్రోత్సేధమై = హిమవత్పర్వతమంతపొడవై. (2) దావపావకకీలాపరుష ప్రచండతర = మిక్కిలి ఉద్ధృతమైన కార్చిచ్చు మంటలవలె. (3) వికటంబై = వ్యథ పెట్టునదియై. (4) అర్భకులెల్లన్ = ఈ గొల్లపిల్లకాయలందఱును (5) దివిజాంతకుఁడౌట = రాక్షసుఁడు అగుటను (ఎఱుంగరు). (6) ఆవిర్భవదాగ్రహాత్మమునన్ = పుట్టుచున్న కోపముగలవానితనముతోను. (7) ఉజ్జ్వల........కారంబుతోన్ = ప్రళయకాలమందు ప్రకాశించు నాల్కలుగల అగ్నిరూపముతో.

స్వల్పాహీంద్రము మూర్ఛవాప్పితమనో ♦ వ్యాపార సంచారు ల
నల్పాకారుల [1]శిక్యభారులఁ గృపమా ♦ రాభీరులన్ ధీరులన్. 477

వ. ఇట్లు పెనుబాముచేత [2]మింగఁబడువడు సంగడికాండ్రగమిం జూచి కృష్ణుండు. 478

చ. పడుచులు లేఁగలుఁ గలసి ♦ పైకొని వత్తురు తొల్లి కృష్ణ మా
కొడుకు లదేల రా రనుచు ♦ గోపిక లెల్లను బల్క నేక్రియన్
నొడివెద నేఁడు పన్నగను ♦ నోరికి వీరికి నొక్కలంకెగా
నొడఁబడ నేల చేసె విధి ♦ యోడక సేయుఁగదయ్య క్రౌర్యముల్.

వ. అని తలపోసి నిఖిలలోచనుండును [3]నిజాశ్రిత నిగ్రహమోచనుండును నైన తమ్మికంటి మింటి తెరువరులు మొఱలిడ రక్కసు [4]ఉక్కుమిగుల వెక్కసం బగు నజగరం బయియున్న యన్నరభోజను కుత్తుకకుఁ బొత్తుకొని మొత్తంబు వెంటనంటంజని తమ్మునందఱఁ జిందరవందఱ సేసి మ్రింగ నగ్గలించు నజగరంబు కంఠద్వారంబున సమీరంబు వెడలకుండఁ దనశరీరంబు పెంచి [5]గ్రద్దన మిద్దె సఱచినట్లుండ.

క. ఊపిరి వెడలక కడుపున, వాపొదవినఁ బాము ప్రాణ♦వాతంబులు సం
తాపించి శిరము వ్రక్కలు వాపికొనుచు వెడలి చనియె♦బటుఘోషముతోన్

శా. [6]క్రూరవ్యాళవిశాలకుక్షి గతులన్ ♦ గోవత్ససంఘంబుతోఁ
[7]గారుణ్యామృత వృష్టిచేత బ్రదుకం ♦ గాఁ జూచి వత్సంబులన్
వారుం దాను [8]దదాస్యవీధి మగుడన్ ♦ వచ్చెన్ [9]ఘనోన్ముక్తుఁడై
[10]తారానీకముతోడ నొప్పెసఁగు నా ♦ [11]తారేశు చందంబునన్.

---

[1] శిక్యభారుల...ధీరులన్ = చల్దియన్నము కావిళ్లు మోసికొని వచ్చుచున్న ధైర్యము గల గొల్లపిల్లకాయలను [2] మింగుడువడు సంగడికాండ్రగమిన్ = భక్షింపఁబడుచున్న స్నేహితులసమూహమును [3] నిజాశ్రితనిగ్రహ మోచనుండును = తన్ను ఆశ్రయించిన వారి బాధను పోఁగొట్టువాఁడును [4] ఉక్కుమిగులన్ = మదింపగా [5] గ్రద్దన... నట్లుండ = సరిగా కట్టువేసి నట్లుండఁగా [6] క్రూర...గతులన్ = క్రూరమైన పాము యొక్క విశాలమైన కడుపునందున్నవారిని [7] కారుణ్యామృతవృష్టిచేతన్ = దయారసమనెడు అమృతపు వానచేత [8] తదాస్యవీధిన్ = వాని నోటిగుండ [9] ఘనోన్ముక్తుఁడై = మబ్బుచేత విడువఁబడినవాఁడై [10] తారానీకముతోడన్ = నక్షత్రముల చాలుతో [11] ఆ తారేశు చందంబునన్ = ప్రసిద్ధిచెందిన ఆ చంద్రునివలెనే.

ఆ. అమరవరులకొఱకుఁ ♦ గమలజాండం బెల్ల
బలిఁ దిరస్కరించి ♦ బలియు వడుగు
గోపసుతులకొఱకుఁ ♦ [1]బాపపుఁ బెనుఁబాము
గళము దూఁటుగట్ట ♦ బలియకున్నె. 483

ఉ. ఆ పెనుఁబాము మేన నొక ♦ యద్భుతమైన వెలుంగు [2]దిక్తటో
ద్దీపక మై వడిన్ వెడలి ♦ [3]దేవపథంబునఁ దేజరిల్లుచున్
గ్రేపులు బాలురన్ బెదరఁ ♦ గృష్ణుని దేహమువచ్చి చొచ్చె నా
పాపఁడు సొచ్చి ప్రాణములఁ ♦ బాసిన యంతన శుద్ధసత్త్వమై. 484

క. తనరూ పొకమాటయినను
మనమున నిడుకొనినఁ బాప ♦ మయ్యుఁ దనగతికిన్
గొనిచను హరి దను మ్రింగిన
దనుజునిఁ గొని పోవకున్నె ♦ తనలోపలికిన్. 485

♦ దేవతలు శ్రీకృష్ణునిమీఁదఁ బుష్పములు గురియించుట ♦

వ. తదవసరంబున సురలు గుసుమవర్షంబులు గురియించిరి. మునులు హర్షించిరి. రంభాదు లాడిరి. గంధర్వులు పాడిరి. మేఘంబులు మృదంగములభంగి ఘోషించె. సిద్ధగణంబులు జయజయ భాషణంబుల భూషించె నంత. 486

శా. ఆ వాద్యంబులు నా మహాజయరవం ♦ బాపాట లా యాటలుం
దేవజ్యేష్ఠుఁడు పద్మజుండు విని శ్రీ ♦ తిన్ భూమి కేతెంచి నేఁ
డీ వత్సార్భకులన్ [4]భుజంగమువడిన్ ♦ హింసింప నీ బాలకుం
డే వెంటన్ బ్రదికించె మే లనుచు నూహించెం గడున్ నివ్వెఱన్.

వ. అంత [5]నయ్యజగర చర్మంబు గొన్నిదినంబుల కెండి పెద్దకాలంబు గోపాలబాలురకుం గేళీబిలంబై యుండె నిట్లు కౌమారవిహారంబున నైదవయేఁట గృష్ణుం డఘాసురునిం దెగఁజూచుటయుఁ దమ్ముం

(1) పాపపుఁ...దూటుగట్ట = దుష్టమయిన కొండపాము గొంతులోని క్రొవ్వు లేక మదమును అణగించుటకు. (2) దిక్తటోద్దీపకమై = అన్నిదిక్కులు ప్రకాశింపఁజేయునదియై. (3) దేవపథంబునన్ = ఆకాశమార్గమున. (4) భుజంగము = సర్పము (5) ఆ య్యజగరచర్మంబు = ఆ కొండపాముయొక్క తోలు.

గాచుటయు నాఁటవయేఁటి దైన[1] పౌగండ వృత్తాంతం బని చిత్తం
బుల గోపకుమారులు దలంచుచుండు రని చెప్పిన నప్పుడమిఱేఁ
డప్పరమయోగీంద్రున కిట్లనియె. 488

సీ. అయిదేండ్లు కౌమార ◆ మటమీఁద నైదేండ్లు
పౌగండ మనియెడు ◆ ప్రాయమందు
నయిదేండ్లవాఁడైన ◆ యబ్జాక్షుచరితంబు
పౌగండ మగు గోప ◆ బాలు రెల్లఁ
దలఁతు రంటివి యెట్లు ◆ తలఁతురు వారలు
నిరుడు సేసిన పని ◆ నేఁటి దనఁగ
వచ్చునే యిదినాకు ◆ వరుసతో నెఱిఁగింపుఁ
డనవుఁడు యతిచంద్రుఁ ◆ డైన శుకుఁడు

ఆ. యోగదృష్టిఁ జూచి ◆ యొక్కింత భావించి
వినుము రాజవర్య ◆ [2]వినయధుర్య
పరమగుహ్య మనుచుఁ ◆ బలుకుదు రార్యులు
శిష్యజనుల కీవు ◆ సేయు తలఁపు. 489

క. ప్రియురాలివలని వార్తలు
ప్రియజనులకు నెల్లప్రొద్దుఁ బ్రియమగు భంగిం
బ్రియుఁడగు హరిచరితంబులు
ప్రియభక్తుల కెల్లయెడలఁ ◆ బ్రియములుగావే. 490

వ. అనిపలికి యోగీంద్రుఁడు రాజేంద్రునకిట్లనియె నట్లఘాసురు మొగంబు
వలనం గడచనిన లేఁగలకాపరులం (గోపకుమారులం) బ్రదికించి
వారును దానునుం జనిచని. 491

మ. కనియెం గృష్ణుఁడు సాధునీరము మహా ◆ గంభీరముం బద్మ [3]కో
కనదాస్వాద వినోదమోదమదభృం ◆ గద్వంద్వ ఝుంకారమున్

(1) పౌగండము = అయిదు సంవత్సరములకు పై నుండువయస్సు (2) వినయధుర్య = విశేష నీతిని వహించినట్టి (3) కోకనద......ఝుంకారము = ఎఱ్ఱకలువ పుష్పములందలి అమృతమువంటి తేనెను అనుభవించి మదించిన తుమ్మెదలజంటలయొక్క ఝుం ఝుం అను సంతోషముతో చేయుచున్న ధ్వనులు గల దానిని

ఘన[1]కల్లోల లతావితానవిహార ♦ [2]కాదంబ కోలాహల
స్వన [3]విస్ఫారము [4]మందవాయుజకణా♦సారంబు గాసారమున్. 492

-♦ గోపబాలురు కృష్ణునితోఁగూడి చల్దు లారగించుట ♦-

వ. కని తమ్మికంటి [5]తమ్ములయింటి సొబఁగునకు నిచ్చ మెచ్చుచుఁ జెచ్చెర గాలి నోలిం గదలెడు కరళ్ళతుంపురులజల్లు పెల్లున నొడళ్లు గగురు పొడువఁ [6]గొలంకుంగెలఁకులఁ గాయపండుల గెలల వ్రేఁగున వీఁగిపట్టుఁ గలచెట్టుఁ [7]దుటుమునీడల నొప్పుచున్న యిసుకతిప్పల విప్పునూచి [8]వేడుకపిచ్చలింప నెచ్చెలుల కిట్లనియె. 493

శా. ఎండన్ ద్రిమ్మఱితి రాఁకటం బడితి రిం ♦ కేలా విలంబింపఁగా
రండో బాలకులార చల్దిగుడువన్ ♦ రమ్యస్థలం బిక్కడీ
దండన్ లేఁగలు నీరు ద్రావి [9]యిర వం ♦ దం బచ్చికల్ మేయుచుం
దండంబై విహరించుచుండఁగ నమం ♦ దప్రీతి భక్షింతమే. 494

వ. అనిన నగుగాక యని వత్సంబుల నుత్సాహంబున నిర్మలంబు లగు జలంబులు ద్రావించి పచ్చికల మొల్లంబులుగల పల్లంబుల నిలిపి [10]చొక్కంబులగు చల్దుల చిక్కంబులఁ [11]జక్కడించి.

మ. [12]జలజాంతస్స్థితకర్ణికం దిరిగి రా ♦ సంఘంబులై యున్న రే
కులచందంబునఁ గృష్ణుచుం దిరిగి రాఁ ♦ గూర్చుండి వీక్షించుచున్,
శిలలుం [13]బల్లవముల్ దృణంబులు లతల్ ♦ చిక్కంబులుం బువ్వులా
కులు కంచంబులుగాభుజించి రచటన్ ♦ గోపార్భకుల్ భూవరా. 496

---

(1) కల్లోలలతావితాన = పెద్ద అలలనెడు తీఁగల సమూహమునందు. (2) కాదంబకోలాహలస్వన = కలహంసపక్షులయొక్క కలకలధ్వనులచేత. (3) విస్ఫారమున్ = తిరుగుడు పడుచున్నదానిని. (4) మందవాయుజకణాసారంబున్ = తిన్నని గాలివలనఁ బుట్టిన నీటితుంపురుల వానగల దానిని (5) తమ్ములయింటి సొబఁగునకున్ = ఆతటాకముయొక్క అందమునకు. (6) కొలంకుంగెలఁకులన్ = ఆసరస్సుయొక్క చుట్టును. (పార్శ్వముల యందు) (7) తుటుము = గడ్డి, ఆకులు. (8) వేడుక ......... కిట్లనియె = సంతోషముతోఁ దన ప్రియులైన గొల్లపిల్లకాయలతో నిట్లు చెప్పెను. (9) ఇరవందన్ = నిలచియుండి. (10) చొక్కంబులగు = స్వచ్ఛమైన (పరిశుభ్రమైన) (11) చక్కడించి = క్రమముగా (జాగ్రత్తగా) కొవడి దించి (12) జలజాంతస్థితకర్ణికన్ = తామర కమలము లోపలనుండు మిద్దెను. (13) పల్లవముల్ = చిగుళ్ళను.

సీ. మాటిమాటికి వ్రేలు ♦ మడిచి యూరించుచు
నూరుఁగాయలు దిను ♦ చుండు నొకఁ
డొకని కంచములోని ♦ దొడిసి చయ్యన మ్రింగి
చూడు లే దని నోరు ♦ చూపు నొకఁ
డేగు రార్గురిచల్ది ♦ తెలమిఁ బన్నిద మాడి
కూర్కొని కూర్కొని ♦ కుడుచు నొకఁ
డిన్నియుఁ దగఁ బంచి ♦ యిడుట నెచ్చెలితన
మనుచు బంతెనగుండు ♦ లాడు నొకఁడు

ఆ. కృష్ణుఁ జూడు మనుచుఁ ♦ [1]గికురించి [2]పరుమ్రోల
మేలి భక్ష్యరాశి ♦ మెసఁగు నొకఁడు
నవ్వు నొకఁడు సఖుల ♦ నవ్వించు నొకఁడు
ముచ్చటాడు నొకఁడు ♦ మురియు నొకఁడు. 497

వ. అయ్యవసరంబున. 498

సీ. కడుపున దిండుగాఁ ♦ గట్టిన వలువలో
[3]లాలితవంశనా ♦ ళంబుఁ [4]జొనిపి
[5]విమలశృంగంబును ♦ [6]వేత్రదండంబును
జాఱిరానీక డా ♦ చంక నిఱికి
మీఁగడ పెరుఁగున ♦ మేళవించిన చల్ది
ముద్ద డాపలిచేత ♦ [7]మొనయ నునిచి
చెలరేఁగి కొసరి తె ♦ చ్చిన యూరుగాయలు
వ్రేళ్ళసందుల నెల్ల ♦ వెలయ నిఱికి

ఆ. [8]సంగడీల నడుమఁ ♦ జక్కనఁ గూర్చుండి
[9]నర్మభాషణముల ♦ నగవు నెఱపి

---

[1] కికురించి = ఏమరించి. [2] పరుమ్రోలన్ = ఇతరుల ముందఱయున్న [3] లాలితవంశనాళంబు = అందమైన పిల్లనగ్రోవి. [4] చొనిపి = దోపుకొని [5] విమలశృంగంబును = నిర్మలమైన కొమ్మును. [6] వేత్రదండంబును = బెత్తపు కఱ్ఱను. [7] మొనయన్ = చక్కఁగా కనఁబడునట్లు. [8] సంగడీల నడుమన్ = చెలికాండ్రమధ్య కూర్చుండి [9] నర్మభా... నెఱపి = ప్రియమైన చలోక్తితో నవ్వించుచున్న వాఁడై.

[1]యాగభోక్త కృష్ణుఁ ♦ డమరులు [2]వెఱఁగంద
[3]శైశవంబు మెఱసి ♦ చల్ది గుడిచె. 499

వ. ఇట్లు కృష్ణసహితు లయిన గోపకుమారులు చల్దులు గుడుచునెడఁ గ్రేపులు మేపులకుం జొచ్చి పచ్చని గఱికిజొంపంబుల గుంపుల కుఱికి [4]లంపులు మేయుచు ఘోరంబగు నరణ్యంబునడుమఁ దోరం బగు దూరంబు సనిన వానిం గానక వెఱచుచున్న గోపడింభకులకు నంభోజనయనుం డిట్లనియె. 500

మ. వినుఁ డో బాలకులార! క్రేపు [5]లటవీ ♦ వీథిన్ మహాదూరముం
జనియెం [6]గోమలఘాసఖాదనరతో ♦ త్సాహంబుతో నెందుఁ బో
యెనో యేమయ్యెనో క్రూరజంతువులచే ♦ నేయాపదం బొందెనో
కని తెత్తుం గుడువుండు చల్దిగొఱఁతల్ ♦ గాకుండ మీ రందఱున్.

వ. అని చెప్పి. 502

–♦ బ్రహ్మ గోవత్సములను గోపబాలకుల నంతర్ధానంబు సేయుట ♦–

శా. *కర్ణాలంబితకాకపక్షములతో ♦ గ్రైవేయహారాళితో
స్వర్ణాభాసితవేత్రదండములతో ♦ సత్పింఛదామంబులతోఁ
బూర్ణోత్సాహముతో ధృతాన్నకబళో ♦ త్ఫుల్లాబ్జహస్తంబుతోఁ
దూర్ణత్వంబున నేఁగె లేఁగలకునై ♦ దూరాటవీవీథికిన్. 503

వ. ఇట్లేఁగుచు.

క. ఇచ్చోఁ బచ్చిక మేసిన
విచ్చోఁ ద్రావినవి తోయ ♦ మేఁగిన విచ్చో

---

[1] యాగభోక్త = యజ్ఞభాగములను భుజించువాఁడుఁ [2] వెఱఁగంద = ఆశ్చర్యపడఁగా [3] శైశవంబు మెఱసి చల్ది గుడిచె = పసిబిడ్డలభావము జూపుచు చల్ది అన్నము భుజించెను. [4] లంపులు మేయుచున్ = దొంగమేత మేయుచును [5] అటవీవీథిన్ = అడవిమార్గమున [6] కోమల...త్సాహంబుతో = లేఁతనైన గడ్డిమేయుటయందు గలిగిన యాశవలని యుత్సాహముతో

*తా. శిరస్సునందు నెమలికుంచెను ధరించి, చెవులమీఁది నుండి జులపాలు వ్రేలాడుచు రత్నాలహారములు మెడనిండ ధరించినవాఁడై, కమలములవంటి హస్తములందు బంగారు నీరుపూసిన కఱ్ఱను ధరించి, రెండవ హస్తమునందు చల్ది అన్నపుమూటను బట్టుకొని శ్రీకృష్ణపరమాత్మ పసిమూఁపలకుచెదసటచు అడవులకు బహుమార్గము పోయెను.

నిచ్చోట మంద గొన్నవి
యిచ్చోఁ బాసినవి జాడ ♦ యిదె యిదె యనుచున్. 505

కం. కంజదళాక్షుఁడు వెదకెను
[1]గొంజక లేఁగల నపార ♦ [2]గురుతృణవనికా
పుంజంబుల భీకరమ్ముగ
కుంజంబులఁ దరుల గిరులఁ ♦ గోఁకుల నడులన్. 506

వ. అంత 507

శా. బాలుండై యితఁ డాయఘాసురుని ద్రుం ♦ పన్ బాలురం గ్రేపుల
న్నేలీలన్ బ్రతికించె నో కొ- భువి ♦ నూహింపం గడుం జోద్య మం
చాలో నంబుజసంభవుండు సని [3]మా♦యాబాలు శంభద్బలం
బాలోకింపఁ దలంచి దాఁచె నొకచో ♦ నాలేఁగలన్ బాలురన్. 508

వ. ఆసమయంబున దూడలు పోయినజాడ యెఱుంగక తప్పి యప్పద్మలోచనుం డెప్పటి కొలంకుకడకు వచ్చి యచ్చోట నెచ్చెలులం గానక వారిం జీరి లేకుండుట నిశ్చయించి గోవిందుండు [4]విశ్వవిదుండు గావున నిది విరించి [5]మొఱంగని యెఱింగి తిరిగి పోవుచు. 509

శా. వంచింపం బని లేదు బ్రహ్మ కిచటన్ ♦ వత్సంబులన్ బాలురన్
వంచించెం గను బ్రామి తన్ను మఱలన్ ♦ వంచించు టాశ్చర్యమే
వంచింపన్ మన కేల తెచ్చుటకు నై ♦ వర్ధించు బ్రహ్మాండము
ల్వంచింపన్ మఱలింప నేర్చు హరి లీ♦లన్ మందహాసాస్యుఁడై. 510

క. గోపాలసుతులు లేరని గోపికలకుఁ జెప్ప నేల ♦ గోపాలకులున్
గోపికలు నలర బాలుర క్రేపులరూపములనేఁ జ♦రించెద ననుచున్.

మ. కరముల్ పాదములున్ శిరంబు [6]లవల♦గ్నంబుల్ ముఖంబుల్ భుజాం
తరముల్ ముక్కులు గన్నులున్ శ్రవణముల్ ♦దంతాదులున్ [7]దండకాం
బర స్రగ్వేణువిషాణభూషణ వయో ♦ భాషాగుణాఖ్యాన నూ
త్నరతల్ వీడ్వడకుండఁ దాల్చె విభుఁడా ♦ [8]వత్సార్భకాకారముల్

(1) కొంజక = వెనుదీయక. (2) గురుతృణవనికాపుంజంబులున్ = విపరీతమైన (దట్టమైన) గడ్డిగల అడవి సమూహములలోను. (వెదకెను.) (3) మాయాబాలు = కపటబాలకుఁడైన శ్రీకృష్ణుని. (4) విశ్వవిదుండు = సర్వము తెలిసినవాఁడు. (5) మొఱంగు = వంచన. (6) అవలగ్నంబులు = నడుములు. (7) దండకాంబర.....రతల్ = చేతికఱ్ఱలు, దుస్తులు, పూలమాలికలు, పిల్లనగ్రోవి, కొమ్ములు, నగలు, వయస్సు, భాష, గుణములు, నామములు, క్రొత్తవగు బాలక్రీడలు. (8) ఆ వత్సార్భకాకారముల్ = ఆదూడలయు, బాలురయు నాకారములను.

క. రూపంబు లెల్లనగు బహురూపకుఁ డిటు బాలవత్సరూపంబులతో
నేపారు టేమి చోద్యము రూపింపఁగ నతని కితర రూపముగలదే.

క. మరలుపు మనియెడు కర్తయు
మరలించు కుమారకులును ♦ మరలెడి క్రేపుల్
పరికింపఁ దానయై హరి
మరలం జనె లీలతోడ ♦ మందకు నధిపా. 515

వ. ఇట్లు బాలవత్సరూపంబుల విహరించుచు మందకు వచ్చి వారివారి దొడ్ల నయ్యైవత్సంబుల [1]ముందటికందువల నిలిపి తత్తద్బాలరూపంబుల నందజగృహంబులం బ్రవేశించి వేణునాదంబులు సేసిన. 515

చ. కొడుకుల వేణునాదములు ♦ గొబ్బున వీనులకుం బ్రియంబులై
ముడివడ లేచి యెత్తికొని ♦ మూర్కొని తల్లులు గౌఁగిలించుచుం
[2]జడిగొనఁ జేపువచ్చి తమ ♦ చన్నులయందు [3]సుధాసమంబులై
వెడలెడిపాలు నిండుకొను ♦ వేడుక నిచ్చిరి తత్సుతాళికిన్. 516

వ. మఱియుఁదల్లు లుల్లంబులం బెల్లుగ వెల్లిగొనిన వేడుకలం దమ నందనులకు నలుంగు లిడి మజ్జనంబులు గావించి గంధంబు లలంది తొడవులు దొడిగి నిటల ఫలకంబుల రక్షాతిలకంబులు వెట్టి సకల పదార్థసంపన్నంబు లయిన యన్నంబు లొసంగి సన్నములు గాని మన్ననలు సేసిరి. 517

క. ఏతల్లుల కేబాలకు లేతెఱఁగునఁ దిరిగి ప్రీతి ♦ నెసగింతురు మున్నాతల్లుల కాబాలకు లాతెఱఁగునఁ బ్రీతిఁ జేసి ♦ రవనీనాథా. 518

వ. ఆ సమయంబున. 519

ఉ. పాయని వేడ్కతో నునికి ♦ పట్టులకుం జని గోవు లెల్ల నం
బా యని చీరి హుమ్మనుచుఁ ♦ బైకొని మూర్కొని [4]పంచితిల్లి పె
ల్లై యతిరేకమై పొదుగు ♦ లం దెడలేక స్రవించుచున్న పా
లామెడ నాకుచున్ సుముఖ ♦ లై యొసఁగెన్ [5]నిజవత్సకోటికిన్.

క. వ్రేతలకును గోవులకును
మాతృత్వము చాలఁ గలిగె ♦ మఱి మాధవు పై

(1) ముందటికందువలన్ = మునుపటిచోటులందు (2) జడిగొనన్ = మిక్కిలి అతిశయముగా. (3) సుధాసమంబులై = అమృతమును బోలినవై. (4) పంచితిల్లి = మాత్రమును విడిచి. (5) నిజవత్సకోటికిన్ = తనదూడల సమూహమునకు.

మాతలని వారియు నిర్మల
కౌతూహల మొప్పఁ దిరిగెఁ ♦ గడుబాల్యమునన్. 521

ఆ. ఘోషజనుల కెల్లఁ ♦ గుఱ్ఱలపై వేడ్క
పూఁటపూఁట కెలమిఁ ♦ బొటకరించె
నిచ్చ క్రొత్త యగుచు ♦ నీరజాక్షునిమీఁద
వేడ్క దమకుఁ దొల్లి ♦ వెలసినట్లు. 522

వ. ఇట్లు కృష్ణుండు బాలవత్సరూపంబులు దాల్చి తన్నుఁదాన రక్షించు కొనుచు మందను వనంబున నమందమహిమంబున నొక్కయేఁడు క్రీడించె, నాయేఁటికి నైదాఱుదినంబులు కడమపడి యుండ నం దొక్కనాఁడు బలభద్రుండును దానును వనంబునకుం జని మంద చేరువ లేఁగలమేప నతిదూరంబునం గోవర్ధన శైలశిఖరంబున ఘాసం బులు గ్రాసంబులు గొనుచున్న గోవు లా లేఁగలం గని. 523

చ. ముదమున హుంకరించుచును ♦ మూఁపులపై మెడలెత్తిచాచుచున్
బదములు నాల్గు రెండయిన ♦ బాగునఁ గూడఁగఁబెట్టి దాటుచున్
వదనములన్ విశాలతర ♦ వాలములన్ వడినెత్తి పాఱి యా
మొదవులు సన్నులం గుడిపె♦మూఁతుల క్రమింగెడిభంగి నాకుచున్.

వ. అంత నా గోపకులు గోవుల వారింప నలవిగాక దిగ్గున నలకతోఁడి సిగ్గు లగ్గలంబుగ [1]దుర్గమమార్గంబున వానివెంట నంటివచ్చి లేఁగల మేపుచున్న కొడుకులం గని. 525

ఉ. అయ్యలఁ గంటిమంచుఁ బుల ♦ కాంకురముల్ వెలయంగఁగుఱ్ఱలం
జయ్యన డాసి యెత్తుకొని ♦ సంతస మందుచుఁ గౌఁగిలించి తా
రయ్యెడనౌదలల్ మనము ♦ లారఁగ మూర్కొని ముద్దుసేయుచున్
దయ్యు మెఱుంగు గోపకులు ♦ దద్దయు నుబ్బిరి నిబ్బరంబునన్.

వ. ఇట్లు బాలకాలింగనంబుల నానందబాష్పపూరితనయను లై గోప కులు గోవుల మెలుచుకొని తలంగి చన వారలం జూచి బలభద్రుండు దనలో నిట్లని తలంచె. 527

[1] దుర్గమమార్గంబున = చొర నలవిగాని యాగోవులు వచ్చిన మార్గంబున.

సీ. చన్ను మానిన యట్టి ♦ [1]శాబకశ్రేణిపై
గోగణంబులకును ♦ గోపకులకు
నిబ్భంగి వాత్సల్య ♦ మెబ్భంగి నుదయించె
హరిఁ దొల్లి మన్నించు ♦ నట్లు వీరు
మన్నించు చున్నారు ♦ మమతఁ జేయుచుఁ బ్రీతి
నంబుజాక్షునిఁ గన్న ♦ యట్ల నాకుఁ
బ్రేమమయ్యెడి డింభ ♦ బృందంబుఁ గనుగొన్న
నిది మహాద్భుత మెందు ♦ నెఱుఁగరాదు
తే. మనుజదైవత దానవ ♦ మాయ యొక్క-
కాక నాభర్త యగు చున్న ♦ కమలనయను
మాయయో కాక యితరుల ♦ మాయ నన్నుఁ
గలఁప నోపదు విభుమాయ ♦ గాఁగ నోపు. 528

క. అని మున్ను [2]ముగ్ధుఁ డయ్యును
దనయందుల దివ్యదృష్టిఁ ♦ దప్పక బుద్ధిం
దన చెలికాండ్రను గ్రేపుల
వనజాక్షుం డనుచుఁ జూచె ♦ వసుధాధీశా. 529

వ. ఇట్లు విజ్ఞానదృష్టిం జూచి యెఱింగియు నమ్మక బలదేవుండు గొందలం పడుచుఁ గృష్ణుం జూచి మహాత్మా తొల్లి యెల్లక్రేపులును ఋషుల యంశం బనియును గోపబాలకులు [3]వేల్పులయంశం బనియును దోఁచు చుండు, నిపుడు వత్సబాలకసందోహంబు సందేహంబు లేక నీవ యని తోఁచు చున్న దిదియేమి యని యడిగిన నన్నకు నున్నరూపు వెన్నుండు మన్నన సేసి క్రన్నన యెఱింగించె నతండు నెఱింగె, నివ్విధంబున హరి బాలవత్సంబులు దానయై సంచరించిన యేఁడు విరించికిఁ దనమానంబున నొక్క-త్రుటిమాత్రం బయిన విరించి చనుదెంచి వత్సబాలకుండైన కృష్ణబాలకుంజూచి వెఱంగుపడి యిట్లని వితర్కించె. 530

---

[1] శాబకశ్రేణిపై = పిల్లలయొక్క- పంక్తిమీఁద (2) ముగ్ధుఁడు = ఏమియుఁ దెలియనివాఁడు. (3) వేల్పులయంశంబనియుఁ = బ్రహ్మాదిదేవతల అంశములవలనఁ గలిగినవారనియును.

శా. మందం గల్గు సవత్సబాలకులు నా ♦ మాయాగుహాసుప్తులై
యెందుం బోవరు లేవ రిప్పుడును వే ♦ ఱే చేయ నా కన్యు లొం
డెందున్ లేరు విధాత నేఁ బరులు వీ ♦ రెవ్వార [1]లెట్లైరొకో
యెం దేతెంచిరొ కృష్ణుతో మెలఁగువా ♦ రేడయ్యెడిన్ నేఁటికిన్. 531

మత్తకోకిలము

బ్రహ్మసంపునఁ గాని పుట్టదు ♦ ప్రాణిసంతతి యెప్పుడున్
బ్రహ్మనొక్కఁడ గాని వేఱొక ♦ బ్రహ్మ లేఁడు సృజింపఁగా
బ్రహ్మ నేను సృజింప నొండొక ♦ బాలవత్సకదంబ మే
బ్రహ్మ మందు జనించె నొక్కట ♦ బ్రహ్మవహా నది చూడఁగాన్.

వ. అని యిట్లు సకలంబును సుకరంబుగ నెఱ వెఱింగెడి [2]నెఱవాది ముదుక యెఱుకఁ గల ప్రౌఢ వెఱంగుపడి గ్రద్దనఁ బెద్దప్రొద్దు దద్దయుం దలపోసి కర్జంబు మందల యెఱుంగక [3]కొందలంపడుచు నాందోళనంబున. 533

క. మోహము లేక జగంబుల
మోహింపఁగఁ జేయ నేర్చి ♦ మొనసిన విష్ణున్
మోహింపించెద ననియెడు
మోహమున విధాత దాన ♦ మోహితుఁడయ్యెన్. 534

తే. పగలు [4]ఖద్యోతరుచి చెడు ♦ పగిది రాత్రి
మంచు చీఁకటిలీనమై ♦ [5]మాయుమాడ్కి
విష్ణుపై నన్యమాయలు ♦ విశదమగునె
చెడి [6]నిజేశులగరిమంబుఁ ♦ జెఱచుఁగాక. 535

వ. మఱియును. 536

క. పుట్టితి బుద్ధి యెఱింగితిఁ
బుట్టించితి జగము సగము ♦ వోయెన్ బ్రాయం

---

(1) ఎట్లైరొకో = వీరు ఏవిధముగా పుట్టిరో, (2) నెఱవాదిముదుక = చతురత్వము గల ముసలివాఁడైన. (3) కొందలంపడుచు = సంకటపడుచు (4) ఖద్యోతరుచి = మినుగుఱుఁబురుగుల కాంతి. (5) మాయుమాడ్కిన్ = నశించునట్లును (6) నిజేశుల గరిమంబున్ = తమ తమ నేలినవారియొక్క గౌరవమును.

బిట్టి వినూతనసృష్టులు
పుట్టుట లే దార యిట్టి ♦ [1]బూమెలు భూమిన్. 537

వ. అని యిట్లు దలవాకిట వాణి గలపోఁడిమి వాఁడిమిచే వాసికెక్కిన నలుమొగంబుల తక్కరిగొంటు పెనుదంట పలువెంటలయిన మనంబున వితర్కించి విచారించునెడ నతండు గనుంగొనుచుండ నబ్బాలకులు మేఘశ్యాములును హారకుండల కేయూరకిరీట వనమాలికాభిరాములును శ్రీవత్సమంగళాంగదనూపుర కనక కటక కంకణ కటి ఘటిత[2]కాంచీగుణో[3]ద్దాములును నాపాదమస్తక తులసీదళ దాములును [4]విలసదంగుళీయక స్తోమములును శంఖచక్రగదాకమల హస్తులును జతుర్భుజప్రశస్తులును బీతకౌశేయవాసులును జంద్రికాధవళహాసులును కరుణాకటాక్ష వీక్షణ విలాసులును రవికోటిభాసురులును ననంత సచ్చిదానంద రూపమహితులును నణిమాది గుణోపేతులును విజాతీయ సంభేదరహితులును శ్రీమన్నారాయణ ప్రతిమాన విగ్రహ స్వరూపులును నయి తమకుఁ బరతంత్రులగుచు నృత్తగీతాది సేవావిశేషంబులకుం జొచ్చి మెలంగుచు మూర్తిమంతంబు లయిన బ్రహ్మాది చరాచరంబులు [5]నణిమాదిసిద్ధులును మాయాప్రముఖంబులైన శక్తులును మహదాది చతుర్వింశతితత్త్వంబులును గుణక్షోభ కాలపరిణామ హేతు సంస్కారకామ కర్మగుణంబులును సేవింప వేదాంతవిదులకైన నెఱుంగరాని తెఱంగున మెఱయుచుఁ గానంబడిన వారలం గనుంగొని. 538

ఉ. బాలురఁ గంటి నామదికిఁ ♦ బాసినవారిని మున్నువారినేఁ
బోలఁగఁ జూచు నంతటన ♦ భూరినిరర్గళ దుర్గమప్రభా
జాలముతోడఁ జూపులకుఁ ♦ జాలమిఁ దెచ్చుచు నున్నవార లే
మూలమొ మార్గ మెయ్యదియొ ♦ మోసమువచ్చెఁగదే విధాతకున్.

వ. అని సకలేంద్రియంబులకు వెక్కసం బయిన ప్రసక్తి 540

---

(1) ఇట్టి బూమెలు = ఇటువంటి మాయవేషములు. (2) కాంచీగుణ = మొలనూలిచేత. (3) ఉద్దాములును = అధికులైనవారును. (4) విలస .....ములును = ప్రకాశించుచున్న ఉంగరములయొక్క సమూహములు కలవారును. (5) అణిమాదిసిద్ధులును = అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అనెడి అష్టమహదైశ్వర్యములును.

ఉ. ఏ పరమేశు తేజమున ♦ నీ సచరాచర మైన లోక ము
దీపిత మయ్యె నట్టి విభు ♦ తేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా
నోపక పారవశ్యమును ♦ నొందుచు [1]సంస్తిమితాఖిలేంద్రియుం
డై పరమేష్ఠి మైమఱచె ♦ నప్పుడు చిత్రపురూపు కైవడిన్. 541

వ. ఇట్లు మాయాతీతుండును వేదాంతవిజ్ఞానదుర్లభుండును స్వప్రకాశా నందుండును నైన తనబాహుళ్యంబుఁ జూచి నివ్వెఱపడిన బ్రహ్మం గని యీశ్వరుండును. 542

శా. బాలుండై [2]చతురాననుండు తన యీ ♦ బ్రహ్మాభిమానంబునన్
లోలుండై మతి దప్పి నామహిమ యా ♦ లోకింప నేతెంచెఁ దా
నాలోకింపఁగ నెంతవాఁడనుచు మా ♦ యాజాలమున్ విప్పి త
ల్లీలారూపము లెల్ల దాఁచె నటఁ గే ♦ లీచాతురీధుర్యుఁడై. 543

వ. అంతలోన నజీవుండు సజీవుండైన తెఱంగున నెనిమిది కన్నులు గల వేలుపుగమికాఁడు తీఱి తెప్పిఱి కాలుఁగేలుఁ గదలించి చెచ్చెరం గన్నులు విచ్చిచూడ సమర్థుండై ముందటఁ గని వెనుకఁ జూచి దివి విలోకించి దిక్కులు వీక్షించి యెల్లయెడలం గలయ దర్శించి తన పురోభాగంబున హరి సంచరించుటం జేసి జాతివైరంబులు లేని నర పక్షి మృగాదులకు నాటపట్టయి సిరి గలిగి కామక్రోధాదిరహితు లకు జీవనంబైన బృందావనంబుం బొడగాంచి యందు. 544

సీ. తన కన్యములు లేక ♦ [3]తనరారి [4]ముమ్మూర్తుల
విభుఁ డయ్యుఁ గ్రేపుల ♦ వెదకువాని
నఖిలజ్ఞుఁడై యొక్కఁ ♦ డయ్యు నజ్ఞాకృతిఁ
జెలికాండ్రఁ బెక్కండ్రఁ ♦ జీరువాని
బహిరంతరాద్యంత ♦ భావశూన్యుం డయ్యు
నంతంత నడుగు చో ♦ ప్పరయువాని

---

[1] సంస్తిమిత = శబ్దస్పర్శాదివ్యాపారశూన్యములైన, అఖిల = సమస్తములైన, ఇంద్రియుండై = పదునాలుగింద్రియములు గలవాడై [2] చతురాననుండు = బ్రహ్మ. [3] తనరారి = ఒప్పి. [4] ముమ్మూర్తులవిభుఁడు = సృష్టిస్థితి సంహారములనుచేయునట్టిత్రిమూర్తులకును బ్రభువు.

[1]గురుగభీరుం డయ్యుఁ ♦ గురువులు వాఱుచు
నట్టిట్టుఁ బాతర ♦ లాడువాని

ఆ. జాతిరహితుఁ డయ్యుఁ ♦ జతుర గోపార్భక
భావమెల్ల నచ్చు ♦ వడిన మేటి
చెలువువాని హస్త ♦ శీతాన్నకబళంబు
వానిఁ గాంచె నపుడు ♦ [2]వాణిమగఁడు. 545

వ. కని సంభ్రమించి విరించి [3]రాయంచ డిగ్గ నుఱికి కనకదండసుకుమారంబైన శరీరంబుతోడ నేలం జాఁగిలంబడి మణిగణసుప్రకాశంబులైన తన కిరీటశిఖర ప్రదేశంబు లా కుమారుని పాదపద్మంబులు [4]మోప మ్రొక్కి [5]తోరంబులగు నానంద బాష్పజలపూరంబుల నడుఁగులు గడిగి మఱియును. 546

క. అడుఁగులపైఁ బడు లేచుం
బడుఁ గ్రమ్మఱ లేచు నిట్లు ♦ భక్తిన్ మును తాఁ
[6]బొడగనిన పెంపుఁ దలఁచుచు
[7]దుడుకని మహిమాబ్ధి నజుఁడు ♦ దుడు కడఁచె నృపా. 547

వ. అంత మెల్లన లేచి నిలుచుండి నయనారవిందంబులు దెఱచి గోవిందుని సందర్శించి చతుర్ముఖుండు ముఖంబులు వంచి కృతాంజలియై డగ్గుత్తిక యిడుచు నేకచిత్తంబునఁ జతుర్ముఖంబుల నిట్లనిస్తుతియించె

సీ. [8]శంపాలతికతోడి ♦ జలదంబు కైవడి
[9]మెఱుఁగుటొల్లియతోడి ♦ మేనివానిఁ
గమనీయమృదులాన్న ♦ కబళ [10]వేత్ర విషాణ
వేణుచిహ్నంబుల ♦ వెలయువానిఁ

(1) గురుగభీరుండు = మిక్కిలి గాంభీర్యముగలవాఁడు (2) వాణిమగడు = సరస్వతికి మగఁడైన బ్రహ్మ. (3) రాయంచ డిగ్గ నుఱికి = రాజహంస వాహనమువీఁదనుండి భూమి మీఁదకు దుమికినవాఁడై. (4) మోపన్ మ్రొక్కి = తగులునట్లుగా నమస్కరించి (5) తోరంబులు = అధికములు (6) పొడగనిన పెంపున్ = చూచిన మహిమాతిశయమును. (7) దుడుకని = దుష్టుని, (8) శంపా... కైవడిన్ శంపాలతికతోడి = మెఱుపు తీగఁతోఁ గూడుకొన్న మేఘమువలెనే. (9) మెఱుఁగు టొల్లియతోడి మేనివానిన్ = మెఱుఁగులు దేఱుచున్న బంగారుపచ్చడముతోఁ గూడినదేహము గలవానిని (10) వేత్ర = బెత్తము; విషాణ = కొమ్ము.

[1]గుంజావినిర్మిత ♦ కుండలంబులవాని
శిఖిపింఛవేష్టిత ♦ శిరమువాని
వనపుష్పమాలికా ♦ వ్రాతకంఠమువాని
నలినకోమల చర ♦ ణములవాని

ఆ. కరుణ గడలుకొనిన ♦ కడగంటివాని గో
పాలబాలుభంగిఁ ♦ బరఁగువాని
నగుమొగంబువాని నను ♦ గన్న తండ్రిని
నిను భజింతు మ్రొక్కి ♦ నీరజాక్ష. 549

మ. నను మన్నించి భవజ్జనంబులకు నా ♦ నందంబు నిండించు నీ
తనురూపం బిదె నామనంబున కచిం ♦ త్యం బయ్యె నీయుల్లస
ద్ఘనవిశ్వాకృతి నెవ్వఁడోపు నెఱుఁగం ♦ గైవల్యమై యొప్పు నా
త్మనివేద్యం బగు నీదువైభవము చం ♦ దంబెట్టిదో యీశ్వరా. 550

క. విజ్ఞానవిధము లెఱుఁగక
తజ్జ్ఞులు నీవార్తఁ జెప్పఁ ♦ దనువాఙ్మనముల్
యజ్ఞేశ నీకు నిచ్చిన
యజ్ఞులు నినుఁబట్టి గెలుతు ♦ రజితుఁడ వైనన్. 551

క. శ్రేయములు గురియు భక్తిని
జేయక కేవలము బోధ ♦ సిద్ధికిఁ దపముం
జేయుట విఫలము పొల్లున
నాయము సేకుఱునె తలఁప ♦ నధికంబైనన్. 552

క. నిజముగ నిన్నెఱుఁగఁగ మును
నిజవాంఛలు నిన్నుఁ జేర్చి ♦ నీకథ వినుచున్
నిజకర్మలబ్ధభక్తిఁ
సుజనులు [2]నీమొదలిటెంకిఁ ♦ జొచ్చి రధీశా. 553

సీ. [3]విక్రియాశూన్యమై ♦ [4]విషయత్వమును లేని
దగుచు నాత్మాకార ♦ మై తనర్చు

(1) గుంజావినిర్మిత=గురివిందలచేత చేయఁబడిన. (2) నీమొదలిటెంకికి=నీదైన ముఖ్యస్థానమును (3) విక్రియాశూన్యమై=సంకోచవికాసము లను వికారములు లేనిదై (4) విషయత్వమును = శబ్దస్పర్శరూపరసగంధాది విషయానుభవమును.

నంతఃకరణ మొక్క ♦ యధికసాక్షాత్కార
విజ్ఞానమునఁబట్టి ♦ వే ఱొరులకు
నెఱుఁగంగ రానిదై ♦ యేపారి యుండుటఁ
జేసి నీ నిర్గుణ ♦ శ్రీవిభూతి
బహిరంగవిధులఁ ♦ బాఱక తిరము నై
[1]యమలంబు లగు నింద్రి ♦ యములచేత
ఆ. నెట్టకేల కైనఁ నెఱుఁగంగ నగుఁగాని
గుణవిలాసి వగుచుఁ ♦ గొమరుమిగులు
నీ గుణవ్రజంబు ♦ నేర రా దెఱుఁగంగ
నొక్కమితము లేక ♦ యుంట నీశ. 554

క. తారాతుషారశీకర
భూరజముల కైన లెక్క ♦ బుధు లిడుదురు భూ
భారావతీర్ణ కరుఁ డగు
నీ రమ్యగుణంబు లెన్న ♦ నేర [2]రగణ్యా. 555

శా. ఏ వేళంగృపఁ జూచు నెన్నఁడు హరి ♦ యీక్షింతు నం [3]చాఢ్యుఁడై
నీవెంటం బడి తొంటికర్మచయముల్ ♦ నిర్మూలముం జేయుచున్
నీ వాఁడై తనువాఙ్మనోగతుల ని ♦ న్సేవించు విన్నాణి మో
కైవల్యాధిప లక్ష్మి నుద్దవడిఁ దాఁ ♦ గైకొన్నవాఁ డీశ్వరా. 556

ఉ. మాయలు గల్గువారలను ♦ మాయలఁబెట్టెడి ప్రోడ నిన్ను నా
మాయఁ గలంచి నీ మహిమ ♦ మానముఁ జూచెద నంచు నేరమిం
జేయఁగఁ బూనితిం గరుణ ♦ సేయుము కావుము యోగిరాజవా
గ్గేయ దవాగ్నిఁ దజ్జనిత ♦ కీలము గెల్చి వెలుంగ నేర్పునే. 557

సీ. సర్వేశ [4]నే రజో ♦ జనితుండ మూఢుండ
ప్రభుఁడ నే నని వెఱ్ఱి ♦ ప్రల్లదమున
గర్వించినాఁడను ♦ గర్వాంధకారాంధ
నయనుండఁ గృపఁజూడు ♦ ననుఁ బ్రధాన

---

(1) అమలంబులు = నిర్మలములు - రాగద్వేషాదులు లేని, (2) అగణ్యా = అనుమానము ప్రత్యక్షము మొదలైన అష్టప్రమాణములచేతఁ బ్రమాణింప శక్యము కానివాఁడా, (3) ఆఢ్యుఁడై = అధికాసక్తి గలవాఁడై. (4) నే రజోజనితుండఁ = నీ సంబంధమైన ఘోరవృత్తియును, మధ్యమమునైన రజోగుణమువలనఁ బుట్టినవాఁడను.

మహదహంకృతినభో ♦ మరుదగ్నిజలభూమి
పరివేష్టితాండకుం ♦ భంబులోన
నేను జేనలమేన ♦ నెనయు నే నెక్కడ
నీదృగ్విధాండంబు ♦ లెఱ కైన

తే. సంఖ్య సేయంగ రానివి ♦ సంతతంబు
నోలిఁ బరమాణువులభంగి ♦ నోడలి రోమ
వివరములయందు వర్తించు ♦ విపులభాతి
[2]నెనయుచున్న నీ వెక్కడ ♦ నెంత కెంత. 558

తరలము.

కడుపులోపల నున్న పాపఁడు ♦ గాలఁ దన్నినఁ గిన్నెతో
నడువఁ బోలునె క్రాఁగి తల్లికి ♦ నాద్య సన్నము దొడ్డనె
యడఁగి కారణకార్యరూపము ♦ నైన యీ సకలంబు నీ
కడుపులోనిది గాదె పాపఁడఁ ♦ గాక యే మతి యెవ్వఁడన్. 559

క. భూరిలయ జలధి నిద్రిత నారాయణ నాభికమల ♦ నాళమున నజుం
డారయఁ బుట్టె ననుట నిజ మో రాజీవాక్ష పుట్టె ♦ నోటు తలంపన్.

సీ. నలినాక్ష నీ వాది ♦ నారాయణుండవు
జలము నారము జీవ ♦ చయము నార
మందు నీ వుంట నీ ♦ యం దవి యుంటను
నారాయణుం డను ♦ నామమయ్యె
సకలభూతములకు ♦ సాక్షి వధీశుండ
వబ్ధి నిద్రించు నా ♦ రాయణుండ
నీ మూర్తి యది నీకు ♦ నిజమూర్తి యనరాదు
నళిననాళము త్రోవ ♦ నడచి మున్ను

తే. కడఁగి నూరేండ్లు వెదకి నేఁ ♦ గాన నయితి
నేకదేశస్థుడవు గావ ♦ నేకరుచివి
జగములో నుందు నీ లోన ♦ జగములుండు
నరుదు నీ మాయ నెట్లైన ♦ నగుచునుండు. 561

(1) ఈ దృగ్విధాండంబులు = ఇట్టి బ్రహ్మాండములు (2) ఎనయుచున్న నీవు = కూడి యుండునట్టి నీవు.

మ. విను మో యీశ్వర వేల్పులన్ వెలుఁగు నీ ♦ విశ్వంబు నీ మాయఁగా
క నిజంబైన యశోద యెట్లు గనియెం ♦ గన్నార నీ కుక్షిలోఁ
గనెఁ బో క్రమ్మఱఁ గాంచెనే [1]భవ దపాం ♦ గ శ్రీఁ బ్రపంచంబు చ
క్కన లోనా వెలియాను లోను వెలియుం ♦ గాదేఁ దదన్యాంబగుణ్.

మ. ఒకఁడై యుంటివి బాలవత్సములలో ♦ నొప్పారి తీ వంతటన్
[2]సకలోపాసితులా చతుర్భుజులు నై ♦ సంప్రీతి నే గొల్వఁగాఁ
బ్రకటశ్రీ గలవాఁడ వైతివి మఱిన్ ♦ బ్రహ్మాండముల్ చూపి యొ
ల్లక యిట్లొక్కఁడ వైతి నీ వివిధ లీ ♦ లత్వంబుఁ గంటిం గదే. 563

క. ఎఱిఁగిన వారికిఁ దోఁతువు
నెఱిఁ బ్రకృతిం జేరి జగము ♦ నిర్మింపఁగ నా
తెఱఁగున రక్షింపఁగ నీ
తెఱఁగునఁ బ్రహరింప రుద్రు ♦ తెఱఁగున నీశా. 564

వ. అదియునుం గాక. 565

క. జలచర మృగ సురముని నర
కులముల జన్మించి తీవు ♦ కుజనులఁ జెఱుపన్
జెలిమిని సుజనుల మనుపను
దలపోయఁగ రాదు నీ వి ♦ ఘంబు లనంతా. 566

ఆ. మ్రబ్బు గొలిపి యోగ ♦ మాయ నిద్రించిన
యో పరాత్మ భూమ ♦ యోగిరాజ
యే తెఱంగు లెన్ని ♦ యెంత యెచ్చోట నీ
హేల లెవ్వఁ డెఱుఁగు ♦ నీశ్వరేశ. 567

సీ. అదిగాన నిజరూప ♦ మనరాదు కలవంటి
దై బహువిధదుఃఖ ♦ మై విహీన
సంజ్ఞానమై యున్న ♦ జగము సత్సుఖబోధ
తనుఁడవై తుదిలేక ♦ తనరు దీవు
మాయచేఁ బుట్టుచు ♦ మనుచు లేకుండుచు
నున్న చందంబున ♦ నుండు చుండు

(1) భవదపాంగశ్రీన్ = నీ కడగంటిచూపుయొక్క ప్రకాశముచేత. (2) సకలోపా సితులా = సకలప్రాణులచేత నాశ్రయింపఁబడినవారగు.

నొకఁడ వాత్మకుఁ బిత • రోపాధిశూన్యుండ
వాద్యుండ [1]వమృతుండ • [2]వక్షరుండ
ఆ. [3]వద్వయుండవును స్వ • యంజ్యోతి వాపూర్ణుఁ
డవు పురాణపురుషుఁ • డవు నితాంత
సౌఖ్యనిధివి నిత్య • సత్యమూర్తివి నిరం
జనుఁడ వీవు దలఁపఁ • జనునె నిన్ను. 568

వ. దేవా యిట్టి నీవు జీవాత్మస్వరూపుండవును సకలాత్మలకు నాత్మ వైన పరమాత్మ స్వరూపకుఁడవు నని యెవ్వ రెఱుంగుదురు వారు గదా గురు వనియెడు దినకరునివలనఁ బ్రాప్తం బైన యుపనిషదర్థ జ్ఞానం బను సునేత్రంబునం జేసి సంసారమిథ్యాసాగరంబుఁ దరించిన చందంబున నుండుదురు. [4]రజ్జు వని యెఱింగెడి యెఱుక లేకుండ నయ్యెఱుంగమి నది సర్పరూపం బయి తోఁచినపిదప నెఱింగినవారి వలన రజ్జువు రజ్జు వని యెఱుంగుచుండ సర్పరూపంబు లేకుండు కైవడి యప్పరమాత్మ యని యెవ్వ రెఱుంగరు వారి కయ్యెఱుంగమి వలన సకలప్రపంచంబు గలిఁగి తోఁచు. నాత్మ యప్పరమాత్మ యని యెవ్వ రెఱుంగుదురు. వారి కయ్యెఱుకవలనఁ బ్రపంచంబు లేకుండు, నజ్ఞానసంభావిత నామకంబులైన సంసారమోక్షంబులు జ్ఞానవిజ్ఞానంబులలోనివి గావు. కావున సవితృన కహోరాత్రంబులు లేని తెఱంగునఁ బరిపూర్ణజ్ఞానమూర్తి యగు నాత్మయందు నజ్ఞానంబును లేమిని బంధంబును, సుజ్ఞానంబు లేమిని మోక్షంబును లే వాత్మ వైన నిన్ను దేహాదికం బని తలంచియు దేహాదికంబు నినుఁగాఁ దలంచియు నాత్మ వెలి నుండు నంచు మూఢులు మూఢత్వంబున వెదకుచుందురు. వారి మూఢత్వంబుఁ జెప్పనేల? బుద్ధిమంతులై పరతత్త్వంబుగాని జడంబును నిషేధించు చున్న సత్పురుషులు తమ శరీరంబులయందు నిన్నరయు చుందు రది గావున. 569

శా. దేవా నీ చరణప్రసాదకణ ల • బ్ధిం గాక లేకున్న నొం
డే వెంటం జను నీ మహామహిమ నూ • హింపంగ నెవ్వారికిన్

(1) అమృతుండవు = చావులేనివాఁడవు. (2) అక్షరుండవు = నాశములేనివాఁడవు.
(3) అద్వయుండవు = రెండవ్వ వస్తువు లేనివాఁడవు. (4) రజ్జువు = త్రాడు.

నీవారై చనువారిలో నొకఁడనై ♦ నీకుఁ గొల్చుభాగ్యంబు నా
కీవే యిప్పటి జన్మమం దయిన నొం ♦ డెందైన నో యీశ్వరా.

తరలము. క్రతుశతంబులఁ బూర్ణకుక్షివి ♦ కాని నీ విటు క్రేపులున్
సుతులు నై చనుఁబ్రాలు ద్రావుచుఁ ♦ జొక్కి యాడుచుఁ [1]కౌతుక
స్థితిఁ జరింపఁగఁ దల్లులై విల ♦ సిల్లు గోవుల గోపికా
సతుల ధన్యత లెట్లు సెప్పఁగఁ ♦ జాలువాఁడఁ గృపానిధీ. 571

క. పరిపూర్ణంబుఁ బురాణముఁ
బరమానందంబు నైన ♦ బ్రహ్మమె చెలికాఁ
డరు దరుదు [2]నందఘోష
స్థిరజనముల భాగ్యరేఖ చింతింపంగన్.

సీ. [3]ఏకాదశేంద్రియా ♦ ధీశులు చంద్రాదు
లేను [4]ఫాలాక్షుండు ♦ నిట్లు గూడఁ
బదుమువ్వురము నెడ ♦ పడక నింద్రియపాత్ర
ముల నీ పదాంభోజ ♦ ముల మరంద
మమృతంబుగాఁ ద్రావి ♦ యమర నేకైకేంద్రి
యాభిమానుల మయ్యు ♦ [5]నతికృతార్థ
భావుల మైతిమి ♦ [6]పరఁగ సర్వేంద్రియ
వ్యాప్తులు నీమీఁద ♦ వ్రాల్చి తిరుగు

తే. గోపగోపికాజనముల ♦ గురువిశిష్ట
భాగ్యసంపదఁ దలపోయఁ ♦ బ్రస్తుతింప
నలవిగా దెవ్వరికి నైన ♦ నంబుజాక్ష
భక్తవత్సల సర్వేశ ♦ పరమపురుష. 573

శా. ఏలా బ్రహ్మపదంబు వేదములకున్ ♦ వీక్షింపఁగా రాని ని
న్నీ లోకంబున నీ వనాంతరమునం ♦ దీ మందలోఁ గృష్ణ యుం

(1) కౌతుకస్థితిన్ = కుతూహలముతో, (2) నందఘోష = నందుని మందయందలి, (3) ఏకాదశేంద్రియాధీశులు = జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మానసము లనెడు పదునొకండు ఇంద్రియములకు నధిదేవతలయిన, (4) ఫాలాక్షుండున్ = అహంకారాధిదేవత యైన శివుఁడును, (5) అతికృతార్థభావులము = మిక్కిలిధన్యత్వముగలవారము, (6) పరఁగన్ = ప్రసిద్ధముగా.

[1]చాలాపాది సమస్తభావములు నీ ♦ యందే సమర్పించు నీ
ప్రేలం దొక్కని పాదరేణువులు [2]పై ♦ వేష్టించినం జాలదే. 574

మ. నిను హింసించిన పూతనాదులకు ముక్ ♦ [3]నీమేటిసంకేత మి
చ్చిన నీకుం బురదారపుత్త్రగృహగో ♦ స్త్రీప్రాణదేహాదు లె
ల్లను వంచింపకయిచ్చు గోపకులకుక్ ♦ లక్షింప నేమిచ్చెదో
యని సందేహము దోఁచుచున్నది [4]ప్రప ♦ న్నానీక రక్షామణీ.

క. దేహము కారాగేహము
మోహము [5]నిగళంబు [6]రాగ ♦ ముఖరములు [7]రిపు
వ్యూహములు భక్తితో ని
న్నూహింపని యంతదడవు ♦ నో కమలాక్షా. 576

ఆ. ఆశ్రయించు జనుల ♦ కానందసందోహ
మీఁ దలంచి వివిధ ♦ హేలతోడ
నప్రపంచకుండ ♦ వయ్యుఁ బ్రపంచంబు
వెలయఁజేయు దీవు ♦ విశ్వమూర్తి.

క. ఎఱిఁగినవారి యెఱుంగమి యెఱుఁగమె బహుభాషలేల♦యీశ్వరనీపెం
పెఱుఁగ మనోవాక్కులకుక్ గుఱిసేయంగొలఁదిగాదు♦గుణరత్ననిధీ.

క. సర్వము నీన యెఱుంగుదు సర్వవిలోకనుఁడ వీవ ♦ జగదధిపతివిక్
సర్వాపరాధు నను నో సర్వేశ యనుగ్రహింపు ♦ చనియెదనింకన్.

క. [8]జిష్ణు[9]నిశాటవిపాటన [10]వృష్ణికులాంభోజసూర్య ♦ విప్రామరగో
వైష్ణవసాగరహిమకర కృష్ణా [11]పాషండధర్మ ♦ [12]గృహదావాగ్నీ.

---

(1) ఆలాపాది = ముచ్చటాడుటలు మొదలైన, (2) పైవేష్టించినక్ = మీఁద గ్రమ్ముకొన్నను, (3) నీమేటిసంకేతము = నీదైన పరమపదమును, (4) ప్రపన్నానీకరక్షామణీ = ప్రపన్న = ప్రపత్తిని పొందినవారియొక్క, నీ వేదిక్కని నిన్నే నమ్మిన యేకాంతభక్తుల యొక్క, ఆనీక=సమూహమును, రక్షామణీ=రక్షించువాఁడా, (5) నిగళంబు = సంకెల, (6) రాగముఖరములు = అనురాగము మొదలగునవి, కామము, క్రోధము, లోభము, మదము, మాత్సర్యము మొదలైన దుర్గుణములనుట, (7) రిపువ్యూహములు - శత్రుసేనల బారులు, (8) జిష్ణు = జయశీలుఁడవును, (9) నిశాటవిపాటన - నిశాట = తృణావర్తవత్స బకాసురాదిరాక్షసులను. విపాటన = పడఁగొట్టు వాఁడవును. (10) వృష్ణికులాంభోజసూర్య = వృష్ణివంశమను నెడి కమలమునకు సూర్యుఁడవు (11) పాషండధర్మ = నాస్తికజనుల యొక్క ఆచారములనెడి (12) గృహదావాగ్నీ = ఇంటికి కార్చిచ్చువైనవాఁడా,

వ. దేవా నీకుఁ [1]గల్పపర్యంతంబు నమస్కరించెద నని యివ్విధంబున సంస్తుతించి ముమ్మాఱు వలగొని పాదంబులపైఁ బడి వీడ్కొని బ్రహ్మ దన నెలవునకుఁ జనియె: నతని మన్నించి భగవంతుండైన హరి తొల్లి చెడి తిరిగి వచ్చిన వత్సబాలకులం గ్రమ్మఱం గైకొని [2]పులినంబుకడఁ జేర్చె నిట్లు. 581

క. [3]క్రించుతనంబున విధి దము, వంచించినయేఁడు [4]గోప♦వరనందను లో
క్కించుక కాలంబుగ నీ, క్షించిరి రాజేంద్ర బాల♦కృష్ణునిమాయన్.

ఆ. ఏ మహాత్మమాయ ♦ నీ విశ్వ మంతయు
మోహితాత్మక మగు ♦ మునిఁగియుండు
నట్టి విష్ణుమాయ ♦ నర్భకు లొక్కయేఁ
డెఱుఁగ కుండి రనుట ♦ యేమి వెఱఁగు. 483

వ. అప్పుడు. 584

మ. చెలికాఁడా చనుదెంచితే యిచటికిన్ ♦ సేమంబునం గ్రేపులున్
నెలవుల్ సేరె నరణ్యభూమివలనన్ ♦ నీ వచ్చునందాఁకఁ జ
ల్దులు పేరించుక యెవ్వరుం గుడువ రా ♦ లోకింపు రమ్మంచు నా
జలజాక్షుండు [5]నగన్ భుజించి రచటన్ ♦ సంభాషలన్ డింభకుల్.

వ. ఇట్లు బాలకులతోడఁ జల్ది గుడిచి వారలకు నజగరచర్మంబు సూపుచు వనంబున నుండి తిరిగి. 586

పంచచామరము.

ప్రసన్న పింఛమాలికా ప్ర♦భావిచిత్రితాంగుఁడుం
బ్రసిద్ధశృంగ వేణునాద ♦ పాశబద్ధలోకుఁడుం
బ్రసన్న గోపబాలగీత ♦ బాహువీర్యుఁ డయ్యు ను
ల్లసించి యేఁగె గోపకుల్ సె♦లంగి చూడ మందకున్. 587

వ. ఆ సమయంబున.

క. పెనుఁబాము దమ్ము మ్రింగిన
మననందసుతుండు పాము ♦ మర్దించి మమున్

(1) కల్పపర్యంతంబు = ప్రళయకాలమువఱకును, అనఁగా సుస్థిరవ్యవస్థదనుక,
(2) పులినంబుకడన్ = ఇసుకదిబ్బవద్ద, (3) క్రించుదనంబునన్ = మోసగానితనముచేత,
(4) గోపవరనందనులు = గోపకశ్రేష్ఠుల కుమారులు. (5) నగన్ = తమమాటలు విని నవ్వఁగా,

మనిచె నరణ్యములోపల
నని ఘోషించిరి కుమారు ♦ లా ఘోషములోన్. 589

వ. అనిన విని నరేంద్రుం డిట్లనియె.

క. కని మనిచి యెత్తి పెంచిన
తనుజన్ములకంటె నంద ♦ తనయుం డా ఘో
షనివాసులకు మనోరం
జనుఁ డెట్లయ్యెను [1]బుధేంద్ర ♦ చను నెఱిఁగింపన్. 591

వ. అనిన శుకుం డిట్లనియె. 592

సీ. అఖిలజంతువులకు ♦ నాత్మ వల్లభుఁడైన
భంగి బిడ్డలు నిండ్లుఁ బసిఁడి మొదలు
వస్తువు లెవ్వియు ♦ వల్లభంబులు గావు
సకలాత్మకుండైన ♦ జలజనేత్రుఁ
డఖిలజంతువులకు ♦ నాత్మ గావున [2]ఘోష
వాసుల కెల్లను ♦ వల్లభత్వ
మున మిక్కి లొప్పెను ♦ మూఁడులోకములకు
హితము సేయఁగ జల ♦ జేక్షణుండు

ఆ. మాయతోడ మూర్తి ♦ మంతుఁడై యొప్పారుఁ
గలఁ డతండు నిఖిల ♦ గణములందు
[3]భవతిధాతు వెట్లు ♦ [4]భావార్థమై [5]సర్వ
ధాతుగణమునందుఁ ♦ దనరునట్లు. 593

క. శ్రీపతిపదమను నావను బ్రాపించి భవాబ్ధి వత్స ♦ పదముగ ధీరుల్
రూపించి దాఁటిచేరుదు రాపత్పదరహితులగుచు ♦ నమృతపదంబున్.

ఆ. అఘునిఁ జంపి కృష్ణుఁ ♦ డాప్తులుఁ దానును
జల్ది గుడిచి జలజ ♦ సంభవునకుఁ

(1) బుధేంద్రా = పండితోత్తమా ! (2) ఘోషవాసులకెల్లన్ = మందయందుండు వారి కందఱకును. (3) భవతిధాతువు = భూధాతువు. (4) భావార్థమై = తాను స్వప్రతిపాదకత్వముచేత సమస్తధాతువులతోఁ గ్రియావాచ్యమై. (5) సర్వధాతుగణము నందున్ = భ్వాది, అదాది, జుహోత్యాది, దివాది, సునోత్యాది, తుదాది, రుధాది, తనోత్యాది, క్ర్యాది, చురాది అను ధాతువుల సమూహమునందు,

జిద్విలాస మైన ♦ చెలువు సూపిన కథఁ
జదువ వినినఁ గోర్కి ♦ సంభవించు.

వ. అని చెప్పి మఱియు వ్యాసనందనుం డిట్లనియె. 596

క. రాగంబున బలకృష్ణులు
పౌగండవయస్కు లగుచుఁ ♦ బశుపాలకతా
యోగంబున బృందావన
భాగంబునఁ గాచి రంతఁ ♦ బశువుల నధిపా. 597

వ. అయ్యెడఁ గృష్ణుం డొక్కనాఁడు రేపకడ లేచి వేణువు పూరించి బల
భద్రసహితుండై గోపకుమారులు దన్ను బహువారంబులు గైవా
రంబులు సేయ గ్రోల నాలకదుపుల నిడుకొని నిరంతరఫలకిసలయ
కుసుమంబులును గుసుమ మకరందనిష్యందపానానందదిందిందిరకదం
బంబును గదంబాదినానాతరులతాగుల్మసంకులంబును గులవిరోధ
రహితమృగపక్షిభరితంబును భరితసరస్సరోరుహ పరిమళమిళిత
పవనంబును నయిన వనంబుఁ గని యందు వేడుకం గ్రీడింప నిశ్చ
యించి యన్నం డన్న కిట్లనియె.

-♦ శ్రీకృష్ణమూర్తి బలరామునితో సరసోక్తు లాడుట ♦-

శా. శాఖాపుష్పఫలప్రభారనతలై ♦ చర్చించి యో దేవ మా
శాఖిత్వంబు హరింపు మంచు [1]శుకభా ♦ షన్ నీ కెఱింగించుచున్
శాఖాహస్తములం బ్రసూనఫలముల్ ♦ సక్కన్ సమర్పించుచున్
[2]శాఖిశ్రేణులు నీ పదాబ్జముల కో ♦ జన్ మ్రొక్కెడిం జూచితే.

సీ. నిఖిలపావన మైన ♦ నీ కీర్తిఁ బాడుచు
నీ తుమ్మెదలు వెంట ♦ నేఁగుదెంచె
నడవిలో [3]గూఢుండ ♦ వైన యీశ్వరుఁడ వని
మునరి కొల్వఁగ వచ్చె ♦ మునిగణంబు
నీలాంబరముతోడి ♦ నీవు జీమూతమ
వని నీలకంఠంబు ♦ లాడఁ దొడఁగెఁ

(1) శుకభాషన్ = చిలుకలపలుకులచేత (2) శాఖిశ్రేణులు = వృక్షముల బారులు,
(3) గూఢుండవు = వేషాంతరముచేత మఱుఁగుపడినవాఁడవు.

ప్రియముతోఁ జూచు గో ♦ పికలచందంబున
నినుఁ జూచె నదె [1]హరి ♦ ణీచయంబు

ఆ. నీవు విందవనుచు ♦ నిర్మల సూక్తులు
వలుకుచున్న విచటఁ ♦ [2] బరభృతములు
నేఁడు [3]విపినచరులు ♦ నీవు విచ్చేసిన
ధన్యులైరి గాదె ♦ తలఁచి చూడ. 600

సీ. నీ పాదములు సోకి ♦ నేఁడు వీరు [4] తృణ
పుంజంబుతో భూమి ♦ పుష్యమయ్యె
[5]నీ నఖంబులు దాఁకి ♦ నేఁడు నానా లతా
తరుసంఘములు కృతా ♦ ర్థంబు లయ్యె
నీ కృపాదృష్టిచే ♦ నేఁడు నదీ శైల
ఖగమృగంబులు దివ్య ♦ కాంతిఁ జెందె
[6]నీ పెన్నురము మోప ♦ నేఁడు గోపాంగనా
జనముల పుట్టువు ♦ సఫల మయ్యె

ఆ. నని యరణ్యభూమి ♦ నంకించి పసులను
మిత్రజనులుఁ దాను ♦ మేపుచుండి
నలినలోచనుండు ♦ నదులందు గిరులందు
సంతసంబు మెఱయ ♦ సంచరించె. 601

వ. మఱియు న య్యీశ్వరుండు. 602

సీ. ఒకచోట [7]మత్తాళి ♦ యూథంబు జుమ్మని
మ్రోయంగ జుమ్మని ♦ మ్రోయుచుండు
నొకచోటఁ గలహంస ♦ యూథంబు గూడి కేం
కృతులు సేయంగఁ గేం ♦ కృతులు సేయు

---

(1) హరిణీచయంబు = ఆడుజింకల సమూహము. (2) పరభృతములు = కోయిలలు. (3) విపినచరులు = అడవులయందు సంచరించునట్టి బోయలు మొదలగువారు (4) తృణపుంజంబుతో = కసవుజొంపములతో. (5) నీనఖంబులు = నీగోళ్లు. (6) నీపెన్నురము = విశాలమైన నీ రొమ్ము. (7) మత్తాళియూథంబు = మదించిన తుమ్మెదలయొక్క సమూహము

నొకచోట [1]మదకేకి ♦ యూథంబు లాడంగ
[2]హస్తాబ్జములు ద్రిప్పి ♦ యాడఁదొడఁగు
నొకచోట వనగజ ♦ యూథంబు నడవంగ
నయముతో మెల్లన ♦ నడవఁ జొచ్చుఁ

ఆ. [3]క్రౌంచచక్రముఖర ♦ ఖగము లొక్కొకచోటఁ
బలుక వానియట్ల ♦ పలుకుఁ గదిసి
పులుల సింహములను ♦ బొడఁగని యొకచోటఁ
బఱచు మృగములందుఁ ♦ [4]దఱచుఁగూడి. 603

వ. మఱియును.

*సీ. రా పూర్ణచంద్రిక ♦ రా గౌతమీ గంగ
రమ్మ భగీరథ ♦ రాజతనయ
రా సుధాజలరాశి ♦ రా మేఘమాలిక
రమ్మ చింతామణి ♦ రమ్మ సురభి
రా మనోహారిణి ♦ రా సర్వమంగళ
రా భారతీదేవి ♦ రా ధరిత్రి
రా శ్రీమహాలక్ష్మి ♦ రా మందమారుతి
రమ్మ మందాకిని ♦ రా శుభాంగి

ఆ. యనుచు మఱియుఁ గలుగు ♦ నాఖ్యలు గల గోవు
లడవిలోన దూర ♦ మందు మేయ
ఘనగభీరభాషఁ ♦ గడు నొప్పఁ జీరు నా
[5]భీరజనులు వొగడ ♦ బెంపు నెగడ. 605

క. కాంతారవిహారమ్ముల
[6]శ్రాంతుండై [7]గోపకాంక ♦ శయుఁ డగు నన్నా

---

(1) మదకేకియూథంబు = మదించిన నెమళ్ళయొక్కసమూహము. (2) హస్తాబ్జములు = కమలములవంటిహస్తములను. (3) క్రౌంచచక్రముఖరఖగములు=క్రౌంచపక్షులు,చక్రవాకపక్షులు మొదలుగాఁగల పక్షులు. (4) పఱచుట = పరుగెత్తును. (5) ఆభీరజనులు = గొల్లవాండ్రు. * అక్కడక్కడ మేయుచున్న గోవులను ఈ పేరుతో రమ్మ, రమ్మని గంభీరస్వరముతో తనయొక్క గొల్లవారందరు కొనియాడుచుండంగా పిలుచుచుండును. (6) శ్రాంతుండై = అలసినవాఁడై, (7) గోపకాంక = గొల్లవారల యొక్క ఒడియందు;

సంతుష్టిఁ బొందఁ జేయు ని
రంతరకరచరణమర్శ ♦ నాదుల నధిపా. 606

క. పాడుచు నాడుచు ముచ్చట
లాడుచు నొండొరులఁ దాఁకు ♦ నాప్తులఁ గని బి
ట్టాడుచుఁ జేతులు వ్రేయుచుఁ
గ్రీడింతురు నగుచు బలుఁడుఁ ♦ గృష్ణుఁడు నొకచోన్. 607

వ. ఇవ్విధంబున.

సీ. [1]వేదాంతవీథుల ♦ [2]విహరించువిన్నాణి
విహరించుఁ [3]గాంతార ♦ వీథులందు
ఫణిరాజశయ్యపైఁ ♦ బవళించు సుఖభోగి
పల్లవశయ్యలఁ ♦ బవ్వళించు
గురుయోగిమానస ♦ గుహలఁ గ్రుమ్మరుమేటి
గ్రుమ్మరు నద్రీంద్ర ♦ గుహలలోనఁ
గమలతోడఁ బెనంగి ♦ కడు డయ్యు చతురుఁ డా
భీరజనులతోడఁ ♦ బెనఁగి డయ్యు

ఆ. నఖిలలోకములకు ♦ నాశ్రయుండగు ధీరుఁ
డలసి తరులనీడ ♦ నాశ్రయించు
యాగభాగచయము ♦ లాహరించు మహాత్ముఁ
డడవిలోని ఫలము ♦ లాహరించు. 609

వ. ఆ సమయంబున. 610

సీ. అలసినచోఁ గొంద ♦ ఱతిమోదమున వీఁపు
లెక్కించుకొని పోదు♦ రేపు మెఱసి
సొలసి నిద్రించిన ♦ చో [4]నూరుతల్పంబు
లిడుదురు కొందఱు ♦ హితవు గలిగి
చెమరించి యున్నచోఁ ♦ జిగురుటాకులఁ గొంద
ఱొయ్యన విసరుదు ♦ రుత్సహించి

(1) వేదాంత వీథులన్ = ఉపనిషత్తులయొక్క మార్గములయందు, (2) విహరించు విన్నాణి = వినోదముగా సంచరించునట్టి విజ్ఞాని (3) కాంతార వీథులందున్ = అడవిచెట్లచాళ్ళనడుమ, (4) ఊరుతల్పంబులు = తొడలపాన్పులు.

దవ్వేగి నిలుచుచోఁ ♦ దడయక కొందఱు
పదము లొత్తుదు రతి ♦ బాంధవమున

ఆ. గోపవరులు మఱియుఁ ♦ గొందఱు ప్రియమున
మాధవునకుఁ బెక్కు ♦ మార్గములను
బనులు సేసి రెల్ల ♦ భవములఁ జేసిన
పాపసంచయములు ♦ భస్మములుగ. 611

వ. అయ్యవసరంబున శ్రీధామనామధేయుం డైన గోపాలకుండు రామకేశవులం జూచి యిట్లనియె. 612

—♦ గార్దభాకారుం డైన ధేనుకాసురుని బలభద్రుఁడు వధించుట ♦—

క. దూరంబునఁ [1]దాలతరు
స్ఫారం బగు వనము గలదు ♦ [2]పతితానుపత
[3]ద్భూరిఫలసహిత మది యే
ధీరులు సొర వెఱతు రందు ♦ [4]ధేనుకుఁ డుంటన్.

వ. ఆ ధేనుకాసురుండు మహాశూరుండును [5]ఖరాకారుండును నై సమాన సత్త్వసమేతు లైన జ్ఞాతులుం దానును మనుష్యులం బట్టి భక్షించుచుండు నయ్యెడఁ బరిమళోపేతంబు లైన నూతనఫలవ్రాతంబు లసంఖ్యాకంబులు గలవు వినుండు. 614

క. ఫలగంధము [6]నాసాపుట
ముల వెంటం జొచ్చి చిత్త ♦ ములఁ గొనిపోయెన్
ఫలములు నమలింపుఁడు మము
బలియురకును మీకు దైత్య ♦ భటు లడ్డంబే. 615

వ. అని పలికిన చెలికాని పలుకు లాదరించి విని నగి వారునుం దామును మహోత్తాలం బగు తాలవనంబులకుం జని యందు. 616

క. తత్తరమున బలభద్రుఁడు
[7]తత్తాలానోకహములఁ ♦ దన భుజబల సం

---

(1) తాలతరుస్ఫారంబు = తాటిచెట్లచేత నతిశయించినది, (2) పతితానుపతత్ = పడిపోయినదాని వెంబడిఁ బడుచున్న, (3) భూరి = అధికమైన, (4) ధేనుకుఁడు = ధేనుకుఁ డనెడు రాక్షసుఁడు. (5) ఖరాకారుఁడు = గాడిదయొక్క ఆకారము గలవాఁడు. (6) నాసాపుటముల వెంటన్ = ముక్కురంధ్రముల దారిని. (7) తత్తాలానోకహములన్ = ఆ తాటిచెట్లను.

పత్తిఁ గదల్చుచు గ్రక్కున
మత్తేభముభంగిఁ బండ్లు ♦ మహిపై రాల్చెన్. 617

వ. అప్పుడు పండ్లురాల్చిన చప్పుడు సెలవులకు [1]దెప్పరం బయిన నదిరి పడి [2]రిపుమర్దన కుతుకంబున గార్ధభాకారుండైన ధేనుకాసురుండు

మ. పదవిక్షేపములన్ సవృక్షధరణీ ♦ భాగంబు గంపింపఁగా
[3]రదముల్ దీటుచుఁ గత్తిరించిన చెవుల్ ♦ రాజిల్ల వాలంబు భీ
తిదమై తూలఁగ గారవంబున సము ♦ ద్దీపించి గోపాలకుల్
బెదరన్ రాముని రొమ్ముఁ దన్నె వెనుకై ♦ బీరంబు దోరంబుగన్.

క. మఱియును [4]దనుజుఁడు రామునిఁ
గఱవఁగ గమకించి తెఱపి ♦ గానక యతనిం
[5]జుఱచుఱఁ జూచుచు శౌర్యము
పఱివోవఁగ నింత నంతఁ ♦ బదములఁ టన్నెన్. 620

వ. అంత బలభద్రుండు రౌద్రాకారంబున గర్ధభాసురు పదంబులు నాలుగు [6]నొక్కకేల నంటం బట్టి బెట్టు దట్టించి త్రిప్పి [7]విగతజీవునిం జేసి.

మ. ఒక తాలాగ్రముఁ దాఁకవైవ నది కం ♦ పోద్రిక్తమై త్రుళ్ళి వే
ఱొక తాలాగ్రముపైఁ బడ న్నదియు [8]న ♦ త్యుగ్రాహతిన్ సిల్వ కొం
డొకతాలాగ్రముపైఁ బడన్ విఱిగి యి ♦ ట్లొండొంటిపైఁ దాల వృ
క్షకముల్ గూలెఁ బ్రచండమారుతము దాఁ♦కం గూలుచందంబునన్

ఉ. [9]తంతువులందుఁ జేలము వి ♦ ధంబున నే పరమేశుమూర్తి యం
దింతయుఁ జుట్టునట్టి జగ ♦ [10]దీశుఁడనంతుఁడు దైత్యమాత్రు ని

---

(1) తెప్పరంబైన = సహింపఁగూడకపోగా. (2) రిపుమర్దన కుతుకంబునన్ = శత్రువులను మర్దించుటయందలి కుతూహలముతో. (3) రదముల్ దీటుచున్ = పండ్లుకొఱుకుచును (4) దనుజుఁడు = ఆ ధేనుకాసురుఁడు. (5) చుఱచుఱ చూచుచున్ = రెప్పవాల్పక కోపదృష్టితోఁ జూచుచును. (6) ఒక్కకేల .....దట్టించి = ఒకచేతితో కదియఁబట్టి భయంకరముగా చఱచి (త్రిప్పి). (7) విగత జీవుంజేసి = పోయిన ప్రాణము గలవానిఁగాఁజేసి (చంపియనుట). (8) అత్యుగ్రాహతిన్ = మిక్కిలి భయంకరమైన దెబ్బచేత. (9) తంతువు.....విధంబునన్ = పడుగు పేకగా నున్న నూలు వలనుండిన వస్త్రమువలెనే. 10 ఈశుఁడు = అట్టి లోకనాయకుఁడైన విష్ణుమూర్తి.

ట్లింతయుసేయు టెంతపని ♦ యద్భుతమే వినుమంతలోన వాఁ
డంతముఁబొందు టెల్లఁగని ♦ యాతని బంధులు గార్దభంబులై. 623

క. బల కృష్ణులపైఁ గవిసిన
బలియుర ఖరదైత్యభటులఁ బశ్చిమపాదం
బులు పట్టి తాలశిఖరం
బుల కెగురఁగ వైచి వారు ♦ పొరిఁగొని రధిపా. 624

వ. అప్పుడు. 625

క. [1]ఆలమున నోలిఁ గూలిన
తాల ద్రుమఖండ [2]దైత్య ♦ తనుఖండములన్
గీలిత యై ధర [3]జలధర
మాలావృతమైన మింటి ♦ మాడ్కిన్ వెలిఁగెన్. 626

క. ధేనుకవనమున నమలిరి
మానవు లావేళఁ దాటి ♦ మ్రాఁకుల ఫలముల్
ధేనువులు మెసఁగెఁ గసవులు
ధేనుకహర భక్తకామ ♦ ధేనువు గలుగన్. 627

వ. ఆ సమయంబున సురలు [4]విరులవానలు గురియించి దుందుభులు మొరయించి రంతఁ గమలలోచనుఁడు గోపజనజేగీయమానవర్తనుండై యన్నయుం దానును గోగణంబుల దోలుకొని మందకుం జనియె నయ్యెడ. 628

ఉ. గోపద రేణు సంకలిత ♦ [5]కుంతలబద్ధ మయూరపింఛు [6]ను
ద్దీపిత మందహాస శుభ ♦ దృష్టి లసన్ముఖు వన్యపుష్పమా
లా పరిపూర్ణు గోపజన ♦ లాలిత వేణురవాభిరాము నా
గోపకుమారునిం గనిరి ♦ గోపసతుల్ నయనోత్సవంబుగన్. 629

ఆ. కమల నయను వదన ♦ కమల మరందంబుఁ
దవిలి [7]నయన షట్ప ♦ దముల వలనఁ

(1) ఆలమున నోలిన్ = యుద్ధమునందు వరుసగా. (2) దైత్యతనుఖండములన్ గీలితయై = రాక్షసదేహములను తునుకలచేత కూర్చఁబడినదై. (3) జలధరమాలావృత = మేఘముల యొక్క చాళ్ళచేత కప్పఁబడినది. (4) విరులవానలు = పూలవర్షములు. (5) కుంతలబద్ధ = తలవెండ్రుకలయందు కట్టఁబడిన (6) ఉద్దీపిత = మిక్కిలి ప్రకాశించుచున్న (7) నయన షట్పదములవలనన్ = కన్నులనెడి తుమ్మెదలవలన.

ద్రావి దినవియోగ ♦ తాపంబు మానిరి
గోపకాంత లెల్లఁ ♦ గోర్కు లలర. 630

వ. ఇట్లు గోపికలు సాదరంబునం జూడ [1]వ్రీడాహాస వినయంబులం జూచుచుఁ గ్రీడాగరిష్ఠుం డయిన [2]ప్రౌఢ గోష్ఠంబు ప్రవేశించె; నంత రోహిణీయశోదలు గుఱ్ఱలనలని మచ్చికలు పిచ్చలింప నిచ్చకు వచ్చిన ట్లయ్యైవేళల దీవించిరి. వారును [3]మజ్జనోన్మర్దనాదు లంగీకరించి [4] సురభికుసుమగంధంబులు గైకొని [5] రుచిరచేలంబులు గట్టికొని [6]రసోపపన్నంబులయిన యన్నంబులు గుడిచి తృప్తులై మంజుల శయ్యల సుప్తులయి యుండి రందు. 631

—♦ శ్రీకృష్ణుఁడు కాళీయమర్దనము గావించుట ♦—

సీ. ఒకనాఁడు బలభద్రుఁ ♦ డొక్కఁడు రాకుండ
గోపాలకులుఁ దానుఁ ♦ గూడి కృష్ణు
డడవికిఁ జని యెండ ♦ నా గోవులును గోప
కులు [7]నీరువట్టునఁ ♦ గుంది డస్సి
కాళిందిలో [8]విష ♦ కలితతోయముఁ ద్రావి
ప్రాణానిలంబులు ♦ వాసి పడిన
[9]యోగీశ్వరేశుండు ♦ యోగివంద్యుఁడు కృష్ణుఁ
[10]డీక్షణామృతధార ♦ [11]లెలమిఁ గురిసి

ఆ. పసుల గోపకులను ♦ బ్రతికించె మఱలంగ
వారు తమకుఁ గృష్ణు ♦ వలన మఱల
బ్రదుకు గలిగె నంచు ♦ భావించి సంతుష్ట
మానసములఁ జనిరి ♦ మానవేంద్ర. 632

(1) వ్రీడా = సిగ్గుచేత. (2) గోష్ఠంబు = మంద (3) మజ్జనోన్మర్దనాదులు = స్నానము నలుఁగు మొదలైనవి. (4) సురభికుసుమ = మంచివాసనగల పువ్వులు. (5) రుచిరచేలంబులు = పరిశుద్ధమైన వస్త్రములు. (6) రసోపపన్నంబులయిన యన్నంబులు = షడ్రససంయుక్తము లయినట్టి భోజ్య లేహ్య చోష్య పానీయము లైన నాలుగు విధముల అన్నములను. (7) నీరువట్టునన్ గుంది = దప్పికచేత బాధపడి (8) విషకలిత తోయమున్ = విషముతోఁ గూడుకొన్న నీళ్ళను (9) యోగివంద్యుఁడు = యోగులు స్తోత్రముచేయఁ దగినవాఁడు (శ్రీకృష్ణపరమాత్మ) (10) ఈక్షణామృత ధారలు = చల్లనిచూపు లనెడు నమృతధారలు. (11) ఎలమిన్ = ప్రేమతో

క. [1]కాళియఫణిదూషితయగు కాళిందిఁ బవిత్రఁ జేయఁ♦గా నుత్సుకుఁడై
[2]కాళిందీజలవర్ణుఁడు కాళియు వెదలంగ నడిచెఁ♦గౌరవముఖ్యా. 633

వ. అనిన నయ్యగాధజలంబున మాధవుం డెట్టినేర్పున సర్పంబు దర్పంబు మాపి వెడలించె నందుఁ బెద్దకాలం [3]బా వ్యాళం బేల యుండె నెఱింగింపుము. 634

క. [4]తోల్ఱులఁ గాచిన నందుని
కుఱ్ఱని చరితామృతంబు ♦ గొనకొని చెవులన్
జుఱ్ఱంగఁ దనివి గల్గునె
వెఱ్ఱుల కయినను దలంప ♦ విప్రవరేణ్యా. 635

వ. అనిన శుకుం డిట్లనియె. 636

సీ. మానవేశ్వర యొక్క ♦ మడుఁగు కాళిందిలోఁ
గల దది యెప్పుడుఁ ♦ గాళిమోపి
[5]విషవహ్ని శిఖలచే ♦ వేఁచుచుండును మీఁదఁ
బఱతెంచినంతన ♦ పక్షులైనఁ
బడి మ్రగ్గు నందుఁ ద ♦ ద్భంగశీకరయుక్త
పవనంబు సోఁకినఁ ♦ బ్రాణు లెవ్వ
యైన నప్పుడు చచ్చు ♦ నట్టి యా మడుఁగులో
నుదకంబు పొంగుచు ♦ నుడుకుచుండఁ

తే. జూచి వెఱఁగంది కుజనులఁ ♦ ద్రుంక్కఁ జేయ
నవతరించిన బలువీరుఁ ♦ డాగ్రహించి
[6]భుజగ విషవహ్ని దోషంబు ♦ వాలియఁ జేసి
సుజలఁ గావించి యా నదిఁ ♦ జూతు ననుచు. 637

వ. కృతనిశ్చయుండై పూర్వజన్మ భాగ్యంబునం దనచరణసంస్పర్శంబునకు యోగ్యంబై తత్సమీపంబున విశాలవిటపశాఖాకదంబం బుతో నున్న కదంబభూజంబు నెక్కి.

(1) కాళియఫణిదూషిత = కాళియుఁడు అను సర్పముచేత దోషయుక్త మయినది—ప్రజల కుపయోగింపనిది. (2) కాళిందీజలవర్ణుఁడు = ఆ యమునా నదిలోని జలమువలె నల్లని వన్నెగలవాఁడైన శ్రీకృష్ణమూర్తి (3) ఆ వ్యాళమ్ము = ఆ పాము (4) తోల్ఱులఁ గాచిన = ఆవులను రక్షించిన. (5) విషవహ్నిశిఖలచే = విష మను అగ్నిజ్వాలలచే, (6) భుజగ విషవహ్ని దోషంబు = సర్పవిష మను అగ్నిదోషమును.

మ. [1]కటిచేలంబు బిగించి పింఛమునఁ జ ♦ క్కంగొప్పు బంధించి* దో
స్తట సంస్ఫాలన మాచరించి చరణ ♦ ద్వంద్వంబుఁ గీలించి త
[2]త్కుట శాఖాగ్రముమీఁదనుండి యుఱికెన్ ♦ గోపాలసింహంబు ది
క్తటముల్ మ్రోయ[3]హ్రదంబులోఁ గుభగుభ♦ధ్వానంబనూనంబుగన్.

ఉ. భూరిమహాప్రతాపపరి ♦ పూర్ణ భయంకర గోపబాల కం
ఠీరవపాతవేగ వికటీకృత దుర్విష [4]భీషణోర్మి సం
పూరిత మై వడిం గలఁగి ♦ పొంగి [5]ధనుశ్శతమాత్ర భాగ వి
స్తారము పొంగె నమ్మడుఁగు ♦ [6]తప్తపయఃకణ బుద్బుదోగ్రమై.

శా. [7]పాఠీనాకృతిఁ దోయరాశి నడుమన్ ♦ భాసిల్లి మున్నాఢ్యుఁడై
కాఠిన్యక్రియ నీఁదు నేర్పు దనకుం ♦ గల్మిన్ భుజంగేంద్ర హృ
త్తీవ్రాగ్రంబున రోషవహ్ని లెగయన్ ♦ భీమంబుగా నీఁదె ను
ల్లుంఠోత్తుంగతరంగమై మడుఁగు [8]దు ♦ ర్లోక్యంబుగా బాహులన్.

వ. ఆ సమయంబున. 642

శా. బాలుం డొక్కఁడు వీఁడు నా మడుఁగు వి ♦ భ్రాంతోచ్ఛలత్కర్ణక
ల్లోలంబై కలఁగం జరించె నిట నే ♦ లో నుంటఁ జూడం డహో [9]మ
త్కీలాభీల విశాలదుస్సహ విషా ♦ గ్నిజ్వాలలన్ భస్మమై
కూలం జేసెద నేఁడు లోకులకు నా ♦ కోపంబు దీపింపఁగన్. 643

వ. అని తలంచి విజృంభించి.

ఉ. ఘోరవిషానలప్రభలు గొబ్బునఁ ♦ గ్రమ్మఁగ సర్పసైన్య వి
స్ఫారుఁడు [10]కాళియోరగుఁడు ♦ వాటి వడిం గఱచెం[11]బయోధరా
కారుఁ [12]బయోవిహారు భయ ♦ కంపవిదూరు మహాగభీరు నా
భీరకుమారు వీరు నవ ♦ పీతశుభాంబరధారు ధీరునిన్.

---

(1) కటిచేలంబు=నడుమునకుఁగట్టిన వస్త్రము (2) కుటము = వృక్షము (3) హ్రదంబులో= మడుఁగులో (4) భీషణోర్మిసంపూరితమై = భయంకరమైన తరంగములచే నిండినదై (5) ధనుశ్శత...రము = నూరు బాణముల పొడవుఁగల ప్రదేశము. (6) తప్త...... ద్రోగ్రమై = కాగినపాల బిందువుల బుడగలవలె భయంకరమై (7) పాఠీనాకృతి = వేయి కోఅలుగల చేపవలె (8) దుర్లోక్యంబు = చూచుటకు శక్యము కానిది. (9) మత్కీలా... ...జ్వాలలన్ = నాయొక్క [సర్పము] మంటలచే భయంకరమై విశాలమై సహించుటకు శక్యముకాని విషమనెడు అగ్నిజ్వాలలను * దోస్తటసంస్ఫాలన = భుజములమీఁద నెక్కి-చఱచుట (10) కాళియోరగుఁడు = సర్పవిశేషము (11) పయోధరాకారున్ = మబ్బు కాంతివంటి కాంతిగలవానిని. (12)పయోవిహారున్ = క్షీరసముద్రమున విహరించువానిని.

క. కఱచి పిఱుతివక మఱియును
వెఱవక [1]నిజవదన జనిత ♦ విషదహనశిఖల్
మెఱయఁ దన నిడుద యొడలను
నెఱి హరిఁ బెనఁగొనియె [2]భుజగ ♦ నివహపతి వడిన్. 646

వ. ఇట్లు [3]భోగిభోగ పరివేష్టితుండై చేష్టలు లేనివాని తెఱంగునఁ గానంబడుచున్న ప్రాణసఖునిం గనుంగొని తత్ప్రభావంబు లెఱుంగక [4]తత్సమర్పిత ధనదారమనోరథమానసులు గావున 647

చ. అదె మన కృష్ణునిం గఱచి ♦ యంతటఁ బోక భుజంగమంబు దు
ర్మదమున మేనఁ జుట్టుకొని ♦ మానక యున్నది యింక నేమి సే
యుద మెటఁ జొత్తు మే పురుషు ♦ లోప్రదు రీ యహి నడ్డపెట్ట నె
య్యది సమపాయ మంచుఁ బడి ♦ రార్తరవంబులఁ దూలి గోపకుల్.

క. గోపకుమారక శేఖరు నేపున సర్పంబుఁ గఱచు ♦ టీక్షించి వగన్
[6]మేపులకుఁ దొలఁగి గోవులు వాపోవుచు నుండె వృషభ ♦ వత్సంబులతోన్

క. భూతలము వడఁకె [7]నుల్కా
పాతంబులు మింటఁ గానఁ ♦ బడె [8]ఘోషములో
[9]వ్రేతలకును గోపక సం
ఘాతములకు నదరెఁ గీడు ♦ కన్ను లిలేశా. 650

వ. అంత నా దుర్నిమిత్తంబు లొడఁగని బెగడు గదిరిన చిత్తంబుల [10]నుత్తలపడుచు మంద నున్న నందయశోదాదు లైన గోపగోపికా జనంబులు హరి దళసరి యెఱుంగక గోపాల గోగణ పరివృతుం డైన కృష్ణుం డెక్కడ నైనం జిక్కనోపు నని పొక్కుచుం బెక్కువలైన మక్కువలు చెక్కు లొత్త నొక్కపెట్ట బాలవృద్ధసమేతులై మహాఘోషంబున నా ఘోషంబు వెలువడి. 651

క. వా రిబ్భంగి నెఱుంగని
వారై హరిఁ జూడఁ బోవ ♦ వడిగొని నగుచున్

(1) నిజవదన.....శిఖల్ = తన ముఖమునఁబుట్టిన విషమును దహించునట్టి జ్వాలలు. (2) భుజగనివహపతి = సర్పసమూహములకు ప్రభువు (3) భోగిభోగ పరివేష్టితుఁడు = పాముపడగచేఁ జుట్టఁబడినవాఁడు (4) తత్సమర్పిత...మానసులు = తను సర్వస్వము శ్రీకృష్ణునికి నర్పించునట్టి మనసులు గలవారు. (5) మేపులకు = పశుపక్ష్యాదులు తిను యాహారము (6) ఉల్కాపాతంబులు = మంటలేని అగ్నికణములు. (7) ఘోషము = గొల్లపల్లె (8) వ్రేతలకును = గోపికలకును (9) ఉత్తలపడుచు = దుఃఖపడుచు.

వారింపఁ డయ్యె [illegible]
వారిని హరి లా లెఱుంగఁడు ♦ నాఁ డయ్యె నృపా. 652

వ. అంతలోన వారునుం దామును గాంతారమార్గంబు నట్టి పోవుచు నెడ నెడ గోపగోష్పదంబుల సందుల నింత సంత నక్కడక్కడ [1]యవాంకుశహల కమలకులిశచక్ర చాపకేతనాది రేఖాలంకృతంబులై [2]మార్గాభరణంబులైన హరిచరణంబులం జాడఁ గని చొప్పు దప్పక చని దుర్ఘటం బయిన యమునాతటంబు సేరి వారి మధ్యంబున నితరులకసాధ్యంబైన సర్పంబుచేతఁ గాటుపడి సర్పంబు సూచక భోగిభోగపరివృతుం డైన కృష్ణునిఁ గృష్ణకృష్ణేతివిలాపంబులఁ దాపంబులం బొందుచుఁ దత్కాలంబునం బ్రతికూలం బయ్యె నని యా దైవంబు దిట్టు గోపికలును గోపకులుం గలసి మేఁత లుడిగి ఱెప్ప లిడక కృష్ణునిం దప్పక చూచుచు నోరలుచున్న గోవులం గని రందు గోపికలు యశోదం బట్టుకొని విలపించుచుఁ గృష్ణు నుద్దేశించి యిట్లనిరి.

సీ. ఎదురువచ్చినఁ జాల ♦ నెదురుగాఁ జనుదెంతు
వెదురువచ్చిన నేఁ డ ♦ దేల రావు
చూచినఁ గృపతోడఁ ♦ జూచుచుందువు నీవు
సూచినఁ గనువిచ్చి ♦ చూడ వేల
డాసిన నజులేక ♦ డాయంగ వత్తువు
డాసిన నేఁటికి ♦ డాయ విచట
జీరిన నో యని ♦ చెలరేఁగి పలుకుదు
విది యేమి సీరిన ♦ నెఱుఁగ కుంట

ఆ. తలఁపుసేయు నంతఁ ♦ దలపోయుచుందువు
తలఁపు సేయ నేఁడు ♦ దలఁప వకట
యనుచు భక్తివివశ ♦ లాడెడి కైవడి
వ్రేత లెల్ల నాఁడి ♦ వివశ లైరి. 654

వ. ఆ సమయంబున నందయశోదాదులు హరిం జూచి యస్తోకంబైన శోకంబున నిట్లనిరి. 655

---

(1) యవాంకుశ.........కృతంబులు = యవరేఖ, అంకుశరేఖ; పద్మరేఖ, వజ్రరేఖ, చక్రరేఖ, ధనూరేఖ, ధ్వజరేఖ మొదలుగాఁ గల రేఖలచే నలంకరింపఁబడినవి.
(2) మార్గాభరణంబులు = త్రోవకు నాభరణముల వంటివి.

క. విషకుచయుగ యగు రక్కసి
[1]విషకుచదుగ్ధంబు ద్రావి ♦ విషవిజయుఁడ వై
[2]విషరుహాలోచన యద్భుత
విషయుం డగు నీకు సర్ప ♦ విష మెక్కెఁ గదే. 656

క. కట్టా క్రూరభుజంగము, గట్టలుకన్ నిన్నుఁ గఱవఁ ♦ గంపించితివో
తిట్టితివో పాపపు విధిఁ బట్టి మముం దలఁచి కాక ♦ పలవించితివో.

క. పన్నగము మమ్ముఁ గఱచక
నిన్నేటికిఁ గఱచెఁ గుజ్జ ♦ నెమ్మిఁ గలిగి నీ
వున్నను మము రక్షింతువు
నిన్నున్ రక్షింప నేము ♦ నేరము తండ్రీ. 658

ఉ. చూడ వ దేమి గారవపుఁ ♦ జూపుల మమ్ము సఖాలితోడ మా
టాడ వ దేమి నర్మముగ ♦ నందెలు పాదములందు మ్రోయ నేఁ
డాడ వ దేమి నర్తనము ♦ లవ్వల మ్రోలను గోపికావళిం
గూడ వ దేమి నవ్వులను ♦ గోపకుమారవరేణ్య చెప్పుమా. 659

సీ. శ్రవణరంధ్రంబులు ♦ సఫలతఁ బొందంగ
నెలమి భాషించు వా ♦ రెవ్వ రింకఁ
గరచరణాదుల ♦ కలిమి ధన్యత నొంద
నెగిరి పైఁ బ్రాఁకు వా ♦ రెవ్వ రింక
[3]నయనయుగ్మంబులు ♦ నన్నిఁ గృతార్థములుగా
నవ్వులు సూపు వా ♦ రెవ్వ రింక
జిహ్వాలు గారవ ♦ శ్రీఁ జేరఁ బాటల
యెడఁ బలికించు వా ♦ రెవ్వ రింకఁ

ఆ. దండ్రి నీవు సర్ప ♦ దష్టుండ వై యున్న
నిచట మాకుఁ బ్రభువు ♦ లెవ్వ రింక
మరిగి పాయ లేము ♦ మాకు నీ తోడిద
లోక మీవు లేని ♦ లోక మేల. 660

(1) విషకుచదుగ్ధంబున్ = విషపుచన్నుల పాలు, (2) విషరుహాలోచన = కమల నేత్రుఁడవైన ఓ శ్రీకృష్ణా. (3) నయన.....గృతార్థంబులుగా = రెండు కన్నులుండుటయే గొప్ప ప్రయోజనములుగా.

వ. అని యొండొరులం బట్టుకొని విలపించుచుం గృష్ణునితోడన మడుఁగుఁ జొత్తము చత్తమనుచుఁ గృష్ణవిరహావేదనానల [1]భారతప్తులై మడుఁగుఁ జొచ్చిపోవుచున్నవారలఁ గనుంగొని భగవంతుండైన బలభద్రుండు మీరు మీరు మీఁదెఱుంగరు ధైర్యంబు విడుచుట కార్యంబు గాదు సహించి చూడుం డని వారిని వారించె. 661

క. తనుఁ గూర్చి యి వ్విధంబున
వనితలు బిడ్డలును దాఁప • వాపోయెడి ఘో
షనివాసులఁ గని కృష్ణుఁడు
మనుజుని క్రియ నొక్క ముహూర్త • మాత్రము జరిపెన్. 662

శా. అంతం గృష్ణుఁడు మేను వెంప భుజగం • డావృత్తులం బాసి తా
[2]సంతప్తాయతభోగుఁడై కలఁచుటల్ • సాలించి నిట్టూర్పుతో
శ్రాంతుండై తలలెత్తి దుర్విషము [3]నా • సాపీథులం గ్రమ్మ దు
శ్చింతన్ దిక్కులుసూచుచున్ దలఁగి ని • ల్చెన్ ధూమకాస్త్రాకృతిన్.

ఉ. వెఱమెర లేని యట్టి బలు • వీర్యుఁడు కృష్ణకుమారుఁ డొక్క చేఁ
జఱచి ఖగేంద్రుచందమునఁ • జక్కన దౌడలు పట్టి కన్నులం
జొఱచొఱ దుర్విషానలము • జొబ్బిలు చుండఁగ నెత్తి లీలతోఁ
జిఱజిఱఁ ద్రిప్పి వైచెఁ [4]బరి • శేషితదర్పము గ్రూరసర్పమున్. 664

వ. ఇట్లు వేగంబున నాగంబు వీచి వైచి జగజెట్టియైన నందునిపట్టి రెట్టించిన సంభ్రమంబున.

సీ. ఘనయమునానదీ • కల్లోల ఘోషంబు
సరసమృదంగ ఘో • షంబు గాఁగ
సాధుబృందావన • చర చంచరీక గా
నంబు గాయక సుగా • నంబు గాఁగ
[5]కలహంస సారస • కమనీయ మంజు శ
బ్దంబులు దాళశ • బ్దములు గాఁగ

---

(1) అనలభారతప్తులై = విపరీతమైన విరహతాపముచే తపింపఁ జేయఁబడిన వారై. (2) సంతప్తాయతభోగుఁడై = నిడువాటి శరీరము గలవాఁడును, సంతాపమును బొందఁజేయఁ బడినవాఁడై. (3) నాసాపీథులన్ = ముక్కురంధ్రముల దారిని. (4) పరిశేషితదర్పమున్ = అంతయు పోఁగాఁ గొంచెము మిగిలిన మదము గలదైన. (5) కలహంస...శబ్దంబులు కలహంస = హంసశ్రేష్ఠులయొక్కయు, సారస = బెగ్గురు పక్షులయొక్కయు, కమనీయ = మనోజ్ఞమయిన, మంజు = ఇంపయిన, శబ్దంబులు = ధ్వనులు.

దివినుండి వీక్షించు ♦ [1]దివిజగంధర్వాది
జనులు సభాసీన ♦ జనులు గాఁగ

తే. బద్మరాగాది రత్నప్ర ♦ భాసమాన
మహిత [2]కాళియ ఫణిఫణా ♦ మండపమున
నళినలోచన విఖ్యాత ♦ నర్తకుండు
నిత్యనై పుణ్యమునఁ బేర్చి ♦ నృత్యమాడె. 666

శా. కుక్షిన్ లోకము లున్న గౌరవముతో ♦ గోపాకృతిన్ నున్న యా
[3]రక్షోహంతృవశీన్ మహోఫణిఫణా ♦ రంగప్రదేశంబుపై
నక్షీణోద్ధతి నాట్యముం బాఁటం జెలఁగున్ ♦ హాసంబుతో డంబర
ప్రక్షేపంబులు సేయుఁ గేళిగతులం ♦ బ్రాణైకశేషంబుగన్. 667

క. ఘనతర [4]సుషిరానంద
స్వనములతో సిద్ధసాధ్య ♦ చారణ గంధ
ర్వ నిలింప మునిపతులు చ
య్యనఁ గురిసిరి విరులవాన ♦ లాడెడు హరిపై. 668

వ. ఇట్లు దుష్టజన దండధరావతారుండైన హరి వడి గలిగిన పడగల మీఁదఁ దాండవంబు సలుప బెండువడి యొండొండ ముఖంబుల రక్తమాంసంబు లుమియుచుఁ గన్నుల విషంబు గ్రక్కుచు నుక్కు సెడి చిక్కి దిక్కులు సూచుచుం గంఠగతప్రాణుండై ఫణీంద్రుండు తన మనంబున. 669

ఉ. [5]వేలుపులైన లావు సెడి ♦ వేసటఁ బొందుచు నా విషానల
జ్వాలలు సోకినంతటన ♦ చత్తురు నేఁ డిది యేమి చోద్యమా
భీలవిషాగ్ని హేతిచయ ♦ పీడకు నోర్చియుఁ గ్రమ్మఱంగ నీ
బాలుఁడు [6]మత్ఫణాశతము ♦ భగ్నముగా వెసఁ ద్రొక్కి యాడెడిన్.

క. ఈతఁడు సర్వ చరాచర
భూతేశుండైన పరము ♦ పురుషుఁడు సేవా

(1) దివిజ = దేవతలును. (2) కాళియఫణిఫణా = కాళియుఁ డను సర్పముయొక్క పడగలనెడు. (3) రక్షోహంత = రాక్షసులను చంపునట్టివాఁడైన ఆ విష్ణుమూర్తి (4) సుషిర = ఊదెడు వాద్యములయొక్క (5) వేలుపులైనన్ = దేవతలైనను (6) మత్ఫణాశతము = నా పడగలయొక్క నూఱు పడగలను.

క్రీతుఁడు హరి గాఁ దగు నని
భీతిన్ శరణంబు నొందె ♦ బిట్టలసి నృపా.

—♦ కాళియ భార్యలైన నాగాంగనలు శ్రీకృష్ణుని స్తుతించుట. ♦—

వ. ఇట్లు క్రూరంబులైన హరిచరణ ప్రహారంబులం బడగ లెడసి నొచ్చి చచ్చిన క్రియం బడియున్న పతిం జూచి నాగకాంతలు దురంతంబైన చింతాభరంబున నివ్వటిల్లెడు నెవ్వగల నొల్లంబోయి పల్లటిల్లిన యుల్లంబుల. 672

మ. [1]కచబంధంబులు వీడ భూషణములా ♦ కంపింపఁ గ్రొఁదీఁవియల్
కుచయుగ్మంబుల వ్రేఁగునం గదలఁ బై ♦ కొంగుల్ వడిం జీరఁగాఁ
బ్రచుర భ్రాంతి గలంగి ముందట [2]రుదద్బాలావలిం గొంచు స్రు
క్కుచు భక్తిం జని కాంచి రా గుణమణిన్ ♦ గోపాలచూడామణిన్.

వ. కని దండప్రణామంబు నాచరించి నిటలతటఘటిత కరకమలలై యిట్లనిరి. 674

క. క్రూరాత్ముల దండింపఁగ
ధారుణిపై నవతరించి ♦ తనరెడి నీకీ
క్రూరాత్ముని దండించుట
క్రూరత్వము గాదు సాధు ♦ గుణము గుణాఢ్యా. 675

క. పగవారి సుతులయందును
బగ యించుక లేక సమతఁ ♦ బరఁగెడి నీకున్
బగ గలదె ఖలుల నడఁచుట
[3]జగదవనముకొఱకుఁ గాక ♦ జగదాధారా. 676

క. నిగ్రహమె మము [4]విషాస్యుల
న్నుగ్రుల శిక్షించు టెల్ల ♦ నూహింప మహా
నుగ్రహము గాక మాకీ
నిగ్రహము [4] విషాస్యభావ ♦ నిర్గతిఁ జేసెన్. 677

(1) కచబంధములు వీడఁగ = కొప్పుముళ్లు వీడిపోఁగా (2) రుదత్ = ఏడ్చుచున్న (3) జగదవనము = లోకములను రక్షించుట (4) విషాస్యులన్ = విషమునోటఁ గలవారిని.

ఉ. ఎట్టి తపంబు సేసెనొకొ ♦ యెట్టి సుకర్మము లాచరించెనో
యెట్టి నిజంబు వల్కెనొకొ ♦ యీ ఫణి పూర్వభవంబునందు ము
న్నెట్టి మహానుభావులకు ♦ నెయ్యము సేయక గాని నీవు నేఁ
డిట్టి వినోదలీలఁ దల ♦ లెక్కి నటించెద వీ ఫణీంద్రుపై. 678

మ. బహుకాలంబు దపంబు సేసి వ్రతముల్ ♦ పాటించి కామించి నీ
మహనీయోజ్జ్వల పాదరేణుకణ సం ♦ స్పర్శాధికారంబు శ్రీ
మహిళారత్నము దొల్లి గాంచె నిదె నే ♦ మం బేమియున్ లేక యీ
యహి నీ పాదయుగాహతిం బడసె నేఁ ♦ డత్యద్భుతం బీశ్వరా.

ఉ. ఒల్లరు నిర్జరేంద్రపద ♦ మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా
నొల్లరు చక్రవర్తిపద ♦ మొల్లరు సర్వరసాధిపత్యము
న్నొల్లరు యోగసిద్ధి మఱి ♦ యొంట భవంబుల నొందనీని నీ
సల్లలితాంఘ్రిరేణువుల ♦ సంగతిఁ గోరిన ధన్యు లెప్పుడున్. 680

క. ఘనసంసారాహతు లగు జను లాకాంక్షింపఁ గడు న♦శక్యం బగు శో
భనము సమక్షంబున నహిగని యొందా మసుఁడు రోష♦కలితుం డయ్యున్.

వ. దేవా సకల పురుషాంతర్యామి రూపత్వంబువలనఁ బరమ పురుషుండ వయ్యును నపరిచ్ఛిన్నత్వంబువలన మహాత్ముండ వయ్యును నాకాశాది భూత సమాశ్రయత్వంబువలన భూతావాసుండ వయ్యును [1]భూతమయత్వంబువలన భూతశబ్ద వాచ్యుండ వయ్యును గారణాతీతత్వంబువలనఁ బరమాత్ముండ వయ్యును జ్ఞాన విజ్ఞాన పరిపూర్ణత్వంబు గలిగి [2]నిర్గుణత్వ నిర్వికారత్వంబువలన బ్రహ్మంబ వయ్యును బ్రకృతి ప్రవర్తకత్వంబువలన నచింత్యశక్తి వై యప్రాకృతుండ వయ్యును [3]గాలచక్ర ప్రవర్తకత్వంబువలనఁ [4]గాలుండ వయ్యును

(1) భూతమయత్వంబువలనన్ = పంచభూత స్వరూపుఁడగుటవలన. (2) నిర్గుణ...... వలనన్ = హేయములైన గుణములు లేకపోవుటవలనను, లేక శాంత ఘోర మూఢ వృత్తులు గలిగి ఉత్తమ మధ్యమాధమములైన సత్త్వగుణ రజోగుణ తమోగుణములు లేకయుండుటవలనను, గర్భములో నుండుట, పుట్టుట, పెరుగుట, ముదియుట, కృశించుట చచ్చుట అను షడ్భావ వికారములయొక్క లేమివలనను. (3) కాలచక్రప్రవర్తకత్వంబు వలనన్ = అఖండమైన కాలమును నిమేష ఘటికా దిన పక్షమాస ర్త్వయన సంవత్సరాది భేదములచేత చక్రమును త్రిప్పునట్టి వాఁడగుటవలన. (4) కాలుండవయ్యున్ = అఖండమైన కాలస్వరూపుఁడ వయ్యును.

[1]గాలశక్తి సమాశ్రయత్వంబువలనం [2]గాలనాభుండవయ్యును సృష్టి
జీవన సంహారాది దక్షత్వంబువలనం [3]గాలావయవసాక్షి వయ్యును
నొప్పు నీకు నమస్కరించెదము మఱియును. 682

సీ. విశ్వంబు నీవయై ♦ విశ్వంబుఁ జూచుచు
విశ్వంబు సేయుచు ♦ విశ్వమునకు
హేతువవై పంచ ♦ భూతమాత్రేంద్రియ
ములకు మనఃప్రాణ ♦ బుద్ధి చిత్త
ములకెల్ల నాత్మవై ♦ మొనసి గుణంబుల
నావృత మగుచు ని ♦ [4]జాంశభూత
మగు [6]నాత్మచయమున ♦ కనుభూతి సేయుచు
[6]మూఁడహంకృతులచే ♦ ముసుఁగువడక

తే. నెఱి ననంతుఁడవై సర్వ ♦ నియరుచివి
గాక సూక్ష్ముఁడవై నిర్వి ♦ కారమహిమఁ
దనరి [7]కూటస్థుఁడన సమ ♦ స్తంబు నెఱుఁగు
నీకు మ్రొక్కెద మాలింపు ♦ నిర్మలాత్మ. 683

వ. మఱియుఁ గలండు లేఁడు సర్వంబు నెఱుఁగు నించుక యెఱుంగు బద్ధుండు విముక్తుం డొకం డనేకుండు నను నివి మొదలుగాఁగల వాదంబులు మాయవలన ననురోధింపుదురు గావున నానావాదానురోధకుండ వయ్యును నభిదానాభిధేయశక్తి భేదంబువలన బహుప్రభావప్రతీతుండ వయ్యును జక్షురాదిరూపంబులవలనఁ బ్రమాణరూపకుండ వయ్యును నిరపేక్షజ్ఞానంబుకలిమిం గవి వయ్యును వేదమయనిశ్వాసిత్వంబువలన శాస్త్రయోని వయ్యును సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధ రూపంబువలనఁ జతుర్మూర్తి వయ్యును

(1) కాలశక్తి సమాశ్రయత్వంబు వలనన్ = కాల మనెడు శక్తికి మేలయిన యాశ్రయభూతుఁ డగుటవలన. (2) కాలనాభుండవయ్యున్ = కాలము స్వాధీనముఁ గలవాఁడ వయ్యును (3) కాలావసాక్షివయ్యున్ = కాలముయొక్క అవయవము లైన పక్ష, మాస, ఋత్వయనాదులకు సాక్షియైనవాఁడవై (4) నిజాంశభూత మగు = స్వాంశమునందుఁ బుట్టినదయిన. (5) ఆత్మచయమునకున్ = దేవతిర్యఙ్మనుష్యాది ప్రాణ సమూహమునకు. (6) మూఁడహంకృతులచేన్ = రాజస, తామస, సాత్త్విక అహంకారములు మూఁటిచేతను. (7) కూటస్థుఁడు = మహాభూతాది సమూహమున నుండువాఁడు.

భక్తజనపాలకుండ వయ్యును నంతఃకరణ ప్రకాశకత్వంబు గలిగి సేవకజన ఫలప్రదానంబుకొఱకు [1]గుణాచ్ఛాదకుండ వయ్యును జిత్తాది వర్తనంబులఁ గానందగిన గుణంబులకు సాక్షివై యెరుల కెఱుంగరామి నగోచరుండ వయ్యును దర్శింపరాని పెంపువలన [3]నవ్యాహతవిహారుండ వయ్యును సకలకార్యహేతువయ్యు నంతఃకరణ [3]ప్రవర్తకత్వంబువలన [4]హృషీకేశుండ వయ్యును సాధనవశంబు గాని [5]యాత్మారామత్వంబువలన మునివయ్యును స్థూలసూక్ష్మగతుల నెఱుంగుచు నెందుం జెందక నీవు విశ్వంబుగాకయు విశ్వంబు నీవ యయ్యును విశ్వభావాభావ సందర్శనంబు సేయుచు విద్యావిద్యలకు హేతువయిన నీకుం బ్రణామంబులాచరించెదమువధరింపుము.

క. లోక జనస్థితిలయములు
గైకొని చేయుదువు త్రిగుణ ♦ కలితుఁడ వై కా
లాకారమున నమోఘ
[6]శ్రీకలితుఁడ వగుచు నిచ్చ ♦ సెందక యీశా.

క. నీశాంతలు గాని తనువు
లీశా యీ మూఢజాతు ♦ లీ సజ్జాతుల్
నీశాంత తనువు లందుఁ బ్ర
కాశింతువు ధర్మహితము ♦ గా సుజనులలోన్. 686

ఉ. నేరము లెన్న నెక్కుడివి ♦ నేము దలంచు తలంపు లోపలన్
నేరుపు లున్నవే సుతుల ♦ నేరమిఁ దండ్రులు త్రోచిపుచ్చ రే
నేరము సేయువారి ధర ♦ నీపతు లొక్కొకమాటు గావరే
నేరముగల్గు మద్విభుని ♦ నేఁడిటుఁ గావఁగదే కృపానిధీ. 687

---

(1) గుణాచ్ఛాదకుండవయును = త్రిగుణములచేత నావరింపఁబడిన వాఁడవై. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది రూపములను ధరించినవాఁడ వనుట (2) అవ్యాహతవిహారుండ వయ్యున్ = ఊహింపరాని మహిమలు గలవాఁడవై. (3) ప్రవర్తకత్వంబువలనన్ = మనస్సును శబ్దస్పర్శరూపరసగంధాది విషయగ్రహణ శక్తిగల దానిఁగ నడవుటచేత. (4) హృషీకేశుండ వయ్యున్ = పదునాలుగింద్రియములకు నియామకుఁడవై. (5) ఆత్మారామత్వంబు వలనన్ = నీ యందే నీవు క్రీడించుట కలవాఁడ వగుటవలన. (6) శ్రీకలితుఁడవు = అణిమాది సంపదతోఁ గూడుకొన్నవాఁడవు. (7) ఈ సజ్జాతుల్ = నీ స్వరూప జ్ఞానముగల మంచిదేహములను ధరించినవియై.

శా. బాలుండీతఁడు మంచివాఁడనుచుఁ ♦ జెప్పన్ రాము క్రూరుండు దు
శ్శీలుం డౌ నవు నైన నేము సుభగ ♦ శ్రీఁ బాసి వైధవ్య దు
ష్టాలంకారముఁ బొంద నోడెద మనా ♦ థాలాప మాలింపవే
చాలున్ నీ పదతాండవంబు పతిభి ♦ క్షం బెట్టి రక్షింపవే. 688

ఉ. ఆకులమయ్యె భోగమిదె ♦ [1]యాఁదల లన్నియు [2]వ్రస్సెఁ బ్రాణముల్
రాకలఁ బోకలన్ బొలిసె ♦ [3]రాయిడి వెట్టక [4]మా నిజేశుపై
నీ కరుణాకటాక్షములు ♦ నిల్పఁగదే తగ నో సమస్తలో
కైకశరణ్య యో యభయ ♦ కారణ యో కమలామనోహరా.

ఆ. మమ్ముఁ బెండ్లి సేయు ♦ మా ప్రాణవల్లభుఁ
బ్రాణ మిచ్చి కావు ♦ భక్తవరద
నీవు సేయు పెండ్లి ♦ నిత్యంబు భద్రంబుఁ
బిన్ననాఁటి పెండ్లి ♦ పెండ్లి గాదు. 690

ఇంద్ర. నీ యాన నెవ్వారిని ♦ నిగ్రహింపం
[5]డా యుగ్ర పాపాకృతి ♦ నందఁ డింకన్
నీ యాజ్ఞలో నుండెదు ♦ నేఁటినుండిన్
మా యీశు ప్రాణంబులు ♦ మాకు నీవే. 691

వ. అని యిట్లు తమ పెనిమిటి బ్రతుకఁ గోరెడి భుజగసతులయందు శరణాగత రక్షకుండైన పుండరీకాక్షుండు గరుణించి చరణఘట్టనంబు సాలించి తలంగిన నెట్టకేలకుఁ బ్రాణేంద్రియంబుల మఱలం బడసి [6]చదిసి నలఁగిన తలలు సవరించుకొని వగచుచు భుజగపతి జలజనయనునికి నంజలిసేసి మెల్లన యిట్లనియె.

చ. [7]మలఁకలు మా ప్రచారములు ♦ మా ముఖముల్ విషవహ్ని ఘోరముల్
ఖలులము రోషజాతులము ♦ గర్వుల మే మొక మంచివార మే
నలినదళాక్ష ప్రాణులకు ♦ నైజగుణంబులు మాననేర్చునే
వెలయవె మా వికారములు ♦ వింతలె మే లొనరించి తీశ్వరా. 69[illegible]

---

[1] జౌఁదల లన్నియున్ = పడఁగలన్నియును. (2) వ్రస్సెన్ = బ్రద్దలయ్యెను. (3) రాయిడి పెట్టక = బాధపెట్టక. (4) మా నిజేశుపైన్ = మా పెనిమిటిమీఁద, (4) ఆ యుగ్ర......డింకన్ = ఆ మనుపటి పాపరూపమైన భయంకరాకారమును ఈ దినము మొదలుకొని పొందఁడు. (6) చదిసి = పగిలి. (7) మలఁకలు = వంకరలుగలవి.

సీ. వివిధభావాకార ♦ వీర్య బీజాశయ
జనయోనియుతముగా ♦ జగములెల్ల
నీవ చేసితి మున్ను ♦ నే మా జగంబులో
సహజక్రోధనులము ♦ సర్పములము
దుర్వారమైన [1]నీ ♦ ఘోరంపు మాయ నే
మెఱిఁగి దాఁటెడు పని ♦ కెంతవార
మంతకుఁ గారణ ♦ మఖిలేశ్వరుండవు
సర్వజ్ఞుఁ డవు నీవు ♦ జలజనయన

తే. [2]మనిచెదేనియు మన్నించి ♦ మనుపు నన్ను
నిగ్రహించెదవేనిని ♦ నిగ్రహింపు
మింక సర్వేశ మా యిష్ట ♦ మెందుఁ గలదు
చిత్తమం దున్న క్రమమునఁ ♦ జేయఁదగును. 694

క. నా పుణ్య మేమి చెప్పుదు నీ పాదరజంబుఁ గంటి ♦ నే సనకాదుల్
నీ పాదరజము గోరుదు రే పదమం దున్న నైన ♦ నిఁక మేలు హరీ.

వ. అని విన్నవించినఁ గాళియుపలుకులు విన నవధరించి కారుణ్యమాన
సుండయిన సర్వేశ్వరుం డతని కిట్లనియె. 696

క. గోవర్గముతో మనుజులు ద్రావుదు రీమడుఁగు నీరు ♦ దగదిం దుండన్
నీవును నీ బాంధవులును నీ వనితలు సుతులుఁ జనుఁడు ♦ నేఁడంబుధికిన్.

క. నిను నే శాసించిన కథ
మనమునఁ జింతించి రేపు ♦ మాపును గీర్తిం
చిన మనుజులు నీ భయమును
విను మెన్నఁడుఁ బొంద రెందు ♦ [3]విషవిజయముతోన్. 698

చ. ఇది మొద లెవ్వరైన నరు ♦ లీ యమునానది నీ హ్రదంబులో
వదలక తోఁగి నన్ను నుప ♦ వాసముతోడఁ దలంచి కొల్చుచుం
గదలక దేవతాదులకుఁ ♦ గా జలతర్పణ మాచరించినన్
సదమలచిత్తులై దురిత ♦ సంఘముఁ బాయుదు రాక్షణంబునన్.

(1) నీ ఘోరంపుమాయన్ = పరమపురుషుండవైన నీ మూలప్రకృతిని (2) మనిచెదేనియున్ = కాపాడెదు పక్షమున. (3) విషవిజయముతోన్ = విషయమును జయించుటతోను.

ఆ. గరుడభీతి రమణ ♦ కద్వీప మెల్ల కీ
మడుపుఁ జొచ్చి తీవు ♦ మత్పదాబ్జ
లాంఛనములు నీ త ♦ లల నుంటఁ జూచి యా
పక్షిరాజు నిన్నుఁ ♦ బట్టఁ డింక. 700

వ. అని యిట్లు విచిత్రవిహారుండైన గోపాలకృష్ణకుమారుం డానతిచ్చిన నియ్యకొని చయ్యన నయ్యహీంద్రుండు దొయ్యలులుం దానును నెయ్యంబున నయ్యీశ్వరునకు నన్యదివ్యాంబరాభరణరత్నమాలి కానులేపనంబులు సమర్పించి తేఁటి తండంబులకు దండయగు నీలోత్పలంబుల దండ యిచ్చి పుత్త్రమిత్త్రకళత్త్ర సమేతుండై బహువారంబులు [1]కైవారంబు సేసి వలగొని మ్రొక్కి లేచి వీడ్కొని రత్నాకర ద్వీపంబునకుం జనియె నిట్లు.

క. వారిజలోచనుఁ డెవ్వఁడు వారింపఁగ లేని ఫణిని ♦ వాసత్వంబుల్
వారించిన యమున సుధా వారిం బోలుపారె నెల్ల ♦ వారికిఁ బ్రియమై.

—♦ కాళియుని పూర్వకథ ♦—

వ. అనిన విని మునీంద్రా యేమికారణంబునఁ గాళియుండు భుజగనివాసం బయిన రమణక ద్వీపంబు విడిచె నతం డొక్కరుండును గరుడును కేమితప్పఁ దలంచెనని నరవరుం డడిగిన మునివరుం డిట్లనియె.

సీ. [2]సర్పభీరువులైన ♦ జనులెల్ల నెల నెల
సరసభక్ష్యములు వృ ♦ క్షంబు మొదల
సర్పంబులకుఁ బెట్ట ♦ సర్పంబులును మును
సర్పాంతకుఁడు దమ్ముఁ ♦ జంప కుండఁ
బ్రతిమాసమును దమ ♦ భాగభక్ష్యంబు లా
పక్షిరాజున కిచ్చి ♦ బ్రతుకుచుండ
[3]విషవీర్య దుర్మదా ♦ విష్టుఁడై కాళియుఁ
[4]డహికులాంతకుని పా ♦ లపహరించి

(1) కైవారంబులుచేసి = వలగొని స్తోత్రములుచేసి, ప్రదక్షిణము చేసి (2) సర్పభీరువులైన జనులెల్లన్ = పాములవలన భయపడునట్టి జనులందఱును. (3) విషవీర్య దుర్మదావిష్టుఁడై = విషముయొక్క బలముచేతఁ గలిగిన చెడ్డక్రొవ్వుచేత నొళ్లుదెలియనివాఁడై. (4) అహికులాంతకునిపాలు = సర్పకులమునకు యమునివంటి వాఁడైన గరుత్మంతుని కిచ్చునట్టి భక్ష్యభాగమును.

తే. యీక తనపాలి బలిభాగ ♦ మెల్లఁ దినిన
విని ఖగేంద్రుండు కోపించి ♦ ఏవి తలలు
సీరి చెండాడి భోగంబు ♦ చించివైచి
ప్రాణములఁ బాపి వచ్చెదఁ ♦ బట్టి యనుచు. 704

క. అక్షీణ కనకసన్నిభ పక్షయుగోద్ధూతఘోర ♦ పవమాన మహా
విక్షేప కంపితానేక[1]క్షోణీధరేంద్రుఁ డగుచు♦గరుడుఁడు వచ్చెన్.

ఉ. వచ్చిన సర్పవైరిఁ గని ♦ వ్రాలక లేచి మహాఫణావళుల్
విచ్చి [2]దృగంచలంబుల న ♦ వీన విషాగ్నికణంబు లొల్కఁగా
[3]నుచ్చల దుగ్రజిహ్వలు స ♦ హోద్ధతిఁ ద్రిప్పుచు [4]నూర్పులందఁ గా
ర్చిచ్చెగయంగఁ బాఱి కఱ ♦ చెన్ విహగేంద్రు నహీంద్రుఁ డుగ్రతన్

క. కఱచిన భుజగము రదములు
విఱుగఁగ వదనముల విషము ♦ వెడలఁగ శిరముల్
పఱియలుగ నడిచె గరుడుఁడు
తఱిమి కనకరుచులు గలుగు ♦ తన వలఱెక్కన్. 707

వ. ఇట్లహికులారాతిచేత వ్రేటువడి వెఱచి పఱతెంచి కాళియుం డీ గంభీరం బయిన మడుఁగు జొచ్చె మఱియు నొక్క విశేషంబు గలదు.

సీ. మున్ను సౌభరి యను ♦ ముని [5]యీ హ్రదంబునఁ
దపము సేయుచుండ ♦ ధరణిలోన
నాఁకలిగొని పన్న ♦ గాంతకుఁ డొకనాఁడు
చనుదెంచి యిందుల ♦ జలచరేంద్రు
నొడిసి భక్షించిన ♦ నున్నమీనము లెల్ల
ఖిన్నంబులై వగఁ ♦ గ్రుస్సియున్నఁ
జూచి యా మునిరాజు ♦ శోకించి కోపించి
గరుడుఁడు నేఁటాది ♦ గాఁగ నిందుఁ

తే. జొచ్చి మీనంబులను మ్రింగఁ ♦ జూచెనేనిఁ
జచ్చుఁ గావుత మని యుగ్ర ♦ శాప మిచ్చెఁ

---

(1) క్షోణీధరేంద్రుఁడు = పర్వతశ్రేష్ఠములు గలవాఁడు. (2) దృగంచలంబులన్ = కన్నులయందు. (3) ఉచ్చలదుగ్రజిహ్వలు = పైకి చాచుటచేతఁ జలించుచున్న భయంకరములైన నాలుకలు. (4) ఊర్పులందు = శ్వాసలందు. (5) ఈ హ్రదంబున = ఈ మడుగునందున

గాళియుం డొక్కఁడె శాప ♦ కథ నెఱుంగు
నితరభుజగంబు లెవ్వియు ♦ నెఱుఁగ వధిప. 709

వ. అది కారణంబుగాఁ గాళియుండు నీ మడుఁగుఁ జొచ్చియున్న గోమనుజరక్షణార్థంబు కృష్ణుం డతని వెడలించె నిట్లు దివ్యగంధాంబర సువర్ణ మణిగణమాలికాలంకృతుండై మడుఁగు వెడలి వచ్చిన మాధవుం గని ప్రాణలాభంబులం బొందిన యింద్రియంబులుం బోలె యశోదారోహిణీసమేతలయిన గోపికలును నందసునందాదులైన గోపకులును మహోత్సవులం బొంది తేఱి తెప్పఱిల్లి లేచి పరమానందంబునం బొందిరి. బలభద్రుండు తమ్ముని నాలింగనంబుసేసె నప్పుడు.

క. అంకెలు వైచె వృషభము ల
హుంకారముతోడ లేఁగ ♦ లట్టిట్టెటికెన్
బొంకములు నొప్పె ధేనువు
లంకురితము లయ్యెఁ దరువు ♦ లా హరి రాకన్. 711

క. నీసుతుఁడహిచే విడివడె నీ సురుచిరభాగ్యమహిమ♦నిశ్చలమనుచున్ *భూసురులు సతులుఁ బాడుచు[1]భాసురవచనముల నందుఁ♦బలికి రిలేశా.

శా. నిన్నా[2]యుగ్రభుజంగమంబు గఱవన్ ♦ నీ వాపదం బొందుచున్
న న్నేమంటివి తనూజ వాఁడవు గా ♦ నా కూన నా తండ్రి రా
వన్నా యంచు శిరంబు మూర్కొని నిజాం ♦ కాగ్రంబుపై నిల్పుచున్
గన్నీరొల్కఁగ గౌఁగలించెఁ దనయున్ ♦ గారాముతోఁ దల్లి దాన్.

వ. ఇట్లు పరమసంతోషులై [3]ఘోషజనులా రేయి కాళిందీతటంబున నాఁకలి నీరువట్టుల డస్సి క్రుస్సి గోవులుం దారు నుండ నగణ్యంబగు నయ్యరణ్యంబున నొక్కదవానలంబు పుట్టి చుట్టు ముట్టికొని నడురేయి నిద్రితంబైన వ్రజంబుమీఁదఁ గదిసిన నదిరిపడిలేచి [4]దందహ్యమానదేహులయి సకలజనులును మాయామనుజబాలకుండైన హరికి శరణాగతులై యిట్లనిరి. 714

(1) భాసుర వచనములన్ = ప్రసిద్ధములైన మంచిమాటలతో. (2) ఉగ్రభుజంగమంబు = భయంకరమైన పాము. *భూసురులును, ఖేచరులును అని పాఠాంతరము. (3) ఘోషజనులు = మందలోని జనులు (4) దందహ్యమానదేహులు = కాలుచున్న దేహము గలవారు.

-♦ గోగోపగోపికా సంఘమును గార్చిచ్చు చుట్టుకొనుట ♦-

మ. అదె వచ్చెన్ [1]దవవహ్ని ధూమకణకీ ♦ లాభీలదుర్వారమై
యిదె కప్పెన్ మము నెల్లవారి నిట మీఁ ♦ దేలాగు రక్షింపు నీ
పదపద్మంబులకాని యొండెఱుఁగ మో ♦ పద్మాక్ష యో కృష్ణ క్రమ్మె
డిద మో రామ మహాపరాక్రమ దవా ♦ గ్నిన్ వేగ వారింపరే.

క. నీ పాదంబులు నమ్మిన నాపద లెక్కడివి జనుల ♦ కత్యుగ్రమహా
దీపిత తాపజ్వాలనము పైఁ బడకుండెడి విధంబు ♦ భావింపఁగదే.

వ. అని ఘోషించు ఘోషజనులం గరుణించి జగదీశ్వరుం డగు ననంతుం డనంతశక్తియుక్తుండై గహనంబు నిండిన దావదహనంబు పానంబు సేసిన విజయగానంబు దశదిశల నిగిడె. అంతఁ గృష్ణుండు గోగణజ్ఞాతిసమేతుండై మందయానంబున మందకు వచ్చె నిట్లు రామకేశవులు గోపాలబాల వేషంబులం గ్రీడించు సమయంబున.

-♦ గ్రీష్మర్తువర్ణనము. ♦-

సీ. దినము లంతంతకు ♦ దీర్ఘంబులై యుండె
దిననాథుఁ డుత్తర ♦ దిశఁ జరించె
నాఁటి నాఁటికి నెండ ♦ సన్యమై ఖరమయ్యె
వెచ్చని గాడ్పులు ♦ విసరఁ జొచ్చె
మేదినీరేణువుల్ ♦ మింట పంకుల మయ్యె
నేఱులుఁ గొలఁకులు ♦ నిగిరిపోయెఁ
బానీయశాలలఁ ♦ బథిక సంఘము నిల్చెఁ
[2]జప్పరంబుల [3]భోగి ♦ చయము డాఁగెఁ

ఆ. దరులు లతలుఁ గుసుమ ♦ దళములతో వాడె
[4]మిథునకోటికి రతి ♦ మెండు దోఁచె
[5]నఖిల జంతు భీష్మ ♦ మైన గ్రీష్మము రాకఁ
గీలి యడవులందుఁ ♦ గేలి సలిపె. 718

ఆ. వాఁడిరుచులు గలుగు ♦ వాని వేఁడిమి గ్రీష్మ
కాలమందు జగము ♦ గలయఁ బడియె

(1) దవవహ్ని=కార్చిచ్చు. (2) చప్పరంబులన్=మంచిపట్టులయందు. (3) భోగిచయము= పాములసమూహము. (4) మిథునకోటికిన్ = దంపతుల సమూహములకు. (5) అఖిల జంతు భీష్మమైన = సకల జంతువులకును భయంకరమైన.

బ్రహ్మ జనులకొఱకు ♦ బ్రహ్మాండ ఘటమున
నుష్ణరసముఁ దెచ్చి ♦ [1]యునిచె ననఁగ.

వ. ఇట్లాభీలం బయిన [2]నిదాఘకాలంబు వర్తింప బృందావనంబు రామ గోవిందమందిరంబైన కతంబున నిదాఘకాల లక్షణంబులం బాసి నిరంతరగిరినిపతిత[3]నిర్ఝరశీకర పరంపరాభాసిత [4]పల్లవిత [5]కుసుమిత తరులతం బయ్యును దరులతాకుసుమ పరిమళ మిళిత మృదుల [6]పవ నంబయ్యును బవనచలితకమలకహ్లార సరోవర మహాగభీర నదీ హ్రదంబయ్యును నదీహ్రదకల్లోల [7]కంకణ ప్రభూత [8]పంకంబయ్యును [9]పంకసంజనిత [10]హరితాయమాన [11]తృణనికుంజంబయ్యును జన మనోరంజనంబై వసంతకాల లక్షణంబులు గలిగి లలిత మృగ పక్షి శోభితం బయి యొప్పుచుండె మఱియు నందు. 720

క. [12]పికముల కోలాహలమును
శుకసంఘము కలకలంబు ♦ సుభగమయూర
ప్రకరము కేకారవ [13]మళి
నికరము రొదయును జెలంగె ♦ నెఱి నయ్యడవిన్. 721

క. ఆతత యమునా సరసీజాతతరంగాభిషిక్త ♦ [14]జలరుహ గంధో
పేతానిల మడఁచె నిదాఘాతత దావాగ్ని పీడ ♦ నవ్వనమందున్.

వ. ఇట్లామనికందువ తెఱంగు గల్గి సుందరంబైన బృందావనంబునకు బలకృష్ణులు గోవుల రొప్పి కొని చని గోపకులం దారును నొండొరులతో నగుచుఁ దెగడుచుఁ జెలంగుచుఁ దలంగుచుఁ జిఱజిఱం దిరుగుచుఁ దరులస్కంధుల కరుగుచు డాఁగిలిమూఁత లాడుచు గీతంబులు వాడుచు వేణునాదంబులు ఘటియించుచు నటియించుచు గతులు దప్పినక్రియ నొఱగుచుఁ గుప్పల కుఱుకుచుఁ జప్పటలు గొట్టుచుఁ

(1) ఉనిచెననఁగన్ = పెట్టెనో యనునట్టుగా. (2) నిదాఘకాలంబు = వేసవికాలము. (3) నిర్ఝర = సెలయేళ్ళయందలి, శీకర = తుంపురులయొక్క. (4) పల్లవిత = చిగిరించినవియు. (5) కుసుమిత = పూచినవైన (6) పవనంబయ్యును = గాలి గల దగుటచేతను (7) కంకణ = తుంపురులవలన (8) పంకంబయ్యును = బురద గలదగుటచేతను, (9) పంకసంజనిత = బురదయందు మొలచిన. (10) హరితాయమాన=పచ్చన యగుచున్న (11) తృణనికుంజంబయ్యును = కసవుగడ్డి పొదరిండ్లు కలదగుటచేతను. (12) పికముల కోలాహలమును = కోవెలలుయొక్క కలకలధ్వనియును. (13) అళినికరమున్ = తుమ్మెదలయొక్క ఝుంకారధ్వనియును (14)జలరుహగంధ = కమలములయొక్క సువాసనలతో

గందుకంబులఁ దట్టుచు నుప్పరం బెగసి దర్దురంబుల చందంబున దాఁటుచు నామలకబిల్వాది ఫలంబుల మీటుచుఁ గుటవిటపంబులఁ గదల్చుచు మృగంబుల నదల్చుచుఁ బెరల రేఁపుచు మధుమక్షికలఁ జోఁపుచుఁ దేనియలు ద్రావుచు సొమ్మలు వోవుచు గురుశిష్యకల్పనంబులం బనులు సేయుచుఁ [1]గాకపక్షధరులై ముష్టియుద్ధంబులకు డాయుచుఁ బన్నిదంబులు సఱచుచుఁ బులుగులభంగి నఱచుచుఁ బహురూపంబులు వన్నుచు నెగిరి తన్నుచు సేవ్యసేవకమిత్రామిత్రభావంబులు వహించుచు నుత్సహించుచు మఱియు ననేకవిధంబులఁ గ్రీడించి రందు.

క. మా పాలికి బలకృష్ణులు భూపాలకు లంచు నెఱిగి♦బొబ్బ లిడుచు న
గ్గోపాలురు మోతురు ప్రమదాపాదకు లగుచు వల్లి♦కాందోళికలన్.

క. గోపకు లందఱు నాడుచు దీపింపఁగ [2]రామ వాసు♦దేవుల వెనుకం
బై పడి పాఠక గాయకరూపంబులఁ బొగడుదురు ని♦రూఢాత్మకులై.

క. ప్రీతిన్ గోపకులందఱు గీతంబులు వాడఁ దరుల♦క్రిందను నగుచున్
జేతులు ద్రిప్పుచు వెడవెడ పాతర లాడును యశోద♦పాపం డనఘున్.

మ. జలజాక్షుండును రాముడున్ నటనముల్ ♦ సల్పంగ గోపాల మూ
ర్తులతో వారలఁ గొల్చు నిర్జరులు సం ♦ తోషించి [3]వేణుస్వనం
బులుగావించుచుఁ గొమ్ములూదుచు శిరం♦బుల్ ద్రిప్పుచుం బాడుచున్
వల నొప్పన్ వినుతించి రప్పుడు నటుల్ ♦ వర్ణించు చందంబునన్.

-♦ బలభద్రుండు ప్రలంబాసురుని వధించుట ♦-

వ. ఇట్లు రామకృష్ణులు నదనదీతీరంబులఁ గొలంకుసమీపంబుల గిరుల చేరువుల సెలయేఱుల కడల మడుగుల పొదరుల పొంతలఁ బసిమిగల [4]కసవుజొంపంబులఁ బసుల మేపుచుండఁ బ్రలంబుం డను రక్కసుం డుక్కు మిగిలి గోపాలరూపంబున వచ్చి వారల హింస చేయందలంచు చుండ [5]నయ్యఖిలదర్శనుండగు సుదర్శనధరుం డెఱింగియు నెఱుంగని తెఱంగున. 728

(1) కాకపక్షధరులై = పిల్లజుట్లు ధరించువారై. (2) రామవాసుదేవుల వెనుకన్ = బలరామ కృష్ణుల వెనుక చేరుకొని. (3) వేణుస్వనంబులు గావించుచున్ = పిల్లనగ్రోవుల నూదుచు. (4) కసవుజొంపంబులన్ = కసవు (గడ్డి) దట్టముగాఁ బెరిగియుండు చోటులందు (5) అయ్యఖిల దర్శనుండును = సర్వమును చూచుచుండువాఁడు

క. ఆ రాముని సహజన్ముం
డా రమ్మని వాని జీరి యాలాపముతో
గారాము సేసి మెల్లన
పోరామి యొనర్చెఁ బిదప [1]బొరిగొనుకొఱకున్. 729

వ. ఇట్లు ప్రలంబునితోఁ జెలిమి సేయుచుఁ గృష్ణుండు గోపాలకులతో నిట్లనియె.

ఆ. మనకుఁ బ్రొద్దు వోదు మన మిందఱము [2]రెండు
గముల వార మగుచుఁ [3]గందుకములు
శిలలు గుఱులు సేసి చేరి [4]క్రీడింతము
రండు వలయు జయ పరాజయములు. 731

వ. అని యిట్లు పలికి తానును బలభద్రుండును బెన్నుద్దులై యితర వల్లవులెల్ల [5]నుద్దించుకొని [6]చిఱుదుద్దులై వచ్చిన సమయంబున విభజించుకొని రెండుగములై మార్గంబులందుఁ [7]దృణ దారు శిలాకల్పితంబు [8]లగు గుఱు[9]లొడ్డి [10]కందుక [11]శిలాదిప్రక్షేపణంబుల లక్ష్యంబులఁ దాఁకనైచి జయపరాజయ నిర్ణయంబులు గైకొని [12]వాహ్యవాహక లక్షణంబుల నిర్జితులు జేతల వహించి క్రీడించుచు బలరామునికి వాని చందంబు రహస్యంబున నెఱింగించి పసులం బిల్చుచు భాండీరకంబను వటంబు సేరి యా సమయంబునఁ గ్రీడయందుఁ బిదప శ్రీదామనామధేయుండైన గోపకుండు శ్రీకృష్ణుని వహించె భద్రసేనుండు వృషభు నెక్కించుకొనియె బలభద్రుండు ప్రలంబు నారోహించె నప్పుడు.

మ. వనజాక్షున్ బలిమిన్ బలాఢ్యుఁడు [13]తృణావర్తుండు మున్ మింటికిం
గొనిపోఁ జాలక చిక్కెనాఁ డతని నాకున్ మోవ రాదంచు నా

---

[1] పొరిగొనుకొఱకున్ = చంపుటకొఱకు. [2] రెండుగముల వారము = రెండు తెగల వారముగా, [3] కందుకములన్ = చెండ్లతో [4] క్రీడింతము = ఆడుదము. [5] ఉద్దించుకొని = ఉద్దులు పన్నుకొని. [6] చిఱుదుద్దులై = చిన్న ఉద్దులై. [7] తృణదారుశిలాకల్పితంబులు = కసవుతోను, ఎండిన మ్రానుల తోను, రాళ్లతోను జేయఁబడినది. [8] అగు గుఱులు = అనఁగా నిరుతెగల యాటకాండ్రును మించిపోకుండ ఏర్పరచుకొను ఎల్లలను చెండు విసరివేయునపుడు ఉభయుల ఎల్లలకు నడుమ ఆ చెండు తాఁకునట్లు ఉంచఁబడిన లక్ష్యము అని అర్థము. [9] ఒడ్డి = పన్నుకొని [10] కందుకము = చెండు [11] శిలాదిప్రక్షేపణంబులన్ = రాళ్లు మొదలయినవాటిచే నెగరవేయుటచేత. [12] వాహ్యవాహక లక్షణంబులన్ = మోయఁదగినవాఁడు మోచువాఁడు అను లక్షణముచేత. [13] తృణావర్తుండు = తృణావర్తుండను రాక్షసుఁడు.

దనుజారిన్ గొని పోఁదలంచెఁ దగ కేన్ ♦ దైత్యేశుఁ డయ్యాటలోఁ
గొనిపోయెన్ గెలిచాఁటి రాము నఖిల ♦ క్రూరక్షయోద్దామునిన్.

వ. ఇట్లు క్రీడాకల్పితవాహనుండైన ప్రలంబుండు బలభద్రునిం గొనిపోవుచు

మ. గురుశైలేంద్ర సమానభారుఁడగు నా ♦ గోపాలకున్ మోవలే
క[1]రయోద్రేకము మాని దైత్యుఁడు నరా ♦ కారంబు చాలించి భీ
కరదైత్యాకృతి నేఁగ [2]హేమకటకా ♦ కల్పంబుతో రాముతో
మెఱుఁగొప్పం [3]తటిల్ల[4]తేందుయుత జీ ♦ మూతంబు చందంబునన్.

ఉ. మోసము లేక వాని పెను ♦ మూఁపున నుండుచు నా హలాయుధుం
డా సమయంబునం గనియె ♦ [6]హాటకరత్న కిరీట కుండలో
[7]ద్భాసితమస్తకున్ భ్రుకుటి ♦ భాసురదారుణనేత్రు [8]నుగ్రదం
ష్ట్రాసహితుం బ్రలంబు [9]నురు ♦ శౌర్యవిలంబు [10]మదావలంబునిన్.

వ. కని నక్తంచరుం డని యించుక శంకించి వెఱవక.

క. కడువడిఁ దన దివికిం గొని
వడిఁ జనియెడు దనుజుశిరము ♦ వ్రయ్య హలధరుం
డదరి పటుచటులతర మగు
పిడికిట వెస విసరి పొడిచె ♦ బిఱుసున నలుకన్. 738

క. హలధరు బలుపిడికిటి హతిఁ
దల వగిలిన [11]రుధిరజలము ♦ [12]తనువివరములన్
[13]దొలఁక మొఱయిడుచు దనుజుఁడు
[14]బలరిపు పవినిహత నగము ♦ పగిదిం బడియెన్. 739

---

(1) రయోద్రేకము = మిక్కిలి వడిగాఁ బోవుట. (2) హేమకటకాకల్పంబుతోన్ = బంగారుకడియములయొక్క అలంకారము గలవాఁడైన (3) తటిల్లత = మెఱుపు తీఁగ. (4) ఇందుయుత = చంద్రునితోఁ గూడుకొన్న. (5 జీమూతంబు చందంబునన్ = మేఘమువలెనే. [6] హాటకరత్న కుండలంబు = బంగారు రత్నములుగల కిరీటముల చేతను. (7) ఉద్భాసితమస్తకున్ = ప్రకాశించునట్టి శిరస్సు గలవాఁడైన. (8) ఉగ్రదంష్ట్రాసహితున్ = భయంకరమైన కోఱపండ్లతోఁ గూడినవాఁడైన. (9) ఉరుశౌర్యవిలంబున్ = మహాక్రూరత్వముచేత నతిశయుఁడైన. (10) మదావలంబునిన్ = మదమునకు స్థానభూతుడైన. (11) రుధిరజలము = నెత్తురుమాదిరినీరు (12) తనువివరములన్ = దేహములోని చెవి, ముక్కు, నోరు మొదలగు రంధ్రములనుండి. (13) తొలఁకన్ = కాఱఁగా (14) బలరిపు...పడియెన్ = ఇంద్రుని వజ్రాయుధముచేత గొట్టఁబడిన పర్వతమువలెనే నేలఁబడెను.

మత్తకోకిలము

మేలుమేలు గదయ్య రాముఁడు ♦ మేటిరక్కసు నొక్కఁడున్
నేలఁ గూలిచె నొక్కపోటున ♦ నేఁడు విస్మయ మంచు గో
పాలకుల్ గని వచ్చివచ్చిన ♦ భ్రాతఁ గన్న విధంబునం
జాల దీవన లిచ్చి రాముని ♦ సత్కరించిరి వేడుకన్. 740

క. బలవంతుఁ డగు ప్రలంబుఁడు
బలముష్టిన్ నిహతుఁ డైన ♦ బ్రదికితి మనుచున్
[1]బలసూదనాది దివిజులు
బలుపైఁ గుసుమములవానఁ ♦ బరగించి రొగిన్. 741

-♦ శ్రీకృష్ణుండు దావాగ్నిని మ్రింగి గోపక గో సంఘములను గాపాడుట ♦-

వ. ఇట్లు గోపకులు క్రీడింప గోవు లంతంతఁ గాంతారంబున వింతకసవులు [2]మెసవుచు మేతవడి నొండడవికి దూరంబు సని యందు దవదహనపవన సంస్పర్శంబు సైరింపక కంపించి దప్పి నొప్పి సెడి ఘోషించిన. 742

శా. ఆ గోపాలకు లందఱుం బసుల కుయ్యాలించి కౌమార కే
ళీగాఢత్వము మాని గోఖురరదా ♦ ళిచ్ఛిన్న ఘాసంబుతో
బాగై యున్న పథంబునం జని దవా ♦ పన్నంబు గా కుండ వే
వేగన్ గోగణముల్ మరల్చి రటవీ ♦ వీథిన్ జవం బొప్పఁగన్. 743

క. జలధర గభీరరవమున
నలినదళాక్షుండు దమ్ము ♦ నామాంకములం
బిలిచిన విని ప్రతిఘోషణ
మును సేయుచుఁ బసులు దిరిగె ముదమున నధిపా. 744

వ. అంత నవ్వనంబున దైవయోగంబునం గార్చిచ్చు పుట్టి బిట్టువిసరెడి కరువలివలన మిన్నుముట్ట మిట్టిపడి గట్టు చెట్టనక దరికొని పట్టి కాలుచుఁ జుట్టుకొని వరవం గని [3]పల్లటిల్లిన యుల్లంబులతో వల్లవులెల్ల దల్లడిల్లి సబలుండైన హరికి మృత్యుభీతులరీతిం జక్క మ్రొక్కి యిట్లనిరి. 745

[1] బలసూదనాది దివిజులు=ఇంద్రుఁడు మొదలుగాఁ గల దేవతలు. [2] మెసవుచున్=పచ్చిక మేయుచు. [3] పల్లటిల్లిన యుల్లంబులతో = తెల్లబోయిన మనస్సులతో=దిగులుబొందిన మనస్సులతో.

క. [1]అభ్రంకష ధూమాయిత విభ్రాంత [2]మహాస్ఫులింగ ♦ విసరోగ్రశిఖా
[3]విభ్రష్టదగ్ధలోకా[4]దభ్రంబై వచ్చెఁ జూడు ♦ [5]దవశిఖి కృష్ణా 746

శా. నీ చుట్టాలకు నాపదల్ గలుగునే ♦ నే మెల్ల నీ వారమ
న్యాచారంబు లెఱుంగ [6]మీశుఁడవు మా కా ♦ భీలదావాగ్ని నేఁ
డే చందంబున నింక దాఁటుదుము మ ♦ మ్మీక్షించి రక్షింప వ
న్నా చంద్రాభ విపన్నులన్ [7]శిఖివితా ♦ నచ్ఛన్నులన్ ఖిన్నులన్.

వ. అని మఱియు.

ఉ. బంధుజనంబుచేత నిటు ♦ ప్రార్థితుఁడై హరి విశ్వరూపుఁ డో
బంధువులార [8]మీ నయన ♦ పంకజముల్ ముకుళింపుఁ డగ్ని నీ
సంధి నడంతు నే ననినఁ ♦ జక్కన వారలు నట్ల చేయుదుర్
[9]బంధురదావపావకముఁ ♦ బట్టి ముఖంబునఁ ద్రావె లీలతోన్.

వ. ఇట్లు నిజయోగ వైభవంబున దావదహనంబు పానంబుసేసి నిమిష మాత్రంబున గోపకుల నందఱ భాండీరకవట (అను మఱ్ఱిచెట్టు) సమీపంబునకుం దెచ్చి విడిచిన వారు వికసితనయనకమలులై కృష్ణుని యోగ మాయాప్రభావంబున నెరగలిచిచ్చు ద్రుగ్గె నని యగ్గించుచుఁ దమ మనంబులందు. 750

క. [10]కార్చిచ్చార్పుపటుత్వము నేర్చునె నరుఁడొకఁడు శౌరి ♦ నేడి దెకార్చి
చ్చార్చి మనల రక్షింపఁగ నేర్చె నితం డజుఁడొ హరియొ ♦ నిటలాక్షుండో

వ. అని వితర్కించి రంతఁ గృష్ణుండు సాయాహ్నసమయంబున రామ సహితుండై [11]వంశనాళంబు పూరించుచు గోపగణ జేగీయమానుండై [12]గోష్ఠంబు ప్రవేశించె నప్పుడు. 752

క. కమలాక్షుఁ డొద్ద నుండని
నిమిషము యుగశతము గాఁగ ♦ నెగడిన గోప

---

(1) అభ్రంకష = ఆకాశమును ఒరయుచున్న. (2) మహాస్ఫులింగ = గొప్పగొప్ప మిణుఁగురులయొక్క—విసర = సమూహముతోడి (3) విభ్రష్ట = మిక్కిలి చెడిన, (4) అదభ్రంబై = హెచ్చినదై. (5) దవశిఖి = దావాగ్ని. (6) ఈశుఁడవు = ఏలినవాఁడవు (7) శిఖివితా నచ్ఛన్నులన్ = నిప్పుల సమూహములచేత కప్పబడినవారమైన. (8) మీ నయన పంకజములు = మీ నేత్రకమలములు, (9) బంధురదావపావకమున్ = తేన చుట్టునున్న మంటలను. (10) కార్చిచ్చార్పు పటుత్వము = అడవి తగులఁబడుచుండఁగాఁ జల్లార్చు సామర్థ్యము, (11) వంశనాళంబు = పిల్లన గ్రోవి, (12) గోష్ఠంబు = మందయందు,

ప్రమదలు సంభ్రమమున నా
కమలాక్షునిఁ జూచి ముదము • గైకొని రధిపా. 753

వ. ఆ సమయంబున గోపకులింగ్లకడ నున్న వృద్ధకాంతా జనంబులకు రామకృష్ణుల చిత్రచరిత్రంబులు సెప్పిన విని వారు వారిని కార్యార్థులై వచ్చిన [1]వియచ్చరవరు లని తలంచి రంత. 754

—• వ ర్ష ర్తు వ ర్ణ న ము. •—

సీ. పూర్వవాయువులు ప్ర • భూతంబులై వీచెఁ
బడమట నింద్రచా • పంబు దోఁచెఁ
బరివేషయుక్తమై • భానుమండల మొప్పె
మెఱుపు లుత్తరదిశ • మెఱయఁ దొడఁగెఁ
[2]దక్షిణగాములై • తఱి రె మేఘంబులు
జలచరానీకంబు • సంతసించెఁ
[3]జాతకంబుల పిపా • సలు కడపలఁ జేరెఁ
గాంతార వహ్నుల • గర్వ మడఁగె

ఆ. [4]నిజకరాళివలన • నీరజబంధుండు
దొల్లి పుచ్చుకొన్న • తోయమెల్ల
మరలనిచ్చు చుండె • మహికర్షకానంద
కంద మైన వాన • కందు వందు. 755

క. వర్షాకాలభుజంగుఁడు హర్షముతో నిడిన [5]నవన • ఖాంకము లని యుత్కర్షింపభూమిసతిపైఁ [6]గర్షకహలరేఖ లమరె • గహనాంతములన్.

క. చెలువుఁడు [7]ప్రావృట్కాలుఁడు
పొలసినఁ బులకించు భూమి • పులకము లనఁగా
మొలచి తల లెత్తి నిక్కుచు
నలలితగతి జాలు వాఱె • సస్యము లధిపా. 757

---

[1] వియచ్చరవరులు = దేవతాశ్రేష్ఠులు. [2] దక్షిణగాములై = దక్షిణపు దిక్కును గూరిచి పోవువారై. [3] చాతకంబుల పిపాసలు = వానకోయిలలయొక్క దాహము [4] నిజకరాళీ......బంధుండు = కమలములకుఁ బ్రియుఁడైన సూర్యకిరణములచేత [5] నవనఖాంకములు = నూతనములైన నఖక్షతములు. [6] కర్షకహలరేఖలు = సేద్యగాండ్రయొక్క నాఁగేటిచాళ్లు. [7] ప్రావృట్కాలుఁడు = వర్షఋతువనెడు పురుషుఁడు.

వ. మఱియుఁ [1]జటిల పవన చలితంబులై పన్ని మిన్నుదన్ని లెక్కకు మిక్కిలియై తెక్కలు గల నీలగిరుల సిరుల మీఱి కాఱుకొని తెఱపిపడక నిబిడంబులై శిశిరకిరణతరణి మండలంబుల చొప్పు దప్పించి విప్పుగలిగి చదలుగప్పుకొనిన లీలం గ్రాలు నీలమేఘంబులును మేఘవిముక్తంబులును [2]జలదసమయవిటుండు సరసగతి ధరణిసతి యురమ్మున దర్పించి నేర్పునసమర్పించు కర్పూరఖండంబులవడువునఁ బుడమిం బడు కరకలును [3]కరకానుగతంబులై [4]యసిత [5]భోగి భోగంబుల బాగున నీలమణిమాలికా విశేషంబుల విధంబున నెడ పడక పడు సలిలధారలును ధారాధర విగళిత విమల సలిలంబులం దోఁగుచు మదజలాభిషిక్త మత్తమాతంగంబుల సొబగున నుండు కొండలును గొండల తుదలనుండి గండశైలంబులపైఁబడి [6]వికీర్యమాణంబులగు [7]గిరినిర్ఝరంబులు [8]శీకరంబులును శీకరపరంపరల చొదుకులు [8]మదుగులుగొనినఁ బిదపిద సగుచుఁ జిదుకు చిదుకు మను రొంపులును రొంపులు గ్రొచ్చి [10]క్రచ్చఱ నుచ్చలితంబులై పఱచు వఱదలును వఱదలవలన మొసలి కదలి పాఱెడి యేఱులును నేఱుల వెంట [11]గఱులు త్రిప్పుచు గములుగొని క్రొన్నీటి కెదురు నడచు మీనంబులును [12]మీననయనల మేనులు మెఱుంగు సొంపు పెంపు సైరింపక కంపించి తిరిగి సుడిఁగి చనియెడికరణి మేఘమధ్యంబులం బొలసి మలసి నిలువక మరలి చను [12]క్రొమ్మెఱుంగులును మెఱుంగుల తెఱంగున మగువలు పురుషులందగిలి నిలువరని జనుల కెఱుంగ నలువ మొఱ యిడిన తెఱంగున మొరయు నుఱుములును నుఱుములఁ గులికిపడక [14]కిసురు వొడుచుచు బించెంబులు గొంచెం

1. చటులపవన చలితంబులై = గొప్పవాయువులచేత చలింపఁ జేయఁబడినవై. 2. జలదసమయ విటుండు = వర్షఋతు వను విటపురుషుఁడు, 3. కరకానుగతంబులై = వడగండ్లను వెంబడించినవై. 4. అసిత = నల్లని. 5. భోగిభోగంబులన్ = సర్పముయొక్క దేహములను. 6. వికీర్యమాణంబులగు = చెదరుచున్నవైన 7. గిరి......కరంబులు = కొండలయందలి సెలయేళ్ళ నీటితుంపరలును 8. శీకర......చొదుకులు = ఒకటివెంట నొకటిగా నెడతెగక పడునట్టి తుంపరలబొట్లు 9. మదుగులు గొనినన్ = చిలుప, చిలుపలుగాఁ జేరుకొనఁగా. 10. క్రచ్చఱనుచ్చలితంబులై = వేగముగా మీఁది కెగురునవియై 11. గఱులు = రెక్కలు. 12. మీననయనల = స్త్రీలయొక్క. 13. క్రొమ్మెఱుంగులు = క్రొత్తమెఱుఁగులు. 14. కిసురు వొడుచుచున్ = మెడలఁద్రిప్పుచు.

బులు సేయక విప్పి దెప్పరంబుగ నొప్పుచు నర్తనంబులు సలుపు
మయూరంబులును మయూరఘోషంబులు భీషణంబులై చెవులు
సోఁకిన ననూనంబులైన మానంబుల నాసలు సెడి యొండొరులకుఁ
గ్రిందుపడి క్రందుకొను విరహజనులును జనులకు మాపు రే పని
నిరూపింపరాక మాలతీకుసుమ వికచ వికసన విదితావసానంబు లగు
దుర్దినంబులు దినావసానసమయంబున మినుకు మినుకు మని
మెఱయుచుం దిరుగు[1]ఖద్యోతంబులును[2]ఖద్యోతసందర్శనంబు గోరుచు
నుడువక విడువక కురియు జడిం బడి వలిగొని వడఁకుచు నశనయత్నం
బులు వర్జించి ఖర్జూరజంబూఫలభక్షణంబుల దేహసంరక్షణంబు
లాచరించు వనచరులును వనచరానందకారిణులై వారరమణులరుచి
ననవరతభుజగసమేతలగు[2]కేతకులును గేతకీకదంబ యూథికా కుటజ
కుసుమ పరిమళమిళితంబు లగు విపినమార్గంబులును మార్గనిరో
ధంబు లగుచుం బెరిఁగి రసికంబులై పసరు దొలంకుచు హరిన్మణి
కిరణపుంజములభంగి రంజిల్లి తొంగలించుచు జొంపములు గొనిన
గసవులును గసవులు మెసవి మిసమిసం దనువులును మెఱయ వలుఁద
పొదుఁగుల బరువునం గదలక నిలిచి నెమ రమర నిడు ధేనువులును
గలిగిఁ ధేనువ్రజంబు కైవడి [4]బయఃకణ మనోహరంబై హరకరంబు
భంగిఁ బరిపూర్ణ [5]సారంగ భాసురంబై [6]సురగిరి చెలువున [7]హరి
శరాసన విభీషణంబై విభీషణహృదయంబు పోలికం బ్రకటిత [8]హరి
శబ్దవైభవంబై [9]భవపూజనంబు చందంబున [10]నింద్రగోపాదివిభవ
జనకంబై జనకయాగంబుభాతి సీతాప్రకరణాలంకృతంబై కృతయు
గంబుసొంపున బహువర్షంబునై వర్షాగమంబు చెలువొందె నప్పుడు

క. వాడక వ్రాలక తెవులుల
కూడక తగ నల్ల గెఱలు ♦ గొని నవకములై

---

(1) ఖద్యోత = మిణుఁగురుపురుగు, (2) ఖద్యోత = సూర్యుఁడు. (3) కేతక = మొగిలిచెట్టు (4) పయః = పాలు, నీరు, (5) సారంగ = వానకోయిల, (6) సురగిరి = మేరుపర్వతము, (7) హరిశరాసన = ఇంద్రధనుస్సు (8) హరిశబ్దము = కప్పల నాదము-హరినామము, (9) భవపూజనము = ఈశ్వరారాధనము, (10) ఇంద్రగోపాది విభవజనకము = స్వర్గాదివిభవకారణము, ఆరుద్రపురుగులు మొదలైన వాటికి కారణము,

చూడఁగ భద్రము లగుచును
వీడెన్ సస్యంబు లిడుమ [1]వీడెం బ్రజకున్. 759

క. జీవనము చాలఁ గలిగియుఁ
గారవమున మిట్టిపడని ♦ ఘనుని క్రియ నదీ
జీవనములు సార జలనిధి
[1]ప్రావృట్కాలమున డిందు ♦ పడి యుండె నృపా. 760

శా. ఆ వర్షాగమమందు గోవుల నర ♦ ణ్యాంతంబులన్ మేఁపుచున్
గోవిందుండు ప్రలంబవైరియుతుఁ డై ♦ గోపాలవర్గంబుతోఁ
బ్రావీణ్యంబునఁ గందమూలఫలముల్ ♦ భక్షించుచున్ [2]మంజుల
గ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్ది గుడిచెం ♦ [3]గాసారతీరంబులన్. 761

వ. ఆ సమయంబున.

సీ. విశ్వమోహన మైన ♦ వేణు నినాదంబు
సరసగంభీర గ ♦ ర్జనము గాఁగ
మహనీయ నిర్మల ♦ మందహాసద్యుతి
లలితసౌదామనీ ♦ లతిక గాఁగఁ
దలచుట్టు బాగుగఁ ♦ బనరు పింఛపుదండ
[4]శైలభేదనశరా ♦ సనము గాఁగఁ
గరుణాకటాక్ష వీ ♦ క్షణసుధావర్షంబు
సలిలధారా ప్రవ ♦ ర్షంబు గాఁగ

తే. జాడ నేతెంచు గోపాల ♦ జనమునీంద్ర
[5]చాతకంబుల దురవస్థ సక్క జేసెఁ
కృష్ణమేఘంబు బహుతర ♦ కీర్తి నొప్పె
విమల బృందావనాకాశ ♦ వీథియందు.

క. గోవుల వృషవత్సంబుల వావిరిఁ బూజించి పిదప ♦ వర్షాకాల
శ్రీవనితను బూజించెను శ్రీవల్లభుఁ డయ్యు గోప♦శేఖరుఁ డధిపా.

(1) ప్రావృట్కాలంబునన్ = ఆ వర్షాకాలమునందు, (2) మంజుల గ్రావాగ్రంబులన్ = ఒప్పిదమై విశాలములైన బండలమీఁద, (3) కాసారతీరంబులన్ = కొలను దరులయందలి, (4) శైలభేదనశరాసనము గాఁగ = ఇంద్రధనుస్సుమాదిరి, (5) చాతకంబులు = వానకోయిలలు,

వ. ఇట్లు కృష్ణుండు [1]విహితవిహారంబుల వర్షకాలంబు పుచ్చె నంత.

—✦ శరదృతువర్ణనము ✦—

క. [2]జొంపములు గొనియె వనములు
రొంపులిగిరె నెమలిగములు ✦ రొద లుడిగె నదుల్
పెంపులకుఁ బాసె నుఱుములు
శంపల సంపదలు మాసె ✦ శారద వేళన్. 766

వ. మఱియు జీవనంబులు విడిచి విమలవిజ్ఞానవశంబున విముక్తు లగు [3]పురుషరత్నంబుల చెన్నునఁ జెన్నువదలి మిన్నువిడిచి వాయువశంబులై [4]వెల్లివిరిసి చను మేఘంబులును మేఘపటలరహితంబును [5]కలశభవమునిసహితంబును నై [6]విజ్ఞానదీపవిలసితం బగు యోగిహృదయంబు చందంబున శుభంబయిన నభంబును నభంబున నీల [7]దుకూల వితానసంయుక్త [8]ముక్తాఫలంబులవడువున నెగడు [9]నుడుగణంబులును నుడుగణమయూఖంబు క్రొవ్వు లువ్వెత్తుగొని నివ్వటిల్లుచు బ్రహ్మాండ కరండ కర్పూర ఖండాయమానంబు లగు చంద్రకిరణంబులును జంద్రకిరణసంస్పర్శనంబున సగర్భంబులై భూమికి దుర్భరంబులగుచు నిండి పండి [10]హాలికకర నిశిత లవిత్రధారాసంరంభంబుఁదలంచి తల్లడిల్లి నెలువెఱకం బాఱుచుఁ దల్లియగు [11]విశ్వంభరకు మునుకొని ప్రణతంబులై వడంకుచు నెఱుఁగ మొఱ యిడుచున్న పెంపున సంపన్నంబు లయిన [12]యెన్నుల ప్రేఁగున ప్రాలి గాలిం దూలుచు [13]మర్మరధ్వనుల సారస్యంబు లగు కలమాది సస్యంబులును సస్యాక

---

1. విహితవిహారంబులన్ = అప్పటికిఁ దగిన నడవడులచేఁ (వర్షకాలంబున) గడపెను. 2. జొంపములు గొనియెన్ = (శరత్కాలమునందు) ఆకులు మొదలైన వాటిచేత నెఱములేకుండ గుబురుగుబురు లేర్పడెను. 3. పురుషరత్నముల చెన్నునన్ = బ్రహ్మవిద్యాగరిష్ఠుల విధమున, చెన్ను వదలి = బాగుదప్పి. 4. వెల్లివిరిసి = విచ్చలవిడిగాఁ జెదరిపోవునట్టి. 5. కలశభవముని సహితంబును = అగస్త్యుఁ డను మునితోఁ గూడుకొన్నదియు. 6. విజ్ఞానదీప విలసితంబగు = బ్రహ్మజ్ఞాన మనెడి దీపముచేతఁ బ్రకాశించునట్టిదైన. 7. దుకూల = ముఱికిలేని పట్టువస్త్రముచేతనైన. 8. ముక్తాఫలంబులవడువునన్ = ముత్తెపుపూసలవలెనే, 9. ఉడుగణంబులును = నక్షత్రసమూహములును. 10. హాలికకర = సేద్యగాండ్రయొక్క చేతులయందలి. 11. విశ్వంభరకున్ = తమకుఁ దల్లియైనభూదేవికి. 12. ఎన్నుల ప్రేఁగునన్ = ఎన్నుల బరువుచేత. 13. మర్మరధ్వనులన్ = మొరమొర యను ధ్వనులతో.

మంజరీపుంజంబులఁ గొంచక [1]చంచువులఁ ద్రుంచి కబళించి పిల్ల పెంటి తండంబులఁగూడి కడుపులనిండ మెక్కి విక్కసిరసి చొక్కుచుఁ ద్రిక్కులుగొని మహోత్తుంగసమంచితసుంచప్రదేశంబు లెక్కి సంచరించుచు వెన్నెలకావలి యున్న [2]యన్నుల కెమ్మోవులు [3]బింబఫలంబు లని కఱచి [4]తత్కరాస్ఫాలనంబుల నులికిపడి చను [5]శుకనికరంబుల కలకలంబును [6]గలహంసకోక సారస కోలాహల మండితంబులై నిండిన నిర్మలజలంబులు గల జలాశయంబులును జలాశయంబుల జలంబు లనుదినంబు నిగుడ గృహంబుల బ్రదుకు దినంబులు సనుట యెఱుంగని మనుజుల గమనికం దిరుగు జలచరంబులును జలచరహృదయంబుల బెదరు గదుర డొంకె యింకిన నదులును నదులందుఁ గట్టిన మంటపంబులఁ దెలియఁగుచ [7]మణికుట్టిమంబుల మూడ్కొని సౌధసోపానమార్గంబుల జాడను విలోకితంబులగు నూతన సైకతంబులును సైకతప్రదేశంబుల నుదయవేళల నిత్యకర్మానుష్ఠాననిరతు లగు మునులును మునికన్యకాకర కలశ సలిలాభిషిక్తమూలంబు లగు తపోవన బాలరసాల సాలంబులును [8]సాలవిటపివాసంతికా [9]కుంజపుంజంబుల [10]తఱుచున నిఱుముకొని దినకరకిరణంబులకుం గరువలికిం జొర వెరవుపడని వనమ్ములును వనమ్ములం దరుల కొనల నాకలములు [11]నేకలములై మెసంగి [12]మసరు కవిసి క్రొవ్వి కొమ్ముల కొనల నూటి యేటిదరులు త్రవ్వి చిమ్మి కుమ్మి కోరాడెడి వనగజంబులును గజకుంభ కనకకుంభ రుచిరకుచభారభీరు మధ్యసమంచితలగు చెంచితలును జెంచితల క్రూరమ్ములగు వాలమ్ముల సారమ్ములు సెడి ఖేదమ్మునఁ బాదమ్ములు దొట్రుపడఁ బెనుగాదమ్ములంబడు వరాహపుణ్డరీకంబులును బుండరీకకుందకుముద కురండ కాది

---

1. చంచువులన్ = ముక్కులచేత, 2. అన్నుల కెమ్మోవులు = స్త్రీలయొక్క ఎఱ్ఱని పెదవులు. 3 బింబఫలంబులని = దొండపండ్లని 4. తత్కరాస్ఫాలనంబులన్ = వారిచేతి చప్పట్లచేతను 5. శుక.........బులును = చిలుకగుంపుల కలకలధ్వనులును. 6. కలహంస.....తంబులై = హంసలు, చక్రవాకములు, బెగ్గురుపక్షులు మొదలయిన వానియొక్క కలకలధ్వనులచేత 7. మణి...మూడ్కొని = రత్నముల రాతికట్టడపు చోట్లవలెను. 8. సాలవిటపివాసంతికా = ఏపిచెట్లయొక్క, గురివిందపువ్వులయొక్క 9. కుంజపుంజంబుల = పొదరిండ్ల సమూహముల (గుంపుల) యొక్కయు 10 తరుచున్ = క్రిక్కిరియుటచేత 11. ఏకలములై = ఒంటరులై 12. మసరుకవిసి = బల మెక్కి.

కుసుమమకరందంబులు గ్రోలి తేలి సోలి వాలి మహాహంకృతుల ఝంకృతులుసేయు[1] తేఁటికదుపులును గదుపులం గలయక యెడ గలిగి మదమున నదనుపద నెఱింగి [2]మదనమార్గణప్రేరితంబులై పెంటి తుటుముల వెంట నంటంజని యొండొంటి గెంటించుచుఁ దగుల నెక్కు గర్భంబులు నెక్కొలుపు మృగవృషభరాజంబులును గలిగి రాజరాజగృహంబుపగిది విలసితకుందపద్మసౌభాగ్యంబై భాగ్యహీను కర్మంబుగతి నప్రసూతనీలకంఠశబ్దంబై శబ్దశాస్త్రవేదిహృదయంబు బాగుగ విశ్వప్రకాశాభిరామంబై రామసంగ్రామంబుకైవడి బాణాసనాలంకృతంబై కృతాంతహృదయంబుకరణి నపంకంబై పంకజాసను గేహంబుసొంపున రాజహంసవిరాజమానంబై మానధనుని చరిత్రంబుసొబగున నకల్మషజీవనంబై వనధిపోలపున [3]సమ్మిళిత భూభృద్వాహినీసంకులంబై కులవధూరత్నంబు చెలువున నదృష్టపయోధరంబై ధరణికిం దొడవగుచు శరత్కాలంబు వచ్చె నంత.

క. [4]వాజుల నీరాజనములు రాజుల జయగమనములును ♦ రాజితలక్ష్మీ
పూజలు దేవోత్సవములు రాజిల్లెను జగతియందు ♦ రాజకులేంద్రా.

క. చేగ గల చెఱకువింటను బాగుగ నీలోత్పలంబు ♦ బాణంబుగ సం
యోగంబుచేసి మదనుఁడు వేగిరమున విరహిజనుల ♦ వేఁటాడించెన్.

వ. ఇట్లు భాసురంబులైన శరద్వాసరంబుల గోవిందుండు గోబృందసమేతుండై బృందావనమ్మునఁ బసులఁ బొసంగ మేపుచు. 770

సీ. కర్ణావతంసిత ♦ కర్ణికారప్రభ
గండభాగద్యుతిఁ ♦ గడలు కొలుప
భువనమోహనమైన ♦ భ్రూవిలాసంబుతో
వామభాగానత ♦ వదన మొప్ప
నపసవ్యకరమృదు ♦ లాంగుళీచాతురి
షడ్జధ్వనికి మర్మ ♦ సరణిఁ జూప
డాకాలిమీఁద న ♦ డ్డముసాఁచి నిల్పిన
వదనఖద్యుతి భూమిఁ ♦ బ్రబ్బికొనఁగ

1. తేఁటికదుపులును = తుమ్మెద గుంపులును, ౨. మదన మార్గణ ప్రేరితంబులై = మన్మథబాణములచేత ప్రేరేపింపఁబడినవై. ౩. సమ్మిళిత భూభృద్వాహినీ = రాజుల సేనలతోఁ గూడిన, 4. వాజులనీరాజనములు = గుఱ్ఱముల నీరాజనములనెడి శాంతికర్మములును.

తే. [1]వాలిపింఛముఁ గంకదా ♦ ముకుము మెఱయ
విలసితగ్రామముగ నొక్క ♦ వేణు వందు
[2]బ్రహ్మగాంధర్వగీతంబు ♦ [3]పరఁగఁ జేసె
చతుర నటమూర్తి గోపాల ♦ చక్రవర్తి. 771

వ. ఇట్లు హరి వేణునాదంబు పూరించిన [4]మారవికారహేతువగు తద్గీతం బాలించి సిగ్గులు సాలించి మక్కువలు సెక్కు లొత్త గోపిక లోపికలు లేక తమ తమ పొత్తుకత్తెలుం దారును దత్తఱంబునఁ బదుగురు నేగురుఁ దుటుములు గొని జిలిబిలి ముచ్చటలకుం జొచ్చి తమలోన.

మ. [5]శ్రవణోదంచిత కర్ణికారకముతో ♦ స్వర్ణాభచేలంబుతో
[6]నవతంసాయిత [7]కేకిపింఛకముతో ♦ [8]నంభోజదామంబుతో
[9]స్వవశుండై మధురాధరామృతముచే ♦ వంశంబుఁ బూరించుచు
న్నవిదా మాధవుఁ డాలవెంట వనమం ♦ దొప్పారెడిం జూచితే.

శా. రావే సుందరి యేమె బోటి వినవే ♦ రాజీవనేత్రుండు బృం
దావీథిం దగ వేణు వూఁదుచు [10]లస ♦ త్సవ్యానతాస్యంబుతో
[11]భ్రూవిన్యాసము [12]లంగుళీక్రమములుం ♦ బొల్పార షడ్జంబుగాఁ
గావించెన్ నటుభంగి బ్రహ్మ మగు ద ♦ ద్గాంధర్వ సంగీతమున్.

క. కలఁకెను గొబ్బునఁ జిత్తము నలినాక్షునిమధుర వేణు♦ నాదము నావీ
నులుసోఁకినంతమాత్రన చెలియా యిఁక నెల్లువెఱవు ♦ చింతింపఁగదే.

క. నాతోడ వెఱవ వలదే నాతోడనె కొనుచుఁబోయి♦ నలినదళాక్షున్
నీతోడుతఁ బలికించెద నీతోడిజనంబు మెచ్చ ♦ నీతోడు సుమీ.

---

(1) వాలిపింఛమున్ = సిగయందలి నెమలికుంచయు, (2) బ్రహ్మ గాంధర్వ గీతంబున్ = వేదసంబంధమైన గాంధర్వ సంగీతమును, (3) పరగఁజేసెన్ = ప్రకాశింపఁజేసెను, (4) మారవికారహేతువు = మన్మథవికారమునకు హేతువైనది (5) శ్రవణోదంచిత = చెవులకు మిక్కిలి ఆనందము గలిగించునది (6) అవతంసాయిత = శిఖగాఁ జేయఁబడిన, శిఖయందుంచుకొన్న యనుట. (7) కేకిపింఛకముతోన్ = నెమలికుంచతోను, (8) అంభోజదామంబుతోన్ = తామర పువ్వుల దండతోను (9) స్వవశుండై = స్వతంత్రుఁడై. (10) లసత్సవ్యానతాస్యంబుతోన్ = ఎడమవైపునకు వంచబడిన నగుమోముతో, (11) భ్రూవిన్యాసములన్ = కనుబొమ్మలయొక్క చలింపఁజేయుటయును, (12) అంగుళీక్రమములున్ = చేతివ్రేళ్ళు ఉంచుటరీతిని (క్రమమును.) (13) షడ్జంబుగాన్ = షడ్జము (పెద్ద) స్వరముగా.

వ. అని పెక్కుభంగుల లోకకర్తృకర్త నుద్దేశించి పలుకుచు గోపసుందరులు బృందావనంబునకు గోవిందున కెదురు చని పరమానందంబున నతనిం దమ మనంబులం బ్రతిపదంబును నాలింగనంబు సేసినవార లగుచు రామకృష్ణుల నుద్దేశించి. 777

మ. [1]నవగోస్థానక రంగమందుఁ బరమా ♦ నందంబుతోఁ జూతప
ల్లవ నీలోత్పల పింఛ పద్మ దళమా ♦ లా వస్త్ర సంపన్నులై
[2]కవలై వేణువు లూదుచున్ బహునటాకారంబులం గేళి తాం
డవముల్ సేసెద రీ కుమారకులు వేడ్కం గామినుల్ గంటిరే.

క. ఓ చెలువలార వినుఁడీ
[3]వాచాశతకంబు లేల ♦ వర్ణింపంగా
లోచనముల కలిమికి ఫల
మీ చెలువురఁ జూడఁ గలుగు ♦ టింతయ సుండీ. 779

వ. అని పలికి రందుఁ గొందఱు గోవిందు నుద్దేశించి. 780

మ. ఒనరన్ వ్రేతల కించు కేమియును లే ♦ కుండంగ [4] గోపాల కృ
ష్ణుని కెమ్మోవిసుధారసంబు గొనుచుం ♦ జోద్యంబుగా మ్రోయుచుం
దనపర్వంబులు నేత్రపర్వములుగా ♦ దర్శించెఁ బూర్వంబునన్
వనితా యెట్టి తపంబు సేసెనొకొ యీ ♦ వంశంబు వంశంబులోన్.

మ. ముదితా యే తటినీపయఃకణములన్ ♦ మున్ వేణు వింతయ్యె నా
[5]నది సత్పుత్రుని గన్నతల్లి పగిదిన్ ♦ నందంబుతో నేఁడు స
మ్మదహంసధ్వని పాటగా వికచపద్మశ్రేణి [6]రోమాంచమై
[7]యొదవం దుంగతరంగహస్తనటనోద్యోగంబు గావింపదే.

క. నలినోదరు భక్తునిఁ గని
కులజులు ప్రమదాశ్రుజలము ♦ గురియుపగిది మ్రాఁ
కులు పూఁదేనియ లొలికెడు
నళినాక్షునిచేతి వంశనాళము మ్రోఁతన్.

---

1. నవగోస్థానక రంగమందున్ = క్రొత్తయయిన పశువులు ఆటలాడుదొడ్డి 2. కవలై = జతయై 3. వాచాశతకంబులేల =(వర్ణింప శక్యముకాని) నూరుమాటలు ఎందుకు 4. గోపాల......రసంబు = ఆ కృష్ణపరమాత్మయొక్క ఎఱ్ఱని నోటినుండి అమృతరసమును తీసికొనుచు 5. ఏ తటినీపయఃకణములన్ = ఏ నదియందలి నీటి తుంపరలచేత 6. రోమాంచమై = గగుర్పాటై 7. ఒదవన్ = జతపడఁగా

శా. నా మోహంబున కెద్ది మేర వినవే ♦ నా పూర్వజన్మంబునన్
లేమా నోములు నోచుచో నకట [1]కా ♦ ళిందీతటిన్ వేణువై
భూమిం బుట్టెద నంచుఁ గోరఁ దగదే ♦ బోధిల్లి యెట్లైన నీ
బామం దిప్పుడు మాధవాధరసుధా ♦ పానంబు గల్గుంగదే. 784

క. కాళిందీ కూలంబున
నాళీ యీ నందసుతుని ♦ యధరామృతముం
గ్రోలెడి వేణువ నగు నో
మేలాగున నోమవచ్చు ♦ నెఱిఁగింపఁగదే. 785

క. వనితా కృష్ణుఁడు నల్లని
ఘన మనియున్ వేణురవము ♦ గర్జన మనియున్
మనమునఁ దలంచి రొప్పుచు
ననవరతము [2]నెమలితుటుము ♦ లాడెడిఁ గంటే. 786

క. [3]గిరిచరమిథునము [4]లోలిం
బరికింపఁగఁ గృష్ణపాద ♦ పద్మాంకితమై
సురరాజు నగరికంటెను
దరుణీ బృందావనంబు ♦ దద్దయు నొప్పెన్. 787

మ. అమరేంద్రాంగన లాకసంబున విమా ♦ నారూఢలై పోవుచుం
గమలాక్షున్ శుభమూర్తిఁ గాంచి మురళీ ♦ గానంబు లాదంద క
ర్ణములన్ నిల్పుచు మేఖలల్ వదలఁగా ♦ [5]నాథాంకమధ్యంబులం
బ్రమదా వ్రాలిరి చూచితే వివశలై ♦ పంచాశుగభ్రాంతలై. 788

ఉ. కానల నుండుచున్ సరస ♦ గానవివేక విహీనజాతలై
వీనుల నేఁడు కృష్ణముఖ ♦ వేణురవామృతధార సోఁకినన్
మేనులు మేఁతలున్ మఱచి ♦ మెత్తని చూడ్కి మృగీమృగావళుల్
మానిని చూడ వమ్మ బహు ♦ మానము సేసెఁ గృతార్థచిత్తలై.

---

1. కాళిందీతటిన్ = యమునానది గట్టునందు. 2. నెమలితుటుము = నెమిళ్ళ గుంపులు. 3. గిరిచరమిథునములు = కొండలయందు సంచరించునట్టి యెఱుకవాండ్ర దంపతులు. 4. ఓలిన్ = వరుసగా 5. నాథాంకమధ్యంబులన్ = పెనిమిటి ఒళ్ళలో 6. పంచాశుగభ్రాంతలై = మన్మథవేదన (మోహావేశము) చేత భ్రమ చెందినవారై.

ఉ. తల్లులచన్నుఁబాలు మును ♦ ద్రావుతఱిం దమకర్ణవీథులన్
వల్లభమైన మాధవుని ♦ [1]వంశరవామృతధార సొచ్చినం
ద్రుళ్ళక [2]పాలు రాఁదివక ♦ దూఁటకమానక కృష్ణుమీఁద [3]దృ
గ్వల్లులు సేర్చి నిల్చె నదె ♦ వత్సము లంగనలార కంటిరే! 790

మ. ప్రమదన్ మోములుమీఁదికెత్తికొని[4]రో ♦ మంథంబుసాలించి[5]హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్పి మురళీ గా ♦ నామృతశ్రేణి క
ర్ణములం గ్రోలుచు మేఁత మాని [6]గళితా ♦ నందాశ్రులై చిత్రితో
పమలై గోవులు సూచుచున్న వవిగో ♦ పద్మాక్షి వీక్షించితే. 791

మ. జగతీజంబుల శాఖ లెక్కి మురళీ ♦ శబ్దామృతస్యందముల్
మిగులన్ వీనులఁ ద్రావి [8]ప్రేఁగువడి నె ♦ మ్మిం గృష్ణురూపంబు చి
త్తగమై యుండఁగ నడ్డపెట్టుక్రియ నే ♦ త్రంబుల్ దగన్ మూసి యీ
ఖగముల్ సొక్కెడిఁ జూచితే మునిజనా ♦ కారంబులం గామినీ. 792

మ. క్రమ మొప్పన్ నదు లెల్ల వంశరవ మా ♦ కర్ణించి సంజాతమో
హములన్ [9]మన్మథసాయకక్షతవిశా ♦ లావర్తలై హంస వా
క్యములం జీఱి తరంగహస్తముల నా ♦ కర్షించి పద్మోపహా
రములం గృష్ణపదార్చనంబు సలిపెన్ ♦ రామా విలోకించితే. 793

ఆ. వనిత నేఁడు కృష్ణు♦వంశనినాదంబు విని పయోధరంబు♦విరులుగురిసి
తనశరీరమెల్ల ♦ ధవళాతపత్రంబుఁ జేసి మింట నీడఁ ♦ జేసెఁ గంటె.

క. మంచిఫలంబులు హారిచే నించి కరాలంబనముల ♦ నెగడుచు నిదె క్రీ
డించెట రంగన చూడుము [10]చెంచితలంబింఛపత్త్రి♦చేలాంచితలన్.

---

1. వంశరవ = వేణునాద మనెడు (అమృతధార) 2. పాలు రాఁదివక = పాలును ద్రాగక. 3. దృగ్వల్లులు = తీఁగలుగ సాగుచున్న చూపులను. 4. రోమంథంబు = నెమరువేయుటను. 5. హృత్కమలాగ్రంబులన్ = హృదయ కమలము మీఁద మనస్సు నుంచినవియై. 6. గళితానందాశ్రులై = కన్నులవెంటఁ గాఱుచున్న యానందబాష్పములు కలవియై. 7. చిత్రితోపమలై = చిత్రపు బొమ్మలతోఁ బోల్పఁదగినవియై. 8. ప్రేఁగువడి = భారమును వహించి. 9. మన్మథ సాయకక్షతవిశాలావర్తలై = పెద్దసుడు లనెడు మన్మథుని ములికిపోటులుగలవియై. 10. చెంచితలం........................చితలన్ = నెమలి యీకలువలె చిత్రించిన చీరలు ధరించిన చెంచుపిల్లలను.

క. [1]ఉల్లసిత కుచభరంబున నల్లాడెడి నడుముతోడ ♦ [2]నలరులదండన్
భిల్లి యొకతె హరి కిచ్చెను [3]హల్లోహలకలిత యగుచు ♦ నంగనకంటే.

క. గిరు లెల్ల జలము లయ్యెం
దరు లెల్లను [4]బల్లవించె ♦ ధరణి గగనభూ
చరు లెల్లను జొక్కిరి హరి
మురళీరవామృతము సోఁకి ♦ ముద్దియ కంటే. 797

మ. [5]బలకృష్ణాంఘ్రి సరోజ సంగమముచే ♦ భాసిల్లుచున్ ధన్యమై
ఫలపుష్పంబులఁ గానికల్ గురిసి సం ♦ భావించి [6]మిన్నందుచున్
[7]జలఘాసంబుల గోవులం దనిపి [8]చం ♦ చద్వ్యాజరోమాంచమై
వెలసెం జూడఁగదమ్మ యీ గిరి పురో ♦ వీథిన్ సరోజాననా. 798

వ. అని యిట్లు బృందావన విహారియైన గోవిందుని సంవర్ణించి [9]పంచబాణభల్లభగ్నహృదయ లయి వల్లవకాంత లేకాంతంబులఁ జింతించుచుఁ [10]దత్పరతంత్ర లయి యుండి రంత. 799

—♦ హేమంతఋతువర్ణనము ♦—

క. [11]చామంతికాస్రగంచిత
సీమంతవతీ [12]కుచోష్ణ ♦ జిత శీతభయ
శ్రీమంతం బయి గొబ్బున
హేమంతము దోఁచె మదనుఁ ♦ [13]డేఁచె విరహులన్. 800

1. ఉల్లసిత = నిక్కిన. 2. అలరుల దండన్ = పూలదండను. 3. హల్లోహల కలిత = మోహముతోఁ గూడుకొన్నది. 4. పల్లవించెన్ = చిగిరించెను. 5. బల ......సంగమముచేన్ = బలరామకృష్ణులయొక్క పాదకమలముల సోఁకుడు చేత 6. మిన్నందుచున్ = ఆకాశము ముట్టుచు. 7. జలఘాసంబులన్ = నీళ్ళచేతను, గడ్డిచేతను, 8. చంచద్వ్యాజ రోమాంచమై = ఒప్పిదములైన వృక్షములనెడు గగుర్పాటుకలదై. 9. పంచ...హృదయలై = మన్మథుని బాణములచేత భంగపెట్టబడిన హృదయములు గలవారలై. 10. తత్పరతంత్రలై = శ్రీకృష్ణుని యందు ఆసక్తములైన వ్యాపారములు గలవారలై. 11. చామంతికాస్రక్ = చామంతి పూలదండలతో, అంచిత = ప్రకాశించుచున్న, సీమంతవతీ = పాపటలు గలిగిన (స్త్రీలయొక్క) 12. కుచోష్ణ ...... శ్రీమంతంబయి = చలివలనిభయమును జయించిన స్తనముల యొక్క యుష్ణసంపదకలదియై. 13. ఏఁచెన్ = పీడించెను.

క. ఉత్తరపుగాలి విసరె [1]వి
యత్తలమునఁ [2]దుహినకిరణుఁ ♦ డహితుం డయ్యెం
బొత్తు జరిగె మిథునములకు
[3]నెత్తమ్ములు దఱిఁగె హిమము ♦ నెలకొనియె నృపా. 801

క. అహములు సన్నము లయ్యెను
దహనము హిత మయ్యె దీర్ఘ ♦ దశ లయ్యె నిశల్
బహుశీతోపేతం బయి
యుహుహూహూ యని వడఁకె లోక ♦ ముర్వీనాథా. 802

క. అన్నులచన్నులవంత విపన్నులు గా కెల్లవారు ♦ బ్రదికిరి గా కీ
చన్నులమీఱిన [4]వలి నాపన్నులు గాకుండఁ దరమె ♦ బ్రహ్మాదులకున్.

ఆ. పొడుపుఁ గొండమీఁదఁ ♦ బొడుచుట మొదలుగాఁ
[5]బరువు పెట్టి యినుఁడు ♦ పశ్చిమాద్రి
మఱుఁగుఁజొచ్చెఁ గాక ♦ మసలినఁ జలిచేతఁ
జిక్కఁ జిక్క ననఁగఁ ♦ జిక్కకున్నె. 804

క. [6]చెంగల్వవిరులగంధము
మంగళముగఁ గ్రోలుచున్న ♦ [7]మధుపము లొప్పె
[8]ననంగజవహ్నులపైను
పొంగి విజృంభించు పొగల ♦ పోలిక నధిపా. 805

ఆ. శంభుకంట నొకటి ♦ జలరాశి నొక్కటి
మఱియు నొకటి మనుజ ♦ మందిరముల
నొదిఁగెఁ గాక మెఱసి ♦ యున్న [9]మూఁడగ్నులు
గలికి నోడి భక్తి ♦ సలుపకున్నె. 806

1. వియత్తలమునన్ = ఆకాశమునందు. 2. తుహినకిరణుఁడు = చల్లని కిరణములు గలవాఁడైన చంద్రుఁడు. 3. నెత్తమ్ములు = వికసించిన కమలములు 4. వలిన్ = చలి చేత. 5. పరువువెట్టి యినుఁడు = సూర్యుఁడు పరుగెత్తి. 6. చెంగల్వవిరుల గంధము = ఎఱ్ఱకలువలయందలి పరిమళము. 7. మధుపములు = తుమ్మెదలు. 8. అంగజవహ్నుల పైన్ = మన్మథాగ్నులమీఁద. 9. మూఁడగ్నులు = గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని అను అగ్నులు మూఁడును.

శా. ఈ హేమంతము రాకఁ జూచి రమణీ ♦ [1]హేలాపరీరంభ [1]స
త్సాహాయ్యంబునఁ గాని దీని గెలువన్ ♦ శక్యంబు గాదంచుఁ దా
[3]రూహాపోహవిధిం బ్రదిమూర్తులు సతీ ♦ యుక్తాంగులై నారు గా
కోహో వార ల దేమి సంతతవధూ ♦ యోగంబు రాఁ గందు రే.

క. ఈ హేమంతమురాకకు శ్రీహరి యొక్కింత వడఁకి ♦ చింతింపంగా
నోహో వెఱవకుమని తా మాహరికిని శ్రీకుచంబు♦లభయంబిచ్చెన్.

వ. ఇట్లు నియంతం బగు హేమంతంబున మొదలినెల తొలిదినంబు
నందు నందుని మందం గల గోపకుమారికలు రేపకడ లేచి చని
కాళిందీజలంబులం దోఁగి జలతీరంబున నిసుమునం గాత్యాయనీ
రూపంబుఁ జేసి సురభికుసుమగంధంబు లిడి ధూపదీపంబు లిచ్చి
బహువిధోపహారంబులు సమర్పించి. 809

క. ఓ కాత్యాయని భగవతి నీకున్ మ్రొక్కెదము మేముః♦నేఁ డనుకంపన్
మాకిందఱకును వైళమ శ్రీకృష్ణుఁడు మగఁడుఁగాఁగఁ♦జేయుముతల్లీ.

క. ఓతల్లి మాకుఁ గృష్ణుఁడు చేతోవిభుఁ డైననాఁడు♦చెలువల మెల్లన్
నేతివసంతము లాడుచు జాతర సేసెదము భక్తి ♦ చాతురితోడన్.

వ. అని నమస్కరించి [4] హవిష్యంబులు గుడుచుచు నివ్విధంబున మాస
వ్రతంబు సలిపి రం దొక్కనాఁడు. 812

—: గోపికావస్త్రాపహరణము :—

మ. రమణుల్ ప్రొద్దున మేలుకాంచి సఖులన్ ♦ రండంచు నాత్మీయనా
మములం జీరి కుచద్వయీభరచులన్ ♦ మధ్యంబు లల్లాడఁగాఁ
బ్రమ [5]దోద్దామగజేంద్రయాన లగుచుం ♦ బద్మాక్షునిం బాడుచున్
యమునాతీరముఁ జేరఁబోయిరి.[6]గృహీ ♦ తాన్యోన్యహస్తాబ్జలై. 813

---

1. హేలాపరీరంభ = విలాసరూపమయిన ఆలింగనముయొక్క 2. సత్సాహాయ్యంబునఁగాని = మంచి సత్ సాంగత్యము చేతనే గాని 3. ఊహాపోహావిధిన్ చర్చచేసి యేర్పఱచుకొన్న నిశ్చయము చేత. 4. హవిష్యంబులు = నివేదిత ప్రసాద.. మొదలైనవి. 5. ఉద్దాము = నివారింపరాని 6. గృహీతాన్యోన్యహస్తాబ్జలై = ఒకరి నొకరు హస్తములు పట్టుకొన్నవారై.

వ. ఇట్లానదీతీరంబు సేరం జని గజగమనలు విజనప్రదేశంబున వలువలు
విడిచి యిడి మది శంకలేక యలంకృతలై క్రుంకులిడఁ జలంబున
జలంబుసొచ్చి. 814

క. వారిజలోచనుఁ బాడుచు వారిజలోచనలు వారి ♦ వారికి వేడ్కన్
వారివిహారము సలిపిరి వారి విహారములు జగతి ♦ వారికిఁ గలవే.

వ. ఆ సమయంబున. 816

క. తోయజనయనలు యమునా
తోయములం దుంట యెఱిఁగి ♦ దూరగుఁ డయ్యుం
దోయజనయనుఁడు హరి [1]తన
తోయము గోపకులు దానుఁ ♦ దోఁతెంచె నృపా. 817

తరలము. కదలకుండని తోడివారలఁ ♦ గన్నుసన్నల నిల్పుచుం
బదము లొయ్యన నేలఁ బెట్టుచుఁ ♦ బద్మనేత్రుఁడు మానియై
పొదలమాటున నల్ల నల్లన ♦ పొంచి పొంచి [2]నతాంగుఁడై
యదను గోరుచు డాసి [3]వ్రేతల ♦ యంబరంబులు దొంగిలెన్. 818

శా. [4]ఉద్యద్గంధగజేంద్రగౌరవముతో ♦ యోషాంబరంబుల్ విభుం
[5]డాద్యుం డర్భకుభంగి ♦ [6]నర్భకులతో ♦ [7]హాసార్థియై కొంచుఁ [8]ద
న్నద్యంభఃకణ శీతవాతజనితా ♦ నందంబుతో నెక్కెఁ దా
[9]సద్యోముక్తదురంతపాదప జను ♦ స్సంతాపమున్ [10]నీపమున్. 819

వ. అప్పు డయ్యింతు లిట్లనిరి. 820

క. మామా వలువలుముట్టకు మామాకొనిపోకు పోకు♦మన్నింపుతగన్
మా మానమేలకొనియెదు మా మానసహరణమేల♦మానుముకృష్ణా

---

1. తనతోయము = తన పరిజనము. 2. నతాంగుఁడై = వంగి దేహము ముడుచుకొన్నవాఁడై. 3. వ్రేతల యంబరంబులు = గోపికల వస్త్రములను, 4. ఉద్య...ముతోన్ = మదించిన గజరాజు గౌరవము (నడక) తో. 5. ఆద్యుండర్భకుభంగిన్ = ప్రపంచోత్పత్తి స్థితి లయములకు మూలపురుషుఁడైన శ్రీకృష్ణమూర్తి బాలునివలెనే. 6. అర్భకులతోన్ = గోపబాలకులతో. 7. హాసార్థియై = వేడుకను గోరుచున్నవాఁడై, 8. తన్నద్యంభఃకణ = ఆనదియందలినీటితుంపరలు, శీత...ఆనందంబుతోన్ = చల్లని గాలివీచుటచేత గలిగిన సంతోషముతో. 9. సద్యో...... తాపమున్ = వెంటనే విడువబడిన అంతములేని వృక్షమువంటి జన్మచేఁ గలిగిన సంతాపము గలది. 10. నీపమున్ = కడిమిచెట్టును.

సీ. బహుజీవనముతోడ ♦ భాసిల్లి యుండుటో
గోత్రంబు నిల్పుటో ♦ కూర్మితోడ
మహి నుద్ధరించుటో ♦ మనుజసింహంబవై
ప్రజలఁ గాఁచుటొ కాక ♦ బలిఁ దెరల్చి
పిన్నవై యుండియుఁ ♦ బెంపు వహించుటో
రాజుల గెల్చుటో ♦ రణము లందు
గురునాజ్ఞ సేయుటో ♦ గుణనిధి వై బల
ప్రఖ్యాతిఁ జూపుటో ♦ భద్రలీల

ఆ. బుధులు మెచ్చ భువిఁ [1]బ్ర ♦బుద్ధత మెఱయుటో
[2]కల్కితనము సేయ ♦ ఘనత గలదె
వావి లేదు వారి వారు నా వారని
యెఱుఁగ వలదె వలువ ♦ లిమ్ము కృష్ణ. 822

క. కొంటివిమాహృదయంబులుగొంటివిమానంబులజ్జఁ♦గొంటివివలువల్
గొంటి విఁక నెట్లుసేసెదొకొంటెపుగద నిన్ను నెఱిఁగి♦కొంటిమికృష్ణా.

సీ. రాజసంబున నీవు ♦ [3]రంజిల్లు టెఱుఁగమే
చెలరేఁగి వింతలు ♦ సేయు చుండ
సత్త్వసంపద గల్గి ♦ జరుగుటఁ దలఁపమే
సిరిగల్గి యన్యులఁ ♦ [4]జెనకు చుండ
[5]గురుతరశక్తియు ♦ క్తుఁడ వౌటఁ జూడమే
తామసంబున నెగ్గు ♦ దలఁచు చుండ
నొకభంగితో నుండ కుంటఁ జి తింపమే
[6]మాయావివై [7]మాఱు ♦ మలయు చుండ

ఆ. నేమి జాడవాఁడ ♦ వేపాటి గలవాఁడ
వేగుణంబు నెఱుఁగ ♦ వెల్లయెడల

---

1. ప్రబుద్ధతన్ = మిక్కిలి తెలివి గలిగినవానితనమును, 2. కల్కితనము సేయన్ = నేర్పరితనమును జూపుటచేతను, 3. రంజిల్లుట = ప్రకాశించుట, 4. చెనకుచుండన్ = కలఁతఁ బెట్టుచుండఁగా 5. గురుతరశక్తియుక్తుఁడవు = మిక్కిలి యధికమైన బలముతోఁ గూడుకొన్నవాఁడవు, 6. మాయావివై = మాయలుచేయువాఁడవై. 7. మాఱు మలయుచుండన్ = గర్వాతిశయముతో మెలఁగుచుండఁగా, 8. ఏమిజాడవాఁడవు = నీవు ఏ విధమైన నడవడిగలవాఁడవు.

నోదిఁగి యుండ నేర ♦ [1]ఓరంతప్రొద్దును
బటము లీఁ గదయ్య ♦ పద్మనయన. 725

క. రాజుల నెఱుఁగవు బలిమిని రాజిల్లెదు చీర లీవు ♦ రమణుల మింకన్
రాజున కెఱిఁగించెద మో రాజీవదళాక్ష నీవు ♦ రాజవె ధరకున్.

వ. అని పలికిన కన్నియల పలుకులు విని మందహాస సుందరవదనారవిందుండై గోపబాలికల కరంబులం గరంబులు వేసి యమ్ముద్దియల నుద్దేశించి నెఱవాది చతురుం డిట్లనియె. 827

శా. రావేల్ రాజులతోడ నీపనికి నా ♦ రంభింతురే మీక్రియన్
మోహవ్యాకులయు లేక దూఱెదరు మీ ♦ మోసంబు చింతింప [2]నం
భోమధ్యంబుననుండి వెల్వడి వెసం ♦ బూర్ణేందు బింబాననల్
మీ మీ చీరలు వచ్చి పుచ్చుకొనుఁడా ♦ మీకిచ్చెదం జెచ్చెరన్.

వ. అనిన నమ్మానవతు లొండొరుల మొగంబులు సూచి నగుచు మర్మంబులు నాఁటు నమ్మాటలకు [3]మగుడం బలుక సిగ్గుపడుచు [4]నగ్గలం బయిన చలిని వలిగొని కంఠప్రమాణ జలంబులం దుండి డోలాయమానమానస లై యిట్లనిరి. 829

క. మావలువ లాగడంబున నీ వేటికిఁ బుచ్చుకొంటి ♦ నీ వల్లుఁడవే
నీ వెఱుఁగని దే మున్నది నీ విందఱిలోన ధర్మ ♦ నిరతుఁడవు గదే.

శా. ఇంతుల్ తోయము లాడుచుండ మగవా ♦ రేతెంతురే వచ్చి రా
యింతల్ సేయుదురే కృపారహితులై ♦ యేలోకమం దైన నీ
వింతల్ సేతలఁ బుట్టెఁగాక మఱి యే ♦ పీ కృష్ణ యోచెల్ల నీ
చెంతన్ దాసుల మై చరించెదము మా ♦ చేలంబు లిప్పింపవే. 831

క. వచ్చెదము నీవు పిలిచిన
నిచ్చెద మే మైన ♦ నీకు నెటు సారు మనినం
జొచ్చెదము నేఁడు వస్త్రము
లిచ్చి మముం గరుణతోడ ♦ నేలుము కృష్ణా. 832

---

1. ఓరంతప్రొద్దును = సర్వకాలమును 2. అంభోమధ్యంబుననుండి = నీళ్ళ మధ్య నుండి. 3. మగుడంబలుకన్ = బదులుమాట చెప్పుటకు. 4. అగ్గలంబు = అధికము.

వ. అనిన [1]దరహసితవదనుండై హరి యిట్లనియె. 833

క. [2]ఏ తరుణుఁడు మగఁ డగుటకు
మీ తపములు సెప్పఁ డింక ♦ మీ యానలు సుం
డీ తప్పిన నీకూరిమి
మీ తలలనె వృట్టె నోటు ♦ మేదిని లేదే. 834

క. ఎవ్వానిఁ గని మోహించితి రెవ్వఁడు మీ మానధనము ♦ లెల్ల హరించెన్
[3]నివ్వటిలు మీకుఁ గూరిమి యెవ్వనిపైఁ బలుకరాదె ♦ యే నన్యుఁడనే.

వ. అనిన విని సుందరు లన్యోన్యసందర్శనంబులు సేయుచు [4]హృదయార
విందంబులందుఁ గందర్పుండు సందడింప నగుచు నిరుత్తర లయి
యున్న లోకోత్తరుం డిట్లనియె. 836

క. నాయింటికి దాసులరై। నాయాజ్ఞ వహించి మీరు ♦ నడచెద రేనిన్
మీయంబరంబు లిచ్చెదఁ। దోయంబులు వెడలి రండు ♦ తొయ్యలులారా

వ. అనిన విని హరిమధ్యలు చలికి వెఱచి సలిలమధ్యంబున నిలువ
నోపక. 838

క. కొందఱు వెడలుద మందురు
కొందఱు వెడలుటయు సిగ్గుఁ ♦ గొను గోవిందుం
డందురు కొందఱు దమలోఁ
[5]గొందల మందుదురు వడఁకు ♦ గొని మనుజేంద్రా. 839

వ. మఱియు నెట్టకేలకుఁ జిత్తంబులు గట్టిపఱచుకొని తనుమధ్యలు
తోయమధ్యంబు వెలువడి. 840

క. [6]చంచత్పల్లవకోమల కాంచన నవరత్న ఘటిత ♦ కంకణరుచిరో
దంచితకరసంఛాదిత పంచాయుధగేహ లగుచుఁ ♦ బడఁతులు వరుసన్.

---

1. దరహసితవదనుండు = చిఱునగవు గల మొగము వాఁడు. 2. ఏతరుణుఁడు = ఏ కోడెకాఁడు. 3. నివ్వటిలున్ = వృద్ధిఁబొందును. 4. హృదయార........సందడింపన్ = మనఃకమలములయందు మన్మథుఁడు సందడింపఁగా (మన్మథ వేదన అతిశయింపఁగా). 5. కొందలమందుదురు = కలఁతపడుదురు 6. చంచత్............గేహాలు = చక్కని లేత చిగుళ్ళవలె మృదువులై నవరత్నములతోఁ బొదిగిన బంగారు కడియములచేతఁ బ్రకాశించు చున్నట్టి చేతులతోఁ గప్పబడిన మర్మస్థలములు గలవారు.

వ. చని ప్రౌఢలైన సుందరుల ముందట నిడుకొని మందగమనలు మందహాసంబుతోడ నెదుర నిలిచిన నరవిందనయనుం డిట్లనియె.

సీ. శృంగారవతులార ♦ సిగ్గేల మిముఁగూడి
పిన్ననాఁటనుగోలెఁ ♦ బెరిఁగినాఁడ
నెఱుఁగనే మీలోన ♦ నెప్పుడు నున్నాఁడ
నేను జూడని మర్మ ♦ మెద్ది గలదు
వ్రతనిష్ఠలై యుండి ♦ వలువలు గట్టక
నీరు సొత్తురె మీరు ♦ నియతి దప్పి
కాత్యాయనీదేవిఁ ♦ గల్ల సేయుట గాక
యీ రీతి నోమువా ♦ రెందుఁ గలరు

ఆ. వ్రతఫలంబుమీరు♦వలసినఁ జక్కఁగ నింతులెల్లఁ జేతు♦లెత్తిమ్రొక్కి
చేరిపుచ్చుకొనుఁడు ♦ చీరలు సిగ్గు వో నాడ నేల యెగ్గు ♦ లాడ నేల.

వ. అనిన విని మానవతులు దమలోన. 844

మ. వ్రతముల్ సేయుచు నొక్కమాటయిన నె ♦ వ్వానిన్ విచారించినన్
వ్రతభంగంబులు మాను నట్టి వరదున్ ♦ వామాక్షు[1]లీక్షించియున్
గతచేలాప్లవనంబు నేఁడు వ్రతభం ♦ గం బంచు శంకించి [2]ఫా
లతటన్యస్తకరాబ్జలై సరస లీ ♦ లన్ మ్రొక్కి రట్లందఱున్. 845

క. బాలలకు [3]హస్తకీలిత ఫాలలకు [4]నితాంతశీత ♦ పవనాగమనా
లోలలకునంబరములుకృపాలుఁడుహరియిచ్చె భక్త♦పాలుండగుటన్.

ఆ. చీర లపహరించి ♦ సిగ్గులు విడిపించి
పరిహసించి యైనఁ ♦ బరఁగ మనకు
ఘనుఁడు నోముకొఱఁత ♦ గాకుండ మ్రొక్కించె
ననుచు హరి నుతించి ♦ రబల లెల్ల. 847

క. ఉల్లములు నొవ్వ నాడినఁ గల్లలు సేసినను నగినఁ గలఁచిన నైనన్
[5]వల్లభులు సేయు కృత్యము వల్లభలకు నెగ్గుగాదు ♦ [6]వల్లభ మధిపా.

---

1. ఈక్షించియున్ = చూచియును. 2. ఫాలతటన్యస్తకరాబ్జలై = నొసటను (మొగమున) చేతులు చేర్పఁబడినవారై, 2. హస్త...ఫాలలకు = హస్తములతోఁ గూర్పఁబడిన నుదుళ్ళుగలవారు. 4. నితాంత......లోలలకు = ఎక్కువ చలిగాలివీచుటచే మిక్కిలి వణకుచున్నవారు. 5. వల్లభులు = ప్రియులు. 6. వల్లభము = సంతోషకరము.

వ. ఇట్లు హారెవలువ లిచ్చినం గట్టుకొని సతు లతనియందు బద్ధానురాగ లయ్యుఁ జలింపక తెప్ప లిడక తప్పక చూడ నా ప్రోడ యెఱింగి చేరి వారి కిట్లనియె. 849

సీ. లక్షణవతులార ♦ లజ్జించి చెప్పరు
గాని మీ మర్మముల్ ♦ గానఁబడియె
ననుఁ గొల్వఁ జింతించి ♦ నారు నాచేతను
సత్యంబు మీ నోము ♦ సఫల మగును
గామితార్థంబుల ♦ కలిమిఁ జెప్పఁగ నేల
ననుఁ గొల్వ ముక్తికి ♦ నడవ వచ్చుఁ
గడమ కూడఁగ నంబి ♦ కాదేవి నోమంగ
నటమీఁద ర్రాతుల ♦ యందు మీకు

ఆ. నన్నుఁ బొందఁ గల్గు ♦ నమ్ము పొండని హరి
వల్క నింతు లెల్ల ♦ భ్రాంతిఁ జనిరి
తపము పండె ననుచుఁ ♦ దత్పదాంబుజములు
మానసించుకొనుచు ♦ మందకడకు. 850

—♦ మునిభార్య లన్నముఁ దీసికొనివచ్చి శ్రీకృష్ణుని నారగింపఁ జేయుట ♦—

వ. ఇట్లు గోపకన్యకలందుఁ బ్రసన్నుండై గోవిందుండు బృందావనంబు దాఁటి దూరంబున ధేనువుల మేపుచుండఁ జండకిరణునియెండం బడి [1]దండి చెడి తరులదండ నండ గొనుచు [2]నాతపత్రాకారంబులై నీడలు సేయుచున్న వృక్షంబుల నీక్షించి కృష్ణబల శ్రీదామదేవ ప్రశస్తవిశాలార్జున ప్రముఖులకుం దక్కిన గోపకు లిట్లనిరి. 851

మ. [3]అపకారంబులు సేయ వెవ్వరికి నే ♦ కాంతంబులం దుండు నా
తపశీతానిలవర్ష వారణములై ♦ త్వగ్గంధనిర్యాస భ
స్మపలాశాగ్రమరందమూల కుసుమ ♦ చ్ఛాయాఫలశ్రేణిచే
నుపకారంబులు సేయు నర్థులకు నీ ♦ యుర్వీజముల్ గంటిరే. 852

1. దండిచెడి = దేహము నీరసించినదై. 2. ఆతపత్రాకారంబులై = గొడుగుల యాకృతి వహించినవై. 3. ఒకరికి నపకారము చేయక ఒకరికి సంబంధము లేనట్టియు ఎండ, చలిగాలి, వాన మొదలైనవి సోఁకకుండ పట్ట, వాసన, బంక, బూడిద, ఆకు, చిగురు, పూఁదేనె, వేరు, పువ్వు, నీడ, పండు మొదలైనవాని సమూహముచేత కోరినవారికెల్ల ఉపకారము చేయుచుండునట్టి ఈ వృక్షములను జూచితిరా అని తాత్పర్యము.

వ. అని చిగురాకు పువ్వు గాయ పండు తండంబులఁ బ్రేగున పీగిన తరువుల నడిమి తెరువులం బసులఁ దాఁటుల దాఁటించి యమునకుం జని వెడఁద మడుఁగుల మెల్లన చల్లని నీరు ద్రావించి తత్సమీపంబున మేపుచు వల్లవు లెల్ల మూఁకలుగొని యాఁకలిఁ గొంటి మని విన్నవించినఁ దనకు భక్తురాండ్రగు విప్రభార్యలవలనం బ్రసన్నుఁడై వారలం జూచి రామసహితుండైన హరి యిట్లనియె. 853

సీ. వల్లవులార యీ ♦ వనమున విప్రులు
బ్రహ్మవాదులు దేవ ♦ భవనమునకు
నరుగుట [1]కాంగిర ♦ సాహ్వాయసత్త్రంబు
సలుపుచు నున్నారు ♦ సరఁగ మీరు
మా నామములు సెప్పి ♦ మైత్రితో నడిగిన
నన్నంబు పెట్టెద ♦ రనుచుఁ బలుక
వారలు చని విప్ర ♦ వరుల కెల్లను మ్రొక్కి
పసుల మేపుచు బల ♦ భద్రకృష్ణు

తే. లలసి పుత్తెంచి రిట మమ్ము ♦ నన్న మడుగ
ధర్మవిదులార [2]యర్థిప్ర ♦ దాతలార
పెట్టుఁ డన్నంబు [3]శ్రాంతులఁ ♦ బిలిచి తెచ్చి
పెట్టుదురుగాదె మిముబోఁటి ♦ పెద్దలెల్ల. 854

క. ఘనదీక్షితునకునై నంజనుఁ గుడువఁగఁబశువధంబు♦[4]సౌత్రామణియుం
జనిన వెనుక దోషము లే [5]దనఘాత్మకులార పెట్టుఁ♦డన్నము మాకున్.

వ. అని గోపకులు పలికిన.

మ. క్రతువున్ మంత్రముఁ దంత్రమున్ ధనములుం♦గాలంబు దేశంబు దే
వతయున్ ధర్మము నన్యముల్ దలఁప నె♦వ్వాఁ డట్టి సర్వేశ్వరున్
మతి నూహింపక గోపబాలుఁ డనుచున్ ♦ మందస్మితిం జూచి దు
ర్మతులై యన్నము లేదు లే దనిరి స♦మ్మానక్రియాశూన్యులై.

1. ఆంగిరసాహ్వాయసత్త్రంబున్ = ఆంగిరసము అను పేరుగల యజ్ఞమును. 2. అర్థిప్రదాతలార = యాచకులు కోరినవాని నిచ్చునట్టి పెద్దలారా. 3. శ్రాంతులు = ఆకలిగొన్నవారు 4. సౌత్రామణియున్ = సుత్రాముఁడైన యింద్రుని సంబంధమైన హోమమును 5. అనఘాత్మకులార = పాపరహితమయిన మనసుగల ఓ బ్రాహ్మణులారా

వ. అంత గోపకులు నిరాశులై వచ్చి యెఱింగించిన హరి లౌకికానుసారి యగుచు మీ రయ్యార్యుల నడుగక వారిభార్యలకు మా రాకం జెప్పుం డన్నంబు వెట్టెద రని పంచిన వారలు సని బ్రాహ్మణసతుల దర్శించి నమస్కరించి సంపూజితులై యిట్లనిరి. 858

క. గోవుల మేపుచు నాఁకొని గోవిందుం డన్నమడిగి ♦ కొని రం డని మ
మ్మీవేళం బుత్తెంచెను [1]ధీవిలసితలార రండు ♦ తెం డన్నంబుల్.

వ. అనిన విని గోవిందసందర్శనకుతూహలలై ధరణీసుర సుందరులు సంభ్రమానందంబులు డెందంబుల సందడింప భక్ష్యభోజ్య లేహ్య చోష్య పానీయ భేదంబులం గలిగి సంస్కారసంపన్నంబు లైన యన్నంబులు కుంభంబుల నిడికొని సంరంభంబుల సముద్రంబునకు నడచు నదుల తెఱంగున. 860

క. బిడ్డలు మగలును భ్రాతలు
నడ్డము చని వల దనంగ ♦ నటు దలుఁడని నూ
ఱొడ్డుచు జగదీశ్వరునకు
జడ్డన నన్నంబు గొనుచుఁ ♦ జని రా సుదతుల్. 861

వ. చని యమునాసమీపంబున నవపల్లవాతిరేకంబును విగతవనచర శోకంబును నైన యశోకంబుక్రింద నిర్మలస్థలంబున. 862

సీ. ఒక చెలికానిపై ♦ నొకచేయి సాఁచి వే
ఱొకచేత [2]లీలాబ్జ ♦ మూఁచువానిఁ
గొప్పున కందని ♦ కొన్ని [3]కుంతలములు
సెక్కుల నృత్యంబు ♦ సేయువానిఁ
గుఱుచ చుంగులు వుచ్చి ♦ [4]కొమరారఁ గట్టిన
పసిఁడివన్నియ గల ♦ పటమువాని
[5]నౌదలఁ దిరిగిరా ♦ నలవడఁ జుట్టిన
దట్టంపుఁ బించెపు ♦ దండవాని

---

1. ధీవిలసితలార = బుద్ధివికాసముగల యోయమ్మలారా! లీలాబ్జముఁ = వేడుక కొఱకైన కమలమును. 3. కుంతలములు = చుట్టువెండ్రుకలు. 4. కొమరారఁ = అందగించునట్లుగా. 5. ఔదలఁ = శిరస్సునందు.

తే. [1]రాజితోత్పలకర్ణపూ ♦ రములవాని
మహితపల్లవపుష్పదా ♦ మములవాని
భువనమోహనతటవేష ♦ భూతివానిఁ
గనిరి కాంతలు కన్నుల ♦ కఱవు దీఱ. 863

క. కని లోచనరంధ్రంబుల
[2]మునుమిడి హరి లలితరూప ♦ మును లోఁగొని [3]నె
మ్మనములఁ [4]బరిరంభించిరి
తనుమధ్యలు [5]హృదయజనిత ♦ తాపము వాయన్. 864

వ. ఇవ్విధంబున.

క. వారిట [6]సర్వస్పృహలై నారంటఁ దన్నుఁజూడవచ్చుట మదిలో
వారిజనయనుఁడు పొడగని వారికి నిట్లనియె నగి [7]య♦వారితదృష్టిన్.

శా. కాంతారత్నములార మీ గృహములం ♦ గల్యాణమే యేమి గా
వింతున్ మీ కిటు రండు మమ్ము నిచటన్ ♦ వీక్షింప నేతెంచినా
రెంతే వేడుకతో నెఱుంగుదుము ని ♦ ర్హేతుస్థితిన్ నన్ను ధీ
మంతుల్ మీక్రియఁ జేరె కందురుగదా ♦ మత్సేవలన్ సర్వమున్.

వ. కావున గృహస్థులైన మీపతులు మిమ్ముంగూడి క్రతువు నిర్విఘ్నం
బుగా సమాప్తించెదరు మీరు [8]యాగవాటంబునకుం జనుం డనిన
విప్రభార్య లిట్లనిరి. 868

మ. తగునే మాధవ యిట్టి వాఁడిపలుకుల్ ♦ ధర్మంబులే మాయెడన్
మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ ♦ మమ్మున్ నివారింప మ
చ్చిక నీయంఘ్రులు సేరినార మటవోఁ ♦ జేకొందు రేవార లా
పగి దే మెల్లము [9]కింకరీజనులఁగా ♦ భావించి రక్షింపవే. 869

వ. అనిన జగదీశ్వరుండు. 870

---

[1] రాజితోత్పల కర్ణపూరములవానిన్ = ప్రకాశించునట్టి కలువలచేతఁ గర్ణకుండలములు ధరించినవానిని. [2] మునుమిడి = వరుసపెట్టి [3] నెమ్మనములన్ = కొఱఁతలేని మనస్సులతో [4] పరిరంభించిరి. = ఆలింగనము చేసికొనిరి. [5] హృదయజనితతాపము వాయన్ = మనసులయందుఁ బుట్టినసంతాపము తొలఁగునట్లుగా, [6] సర్వస్పృహలై = ఎల్లకోరికలు గలవారై. [7] అవారితదృష్టిన్ = ఒకేచూపుతో [8] యాగవాటంబునకున్ = యజ్ఞశాలకు. [9] కింకరీజనులఁగాన్ దాసురాండ్రనుగా.

సీ. నా సమీపమున ను ♦ న్నా రంచు నలుగరు
బంధులు భ్రాతలు ♦ పతులు సుతులు
మిమ్ము దేవతలైన ♦ మెత్తు రంగనలార
నా దేహసంగంబు ♦ నరుల కెల్ల
సౌఖ్యానురాగ[1]సం ♦ జనకంబు గాదు [2] ము
క్తిప్రదాయకము నా ♦ కీర్తనమున
దర్శనాకర్ణన ♦ ధ్యానంబులను గర్మ
బంధదేహంబులఁ ♦ బాసి మీరు
తే. మానసంబులు నాయందు ♦ మరుగఁ జేసి
నన్నుఁ జేరెద రటమీఁద ♦ నమ్ముఁ డనుచుఁ
బలికి వారలు దెచ్చిన ♦ భక్ష్యరాసు
లాప్తవర్గంబుతో హరి యారగించె. 871

క. పరమేశ్వరార్పణంబుగఁ
బరజనులకు భిక్ష యిడినఁ ♦ బరమపదమునం
బరఁగెద రట తుది సాక్షా
త్పరమేశుఁడు భిక్ష సేయు ♦ ఫల మెట్టిదియో. 872

వ. ఇట్లు సర్వేశ్వరుం డయిన హరికి భిక్ష యిడి తమభార్య లతనివలనం గృతార్థు లగుట యెఱింగి భూసురవరులు తమలో నిట్లనిరి. 873

చ. కటకట మోసపోయితిమి ♦ కాంతలపాటియు బుద్ధిలేదు నేఁ
డిట హరిఁ గానఁ బో నెఱుఁగ ♦ మేము దురాత్ముల మేము గల్మషో
[3]ద్భటులము విష్ణుదూరగుల ♦ ప్రాజ్ఞత లేల తపంబు లేల ప
ర్యటనము లేల శీలములు ♦ యోగములుం మఱి యేల కాల్పనే.

క. జపహోమాధ్యయనంబులుఁ
దపములు వ్రతములును లేని ♦ తరుణులు హరి స
త్కృపఁ బడసి రన్ని గలిగియుఁ
జపలతఁ బొందితిమి భక్తి ♦ సలుపమి నకటా. 875

క. సురగురు లగు యోగీంద్రుల
నరుదుగ మోహితులఁ జేయు ♦ హరిమాయ మమున్

[1] సంజనకంబుగాదు = పుట్టించునదిగాదు. [2] ముక్తిప్రదాయకము = దుఃఖమును పోగొట్టిమోక్షము నిచ్చునది. 3. ఉద్భటులము = గర్వించినవారము.

నరగురుల మాధవిప్రుల
నురవడి మోహితులఁ జేయ ♦ నోపక యున్నే. 876

మ. క్రతువుల్ ధర్మము మంత్రతంత్రధనముల్ ♦ కాలంబు దేశంబు దే
వతయున్ [1]వహ్నులు మేదినీసురులు నై ♦ వ్వాఁడట్టి సర్వేశుఁ డీ
క్షితి రక్షింప జనించినాఁ డెఱుఁగ మా ♦ శ్రీభర్తకుం గర్తకుం
[2]కుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము [3]ర ♦ క్షోనాథసంహర్తకున్.

వ. అని మఱియు ననేకవిధంబులఁ బశ్చాత్తాపంబుఁ బొంది హరిఁ దలంచి శమింపుమని మ్రొక్కి బ్రాహ్మణులు కంసభీతులయి బాలకృష్ణ సందర్శనంబు సేయం జనరైరి. 877

—♦ నందాదు లింద్రయాగము సేయ శ్రీకృష్ణునితో నాలోచించుట ♦—

వ. అంత నక్కడ నఖిలదర్శనుండైన హరి యింద్రయాగంబు సేయం దలంచి తన కడకు వచ్చిన నందాది గోపవృద్ధులం గని నందున కిట్లనియె. 878

సీ. యాగంబు సేయంగ ♦ నర్థించి వచ్చితి
రీయాగమున ఫల ♦ మేమి గలుగు
నెవ్వాఁడు దీనికి ♦ నీశ్వరుం డధికారి
యెవ్వాఁడు సాధన ♦ మెంత వలయు
శాస్త్రీయమో జనా ♦ చారమో కార్యంబు
వైరుల కెఱిఁగింప ♦ వలదు గాని
మెఱిఁగెడి మిత్రుల ♦ కెఱిఁగింపఁ దగుఁ జేరి
యెఱిఁగి చేసినఁ గోర్కు ♦ లెల్లఁ గలుగుఁ

ఆ. బగయుఁ జెలిమి లేక ♦ పరఁగిన మిముబోఁటి
మంచివారి కేల ♦ మంతనంబు
తలఁపు లెల్ల మాకుఁ ♦ దగ నెఱిఁగింపవే
తాత వాక్సుధా ప్ర ♦ దాత వగుచు. 878

వ. అని పలికిన ప్రౌఢకుమారునికిఁ దండ్రి యిట్లనియె. 880

---

1. వహ్నులు = త్రేతాగ్నులు. 2. కుతలోద్ధర్తకుణ్ = భూమి నుద్ధరించువానికి.
3. రక్షోనాథ సంహర్తకుణ్ = రాక్షసరాజుల నందఱను జంపునట్టివానికి.

సీ. [1]పర్జన్యుఁ డధికుండు ♦ భగవంతుఁ డమరేంద్రుఁ
డతనికిఁ బ్రియమూర్తు ♦ లగుచు నున్న
మేఘబృందంబులు ♦ మేదినీతలముపై
నతనిపంపున [2]భూత ♦ హర్షణముగ
జలములు గురియుఁ [3]ద ♦ జ్జలపూరములఁ దోఁగి.
పండు సస్యంబు లా ♦ పంట దమకు
ధర్మార్థకామ ప్ర ♦ దాయకంబుగ లోకు
లెల్లను బ్రతుకుదు ♦ రింత యెఱిఁగి
తే. మేఘవిభుఁడైన యింద్రుండు ♦ మెచ్చుకొఱకు
నింద్రయాగము సేయుదు ♦ రెల్లనృపులు
కామలోభభయద్వేష ♦ కలితు ♦ లగుచుఁ
జేయ కుండిన నశుభంబు ♦ చెందుఁ బుత్ర. 881

వ. అదియునుం గాక. 882

ఆ. మఖము సేయ వ్రజ ♦ మది సంతసించును
వ్రజ సంతసింప ♦ వాన గురియు
వాన గురియఁ గసవు ♦ [4]వసుమతిఁ బెరుఁగును
గసవు మేసి ధేను ♦ గణము బ్రతుకు. 883

క. ధేనువులు బ్రతికెనేనియు మానదఘనమైన పాడి ♦ మందలఁ గలుగున్
[5]నూనముగఁ బాఁడిగలిగిన మానవులును సురలు దనిసి ♦ మనుదురు పుత్రా.

వ. అని యిట్లు నొడివిన నందునివచనంబులు విని యింద్రునికిఁ గోపంబు దీపింప దనుజదమనుండు తండ్రి కిట్లనియె. 885

క. [6]కర్మమునఁ బుట్టు జంతువు కర్మముననువృద్ధిఁ బొందుఁ ♦ గర్మమునఁ జెడుం
గర్మమె జనులకు దేవత కర్మమె సుఖదుఃఖములకుఁ ♦ గారణ మధిపా.

---

1. పర్జన్యుఁడు = వర్షాధిదేవతయును. 2. భూతహర్షణముగన్ = ప్రాణులకు సంతోషకరముగ 3. తజ్జలపూరములన్ = ఆ జలప్రవాహములందు. 4. వసుమతిన్ = భూమియందు 5. నూనముగన్ = నిక్కముగ 6. ఏప్రాణియైనను దన పూర్వజన్మకర్మఫలముల ననుసరించి భూమిలోఁ బుట్టును. ఆ కర్మఫలము ననుసరించియే వర్ధిల్లును, నశించును కనుక కర్మమే దేవుఁడు; కర్మమే సుఖదుఃఖములకుఁ గారణము.

క. [1]కర్మములకుఁ దగు ఫలములు కర్ములకు నిడంగ రాజు ♦ గాని సదా ని
ష్కర్ముఁడగు నీశ్వరుండును గర్మవిహీనునికి రాజు ♦ గాఁడు మహాత్మా.

వ. కావునఁ [2]గర్మానుయాతంబు లయిన భూతంబులకుఁ [3]బురుహూతుని వలన భీతి యేటికి పురాతన సంస్కారంబులు గుప్పలు గొని కప్పిన గర్మంబులఁ దప్పించి పెంపు వడయ నప్పరమేశ్వరుండును నేరఁ డితరులం జెప్ప నేల సురాసుర నరానీకంబులు తోడిలోకంబు [5]నిజసంస్కారవశంబై యుండ[6]డింది యున్నది సందేహంబు లేదు. దేహి కర్మవశంబున గురుతను దేహంబులం జొచ్చి వెడలు, నొజ్జ వేలుపు నెచ్చెలి పగఱు చుట్టంబులు కర్మంబు, జీవుండు కర్మంబు తోడన వర్తించు, నతనికిఁ గర్మంబు దైవతంబు, కర్మంబున బ్రతుకుచు నితరసేవ సేయుట సతి పతి విడిచి జారుం జేరిన చందంబగు, విప్రుండు వైదికకర్మంబున మెలంగు, నృపతి ధరణీపాలనంబున సంచరించు, వైశ్యుండు వాణిజ్యకృషి [7]కుసీదగోరక్షణాదుల వర్తించు, శూద్రుండు ద్విజన్ముల సేవించి బ్రతుకు, [8]సత్త్వరజస్తమోగుణంబు లుత్పత్తిస్థితిలయ కారణంబు, లందు రజంబున జగంబు జన్మించు, రజోగుణప్రేరితంబులయి మేఘంబులు వర్షించు, వర్షంబునం బ్రజా వృద్ధి యగు, నింద్రుం డేమి సేయంగలవాఁ డదియునుంగాక. 888

శా. కోపింపం బని లేదు శక్రునికిఁ దాఁ ♦ గోపించు గాకేమి [9]సం
క్షేపం బయ్యెడిదేమి పట్టణములున్ ♦ [10]గేహంబులున్ దేశముల్
వ్యాపారంబులు మాకుఁ బోయెడు నె శై ♦ లారణ్యభాగంబులన్
గోపత్వంబున నుండుచున్ మనకు సం ♦ కోచింపఁగా నేటికిన్. 889

---

1. లోకమునందు ఎవఁడు ఏకర్మమును మునుపు చేసి యుండెనో అందులకుఁ దగినఫలమును, ఆ ఫలము ననుసరించిన కర్మములు మొదలైనవానియందుఁ గలుగఁ జేయు నీశ్వరుఁడు కర్త యగు గాని ఎల్లప్పుడు ఏ కర్మము చేయక యుండునట్టి ఈశ్వరుఁడు ఏ కర్మమును ఎప్పుడును చేయనివానికి నేఫలము నిచ్చుటకును గర్త గాఁడు. 2. కర్మానుయాతంబులు = కర్మమును అనుసరించి వర్తించునవి. 3. పురుహూతునివలన భీతి = ఇంద్రునివలన భయము, 4. ఆనీకంబులతోడి = సమూహములతోఁగూడిన 5. నిజసంస్కారవశంబై = తన కర్మములకు లోఁబడినదై. 6. డిందె = అణఁగి 7. కుసీద = వడ్డీమార్పు, 8. రజస్సత్త్వతమోగుణంబులు = రజస్సు, సత్త్వము, తమస్సు అను నీ మూఁడుగుణములు. 9. సంక్షేపంబయ్యెడిదేమి = (అతని కోపమువల్ల మనకు) నిలిచిపోవునది యేమున్నది. 10. గేహంబులన్ ఇండ్లను,

సీ. పసులకుఁ గొండకు • బ్రాహ్మణోత్తములకు
మఖము గావించుట • మంచిబుద్ధి
యింద్రయాగంబున • కే మేమి దెప్పింతు
రవి యెల్లఁ దెప్పింపుఁ • డరసి మీరు
పాయసంబులు [1]నపూప • పప్పులు [2]సైఁదపుఁ బిండి
వంటలుఁ బప్పును • వలయునట్టి
ఫలశాకముల వండఁ • బంపుఁడు హోమంబు
సేయుఁడు ధేను ద • క్షిణల నిచ్చి

తే. [3]బహురసాన్నంబు వెట్టుఁడు • బ్రాహ్మణులకు
నచలులై పూజ లొనరింపుఁ • డచలమునకు
నధమచండాల శునక సం • హతికిఁ దగిన
భక్ష్యములఁ దెండు కసవులు • పసుల కిండు. 890

శా. గంధాలంకరణాంబరావళులచేఁ • గై సేసి యిష్టాన్నముల్
బంధుశ్రేణియు మీరలుం గుడిచి నా • భాషారతిన్ వేడుకల్
సంధిల్లన్ [4]గిరిగోద్విజానల నమ • స్కారంబు గావింపుఁడీ
సంధిల్లున్ సకలేప్సితంబులును మీ • జన్మంబు ధన్యంబగున్. 891

వ. అని మఱియు [5]నిలింపపతి సొంపు [6]డింపు తలంపున నిమ్మఖంబు తనకు సమ్మతం బని గోవిందుండు పలికిన నందాదులు మేలు మే లని తద్వచన ప్రకారంబునం బుణ్యాహ వాచనంబులు సదివించి ధరణీసురులకు భోజనంబు లిడి పసులకుం గసవు లొసంగి రప్పుడు.

మ. [7]సకలాభీరులు వీఁడె కృష్ణుఁ డన నై • జంబైన రూపంబుతో
నకలంకస్థితి నుండి శైల మిదె మీ • రర్చింప రం డంచుఁ దా
నొక శైలాకృతిఁ దాల్చి గోపకులతో • నొండొండ పూజించి గో
పకదత్తాన్నము లాహరించె విభుఁ డా • ప్రత్యక్షశైలాకృతిన్. 893

---

1. అపూపములు = అప్పములు. 2. సైఁదపుఁ బిండివంటలును = గోధుమపిండి భక్ష్యములును. 3. బహురసాన్నంబు = షడ్రసోపేతమైన పరిశుద్ధాన్నము. 4. గిరి...... రంబు = కొండ, గోవు, బ్రాహ్మణుఁడు అగ్ని, వీనికొఱకైన నమస్కారమును 5. నిలింపపతిసొంపు = ఇంద్రునియొక్క యాధిక్యమును 6. డింపుతలంపునన్ = తక్కువ పఱుపవలె నను తలంపుతో 7. సకలాభీరులున్ = ఎల్లగొల్లలును.

మ. వినుఁ డీ శైలము కామరూపి ఖలులన్ ♦ వేధించు [1]నాజ్యాన్నముల్
మన మొప్పించిన నాహరించె మసలన్ ♦ మన్నించెఁ జిత్తంబులో
[2]ననుకంపాతిశయంబు సేసె మనపై ♦ నాచుఁ సగోపాలుఁడై
వనజాక్షుండు నమస్కరించె గిరికిన్ ♦ [3]వందారు మందారుఁడై. 894

వ. ఇట్లు గోపకులు హరిసమేతులై గిరికిం బూజనోపహారంబులు సమర్పించి గోధనంబులం బురస్కరించుకొని భూసురాశీర్వాద వచనంబుతో గిరికిం బ్రదక్షిణంబు సేసి రా సమయంబున. 895

క. గుజ్జుముల పరువు మెచ్చని నజ్జులఁ గట్టిన రథంబు ♦ నంద ప్రముఖుల్
గుజ్జులయూర్పులు సెలఁగఁగ దొజ్జుగమి వెంటనంటఁ♦దోలి రిలేశా.

క. పాటించి గానవిద్యా పాటవమునఁ దేరు లెక్క ♦ బహుతానములం
బాటలగంధులు కృష్ణునిఁ బాటలఁబాడిరి నిరోధి♦పాటనుఁ డనుచున్.

క. [4]కుండనిభాపీనంబులు బండితవర్ణములు వివిధ♦మహితాకృతులున్
నిండినకడుపులుఁగన్నుల పండువులుగఁ [5]బాఁడికుఱ్ఱి♦పదువులుజరిగెన్.

క. పొగ రెక్కిన మూఁపురములఁ
దెగ గల వాలములు శైల ♦ దేహంబులు భూ
గగనములు నిండు అంకెలు
మిగుల మెఱయు వృషభగణము ♦ మెల్లన నడచెన్. 899

వ. ఇట్లు పర్వత ప్రదక్షిణంబు సేసి గోపకులు మాధవసమేతులై మందకుం జని రంత మహేంద్రుం డంతయు నెఱింగి మహారోషంబునఁ బ్రళయ ప్రవర్తకంబులగు సంవర్తక మేఘంబులం జీరి యిట్లనియె. 900

—♦ ఇంద్రుఁడు కోపించి సంవర్తక మేఘంబులఁ బురికొల్పుట ♦—

మ. పెరుగుల్ నేతులు ద్రావి క్రొవ్వి భువి నా ♦ భీరుల్ మదాభీరులై
గిరిసంఘాతకఠోర [7]పత్త్రిదళన ♦ క్రీడాసమారంభ దు

1. ఆజ్యాన్నములు = నేతితోఁగూర్చిన యన్నములను. 2. అనుకంపాతిశయంబు సేసెన్ = మిక్కిలి దయచూపెను. 3. వందారుమందారుఁడై = తన్ను సేవించు వారికిఁ గల్పవృక్షమువలె కోరిన కోర్కెల నిచ్చువాఁడై, 4. కుండనిభాపీనంబులు = కుండలవంటి పొదుగులు, 5. పాఁడికుఱ్ఱి = పాఁడియావు. 7. పత్త్రిదళన = ఱెక్కలను దెగఁగొట్టుట.

ర్భర [1]దంభోళిధరుం [2]బురందరు ననుం ♦ బాటించి పూజింప క
గ్గిరికిం బూజలుసేసి పోయి రిదెపో ♦ కృష్ణుండు ప్రేరేపఁగన్.

క. గురుదేవహీను బాలుని గిరిభూజప్రముఖవాసుఁ గృష్ణు ననీశం
బరిణామశీలుఁ గులగుణ పరహితుఁజేపట్టి యింద్రుఁ ♦ విడిచిరిగొల్లల్

ఆ. విమలఘనతరాత్మ ♦ విజ్ఞానవిద్యచే
నిగుడ లేక [3]యుడుప ♦ నిభము లగుచుఁ
గర్మమయము లైన ♦ క్రతువుల భవమహా
ర్ణవము గడవఁ గోరి ♦ నారు వీరు. 903

శా. ఉద్యత్సంపద నమ్మి నందతనయో ♦ ద్యోగంబునన్ వెఱ్ఱులై
[4]మద్యాగంబు విసర్జనీయ మని రీ ♦ మర్త్యుల్ వడిన్ మీరు మీ
[5]విద్యుద్వల్లులఁ గప్పి గర్జనములన్ ♦ వేధించి గోవుల్ జనుల్
సద్యోమృత్యువుఁ బొంద జాల్ గురియుఁడీ♦ శౌర్యం బవార్యంబుగన్

క. మీవెంట వత్తు నే నై రావతనాగంబు నెక్కి ♦ రయ మొప్పంగా
దేవగణంబులతోడను గోవిందుని మందలెల్లఁ ♦ [6]గొందల పెట్టన్.

వ. అని యిట్లు పలికి [7]జంభవైరి సంరంభంబున దంభోళి జళిపించు బింకంబున శంకింపక కింకతోడ సంకెల లూడ్పించిన మహానిల ప్రేరితంబు లయి చని నందుని మందమీఁద నమోఘంబు లైన మేఘంబులు మహౌఘంబులై ప్రచండగతిం జండమరీచిమండలంబు గప్పి దివి నిండి దిశ లావరించి రోదోంతరాళంబు నిరంతరనీరంధ్ర నిబిడాంధకారబంధురంబుగ నిరోధించి బలిభంజన ద్వితీయపాదపల్లవ భగ్నంబైన బ్రహ్మాండంబుచిల్లుల జల్లించి తొరఁగు బహిస్సముద్ర సలిలనిర్ఝరంబుల వడువున నెడతెగక తోరంబులై నీరధారలం గురియుచు శిలల వర్షించుచుఁ బిడుగుల ఉవ్వుచు నుండ మిట్టు పల్లంబులు సమతలంబు లయి యేకార్ణవంబు రూపు సూపిన నందు దుడు కడుచుచు నీఁదుచు [8]విలయశిఖిశిఖాసన్నిభ విజృంభమాణ

1. దంభోళి = వజ్రాయుధము, 2. పురందరుఁడు = ఇంద్రుఁడు 3. ఉడుప నిభములు = తెప్పకొయ్యవంటివి. 4. మద్యాగంబు = నన్ను బూజించుటను, 5. విద్యుద్వల్లుల = మెఱుపు తీఁగెలను. 6. కొందలపెట్టన్ = బాధ పెట్టుటకై 7. జంభవైరి = ఇంద్రుఁడు 8. విలయ శిఖిశిఖా = ప్రలయాగ్నిజ్వాల.

విద్యుల్లతావిలోకంబున రెప్పలుగొని సొమ్మలు వోవుచున్న లేఁగలును, లేఁగలకు మూతు లెత్తంబు లిడి ప్రళయభైరవభేరీభాంకార విభీషణంబు లగు గర్జనఘోషణంబులఁ జెవుడుపడి చిందఱవందఱలైన డెందంబులం గంది కుంది వ్రాలు ధేనువులును, ధేనువుల వెనుక నిడుకొని మరంతకల్పాంతకాలకీలి కీలా కాలకంఠ కరగదాఘాత ప్రభూతంబులైన శిలాపాతంబులకు భీతంబులై హరికి మ్రొక్కి రక్ష రక్షేతి శబ్దంబులు సేయునై నడి విడువని జడిం బడి సైరింపక శిరంబులు వంచుకొని గద్గదకంఠంబుల సంభారవంబులు సేయు వృషభంబులును, వృషభాది గోరక్షణంబు సేయుచు దుర్వారఘోర[1]శిలాసారంబుల సారంబులు సెడి శరీరంబులు భారంబులైన [2]ప్రమానుపదు గోపకులును, గోపకులం బట్టుకొని దట్టంబయిన వానకొట్టునం బెట్టువడి బడుగునడుములు నుసులువడ వడవడ వడంకుచు గోవిందునిం జీరుగోపికలును గోపికాజన కఠినకుచకలశ యుగళంబుల మఱుంగునం దలలు గుట్టుకొని పరవశులైన శిశువులునుం గలిగి మహాఘోషంబు తోడ నష్టంబైన ఘోషంబుఁ జూచి ప్రబుద్ధులైన గోపవృద్ధులు గొందఱు దీనజనరక్షకుండైన పుండరీకాక్షునకు మ్రొక్కి యిట్లనిరి.

ఉ. అక్కట వానఁ దోఁగి [3]వ్రజ ♦ మాకులమయ్యెఁగదయ్య కృష్ణ నీ
వెక్కడ నుంటి వింతవడ ♦ వేల సహించితి నీ పదాబ్జముల్
దిక్కుగ నున్న గోపకులు ♦ దీనత నొంద భయాపహారివై
గ్రక్కునఁ గావ కిట్లునికి ♦ కారుణికోత్తమ! నీకుఁ బాడియే. 907

క. ఈయుఱుములునీమెఱుములునీ[4]యశనివిఘోషణములు♦నీజలధారల్
నీయాన దొల్లి యెఱుఁగము కూయాలింపంగదయ్య♦గుణరత్న నిధీ.

క. వారి బహు వయ్యె మందల వారికి నిదె పరులు లేరు ♦ వారింపంగా
[5]వారిదపటలభయంబును వారిరుహదళాక్ష నేఁడు ♦ వారింపఁగదే.

వ. అనిన విని సర్వజ్ఞుం డైన కృష్ణుం డంతయు నెఱింగి. 910

---

1. శిలాసార = ఱాళ్లవాన 2. ప్రమానుపదు = నిశ్చేష్టులయిన 3. వ్రజము + ఆకులమయ్యె, వ్రజమాకులమయ్యె = గోకుల మంతయు వ్యాకుల మయ్యెను. 4. అశనివిఘోషణములు = పిడుగులచప్పుడులు. 5. వారిదపటలభయంబు = మేఘముల గుంపువలని భయమును.

ఉ. తన్నొకయింత గైకొనరు ♦ తప్పిరి యాగము చేసి రంచుఁ దా
మిన్నున నుండి గోపకుల ♦ మీఁద శిలల్ గురియించుచున్నవాఁ
[1]డున్నతనిర్జరేంద్రవిభ ♦ వోద్ధితగర్వనగాధిరూఢుఁడై
కన్నులఁగానఁ డింద్రుఁ డిటు ♦ గర్వపరుం డొరుఁ గాన నేర్చునే.

క. దేవత లందఱు నన్నును
సేవింతురు, రాజ్యమదముఁ ♦ జెందిరె, చెఱుపం
గా వలదు, మానభంగము
గావింపఁగ వలయు, శాంతి ♦ గలిగెడుకొఱకై. 912

వ. అని చింతించి శిలావర్షహతులై శరణాగతులైన [2]ఘోషజనుల రక్షించుట తగవని సకలలోకరక్షకుం డయిన విచక్షణుండు. 913

చ. కలఁగకుఁడీ వధూజనులు ♦ కంపము నొందకుఁడీ వ్రజేశ్వరుల్
తలఁగకుఁడీ కుమారకులు ♦ తక్కినవారలు జాలవానచే
నలఁగకుఁడీ పశువ్రజము ♦ నక్కడ నిక్కడ నిల్వనీకుఁడీ
మెలుపున మీకు నీశ్వరుఁడు ♦ మేలొసఁగుం గరుణార్ద్రచిత్తుఁడై.

వ. అని పలికి. 915

—♦ శ్రీకృష్ణుఁడు గోవర్ధన పర్వతము నెత్తుట ♦—

క. [3]కిరియై ధర యెత్తిన హరి
కరి సరసిజముకుళ మెత్తు ♦ గతిఁ [4]త్రిభువన శం
కరకరుఁడై గోవర్ధన
గిరి యెత్తెం జక్కనొక్క ♦ కేలన్ లీలన్. 916

క. దండిని బ్రహ్మాండంబులు
చెండుల క్రియఁ బట్టి యెగురఁ ♦ జిమ్మెడు హరికిన్
గొండ పెకలించి యెత్తుట
[5]కొండొకపని గాక యొక్క ♦ కొండా తలఁపన్. 917

వ. ఇట్లు గిరి యెత్తి. 918

---

1. ఉన్నతనిర్జరేంద్ర విభవోద్ధిత గర్వనగాధిరూఢుఁడై = ఉన్నతమయిన యింద్రపదవివలన గలిగిన గర్వ మను పర్వతము నెక్కినవాఁడై 2. ఘోషజనులు = గోపాలకులు 3. కిరియై = వరాహమై, 4. త్రిభువనశంకరకరుఁడై = ముల్లోకములకు సుఖమును గలుగఁజేయు హస్తములు గలవాఁడై 5. కొండొకపని = చిన్నపని

శా. బాలుం డాడుచు [1]నాతపత్ర మని సంభావించి పూగుత్తి, కెం
గేలం దాల్చినలీల తే నగవుతోఁ ♦ గృష్ణుండు దా నమ్మహా
శైలంబున్ వలకేలఁ దాల్చి విపుల ♦ చ్ఛత్త్రంబుగాఁ బట్టె [2]నా
భీలాభ్రచ్యుతదుశ్శిలాచకిత గో ♦ పీ గోప గోపంక్తికిన్. 919

వ. ఇట్లు గోత్త్రంబు ఛత్త్రంబుగావించి గోపజనులకు గోపాలశేఖరుం డిట్లనియె.

క. రా తల్లి రమ్మ తండ్రి
వ్రేతలు గోపకులు రండు ♦ వినుఁ డీ [3]గర్త
క్ష్మాతలమున నుండుఁడు గో
వ్రాతముతో మీరు మీకు ♦ వలసినయెడలన్. 921

శా. బాలుం డితఁడు కొండ దొడ్డది మహా ♦ భారంబు సైరింపఁగాఁ
జాలం డో యని దీని క్రింద నిలువన్ ♦ శంకింపఁగాఁ జాల దీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరా ♦ చక్రంబు పైఁబడ్డ నా
కేలల్లాడదు బంధులార నిలుఁడీ ♦ క్రిందం బ్రమోదంబునన్. 922

వ. అని పలుకుచున్న హరిపలుకులు విని నెమ్మనమ్ముల నమ్మి కొండ యడుగునం దమతమ యిమ్ములం బుత్త్రమిత్త్రకళత్త్రాదిసమేతులై గోవులుం దారును గోపజనులు జనార్దన కరుణావిలోకనామృతవర్షంబున నాకలినీరువట్టుల చొప్పెఱుంగక కృష్ణకథావినోదంబుల నుండి రివ్విధంబున. 923

మ. హరిదోర్దండము గామ గుబ్బ శిఖరం ♦ బాలంబ ముక్తావళుల్
పరఁగన్ జారెడుతోయబిందువులు గో ♦ పాలాంగనాపాంగహా
సరుచుల్ రత్నచయంబు గాఁగ ♦ నచలచ్ఛత్త్రంబు శోభిల్లెఁ ద
ద్గిరిభిద్దుర్మదభంజియై జలధరా ♦ క్లిన్నప్రజారంజియై. 924

క. రాజీవాక్షునిచే నొక [4]రాజీవముభంగి శైల ♦ రాజము మెఱసెన్
రాజేంద్రమీఁద [5]మధుకర రాజిక్రియన్ మేఘరాజి ♦ రాజిల్లెఁగడున్.

---

1. ఆతపత్రము = గొడుగు, 2. ఆభీలాభ్ర = భయంకరమయిన మేఘములనుండి 3. గర్తక్ష్మాతలమున = గుంటగా నున్న భూప్రదేశమున. 4. రాజీవముభంగి = పద్మమువలె 5. మధుకరరాజిక్రియన్ = తుమ్మెదలపంక్తివలె.

క. వడిగొని [1]బలరిపు పనుపున
సుడుకగ జడిగురిసె నేడ ♦ హోరాత్రము ల
య్యెడ గోపజనులు బ్రతికిరి
జడిఁ దడియక కొండగొడుగు ♦ చాటున నధిపా.

వ. ఇట్లు హరి యే డహోరాత్రంబులు గిరి ధరించిన [2]గిరిభేది విసిగి వేసరి కృష్ణుచరితంబులు విని వెఱఁగుపడి విఫలమనోరథుండై మేఘం బుల మఱలించుకొని చనియె నంత నభోమండలంబు [3]విద్యోత మానఖద్యోతమండలం బగుట విని గోవర్ధనధరుఁడు గోపాలకుల కిట్లనియె. 927

క. ఉడిగెను వానయు గాలియు
జడి సెడె నదులెల్ల బొలప ♦ వఱద లిగిరెఁ గొం
డడుగున నుండక వెడలుఁడు
కొడుకులుఁ కోడండ్రు సతులు ♦ గోవులు మీరున్. 928

వ. అనిన విని సకలగోపజనులు శకటాద్యుపకరణసమేతులయి గోవులుం దారును గొండడుగు విడిచి వచ్చి రచ్యుతుండును జెచ్చెరఁ దొల్లింటి యట్ల నిజస్థానంబున గిరినిలిపె, నంత [4]వల్లవు లెల్లం గృష్ణుం గౌఁగి లించుకొని సముచితప్రకారంబుల సంభావించి చీవించిరి, గోపికలు నేసలిడి దధ్యన్న కబళంబు లొసంగుచు నాశీర్వదించిరి, నంద బల భద్ర రోహిణీ యశోద లాలింగనంబు నేసి భద్రవాక్యంబులు పలి కిరి, సిద్ధ సాధ్య గంధర్వవరులు విరులు గురియించిరి, సురలు శంఖ దుందుభులు మొఱయించిరి, తుంబురుప్రముఖు లయిన గంధర్వులు పాడి రప్పుడు.

క. వల్లవకాంతలు దనకథ లెల్లను బాడంగ నీర ♦ జేక్షణుఁ డంతన్
వల్లవబలస యుతుఁడై యొల్లన గోష్ఠంబు సేరె ♦ నుర్వీనాథా.

వ. అయ్యవసరంబునఁ గృష్ణు చరితంబులు దలంచి వెఱఁగుపడి గోప జనులు నందున కిట్లనిరి.

---

1. బలరిపు పనుపున = ఇంద్రుని యానతిచే. 2. గిరిభేది = ఇంద్రుఁడు,
3. విద్యోతమానఖద్యోతమండలంబు = ప్రకాశించుచున్న సూర్యమండలము గలది.
4. వల్లవులు = గోపాలురు.

సీ. కన్నులు దెఱవని • కడుఁ జిన్నపాపఁడై
దానవి చనుఁబాలు • ద్రాగి చంపె
మూఁడవ నెలనాఁడు • ముద్దులబాలుఁడై
కోపించి శకటంబుఁ • గూలఁదన్నె
నేఁడాదికుఱ్ఱఁడై • యెగసి తృణావర్తు
మెడఁ బట్టుకొని కూల్చి • మృతునిఁ జేసెఁ
దల్లి వెన్నలకునై • తను ఱోలఁ గట్టినఁ
గొమరుఁడై మద్దులు • గూల నీడ్చెఁ

తే. బసులఁ గ్రేపులఁ గాచుచు • బకుని జీరె
వెలఁగతో వత్సదైత్యుని • వ్రేసి గడపె
సబలుఁడై ఖరదైత్యుని • సంహరించె
నితఁడు కేవలమనుజుఁడే • యెంచిచూడ. 932

క. తెంపరియై రామునిచేఁ జంపించెఁ బ్రలంబుఁ బ్రమింగెఁ • జటులదవాగ్నిన్
సొంపు పెడఁ ద్రొక్కి కాళియుఁ ద్రుంపక కాళింది వెడలఁ • ద్రోలెన్ లీలన్

క. ఏడేండ్ల బాలుఁ డెక్కడ క్రీడం[1]గరితమ్మి యెత్తు • క్రియ నందరముం
జూడ గిరి యెత్తు టెక్కడ వేడుక నొకచేత నేఁడు • వెఱఁగాఁగాదే.

క. ఓ నంద గోపవల్లభ నీ నందనుఁ డాచరించు • నేర్పరితనముల్
మానవులకు శక్యంబులె మానవమాత్రుండె నీ కు • మారుఁడు తండ్రీ

—• నందుఁడు గోపకులకు గర్గముని తెల్పిన కృష్ణుని ప్రభావంబుఁ దెలుపుట •—

వ. అనిన విని నందుండు వారలం జూచి మున్ను తనకు గర్గమహాముని చెప్పిన సంకేతంబు దెలిపి శంక లేదు కృష్ణుండు లోకరక్షకుం డయిన పుండరీకాక్షుని నిజాంశంబ యనుచు నంతరంగంబునం జింతింతు నని పలికిన వెఱఁగుపడి గోపకులు గృష్ణుం డనంతుం డని పూజించి రంత. 936

మ. హరి కేలన్ గిరి యెత్తి [3]వర్షజలక్షి • న్నాభీరగోరాజికిన్
శరణం బైనఁ ద్రిలోకరాజ్యమదముం • జాలించి నిర్గర్వుఁడై

1. కరి = ఏనుఁగు. 2. తమ్మి = పద్మము. 3. వర్షజలక్షిన్నాభీరగోరాజికిన్ = వర్షధారలచే ఖేదమునొందిన గోపాలకులకును, గోబృందమునకును.

¹సురభిం గూడి ²బలారి వచ్చి కనియెన్ ♦ సొంపేది దుష్టప్రజే
శ్వర దుర్మాననిరాకరిష్ణుఁ గరుణా ♦ వర్షిష్ణు శ్రీకృష్ణునిన్. 937

క. కని యింద్రుఁడు పూజించెను
దినకరనిభనిజకిరీట ♦ దీధితిచేతన్
మునిహృదలంకరణంబులు
³సునతోద్ధరణములు నంద ♦ సుతు చరణంబుల్. 938

వ. ఇట్లు నమస్కరించి కరకమలంబులు ముకుళించి హరికి హరిహయుం
డిట్లనియె. 939

—♦ ఇంద్రుఁడు హరిని నుతించుట ♦—

సీ. పరమ నీధామంబు ♦ భాసురసత్త్వంబు
శాంతంబు హత రజ ♦ స్తమము నిత్య
మధికతపోమయ ♦ మట్లు గావున మాయ
నెగడెడి గుణములు ♦ నీకు లేవు
గుణహీనుఁడవు గాన ♦ గుణముల నయ్యెడి
లోభాదికములు నీ ♦ లోనఁ జేర
వైన దుర్జననిగ్ర ♦ హము శిష్టరక్షయుఁ
దగిలి సేయఁగ దండ ♦ ధారి వగుచు

తే. జగము భర్తవు గురుఁడవు ♦ జనకుఁడవును
జగదధీశుల మను మూఢ ♦ జనులు దలఁక
నిచ్చ పుట్టినరూపంబు ♦ లీవు దాల్చి
హితము సేయుదుగాదె ♦ లోకేశ్వరేశ. 940

క. నావంటి వెఱ్ఱివారిని శ్రీవల్లభ నీవు శాస్తి ♦ సేసితి వేనిం
గావరముమాని పెద్దల త్రోవన్ జరుగుదురు బుద్ధి ♦ దోఁచిన నీశా.

క. ఒక్కొకలోకముఁ గాచుచు
నెక్కుడుగర్వమున నేమె ♦ యీశుల మనుచుం
జిక్కి ననుబోఁటి వెఱ్ఱులు
నిక్కము నీ మహిమఁ దెలియ ♦ నేర రనంతా. 942

---

1. సురభిన్ = కామధేనువును. 2. బలారి = ఇంద్రుఁడు. 3. సునతోద్ధరణములు = నమస్కరించు వారల నుద్ధరించు నట్టివి.

ఆ. వాసుదేవ కృష్ణ ♦ వరద స్వతంత్ర వి
జ్ఞానమయ మహాత్మ ♦ సర్వపుణ్య
పురుష నిఖిలబీజ ♦ భూతాత్మక బ్రహ్మ
నీకు వందనంబు ♦ నిష్కళంక. 943

శా. నీ సామర్థ్య మెఱుంగ మేఘములచే ♦ నీ[1]ఘోషమున్ [2]భీషణో
గ్రాసారంబున ముంచితిన్ మఖము నా ♦ కై వల్లవుల్ సేయ రం
చో సర్వేశ భవన్మహత్త్వమున నా ♦ యుద్యోగ మిట్లయ్యె నీ
దాసున్ నన్నుఁ గృతాపరాధుఁ గరుణన్ ♦ దర్శింపవే మాధవా. 944

మ. నిను బ్రహ్మాదు లెఱుంగ లేరు జడతా ♦ నిష్ఠుండ [3]లోకత్రయా
వనదుర్మానగరిష్ఠుఁడన్ విపుల[4]దు ♦ ర్వైదుష్యభూయిష్ఠుఁడన్
వినయత్యాగవరిష్ఠుఁడం గుజన గ ♦ ర్విశ్రేష్ఠుఁడన్ దేవ నీ
ఘనలీలావిభవంబు పెంపుఁ దెలియం ♦ గా నెవ్వఁడన్ సర్వగా. 945

వ. అనిన విని నగుచు జలధరగంభీర రవంబున శక్రునకుం జక్రియిట్లనియె.

మ. అమరాధీశ్వర లక్ష్మితోఁ దగిలి యి ♦ ట్లంధుండ వై యున్న నీ
సమదోద్రేకము ద్రుంచి వైచుటకు నీ ♦ జన్నంబు దప్పించితిం
బ్రమదశ్రీకులు దండధారి నగు నన్ ♦ భావింప రెవ్వాని ని
క్కము రక్షింపఁ దలంతు వాని నధనుం ♦ గావింతు [5]జంభాంతకా.

క. నాయాజ్ఞ నేయుచుండుము నీయధికారంబునందు ♦ నిలువు సురేంద్ర
శ్రీయుతుఁడవై మదింపకు శ్రేయంబులుగల్గుఁబొమ్ము ♦ [6]సితకరిగమనా.

—♦ కామధేనువు కృష్ణుని నుతించి యభిషేకించుట ♦—

వ. అని యిట్లు జిష్ణునిం బలుకుచున్న కృష్ణునికి మ్రొక్కి గోగణ సమేత యయిన కామధేనువు భక్తజన కామధేను వయిన యీశ్వరున కిట్లనియె. 949

---

1. ఘోషమున్ = గొల్లపల్లెను, 2. భీషణోగ్రాసారంబున = భయంకరమయిన యుగ్రమైన ధారావర్షము చేతను. 3. లోకత్రయావనదుర్మానగరిష్ఠుఁడన్ = ముల్లోకములను రక్షించువాఁడ నను దుష్టగర్వముచే నొప్పుచున్నవాఁడను. 4. దుర్వైదుష్య = దుష్టపాండిత్యముచేత. 5. జంభాంతకా = ఇంద్రుఁడా! 6. సితకరిగమనా = ఐరావతము వాహనమ్ముగఁ గలవాఁడా!

క. విశ్వేశ విశ్వభావన విశ్వాకృతి యోగివంద్య ♦ విను నీచేతన్
శాశ్వతులమైతిమిప్పుడు శాశ్వతముగఁ గంటిమధిక ♦ సౌఖ్యంబు హరీ.

వ. దేవా మాకుం బరమదైవతంబ నింద్రుండవు [1]భూసురగోసుర సాధు
సౌఖ్యంబులకొరకు ని న్నింద్రునిం జేసి పట్టంబు గట్టు మని విరించి
నియమించి పుత్తెంచె, నీవు భూతలభూరి భారనివారణంబు సేయ
నవతరించిన హరి వని పలికి యంత. 951

మ. సురభిక్షీరములన్ [2]సురద్విపమహా ♦ శుండాలతానీక ని
ర్జరగంగాంబువులన్ నిలింపజననీ ♦ సన్మౌనిసంఘంబుతో
సురనాథుం డభిషిక్తుఁ జేసి పలికెన్ ♦ సొంపార గోవిందుఁ డం
చు [3]రణాక్రాంతవిపక్షుఁ డోయజదళా ♦ క్షున్ సాధుసంరక్షణున్.

సీ. తుంబురు నారదా ♦ దులు సిద్ధచారణ
గంధర్వులును హాడి ♦ కథలు పాడి
రమరకాంతలు మింట ♦ నాడిరి వేల్పులు
గురియించి రంచిత ♦ కుసుమవృష్టి
జగములు మూఁడును ♦ సంతోషమును బొందెఁ
[4]గుఱ్ఱుల చన్నులఁ ♦ గురిసెఁ బాలు
నవజలంబులతోడ ♦ నదు లెల్లఁ బ్రవహించె
నిఖిలవృక్షములు దే ♦ నియలు వడిసె

తే. సర్వలతికల ఫలపుష్ప ♦ చయము లమరెఁ
బర్వతంబులు మణిగణ ♦ ప్రబల నొప్పెఁ
బ్రాణులకు నెల్లఁ దమలోని ♦ పగలు మానె
వాసుదేవుని యభిషేక ♦ వాసరమున. 953

వ. ఇట్లు గోపగోగణపతిత్వంబునకు గోవిందు నభిషిక్తుం జేసి వీడ్కొని
పురందరుండు దేవగణంబులతో దివంబున కరిగె నంత. 954

---

1. భూసురగోసుర = బ్రాహ్మణులకు, గోవులకు, దేవతలకు. 2. సురద్విపమహాశుండాలతానీత నిర్జరగంగాంబువులన్ = ఐరావతముయొక్క గొప్పతొండముచే దీసికొనిరాఁబడిన గంగోదకముచేతను, 3. రణాక్రాంతవిపక్షున్ = యుద్ధములో శత్రువులను నిర్మూలముచేయువాఁడు. 4. కుఱ్ఱులు = పాఁడియావులు.

—♦ శ్రీకృష్ణమూర్తి నందుని వరుణాలయమునుండి గొని తెచ్చుట ♦—

సీ. నందుఁ డేకాదశి ♦ నాఁ డుపవాసంబు
 సేసి శ్రీహరిపూజ ♦ సేసి దనుజ
వేళ యెఱుంగక ♦ వేగక మునుఁదర
 ద్వాదశీస్నానంబు ♦ దగ నొనర్ప
యమునాజలము సొర ♦ నం దొక్కదైత్యుండు
 నందుని వరుణుని ♦ నగరమునకుఁ
గొనిపోవఁ దక్కిన ♦ గోపకులందఱుఁ
 నందగోపకుని గా ♦ నక కలంగి
తే. రామకృష్ణులఁ బేర్కొని ♦ రవము సేయఁ
గృష్ణుఁ డీశుండు దమతండ్రిఁ ♦ గికురు వెట్టి
వరుణభృత్యుండు గొని పోయి ♦ వరుణుఁ జేర్చు
టెఱిఁగి రయమున నచ్చోటి ♦ కేగె నధిప. 955

వ. అప్పుడు. 956

క. వచ్చినమాధవుఁ గనుఁగొని చెచ్చెరవరుణుండుపూజ♦సేసి వినతుఁడై
యచ్చుగ నిట్లని పలికెను విచ్చేసితి దేవ నా [1]ని ♦ వేశంబునకున్.

ఉ. ఏ విభుపాదపద్మ రతు లెన్నఁడు నెవ్వరుఁ బొందలేని పెం
డ్రోవఁ జరింతు రట్టి బుధ ♦ తోషక నీ వరుదెంచుటం బ్రమో
దావృత మయ్యెఁ జిత్తము కృ ♦ తార్థత నొందె మనోరథంబు నీ
సేవఁ బవిత్రభావమును ♦ జెందె శరీరము నేఁడు మాధవా. 958

ఉ. ఏ పరమేశ్వరున్ జగము ♦ లిన్నిటిఁ గప్పినమాయ గప్పఁగా
నోపక పారతంత్ర్యమున ♦ నుండు మహాత్మక యట్టి నీకు ను
ద్దీపితభద్రమూర్తికి సు ♦ ధీజనరక్షణవర్తికిం దనూ
తాపము వాయ మ్రొక్కెద ♦ నుదారతపోధనచక్రవర్తికిన్. 959

చ. ఎఱుఁగఁడు వీఁడు నా భటుఁ డొ ♦ కించుక యైన మనంబులోపలం
దెఱుకువ లేక నీ జనకుఁ ♦ దెచ్చె దయం గొనిపొమ్ము ద్రోహమున్
మఱవుము నన్ను నీ భటుని ♦ మన్ననసేయుము నీదు సైరణన్
వఱలుదుఁ గాదె యో జనక ♦ వత్సల నిర్మల భక్తవత్సలా. 960

1. నివేశంబునకున్ = గృహమునకు.

వ. అని యిట్లు పలుకుచున్న వరుణునిం గరుణించి తండ్రిం దోడ్కొని హరి దిరిగి వచ్చె, నంత నందుండు దన్ను వెన్నుండు వరుణ నగరంబుననుండి విడిపించి తెచ్చిన వృత్తాంతం బంతయు బంధువుల కెఱింగించిన వారలు కృష్ణుం డీశ్వరుం డని తలంచి రఖిలదర్శనుం డయిన యీశ్వరుండును వారల తలం పెఱింగి వారికోరిక సఫలంబు సేయుదు నని వారినందఱ బ్రహ్మహ్రదంబున ముంచి యెత్తి. 961

ఆ. ప్రకృతి కామకర్మ ♦ పరవశమై యుచ్చ
నీచగతులఁ బొంది ♦ నెఱయఁ బ్రమసి
తిరుగుచున్న జనము ♦ తెలియనేరదు నిజ
గతి విశేష మీ జ ♦ గంబునందు. 962

మ. అని చింతించి దయాళుఁడైన హరి మా ♦ యాదూరమై జ్యోతియై
యనిరూప్యం బయి సత్యమై యెఱుకయై ♦ యానందమై బ్రహ్మమై
యనఘాత్ముల్ గుణనాశమందుఁ గను ని ♦ త్యాత్మీయలోకంబు గ్ర
క్కునఁ జూపెం గరుణార్ద్రచిత్తుఁడగుచున్ ♦ గోపాలకశ్రేణికిన్. 963

వ. ఇట్లు హరి మున్నక్రూరుండు వొందిన లోకమంతయుం జూపి బ్రహ్మలోకంబు సూపినం జూచి నందాదులు పరమానందంబునుం బొంది వెఱఁగుపడి హంసస్వరూపకుండైన కృష్ణునిం బొడగని పొగడి పూజించి రంత. 964

చ. కలువలమేలికందువలు ♦ కాముని కయ్యపుఁబాళెముల్ విర
క్తులు దలడించువేళలు చ ♦ కోరక పంక్తుల భోగకాలముల్
సెలువలు సైరణల్ విడిచి ♦ చిక్కుతఱుల్ [1]ఘనచంద్ర చంద్రికా
జ్వలితదిశల్ శరన్నిశలు ♦ జారక దుర్దశ లయ్యె నయ్యెడన్. 965

ఆ. కామతంత్రటీక ♦ కలువలజోక కందర్పుడాక విటుల ♦ తాల్మిపోక
చకితచక్రవాక ♦ సంప్రీతజనలోక [2]రాకవచ్చె మేలు ♦ రాక యగుచు.

క. పతి దనకరములఁ గుంకుమ
సతి మొగమున నలఁదుభంగి ♦ సముదయవేళాం

---

1. ఘనచంద్ర చంద్రికాజ్వలితదిశల్ = విస్తారమగు చంద్రకాంతులచేఁ బ్రకాశింపఁజేయఁబడిన దిక్కులుగలవి. 2. రాక = పూర్ణిమ.

చిత్రకరరాగమున నిశా
పతి రంజించెన్ నరేంద్ర ♦ ప్రాక్పతిమొగమున్.

సీ. విటసేనపై దండు ♦ వెడలెడు వలజేని
1గొల్లెనపై హేమ ♦ కుంభ మనఁగఁ
గాముక ధృతివల్లి ♦ కలుద్రెంప నెత్తిన
శంబరాంతకు చేతి ♦ చక్ర మనఁగ
మారుండు పాంథుల ♦ మానాటవులు గాల్పఁ
గూర్చిన నిప్పుల ♦ కుప్ప యనఁగ
విరహిమృగమ్ముల ♦ వేఁటాడ మదనుండు
దెచ్చిన మోహాన ♦ దీప మనఁగ

ఆ. వింతనునుపు గల్గి ♦ వృత్తమై యరుణమై
కాంతితోడఁ జకోర ♦ గణము లుబ్బఁ
బొడుపుఁగొండచక్కిఁ ♦ బొడిచె రాకాచంద్ర
మండలంబు గగన ♦ మండలమున. 968

—♦ శరద్రాత్రిం గాన మొనర్చు కృష్ణునిసన్నిధికి గోపికలు వచ్చుట ♦—

వ. ఇట్లు పొడిచి నవకుంకుమాంకిత రమామఖమండలంబునుంబోలె నఖండంబైన చంద్రమండలంబుఁ బొడగని పుండరీకనయనుండు యమునాతటవనంబున జగన్మోహనంబుగా నొక్కగీతంబుఁ బాడిన విని పరాయత్తచిత్తలై తత్తఱంబున 2వ్రేత లే పనులకుం జేతు లాడకయు గోవులకుం 3క్రేపుల విడువకయు విడిచి విడిచియు పీడ కయు పీడి యీడియు పీడినపాలు గాఁపకయుఁ గాఁచి కాఁచియుఁ గాఁగిన పాలు డింపకయు డించి డించియు డించినపాలు బోలురకుఁ బోయకయుఁ బోసిపోసియుఁ బతులకుఁ బరిచర్యలు సేయకయుఁ జేసి చేసియు నశనంబులు గుడువకయుఁ గుడిచిగుడిచియుఁ గుసుమంబులు ముడువకయు ముడిచి ముడిచియుఁ దొడవులు దొడుగకయుఁ దొడిగి తొడిగియు గోష్ఠంబుపట్టుల నుండకయుఁ బోయసంబు నెఱయ వండకయు నయ్యైయెడల నిలువంబడకయుఁ గొటుకల

1. గొల్లెన = డేరా. 2. వ్రేతలు = గోపికలు. 3. క్రేపుల = దూడలను

నూటినిడకయుఁ గురులు సక్కనొత్తకయుఁ గుచంబుల గంధంబులు
గలయ మెత్తకయుఁ బయ్యెదలు విప్పి కప్పకయు సఖులకుం జెప్ప
కయు సహోదరులు మగలు మామలు మఱందులు బిడ్డలు నడ్డంబు
చని నివారింపం దలారింపకయు సంచలించి [1]పంచభల్లునిభల్లంబుల
మొల్లంపుజల్లులపెల్లునం దల్లడిల్లి డిల్లపడి మొగిళ్ళగమి వెలువడి
యుల్లసిల్లు తటిల్లతలపొందున [2]మందగమన లమందగమనంబుల
[3]మంద వెలువడి గోవిందసందర్శనంబునకుం జని రప్పుడు. 969

మ. తరుణుల్ గొందఱు మూలగేహముల ను ♦ ద్దండించి రారాక త
ద్విరహాగ్నిం బరితాప మొందుచు ఘనో ♦ వీథిన్ విభున్ మాధవుం
బరిరంభంబులు సేసి జారుఁ డనుచున్ ♦ భావించియుం జొక్కి పొం
దిరి ముక్తిన్ గుణదేహముల్ విడిచి ప్రీ ♦ తిన్ బంధనిర్ముక్తలై.

వ. అనిన నరేంద్రుం డిట్లనియె. 971

క. జారుఁ డని కాని కృష్ణుఁడు భూరిపరబ్రహ్మ మనియు ♦ బుద్ధిఁ దలంపన్
నేరరు గుణమయ దేహము లేరీతిన్ విడిచి రింతు ♦ లెఱిఁగింపు శుకా.

వ. అనిన శుకుం డిట్లనియె.

మ. మును నేఁ జెప్పితిఁ జక్రికిం బగతుఁడై ♦ మూఢుండు చైద్యుండు పెం
పునఁ గైవల్యపదంబు నొందెఁ బ్రియలై ♦ పొందంగ రాకున్నదే
[4]యనఘుం డవ్యయుఁ డప్రమేయుఁ డగుణుం ♦ డైనట్టి గోవిందుమూ
ర్తి నరశ్రేణికి ముక్తిదాయినిసుమీ ♦ తెల్లంబు భూవల్లభా. 974

ఆ. భాంధవమున నైనఁ ♦ బగ నైన వగ నైనఁ
బ్రీతి నైనఁ బ్రాణ ♦ భీతి నయిన
భక్తి నైన హరికిఁ ♦ బరతంత్రులై యుండు
జనులు మోక్షమునకుఁ ♦ జనుదు రధిప.

వ. అటుగావునఁ బరమపురుషుండును నజుండును యోగీశ్వరేశ్వరుండును

---

1. పంచభల్లుని భల్లంబుల = మన్మథబాణముల, 2 మందగమన లమంద
గమనంబుల = మందగమనలు + అమందగమనంబులు = స్త్రీలు శీఘ్రగమనములచే,
3. మంద = గోకులము. 4. అనఘుఁడు = పాపరహితుఁడు, అవ్యయుఁడు =
నాశరహితుఁడు, అప్రమేయుఁడు = యథార్థముగా నెఱుఁగరానివాఁడు (దేవుఁడు).
అగుణుఁడు = నిర్గుణుఁడు.

నైన హారిని సోఁకిన స్థావరంబయిన ముక్తంబగు వెఱఁగుపడెఁ వేలవే
ది విధంబున.

క. ఘన మధురగీతనినదము విని వచ్చిన గోపికలను ♦ వీక్షించి నయం
బున మేటిసుగుణి నేర్పరితనవాగ్వైభవంబు మెఱయఁ ♦ దగనిట్లనియెన్.

—♦ శ్రీ కృష్ణ గోపికా సంవాదము ♦—

శా. మేలా మీకు భయంబు వుట్టదు గదా ♦ మీమందకున్ సింహ శా
ర్దూలానేక మృగంబులుం దిరిగెడిన్ ♦ దూరంబు లేతెంతు రే
హేలా వచ్చితి రీ నిశాసమయమం ♦ దిచ్చోట వర్తింతు రే
చాలుం జాలు లతాంగులార చనుఁడా ♦ సంప్రీతితో మందకున్.

శా. మీ రేతెంచినజాడఁ గానక వగన్ ♦ మీ తల్లులుం దండ్రులున్
మీ [1]రాముల్ మఱఁదుల్ తనూజులు గురుల్ ♦ మీసోదరుల్ బంధువుల్
మేరల్ మీఱిరి లేరు పోయిరనుచున్ ♦ మీఘోష భూభాగముం
దే రీతిం బరికించిరో తగవు లే ♦ యీ సాహసోద్యోగముల్. 979

చ. ఇలువడి సున్న సేసి హృద ♦ యేశుల సిగ్గులు వుచ్చి యుత్తమా
మల నెరియించి సోదరుల ♦ [2]మానము సూఱలువుచ్చి తల్లి దం
డ్రులరుచి మాన్పి బంధులకు ♦ రోఁతయొనర్చుచు జారవాంఛలన్
[3]వల నఱి సత్కులాంగనలు ♦ వత్తురె లోకులు సూచి మెత్తురే. 980

సీ. ప్రాణేశుఁ డెఱిఁగినఁ ♦ బ్రాణంబులకుఁ దెగు
దండించు నెఱిఁగినఁ ♦ ధరణివిభుఁడు
మామ యెఱింగిన ♦ మను వెల్లఁ జెడిపోవుఁ
దలవరి యెఱిఁగినఁ ♦ దగులు సేయు
వలిదండ్రు లెఱిఁగినఁ ♦ దల లెత్తకుండుదు
రేరా లెఱింగిన ♦ నెత్తిపొడుచు
నాత్మజు లెఱిఁగిన ♦ నాదరింపరు చూచి
బంధువు లెఱిఁగిన ♦ [4] బహి యొనర్తు

ఆ. రితరు లెఱిఁగి రేని ♦ నెంతయుఁ జుల్కఁగాఁ
జూతు రిందు నందు ♦ సుఖము లేదు

---

1. రాముల్ = ప్రియులు. 2. మానముసూఱలువుచ్చి = గౌరవమును కొల్లఁగొట్టి.
3. వలనఱి = విధము దప్పి. 4. బహియొనర్తురు = వెలివేయుదురు.

యశము లేదు నిర్భ ♦ యానందమును లేదు
జారుఁ జేరఁ జనదు 1 చారుముఖికి. 981

క. నడవడి కొఱగా కున్నను బడుగైనఁ గురూపియైనఁ ♦ బామరుఁడైనన్
జడుఁడైన రోగి యైనను విడుచుట మర్యాదగాదు ♦ విభు నంగనకున్.

చ. ఇది [1]యమునానదీ జల స ♦ మేధిత పాదప పల్లవ ప్రసూ
నదళవిరాజితం బగు వ ♦ నంబు మనంబుల మేర దప్పెనో
పొదఁ డటు నేడ్చు బిడ్డలకుఁ ♦ బోయుఁడు పాలు విడుండు లేగలన్
మొదవులకున్ నిజేశ్వరుల ♦ ముద్దియలార భజింపుఁ డొప్పుగన్. 983

చ. వనితలు నన్నుఁ గోరి యిట ♦ వచ్చితి రింతఁ గొఱంత లేదు మీ
లోన రె సమస్త జంతువులు ♦ నోలిఁ బ్రియంబులుగావె నాకు నై
నను నిలువంగఁ బోలదు స ♦ నాతన ధర్మము లాడువారికిన్
బెనిమిటులన్ భజించుటలు ♦ పెద్దలు సెప్పుచు నుందు రెల్లెడన్

క. [2]ధ్యానాకర్ణనదర్శన
గానంబుల నాతలంపు ♦ గలిగినఁ జాలుం
బూనెదరు కృతార్థత్వము
మానవతుల్ చనుఁడు మఱలి ♦ మందిరములకున్. 985

వ. అనిన విని. 986

సీ. విరహాగ్ని శిఖలతో ♦ వెడలు నిట్టూర్పుల
ముమ్మరంబునఁ గంది ♦ మోము లెండఁ
గన్నుల వెడలెడి ♦ [3]కజ్జల ధారలు
కుచకుంకుమంబులఁ ♦ గ్రొచ్చిపాఱఁ
జెక్కులఁ జేర్చిన ♦ చేతుల వేఁడిమి
మోముఁదమ్ముల మేలి ♦ మురువు డింపఁ

---

1. యమునా నదీ జలసమేధిత పాదప పల్లవ ప్రసూనదళ విరాజితంబు = యమునాజలముచే వృద్ధిఁ బొందింపఁబడిన వృక్షముల చిగుళ్ళచేతను, పుష్పముల చేతను, ఆకులచేతను విరాజిల్లుచున్నది. 2. ధ్యానాకర్ణన దర్శనగానంబుల = నన్ను ధ్యానించుటచే, నా కథలను వినుటచే, నన్ను దర్శించుటచే, నా గుణములను గానము చేయుటచే. 3. కజ్జలధారలు = కాటుక నీటిధారలు.

బోరిఁబోరిఁ బుంఖాను ♦ పుంఖంబులై తాఁకు
¹మదనుకోలల ధైర్య ♦ మహిమ లెడల
తే. దుఃఖభరమున మాటలు ♦ దొట్రుపడఁగఁ
బ్రియము లాడని ప్రియుఁ జూచి ♦ బెగ్గడిల్లి
చరణముల నేల వ్రాయుచు ♦ సంభ్రమమునఁ
గాంత లెల్లను వగల నా ♦ క్రాంత లగుచు. 987

వ. ఇట్లనిరి. 988

మ. అకటా నమ్మితి మేము క్రూరుఁడన ని ♦ న్నర్థంబె మాయిండ్లలో
సకలవ్యాప్తుల డించి నీ పదసరో ♦ జాతంబు లర్చింపఁ జి
క్కక యేతెంచితి ²మీఁకుఁ డాధ్యుఁడు ముము ♦ క్షాసక్తులం గాచుపో
లికఁ గావందగుఁ గావవే విడువ మే ♦ లే కాంతలన్ భ్రాంతలన్.

మ. పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం ♦ బాటించు టే ధర్మ ప
ద్ధతి యా నంటివి దేహధారిణులకున్ ♦ ధర్మజ్ఞ చింతింపుమా
పతిపుత్రాదికనామమూర్తి వగుచున్ ♦ భాసిల్లు నీయందుఁ ద
త్పతిపుత్త్రాదిక వాంఛలం జలిపి సం ♦ భావించు టన్యాయమే. 990

మత్త. నీపయిన్ రతి సేయు చుందురు ♦ నేర్పరుల్ సతతప్రియో
ద్దీపకుండవు గాన నెవ్వఁగఁ ♦ దెచ్చు నాథసుతాదులం
జూప నేటికి మన్మథాశలు ♦ సుట్టి నీకడ నుండఁగాఁ
బాప నేల మదీయ తాపముఁ ♦ బాపఁ బోలుఁ గృపానిధీ. 991

సీ. నీ పాదకమలంబు ♦ నెమ్మి డగ్గఱఁ గాని
తరలి పోనంగఁ బా ♦ దములు రావు
నీ కరాబ్జంబులు ♦ నేటి నంటితివఁ గాని
తక్కనపనికి హ ♦ స్తములు సొరవు
నీ వాగమృతధార ♦ నిండఁ గ్రోలఁగఁ గాని
చెవు లన్యభాషలు ♦ సేరి వినవు
నీ సుందరాకృతి ♦ నియతిఁ జూడఁగఁ గాని
చూడ వన్యంబులఁ ♦ జూడ్కి కవలు

1. మదనుకోలల = మన్మథ బాణములచే. 2. (పాఠాం) "ఈశుఁడాధ్యుఁడవు మోక్షాసక్తులం"

ఆ. నిన్ను గాని పలుక ♦ నేరవు మా జిహ్వ
లొల్ల ననుచు బలుక ♦ నోడ వీవు
మా మనంబు లెల్ల ♦ మరగించి దొంగిలి
తేమి సేయువార ♦ మింకఁ గృష్ణ.

చ. సిరికి నుదారచిహ్నములు ♦ సేయు భవచ్చరణారవిందముల్
సరసిజనేత్ర మాతపము ♦ సంపదఁ జేరితి మెట్టకేలకున్
మరలఁగలేము మామగల ♦ మాటల నొల్లము పద్మగంధముల్
మరగిన [1]తేఁటు లన్యకుసు ♦ మంబులకుం జన నిచ్చగించునే.

ఆ. సవతు లేక నీ వి ♦ శాలవక్షస్థలిఁ
దులసితోడఁ గూడఁ ♦ దోయజాక్షు
మనువు మనుచు నెపుడు ♦ [2]మా కాంత నీ పాద
కమలరజముఁ గోరుఁ ♦ గాదె కృష్ణ. 994

ఉ. అత్తలు మామలుఁగా వగవ ♦ నాడిక కోడక నాథులన్ మగా
యత్తులఁజేసి యిల్వరుస ♦ లాఱడిఁ బోవఁగ నీదునవ్వులన్
మెత్తనిమాటలన్ [3]మరుఁడు ♦ మేల్కని యేఁచిన వచ్చినార మే
పొత్తుల నొల్ల మో పురుషభూషణ ♦ దాస్యము లిచ్చి కావవే. 995

మ. మగువల్ సిక్కరె తొల్లి వల్లభులకున్ ♦ మన్నించి తద్వల్లభుల్
మగపంతంబు తలంపరే తగులముల్ ♦ మాపాలనే పుట్టెనే
మగవా రాడెడు మాటలే తగవు నీ ♦ మాటల్ మనోజాగ్నిచేఁ
బొగులం జాలము కౌఁగిలింపుము మముం ♦ బుణ్యంబు పుణ్యాత్మకా.

ఉ. కుండలదీప్తగండమును ♦ గుంచితకుంతలఫాలమున్ [4]సుధా
మండితపల్లవాధరము ♦ మంజులహాసవిలోకనంబునై
యుండెడు నీ ముఖంబుఁ గని ♦ యుండఁగ వచ్చునె మన్మ[5]థేక్షుకో
దండవిముక్తబాణముల ♦ దాసులమయ్యెద మాదరింపవే. 997

సీ. నీయధరామృత ♦ నిర్ఝరంబుల నేఁడు
సేరి వాతెఱలపైఁ ♦ జిలుక కున్న

1. తేఁటులు = తుమ్మెదలు. 2. మాకాంత = లక్ష్మీదేవి. 3. మరుఁడు = మన్మథుఁడు. 4. సుధామండిత పల్లవాధరము = అమృతముచే నలంకరింపఁబడిన చిగురుటాకువంటి యధరోష్ఠము గలదియు. 5. ఇక్షుకోదండ = చెఱకువిల్లునుండి.

నీ విశాలాంచిత ♦ నిర్మలవక్షంబుఁ
గుచకుట్మలంబులఁ ♦ గూర్ప కున్న
నీ రమ్యతరహస్త ♦ నీరజాతంబులు
చికురబంధంబులఁ ♦ జేర్ప కున్న
నీ కృపాలోకన ♦ నివహంబు మెల్లన
నెమ్మొగంబులమీఁద ♦ నెఱపకున్న

ఆ. నీ నవీనమాన ♦ నీయసల్లాపంబు
కర్ణరంధ్రదిశలఁ ♦ గప్ప కున్న
నెట్లు బ్రదుకువార ♦ మెందుఁ జేరెడువార
మధిప వినఁగఁదగదె ♦ యాఁడుకుయులు. 998

మ. [1]భవదాలోకనహాసగీతజములై ♦ భాసిల్లు కామాగ్నులన్
భవదీయాధర పల్లవామృతముచేఁ ♦ బాపం దగున్ బాపవే
ని వియోగానల హేతిసంహతులచే ♦ నీఱై భవచ్చింతలం
భవదంఘ్రిద్వయవీథిఁ బొందెదము నీ ♦ పాదంబులానం బ్రియా.

క. తరుమృగఖగగోగణములు
కర మొప్పెడు నిన్నుఁ గన్న ♦ గానము విన్నం
గరఁగి పులకించు నబలలు
గరఁగరె నినుఁ గన్న నీదు ♦ గానము విన్నన్. 1000

సీ. ఈ పంచబాణాగ్ని ♦ నేవెంట నార్తుము
నీ మంజువాగ్వృష్టి ♦ నెగడదేని
నీ మన్మథాంభోధి ♦ నే త్రోవఁ గడతుము
నీ దృష్టి నావయై ♦ నిలువదేని
నీ చిత్తజధ్వాంత ♦ మే జాడఁ జెఱతుము
నీ హాసచంద్రిక ♦ నిగుడదేని
నీ దర్పకజ్వర ♦ మే భంగి నడఁతుము
ని నవాధరసుధ ♦ నింపవేని

1. భవదాలోకనహాసగీతజములు = నిన్నుఁ జూచుటవలనను, నీ మందహాసముల వలనను, నీ వేణుగానమువలనను బుట్టినటువంటివి.

ఆ. నెట్లు నిర్వహింతు ♦ మేలాగు మాలాగు
కరుణసేయ వేనిఁ ♦ గదియ వేని
మరుఁడు నిర్దయుండు ♦ మన నిచ్చునే యశో
దాకుమార యువతి ♦ ధైర్యచోర. 1001

క. అమరులఁ గాచిన హరి క్రియఁ
గమలేక్షణ నీవు నేఁడు ♦ కరుణ నభయ హ
స్తము మా యురముల శిరములఁ
బ్రమదంబున నిడుము మూర్ఛ ♦ పాల్పడకుండన్. 1002

క. కట్టా తలముసుకలునై దట్టపువిరహాబ్ధి తెరలు ♦ తరుణుల నేఁచన్
నెట్టు ద్దరిఁ జేర్ప వయో కట్టిఁడివిగదా కుమార ♦ కరుణోదారా.

వ. అని యిట్లు కుసుమశరునిశరపరంపరాపరవశలై యోపికలు లేక వలికిన గోపికల దీనాలాపంబులు విని నవ్వి యోగీశ్వరేశ్వరుం డయిన కృష్ణుం డాత్మారాముండై వారలతో రమించె నప్పుడు.

మ. కగుణాలోకములం [1]బటాంచలకచా ♦ కర్షంబులన్ [2]మేఖలా
కరబాహుస్తనమర్శనంబుల నఖాం ♦ కవ్యాప్తులన్ నర్మవా
క్పరిరంభంబుల మంజులాధరసుధా ♦ పానంబులం గాంతలం
గరఁగించెన్ రతిఁ జేసి కృష్ణుఁడు గృపం ♦ గందర్పుఁ బొలార్చుచున్.

క. మక్కువ వికసిత వదనలు
చక్కఁగఁ దనుఁ గొల్వ హాస ♦ చంద్రికతోడన్
మిక్కిలి మెఱసెను గృష్ణుఁడు
చుక్కలగమినడిమి పూర్ణ ♦ సోమునిభంగిన్. 1006

ఆ. సతులు దన్నుఁ బాడ ♦ సంప్రీతి నాడుచు
నఱుత నున్న వైజ ♦ యంతితోడ
వనజలోచనుండు ♦ వనభూషణుం డయ్యె
యువతిజనశతంబు ♦ లోలి గొలువఁ 1007

[1] పటాంచలకచాకర్షంబులన్ = పమిటచెంగులను కేశపాశములను లాగుట చేతను, 2. మేఖలాకర బాహు స్తనమర్శనంబులన్ = మొలనూలును, చేతులను, బాహువులను, స్తనములను స్పృశించుటచేతను,

ఉ. చిక్కక యీశుఁడై యెదిరిఁ ♦ జిక్కులఁ బెట్టెడి మాయలానికిం
జిక్కి కృతార్థలై మరుని ♦ చిక్కులఁ జొక్కి లతాంగు లుండఁగా
మక్కువ శాంతి సేయుటకు ♦ మన్నన సేసి ప్రసన్నుఁ డౌటకుం
జక్కన నావిభుండు గుణ ♦ శాలి తిరోహితుఁ డయ్యె నయ్యెడన్.

—♦ తిరోహితుఁడైన హరికొఱకు గోపిక లన్వేషించుట. ♦—

వ. ఇట్లు హరి గనుమొఱంగి చనిన తఱిం గానక కరిం బాసి తిరుగు కరిణుల పెల్లున నుల్లంబులు దల్లడిల్ల వల్లవకాంతలు తదీయగమన హాసలీలావిలాసవీక్షణ విహారవచన రచనానురాగంబులం జిత్తం బులు గోల్పడి వివిధచేష్టలకుం బాల్పడి తదాత్మకత్వంబున నేన నేన కృష్ణుండ నని కృష్ణగుణావేశంబులం జరియించుచు,

క. భూతములలోన వెలిఁ బ్రఖ్యాతుండగునట్టివాని ♦ గాంతలు కాళిం
దీతీరవనాంతరముల భ్రాంతిన్ వెదకంగఁ జనిరి ♦ పాడుచు నధిపా.

సీ. [1]పున్నాగ కానవే ♦ పున్నాగవందితుఁ
దిలకంబ కానవే ♦ తిలకనిటలు
ఘనసార కానవే ♦ ఘనసారశోభితు
బంధూక కానవే ♦ బంధుమిత్రు
మన్మథ కానవే ♦ మన్మథాకారుని
[2]వంశంబ కానవే ♦ వంశధరునిఁ
జందన కానవే ♦ చందనశీతలుఁ
గుందంబ కానవే ♦ [3]కుందరదను

తే. నింద్రభూజమ కానవే ♦ యింద్రవిభవు
గువలవృక్షమ కానవే ♦ కువలయేశుఁ
బ్రియకపాదప కానవే ♦ ప్రియవిహారు
ననుచు గృష్ణుని వెదకి ర ♦ య్యబ్జముఖులు 1011

వ. మఱియును. 1012

ఉ. నల్లనివాఁడు పద్మనయ ♦ నంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు [4]మౌళిపరి ♦ సర్పితపింఛమువాఁడు నవ్వు రా

1. పున్నాగ వందితు = పురుష శ్రేష్ఠులచే నమస్కరింపఁబడు కృష్ణుని.
2. వంశము = వెదురు. కుందరదను = మల్లెమొగ్గలవంటి దంతములుగల వానిని
4. మౌళిపరిసర్పిత పింఛమువాఁడు = శిరమునందొప్పుచున్న నెమిలిపింఛముగలవాఁడు.

జిల్లెడు మోమువాఁ డొకఁడు ♦ చెల్వలమాన ధనంబుఁ దెచ్చె నో
మల్లియలార మీపొదల ♦ మాటున లేఁడు గదమ్మ చెప్పరే. 1013

ఉ. అంగజు నైనఁ జూడ హృద ♦ యంగముఁ డై కరఁగించువాఁడు శ్రీ
రంగదురంబువాఁడు మధు ♦ రంబగు వేణురవంబువాఁడు మ
మ్మంగజు పువ్వుఁదూఁపులకు ♦ నగ్గముసేసి లవంగ లుంగ నా
రంగములార! మీకడకు ♦ రాఁడుగదా కృప నున్నఁ జూపరే. 1014

సీ. మానినీ మన్మథు ♦ మాధవుఁ గానరే
సలలితోదార [1]వ ♦ త్సకములార!
సలలితోదార వ ♦ త్సకవైరిఁ గానరే
సుందరోన్నత ల[2]తా ♦ ర్జునములార!
సుందరోన్నతలతా ♦ ర్జునభంజిఁ గానరే
ఘనతరలసదశో ♦ కంబులార!
[3]ఘనతరలసదశో ♦ కస్ఫూర్తిఁ గానరే
[4]నవ్యరుచిర కాంచ ♦ నంబులార!

ఆ. నవ్యరుచిరకాంచ ♦ నకిరీటుఁ గానరే
[5]గహనపదవి కురవ ♦ కంబులార!
గహనపదవికురవ ♦ క నివాసిఁ గానరే
[6]గణికలార చారు ♦ గణికలార! 1015

సీ. అదె నందనందనుం ♦ డంతర్హితుం డయ్యెఁ
బాటలీతరులార ♦ పట్టరమ్మ
హేలావతులఁ గృష్ణ ♦ యేల పాసెతి వని
[7]ఐలేయలతలార ♦ యడుగ రమ్మ
వనజాక్షుఁ డిచటికి ♦ వచ్చి దాఁగఁడుగదా
చూతమంజరులార ♦ చూడ రమ్మ

---

1. వత్సకములార = కొండమల్లెలార. 2. అర్జునములార = మద్దిచెట్టులార. 3. అశోకస్ఫూర్తిన్ = అధికానందము కలవానిని. 4. నవ్య...నంబులార = క్రొత్త కాంతులుగల సంపెఁగలార. 5. గహనపదవి కురవకంబులార = అడవిలో నున్న ఎఱ్ఱ గోరింట వృక్షములార. 6. గణిక = అడవిమొల్ల. 7. ఐలేయలత = ఏలకితీఁగ.

మానినీమదనుతో • మారాక యెఱిఁగించి
మాధవీలతలార • మనుపరమ్మ
ఆ. జాతిసతులఁ బాయ • నీతిమేఁ హరి కని
జాతులార దిశలఁ • జాట రమ్మ
కదళులార పోయి • కదలించి [1] శిఖిపించ
జూటుఁ దెచ్చి కరుణఁ • జూప రమ్మ. 1016

క. హరిచరణములకుఁ బ్రియవై హరి నిను మన్నింపభద్ర•మందేడుతులసీ
హరి నీదెసరాఁడుగదా హరి చొప్పెఱిఁగించి శుభము•లందింపఁగదే.

తే. పొగడఁ దగువానిఁ గానరే • పొగడలార
యీడెఱుంగని విభు జూపుఁ • డీడెలార
మొల్లమగుకీర్తివాఁ డేఁడి • మొల్లలార
[2]శుకనిగదితునిఁ జెప్పఁడు [3]కిం • శుకములార. 1018

క. తరుణి కుచకుంకుమయుతహారికంధరదామగంధ•మడరెడుఁ జూడ్డుల్
హరిఁగనినపగిదిఁ దసరెడి హరిణీ హరిజాడఁ బుణ్య•మయ్యెడిఁ జెపుమా.

క. కిటియై కౌఁగిటఁ జేర్చెను నటుఁడై వఢిల్లికొలిచె • వసిఁ గృష్ణుండై
యిట పదచిహ్నము లిడెఁ గ్రిందటి [4]బామున నేమినోఁచి•తమ్మధరిత్రీ.

వ. అనుచు మదనోన్మాదచిత్తలై తదాత్మకత్వంబునఁ గృష్ణలీల ననుక
రించుచు. 1021

—• విరహార్తలైన గోపికలు హరిలీలల ననుకరించుట •—

సీ. పూతనయై యొక్క • పొలఁతి చరింపంగ
శౌరియై యొక కాంత • చన్ను గుడుచు
బాలుఁడై యొకభామ • పాలకు నేడ్చుచోఁ
బండి నే ననులేమఁ • బాఱఁదన్ను
సుడిగాలి నని యొక్క • సుందరి గొని పోవ
హరి నని వర్తించు • నబ్జముఖియు

[1] శిఖిపించజూటు = నెమలిపురి శిరోభూషణముగాఁ గల వాఁడు. [2] శుకనిగదితుని = శుకునిచే వర్ణింపఁబడిన కృష్ణుని. [3] కింశుకములారా = మోదుగు చెట్లులార. [4] బామ్మున = జన్మమున.

బకుఁడ నే నని యొక్క ♦ పడఁతి సంరంభింపఁ
బద్మాక్షుఁ డను కొమ్మ ♦ పరిభవించు

ఆ. నెలమి రామకృష్ణు ♦ లింతు లిద్దఱు గాఁగ
గోపవత్సగణము ♦ గొంద ఱగుదు
రసురవైరి ననుచు ♦ నబల యొక్కతె చీరుఁ
బశుల మనెడి సతుల ♦ భరతముఖ్య. 1022

ఆ. లోక మెల్లఁ గుక్షి ♦ లోపల నున్నది
మాధవుండ నేను ♦ మాతవీవు
చూడు మనుచు దొక్క ♦ సుందరి యొకతెకు
ముఖముఁ దెఱచి చూపు ♦ ముఖ్యచరిత. 1023

క. వెన్నలు దొంగిలి తిని యెడి వెన్నుఁడ నని యొకతె నుడువ ♦ వేఱొక్కతె చే
సన్నల యశోద నంచును గ్రన్నన కుసుమముల దండఁ ♦ గట్టు నిలేశా. 1024

క. కాళియ ఫణి యిది వీరలు కాళియ ఫణిసతులు మ్రొక్కఁ ♦ గడగిరి నే గో
పాలకుమారుఁడ ననుచును లీలాగతి నాడు నొక్క ♦ లేమ నరేంద్రా.

క. తరుణులు గోపకులందఱు [1]హరిహయుఁడిదె వాన గురిసె ♦ హరి నేన నిభా
స్వరచేలాంచల మొక్కతె గిరి నెత్తెద ననుచు నెత్తుఁ ♦ గెంగేల నృపా.

క. మీరలు గోపకు లే నసు రారిని దావాగ్ని వచ్చె ♦ నటు మాడకుఁడీ
వారించెద నని యొక్కతె సేరిబయల్ కబళనంబు ♦ సేయు నరేంద్రా.

వ. ఇట్లు తన్మయత్వంబున గోపసుందరులు బృందావనంబునం గల తరు
లతాదుల హరి నడుగుచు దుర్గమంబు లయిన విపినమార్గంబుల
[2]సరోజాత కేతన హల కులిశ కలశాంకుశాది శుభలక్షణ లక్షితంబులయి
మనోహరంబు లయిన హరిచరణంబుల చొప్పుఁగని తప్పక చెప్పి
కొనుచుఁ దమలో ని ట్లనిరి. 1028

సీ. కొమ్మకుఁ బువ్వులు ♦ గోసినాఁ డిక్కడ
మొనసి పాదాగ్రంబు ♦ మోపినాఁడు

---

1. హరిహయుఁడు - ఇంద్రుఁడు. 2. సరోజాతకేతనహలకులిశకలశాంకుశాది శుభలక్షణ లక్షితంబులయి - పద్మరేఖ, ధ్వజరేఖ, హలరేఖ, వజ్రరేఖ, కలశరేఖ, అంకుశరేఖ మొదలగు శుభలక్షణములతోఁ గూడియున్న,

సతి నెత్తుకొని వేడ్క ♦ జరిగినాఁ డిక్కడఁ
దృణములో లేదిదె ♦ తెఱవజాడ
ప్రియకు [1]ధమ్మిల్లంబు ♦ పెట్టినాఁ డిక్కడ
గూర్చున్న చొప్పిదె ♦ కొమరుమిగులు
నింతికిఁ గెమ్మోవి ♦ యిచ్చినాఁ డిక్కడ
వెలఁది నిక్కినగతి ♦ విశదమయ్యె
ఆ. సుదతితోడ నీరు ♦ సొచ్చినాఁ డిక్కడ
జొచ్చి తా వెడలిన ♦ చోటు లమరెఁ
దరుణిఁ గాముకేళిఁ దనిపినాఁ డిక్కడ
ననఁగి పెనఁగి యున్న ♦ యంద మొప్పె, 1029

వ. మఱియును.

సీ. ఒక [2]యెలనాఁగ చే♦యూఁదినాఁ డిక్కడ
సరస నున్నవి నాల్గు ♦ చరణములును
నొకనీలవేణితో ♦ నొదిఁగినాఁ డిక్కడ
మగజాడలో నిదె ♦ మగువజాడ
యొకలేమ మ్రొక్కిన ♦ [3]నురివినాఁ డిక్కడ
రమణి మ్రొక్కిన చొప్పు ♦ రమ్య మయ్యె
నొకయింతి కెదురుగా ♦ నొలసినాఁ డిక్కడ
నన్యోన్యముఖములై ♦ యంఘ్రు లొప్పె
ఆ. నొకతె వెంటఁదగుల ♦ నుండక యేగినాఁ
డడుఁగుమీఁదఁ దరుణి ♦ యడుఁగు లమరె
నబల నిరుగెలంకు ♦ లందురాఁ దిరిగునాఁ
డాఱుపదము లున్న ♦ వమ్మ యిచట. 1031

సీ. ఈ చరణంబులే ♦ యిందు నిభానన
సనకాదిమునియోగ ♦ సరణి నొప్పు
నీ పాదతలములే ♦ యెలనాగ [4]శ్రుతివధూ
సీమంతవీథులఁ జెన్నుమిగులు

1. ధమ్మిల్లంబు = కొప్పు. 2. ఎలనాఁగ = స్త్రీ. 3. ఉరివినాఁడు = తప్పించుకొన్నాఁడు. 4. శ్రుతివధూసీమంతవీథులన్ = ఉపనిషత్తులలో.

నీ పదాబ్జంబులే ♦ యిభకులోత్తమయాన
[1]పాలేటిరాచూలి ♦ పట్టుఁగొమ్మ
లీ సుందరాంఘ్రులే ♦ యిందీవరేక్షణ
ముక్తికాంతామనో ♦ మోహనంబు

ఆ. లీ యడుఁగులరజమె ♦ యింతి బ్రహ్మేశాది
దివిజవరులు మౌళి ♦ దిశలఁ దాల్తు
రనుచుఁ గొంద ఱబల ♦ లబ్జాక్షుఁ డేగిన
క్రమముఁ గనియు నతని ♦ గాన రైరి. 1032

వ. అప్పుడు. 1033

సీ. పతుల దైన్యంబును ♦ భామల క్రౌర్యంబుఁ
జూపుచు విభుఁ డొక్క ♦ సుదతితోడ
విహరింప నదియెల్ల ♦ వెలఁదుల వర్జించి
నాయొద్ద నున్నాఁడు ♦ నాథుఁ డనుచు
గర్వించి రాఁజాలఁ ♦ గమలాక్ష మూఁపున
నిడుకొను మనుడు న ♦ య్యీశ్వరుండు
మొఱఁగిపోయిన దాప ♦ మును బొంది యో కృష్ణ
యెక్కడఁ జనితి ప్రా ♦ ణేశ రమణ

తే. నీకు [2]వరవుడ నయ్యెద ♦ నిలువు మనుచు
వగవఁ గొందఱుకాంత లా ♦ వనితఁ జూచి
వరుఁడు మన్నింప గర్వించి ♦ వనజనేత్ర
చిక్కె నేఁడని వెఱఁగున ♦ జెంది రపుడు. 1034

వ. మఱియును. 1035

సీ. ఈ పొదరింటిలో ♦ నిందాఁకఁ గృష్ణుండు
నాతోడ మన్మథ ♦ నటన మాడె
[3]నియ్యోల మగుచోట ♦ నిందాఁకఁ జెలువుండు
గాఢంబుగా నన్నుఁ ♦ గౌఁగిలించె

1. పాలేటి...గొమ్మలు = లక్ష్మికినివాసములు. 2. వరవుఁడు = దాసి. 3. ఇ + ఓలము + అగుచోటన్ = ఈ మఱుఁగైన చోటునందు.

సీ. మహీజమునీడ ♦ నిందాఁక సుభగుండు
చిట్టంబుచెయ్యాల ♦ సిగ్గుగొనియె
నీ పుష్పలతపొంత ♦ నిందాఁక దయితుండు
నను డాసి యధరపా ♦ నంబుసేసె

ఆ. నీ ప్రసూనవేది ♦ నిందాఁక రమణుండు
గుసుమదామములను ♦ గొప్పఁదీర్చె
ననుచుఁ గొంద ఱబల ♦ లంభోజనయనుని
పూర్వలీలఁ దలఁచి ♦ పొగడి రధిప. 1036

మ. అని యిబ్భంగి లతాంగు లందఱును బృం ♦ దారణ్యమందీశ్వరున్
వనజాక్షుం బరికించి కానక విభున్ ♦ వర్ణించుచుం బాడుచున్
మనముల్ మాటలుఁ జేష్టలుం గ్రియలు న ♦ మ్మానాథుపైఁ జేర్చి వే
చని [1]రయ్యామునసైకతాగ్రమునకున్ ♦ [2]సత్యక్త గేహేచ్ఛలై. 1038

వ. చని గోపికలు హరి నుద్దేశించి యిట్లనిరి.

— ♦ గోపికా గీతలు ♦ —

క. నీవు జనించినకతమున నోవల్లభ లక్ష్మి మంద ♦ నొప్పె నధిక మై
నీ వెంటనె ప్రాణము లిడి నీ వా రరసెదరు చూపు ♦ నీరూపంబున్.

క. [3]శారదకమలోదరరుచి చోరక మగు చూపువలన ♦ సుందర మమ్ముం
గోరి వెల యీనిదాసుల ధీరత నొప్పించు టిది వ ♦ ధించుట గాదే.

ఆ. విషజలంబువలన ♦ విషధరదానవు
వలన ఱాలవాన ♦ వలన వహ్ని
వలన నున్నవాని ♦ వలనను రక్షించి
కుసుమశరునిబారిఁ ♦ గూల్పఁ దగునె. 1040

ఉ. నీవు యశోదబిడ్డఁడవె ♦ నీరజనేత్ర సమస్తజంతుచే
తోవిదితాత్మ వీవుఁ డవు ♦ తొల్లి విరించి దలంచి లోకర

1. అయ్యామున...మునకున్ = ఆ యమునానదిలోని యిసుక తిన్నెమీఁదికి.
2. సత్య...చ్ఛలై = ఇండ్లమీఁది కోరిక విడిచినవారై. 3. శార...రకము = శరత్కాల పద్మము గర్భమందలి కాంతిని హరించినది. 4. విషధరదానవువలన = అజగరరూపము ధరించిన యఘాసురునివలన.

తేవిధ మాచరింపు మని ♦ సన్నుతి సేయఁగ సత్కులంబులన్
భూవలయంబుఁ గావ నిటు ♦ పుట్టితిగాదె మనోహరాకృతిన్. 1041

ఆ. చరణసేవకులకు ♦ సంసారభయమును
బాపి శ్రీకరంబు ♦ పట్టు గలిగి
కామదాయి యైన ♦ కరసరోజంబు మా
మస్తకముల నునిచి ♦ మనుపు మీశ. 1042

ఉ. గోవుల వెంటఁ ద్రిమ్మరుచుఁ ♦ గొల్చినవారల పాపసంఘముల్
ద్రోవఁగఁ జాలి శ్రీఁ దనరి ♦ దుష్టభుజంగ ఫణాలతాగ్రసం
భావితమైన నీ చరణ ♦ పద్మము చన్నులమీఁద మోపి త
[1]ద్భావజపుష్పభల్లభవ ♦ బాధ హరింపు వరింపు మాధవా. 1043

క. బుధరంజనియును సూక్తయు
మధురయు నగు నీదువాణి ♦ మరగించెను నీ
యధరామృతసంసేవన
విధి నంగజతాప మెల్ల ♦ విడిపింపఁగదే. 1044

క. మగువలయెడ నీక్రౌర్యము దగునే నిజభక్తభీతి ♦ దమనుఁడ వకటా
తగదు భవద్దాసులకును నగుమొగముం జూపి కావు ♦ నళినదళాక్షా.

మ. ఘనలక్ష్మీయుతమై వినన్ శుభదమై ♦ కామాది విధ్వంసియై
సనకాదిస్తుతమై నిరంతరతప ♦ స్సంతప్త పున్నాగజీ
వన మై యొప్పెడు నీ కథామృతము ద్రా ♦ వం గల్గునే భూరిదా
న నిరూఢత్వము లేనివారలకు మా ♦ నారీమనోహారకా.

క. నీనగవులు నీచూడ్కులు నీనానావిహరణములు ♦ నీధ్యానంబుల్
నీనర్మాలాపంబులు మానసముల నాటి నేఁడు ♦ మగుడవు కృష్ణా.

ఆ. ఘోషభూమి వెడలి ♦ గోవుల మేపంగ
నీరజాభ మైన ♦ నీ పదములు
గసవు శిలలుఁ దాఁకి ♦ కడునొచ్చునో యని
కలఁగు మా మనములు ♦ కమలనయన. 1049

[1] శ్రీకరంబుపట్టు = లక్ష్మి చేయూఁత. [2] భావజపుష్పభల్లభవబాధ = మన్మథుని పుష్పబాణములవలనఁ గలుగుబాధ [3] బుధరంజని=పండితులను రంజించునది.

ఉ. మాపటివేళ నీవు వన ♦ మధ్యము వెల్వడి వచ్చి [1]గోష్పద
ప్రాపితధూళిధూసరిత ♦ భాసితకుంతల మై సరోరుహా
ద్దీపిత మైన నీమొగము ♦ ధీరజనోత్తమ మాకు వేడ్కతోఁ
జూపి మనంబులన్ మరునిఁ ♦ జూపుదు గాదె క్రమక్రమంబునన్.

ఆ. భక్తకామదంబు ♦ బ్రహ్మసేవిత [2]మిలా
మండనంబు దుఃఖ మర్దనంబు
భద్రకరము నైన ♦ భవదంఘ్రియుగము మా
యురములందు రమణ ♦ యునుపఁదగదె. 1051

ఆ. సురతవర్ధనంబు ♦ శోకాపహరణంబు
[3]స్వరితవంశనాళ ♦ సంగతంబు
నన్యరాగజయము ♦ నైన నీ మధురాధ
రామృతమునఁ దాప ♦ మార్పు మీశ. 1052

ఉ. నీ వడవిం బగల్ దిరుగ ♦ నీ[4]కుటిలాలకలాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడ కున్న నిమి ♦ షంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రులైన నినుఁ ♦ గన్నుల నెప్పుడుఁ జూడ కుండ ల
క్ష్మీవర ఱెప్ప లడ్డముగఁ ♦ జేసె ని దేల విధాత క్రూరుఁడై.

ఉ. అక్కట బంధులున్ మగలు ♦ నన్నలుఁ దమ్ములుఁ బుత్రకాదులున్
నెక్కొనిరాత్రిఁ బోవఁ దన ♦ నీ మృదుగీతరవంబు వీనులన్
వెక్కస మైన వచ్చితిమి ♦ వేగమె మోహము నొంది నాథ నీ
వెక్కడఁ బోయితో యెఱుఁగ ♦ మీ క్రియనిర్దయుఁ డెందు గల్గునే.

తే. మదనుఁ డార్వంగ నీ వాడు ♦ మంతనములు
నవరసాలోకనం బగు ♦ నగుమొగంబు
కమల కిర వైన మహిత వ ♦ క్షస్స్థలంబు
మా మనంబుల లోఁగొని ♦ మరపెఁ గృష్ణ. 1055

1. గోష్పదప్రాపిత ధూళిధూసరిత భాసితకుంతలమై = గోవుల పాదధూళిచే వ్యాప్తమయి యొప్పుచున్న కేశములు గలది. 2. ఇలామండనంబు = భూమికలంకార మైనది. 3. స్వరిత... సంగతంబు = ధ్వనించుచున్న మురళితోఁ గూడినది. 4. కుటిలాలకలాలితాస్యము = వంకరముంగురులచే నొప్పుచున్న ముఖము.

మ. అరవిందంబులకంటెఁ గోమలము లై ♦ యందంబు లై యున్న నీ
చరణంబుల్ కఠినంబు లై మొనయు మా ♦ చన్నుంగవల్ సోఁకఁగా
నెరియం బోలు నటంచుఁ బొక్కెదము నీ ♦ యీ కర్క శారణ్య భూ
పరిసంచారము కృష్ణ నీ ప్రియులకుం ♦ బ్రాణవ్యథం జేయదే. 1056

క. కట్టా మన్మథుకోలలు నెట్టన నో నాఁట బెగడి ♦ నీ పాదంబుల్
పట్టికొనఁగ వచ్చిన మము వట్టి పవిఁడించి పోవ ♦ న్యాయమె కృష్ణా.

క. హృదయేశ్వర మా హృదయము
మృదుతరముగఁ జేసి తొల్లి ♦ మిక్కిలి కడ నీ
హృదయము కఠినము చేసెను
మదీయసౌభాగ్య మిట్టి ♦ మందము గలదే. 1058

ఉ. క్రమ్మి నిశాచరుల్ సుర ని ♦ కాయములన్ వడిఁ దాఁకి నీఁక వా
లమ్ముల [1]తెట్టెముల్ నటప ♦ నడ్డము వచ్చి జయింతువంద్రు ని
న్నమ్మిన ముగ్ధలన్ [2]రహిత ♦ నాథల నక్కట నేఁడు [3]రెండుమూఁ
డమ్ములయేటుకాఁ డెగవ ♦ నడ్డము రాఁ దగదే కృపానిధీ. 1059

క. [4]తియ్యవిలుకాఁడు డీకొని ద్రయ్యలుగాఁ దూలనేసె ♦ వనితలమనముల్
[5]వియ్యాన నింక నడునం గుయ్యాలింపం గదయ్య ♦ గోవింద హరీ.

—♦ శ్రీకృష్ణుఁడు గోపికలకుఁ బ్రత్యక్ష మగుట ♦—

మ. అని యిట్లంగన లంచితస్వరముతో ♦ నంకించుచుం బాడుచుం
దను రావే యని చీరి యేడువ జగ ♦ త్త్రాణుండు త్రైలోక్య మో
హనుఁడై మన్మథమన్మథుం డయి మనో ♦ జ్ఞాకారియై హారియై
ఘనపీతాంబర ధారియై పొడమెఁ ద ♦ త్కాంతాసమీపంబునన్.

క. వచ్చిన వల్లభుఁ గనుగొని పిచ్చెసె నటంచు సతులు ♦ వికసితముఖులై
యచ్చుగఁ బ్రాణములోడలికివచ్చిననిలుచుండునవయ ♦ వంబులభంగిన్.

సీ. అబల యొక్కతె భక్తి ♦ నంజలి గావించి
ప్రాణేశు కెంగేలు ♦ వట్టికొనియె

1. తెట్టెముల్ = సమూహములు. 2. రహితనాథలన్ = దిక్కులేనివారిని. 3. రెండుమూఁడమ్ములయేటుకాఁడు = పంచబాణుఁడగు మన్మథుఁడు. 4. తియ్యవిలుకాఁడు = మన్మథుఁడు. 5. వియ్యానన్ = బంధుభావముతో.

నింతి యొక్కతె జీవి ♦ తేశ్వరు బాహువు
మూఁపున నిడుకొని ♦ ముదము నొందె
వనిత యొక్కతె తన ♦ వల్లభుతాంబూల
చర్విత మాత్మహ ♦ స్తమునఁ దాల్చెఁ
బడఁతి యొక్కతె ప్రియు ♦ పదములు విరహాగ్ని
తప్తకుచంబులఁ ♦ దాపుకొనియె

ఆ. భామయొకతె భ్రుకుటి ♦ బంధంబు గావించి
ప్రణయభంగరోష ♦ భాషణమున
[1]దష్టరదన యగుచు ♦ దండించు కైవడి
వాఁడిచూడ్కిగముల ♦ వరునిఁ జూచె. 1063

క. హరిముఖకమలముఁ జూచుచుఁ
దరుణియొకతె ఱెప్పలిడక ♦ తనియక యుండెన్
హరిపదకమలముఁ జూచుచు
మరగి తనివి లేని సుజను ♦ మాడ్కి నరేంద్రా. 1064

ఉ. ఒక్కలతాంగి మాధవుని ♦ యుజ్జ్వలరూపముఁ జూడ్కితీవలం
జిక్కఁగఁ బట్టి హృద్గతముఁ ♦ జేసి వెలిం జనకుండ నేత్రముల్
గ్రక్కున మూసి మేనఁ బుల ♦ కంబులు గ్రమ్మఁగ గౌఁగిలించుచుం
జొక్కములైన లోచవులఁ ♦ జొక్కుచునుండెను యోగికైవడిన్.

సీ. [2]ఎలయించి ప్రాణేశ ♦ యెందుఁ బోయితి వని
[3]తోరంపుటలుకతో ♦ దూఱె నొకతె
జలజాక్ష ననుఁ బాసి ♦ చనఁగ నీ పాదంబు
లెట్లాడె నని [4]వగ ♦ నెయిదె నొకతె
నాథ నీ వరిగిన ♦ నా ప్రాణ మున్నది
కూర్మియే యిది యని ♦ కుందె నొకతె
యీశ్వర నను నిన్ను ♦ నిందాఁకఁ బాపె నే
పాపపువిధి యని ♦ పలికె నొకతె

1. దష్టరదన = పళ్ళు కొరుకు చున్నదియై. 2. ఎలయించి = ఆసక్తిఁగొలిపి.
3. తోరంపుటలుకతో = మిక్కిలి కోపముతో. 4. వగన్ ఎయిదెన్ = విచారమునుఁ బొందెను.

ఆ. తలఁగి పోవునట్టి ♦ తప్పేమి చేసితి
నధిప పలుకు ధర్మ ♦ మనియె నొకతె
యేమినోముఫలమొ ♦ హృదయేశ నీ మోము
మఱలఁ గంటి ననుచు ♦ మసలె నొకతె. 1066

క. పలికినఁ బ్రతిజ్ఞదప్పెడి బలికించినఁగాని రమణుఁ ♦ బలుక నటంచుం
గలకంఠియొకతెచెలితోఁబలుకులనమృతములుగురియ ♦ పగిదింబలికెన్.

క. పట్టినఁగాని మనోవిభుఁ బట్టఁగదాయంచు నొక్క ♦ బాలికసఖిచే
పట్టుకొనిచెప్పెధైర్యము పట్టెల్లను మరునిసొంకి ♦ పట్టుగ నధిపా.

క. చెలువుఁడుసెప్పకపోయినసాలపునొకముగ్ధమున్న ♦ చూడననుచునా
దలవంచియుండఁజాలక దలయెత్తుచులోనమరుఁడు ♦ దలయెత్త నృపా.

వ. ఇవ్విధంబున. 1070

క. హాసిసురుచిరలలితాకృతి దరుణులు గని ముక్తవిరహ ♦ తాపజ్వరలై
పరమోత్సవంబు సలిపిరి పరమేశ్వరుఁగనినముక్త ♦ బంధులభంగిన్.

వ. అంత నక్కాంతుండు కాంతాజనపరిక్రాంతుఁడై వనాంతరంబున శక్తినికరసంయుక్తుం డైన పరమపురుషుండునుం బోలె వారలం దోడ్కొని మందారకుందకుసుమపరిమళమిళిత [1]పవమానమానిత [2]మధుకరనికర ఝుంకారసుకుమారంబును శరత్కాల చంద్రకిరణ సందోహ సంటళితాంధకారంబును యమునాతరంగ సంగతకోమల [4]వాలుకాస్ఫారంబునునై యమలినం బైన [5]పులినంబు ప్రవేశించె. వారును విజ్ఞానకాండంబున నీశ్వరుం గని శ్రుతులు ప్రమోదంబునం గామానుబంధంబులు విడిచిన విధంబున హరిం గని విరహ వేదనలు విడిచి పరిపూర్ణ మనోరథ లై.

క. [6]పాఠీననయన లెల్ల నకారిత్వపటాంచలములఁ ♦ గౌతుకములు హృ
త్ప్రీతముల సందడింపఁగఁ బీఠము గల్పించి రంతఁ ♦ బ్రియునకు నధిపా.

---

1. పవమాన - వాయుదేవుఁడు. 2. మధుకరనికర = తుమ్మెదల గుంపుల యొక్క, 3. కిరణ... కారంబును = కిరణసమూహముచేఁ బోగొట్టఁబడిన చీఁకటి గలది. 4. వాలుకాస్ఫారము = విస్తారమగు నిసుకగలది. 5. పులినంబు = ఇసుకతిప్ప. 6. పాఠీననయనలు - మీననేత్రలు (గోపికలు).

ఆ. పరమయోగిహృదయ ♦ భద్రకేతంబుల
నుండు మేటి వ్రజవ ♦ ధూత్రీయ
పీఠమున వసించి ♦ పెంపారెఁ ద్రిభువన
దేశలక్ష్మి మేనఁ ♦ దేజరిల్ల. 1074

మ. మదనోద్దీపకుఁ డైన నాథునికి స ♦ మ్మానంబు గావించుచున్
ముదితల్ హాసవిలోకవిభ్రమములన్ ♦ మోదించుచుం జేరి త
త్పదముల్ హస్తతలంబులం బిసుకుచుం ♦ బైముట్టుచున్ దూఱుచుం
జదురుల్ పల్కుచుఁ గూర్మి నిట్లనిరి [1]యీ ♦ షత్కోపదీప్తాస్యలై.

క. కొలిచినఁ గొలుతురు కొందఱు
గొలుతురు దముఁ గొలువకున్నఁ ♦ గొందఱు పతులం
గొలిచినను గొలువ కున్నను
గొలువరు మఱికొంద ఱెలమి ♦ గోపకుమారా. 1076

వ. అని తన్నుద్దేశించి రహస్యంబుగాఁ బలికిన సుందరులపలుకులు విని గోపాలసుందరుం డిట్లనియె. 1077

సీ. కొలిచినఁ గొలుతురు ♦ కొందఱు పశువుల
భజనము భంగిని ♦ ఫలముకొఱకు
నై సఖ్యధర్మము ♦ లందు సిద్ధింపవు
కొందఱు తండ్రుల ♦ గుణముఁ దాల్చి
దయఁ గలవారలు ♦ తగిన సుహృత్తులు
గొలువనివారలఁ ♦ గొల్తు రెపుడు
ధర్మకామంబులు ♦ దనరంగఁ గొందఱు
కొలువని వారిని ♦ గొలుచువారిఁ

ఆ. గొలుచుతలఁపు లేమిఁ ♦ గొలువ రాత్మారాము
లాప్తకాము లజ్ఞు ♦ లతికఠినులు
హారియందుఁ బిదప ♦ వానిఁగాఁ జింతించి
యే లతాంగులార ♦ యిట్టు లనుట. 1078

1. ఈషత్కోపదీప్తాస్యలై = కొంచెముగఁ గోపముతో నొప్పుచున్న ముఖములుగల వారలయి.

క. ఏ నిం దెవ్వఁడ నయినం గా నంగనలార పరమ ♦ కారుణికుండన్
మానసబంధుఁడ నిత్యధ్యానము మీ కొసఁగవలసి ♦ తలఁగితిఁజుండీ.

మ. నను సేవించుచు నున్న వారలకు నే ♦ నారూపముం జూపఁ జూ
చినఁ జాలించి మదించి వారు మఱి నన్ ♦ సేవింపరో యంచు ని
ర్ధనికుం డాత్మధనంబు సెడ్డ నెపుడుం ♦ దత్పారవశ్యంబుఁ దా
ల్చినభంగిన్ ననుఁబాసి మత్ప్రియుఁడుదాఁ ♦ జింతించునారూపమున్.

తరలము. తగవు ధర్మముఁ జూడ నొల్లక ♦ తల్లిదండ్రుల బంధులన్
మగల బిడ్డలఁ బాసి వచ్చిన ♦ [1]మన్నిషక్తల మిమ్ము నేఁ
దగదు పాసితిఁ దప్పు సైఁపుఁడు తద్వియోగభరంబునన్
వగలఁబొందుచు మీర లాడిన ♦ వాక్యముల్ వినుచుండితిన్.

ఉ. పాయని [2]గేహశృంఖలలఁ ♦ బాసి నిరంతర మత్పరత్వముం
జేయుచు నున్న మీకుఁ బ్రితి ♦ సేయ యుగంబులనైన నేర నన్
బాయక గొల్చుమానసము ♦ ప్రత్యుపకారముగాఁ దలంచి నా
పాయుటఁదప్పుగాఁగొనక ♦ భామినులార కృపన్ శమింపరే. 1082

క. చక్కఁగ హరి యిటుపలికిన చక్కనివాక్యములనతని♦సంగమమునలో
నిక్కినవియోగతాపము లొక్కటవిడిచిరి లతాంగు ♦ లుర్వీనాథా.

—♦ రాసక్రీడాభివర్ణనము ♦—

ఉ. ఆ సమయంబునన్ విభుఁడ ♦ నంతుఁడు కృష్ణుఁడు చిత్రమూర్తియై
చేసెను [3]మండలభ్రమణ ♦ శీలపరస్పరబద్ధబాహుకాం
తాసువిలాసమున్ బహువి ♦ ధస్ఫురితాననహస్తపాదవి
న్యాసము రాసముం గృతవి ♦ యచ్చరనేత్రమనోవికాసమున్.

వ. ఇట్లు బహుగతులం దిరుగ నేర్పరి యగు హరి దర్శించి తనయిరుగెలం
కుల నలంకృతలయి కళంకరహితచంద్రవదన లిద్దఱు ముద్దియ లుద్ది
గొని వీణ లందుకొని వీణలఁ బ్రవీణలై సొంపు మెఱసి యింపుగ

1. మన్నిషక్తల = నా యందాసక్తిగలవారిని. 2. గేహశృంఖలలన్ = గృహము లనెడి సంకెళ్ళను 3. మండలభ్రమణశీల పరస్పర బద్ధబాహుకాంతాసువిలాసమున్ = గుండ్రముగఁ దిరుగుటకై యొకరిభుజము నింకొకరు పట్టుకొనియున్న గోపికల విలాసములు గల,

వాయించుచు నానందలహరీవితానం బగు గానంబు సేయ నవిరళంబై తరళంబుగాని వేడుక సరళం బగు మురళంబు లీలం గేలనందుకొని మధురంబగు నధరంబునం గదియించి మించి కామినీజన కబరికా సౌగంధిక గంధబంధుర కరాంగుళీకిసలయంబులు యతిలయంబులం గూడి వివరంబుగ మురళీవివరంబులు సారెంచి పూరించుచు సాటిలేని భంగిం ద్రిభంగియై కమలకర్ణికాకారంబున నడుమ నిలిచి మఱియు గోపసుందరు లెందఱందఱకు నందఱయి సుందరుల కవల యెడలం దానును దవకవలయెడల సుందరులును దేజరిల్ల [1]నృత్తవిద్యామహార్ణవ వేలావలయవలయితంబై విస్మితాఖండలం బగు రాసమండలంబుం గల్పించి వేల్పులు హర్షంబునం గుసుమవర్షంబులు గురియ నందుఁ బ్రసూనమంజరీ సహచరంబులైన [2]చంచరీకంబులమించు ప్రకటించుచు సువర్ణ మణిమధ్యగంబులైన మహేంద్ర నీలంబుల తెఱంగు నెఱపుచుఁ [3]గరిణీవిహార బంధురంబులైన [4]సింధురంబుల చెలువుఁ గైకొలుపుచుఁ బల్లవిత కుసుమితలతానుకూలంబులైన తమాలంబులసొబగు నెగడించుచు మెఱపుఁదీవల నెడనెడఁ బెడం గడరు నల్ల మొగిళ్ళ చెల్లు చూపుచుఁ దరంగిణీసంగతంబులయిన రోహణాచలశృంగంబుల బాగు లాగించుచు జగన్మోహనుండై యుండి రక్తకమలారుణంబులును జంద్రశకలనిర్మల నఖర సంస్ఫురణంబులును [5]శ్రుతినితంబినీ సీమంతవీథికాలంకరణంబులును ద్రిలోక రక్షాకరణంబులును సనకసనందనాది యోగీంద్ర మానసాభరణంబులును నయిన చరణంబులు గదియ నిడి సమస్థితి నంజలిపుటంబులం బుష్పంబు లుల్లసిల్లఁ జల్లి సల్లలిత కమల ప్రశస్తంబు లయిన హస్తంబులు వల్లవీజనుల కంఠంబులపై నిడి తాను గీతానుసారంబుగ జిత్రపాదసంచారంబు సలుపుచు వర్తులాకార రాసబంధంబున నర్తనంబులం బ్రవర్తించి నెండియు ప్రేతలుం దానును శంఖపద్మవజ్రకందుక చతుర్ముఖ చక్రవాళ చతుర్భద్ర సౌభద్ర నాగ నంద్యావర్తకుండలీ

1. నృత్తవి......తంబై = నాట్యవిద్య యను సముద్రముయొక్క గుండ్రని చెలియలికట్టవలె వలయాకారమై. 2. చంచరీకంబులమించు = తుమ్మెదలయొక్క శోభ. 3. కరిణీ = ఆడయేనుఁగుల. 4. సింధురంబుల = ఏనుఁగులయొక్క. 5. శ్రుతినితంబినీ సీమంతవీథికాలంకరణంబులు = ఉపనిషదలంకారములయిన.

కరణ ఖురరీబంధ ప్రముఖంబు లయిన విశేషరాసబంధంబులకుం జొచ్చి యేకపాద సమపాద వినివర్తిత గతాగత వలిత వైశాఖ మండల త్రిభంగిప్రముఖంబు లైన తానకంబుల నిలుచుచుఁ గనక [1]కింకిణీమంజుల మంజీర శింజనంబులు జగజ్జనకర్ణ రంజనంబులై చెలంగ ఘట్టిత మర్దిత పార్శ్వగ ప్రముఖంబు లైన పాదకర్మభేదంబులు సేయుచు సమపాద శకట వదనమతల్లీ సుప్తిప్రముఖంబులైన [2]పార్థివచారివిశేషంబులును నపక్రాంకడోలాపాదసూచీప్రముఖంబు లైన [3]వ్యోమచారివిశేషంబులనుం జూపుచు సురేంద్ర శాఖశాఖామనోహరంబులును నపహసిత దిక్కరీంద్రకరంబులును త్రిలోకక్షేమకరంబులును నగు కరంబులం దిరంబు లగు రత్నకటకంబుల మెఱుంగులు నింగి చెఱుంగులం దఱచుకొన నర్ధచంద్ర కర్తరీముఖ కపిత్థ కటకాముఖ శుకతుండ లాంగూల పద్మకోశ పతాక ప్రముఖంబులైన స్వస్వభావ సూచక నానావిధకరభావంబు లాచరించుచుఁ గటినిబద్ధ సువర్ణ వర్ణచేలాంచల ప్రభానికరంబులు సుకరంబులై దిశాంగనాముఖంబులకు హరిద్రాలేపన ముద్రాలంకారంబు లొసంగుచు నాస్కందిత భ్రమరశకటాసన ప్రముఖంబులైన జానుమండల భేదంబులును నలాత దండలాత లలిత విచిత్ర ప్రముఖంబు లైన దైవమండలంబులు నొనర్చుచుఁ గమనీయ కంబుకంఠాభిరామంబులు నుద్దామ తేజస్తోమంబులు నైన నీల మౌక్తిక వజ్రవైడూర్య దామంబుల రుచు లిందిరకు మందిరంబులయి సుందరంబులైన యురంబులం దిరుగుడువడి కలయం బడ నంగాంతరవాహ్యాలకు ఛత్రిపర్రిముఖంబు లైన భ్రమరీవిశేషంబుల విలసించుచు నిద్దంబు లగు చెక్కుటద్దంబుల నుద్దవిడిం దద్దయుం బ్రభాసిత చంద్రమండలంబు లగు కుండలంబుల మెఱుంగు మొత్తంబులు నృత్తంబు లొనరింపఁ గటి భ్రాంతదండరచిత లలాటతిలక మయూర లలిత చక్రమండల నికుంచిత గంగావతరణ ప్రముఖంబు లైన కరణంబు లెఱింగించుచు వెలిదమ్మి విరులసిరులఁ

---

1. కనకకింకిణీ మంజుల మంజీర శింజనంబులు = బంగరు చిఱుగంటలతో నొప్పుచున్న పాంజేబుల ధ్వనులు. 2. పార్థివచారి విశేషంబులు = భూమిమీఁది నడకలలోని భేదములు. 3. వ్యోమచారి విశేషంబులు = ఆకాశమునందలి సంచార భేదములు.

చెన్ను మిగులు కన్నులవలన దీనజనదైన్య కర్కశంబు లై తనరు కటాక్షదర్శనజాలంబులు జాలంబులై కామినీజన నయనమీనంబుల నావరింప లలిత కుంచిత వికాస ముకుళ ప్రముఖంబు లయిన చూడ్కులం దేజరిల్లుచు ననేకపరిపూర్ణచంద్రసౌభాగ్యసదనంబు లగు వదనంబులఁ బ్రసన్నరాగంబులు ప్రకటించుచు [1]నుదంచిత పింఛమాలికా మయూఖంబు లకాలశక్రచాపంబుల సొంపు సంపాదింప నికుంచితాకుంచిత కంపితాకంపితపరివాహిత పరావృత్త ప్రముఖంబులైన శిరోభావంబులు నెఱపుచు మృగనాభితిలకంబులు గల నిటల ఫలకంబులఁ జికురంబులు నికరంబులుగ నపరాజిత సూచికావిద్ధ పరిచ్ఛిన్న విష్కంభ రేచిత ప్రముఖంబు లగు నంగహారంబుల విలసిల్లుచుఁ జరణకటీకరకంఠ రేచకంబు లాచరించుచు నొప్పె, నప్పు డా రాసంబు సంజనిత సకలజన మానసోల్లాసకరంబై సుధార్ణవంబునుం బోలె నుజ్జ్వల [2]రసాభిరామం బై రామరాజ్యంబునుంబోలె [4]రాగపరిపూర్ణం బై పూర్ణచంద్రమండలంబును బోలెఁ [4]గువలయానందం బై నందనవనంబునుంబోలె [5]భ్రమరీవిరాజమానంబై మానధనునిచిత్తంబునుంబోలెఁ బ్రధానవృద్ధిసమర్థం బై సమర్థకవివిలసనంబునుంబోలె బహు[6]ప్రబంధ భాసురం బై సురలోకంబునుంబోలె [7]వసుదేవనందనవిశిష్టం బై శిష్టచరితంబునుంబోలె ధరణీగగన మండలసుందరంబై సుందరీరత్నంబునుంబోలె నంగహార మనోహరం బై హారవధూనిలయంబునుంబోలె ననేక చారుసుకుమారంబై సుకుమారవృత్తంబునుంబోలె నుద్దీపితవంశం బై యుండె నందు. 1085

---

[1] ఉదంచిత పింఛమాలికా మయూఖంబులు = ప్రకాశించుచున్న నెమలి పింఛముల కాంతులు, అకాలశక్రచాపంబు సొంపు = అసమయములో నింద్ర ధనుస్సుయొక్క యందమును. 2. రసము = క్షీరరసము, శృంగారరసము. 3. రాగము = అనురాగము, సంగీతములోని రాగము. 4. కువలయము = భూమండలము, కలువ. 5. భ్రమరీ = తుమ్మెదలు, భ్రమణములు. 6. ప్రబంధము = గ్రంథము, ప్రకృష్టమయిన బంధము. 7. వసుదేవనందన = వాసుదేవుడు, వసు + దేవ + నందన = అష్టవసువులతోడ, దేవతలతోడ, నందనవనముతోడ.

చ. నడుములు స్రుంగి యాడఁ జిఱు ♦ నవ్వులు నివ్వటిలంగ హారముల్
సుసివడ మేఖలల్ వదలఁ ♦ జూడ్కి మెఱుంగులు వర్వ [1]ఘర్మముల్
వొడమఁ గురుల్ చలింప శ్రుతి♦భూషణముల్ మెఱయన్ సకృష్ణలై
పడఁతుక లాడుచుం జెలఁగి♦పాడిరి మేఘతటిల్లతాప్రభన్. 1086

క. అంకరహితేందువదనలు పంకజలోచనునిఁ గూడి♦పరఁగ నటింపం
గింకిణుల నూపురంబుల కంకణముల మ్రోఁత లెసఁగెఁ♦గర్ణోత్సవమై.

క. హరిణీనయనలతోడను హరి రాసక్రీడ సేయ ♦ నంబరవీథిన్
సురనాథులు భార్యలతో సొరిది విమానంబులెక్కి♦చూచిరి రేశా.

క. కురిసెం బువ్వులవానలు
మొరసెం దుందుభులు మింట ♦ ముదితలు దారున్
సరసన్ గంధర్వపతుల్
వరుసన్ హరిఁ బాడి రప్పుడు ♦ వసుధాధీశా. 1089

క. రామలతోడను రాసము రామానుజుఁడాడఁ జూచి ♦ రాగిల్లి మనో
రాములమీఁద వియచ్చరరామలు మూర్ఛిల్లి పడిరి ♦రాజకులేంద్రా.

క. తారాధిపనిభవదనలు తారాధిపవంశ్యుఁ గూడి ♦ తారు నటింపం
దారలు నిల్చి సుధాంశుఁడు దారును వీక్షింప రేయి ♦ దడవుగ జరగెన్

మ. [2]యమునాకంకణచారి యై వనజపు ♦ ష్పామోదసంచారియై
రమణీఘర్మనివారియై మదవతీ ♦ రాసశ్రమోత్తారియై
ప్రమదామానస నవ్యభవ్యసుఖసం ♦ పత్కారి యై చేరి యా
కమలాక్షుం డలరంగ గాలి విసరెం ♦ గల్యాణభావంబునన్. 1092

వ. అప్పుడు. 1093

చ. ప్రమద యొకర్తు మాధవుఁడు ♦ పాడ [3]విపంచి ధరించి కేలి సం
భ్రమమునఁ [4]దంత్రిమీటుచుఁ ది♦రంబుగ [5]ఠాయము సేసి యొక్క రా
గము దగ నాలపించి సుభ ♦ గస్వరజాతులు వేఱు వేఱ గా
నమరఁగఁ బాడెదన్ రమణుఁ ♦ డౌ నన దారువు లంకురింపఁగన్.

---

1. ఘర్మముల్ = చెమటలు. 2. యము...చారియై = యమునానదిలోని నీటిబిందువులను రేపుచున్నదై. 3. విపంచి = వీణను. 4. తంత్రి = తీఁగెను. 5. ఠాయము = స్వరస్థాయి.

క. ఆడుచుఁ బాడుచు నందొక చేడియ మంజీరమంజు ♦ శింజితమమరం
గూడి హరికరమునను గవపై డాయఁగ దిగిచె జఘన ♦ భారాలసయై.

క. చందనలిప్తంబై యరవిందామోదమున నొప్పు ♦ విపులభుజము గో
విందుఁడొకతరుణిమూఁపునఁ బొందించిననది దెమల్చి ♦ పులకించె నృపా.

సీ. చెలువ యొక్కతె చెక్కుఁ ♦ జెక్కుతోఁ మోపిన
విభుఁడు దా బూలచ ♦ ర్వితము వెట్టె
నాడుచు నొకలేమ ♦ యలసినఁ బ్రాణేశుఁ
డున్నతదోః స్తంభ ♦ మూఁత సేసెఁ
జెమరించి యొకబాల ♦ సేసినఁ గడ గోరఁ
జతురుఁడు కుచఘర్మ ♦ జలము వాపె
నలకంబు లొకయింతి ♦ [1]కళికచిత్రక రేఖ
నంటినఁ బ్రియుఁడు వా ♦ యంగ దువ్వె

ఆ. బడఁతి యొకతె పాట ♦ వాడి డస్సిన నధ
రామృతమున నాథుఁ ♦ డాదరించె
హరి యొక్కసతికి ♦ నంసావృతం బైనఁ
గాంతుఁ డురముఁ జేర్చి ♦ కౌఁగిలించె. 1097

క. హాసంబులఁ గరతల విన్యాసంబుల దర్శనముల ♦ నాలాపములన్
[2]రాసక్రాంతల నాహరి సేసెన్ మన్ననలు కరుణ ♦ సేసి నరేంద్రా.

క. హరి తనుసంగసుఖంబునఁ బరవశలై వ్రేతలెల్లఁ ♦ బయ్యెదలు నిజాం
బరములు నెఱుఁగమిచోద్యమె సురసతులీక్షించికరఁగి ♦ చొక్కి రిమింటన్.

వ. ఇట్లు భగవంతుండైన కృష్ణుం డాత్మారాముం డయ్యును గోపసతు
లెందఱందఱకు నందఱై నిజప్రతిబింబంబులతోడం గ్రీడించు
బాలుపోలిక రాసకేలి సలిపిన. 1100

క. తగఁగూడియాడిమనముల నగేఁజూ చెంబలి కెనంద ♦ నందనుఁ డనుచున్
మగువలు పెద్దరికముతోఁ బొగడిరి తమపూర్వజన్మ ♦ పుణ్యశ్రేణిన్.

---

1. అళికచిత్రరేఖన్ = నుదుటిబొట్టునందు, 2. రాసక్రాంతలన్ = రాస క్రీడలో శ్రమమును జెందినవారలను,

—◆ జలక్రీడా వర్ణనము ◆—

వ. ఇట్లు హరి రాసకేళి సాలించి కరకాంచిత లగు తటిల్లతల చెలువున ఘర్మసలిలకణాక్రాంతలగు కాంతలంగూడి జలక్రీడాకుతూహలుండై యమునాజలంబులు సొర నందు ముందర సుందరులు సొచ్చి పద ప్రమాణంబు [1]జానుదఘ్నంబు [2]కటిద్వయసంబు మధ్యమాత్రంబు కుచంబుల బంటి యని పలుకుచుం [3]గుచనయన నాభివివరకుంత లంబులు చక్రవాకజలచరావర్త శైవాలంబులచందంబున నందంబుగ నీడుఁ బొందిన యేఱులని కళిందనందన గరంబులు సాఁచి పరిరంభంబు లకు నారంభించుకై వడి నెదురు చనుదెంచి తాఁకు తరంగంబులకు నులుకుచు సారసంబులకుం గరంబులు డాచుచు మరాళంబులం జోపుచుఁ జెన్నుమిగిలిన చన్నుల యెత్తువత్తు మను నెపంబులం దపంబుల నీటఁ గావించు సూటిని సంచరించు చక్రవాకంబులం దోలుచు నితాంతకాంతి సదనంబు లగు వదనంబులకు నోడి వ్రీడం జెంది కంది చందురుండు సలంబుసిగ జలంబునంబడి కంపించుకరణి నిజకరకంపిత జలప్రతిఫలితుండై కదలు చంద్రునింగని మెచ్చిసోలుచు సలిలావగాహనసమయ సముచ్ఛలిత వారిశీకర పరంపరలవలన మక రంద పాన మత్త మధుకర పక్షవిక్షేపణ సంజాత వాత సముద్ధూత కుముదాది పరాగ పటంబులం జేరుచు మోముదమ్ముల కమ్మ దనంబునకు మూఁగి జుమ్మురను తుమ్మెదలకు వెఱచుచుఁ గరంబుల నీ రెగయం జఱచుచు నిలసీరదనిపతిత పయోబిందుసందోహంబులం దడియు పువ్వుఁదీవియల బాగునఁ గృష్ణకరద్వయ తోయంబులం [4]బెక్కుతోయంబులు దడియుచుఁ గ్రందుకొని సుడియుచు నసమ బాణుని పులుగడిగిన కుసుమ బాణంబులపగిది మేనులు మెఱయ సలిలావగాహనపరాయత్తచిత్త లగుచు మొత్తంబులై సరసభాష ణంబులం గ్రుమ్మచుఁ గరంబుల నీరు నించి హరిమీఁదం జల్లుచు

---

1. జానుదఘ్నము = మోకాలిలోఁతు 2. కటిద్వయసము = మొలలోఁతు.
3. కుచనయననాభి వివరకుంతలంబులు చక్రవాక జలచరావర్త శైవాలంబుల చందంబున = ఇది క్రమాలంకారము (అనఁగా) కుచములు చక్రవాక పక్షులవలెను, నేత్రములు మత్స్యములవలెను, నాభి సుడివలెను, కేశములు నాచువలె నొప్పుచుండె నని భావము. 4. పెక్కుతోయములు = పెక్కుపర్యాయములు.

జల్లునెడం దడఁబడన్ దాఁటుచు దాఁటి చనక నిలువరించుచు
వినోదింప హాఁసియుం గరేణుకరవికీర్ణ నీరధారాభిషిక్తంబగు శుండా
లంబులీల నాభీరకామినీకరసముజ్ఝిత జలాసారంబులం దోఁగుచు
వ్రజవధూజనహస్తప్రయుక్త కల్హార కైరవ పరాగపటలంబువలన
[1]భూతిభూషణుసిరి వహించుచు గోపికాజనపాణికిసలయ సమున్ముక్త
కమలదళంబులవలన సహస్రనయనునిరూపుఁ జూపుచు గోపాల
బాలికా కుచకలశ కుంకుమ పంకంబువలనఁ బ్రభాత బాలభానుని
భంగి భాసిల్లుచు ఘోషయోషా కటాక్షవిక్షేపణంబులవలన
మధుపరివృత హరిచందన సౌందర్యంబు నొందుచు వల్లవీహాసరుచుల
వలనఁ జంద్రికా ప్రభాభాసిత నీలశైలంబుక్రియ నమరె నంత. 1102

మ. సతులుం దానును నీటిలో వెడలి భూ ♦ షాగంధచేలాద్యలం
కృతుఁడై [2]కుంభి కరేణుయూథపులతోఁ ♦ గ్రీడించుచందంబునన్
లతలందుం దరులందుఁ బుష్పమయభూ ♦ లాశయ్యలందున్ సుఖో
న్నతుఁడై కృష్ణుఁడు క్రీడలం దనిపెనా ♦ నారీలలామంబులన్. 1103

వ. ఇట్లు శరత్కాలంబున వెన్నుం డింద్రియస్ఖలనంబు సేయక గోపికల
తోడ రమించె నని చెప్పిన మునివరునకు భూవరుండిట్లనియె. 1104

మత్తకోకిలము.

ధర్మకర్తయు ధర్మభర్తయు ♦ ధర్మమూర్తియు నైన స
త్కర్ముఁ డీశుఁడు ధర్మశిక్షకుఁ ధర్మరక్షయు జేయఁగా
నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి ప ♦ రాంగనాజనసంగమే
ధర్మమంచుఁ దలంచి చేసె ను ♦ దాత్తమానస చెప్పుమా.

వ. అనిన శుకుం డిట్లనియె. 1106

ఆ. సర్వభక్షుఁ డగ్ని ♦ సర్వంబు భక్షించి
దోషి గానిపగిది ♦ దోషమైనఁ
జేసి దోషపదముఁ ♦ జెందరు తేజస్వు
లగుటఁ [3]జంద్రవాస ♦ వాదు లధిప. 1107

---

1. భూతిభూషణుసిరి = శంకరునిశోభ. 2. కుంభికరేణుయూథములతో = మగయేనుఁగు, ఆఁడయేనుఁగులగుంపుతో. 3. చంద్రుఁడు, ఇంద్రుఁడు మొదలైనవారు.

క. ఈశ్వరుఁడు గానివాఁడు న
రేశ్వర పరకాంతఁ దలఁచి ♦ యెట్లు బ్రతుకు గా
రీశ్వరుఁడు దక్క నన్యుఁడు
విశ్వభయదవిషము మ్రింగి ♦ వెలయం గలఁడే. 1108

క. సత్యము ప్రభువులవచనము నిత్యముఁ దద్వచనవీథి ♦ నిలుతురు పెద్దల్
సత్యాసత్యము గావున సత్య మనుచుఁ జనరు వారి ♦ చరితమున నృపా.

మ. ఘనులై యెవ్వని పాదపంకజపరా ♦ గధ్యానసంప్రాప్తయో
గనిరూఢత్వముచే మునీంద్రులు మహా ♦ కర్మంబులం బాసి బం
ధనిరోధంబులు లేక విచ్చలవిడిన్ ♦ దర్పింతు రా దివ్యశో
భనుఁ డెట్లుండిన నుండెఁగాక కలవే ♦ బంధంబు లుర్వీశ్వరా. 1110

ఆ. గోపజనములందు ♦ గోపికలందును
సకలజంతులందు ♦ సంచరించు
నా మహాత్మునకుఁ బ ♦ రాంగన లెవ్వరు
సర్వమయుఁడు లీల ♦ చరిపెఁ గాక. 1111

వ. అని చెప్పి శుకుండిట్లనియె నంత [1]బ్రాహ్మముహూర్తంబునం గృష్ణు వీడ్కొని గోపిక లిచ్చ లేకయు నిండ్లకడ కేగినం గృష్ణమాయామోహితులై గోపకులు వారలం గోపింపనేరరై రివ్విధంబున. 1112

ఇంద్ర. గోపాలకృష్ణుండును ♦ గోపకాంతల్
ప్రాపించి క్రీడించిన ♦ భంగు లెల్లన్
రూపించి వర్ణించి న ♦ రుండు హృత్సం
తాపంబులన్ బాయును ♦ తత్త్వసక్తిన్. 1113

—♦ సర్పరూపి యగు సుదర్శనుం డను గంధర్వుని శాపవిమోచనము ♦—

వ. అంత నొక్కనాఁడు నందాదు లైన గోపకు లంబికావనంబునకు శకటంబు లెక్కి [2]జాతరకుం జని సరస్వతీనదీజలంబుల స్నానంబులు సేసి యుమామహేశ్వరుల నర్చించి కానిక లిచ్చి బ్రాహ్మణులకు గోహిరణ్య వస్త్రాన్నదానంబు లొసంగి జలంబులఁ బ్రాశించి నియమంబున నుండ దైవయోగంబున నాఁకొని యొక్క మహోరగంబు

1. బ్రాహ్మ్యముహూర్తము = తెల్లవాఱుజాము. 2. జాతర = ఉత్సవము.

నిదుర వోయిన నందునిం గఱచి మ్రింగ నగ్గలింప నతండు కృష్ణ
కృష్ణేతి వచనంబులం దన్ను విడిపింపు మని మొఱ యిడిన విని.

క. గోపకు లందఱు మేల్కొని
కోపముతోఁ బెద్దగుదెలఁ ♦ గొఱవుల మొత్తం
దాపము నొందియు వదలక
పాపపుఁ బెనుబాము నందుఁ ♦ బట్టె నరేంద్రా. 1115

వ. అయ్యవసరంబునఁ గృష్ణుండు దర్పించి పాదతాడనంబు సేసిత్రొక్కిన
సర్పంబు సర్పరూపంబు విడిచి విద్యాధరేంద్రరూపంబుఁ దాల్చి
హరికి మ్రొక్కిన నతనికి హరి యిట్లనియె. 1116

ఉ. [1]మండితమూర్తితోఁ గనక ♦ మాలికతో శుభలక్షణుండవై
యుండెదు నీకుఁ గష్టపు మ ♦ హోరగదేహ మి దేల వచ్చె నె
వ్వండవు నామ మెయ్యది భ ♦ వంబున కెద్ది మిషంబు నాకు నొం
డొండ యెఱుంగఁ జెప్పుము బు♦ధోత్తమ నీపని చోద్యమయ్యెడిన్.

వ. అనిన వాఁడిట్లనియె. దేవా యేను సుదర్శనుం డను విద్యాధరుండ
విమానారూఢుండ నై రూపసంపద్గర్వంబులం జొక్కి దిక్కులం
జరించుచు నొక్కయెడ నాంగిరసు లైన ఋషులం గురూపులైన
వారలం గని నగిన వారును నీవు రూపసంపద్గర్వంబున మమ్ము నగితివి
గావున మృపాసర్పంబ వై యుండు మని శపించె పిదప నే వేఁడు
కొనిన నిట్లనిరి. 1118

చ. యదుకులమందు భక్తుల భ ♦ యంబు హరించుటకున్ జనార్దనుం
డుదయము నొంది యీయడవి ♦ నొక్కదినంబున రాఁ గలండు త
త్పదమున నీవు దన్నఁబడి ♦ పన్నగదేహముతోడఁ బాసి నీ
మొదలిటిమేను గాంచెదవు ♦ మూఢుఁడ పొమ్మని రో దయానిధీ.

మ. నినుఁ జింతించిన నిన్నుఁ బేరుకొనినన్ ♦ నిర్మూలమై [2]క్రుస్సి పా
పనికాయంబు వినష్ట మౌ నఁట భవ ♦ త్పాదంబు నామీఁదఁ బె
ట్టినఁ దద్బ్రాహ్మణశాపసంజనిత కౌ ♦ టిల్యంబు దానిల్చునే
వనజాతేక్షణ నేఁడు వాసె [3]నురగత్వం బెల్ల నేఁ బోయెదన్. 1120

---

1. మండితమూర్తితో = అలంకరింపఁబడిన యాకృతితో. 2. క్రుస్సి = కృశించి
3. ఉరగత్వంబు = సర్పదేహంబు

వ. అని విన్నవించి హరికిఁ బ్రదక్షిణంబు వచ్చి మ్రొక్కి సుదర్శనుండు దివంబునకుం జనియె. సర్పంబువలన నందుండు విముక్తుం డయ్యె నదత్ప్రకారంబు విని వెఱఁగుపడి గోపకులు దేవతా మహోత్సవంబు సమాప్తి నొందించి కృష్ణకీర్తనంబు సేయుచు మఱల మందకుం జని రంత. 1121

—♦ కుబేరభటుం డగు శంఖచూడుం డను గుహ్యకుని సంహరించుట ♦—

చ. మఱి యొకనాఁటిరాత్రి బల ♦ మాధవు లుజ్జ్వల వస్త్రమాలికా
ధరులును లేపనాభరణ ♦ ధారులు నై చని మల్లికాదిపు
ష్పరసనిమగ్నమత్తమధు ♦ పంబుల గీతము వించుఁ దద్వనాం
తరమున వెన్నెలన్ [1]వ్రజని ♦ తంబిను లుండఁగఁ బాడి రింపుగన్.

క. ఆ పాట సెవుల సోఁకిన
నే పాటియు దేహలత ♦ నెఱుఁగక [2]దృగ్వా
చాపాటవములు సెడి పడి
రా పాటలగంధు లెల్ల ♦ నటవీవీథిన్. 1123

వ. ఇట్లు సకలభూత సమ్మోహనంబుగాఁ బాడుచు నిచ్ఛానువర్తనంబులం బ్రమత్తుల చందంబున రామకృష్ణులు క్రీడింపఁ గుబేర భటుండు శంఖచూడుం డను వాఁడు రామ కృష్ణ రక్షిత లగు గోపికలం దన యోగబలంబున నుత్తరపు దిక్కునకుం గొనిపోవ నయ్యమలు రామకృష్ణేతి భాషలం జీరె పులికి నగపడిన [3]మొదవులక్రియ మొఱ లిడిన విని. 1124

ఉ. గ్రద్దన సాలవృక్షములు ♦ గైకొని బల్లిదు లన్నదమ్ము లా
యుద్దఱుఁ గాలమృత్యువుల ♦ యేఁపున వే చని యోడకుండుఁ డో
ముద్దియలార యంచుఁ దను ♦ ముట్టినఁ జూచి కలంగి గుహ్యకుం
[4]డుద్దవడిన్ దగం బఱచె ♦ నుత్తర మింతుల డించి భీతుఁడై.

వ. ఇట్లు గుహ్యకునిచేత విడివడిన గోపికల రక్షించుకొని యుండు మని బలభద్రునిం బలికి. 1126

---

1. వ్రజనితంబినులు = గోపికలు. 2. దృగ్వాచాపాటవములు = చూపులలో మాటలలో నేర్పులు. 2. మొదవులక్రియ = పాఁడియావులరీతిగ. 4. ఉద్దవడిన్ = అత్యంతవేగముగ.

శా. ఓరీ గుహ్యక పోకు పోకు మని రో ♦ షోక్తిన్ బకారాతి వాఁ
డే రూపంబున నెందుఁ జొచ్చె నట వో ♦ యెం దోడఁ దా నేగి [1]దు
ర్వారోదంచితముష్టి వానితలఁ ద్రె ♦ వ్వం బెట్టి తద్వీరకో
టీర భ్రాజితరత్నముం గొనియె దం ♦ డిన్ గోపికల్ సూడఁగన్.

వ. ఇట్లు శంఖచూడునిం జంపి వానిశిరోరత్నంబు దెచ్చి బలభద్రున కిచ్చి మెప్పించె మఱియు నొక్కదినంబున గృష్ణుండు వనంబునకుం జనిన నతని లీలలు వాడుచు నిండ్లకడఁ దద్విరహవేదనానలభరంబు సహింపక గోపికలు దమలో నిట్లనిరి. 1128

శా. భ్రూవిక్షేపముతోడ దాపలిభుజం ♦ బుం జెక్కుఁ గీలించి కె
మ్మోవిన్ వేణువుఁ గూర్చి సుస్వరముగా ♦ మ్రోయించుచు న్నంగుళీ
ప్రావీణ్యంబు విభుండు సూపఁ గని స ♦ ప్రాణేశలై యుండియున్
నీవీబంధము లూడఁ జొక్కుదురు వో ♦ నింగిన్ [2]నిలింపాంగనల్.

మ. నవమాధుర్యము గల్గు కృష్ణు మురళీ ♦ నాదామృత స్యందముల్
సెవులం జొచ్చి హృదంతరాళముల భా ♦ సిల్లన్ సవత్సంబులై
యువిదా మేపులకుం దొఱంగి మృగగో ♦ యూథంబు లుత్కంఠతో
దివికిం గంఠము లెత్తి లో వదలుఁబో ♦ దేహేంద్రియవ్యాప్తులన్.

శా. ఓ కంజేక్షణ కృష్ణుఁ డుజ్జ్వలిత హా ♦ రోద్దాముఁడై గానవి
ద్యాకౌతూహలితన్ మనోజ్ఞమురళీ ♦ ధ్వానంబు గావింపఁగా
నాకర్ణించి [3]సశంప మై మురయు నీ ♦ లాభ్రంబుగాఁ జూచుచుం
గేకారావము లిచ్చుచున్ మురియుఁ బో ♦ [4]కేకీంద్రసంఘాతముల్.

మ. లలనా యేటికిఁ దెల్లవాఱె రవి యే ♦ లా తోఁచెఁ బూర్వాద్రిపైఁ
గలకాలంబు నహంబు గాక నిసిగాఁ ♦ గల్పింపఁ డా బ్రహ్మ దా
వలజేఁడుం గృప లేఁడు కీరములు దు ♦ ర్వారంబు లెట్లో కదే
కలదే మాపటివేళయుం గలుగునే ♦ కంజాక్షు సంభోగముల్.

ఉ. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు హరి ♦ యెప్పుడు గోవుల మేపివచ్చు నా
కెప్పుడు తన్ముఖాంబుజస ♦ మీక్షణ మబ్బు నతండు వచ్చిన

1. దుర్వా...ముష్టి = అడ్డుకొనరాని బలమైన పిడికిలి, 2. నిలింపాంగనల్ = దేవతాస్త్రీలు, 3. సశంపమై = మెఱుపుతోఁ గూడినదై. 4. కేకీంద్రసంఘాతముల్ = శ్రేష్ఠమయిన నెమిళ్ళగుంపులు.

న్నెప్పుడు గారవించుఁ దుది ♦ యెప్పుడు మద్విరహాగ్నిరాశికిం
జెప్పఁగ దమ్మ బోఁటి [1]మరు ♦ చేఁతల నుల్లము దల్లడిల్లెడిన్.

మ. చెలియా కృష్ణుఁడు నన్నుఁ బాసి వనముం ♦ జేరంగ నయ్యేక్షణం
బులు నాకన్నియు నుండ నుండఁగడు నా♦పూర్ణంబులై సాఁగి లో
పల దోఁచుం [2]ప్రహారంబులై దినములై ♦ పక్షస్వరూపంబులై
నెలలై యబ్దములై మహాయుగములై ♦ నిండారు కల్పంబులై.

వ. అని మఱియుఁ గృష్ణవిరహదుఃఖంబున బహువిధంబులఁ బశ్చాత్తాపంబుఁ బొందుచు గోపిక లోపికలు లేక యెట్టకేలకు దినంబు గడపి దినాంత సమయంబునందు. 1135

మ. అదె భానుం డపరాద్రిఁ జేరె నిదె సా ♦ యంకాల మేతెంచె న
ల్లదె గోపాదపరాగ మొప్పెసఁగె బృం ♦ దారణ్యమార్గంబునం
దిదె వీతెంచె వృషేంద్రఘోషము ప్రియుం ♦ డేతెంచె రండంచుఁ దా
మెదు రేతెంతురు మాపు కృష్ణునికి న ♦ య్యంతుల్ పరిభ్రాంతలై.

వ. ఇట్లు దన కెదురు వచ్చిన మచ్చిక నచ్చెలువల నచ్యుతుం డిచ్ఛానువర్తనంబుల గారవించె నంత నొక్కనాఁడు. 1137

—♦ శ్రీకృష్ణుండు వృషభాసురుని సంహరించుట. ♦—

సీ. ఎవ్వనిమూఁపుర ♦ మీక్షించి మేఘంబు
లద్రిశృంగం బని ♦ యాశ్రయించు
నెవ్వనిఱంకె క ♦ ర్ణేంద్రియంబులు సోఁక
గర్భపాతం బగు ♦ గర్భిణులకు
నెవ్వనిపదహతి ♦ నెగయు పరాగంబు
లంధకారారాతి ♦ నావరించు
నెవ్వఁడు గొమ్ముల ♦ నెదిరించి చిమ్మినఁ
బృథ్వీధరంబులు ♦ పెల్లగిల్లు

తే. నట్టి వృషభాసురేంద్రుఁ డ ♦ హంకరించి
వాలలత యెత్తి పెనుఱంకె ♦ వైచి నేల

1. మరుచేతలు = మన్మథచేష్టలు. 2. ప్రహారంబు = జాము.

గాలు ద్రవ్వుచు నిశితకర్శృం ♦ గముల సాఁచి
మంద [1]బెగడంగఁ [2]గవిసె న ♦ మందుఁ డగుచు. 1138

వ. ఇట్లు వృషభాకారంబున నరిష్టుండు హరికి నరిష్టంబు సేయం దలంచి
పై కుఱికిన. 1139

ఉ. క్రేపులు వాఱె గోవులకుఁ ♦ గ్రేపులు గోవులు గోవృషంబులం
బైపడె [3]వత్సధేను వృష ♦ భంబులు గోపకులందుఁ జొచ్చె నా
గోపకులా వృషేంద్రములు ♦ గోవులు లేఁగలు విచ్చి పాఱఁగా
గోపచమూవిభుండు గనె ♦ గోవృషదైత్యుఁడు వెంటనంటఁగన్.

వ. ఇట్లు భయభ్రాంతులై కాంతలుం దారును గృష్ణ రక్షింపు రక్షింపు
మనియెడు గోపకులకు నడ్డంబువచ్చి దీనజన రక్షకుండైన పుండరీ
కాక్షుం డి ట్లనియె. 1141

ఉ. బాలుర నింతులం బసులఁ ♦ బాఱఁగఁ దోలుట బంటుపంతమే
చాలు వృషాసురేంద్ర బల ♦ సంపదఁ జూపఁగ నెల్ల బోటి గో
పాలుర మంద గాదు చనఁ ♦ బైపడితేనిఁ బ్రచండకృష్ణ శా
ర్దూలము నేఁడు నీ గళము ♦ ద్రుంపక చంపక పోవనిచ్చునే.

ఆ. అనుచు ధిక్కరించి ♦ హస్తతలంబులఁ
జప్పుడించి నగుచు ♦ సఖునిమీఁదఁ
బన్నగేంద్రభయద ♦ బాహుదండము సాఁచి
దండి మెఱసి దనుజు ♦ దండ నిలిచె.

వ. అప్పుడు. 1144

చ. [4]ఖురముల నేలఁ ద్రవ్వుచు [5]న ♦ కుంఠితవాలసమీరణంబులన్
విరవిరఁ బోయి మేఘములు ♦ వివ్వ విషాణము లొడ్డికొంచు దు
స్తరతరమూర్తియై వృషభ ♦ దైత్యుఁడు గన్నుల నిప్పులొల్కఁగా
దురదుర వచ్చి తాఁకె రిపు ♦ దుర్మదమోచనుఁ బద్మలోచనున్.

1. బెగడంగన్ = భయపడఁగ. 4. కవిసెన్ = వ్యాపించెను, 3. వత్సధేను
వృషభంబులు = దూడలు, గోవులు, వృషభములు. 4. ఖురముల = డెక్కలచే
5. అకుంఠితవాలసమీరణంబులన్ = ఎదురులేక తోక నాడించుటవలనఁ గలిగిన
వాయువులచే.

ఉ. యాదవకుంజరుండు వృష ♦ భాసురుకొమ్ములు రెండుబట్టి య
ష్టాదశపాదమాత్రము గ ♦ జంబు గజంబును ద్రొబ్బు కైవడిన్
భేదిల ద్రొబ్బ నయ్యసుర ♦ బిమ్మిటినొంది చెమర్చి మ్రొగ్గి దు
ర్మాదముతోడ డీకొనెఁ బ్ర ♦ మత్తవిమర్దను నా జనార్దనున్.

ఆ. అంత గోపసింహుఁ ♦ డసురకొమ్ములు వట్టి
ధరణిఁ ద్రొబ్బి త్రొక్కి ♦ దైత్యభటుల
కొమ్మువీఁగ సురల ♦ కొమ్ము వర్థిల వాని
కొమ్ము వెఱికి మొత్తె ♦ కూల్చె నధిప.

క. ఉక్కు సెడి [1]రోఁజి నెత్తురు ముక్కున వాతను స్రవింప ♦ మూత్రశకృత్తుల్
మిక్కిలి విడుచుచు మసరపు రక్కసుఁ డవిసె బ్రజకు ♦ రాగంబమరన్.

వ. ఇట్లు వృషభాసురుం జంపిన నిలింపులు గుంపులు గొని విరులు వర్షింప గోపకులు హర్షింప గోపసతు లుత్కర్షింప బలభద్రుండును దానును గోవిందుండు పరమానందంబున మందకుం జనియె నంత. 1149

చ. ఘనుఁ డొకనాఁడు నారదుఁడు ♦ కంసునితోడ యశోదకూఁతుఁ దాఁ
గనుటయుఁ జక్రి దేవకికి ♦ గర్భజుఁ డౌటయు మున్ను రోహిణీ
తనయుఁడు రాముఁ డౌటయును ♦ దద్విభు లిద్దఱు మంద నున్నవా
రనియు నెఱుంగఁ జెప్పిన మ ♦ హోన్నతమంచుఁ జలించి కిన్కతోన్.

చ. కొడుకుల మందలోన నిడి ♦ గొంటుతనంబున మోసపుచ్చె నీ
బడుగును బట్టి చంపు టిది ♦ భావ్య మటంచుఁ గృపాణపాణియై
వడి వసుదేవునిం జనుచు ♦ వచ్చిన కంసునిఁ జూచి నారదుం
డుడుగుము చంపఁ బోల దని ♦ యోడక మానిచి పోయె నింటికిన్.

వ. మఱియు నలుకదీఱక కంసుండు దేవకీవసుదేవుల లోహపాశబద్ధులం జేసి కేశియనువానిం బిలిచి రామకేశవులం జంపుమని పంపి మంత్రి భటగజారోహకచాణూరముష్టిక సాల్వ కోసల ప్రముఖుల రావించి యిట్లనియె.

శా. ఎందున్ నన్నెదిరించి పోరుటకు దే ♦ వేంద్రాదులుం జాల రీ
బృందారణ్యము మంద నిప్పుడు [2]మదా ♦ భీరార్భకుల్ రామగో

1. రోఁజి = నిట్టూర్పువిడిచి 2. మదాభీరార్భకుల్ = పొగరెక్కిన గొల్లపిల్లలు.

విందుల్ వర్ధిలుచున్నవా రట రణో ♦ ద్యోం గంసు మర్దింతు మం
చుం దర్పంబులు వల్కుచుందు రట యీ ♦ చోద్యంబులన్ వింటిరే.

క. పట్టణజనములు సూతురు దట్టంబుగ మల్లరంగ ♦ తలపార్శ్వములం
బెట్టించుఁడుతమకంబులు పుట్టించుఁడు వీటమల్లు ♦ పోరనుమాటన్.

శా. [1]విన్నాణంబులఁ జోరనేర్తురు మహా ♦ వీర్యప్రతాపాది సం
పన్నుల్ మీరలు మేటిమల్లుగములం ♦ ప్రఖ్యాతులై పెంపుతో
మన్నా రా బలకృష్ణులం బెనఁకువన్ ♦ మర్దించి మత్ప్రీతి కా
సన్నుల్ గండు పురీజనుల్ పొగడ నో ♦ చాణూర యో ముష్టికా.

శా. రారా [2]హస్తిపకేంద్ర [3]గండమదధా ♦ రాగంధలోభాంధగం
భీరాళివ్రజ మైన మత్కువలయా ♦ పీడద్విపేంద్రంబు మ
ద్ద్వారోదంచిత దేహళీపరిసర ♦ స్తంభంబు డాయంగ నా
భీరుల్ రా నదలించి డీకొలుపు నీ ♦ బీరంబు తోరంబుగన్. 1156

క. పశు [4]విశసనములు సేయుఁడు
పశుపతికిం బ్రియము గాఁగ ♦ భావించి చతు
ర్దశినాఁడు ధనుర్యాగము
విశదంబుగఁ జేయ వలయు ♦ విజయముకొఱకున్.

వ. అని తనవారి నందఱ నయ్యైపనులకు నియమించి యదుశ్రేష్ఠుం డగు నక్రూరునిం బిలిపించి చెట్టవట్టికొని యిట్లనియె.

శా. అక్రూరత్వముతోడ నీవు మనఁగా ♦ నక్రూరనామంబు ని
ర్వక్రత్వంబునఁ జెల్లె మైత్రి సలుపన్ ♦ వచ్చున్ నినుం జేరి నీ
వక్రోధుండవు మందలోన బలకృ ♦ ష్ణాభీగు లస్మద్వినా
శక్రీడారతులై చరింతు రట యో ♦ జం దెచ్చి యొప్పింపవే.

ఆ. పాకు వెఱచి సురలు ♦ నారాయణుని వేఁడి
కొనిన నతఁడు వచ్చి ♦ గోపకులము

1. విన్నాణంబులన్ = నేర్పుతో. 2. హస్తిపకేంద్ర! = మావటీఁడులలో శ్రేష్ఠుఁడా! 3. గండమదధారాగంధలోభాంధగంభీరాళివ్రజ మైన = గండస్థలము నందలి మదధారయొక్క పరిమళమునం దాసక్తిచే గన్నుగానని గంభీర మైన తుమ్మెదల గుంపుగల. 4 విశసనములు = హింసలు.

నందుఁ గృష్ణమూర్తి ♦ [1]నానకదుందుభి
కుదతుఁ డయ్యె ననఁగ ♦ నొకటి వింటె. 1160

వ. కావున నీవు గోపకులచేత [2]నరులు గొని ధనుర్యాగంబుఁజూడ రండని వారలం దోడ్కొని రమ్ము వచ్చిన. 1161

శా. కొండల్ గూలఁగ ద్రొబ్బు కొమ్ములతుదిం ♦ గోపించి [3]కోరాడుచో
దండిన్ [4]దండి నధఃకరించు నొక [5]వే ♦ దండంబు నా యింట బ్ర
హ్మాండం బైనఁ గదల్ప నోపు బలకృ ♦ ష్ణాభీరులం బోరిలో
ఖండింపం దడ వెంత దాని కదియుం ♦ గాదేని నక్రూరకా. 1162

శా. చాణూరుండును ముష్టికుండును సభా ♦ సంఖ్యాతమల్లుల్ [5]జగ
త్ప్రాణున్ మెచ్చరు సత్త్వసంపదల బా ♦ హాబాహిసంగ్రామపా
రీణుల్ వారలు రామకృష్ణుల బలో ♦ ద్రేకంబు సైరింతురే
క్షీణప్రాణులఁ జేసి చూపుదురు సం ♦ సిద్ధంబు యుద్ధంబునన్. 1163

సీ. ఆ రామకేశవు ♦ లంతరించిన వసు
దేవముఖ్యులఁ జంపి ♦ తెగువ నొఱసి
వృష్టిభోజదశార్హ ♦ వీరులఁ దెగటార్చి
ముదుకఁడు రాజ్యకా ♦ ముకుఁడు ఖలుఁడు
నగు నుగ్రసేను మా ♦ యయ్య గీ టడఁగించి
పినతండ్రి దేవకుఁ ♦ బీఁచ మడఁచి
మఱియు వైరుల నెల్ల ♦ మర్దించి నే జరా
సంధ నరక బాణ ♦ శంబరాది

ఆ. సఖులతోడ భూమి ♦ చ క మేలెదఁ బొమ్ము
తెమ్ము వేగమ వసు ♦ దేవసుతుల
మఖము పేరు సెప్పి ♦ మంత్రభేదము సేయ
వలయుఁ బెంపఁ జనదు ♦ వైరిజనుల. 1164

వ. అనిన నక్రూరుండిట్లనియె. 1165

---

1. ఆనకదుందుభికి = వసుదేవునకు. 2. అరులు = కప్పములు. 3. కోరాడుచో = కొమ్ములతో దుమ్ము పైకిఁ జల్లునపుడు. 4. దండి = యముని 5. వేదండంబు = ఏనుఁగు. 6. జగత్ప్రాణున్ = వాయువును.

ఉ. పంపినఁ బోనివాఁడనె నృ • పాలక మానవులెన్నఁ దమ్ము నూ
హింపరు దైవయోగముల • నించుక గానరు తోఁచినట్లు ని
ష్కంపగతిం జరింతు రది • గాదనవచ్చునె యీశ్వరేచ్ఛఁ ద
ప్పింపఁగ రాదు నీ పగతు • బిడ్డలఁ దెచ్చెదఁ బోయివచ్చెదన్.

—• శ్రీకృష్ణుఁడు కేశివ్యోమాసురుల సంహరించుట •—

వ. అని పలికి రథం బెక్కి యక్రూరుండు సనిన సకలజనులను వీడుకొలిపి కంసుండు దంతిపురంబునకుం జనియె నంతఁ గంసప్రేరితుండై.

సీ. ఖురపుటాహతిఁ దూలి • [1]కుంభినీచక్రంబు
ఫణిరాజఫణములకుఁ • బరువు సేయ
భీషణహేషావి • భీషితులై మింట
[2]నమృతాంధు లొండొరు • నండఁ గోరఁ
[3]జటులచంచలసటా • చ్ఛటల గాడ్పుల మేఘ
ములు విమానములపై • ముసుఁగుపడఁగ
వివృతాస్యగహ్వర • విపులదంతంబులు
ప్రళయాగ్నికీలల • పగిది మెఱయఁ

ఆ. గాలపాశలీల • గావాలమేపార వాహమగుచు గంధ • వాహగతుల
[4]విజితశక్రపాశి • వీర్యపయోరాశి కేశివచ్చె మంద • క్లేశమంద. 1168

వ. మఱియును. 1169

క. భీషణఘోటక దానవ హేషానిర్ఘోషభిన్న • హృదయాఖిలగో
యోషాపురుషార్భకమై ఘోషముహరిసూడదైన్య • ఘోషంబయ్యెన్.

వ. ఆ సమయంబున. 1171

ఉ. పేదల ఘోషగోపకుల • బిట్టడలించుట వీరధర్మమా
కాదు వ్రజంబులో [5]దనుజ • ఘస్మరుఁ డే డని తన్నరోయు [6]క్ర
వ్యాదునిఁ జూచి గోపకుల • కడ్డము వచ్చి నిశాట యింకఁ బో
రా దని శౌరి సీరె మృగ • రాజు క్రియ న్నెదిరించె దైత్యుఁడున్.

1. కుంభినీ చక్రంబు = భూమండలము. 2. అమృతాంధులు = దేవతలు. 3. చటుల.......చ్ఛటలగాడ్పులన్ = తీవ్రముగా నెగురుచున్న జూలుసమూదాయముచేఁ బుట్టిన వాయువులచేత. 4. విజితశక్రపాశి = ఇంద్రుని, వరుణుని జయించినటువంటి 5. దనుజఘస్మరుఁడు = రాక్షసాంతకుఁడు. 6. క్రవ్యాదుని = రాక్షసుని

ఆ. నిష్ఠురోగ్రసింహ ♦ నినదంబుతో నింగి
ప్రింగుభంగి నోరు ♦ మిగులఁ దెఱచి
కఱవ రాఁగ నతఁడు ♦ గాటు దప్పించినఁ
దన్నె నెగసి తురగ ♦ దానవుండు. 1173

ఉ. తన్నిన తన్నునం బడక ♦ దానవ హంత [1]సమీకరంతయై
కన్నులఁ గెంపు పెంపెసఁగ ♦ గ్రక్కున ఘోటనిశాటుపాదముల్
వన్నె సెడంగఁ బట్టి నడి ♦ వైచె ధనుశ్శతమాత్రదూరముం
[2]బన్నగడింభమున్ విసరి ♦ పాఱఁగ వైచు ఖగేంద్రు కైవడిన్. 1174

ఉ. వైచిన మ్రొగ్గిలేచి వెస ♦ [3]వాజినిశాటుఁడు హుంకరించి సం
కోచము లేక పైఁ బడిన ♦ గోపకులేంద్రుఁడు దిగ్గజేంద్రశుం
డాచటుల ప్రభాబలవి ♦ డంబకమైన భుజార్గళంబు దో
షాచరునోటిలో నిడియెఁ ♦ జండఫణిన్ గుహ నుంచు కైవడిన్.

శా. [3]దంభోళిప్రతిమానకర్కశమహో ♦ ద్యద్వామదోస్తంభమున్
శుంభల్లీల నఘారి వానిరదముల్ ♦ చూర్ణంబులై రాలఁగా
గంభీరంబుగఁ గుక్షిలోఁ జొనిపి పీఁ ♦ కన్ వృద్ధిబొందించుచుం
గుంభించెన్ బవనంబు పిక్కటిలఁ ద ♦ త్కుక్షిన్ నరేంద్రోత్తమా

క. వాయువు వెడలక నిలిచిన గాయంబు సెమర్పఁగన్నుఁ ♦ గవ వెలి కుఱుకన్
మాయ సెడి తన్నుఁ గొనుచును గూయుచు నశ్వాసురుండు ♦ గూలెన్ నేలన్.

ఆ. ఘోటకాసురేంద్రు ♦ కుక్షిలోఁ గృష్ణుని
బాహువధికమైనఁ ♦ బట్టు లేమిఁ
బగిది దోసపండు ♦ పగిదిఁ దద్దేహంబు
వసుమతీశ రెండు ♦ వ్రయ్యలయ్యె. 1178

క. నలినాక్షుఁడు లీలాగతి విలయముఁ బొందించె నిట్లు ♦ వీరావేశం
[5]బలలాశిన్ జగదభినవ బలరాశిన్ విజితశక్ర ♦ పాశిం గేశిన్. 1179

వ. ఆ సమయంబునం బుష్పవర్షంబులు గురియించి సురలు వినుతించి

1. సమీకరంతయై = యుద్ధములోఁ గ్రీడించువాఁడై. 2. పన్నగడింభమున్ = పాముపిల్లను 3. వాజినిశాటుఁడు = కేశియను రక్కసుఁడు (గుఱ్ఱపురూపుగల రక్కసుఁడు). 4. దంభోళి = వజ్రాయుధము. 5. పలలాశిన్ = రక్కసుని.

రంత హరిభక్తి విశారదుండైన నారదుండు వచ్చి గోవిందుని సంద
ర్శించి రహస్యంబున ని ట్లనియె.

సీ. జగతీశ యోగీశ ♦ సర్వభూతాధార
సకల సంపూర్ణ యీ ♦ శ్వర మహాత్మ
[1]కాష్ఠగతజ్యోతి ♦ కైవడి నిఖిలభూ
తము లందు నొక్కఁడవై ♦ తనరు దీవు
సద్బాధ్యుఁడవు గుహా ♦ శయుఁడవు సాక్షివి
నీ యంతవాఁడవై ♦ నీవు మాయఁ
గూడి కల్పింతువు ♦ గుణము లు వానిచేఁ
బుట్టించి రక్షించి ♦ పొలియఁజేయు

ఆ. దీ ప్రపంచ మెల్ల ♦ నిట్టి నీ విప్పుడు
రాజమూర్తు లయిన ♦ రాక్షసులను
సంహరించి భూమి ♦ చక్రంబు రక్షింప
నవతరించినాఁడ ♦ వయ్య కృష్ణ. 1181

వ. దేవా నీచేత నింకఁ జాణూర ముష్టిక గజ కంస శంఖ యవన ముర
నరక పౌండ్రక శిశుపాల దంతవక్త్ర సాల్వ ప్రముఖులు మడిసె
దరు. పారిజాతం బపహృతం బయ్యెడిని. నృగుండు శాపవిముక్తుం
డగు, శమంతకమణి సంగ్రహంబగు, మృతబ్రాహ్మణపుత్త్రప్రదా
నంబుసిద్ధించు, నర్జునసారథి వై యనేకాక్షౌహిణీ బలంబుల వధియించె
దవు మఱియును.

శా. కృష్ణా నీ వొనరించు కార్యములు లె ♦ క్కింపన్ సమర్థుండె వ
రిష్ఠుండైన విధాత మూఁడుగుణముల్ ♦ దీపించు లోపించు రో
చిష్ణుత్వంబున నుండు నీవలన ని ♦ స్సీమంబు నీ రూపు నిన్
విష్ణున్ జిష్ణు సహిష్ణు నీశు నమితున్ ♦ విశ్వేశ్వరున్ మ్రొక్కెదన్.

వ. అని వినుతించి వీడుకొని నారదుం డరిగె. నంత నొక్కనాఁడు
కృష్ణసహితు లయి గోపకుమారు లడవికిం జని పసుల మేపుచు
నొక్కకొండదండ నిలాయనక్రీడ సేసి రందు. 1184

1. కాష్ఠగతజ్యోతి కైవడి = కట్టెలోపల నున్న నిప్పువలె.

క. కొందఱు గొఱియల నుంచును
గొందఱు పాలకుల మంచుఁ ♦ గుటిలత్వమునం
గొందఱు దొంగల మనుచును
జెంది కుమారకులు క్రీడ ♦ సేసిరి తమలోన్. 1185

శా. ఆలో దొంగలలో మయాసురసుతుం ♦ డా వ్యోముండు గో
పాలుండై చని మేషకల్పనలతో ♦ భాసిల్లి క్రీడించు త
ద్బాలవ్రాతము నెల్ల మెల్లన [1]చతుః ♦ పంచావశిష్టంబుగా
శైలాంతర్గుహలోనికిం గొని చనెం ♦ శౌర్యంబవార్యంబుగన్ 1186

వ. ఇట్లు కొండగుహలోనఁ గ్రమక్రమంబున గోపకుమారుల నిడి యొక్క పెనుఱాతఁ దద్ద్వారంబు గప్పి యెప్పటియట్ల వచ్చిన. 1187

ఉ. వీరుఁడు మాధవుం డఖిల ♦ వేద నిశాచరభేది నవ్వుతో
నౌర నిశాట దొంగతన ♦ మప్పుడె నెఱిదొంగ వాఁడు వా
భీరుల నెల్ల శైలగుహఁ ♦ బెట్టితి చిక్కినవారిఁ బెట్ట రా
రార యటంచుఁ బట్టె [2]మృగ ♦ రాజు [3]వృకాఖ్యముఁ బట్టుకైవడిన్.

ఉ. పంకజలోచనుం డొడిసి ♦ పట్టిన శైలనిభాసురాకృతిన్
బింకముతోడఁ బొంగి విడి ♦ పించుకొనంగ బలంబు లేమి లో
శంకిలి బిట్టు తన్నుకొనఁ ♦ జక్కన యా రణభీము వ్యోమునిన్
గొంకకఁ గూల్చె నవ్విభుఁడు ♦ గోయని మింట సుపర్వు లార్వఁగన్

ఆ. ఘోరదనుజు నేలఁ ♦ గూల్చి పర్వతగుహ
వాత నున్నఱాయి ♦ వ్రయ్యఁ దన్ని
గుహఁ జరించుచున్న ♦ గోపాలకులఁ గొంచు
బల్లిదుండు గొల్ల ♦ పల్లె కరిగె. 1190

వ. అంత నా రాత్రి మధురానగరంబున నక్రూరుండు వసియించి మఱునాఁడు [4]రేపకడ లేచి నిత్యకృత్యంబు లాచరించి రథం బెక్కి కదలి నందగోపకులంబునకుం బోవుచుం దెరువునఁ దనలో నిట్లనియె.

1. చతుః...బుగాన్ = నలుగురైదుగురు మిగులునట్లుగా. 4. మృగరాజు = సింహము, 3. వృకాఖ్యము = తోఁడేలును. 4. రేపకడ = ప్రాతఃకాలమున,

## — ♦ కంసునిపంపున నక్రూరుండు బృందావనంబునకుఁ జనుదెంచుట ♦ —

ఉ. ఎట్టితపంబు సేయఁబడె ♦ నెట్టి చరిత్రము లబ్ధ మయ్యెనో
యెట్టి ధనంబు లర్థులకు ♦ నీఁబడెనో తొలిబామునందు నా
యట్టి వివేకహీనునకు ♦ నాదిమునీంద్రులు యోగదృష్టులం
బట్టఁగ లేని యీశ్వరుని ♦ బ్రహ్మమయున్ హరిఁ జూడఁ గల్గెడిన్.

ఉ. సూరులు దొల్లి యే విభుని ♦ శోభితపాదనఖప్రభావళిం
జేరి భవాంధకారములఁ ♦ జిక్కక దాఁటుదు రట్టి దేవరన్
వైరముతోడనైన బిలు ♦ వన్ ననుఁ బంచి శుభంబుసేసె ని
ష్కారణ మైన ప్రేమ నిదె ♦ కంసునిఁ బోలు సఖుండు గల్గునే.

మ. ఇతఁ డా కంసునిచేతఁ బంపువడి నన్ ♦ హింసింప నేతెంచినాఁ
డతిదుష్టుం డని చూచునో సకల భూ ♦ తాంతర్బహిర్మధ్య సం
గతుఁ డౌటం దలపోసి నన్ను సుజనుం ♦ గాఁ జూచునో యెట్టి యు
న్నతి గావించునొ యేక్రియం బలుకునో ♦ నాభాగ్య మెట్లున్నదో.

వ. అని మఱియును. 1195

మ. అలకభ్రాజితమై సుధాంశునిభ మై ♦ హాసప్రభోద్దామమై
జలజాక్షం బయి కర్ణకుండల విరా ♦ జద్గండ మై యున్న యా
జలజాతాక్షుముఖంబు సూడఁ గలుగున్ ♦ సత్యంబు వో నాకు నా
వలది క్కేఁగుచు నున్న యీ వనమృగ ♦ వ్రాతంబు లీత్రోవలన్. 1196

ఉ. మాపటివేళ నేను జని ♦ మాధవుపాద సమీపమందు దం
డాపతితుండ నైన నతఁ ♦ [1]డాశుగ కాలభుజంగ వేగసం
తాపిత భక్తలోక భయ ♦ దారణ మైన కరాబ్జ మాదలన్
మోపి హసించి నా కభయ ♦ ముం గృపతోడుత నీయకుండునే.

వ. అని మఱియు నక్రూరుం డనేకవిధంబుల గోవింద సందర్శనంబు గోరుచు నమందగమనంబున సుందరస్యందనారూఢుండై చనిచని.

క. ముందటఁ గనె ఘనచందన కుందకుటజతాలసాల ♦ కురువకవట మా
కందన్ [2]నందితబల గోవిందన్ వికచారుణార ♦ విందన్ బృందన్.

---

1. ఆశుగ కాలభుజంగము = వేగముగాఁబరుగెత్తు కాలసర్పము. 2. నందిత బలగోవిందన్ = బలరామ కృష్ణులను సంతోషపెట్టినట్టి.

వ. కని బృందావనంబు దఱియం జొచ్చి యందు సాయంకాలంబున
నడవికి నెఱిగలమేఁతల వెంబడి దిగంబడి రాక చిక్కిన కుఱ్ఱకోడె
పడ్డతండంబులం గానక పొదయిఱుకుల మిఱ్ఱు పల్లం బనక దూఱి
పాఱి వెదకి కానక చీరెడుగోపకుల యాహ్వానశబ్దంబు లాకర్ణించుచుఁ
[1]గోమల ఘాసఖాదన కుతూహలంబులం జిక్కి పెక్కువం గ్రేపు
లందలంచి [2]తలారింపక తమకంబులం దమతమ యంత సంభారవం
బులు సేయుచు మూత్రంబులు స్రవింపఁ బరువు లిడు ధేనువులును
ధేనువులకు నోసరించుచు సద్యోజాతంబులగు [3]తర్ణకంబుల వహించి
నవసూతికలు వెనుతగులుటవలన దామహస్తులై చను వల్లవుల
మెల్లన విలోకించుచు మంజయిరుగొంకులం గలంకరహితులై పులి
చివంగి వేఁగి లోనగు వాలుమెకంబుల మొత్తంబులవలన నప్రమత్తు
లయి కుఠారకుంతశరాసనప్రముఖాయుధంబులు ధరియించి కావలి
తిరుగు వ్రేలం గడచి నానావిధసరసతృణకబళఖాదనగరిష్ఠలై గోస్థాన
కంబులు ప్రవేశించి [4]రోమంథలీలాలసలై యున్న ధేనువులును
జన్నులు గుడిచి తల్లులప్రోలఁ బెల్లురేఁగి క్రేళ్ళుఱుకు లేఁగలును నెద
లైన మొదవులం బైగొని పరస్పరవిరుద్ధంబులై డీకొని కొమ్ముల
యుద్ధంబులుసలుపు వృషభంబులును నకుంఠితబలంబులం గంఠరజ్జు
వులం ద్రెంచుకొని పొదలుఱికి దాఁటి తల్లులందూఁటి కుడుచు
తఱపిదూడల దట్టించి పట్టనోపక గ్రద్దనఁ బెద్దలం జీరు గోప
కుమారులును గోడుకుల మగల మామల మఱందుల వంచించి
పంచాయుధ భల్లభగ్నహృదయలై గృహకృత్యంబులు మఱచి
శంకిలక సంకేతస్థలంబులఁ గృష్ణాగమతత్పరలై యున్న గోప
కామినులును గోష్ఠ ప్రదేశంబుల గోవులకుఁ గ్రేపుల విడిచి
యొడ్డుచు మరలం గట్టుచు నీకుచుం గ్రీడించు గోపకులును
[5]గోఖుర సముద్ధూతకరీషపరాగపటలంబులవలన నుల్లాసి దులదుల

---

1. గోమలఘాసఖాదన కుతూహలంబులన్ - లేఁతపచ్చిక మేయు కోరికలతో. 2. తలారింపక = మరలక. 3. తర్ణకంబులన్ = లేఁగలను. 4. రోమంథలీలాలసలు = మెల్లఁగ విలాసముగ నెమరువేయుచున్నవి. 5. గోఖురసముద్ధూత కరీషపరాగపటలంబులవలన = గోవుల డెక్కలచే నెగురగొట్టఁబడిన మొరువ్వుల ధూళిసముదాయమువలన.

నైన ధేనుదోహనవేళా వికీర్ణ పయోబిందుసందోహ పరంపరాసంపాదిత పంకంబులును దోహనసమయ గోపకరాకృష్ట గోస్తననిర్గతంబులయి కలశంబులంబడి మ్రోయు క్షీరధారలచప్పుళ్ళును మహోక్షకంఠ సమ్మర్దన స్నిగ్ధంబులైన మందిరద్వార దారుస్తంభంబుల పొంతలనుం యులికిపడి నలుదిక్కులు గనుంగొని నూతనజన విలోకనకుపితంబులై కరాళించు [1]సారమేయంబులునుం గలిగి బలకృష్ణబాహుదండ ప్రాకార రక్షావిశేషభూషంబైన ఘోషంబుఁ బ్రవేశించి యందు

క. జలజాంకుశాది రేఖలు గల హరిపాదములచొప్పుఁ ♦ గనిమోదముతోఁ
బులకించి రథము డిగి యుత్కలికన్ సంతోషబాష్ప ♦ కలితాక్షుండై.

మ. కనె నక్రూరుఁడు పద్మనేత్రులను రం♦గద్గాత్రులన్ ధేనుదో
హనవాటీగతుల న్నలంకృతుల న♦వ్యద్భాసులం బీతనీ
లనవీనోజ్జ్వలవాసులం గుసుమమా♦లాధారులన్ ధీరులన్
వనితాకాములఁ గృష్ణరాముల జగ ♦ ద్వంద్యక్రమోద్దాములన్.

క. కనివారలపాదములకు వినయంబున ప్రముక్కె భక్తి♦వివశుండగుచుం
దనువునఁ బులకాంకురములు మొనయఁగ నానందబాష్ప ♦ ములు జడిగురియన్.

వ. తదనంతరంబ.

క. అక్రూరు లైన జనుల నవక్రగతిం గాచు భక్త ♦ వత్సలు డంత
న్నక్రూరుఁ గౌఁగిలించెనుఁ జక్రాంకితహస్తతలముఁ♦జాచి నరేంద్రా.

వ. మఱియు నక్రూరుండు బలభద్రునికిం బ్రణతుండైన నతండు గౌఁగిలించి చెట్టపట్టుకొని కృష్ణసహితుండై గృహంబునకుం గొనిపోయి మేలడిగి గద్దియ యిడి పదప్రక్షాళనంబు సేసి [2]మధుపర్కంబు సమర్పించి గోవు నిచ్చి సాదరంబున సరసాన్నంబు వెట్టించి తాంబూల గంధమాల్యంబు లొసంగి, నయ్యవసరంబున నందుం డుపవిష్టుండై యక్రూరుని సత్కరించి యిట్లనియె. 1206

క. చెలియలు మొఱయిడ నల్లురఖలుఁడై పొరిగొనినయట్టి♦కంసుఁడు బ్రదుకం
గలదే మనకి దశార్హుల కిలపై మీ సేమ మింక ♦ నేమని యడుగన్.

1. సారమేయములు = కుక్కలు 2. మధుపర్కము = పెరుగుతోఁ గలిపిన తేనె (మధురపదార్థ మిచ్చుట యాచారము)

వ. అని పలికి నంత నక్రూరుం డొక పర్యంకంబున సుఖోపవిష్టుండై యుండ హరి యిట్లనియె. 1208

మ. శుభమే నీకుఁ బ్రమోదమే సఖులకుం ♦ జుట్టాలకున్ సేమమే
యభయంబే ప్రజ కెల్ల గోత్రజుల కా ♦ త్మానందమే మామ ము
క్తభయుండే వసుదేవ దేవకులు త ♦ త్కారాగృహం బందు [1]మ
త్ప్రభవవ్యాజనిబద్ధులై బ్రదికిరే ♦ ప్రాణానిలోపేతులై. 1209

మ. నెఱి నేఁ డిక్కడ నీవు రాఁగ వగతో ♦ నీతోడ నే మైన నా
కెఱుఁగం జెప్పి మటంచుఁ జెప్పరుగదా ♦ యేమందు రా వార్తయే
తెఱఁగున్ లేదని డస్సిరో వగచిరో ♦ దీనత్వముం జెందిరో
వెఱతో నా తలిదండ్రు లెట్లు వడిరో ♦ విన్పింపు మక్రూరకా. 1210

వ. మఱియు నీ వేమికారణంబున వచ్చితని హరి యడిగిన నతండు కంసునికి నారదుండు వచ్చి చెప్పిన వైరానుబంధ ప్రకారంబును గంసుండు దేవకీవసుదేవుల వధియింపం గమకించి మానిన తెఱంగును ధనుర్యాగంబు పేరు సెప్పి పుత్తెంచిన ప్రకారంబును నెఱిఁగించిన రామకృష్ణులు నగి తమ్ముం బరివేష్టించిన నందాది గోపకులం జూచి కృష్ణుం డిట్లనియె. 1211

శా. భూనాథుండు మఖంబుఁ జూడ బిలువం ♦ బుత్తెంచినాఁ డప్పిభుం
గానం బోవలెఁ బాలు నెయ్యి పెరుఁగుల్ ♦ గట్నంబులుం గానికల్
మీ నేర్పొప్పఁగఁ గూడఁబెట్టుఁడు తగన్ ♦ మీ మీ నివాసంబులన్
యానంబుల్ గొనిరండు పొండు [2]మథురా ♦ యాత్రాభిముఖ్యంబుగన్.

వ. అని నియమించె నంత నక్రూరుండు మథురకు హరిం గొనిపోయెడి నని యెఱింగి వ్రేతలు గలంగి. 1213

—♦ శ్రీకృష్ణుని మథురాయాత్ర వృత్తాంతము విని గోపికలు తల్లడిల్లుట ♦—

మ. హరినవ్వుల్ హరిమాటలున్ హరిమనో ♦ జ్ఞాలాపముల్ లీలలున్
హరి వేడ్కల్ హరిమన్ననల్ హరికరా ♦ బ్జాలంబనాహ్వానముల్

1. మత్ప్రభ...ద్ధులై = నా పుట్టుక యను మిషచే బంధింపఁబడినవారు.
2. మథురా...ఖ్యంబుగన్ = మథురకుఁ బోవు నుద్దేశ్యముతో.

హరిణీలోచన లందఱున్ మఱి యుపా ♦ యం బెట్లొకో యంచు లో
నెరియన్ ముచ్చటలాడిరంత గములై ♦ యేకాంత గేహంబులన్.

వ. మఱియుఁ దనలో నిట్లనిరి. 1215

ఉ. మేటిగృహస్థు బ్రహ్మ యని ♦ మిక్కిలి నమ్మితి మమ్మ చూడ నే
పాటియు లేదు మాకుఁ బరి ♦ పాలకుఁడైన సరోజనేత్రు ని
చ్చోట వసింపనీక యొక ♦ చోటికిఁ బోవిధియించి పిన్నబి
డ్డాటలు సేసె నీ మఱుకు ♦ లక్కట భారతి కైనఁ జెప్పరే.

వ. అని విధిం దూఱుచు మదనతాపాయత్తచిత్తలై. 1217

ఉ. రమ్మని చీరినంతన పు ♦ రంబున కేగెదుఁ గాని నన్ను నీ
కొమ్మలు నమ్మినారు మరు ♦ కోలల కగ్గము సేసి పోవఁగా
ముమ్మర మైన తాపమున ♦ మ్రొగ్గెదరో యనఁ డంబుజాక్షుఁ డా
యమ్మలు గోపవృద్ధులుఁ బ్ర ♦ యాణము వద్దనరైరి చెల్లరే. 1218

శా. అక్రూరుం డని పేరు వెట్టుకొని నేఁ ♦ డస్మన్మనోవల్లభుం
జక్రిన్ మాకడఁ బాపికొంచు నరుగం ♦ జర్చించి యే తెంచినాఁ
డక్రూరుం డట క్రూరుఁ డీతఁడు నిజం ♦ బక్రూరుఁడౌనేని ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁబెట్టి తన త్రో ♦ వం బో విచారింపఁడే.

ఉ. ఫుల్లసరోజలోచనలు ♦ పూర్ణసుధాంశుముఖుల్ పురాంగనల్
మెల్లనె యెల్లిపట్టణము ♦ మేడలనుండి [1]సువర్ణలాజముల్
సల్లఁగ వారిఁ జూచి హరి ♦ సంగతి సేయఁదలంచుఁగాక ప్రే
పల్లె వసించు ముద్దియల ♦ పైఁ బడనేల తలంచు నక్కటా. 1220

క. పురసతుల విలోకనములు సరసాలాపములు నర్మ ♦ సంభోగములున్
మఱిగిహరిమనల నొల్లఁడు నరవరులోయమ్మ [2]నూతన♦ప్రియులుగదే.

క. పుట్టెన్నఁడు హరినెఱుఁగని పట్టణసుందరుల కితని ♦ బత్తిఁ జేసి కడున్
దట్టపు విరహాగ్నులకును గట్టిఁడిదైవంబు ఘోష♦కాంతల వెదకెన్.

మ. హరి నేలా కొనిపోయె దంచు మన మా ♦ యక్రూరుఁ బ్రార్థింతమా
హరిఁ బోనీకుఁడు నిల్పరే యనుచు నేఁ ♦ డర్చింతమా వేల్పులన్

1. సువర్ణలాజముల్ = బంగారు పేలాలు 2. నూతనప్రియులు = క్రొత్తవారిపైఁ గోరిక గలవారు.

హరిపాదంబుల కడ్డముల్ వడుదమా • హా దైవమా యంచు నా
తరుణుల్ గోష్ఠులఁ జీరలుఁ మఱచి కం • దర్పజ్వరభ్రాంతలై.

మ. ఉవిదల్ సిగ్గులు మాని కన్గవల నీ • రొండొండ వర్షింపఁగా
వివశత్వంబులతోఁ గపోలతటసం • విన్యస్తహస్తాబ్జలై
[1]పవనోద్ధూతలతాభలై సుముఖ కృపం • బాటింపు గోవింద మా
ధవ దామోదర యంచు నేడ్చిరి సుజా • తం బైన గీతంబులన్.

వ. అంత మఱునాఁడు సూర్యోదయకాలంబునం గృష్ణుండు దనతోడ బయనంబునకు గమకించి నడచు గోపికలను మరలి వత్తునని దూతికా ముఖంబున నివర్తించి శకటంబులందుఁ గానికలు గోరసంబు నిడుకొని నందాదు లయిన గోపకులు వెను తగుల నక్రూరచోదితం బయిన రథం బెక్కి మథురాభిముఖుండై చను సమయంబున. 1225

చ. అదె చను చున్నవాఁడు ప్రియుఁ • డల్లదె తేరదె వైజయంత యు
ల్లదె రథఘోటకాంఘ్రిరజ • మాదెసమార్గము చూడుఁడంచు లో
నొదవెడి ముచ్చటన్ హరిర • థోన్ముఖలై గములై వ్రజాంగనల్
గదలక నిల్చి చూచిరటు • గన్నుల కబ్బినయంతదూరమున్.

వ. అంత నక్రూర రామసహితుండై చని చని. 1227

క. అవలోకించెను గృష్ణుఁడు [2]ప్రవిమలకల్లోలపవన • భాసితజన్య
[3]న్నవసన్న పాపసైన్యం గవిజనమాన్యం గళింద • కన్యన్ ధన్యన్.

వ. కని తత్కాళిందియందుఁ [4]బరిక్షుణ్ణమణిగణ సముజ్జ్వలంబు లగు జలంబులు ద్రావి తరుసమూహ సమీపంబున రామసహితుండై కృష్ణుండు రథంబు ప్రవేశించె నంత నక్రూరుండు వారలకు మ్రొక్కి వీడ్కొని కాళిందీహ్రదంబు సొచ్చి విధిపూర్వకంబుగ వేదమంత్రంబుల జపించుచు. 1229

1. పవనో... భలై = గాలికిఁ జలించు తీఁగెలతో సమానలై. 2. ప్రవిమల జన్యన్ = స్వచ్ఛమగు తరంగములమీఁది వాయువుచే సుఖము గలిగించునది. 3. అవ......సైన్యన్ = నశింపఁజేయఁబడిన పాపసమూహములుకలది. (పాపములు నశింపఁజేయునది) 4. పరిక్షు........లంబులు = మణుల రజమువలె మిక్కిలి ప్రకాశించునవి.

—♦ అక్రూరుండు యమునయందు రామకృష్ణులను దర్శించి నుతించుట ♦—

ఉ. స్నానము సేసి చేసి నది ♦ చల్లనినీటను రామకృష్ణులన్
మానుగఁ జూచి వీరు రథ ♦ మధ్యమునన్ వసియించియున్న వా
రీ నదినీరిలోపలికి ♦ నెప్పుడు వచ్చి రటంచు లేచి మే
ధానిధి సూచె వారిని ర ♦ థస్థుల [1] భ క్తమనోరథస్థులన్. 1230

వ. చూచి వెఱఁగుపడి. 1231

శా. కంటిన్ మున్న రథంబుపై జలములోఁ ♦ గంటిం దుదిం గ్రమ్మఱం
గంటిం దొంటి రథంబుమీఁద నిదె యీ ♦ కల్యాణచారిత్రు లే
నెంటం దోఁచిరి రెండుదిక్కుల మనో ♦ విభ్రాంతియో నీరిలో
నుం టాశ్చర్యము చూతునంచుమఱియు♦న్స్నాహించిమగ్నాంగుఁడై.

ఉ. పోషితబాంధవుండు యదు ♦ పుంగవుఁ డా జలమందుఁ గాంచె స
ద్భాషు సహస్రమ స్తకవి ♦ భాసితభూషుఁ నహీంద్రు భూమిభృ
ద్వేషు గృపాభిలాషుఁ [2] బ్రతి ♦ వీరచమూవిజిగీషు నిత్య సం
తోషు సరోషు నిర్దళిత ♦ దోషు ననేకవిశేషు శేషునిన్. 1233

వ. మఱియు నీలాంబరసంయుతుండును నిద్రోరగాదిసన్నుతుండును నై యొప్పు నప్పాఁపఱేనిం దప్పక కనుంగొని

సీ. ఆభోగిభోగప ♦ ర్యంక మధ్యంబున
వలనొప్పు పచ్చని ♦ వలువవాని
మేఘంబుపై నున్న ♦ మెఱుఁగుచందంబున
నురమున శ్రీదేవి ♦ యొప్పువాని
ముసరు తేటులు విన్వ ♦ ముఖచతుష్కముగల
తనయుఁ డాడెడ బొడ్డుఁ ♦ దమ్మివానిఁ
గదలిన బహుపద ♦ క్రమవిశేషంబున
రవము సూపెడి నూపు ♦ రములవాని

ఆ. జలజగర్భ రుద్ర ♦ సనక సనందన సద్ద్విజామర ప్ర ♦ శంస్యమాన
చరితుఁడైనవాని♦సౌందర్యఖనియైనవాని నొక్కపురుష♦వర్యుఁగాంచె.

1. భ క్తమ......స్థులన్ = భక్తులమనస్సులనెడి రథములం దున్నవారిని (లేక) భక్తుల కోరికలం దున్నవారిని. 2 ప్రతివీ...గీషు = శత్రుసేనల జయింపఁ గోరువారిని.

వ. మఱియును జాగ లక్షణలక్షిత నఖపాదగుల్ఫజానుజంఘోరుకటి నాభి మధ్యోదరుండును సోదరుండును శ్రీవత్సకౌస్తుభ వనమాలికా విరాజిత విశాల వక్షుండును పుండరీకాక్షుండును శంఖ చక్ర గదా పద్మ హస్తుండును సత్త్వగుణప్రశస్తుండును [1]బ్రహ్మసూత్ర [2]కటి సూత్ర హార కేయూర కటక కంకణ కుండల కిరీటాది విభూషణుండును భక్తజనపోషణుండును సుందర కపోలఫాలనాసాధరవదన కర్ణుండును, నీలనీరదవర్ణుండును [3]కంబుకంధరుండును గరుణాగుణ బంధురుండును ప్రహ్లాద నారద సునంద నంద ప్రముఖ సంభావితుండును శ్రీ పుష్టి తుష్టి కీర్తి కాంతీలోర్జా విద్యావిద్యాశక్తిమాయాది సేవితుండును నై యొప్పు నప్పరమేశ్వరునకు మ్రొక్కి భక్తిసంభ్రమంబు లగ్గంబులుగ గద్గదకంఠుండై డిగ్గనం గరంబులు ముకుళించి యిట్లని వినుతించె. 1236

దండకము. శ్రీమానినీమానచోరా శుభాకార వీరా జగద్ధేతు హేతు ప్రకారా సమస్తంబు నస్తంగతంబై [4]మహాభ్రోల్ల కల్లోల మాలాకులాభీల పాథోనిధిం గూలఁగా బాలకేళీగతిం దేలి నారాయణాఖ్యం బటుఖ్యాతి శోభిల్లు నీ నాభికంజంబులో లోకపుంజంబులం బన్ను విన్నాణియై యున్న యాబమ్మ యుత్పన్నుఁ డయ్యెంగదా పావకాకాశ వాతావనీ వార్యహంకారమాయామహామానసాదుల్ [5]హృషీకాదులుఁ లోకముల్ లోకబీజంబులున్ నిత్యసందోహమై నీమహాదేహమందుల్లసించున్ వసించున్ నశించున్ జడత్వంబు లేకాత్మవై యొప్పు నీయొప్పుటం బెల్లనోచెల్ల చెల్లన్ విచారింపఁ దారెంతవారెంత వారైన మాయాదులా మాయతోఁ గూడి క్రీడించు లోకానుసంధాత యాధాత నిర్ణేతయే నీకళారాశికిం గొంద అంభోజగర్భాను లధ్యాత్మలందుఁ, నశేషాధిభూతంబులందుఁ ననేకాధిదైవంబులందున్ సదా సాక్షివై యుండు దంచుం దదంతర్గతజ్యోతి వీశుండ వంచుం త్రయీపద్ధతిం గొందఱింద్రాది దేవాభిధానంబులం బిక్కడొక్కండ

---

1. బ్రహ్మసూత్రము = యజ్ఞోపవీతము. 2. కటిసూత్రము = మొలత్రాడు 3. కంబుకంధరుండును = శంఖముఁ బోలు కంఠము గలవాఁడు, 4. మహాభ్రో... ధోనిధిన్ = అధికముముగా నెగురుచున్న తరంగపంక్తులచే వ్యాకులమై భయముఁ గొలుపుచున్న సముద్రమందు. 5. హృషీకాదులున్ = ఇంద్రియములు మొదలైనవి.

వంచుఁ మఱిం గొందఱు బాహ్యకర్మంబులం ద్రుంచి సంసారముం ద్రెంచి సన్న్యస్తులై మించి విజ్ఞానచక్షుండ వంచుఁ మఱిం బాంచరాత్రానుసారంబుగాఁ దన్మయత్వంబుతోఁ గొందఱీ వాత్మవంచుఁ మఱిం గొందఱా [1]వాసుదేవాది భేదంబులన్ నల్వురై చెల్వు వాటింతు వంచుఁ మఱి విష్ణు నారాయణాఖ్యుండ వంచుఁ శివాఖ్యుండవంచున్ మఱిం బెక్కుమార్గంబులన్ నిన్ను నగ్గింతు రెగ్గేమి యేఱుల్ పయోరాశినే రాసులై కూడుక్రీడన్ విశేషంబు లెల్లన్ విశేషంబులై డించి నీయందు [2]సూనంబు లీనంబులౌ నేకరాకేందుబింబంబు [3]కుంభాంతరంభంబులం బింబితంబైన వేఱున్నదే యెన్నలేలా ఘటాంతర్గతాకాశముల్ తద్ఘటాంతంబులం దేకమౌ రేఖ లోకావధిన్ వీఁక నేపోకలం బోక యేకాకివై యుందు దీశా కృశానుండు నెమ్మోము భానుండు గన్నుల్ దిశల్ కర్ణముల్ భూమిపాదంబు లంభోనిధుల్ కుక్షి శల్యంబు లద్రుల్ లతా సాలముల్ రోమముల్ గాలి ప్రాణంబు బాహుల్ సురేంద్రుల్ ఘనంబుల్ కచంబుల్ నభోవీథినాభిప్రదేశంబు రేలుం బగళ్ళున్ నిమేషంబు లంభోజగర్భుండు గుహ్యంబు వర్షంబు వీర్యంబు నాకంబు మూర్ధంబుగా నేకమైయున్న నీమేనివండంబయోజాత గర్భాండముల్ మండితోదుంబరానోకహానేకశాఖాఫలాపూరితానంత జంతుప్రకాండంబు లీలం బ్రసిద్ధోదరాశిష్ఠ జంతుప్రకారంబుగా నిండి యుండున్ మహారూప నీరూపముల్ వెగ్గలం బుగ్గడింపన్ లయాంభోధిలో మీనమేనన్ విరోధిన్ నిరోధించి సాధించి మున్ వేధకున్ వేదరాశిం బ్రసాదింపవే ద్రుంపవే కైటభశ్రీ మధుం జక్రివై యొత్తవే యెత్తవే మందరాగంబు రాగంబుతోఁ గూర్మలీలాపరిష్పందివై పందివై మేదినిన్ మీఁదికిన్ ద్రోచి దోషాచరుం గొమ్ములన్ నెమ్ములం జిమ్ముచున్ గ్రువ్వవే తవ్వవే ఘోరవైరిన్ నృసింహుండవై దండి [4]వైరోచనిం జూచి యాచింపవే పెంపవే మేను బ్రహ్మాండము న్నిండఁ బొట్టుండవై రాజకోటిన్ విపాటింపవే రాజవై రాజబింబాస్యకై దుర్మదారిన్

1. వాసుదే......బులన్ = వాసుదేవుఁడు, అచ్యుతుఁడు, అనంతుఁడు, గోవిందుఁడు అనుభేదములచేత. 2. సూనంబు = నిక్కంబు. 3. కుంభాం........బులన్ = కడవలలోని నీళ్ళయందు. 4. వైరోచని = బలిచక్రవర్తి.

విదారింపవే నోంపవే క్రూరులన్ వాసుదేవాదిరూపంబులన్ శుద్ధ
బుద్ధుండవై వైరిదారాంతరంగంబుల న్నంతరంగంబులుంగాఁ గరం
గింపవే పెంపు దీపింపవే కల్కిమూర్తిం బ్రవర్తించు ని న్నెన్న నే
నెవ్వడన్ నన్ను మాయావిపన్నుం గా విపన్నుం [1]బ్రపన్నుం బ్రసన్నుం
డవై ఖిన్నతం బాపి మన్నింపవే పన్నగాధీశతల్పా [2]కృపాకల్ప
వందారుకల్పా నమస్తే నమస్తే నమస్తే నమః. 1237

మ. కలలం బోలెడి పుత్త్రమిత్త్రవనితా ♦ గారాది సంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నా ♦ సల్ సేయు చందంబునం
దలఁతుఁ గా సత్యము లంచు మూఢుఁడ వృథా ♦ తత్త్వజ్ఞుఁడం గా నాకు నీ
విలసత్పాదయుగంబు సూపి కరుణన్ ♦ వీక్షింపు లక్ష్మీపతీ. 1238

వ. అని మఱియు వినుతింప నక్రూరునికి యమునాజలంబులలోనం దన
మొదలిమేను సూపి చాలించి నటునికైవడిం [3]దిరోహితుండైన
నక్రూరుండు నీరు వెడలి వెఱఁగుపడుచు వచ్చి రథారోహణంబు
సేసిన హరి యిట్లనియె. 1245

క. జలములు చేరువ నున్నవి తలపోయఁగ నీవుపోయి ♦ తడవయ్యె నదీ
జలముల నద్భుతము ధరణిం గలుగని చోద్యములు నీకు ♦ గానంబడెనే.

వ. అనిన నతం డిట్లనియె. 1241

క. నీలోన లేనిచోద్యము లే లోకములందుఁ జెప్ప ♦ రీశ్వర నీటన్
నేలన్ నింగిని నున్నవె నీలోఁ జోద్యంబు లెల్ల ♦ నెగడు మహాత్మా.

వ. అని పలికి సాయంకాలంబునకు నక్రూరుండు మథురానగరంబు సేర
రథంబు గడపె నంత నటమున్న చని నందాదులు పురోపవనంబున
విడిసి యుండ వారలం గూడికొని కృష్ణుం డక్రూరునిం జూచి నీవు
రథంబు గొనుచు నగరంబునకుం జనుము మేము వెనుక వచ్చెద
మనిన నతం డిట్లనియె. 1243

క. నా యింటికి విచ్చేయుము [4]నీయంఘ్రిసరోజరేణు ♦ నికరము సోఁకన్
నాయిల్లు పవిత్రం బగు శ్రీయుత నీ భటునిఁ బెద్ద ♦ సేయం దగదే.

1. ప్రపన్నున్ = ఆశ్రయించిన వానిని, 2 కృపాకల్ప = దయయే భూషణముగాఁ గలవాఁడా. 3. తిరోహితుఁడు = అంతర్ధాన మొందినవాఁడు. 4. నీయంఘ్రి... నికరము = నీ పాదపద్మముల పరాగసముదాయము.

వ. అని మఱియుం బ్రార్థించిన హరి యిట్లనియె. 1245

—♦ శ్రీకృష్ణమూర్తి మథురానగరప్రవేశము సేయుట ♦—

క. యదుకులవిద్వేషణుఁడై
మదమున వర్తించు కంసు ♦ మర్దించి భవ
త్సదనంబుఁ జూడ వచ్చెదఁ
బొద మీ స్వాంతముఁ గొనుచుఁ ♦ బురమున కనఘా.

వ. అని పలికిన నక్రూరుండు పురంబునకుం జని రామకృష్ణులు వచ్చిరని కంసున కెఱింగించి తన గృహంబునకుం జనియె నంత నపరాహ్ణంబున బలభద్రగోపాల సహితుండై కృష్ణుండు.

మ. [1]పరిఖల్ గోటలు గొమ్మలుం బడగలుం ♦ బ్రాసాదముల్ వీథులున్
హరులుం దేరులు వీరులున్ గజములున్ ♦ హర్మ్యంబులున్ వాద్యముల్
తరుణుల్ ధాన్యములున్ ధనంబులు మహో♦ద్యానంబులున్ [2]దీర్ఘికల్
గర మాశ్చర్యరుచిం దనర్చు మథురం ♦ గాంచెన్ విభుం డంతటన్.

వ. కని యప్పురంబు ప్రవేశించి వచ్చు సమయంబున. 1249

ఉ. నందతపఃఫలంబు సుగు ♦ ణంబుల పుంజము గోపకామినీ
బృందము నోముపంట సిరి ♦ విందు దయాంబుధి యోగిబృందముల్
డెందములందుఁ గోరెడు క ♦ డింది నిధానము సేరవచ్చెనో
సుందరులార రండు చని ♦ చూతము కన్నుల కోర్కి దీరఁగన్.

వ. అని మఱియు గోవిందసందర్శనకుతూహలంబులఁ బౌరసుందరులు పరస్పరాహూయమానలై భుంజానలై భోజనభాజనంబులు దలంగఁ ద్రోచియు శయానలై లేచియు [3]నభ్యంజ్యమానలై జలంబులాడకయు గురుజనశిక్ష్యమాణలై యోడకయు గృహకార్యప్రవర్తమానలై పరిభ్రమింపకయు రమణరమమాణలై రమింపకయు శిశుజనబిభ్రాణలై డించియు నలంకుర్వాణలై యన్యోన్యవస్త్రాభరణ మాల్యానులేపనంబులు వీడ్వడ ధరించియు నరిగి. 1251

క. పీటఁగల చేడె లెల్లను
హాటక మణి ఘటిత తుంగ ♦ హర్మ్యాగ్రములం

1. పరిఖల్ = కందకములు, 2. దీర్ఘికల్ = దిగుడుబావులు. 3. అభ్యంజ్యమానలై = తల లంటుకొనుచున్నవారలై.

[1]గూటువలు గొనుచుఁ జూచిరి
పాటించి విశాలవక్షుఁ ♦ పద్మదలాక్షున్. 1252

సీ. వీఁ డటే రక్కసి ♦ విగతజీవఁగఁ జన్నుఁ
బాలుద్రావిన మేటి ♦ బాలకుండు
వీఁ డటే నందుని ♦ వెలఁదికి జగమెల్ల
ముఖమందుఁ జూపిన ♦ ముద్దులాఁడు
వీఁ డటే మందలో ♦ వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన ♦ [2]దాఁవరీఁడు
వీఁ డటే [3]యెలయించి ♦ వ్రేతలమానంబు
[4]సూఱలాడిన లోక ♦ సుందరుండు
తే. వీఁడు లేకున్న పుర మట ♦ వీథిలంబు
వీఁని బొందని జన్మంబు ♦ విగతఫలము
వీఁని బలుకని వచనంబు ♦ విహగరుతము
వీనిఁ జూడని చూపులు ♦ వృథలు వృథలు. 1253

మ. చెలియా గోపిక లీ కుమారతిలకుం ♦ జింతించుచుం బాడుచుం
గలయంబల్కుచు నంటుచున్ నగుచు నా♦కర్షించుచున్ [5]హస్తగా
మలకక్రీడకుఁ దెచ్చి నిచ్చలును స ♦ మ్మానంబునం బొందఁగాఁ
దొలిజన్మంబుల నేమి నోఁచిరొకదే ♦ దుర్గప్రదేశంబులన్. 1254

క. అనిమషయుఁబౌరకాంతలు మునుకొనిహరిరూపునేత్ర♦ముల వెంటనులో
గొనితాల్చిరిహృదయములనుజనితప్రమదమునవిరులు♦సల్లుచునధిపా.

వ. మఱియును. 1256

క. నానావిధగంధములుఁబ్రసూనఫలాదులనుహరిత ♦ శుభలాజములుం
గానికలిచ్చుచు విప్రులుమాన్యుఁగబూజించి రాకు♦మారోత్తములన్.

వ. ఆ సమయంబున నగరద్వారంబున నుండి వచ్చువాని నొకరజకుం
గని హరి యిట్లనియె. 1258

1. కూటువలు = గుంపులు. 2. దాఁవరీఁడు = దొంగ. 3. ఎలయించి = ఆసక్తి గొలిపి. 3. చూఱలాడిన = కొల్లగొట్టిన. 4. హస్తగా.........డమున్ = చేతిలోని యుసిరికపండునుబోలె నాడింపఁదగినస్థితికి,

—♦ శ్రీకృష్ణుండు రజకుం జంపి వాయకసుదాము లొసంగు పూజల ♦—
సంగీకరించి మేలొసంగుట.

ఉ. విందులమైనరేశ్వరుని ♦ వీటికి వచ్చితి మేము మాకు మా
మందలలోనఁ గట్టికొన ♦ మంచిపటంబులు లేవు నీ [1]ముడిన్
సుందర [2]ధౌతచేలములు ♦ శోభిలుచున్నవి తెమ్ము నిమ్ము మే
లందెదు నిమ్మ రాజుదే? ♦ నల్లుర మో రజకాన్వయాగ్రణీ.

వ. అనిన రోషించి వాఁ డిట్లనియె. 1260

శా. ఎట్రా! మనుజేంద్రుచేలములు మీ ♦ కీఁ బాడియే మీరలుం
గట్టం బోలుదురే [3]పయోఘృతదధి ♦ గ్రాసంబులన్ మత్తులై
యిట్టాడం జనఁ గాక గొల్లలకు ♦ మీ కెబ్భంగి నోరాడెడిం
గట్టా ప్రాణముఁ గోలుపోయెదు సుమీ ♦ కంసోద్ధతిన్ బాలకా.

క. మారాజు సొమ్ముఁ గైకొన నేరాజులు వెఱతు రింత ♦ యెల్లిదమే నీ
కీరాజరాజగృహమున నీ రాజస మేల గొల్ల ♦ యేగుము తలఁగన్.

వ. అనిన విని రోషించి.

క. ఘోరకరాగ్రతలంబున ధీరుఁడు కృష్ణుండు శిరము ♦ దెగిపడఁ బెట్టెం
బౌరులగుండెలు వగులఁగ వీరోద్రేకిన్ మదావి ♦ వేకిం జాకిన్. 1263

వ. ఇట్లు భగ్నుండైన రజకునిం జూచి వానివారలు పటంబులు డించి వెఱచి పఱచిన రామకృష్ణులు వలసిన వస్త్రంబులు ధరియించి కొన్ని గోపకుల కొసంగి చనుచుండ.

క. అంతట నొక [4]వాయకుఁ డా
క్రాంతిన్ వసుదేవసుతులఁ ♦ గని బహువర్ణా
త్యంతమృదుపటాభరణము
లెంతయు సంతసముతోడ ♦ నిచ్చెన్ మెచ్చన్. 1266

శా. కారుణ్యంబున వాసిఁ గైకొని యలం ♦ కారంబు గావించి శృం
గారోదంచితదిగ్గజేంద్ర [5]కలభా ♦ కారంబులం బొల్చి రా

1. ముడిన్ = మూటయందు. 2. ధౌతచేలములు = ఉదికినబట్టలు. 3. పయో... ములన్ = పాలు నేయి పెరుగు త్రాగుటచే. 4. వాయకుఁడు = బట్టలు నేయువాఁడు 5. కలభములు = గున్నయేనుఁగులు.

శూరుల్ మాధవుఁ డంత వాయకుని కున్ ♦ శ్రీమాన్ మహాకీర్తుఁడై
సారూప్యంబును లక్ష్మియు న్నొసఁగెఁ ♦ సైశ్వర్యాదిసంధాయియై.

వ. అంత నారామకృష్ణులు సుదాముం డను మాలాకారుగృహంబునకుం జనిన నతండు గని లేచి గ్రక్కున మ్రొక్కి చక్కన యర్ఘ్యపాద్యాదికంబు లాచరించి సానుచరులయినవారలకుఁ దాంబూల కుసుమ గంధంబు లొసంగి యిట్లనియె.

ఉ. పావన మయ్యె నాకులము ♦ పండెఁ దపంబు గృహంబులక్ష్మికిన్
సేవిత మయ్యె నిష్టములు ♦ సేకుఱె [1]విశ్వనిదానమూర్తులై
భూవలయంబుఁ గావ నిటు ♦ పుట్టిన మీరలు రాకఁ జేసి నే
నేవిధ మాచరింతుఁ బను♦లెయ్యవి బంట నెఱుంగఁ జెప్పరే. 1269

వ. అని పలికి. 1270

క. దామోదరరాముల కుద్దామయశో హసితతుహిన ♦ ధాములకు వధూ
కాములకుఁ దెచ్చి యిచ్చె సుదాముఁడు ఘనసురభికుసుమ♦దామములధిపా.

క. వారును మాలికుఁ డిచ్చిన భూరికుసుమదామములను♦భూషితులై నీ
కోరినవరమిచ్చెదమని కారుణ్యముసేయ నతఁడు ♦ గని యిట్లనియెన్.

క. నీ పాదకమలసేవయు నీ పాదార్చకులతోడి ♦ నెయ్యమును నితాం
తాపార భూతదయయును దాసమందార నాకు ♦ దయసేయఁగదే.

వ. అని వేఁడికొనిన నిచ్చి మఱియు మాధవుఁ డమ్మాలికునకు బలాయుః కాంతికీర్తి సంపదలొసంగి వానిగృహంబు వెడలి రాజవీథిం జని చని.

—♦ శ్రీకృష్ణుఁడు కుబ్జ ననుగ్రహించుట ♦—

క. ఆ నలినాక్షుఁడు గాంచెను నానాలేపముల [2]భాజ♦నము సేకొనుచుం
బూని చనుదెంచుదానిని [3]నానసరుచినిచయవినమి ♦ తాబ్జం గుబ్జన్.

వ. కని యిట్లనియె. 1876

క. ఎవ్వరిదానవు లేపము లెవ్వరికిం గోరికొనుచు ♦ నేఁగెదు నీ వే
రెవ్వతె మా కిమ్మిన్నియు నివ్వటిలెదు చక్కనగుచు ♦ నీరజనేత్రా.

1. విశ్వనిదానమూర్తులు = ప్రపంచమునకు మూలకారణమైనవారు. 2. భాజనము = పాత్రము. 3. ఆననరు,....,తాబ్జన్ = ముఖకాంతి పుంజముచేఁ బద్మములకు సిగ్గుఁగలిగించు దానిని,

వ. అనిన నయ్యబల యిట్లనియె. 1278

ఉ. చక్కనివాఁడ పౌరుష సర ♦ సంబుల [1]నొంపకు మెల్లవారికిం
జక్కఁదనంబు లెక్కడివి ♦ శౌరి శరీర త్రివక్ర యండ్రు నే
నిక్కము కంసుదాసిని వి ♦ నిర్మలలేపనవిద్యదాన నన్
మిక్కిలి రాజు మెచ్చుఁ బరగ ♦ మీరు విలేపనముల్ ధరింపరే. 1279

క. అని పలికి మాధవరాముల తనువులు నగవులునువీక్షి♦తమ్ములు మాటల్
దనచిత్తముఁ గరఁగించిన ననులేపనములిచ్చె వారి♦కబల ప్రియముతోన్.

సీ. ఇవ్విధంబునఁ గుబ్జ ♦ యిచ్చిన లేపంబు
లన్నయుఁ దాను దే ♦ హమున నలఁది
కొని ప్రసన్నతనొంది ♦ కుబ్జ మువ్వంకల
యొడలు చక్కఁగనొత్తి ♦ యునుపఁదలఁచి
తత్పదంబులమీఁదఁ ♦ దనపదంబులు ద్రొక్కి
హస్తాంగుళద్వయ ♦ మబలగవుద
క్రింద నిప్పుగ నిడి ♦ కృష్ణుఁడు మీఁదికి
నెత్తిన [2]వక్రత ♦ లెల్ల మాని

ఆ. చక్కనైన చిత్త ♦ జన్మబాణముక్రియ,
గొమరుమిగిలి పిఱుఁదుఁ ♦ గుచయుగంబు
సొంపు సేయఁ దరుణి ♦ సుందరమూర్తియై
కమలనయనుఁ జూచి ♦ కాంక్షతోడ. 1218

క. వేంచేయుము నాయింటికిఁ బంచశరాకార యనుచుఁ ♦ బైకొంగాక
ర్షించిహరిఁదిగిచెఁగామిని పంచాశుగబాణజాల ♦ భగ్నహృదయయై.

క. కామిని తిగిచినఁ గృష్ణుఁడు రాముని వీక్షించినగుచు ♦ [3]రాజానన మ
త్కామితముఁదీర్చి పిదపన్ నీమందిరమునకు వత్తు♦నేఁ డలుగకుమీ.

వ. అని వీడుకొలిపి కృష్ణుండు విపణిమార్గంబునం జని చని తాంబూల మాలికా గంధంబులును బహువిధంబులగు కానికలును బౌరు లిచ్చినఁ బరిగ్రహించుచు ధనుశ్శాల కరిగి యందు.

1. నొంపకు = బాధింపకుము, 2. వక్రతలు = వంకరలు. 3. రాజ + ఆనన = చంద్రముఖీ.

—♦ శ్రీకృష్ణుండు విల్లు వంచుట ♦—

క. సురరాజువింటికైవడి గురుతరమై భూరివీర ♦ గుప్తం బయి దు
స్తరమైనవిల్లు పొడఁగని నరులు వలదనంగ బిట్టు ♦ నగి వికసితుఁడై.

శా. బంధుల్ మెలన వామహస్తమునఁ జా ♦ పం బెత్తి మౌర్వీలతా
సంధానం బొనరించి కొంచెపుఁ దెగన్ ♦ శబ్దించుచున్ [1]ధీరతా
సింధుం డా హరి దాని ఖండితముగాఁ ♦ జేసెన్ జనుల్ చూడఁగా
[2]గంధేభంబు రసాలదండము గొనిన్ ♦ ఖండించు చందంబునన్.

క. కోదండభంగనిర్గత నాదము వీనులకు భీష ♦ ణం బయి [3]యాశా
రోదోంతరములు నిండుచు భేదించెన్ భోజవిభుని ♦ బింకము నధిపా.

వ. అప్పుడు.

ఉ. అద్దిర రాచవిల్ విఱిచె ♦ నర్భకుఁ డెంతయు శంక లేక నే
డుద్దవిడిన్ సహింపఁ దగ ♦ దుగ్రతఁ బట్టుద మంచుఁ గ్రుద్ధులై
గ్రద్దన లేచి తద్ధనువు ♦ కావలివా రరుదేర వారి న
య్యుద్దఱుఁగూడి పట్టి మడి ♦ యించిరి కార్ముకఖండహస్తులై. 1289

వ. ఇట్లు రామకృష్ణులు మధురాపురంబున విహరించి వెడలి విడిదలకుం
జని రంత

—♦ సూర్యాస్తమయ చంద్రోదయముల వర్ణనము ♦—

మ. [4]గగనారణ్యచరాంధకార గజముం ♦ [5]గాలాహ్వయవ్యాధుఁ డ
చ్చుగఁ బట్టం గమకించి మచ్చికుటకై ♦ చూతాంకురశ్రేణిచే
నొగిఁ గల్పించిన కందుకం బనఁగ సూ ♦ ర్యుం డంత వీక్షింపఁగాఁ
దగె మందప్రభతోడఁ బశ్చిమ మహా ♦ ధాత్రీధరేంద్రంబునన్.

క. తరుణుండగు శీతలకరు మఱిగి వియల్లక్ష్మి దన్ను ♦ మానిముదుకఁడున్
ఖరకరుఁడు న్ననిద్రొబ్బినకరణిన్ రవిపశ్చిమాద్రి ♦ కడఁ గ్రుంకెన్ నృపా.

---

1. ధీరతాసింధుండు = ధైర్యసముద్రుఁడు. 2. గంధ + ఇభము = మదపుటేనుఁగు
3. ఆశారోదోంతరములు = దిక్కుల యొక్కయు, భూమ్యాకాశముల యొక్కయు మధ్యప్రదేశము. 4. గగనా......గజమున్ = ఆకస మను నటవిం దిరుగాడు చీఁకటి యను నేనుఁగును. 5 కాలా......ధుఁడు = కాల మను పేరి బోయవాఁడు.

ఆ. కళలు గలుగుఁగాక ♦ కమలతోడగుఁగాక
శివునిమౌళిమీఁదఁ ♦ జేరుఁ గాక
నన్యు నొల్లఁ దపనుఁ ♦ డైన మత్పతి యని
సాధ్వీభంగి గమల ♦ జాతి మొగిడె.

క. సుందర [1]సాయంసంధ్యా
వందనవిప్రార్ఘ్యతోయ ♦ వజ్రహతోద్య
న్మందేహాసురరక్త
స్యందముక్రియఁ గెంపు సొంపె ♦ సఁగె నపరదిశన్. 1294

ఆ. భూమి నిండె మింటఁ ♦ బూర్ణమై కర్కట
మకరమీనరాశి ♦ మహితమైన
హరియశస్సుధాబ్ధి ♦ యందుల తుంబురు
లనఁగఁ జుక్క లొప్పె ♦ నాకసమున.

క. ఎల్లదిశలు నిండిన శ్రీవల్లభుగుణమణుల బ్రహ్మ ♦ వాసించుటకై
చల్లిన మృగమద మనఁగా వెల్లివిరిసెఁ దమము గగన♦వీథుల నెల్లన్.

క. ఆచీఁకటి వెనుతగిలినఁ బ్రాచీదిశనుండి గంతుఁ ♦ బరువున రవి భ
ర్మాచలము [2]మలఁకత్రోవను వేచని యెంగాక నిలిచి ♦ [3]విఱుఁగకయున్నే.

ఉ. మీకును వైరి యెప్పుడును ♦ మిక్కిలి మాకును వైరి రాజు దో
షాకరుఁ డింక వచ్చు ♦ జలజాతములార మదీయ బాలురం
జేకొను డంచు బాలకులఁ ♦ జీఁకటి దాఁచిన భంగిఁ జిక్కె రా
రాక వసించెఁ దుమ్మెదలు ♦ రాత్రి సరోరుహకుట్మలంబులన్.

సీ. ప్రాచీదిశాంగనా ♦ ఫాలతలంబున
దీపించు సింధూర ♦ తిలక మనఁగ
దర్పించి విరహుల ♦ ధైర్యవల్లులు ద్రెంప
దర్పకుం డెత్తిన ♦ [4]దాత్ర మనఁగ

1. సాయంసంధ్యా.........స్యందముక్రియన్ = సాయంసమయమున ద్విజు లొసంగెడు నర్ఘ్యప్రదానోదకమను వజ్రముచేఁ గొట్టఁబడుటచే స్రవించు మందేహరాక్షసుని రక్తస్రావమువలె. 2. మలకత్రోవ = వంకరదారి, 3. విఱుఁగక = అపజయము నొందక (ఓడక), 4. దాత్రము = కొడవలి.

నలిగి కాలకిరాతుఁ ♦ డంధకారమృగంబు
ఖండింప మెఱయించు ♦ ఖడ్గ మనఁగఁ
గగన తమాలవృ ♦ క్షము తూర్పుకొమ్మను
లలితమై మెఱయు ప ♦ ల్లవ మనంగఁ

ఆ. దొగలు సంతసిల్ల ♦ దొంగలు భీతిల్లఁ
గడలి మిన్నుముట్టి ♦ కడలుకొనఁగఁ
బొడిచె శీతకరుఁడు ♦ భూరిచకోరక
ప్రీతికరుఁడు జార ♦ భీతికరుఁడు. 1299

క. [1]దర్పితతారాధిప పరిసర్పితకిరణౌఘమిళిత ♦ సకలదిశం బై
యేర్పడి కమలభవాండము కర్పూరపుఁ గ్రోవి భంగి ♦ గనుపట్టె నృపా.

క. ఆ రేయి గోపయుతులై క్షీరాన్నము గుడిచి రామ ♦ కృష్ణులు మదిఁ గం
సారంభ మెఱిఁగి యిష్టవిహారంబుల నప్రమత్తు ♦ లై యుండి రటన్.

క. తనపురికి రామకృష్ణులు చనుదెంచి నిజానుచరులఁ ♦ జంపుటయు మహా
ధనువుఁ గదిసి విఱుచుటయును విని కంసుఁడు నిద్రలేక ♦ విహ్వల మతియై.

సీ. కర్ణరంధ్రములు చేఁ ♦ గప్పిన ఘోషలి
ప్రాణఘోషము వినఁ ♦ బడక డిందెఁ
దోయాదికములందుఁ ♦ దొంగిచూచుచు నుండఁ
దల గానరాదయ్యెఁ ♦ దనువు మీఁదఁ
గరశాఖ నాసికా ♦ గ్రంబుపై నిడి చూడ
గ్రహతారకలు రెండు ♦ గా నగపడె
వెలుఁగున నిలుచుండి ♦ వీక్షింపఁగా మేని
నీడ సరంధ్రమై ♦ నేలఁ దోఁచె

ఆ. నడుగుజాడ దృష్ట ♦ మాట లేదయ్యెను
దరువు లెల్ల హేమ ♦ తరువు లగుచు
మెఱయు చుండెఁ గాల ♦ మృత్యువు డగ్గఱ
బుద్ధి వెల్లఁ గలఁగె ♦ భోజపతికి. 1303

1. దర్పితతా......శంబై = బలిసిన చంద్రకిరణ సమూహాయముతోఁ గూడిన సమస్త దిక్కులు కలది,

క. గరళము( దినుటయు( బ్రేతము( [1]బరిరంభించుటయు [2]నగ్న♦భావు(
డవుటయుఁ శిరమున( దైలము వడుటయు ఖరపతి నెక్కుటయు
నతఁడు ♦ కలలోఁ గనియెఁ. 1304

వ. మఱియు రక్తకుసుమమాలికాధరుండై యొక్కండ నెక్కడేనియుం జనుచున్నవాఁడ నని కలఁగాంచి మరణహేతుకభ్రాంతిం జింతాక్రాంతుండై నిద్రఁజెందక వేగించుచున్న సమయంబున. 1305

—♦ సూర్యోదయవర్ణనము ♦—

క. అరుణహరినఖరవిదళిత గురుతిమిరేభేంద్రకుంభ ♦ కూటవినిర్ము
క్తరుధిరమౌక్తికములక్రియసురపతిదిశఁగెంపుతోఁడ(♦జుక్కలు మెఱసెన్.

సీ. పౌలోమి దనబాలు ♦ పాన్పుపైఁ గనుపట్టఁ
బన్నిన పవడంపు ♦ బంతి యనఁగ
నాయురర్థము లవ్య ♦ యంబు లొత్తిలి చాటు
కాల[2]జాంఘికు చేతి ♦ ఘంట యనఁగఁ
ఘనజంతుజీవిత ♦ కాలరాసుల విధి
కొలువ నెత్తిన హేమ ♦ కుంభ మనఁగఁ
బశ్చిమదిక్కాంత ♦ పరఁగఁ గై సేయుచో
ముందుట నిడుకొన్న ♦ ముకుర మనఁగఁ
తే. గోపతాపోపశమ దివ్య ♦ ఘుటిక యనఁగఁ
బద్మినీకాంత నోముల ♦ ఫల మనంగఁ
మూఁడుమూర్తుల సారంపు ♦ ముద్ద యనఁగఁ
[4]మిహిరమండల ముదయాద్రి ♦ మీఁద నొప్పె. 1307

క. వచ్చెం జల్లనిగాడ్పులు విచ్చెంగమలములు దమము [2]విరసిబిలంబుల్
చొచ్చెంబక్షిమరందము మెచ్చెందుమ్మెదలుగ్రోలి♦మిహిరుఁడు వొడమన్.

క. [5]సంకాశితోదయాచల పంకజనఖకిరణరాగ ♦ పరిపూర్ణంబై
పంకేరుహగర్భాండము కుంకమపలిలంపుఁ [6]గ్రోవి♦కొమరున మెఱసెన్.

---

1. పరిరంభించుట = కౌఁగిలించుట. 2. నగ్నభావుఁడు = దిగంబరుఁడు. 3. జాంఘికుఁడు = చాటింపు వేయువాఁడు. 4. మిహిరమండలము = సూర్యమండలము. 5. సంకాశితోద...ర్ణంబై = ప్రకాశించు నుదయగిరిమీఁది సూర్యునికిరణముల రక్తిమతో బాగుగ నిండినది 6 క్రోవి = గొట్టము.

వ. తదనంతరంబ. 1310

సీ. పాషాణవల్మీక ♦ పంకాదిరహితంబు
మృదులకాంచననిభ ♦ మృణ్మయంబు
గమనీయకస్తూరి ♦ కాజలసిక్తంబు
బద్ధచందనదారు ♦ పరివృతంబు
మహనీయ కుసుమదా ♦ మధ్వజతోరణ
మండితోన్నతమంచ ♦ మధ్యమంబు
బ్రాహ్మణక్షత్త్రాది ♦ పౌరకోలాహలం
బశ్రాంతతూర్యత్ర ♦ యాంచితంబు

ఆ. నిర్మలంబు సమము ♦ నిష్కంటకంబునై
పుణ్యపురుషు మనముఁ ♦ బోలి కంస
సైన్యతుంగ మగుచు ♦ సంతుష్టలోకాంత
రంగ మైన మల్ల ♦ రంగ మొప్పె. 1311

క. ఆ మల్లరంగ పరిసర భూమిస్థితమంచమందు ♦ భోజేంద్రుఁడు మా
న్యామాత్యసంయుతుండై భూమీశులుగొలువనుండెఁ ♦బొంక్కుచునధిపా.

మ. సకలాంభోనిధిమేఖలానహనముం ♦ జాలించి యేతెంచు నా
గకులాగంబులభంగి నొప్పుచుఁ దగం ♦ గై సేసి చాణూర ము
ష్టికకూటుల్ శలతోసలుల్ గురువులన్ ♦ సేవించుచున్ రంగ ధా
త్రిక నేతెంచిరి తూర్యఘోషముల న ♦ ద్రేకం బనేకంబుగన్.

క. నందాదులైన గోపకు లందఱుఁజని కానుకలు స ♦ మర్పించి నృపుఁ
సందర్శించి తదనుమతిఁ జెంది మహామంచముల వ♦సించిరి వరుసన్.

వ. అంత రామకృష్ణులు నలంకృతులై మల్లదుందుభి నినదంబు విని
సందర్శనకుతూహలంబున. 1315

క. ఓడక రంగద్వారము జాడంజని వారు గనిరి ♦ సమదకువలయా
పీడంబున్ [1]భిన్నపరాక్రీడంబున్ బ్రమదకంట ♦ కితచూడంబున్.

వ కని తత్కరిపాలకశ్రేష్ఠుండైన యంబష్ఠునికి మేఘనాథు గంభీరభాష
ణంబుల రఘుభీషణుం డగు హరి యిట్లనియె.

---

1. భిన్నపరాక్రీడంబున్ = పాడుచేయఁబడిన శత్రువుల యుద్యానములుకలది.

—◆ శ్రీకృష్ణుండు కువలయాపీడ మను గజంబును వధించుట ◆—

శా. ఓరీ కుంజరపాల మా దెసకు నీ ♦ యుద్యన్మదేభేంద్రముం
బ్రేరేపం బనిలేదు త్రిప్పు మరలం ♦ బ్రేరేచినన్ నిన్నుఁ గం
భీరోగ్రాశనితుల్య ముష్టిహతులన్ ♦ భేదించి నేఁ డంతకుం
జేరం బుత్తు మహోత్తరద్విపముతో ♦ సిద్ధంబు యుద్ధంబునన్.

వ. అని పలికి.

ఉ. మించుగఁ గొప్పుఁ జక్కనిడి ♦ మెల్లన పచ్చనిచీరఁ గాసె బం
ధించి లలాటకుంతలత ♦ తిన్ మరలించుచు సంగరక్రియా
[1]చుంచుతఁ బేర్చి బాలకుఁడు ♦ చూచుజనంబులు దన్ను బాపురే
యంచు నుతింప డగ్గఱియె ♦ హస్తిజితాగము గంధనాగమున్.

క. [3]అంజక బాలకుఁ డనియును గొంజక దయమాలి రాజ♦కుంజరయంతం
గుంజరమును డీకొలిపెను గుంజరపాలకుఁడు గోప ♦ కుంజరుమీఁదన్.

వ. మఱియు నయ్యనేకపం బనేకపపాలకప్రేరితం బయి మహావాత సంఘాతసముద్ధూతం బగు విలయకాలకీలికేళిని బిట్టు మిట్టిపడి మృత్యుదేవత యొత్తునం గాలుపోలిక శమనుని గమనిక నెదిరి మద సలిలపరిమళ లుబ్ధపరిభ్రమద్భ్రమరగాయక ఝుంకృతు లహంకృతి సంపాదింపం గులకుంభినీధరగుహాకుంభగుంభనంబుగా ఘీంకరించి రోషభీషణ శేషభోగిభోగభయంకరం బగు కరంబున శౌరిం జీరి చీరికిం గొనక పట్టిన నట్టిట్టుగెంటి [2]విధుంతుదవదన గహ్వరంబువలన విడివడియుఱుకుఁ దరణికరణిదర్పించి పాదమధ్యంబునకు నసాధ్యుండై దూఁటివాఁడి మాటువడినం గ్రోధబంధురం బై సింధురంబు. మహార్ణవమధ్య మంథాయమాన మంథగమహీధరంబు కైవడి జిఱజిఱం దిరిగి కానక భయానకంబై గాలివెరపునం గని పొంగి చెంగటం బ్రళయదండిదండ ప్రశస్తంబగు హస్తంబువంచి వంచించి చుట్టిపట్టి పడవేయ గమకించినం జలింపక తెంపున హరి కరిపిఱింది కుఱికి మహారాహువాలవల్లికాకర్షణోద్దీర్ణుండగు సుపర్ణుతెఱంగున నెగిరి

1. చుంచుతన్ = సామర్థ్యముతో. 2. అంజక = బెదరక 3. విధుంతుదుఁడు = రాహువు

శుండాదండంబు వాలంబు లీలం గేలం బొడిచి పట్టి జళిపించి పంచవింశతి బాణాసన ప్రమాణదూరంబు బీరంబునం ద్రిప్పి నైవ నవ్వారణంబు దుర్నివారణం బై రణంబున కోహటించక సవ్యాపసవ్యపరిక్రమణంబుల నవక్రంబై కవిసిన నపసవ్య క్రమంబులం దప్పించి రొప్పి కుప్పించి యెదుర్కొనినఁ గర్కశుం డయి మేచకాచల తుంగశృంగ నిభం బగు కుంభికుంభంబు చక్కటి వ్రక్కలై చెక్కలెగయ దురంతకల్పాంతజీమూతప్రభూతనిర్ఘాతనిష్ఠురం బగు ముష్టి సారించి యార్చి పొడిచినం దద్విదీర్ణ పూర్ణ రక్తసిక్త ముక్తాకంబులు వసుంధరకు సంధ్యారాగరక్త తారకాచ్ఛన్నం బగు మిన్ను చెన్నలవరింప మ్రొగ్గి పెల్లార్చి మ్రగ్గక దిగ్గన నగ్గజంబు లేచి చూచి త్రోచి నడచి సంహారసమయ సముద్ర సంఘాతసంభూత సముత్తుంగభంగ సంఘటితం బగు కులాచలంబు క్రియం గ్రమ్మఱ నమ్మహాభుజుని భుజా దండంబువలన ఘట్టితంబై కట్టలుక ముట్టి నెట్టుకొన ముమ్మరంబుగం గొమ్ములం జిమ్మినన మ్మేటి చేసూటి మెఱసి హస్తాహస్తి సంగరంబునఁ గరంబొప్పి దప్పిం బడక నొప్పించిన నకుంఠిత కాలకంఠకఠోర భల్లభగ్నం బగు పురంబుపగిది జలధిజటులఝుంఝూనిలవికలం బగు కలంబుకై వడి నమ్మదకరింభంబు బలంబు దక్కి చిక్కి స్రుక్కువడి లోభికరంబునుం బోలె [1]దానగళిత ధారావిరహితంబై విరహితలంపునుంబోలె నిరంతర చిత్తజాత నిగ్రహంబై గ్రహణకాలంబునుం బోలెఁ [2]బరాధీనఖరకరంబై శిశిరకరోదయంబునుంబోలె [3]భిన్న పుష్కరంబై పుష్కరవైరి విలసనంబునుంబోలె [4]నభాసితపద్మకంబై యున్న సమయంబున,

శా. కాలంద్రొక్కి సలీలుఁడై నగవుతోఁ ♦ గంఠీరవేంద్రాకృతిం
గేలన్ భీషణదంతముల్ నెఱికి సం ♦ క్షీణంబుగా మొత్తి గో

---

1. దాన....తంబు = (లోభికరము) దానజల ధారలు లేనిది. (ఏనుఁగు పక్షమున) మదజలధారలులేనిది. 2. పరా...రంబు = (గ్రహణకాలము) పరాధీనుఁడగు సూర్యుఁడు కలది. (ఏనుఁగుపక్షమున) స్వాధీనముతప్పిన తుండము కలది. 3. భిన్నపుష్కరంబు = (సూర్యోదయకాలము) వికసించినతామరలు కలది. (ఏనుఁగు) తెగినతుండాగ్రము గలది. 4. ఆభాసిత పద్మకంబు = (పుష్కరవైరియగు చంద్రునికాంతి) వికసింపని పద్మములుకలది: (ఏనుఁగు) ప్రకాశింపని మొగముమీఁది బొట్టుకలది.

పాలగ్రామణి వీరవరాళిమణియై ♦ ప్రాణంబులం బాపె నా
శైలేంద్రాభముఁ [1]ప్రాణలోభము నుదం ♦ చత్సారగంధేభమున్.

వ. మఱియు దంతిదంతతాడనంబుల దంతావళిపాలకుల హరించి తత్ప్రదేశంబు వాసి.

మ. కరిదంతంబులు మూఁపులందు మెఱయన్ ♦ ఘర్మాంబువుల్ మోములన్
నెఱయన్ గోపకు లంతనంత మలయన్ ♦ నిత్యాహవస్థేము లా
హంకారాముల్ చనుదెంచి కాంచిరి మహో ♦ గ్రాడంబరాపూరితా
మరమర్త్యాదిజనాంతరంగము లస ♦ న్మల్లావనీరంగమున్.

సీ. మహితరౌద్రంబున ♦ మల్లుర కశనియై
నరుల కద్భుతముగ ♦ నాథుఁ డగుచు
శృంగారమునఁ బుర ♦ స్త్రీలకుఁ గాముఁడై
నిజమృత్యు వై కంసు ♦ నికి భయముగ
మూఢులు బీభత్స ♦ మునుఁబొంద వికటుఁడై
తండ్రికి దయరాఁగ ♦ దనయుఁ డగుచు
ఖలులకు విరసంబు ♦ గా దండియై గోప
కులకు హాస్యంబుగాఁ ♦ గులజుఁ డగుచు

ఆ. బాంధవులకుఁ బ్రేమ ♦ భాసిల్ల వేలుపై
శాంత మొనర యోగి ♦ జనుల కెల్లఁ
బరమతత్త్వ మగుచు ♦ భాసిల్లె బలునితో
మాధవుండు రంగ ♦ మధ్యమందు.

వ. అప్పుడు.

క. చచ్చినకుంభీంద్రంబును వచ్చిన బలమాధవులను ♦ వరుసం గని తా
నొచ్చినచిత్తముతోడుతఁ జెచ్చెరఁ గడు నెఱచెభోజ♦సింహుం డధిపా.

ఉ. ధీరుల వస్త్రమాల్యమణి ♦ దీపవిభూషణధారులన్ నటా
కారుల సర్వలోకశుభ ♦ కారుల మానవమానినీమనో
హారుల రంగభూతలవి ♦ హారుల గోపకుమారులన్ మహా
వీరులఁ జూచి చూచి తని ♦ విన్ దుదిముట్టక లోకు లందఱున్.

1. ప్రాణలోభము = ప్రాణములపై నాసకలది.

ఉ. సన్నుతరామకృష్ణముఖ ♦ చంద్రమయూఖ సుధారసంబులం
గన్నులఁ ద్రావుచుండమనఁ ♦ గాంచుచు జిహ్వల నంటిచూచు లీ
ల న్నుతి సేయుచుం గరము ♦ లం బరిరంభము సేయుభంగి న
త్యున్నతిఁ జూపుచుం దగిలి ♦ యొండొరుతోడ రహస్యభాషలన్.

క. వసుదేవు నివాసంబున వసుధన్ రక్షింప వీరు ♦ [1]వైష్ణవతేజో
ల్లసనములఁ బుట్టినారఁట పసిబిడ్డలు గాఁ జనదు ♦ [2]పరదేవతలన్.

సీ. చంపె రక్కసిఁ బట్టి ♦ చక్రవాకునిఁ గూల్చెఁ
బడఁ ద్రొబ్బె మద్దుల ♦ బకునిఁ జీరె
నఘదైత్యుఁ బొరిగొనె ♦ నడఁచె వత్సునిఁ ద్రుంచె
గిరి యెత్తె దేవేంద్రుఁ ♦ గ్రిందుపఱచెఁ
గాళియు మర్దించె ♦ గహనానలము ద్రావెఁ
గేశి నంతకుపురిఁ ♦ గ్రేవ ననిచె
మయపుత్త్రుఁ బరిమార్చె ♦ మఱియును దానవ
భటుల హరించి గో ♦ పకులఁ గాచె

తే. గోపకాంతల మనములఁ ♦ గోర్కెఁ దీర్చె
నీ సరోరుహలోచనుం ♦ డీ శుభాంగుఁ
డీ మహామహుఁ డీ దిగ్ ♦ జేంద్రనిభుఁడు
మనుజమాత్రుఁడె తలపోయ ♦ మాధవుండు. 1332

—♦ శ్రీకృష్ణబలరాములు చాణూరముష్టికులను వధించుట ♦—

వ. అని పలుకుచుఁ బౌరజనులు సూచుచుండ రామకృష్ణులకుఁ జాణూరుం డిట్లనియె. 1333

మ. వనమార్గంబున గోపబాలకులతో ♦ వత్సంబులన్ మేపుచుం
బెనఁగన్ మిక్కిలి నేర్చినా రనుచు నీ ♦ పృథ్వీజనుల్ సెప్ప మా
మనుజేంద్రుం డిట మిమ్ముఁ జీరఁ బనిచెన్ ♦ మల్లాహవక్రీడకుం
జన దే కొంత పరాక్రమింప మనసున్ ♦ సభ్యుల్ విలోకింపఁగన్. 1334

1. వైష్ణవ.....నములన్ = విష్ణుతేజో విశేషములచే. 2. పరదేవతలన్ = లోకాతీతులగు దేవతలను.

మ. జవసత్త్వంబులు మేటి సాముఁగలదే ♦ [1]సత్రాణమే మేను భూ
ప్రవరుం బోరఁగ నిమ్మహాంగవలెనే ♦ [2]పాళ్లే లభేద్యంబులే
[3]పవి వో కాక కృతాంతదండకము వో ♦ ఫాలాక్షునేత్రాగ్ని వో
నవనీతంబుల ముద్ద గాదు మెసఁగన్ ♦ నాముష్టి గోపార్భకా. 1335

క. జనములు నేర్చినవిద్యలు
జననాథునికొఱకుఁ గాదె ♦ జననాథుఁడు నీ
జనములు మెచ్చఁగ యుద్ధం
బున మనముం గాంత ప్రౌఢ ♦ ప్రవృత్తమె కృష్ణా. 1336

వ. అనిన విని హరి యిట్లనియె. 1337

ఉ. సాములు లేవు పిన్నలము ♦ సత్త్వము గల్గిన రాము మల్లసం
గ్రామవిశారదుల్ [4]కులిశ ♦ కర్కశదేహులు మీరు మీకడ
న్నేమము చరించు టెట్లు ధర ♦ నేపతి వేడ్కలు సేయువారముం
గాము వినోదముల్ సలుపఁ ♦ గా దన వచ్చునె యొక్కమాటికిన్.

క. నీతోడుత నేఁ బెనఁగెదఁ
బ్రీతిన్ ముష్టికునితోడఁ ♦ బెనఁగెడి బలుఁ [5]డు
గ్రాతతమల్లాహవమున
భూతలనాథునికి మెచ్చుఁ ♦ బుట్టింతు సభన్. 1339

వ. అనిన విని రోషించి చాణూరుం డిట్లనియె. 1340

శా. నాతోఁ బోరఁగ నెంతవాఁడ విసిరో ♦ నాపాటియే నీవు వి
ఖ్యాతుండం గులజుండ సద్గుణుఁడ స ♦ త్కర్మస్వభావుండ నీ
[6]కేతాదృగ్విభవంబు లెల్లఁ గలవే ♦ యీఁపీటఁ బోరాడుటల్
ప్రేతల్ చూడఁగఁ గుప్పిగంతు లిడుటే ♦ వీక్షింపు గోపార్భకా.

శా. స్థాణున్ మెచ్చఁడు బ్రహ్మఁ గైకొనఁడు వి ♦ ష్వక్సేనునప్పున్ జగ
త్ప్రాణున్ రమ్మనఁ డీడు గాఁ డని మహా ♦ బాహాబలప్రౌఢి న

1. సత్రాణము = బలముఁగలది. 2. పాళ్లు = జాదములు. 3. పవి = వజ్రాయుధము. 4. కులిశకర్కశదేహులు = వజ్రమువలె కఠినములగు శరీరములు కలవారు 5. ఉగ్రాతత.....వమునన్ = భయంకరమై పెరిఁగిన మల్లయుద్ధమునందు. 6. ఏతాదృగ్విభవంబులు = ఇట్టి సంపదలు.

క్షీణుం డాజికి నెల్లి నేఁ డనఁడు వై ♦ చిత్రిన్ వినోదించు న
చ్చాణూరుం డొక గోపబాలుపనికిన్ ♦ శక్తుండు గాకుండునే.

క. ప్రల్లద మేటికి గోపక బల్లిదుఁ డను లోకమందుఁ ♦ బ్రఖ్యాతుఁడ నా
[1]చల్లడముక్రిందఁ దూఱని మల్లుఁడు లే రెందు ధరణి♦మండలమందున్

సీ. [2]చలమున నను డాసి ♦ జలరాశిఁ జొరరాదు
నిగిడి గోత్రము డంప ♦ నిలువరాదు
కేడించి కుంభిని ♦ క్రిందికిఁ బోరాదు
మనుజసింహుఁడ నని ♦ మలయరాదు
చేరిన బడవైతుఁ ♦ జెయిసాఁపఁగా రాదు
బెరసి నా ముందటఁ ♦ బెరుఁగ రాదు
భూనాథహింసకుఁ ♦ బోరాదు నను మీఱి
శోధింతుఁ గానలఁ ♦ జొరఁగ రాదు

ఆ. ప్రబలమూర్తి ననుచు ♦ భాసిల్లఁగా రాదు
ధరఁ బ్రబుద్ధుఁడ నని ♦ తఱుమ రాదు
కల్కితనము చూపి ♦ గర్వింపఁగా రాదు
తరము గాదు కృష్ణ ♦ తలఁగు తలఁగు. 1344

వ. అది గాక నీవు శ్రీహరి నంటివి. 1345

సీ. మహిమతో నుండంగ ♦ మధురాపురము గాని
పొలుపారు వైకుంఠ ♦ పురము గాదు
గర్వంబుతో నుండఁ ♦ గంసునిసభ గాని
సంసారరహితుల ♦ సభయుఁ గాదు
ప్రకటించి వినఁగ నా ♦ బాహునాదము గాని
నారదువీణాస్వ ♦ నంబు గాదు
[3]చదురు లాడఁగ మల్ల ♦ జన [4]విగ్రహముగాని
రమతోడి ప్రణయవి ♦ గ్రహముగాదు

తే. వెలసి తిరుగంగ వేదాంత ♦ వీథి గాదు
మొఱఁగి పో మునిమనముల ♦ మూల గాదు

1. చల్లడము = తొడలాగు. 2. ఈ పద్యమున వరుసగా దశావతారములను సంధించుకొనవలెను. 3 చదురులు = నేర్పులు. 4. విగ్రహము = యుద్ధము.

సాఁగి నడవంగ భర్తల ♦ జూడ గాదు
శౌరి నామ్రోల నీ వెందుఁ ♦ జనియె దింక. 1346

వ. అని పలికి.

సీ. రోషాగ్నిధూమ్రప్ర ♦ రోహంబుకైవడి
శిరమున సన్నపు ♦ సిక వెలుంగ
[1]నాశామదేభేంద్ర ♦ హస్తసన్నిభములై
బాహుదండంబులు ♦ భయదములుగ
[2]లయసమయాంతకో ♦ ల్లసితదంష్ట్రలభంగిఁ
జాఁగిన కోఱమీఁ ♦ సములు మెఱయ
నల్లని తెగఁ గల ♦ నడగొండచాడ్పున
నాభీలలీలదే ♦ హంబు మెఱయఁ

ఆ. జరణహతుల ధరణి ♦ సంచలింపఁగ నభో
మండలంబు నిండ ♦ మల్ల సరచి
శౌరిదెసకు నడచెఁ ♦ జాణూరమల్లుఁడు
పౌరలోకహృదయ ♦ భల్లుఁ డగుచు. 1348

వ. ఇట్లగ్గలం బగు నగ్గలిక డగ్గఱిన మల్లునిం గని మెల్లన మొల్లంబగు బీరంబు వెల్లిగొన వల్లవవల్లభుండుల్లసిల్లి బాహునాదంబున రోదోంతరాళంబు పూరించి మించి కవిసి యిట్లిద్దఱు నుద్దవిడి నున్నత విషమంబు లగు తాణలిడి కరి కరియును హరి హరియును గిరి గిరియునుం దాఁకు వీఁకం దలఁపడి ఇతరేతర హేతి హింసితంబు లగు దవానలంబుల తెఱంగునఁ బరస్పర దీర్ఘ నిర్ఘాతఘట్టితంబులగుమహాభ్రంబుల విభ్రమంబున నన్యోన్య తురంగతరంగ తాడితంబు లగు కల్పాంతకాలసముద్రంబుల రౌద్రంబున నొండొరుల ముష్టిఘట్టనంబుల ఘట్టితశరీరులై దద్దరిలక డగ్గఱి గ్రద్దన నయ్యిద్దఱుం దిరుగునెడ హరి సాచ్చి పేచ్చి యార్చి జెట్టిం బట్టి పడఁదిగిచి పాదంబుల జాడించి సముల్లాసంబున [3]నెసకంబునకు వచ్చిన మెచ్చి నొచ్చి

1. ఆశామదే........సన్నిభములు = దిగ్గజముల తుండములతో సమానములు.
2. లయసమ........దంష్ట్రలు = ప్రళయకాలపు యముని వాఁడి కోఱలు, 3. ఎసకంబు= అతిశయము, (మీఁదికి వచ్చుట)

యచ్చపలుండు మీఱి మోర సారించి తెరలక పొరలం ద్రొబ్బిన
నబ్బలానుజుం డుబ్బి గొబ్బున మేను వర్ధిల్ల నర్ధాంగకంబుననుండి
జానువుల నొత్తుచు నురవడిం [1]కరవడంబున నున్న నా దుర్ణయుం
డును బాల మేలు మే లని లీలం గాలు సార నిచ్చి త్రోచినం జూచి
యేచి ఖేచరు లగ్గించి యుగ్గడింప నగ్గోపకుమారుండు పాటవంబునను
[2]రాటవంబునకుం జని వెన్నెక్కి నిక్కిన నక్కంసభటుండు మదజల
రేఖాబంధురం బగు గంధసింధురంబు చందంబునం బదంబును
బదంబునం గరంబును గరంబునం గ్రహించి సహించి వహించి
నైపుణంబున లోపలం దిరిగి యట్టిట్టు తప్పించిన దిట్టతనంబునం
దిటవు దప్పక యప్పద్మలోచనుండు [3]కేడించి యేచి సమతలంబున
వైచి ప్రచండంబగు వాని [4]పిచండంబు వాగించి కాలఁ ధిక్క
రించి [5]డొక్కరంబు గొనిన నయ్యభ్యాసి సభ్యులు సన్నుతింపం
గ్రమ్మఱించి డడ్డనం గా లడ్డగించి రక్షించుకొనిన నారక్షోవైరి వాని
కటిచేలంబు పట్టి యెత్తి యొత్తినడుమ రాగెయిడి సందు వెట్టి నవ్వీన
నవ్విరోధి కాలు కాలిలోనిడి వేధించి నిరోధించిన నిరోధంబుఁ బాసి
తిరిగి వసుదేవుపట్టి పట్టిసంబుగాని దట్టించిన నుబ్బరిక చేసి చాణూ
రుండు హారికరంబు వట్టి హుమ్మని నెమ్మొగంబునం గాలిడి మీఁదైనం
గేళిబాలకుండు కాలిం గాల నివారించి మీఁద నెగడి యుండనీక
దుర్వారబలంబున విదలించి లేచి గృహీతపరిపంథిచరణుండై విపక్షుని
వక్షంబు వజ్రివజ్రసన్నిభం బగు పిడికిటం బొడిచిన వాఁడు వాఁడి
సెడక విజృంభించి యంభోరాశి మధ్యంబునం దిరుగు శైలంబుపోలిక
నేల జిఱజిఱం దిరిగి తన్నిన నెన్నుండు కుప్పించి యుప్పరం బెగసి
మీఁద నుఱికిన నతండు కృష్ణపాదసంధిపరిక్షిప్తపాదుండై యెగ
ఝుంచివైచి సముత్థితుం డయ్యె నయ్యెడ. 1349

క. బలభద్రుఁడు ముష్టికుఁడును
బలములు మెఱయంగఁ జేసి ♦ బాహాబాహిం

---

1. కరవడంబు = కాళ్ళతో నొక్కిపట్టి మీఁదుగా నుండుట. 2. రాటవంబు = మీఁదగుట. 3. కేడించి = తొలఁగి, 4. పించడంబు = పొట్ట, 5. డొక్కరంబు మల్లబంధ విశేషము (డొక్కరము, రాగె, ఉబ్బరిక, మొదలగు నవి మల్లయుద్ధము నందలి విశేషములు)

ప్రబలియాగున్నల్లక్రియఁ బోరిరి
వెలయఁగ బహువిధము లయిన ♦ [1]విన్నాణములన్ 1350

వ. ఇవ్విధంబున. 1351

క. వల్లవులు పెనఁగి [2]యున్నత గల్లుఁ తో భిన్నదిగిభ ♦ కరవల్లులతో
మల్లులతో రిపుమానస భల్లులతో [3]భీతగోప ♦ పల్లులతోడన్.

వ. ఆ సమయంబునఁ బౌరకాంతలు మూఁకలుగట్టి వెచ్చ నూర్చుచు
ముచ్చటలకుం జొచ్చి దమలో నిట్లనిరి. 1353

ఉ. మంచి కుమారులం గుసుమ ♦ మంజులశరీరులఁ దెచ్చి చెల్లరే
యంచితవజ్రసారులు మ ♦ హాద్రికశోరులు నైన మల్లురం
గ్రించులఁ బెట్టి రాజు పెనఁ♦గించుచుఁ జూచుచు నున్నవాఁడు మే
లించుక లేదు మాను మనఁ ♦ డిట్టిదురాత్ముని మున్ను వింటిమే.

క. చూచెదరు గాని సభికులు నీచిన్నికుమారకులకు ♦ నీ మల్లురకున్
ఓచెల్ల యీడుగాదని సూచింపరు పతికిఁ దమకు ♦ శోకముగాదే.

సీ. వేణునాళముల మై ♦ వెలసిన మాధవుం
డధరామృతము లిచ్చి ♦ యాదరించు
బింఛదామముల మై ♦ పెరిఁగిన వెన్నుఁడు
మస్తకంబునఁ దాల్చి ♦ మైత్రి నెఱపు
బీతాంబరముల మై ♦ బెఱసిన గోవిందుఁ
డంసభాగమునఁ బా ♦ యక ధరించు
[4]వైజయంతికల మై ♦ ప్రాలినఁ గమలాక్షుఁ
డతికుతూహలమున ♦ నఱుత నునుచు

తే. దనరు బృందావనంబునఁ ♦ దరుల మైనఁ
గృష్ణుఁ డానందమునఁ జేరి ♦ క్రీడ సల్పు
నెట్టి నోముల నయిన ము ♦ న్నిట్టివిధము
లేల కా మైతి మోయమ్మ ♦ యింక నెట్లు. 1356

---

1. విన్నాణము = నేర్పు, 2. ఉన్నతగల్లులు = బలసిన చౌడలుగలవారు. 3 భీతగోప పల్లులు = గొల్లపల్లెలకు భీతిఁ గొలుపువారు. 4. వైజయంతిక = విష్ణుని ప్రాలమాలిక.

ఉ. పాపపు బ్రహ్మ గోపికల ♦ పల్లెలలోన సృజింపరాదె ము
న్నీ పురిలోపలన్ మనల ♦ నేల సృజించె నతైన నిచ్చలుం
జేపడుఁ గాదె యీ సుభగుఁ ♦ జెందెడిభాగ్యము సంతతంబు నీ
గోపకుమారుఁ బొంద మును ♦ గోపకుమారిక లేమి నోఁచిరో.

క. గోపాలకృష్ణుతోడను గోపాలకవేళలందుఁ ♦ గూడి తిరుగు నా
గోపాలు రెంత ధన్యులో [1]గోపాలుర కైన నిట్టి ♦ గురురుచి గలదే.

క. శ్రమజలకణసిక్తంబై కమలదళేక్షణుని వదన ♦ కమలము మెఱసెన్
హిమజలకణసిక్తంబై కమనీయం బగుచునున్న ♦ కమలముభంగిన్.

ఆ. సభకుఁ బోవఁ జనదు ♦ సభవారిదోషంబు
నెఱిఁగి యూరకున్న ♦ నెఱుఁగ కున్న
నెఱిఁగి యుండి యైన ♦ నిట్టట్టు వలికినఁ
బ్రాజ్ఞుఁ డైనఁ బొందుఁ ♦ బాపచయము. 1360

వ. అని పెక్కండ్రు పెక్కు విధంబులం బలుకుచుండఁ దద్బాహు
యుద్ధంబున. 1361

క. ధృతి చెడి లోఁబడె మల్లుం డతులితభవజలధితరికి ♦ హతరిపుపురికిన్
జితకరికిన్ ధృతగిరికిన్ [2]తతహరిరవభరితశిఖరి ♦ దరికిన్ హరికిన్.

క. హరికిని లోఁబడి బెగడక
హరియురము మహోగ్రముష్టి ♦ నహితుఁడు పొడువన్
హరి [3]కుసుమమాలికాహత
కరిభంగిఁ బరాక్రమించెఁ ♦ గలహోద్ధతుఁ డై. 1363

క. శౌరి నెఱిఁజొచ్చి కరముల గ్రూరగతిం బట్టి త్రిప్పి ♦ కుంభిని వైచెన్
శూరుం గలహగభీరున్ వీరుం జాణూరు ఘోరు ♦ వితతాకారున్.

క. శోణితము నోర నొలుకఁగఁ
జాణూరుం డట్లు కృష్ణ ♦ సంభ్రామణ సం
క్షీణుం డై క్షోణిం బడి
ప్రాణంబులు విడిచెఁ గంసు ♦ ప్రాణము గలఁగన్. 1365

---

1. గోపాలురు = భూపాలురు. 2. తతహరి........దరికిన్ = పెద్ద సింహ నాదముచే నిండింపఁబడిన పర్వతగుహలు కలవానికి 3. కుసుమ మాలికా......భంగిన్ = పూలమాలచేఁ గొట్టఁబడిన యేనుఁగువలె.

క. బలభద్రుఁడుఁ దను లోకులు
బలభద్రుం డనఁగఁ బెనఁగి ♦ పటుబాహుగతిన్
బలభేది మెచ్చఁ ద్రిప్పుచు
బలవన్ముష్టికునిఁ గంసు ♦ బలములు బెగడన్. 1366

ఆ. త్రిప్పి నేలవైవ ♦ దిగ్గన రక్తంబు
వదనగహ్వరమున ♦ వఱదవాఱ
ముష్టికుండు ఘోర ♦ ముష్టి ప్రాణము సెడి
కూలె గాలిఁ దరువు ♦ గూలినట్లు. 1367

వ. మఱియును.

క. పాటవమునఁ బలుపిడికిటఁ గూటింబటఁబొడిచె బలుఁడు♦శోభితఘనబా
హాటోపస్ఫురితకిరీటుం గూటున్ వాచాటు నధిక ♦ ఘోరలలాటున్.

వ. అంత నద్దనుజాంతకుండు చరణప్రహారణంబుల భిన్నమస్తకులం జేసి
తోసలశలుల నంతకాంతికంబున కనిచిన. 1370

క. పల్లవ బాలకులని మన మల్లవరులు పెనఁగి నేఁడు♦మడిసిరి వీరల్
బల్లిదులు [1]తలఁడు తలఁడని చెల్లాచెదరైరి పాఱి ♦ చిక్కిన మల్లుల్.

ఉ. మల్లురఁ జంపి గోపక స ♦ మాజములో [2]మృగరాజు రేఖ శో
భిల్లగఁ బాదపద్మములఁ ♦ బెల్లుగ నందెలు మ్రోయ వచ్చు నా
వల్లవ రాజనందనుల ♦ వారక చూచి మహీసురాదు ల
ల్లలన సంస్తుతించిరి ప్రి ♦ యంబుగఁ గంసుఁడు దక్క నందఱున్.

—♦ శ్రీకృష్ణుండు కంసుని వధించుట ♦—

వ. అంత సభాజనంబుల కలకలంబు నివారించి మంత్రులం జూచి కంసుం
డిట్లనియె. 1373

ఉ. వల్లవబాలురన్ నగరి ♦ వాకిటికిన్ వెడలంగ ద్రొబ్బు డీ
గొల్లల [3]ముట్టికోల్ గొనుఁడు ♦ క్రూరుని నందునిఁ గట్టుఁ డుద్రేకిం
దెల్లము గాఁగ నేఁడు వసు ♦ దేవునిఁ జంపుఁడు తండ్రి గాఁడు వీఁ
డెల్ల విధంబులం బసుల ♦ కిష్టుఁడు గావకుఁ డుగ్రసేనునిన్. 1374

1. తలఁడు = తప్పకొనుఁడు. 2. మృగరాజు రేఖన్ = సింహము తీరున
3. ముట్టికోల్ గొనుఁడు = ముట్టడింపుఁడు.

వ. అని పలుకు సమయంబున. 1375

శా. జంఘాలత్వముతో నగోపరిచర ♦ త్సారంగహింసేచ్ఛ ను
ల్లంఘింపన్ గమకించుసింహముక్రియన్ ♦ లక్షించి పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల హరి కం ♦ సప్రాణహింసార్థియై
లంఘించెం దమగంబుమీఁదికి రణో ♦ ల్లాసంబు భాసిల్లఁగన్.

క. [1]తమగమున కెగురు యదుస
త్తమగణ్యునిఁ జూచి ఖడ్గ ♦ ధరుఁడై యెదిరెం
దమగమివారలు వీరో
త్తమగణవిభుఁ డనఁగఁ గంస ♦ ధరణీపతియున్. 1377

శా. పక్షీంద్రుం డురగంబుఁ బట్టువిధ మొ ♦ ప్పం గేశబంధంబు లో
కక్షోభంబుగఁ బట్టి మౌళిమణులా ♦ [2]కల్పాంతవేళాపత
న్నక్షత్రంబులభంగి రాల రణసం ♦ రంభంబు డిందించి రం
గక్షోణిం బడద్రొబ్బెఁ గృష్ణుఁడు వెసం ♦ గంసున్ నృపోత్తంసునిన్.

శా. మంచాగ్రంబున నుండి రంగధరణీ ♦ మధ్యంబునం గూలి యే
సంచారంబును లేక చిక్కి జను లా ♦ శ్చర్యంబునుం బొందఁగాఁ
బంచత్వంబును బొందియున్న విమతుం ♦ బద్మాక్షుఁ డీడ్చెన్ వడిం
బంచాస్యంబు గజంబు నీడ్చుపగిదిన్ ♦ బాహాబలోల్లాసియై. 1379

క. రోషప్రమోద నిద్రా భాషాశన పానగతులఁ ♦ బాయక చక్రిన్
దోషగతిఁ జూచియైన విశేషగతిం గంసుఁ డతనిఁ ♦ జెందె నరేంద్రా.

వ. ఆ సమయంబున. 1381

క. గోపాలుఁ డొక్కఁ డద్దిర భూపాలకుఁ జంపె వీని ♦ బొదువుం డేత
ద్రూపాలస్యము లేలని తాపాలఘురోషు లగుచు ♦ దర్పోద్ధతులై.

శా. న్యగ్రోధుండును గహ్వుఁడున్ మొదలుగా ♦ నానాయుధానీక సా
మగ్రిం గంసునిసోదరుల్ గవియుడున్ ♦ మాద్యద్గజేంద్రాభుఁడై
యుగ్రుం డై పరఘాయుధోల్లసితుఁ డై ♦ యొండొండ చెండాడి కా
లాగ్రక్షోణికిఁ బుచ్చె రాముఁడు [3]గరీ ♦ యస్థేముఁ డై వారలన్.

---

1 తమగము = మంచె. 2. కల్పాంతవే............బులభంగిన్ = ప్రళయకాలమున రాలిపడెడు నక్షత్రములవలె. 3. గరీయస్థేముఁడు = విస్తారమగు శరీరబలము గలవాఁడు.

వ. అ య్యవసరంబున. 1384

క. చేతులఁ దాళము లొత్తుచుఁ జేతోమోదంబుతోడ ♦ సిగముడివీడం
[1]బాతరలాడుచు మింటను గీతములాడుచు నువ్వాఁడె ♦ గృష్ణాయనుచున్

క. వారిజభవరుద్రాదులు భూరికుసుమవృష్టిఁ గురిసి ♦ పొగడిరి కృష్ణున్
భేరులు మ్రోసెను విద్యాధరులు దివి నాడి రధిక ♦ నటనములన్నృపా.

వ. అంతఁ గంసాదుల కాంతలు భర్తృమరణదుఃఖాక్రాంతలై కరంబుల శిరంబులు మోఁదుకొనుచు నశ్రుజలధారాపరిషిక్తవదనలై సదనంబులు వెలువడి వచ్చి వీరశయ్యానిద్రితులైన విభులం గౌఁగిలించుకొని సుస్వరంబుల విలపించి రందుఁ గంసభార్య లిట్లనిరి. 1387

సీ. గోపాలసింహంబు ♦ గోపించి వెల్వడి
నిను గజేంద్రము భంగి ♦ నేఁడు గూల్చె
యాదవేంద్రానిల ♦ [2]మహాభీలజవమున
నిను మహీజముమాడ్కి ♦ నేల వ్రాల్చె
వాసుదేవాంభోధి ♦ వారి యుద్వేలమై
నిను దీవికైవడి ♦ నేఁడు ముంచె
దేవకీసుతవజ్రి ♦ దేవత లలరంగ
నినుఁ గొండ క్రియ నేఁడు ♦ నిహతుఁ జేసె

తే. హా మనోనాథ హా వీర ♦ హా మహాత్మ
హా మహారాజ నీ విట్లు ♦ హతుఁడ వైన
మనుచు నున్నార మక్కట ♦ మమ్ముఁ గోలు
కరినవ్యాపయులు జగతిపైఁ ♦ గలరె యెందు. 1388

క. భూతముల కెగ్గు సేసిన భూతంబులు నీకు నెగ్గు ♦ పుట్టించె [3]వృథా
భూతమగు మనికి యెల్లను భూతద్రోహికిని శుభము ♦ పొందదధీశా.

క. గోపాలకృష్ణుతోడను భూపాలక మున్ను తొడరి ♦ పొలిసిన వారిన్
నీపాల బుధులు సెప్పరె కోపాటోపములు విడిచి ♦ కొలువం దగదే.

వ. అని విలపించుచున్న రాజవల్లభల నూరార్చి జగద్వల్లభుండైన హరి

1. పాతరలాడుచు = నృత్యము చేయుచు. 2. మహాభీలజవమునన్ = భయంకరమైన వేగముతో. 3. వృథాభూతమగు మనికి = వ్యర్థమగు జీవితము.

కంసాదులకుం బరలోకసంస్కారంబులు సేయం బనిచి దేవకీవసుదేవుల సంకెలియలు విడిపించి బలభద్రసహితుండై వారలకుం బ్రణామంబులు సేసిన.

మ. కని లోకేశులు గాని వీరు కొడుకుల్ ♦ గారంచుఁ జిత్తంబులన్
[1]జనయిత్రీజనకుల్ విచారపరులై ♦ శంకింపఁ గృష్ణుండు దా
జనసమ్మోహిని యైన మాయఁ దదభి ♦ జ్ఞానంబు వారించి యి
ట్లనియెన్ సాగ్రజుఁడై మహావినతుఁడై ♦ యానంద సంధాయియై.

—♦ శ్రీకృష్ణుఁడు దేవకీవసుదేవులచెఱ మాన్పి యుగ్రసేనునికిఁ బట్టంబుఁ గట్టుట. ♦—

సీ. మముఁ గంటిరి గాని ♦ మా బాల్యపౌగండ
కైశోరవయసులఁ ♦ గదిసి మీర
లెత్తుచు దించుచు ♦ నెలమి మన్నించుచు
నుండు సౌభాగ్యంబు ♦ నొందరైతి
రాకాంక్ష గలిగియు ♦ నది దైవయోగంబు
తల్లిదండ్రులయొద్దఁ ♦ దనయు లుండి
యే యవసరమున ♦ నెబ్భంగి లాలితు
లగుచు వర్ధిల్లుదు ♦ రట్టి మహిమ
తే. మాకు నిన్నాళ్ళు లేదయ్యె ♦ మఱియు వినుఁడు
నిఖిలపురుషార్థహేతువై ♦ నెగడుచున్న
మేని కెవ్వార లాఢ్యులు ♦ మీర కారె
యా ఋణముఁ దీర్ప నూఱేండ్ల ♦ కైనఁ జనదు. 1393

క. చెల్లుబడి గలిగి యెవ్వఁడు తల్లికిఁ దండ్రికిని దేహ♦ధనముల [2]వృత్తుల్
చెల్లింపఁ డట్టికష్టుఁడు ప్రల్లదుఁ డామీఁదనాత్మ ♦ పలలాశియగున్.

క. జననీ జనకుల వృద్ధులఁ
దనయుల గురు విప్రసాధు ♦ దారాదుల నే
జనుఁడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక
వనరును [3]జీవన్మృతుండు ♦ వాఁడు ధరిత్రిన్. 1395

1. జనయిత్రీ జనకులు = తలిదండ్రులు, 2. వృత్తులు = వర్తనములు (లేక) జీవికములు. 3. జీవన్మృతుఁడు = బ్రతికియుఁ జచ్చినవాఁడు.

వ. అదియునుంగాక. 1396

శా. కారాశాలల మా నిమిత్తము మిముం ♦ గంసుండు గారింపఁగా
వారింపంగ సమర్థతల్ గలిగియున్ ♦ వారింపఁగా రాక ని
ష్కారుణ్యాత్ముల మైన క్రూరుల మహా ♦ కౌటిల్యసంచారులన్
[1]సారాతిక్షములార మమ్ముఁ గొఱఁతల్ ♦ సైరించి రక్షింపరే.

వ. అని యిట్లు మాయామనుష్యుం డైన హరి పలికిన పలుకులకు మోహితులై వారలు నంకపీఠంబుల నిడుకొని కౌఁగిలించుకొని వారి వదనంబులు కన్నీటం దడుపుచుఁ బ్రేమపాశాబద్ధులై దేవకీవసుదేవు లూరకుండి రంత వసుదేవుండు మాతామహుం డైన యుగ్రసేనుం జూచి. 1398

చ. అనఘ యయాతిశాపమున ♦ యాదవవీరులకున్ నరేశ్వరా
సనమున నుండ రాదు నృప ♦ సత్తము రాజవు గమ్ము భూమి కే
నినుఁ గొలువంగ నిర్జరులు ♦ నీ [2]కఱఁబెట్టుదు రన్యరాజులం
బనిగొను టెంత రమ్ము జన ♦ పాలనశీలివి గమ్ము వేడ్కతోన్.

వ. అని పలికి. 1400

—♦ ఉగ్రసేనునికి రాజ్యాభిషేకంబు గావించుట ♦—

క. మన్నించి రాజుఁ జేసెను నెన్నఁడు [3]సత్యావధాను ♦ విశ్రుతదానున్
సన్నుతమానుం గదన చ్ఛిన్నాహితసేను నుగ్ర ♦ సేనున్ దీనున్.

వ. తదనంతరంబ తొల్లి కంసభీతులై విదేశంబులం గృశియించుచున్న యదు వృష్ణి భోజ మధు దశార్హ కుకు రాంధక ప్రముఖులగు సకల జ్ఞాతి సంబంధులను రావించి చిత్తంబు లలర విత్తంబు లిచ్చి వారి వారి నివాసంబుల నుండ నియోగించె నివ్విధంబున. 1402

క. [4]మధుసూదనసత్కరుణా మధురాలోకనవిముక్త ♦ మానసభయులై
మధురవచనములఁ దారును మధురానగరంబు ప్రజలు ♦ మనిరి నరేంద్రా

---

1. సారాతిక్షములార - బలముచే మిక్కిలి సమర్థులార! 2. అఱఁబెట్టుదురు = కప్పమొసఁగుదురు 3. సత్యావధానున్ - సత్యమునెడ శ్రద్ధగలవానిని. 4. మధుసూదన...సభయులై=కృష్ణుని దయాదృష్టులచేఁ దొలఁగింపఁబడిన భయములుకలవారై.

వ. అంత నొక్కనాఁడు [1]సంకర్షణసహితుండై నందునిం జేరి గోవిందుం డిట్లనియె. 1404

శా. తండ్రిం జూడము తల్లిఁ జూడము యశో ♦ దా దేవియున్ నీవు మా
తండ్రిం దల్లియు నంచు నుండుదుము స ♦ త్కృత్యంబులం దొల్లి యే
తండ్రుల్ బిడ్డల నిట్లు పెంచిరి భవ ♦ త్సౌజన్య భావంబులం
దండ్రీ యింతటివార మైతిమి గదా ♦ తత్తద్వ్యయోలీలలన్. 1405

ఉ. ఇక్కడ నున్న బాంధవు ♦ లెల్లను సౌఖ్యము సేసి యత్తు మే
మక్కడికిన్ మదీయులకు ♦ నంపఅకున్ వినిపింపుమయ్య నే
మెక్కడనున్న మాకు మది ♦ నెన్నఁడుఁ బాయవు మీ వ్రజంబులో
మక్కువతోడ మీరు కృప ♦ మా కొనరించు క్రియావిశేషముల్.

వ. అని పలికి వస్త్రభూషణాదు లొసంగి సాదరంబునం గౌఁగిలించుకొని గోవిందుం డనిచిన నందుండు ప్రణయవిహ్వలుండై బాష్పజల పూరితలోచనుం డగుచు వల్లవులుం దానును వ్రేపల్లెకుఁ జనియె నంత. 1407

♦ వసుదేవుఁడు బలరామకృష్ణుల కుపనయనంబు గావించుట ♦

క. గర్గాదిభూసురోత్తమ వర్గముచే నుపనయనము ♦ వసుదేవుఁడు స
న్మార్గంబునఁ జేయించెను నిర్గర్వచరిత్రులకును ♦ నిజపుత్రులకున్. 1408

క. [2]ద్విజరాజత్వము నొందిరి [3]ద్విజరాజ ముఖాంబుజోప ♦ దిష్టవ్రతులై
ద్విజరాజత్వము నొందిరి [4]ద్విజరాజాదికజనంబు ♦ దీవింపంగన్.

వ. ఉపనయనానంతరమున వసుదేవుండు బ్రాహ్మణులకు సదక్షిణంబులుగా ననేక గోహిరణ్యాదిదానంబు లొసంగి తొల్లి రామకృష్ణుల జన్మ సమయంబులందు నిజమనోదత్తలైన గోవుల నుచ్చరించి యిచ్చి కామితార్థంబుల నర్థులకుం బెట్టె నిట్లు బ్రహ్మచారులై.

1. సంకర్షణసహితుఁడు = బలరామునితోఁ గూడినవాఁడు 2. ద్విజరాజత్వము = ద్విజులలో శ్రేష్ఠత్వమును. 3. ద్విజరాజ........దిష్టవ్రతులై = బ్రాహ్మణశ్రేష్ఠుల ముఖపద్మముచే నుపదేశింపఁబడిన బ్రహ్మచర్యవ్రతముఁ గలవారు. 4. ద్విజరాజాదిక జనంబు = బ్రాహ్మణులు, రాజులు మొదలగువారు.

—♦ రామకృష్ణుల విద్యాభ్యాసము ♦—

శా. ఉర్విన్ మానవు లెవ్వరైన గురువా ♦ క్యోద్యుక్తులై కాని త
త్పూర్వారంభము సేయఁబోరనుచున్ ♦ బోధించుచందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై ♦ సంప్రాప్తులై యుండియుం
గుర్వంగీకరణంబు సేయఁ జని రా ♦ గోవిందుఁడున్ రాముఁడున్.

వ. చని మహావైభవరాశియైన కాశిం జేరి తత్తీర్థంబున నవంతీపుర నివాసియు సకలవిద్యావిలాసియు నైన సాందీపని యను బుధవర్యునిం గని యథోచితంబుగ దర్శించి శుద్ధభావవర్తనంబుల భక్తి సేయుచుండ వారలవలన సంతుష్టుండై 1412

శా. వేదశ్రేణియు [1]నంగకంబులు ధను ♦ ర్వేదంబుఁ దంత్రంబు మ
న్వాదివ్యాహృతధర్మశాస్త్రములు ను ♦ న్యాన్వయముం దర్కవి
ద్యాదక్షత్వము రాజనీతియును ష ♦ డ్వర్గప్రక్రియం జెప్పె నా
భూదేవాగ్రణి రామకృష్ణులకు సం ♦ ప్రీతాత్మప్రమోదంబునన్. 1413

క. అఱువదినాలుగు విద్యల నఱువదినాలుగు దినంబు ♦ లంతన వారల్
[2]నెఱవాదులై సకలమున నెఱిఁగొక్కొకనాఁటివినికి ♦ నేర్చి రిలేశా.

క. గురువులకు నెల్ల గురులై గురులఘుభావములు లేక ♦ కొమరొందు జగ
ద్గురులు త్రిలోకహితార్థము గురుశిష్యన్యాయలీలఁ ♦ గొలిచిరి వేడ్కన్.

వ. ఇట్లు కృతకృత్యులైన శిష్యులం జూచి వారల మాహాత్మ్యంబునకు వెఱఁగుపడి సభార్యుండైన సాందీపని యిట్లనియె. 1416

శా. అంభోరాశిఁ బ్రభాసతీర్థమున మ ♦ న్మత్పుత్త్రతనూసంభవుం
డంభోగాహము సేయుచున్ మునిఁగి లేఁ ♦ డయ్యెం గృపాంభోనిధుల్
శుంభద్వీర్యులు మీరు మీగురునికిం ♦ జోద్యంబుగా శిష్యతా
గాంభీర్యంబునఁ బుత్త్రదక్షిణ యిడం ♦ గర్తవ్యమూహింపరే. 1417

క. శిష్యులు బలాఢ్యులైన విశేష్యస్థితి నొంది గురువు ♦ జీవించును [3]ని
ర్ధూష్యగుణబలగరిష్ఠులు శిష్యులరై గురునికోర్కె ♦ సేయం దగదే.

---

1. అంగకంబులు = ఆఱువేదాంగములు. (శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అనునవి.) 2. నెఱవాదులు = సమర్థులు, 3. నిర్ధూష్య గుణబలగరిష్ఠులు = దూషింపరాని గుణములచే బలముచే గొప్పవారు.

వ. అనిన విని రామకృష్ణులు సుస్థిరంబుగా దుర్వార రథారూఢులై
రయంబునం జని ప్రభాసంబున సముద్రంబుఁ జేరి యుండిరి. 1419

— రామకృష్ణులు గురుపుత్త్రుని గొనివచ్చి యిచ్చుట —

క. సాగర సుబుద్ధితోడను మా గురుపుత్త్రునిఁ దెమ్ము ♦ మా తోడ నీ
[1]వాగడ మవుదువు దుస్సహ వేగకరాఘాతదళిత ♦ విశిఖాగ్నులకున్.

వ. అనిన వారలకు జలరాశి యిట్లనియె. 1421

ఉ. వంచన యింత లేదు యదు ♦ వల్లభులార ప్రభాసతీర్థమం
దంచితమూర్తి విప్రసుతుఁ ♦ డాప్యుఁడు తోయము లాడుచుండ ను
త్సంచలితోర్మి యొక్కటి ప్ర ♦ చండగతింగొనిపోయెఁ బోవఁగాఁ
బంచజనుండు మ్రింగె నతి ♦ ఘాపకశీలుని విప్రబాలునిన్. 1422

వ. అని వాని వసియించు చోటెఱింగించిన. 1423

శా. శంఖారావముతోడఁ బంచజనుఁడున్ ♦ శంకించి చిత్తంబులో
సంక్షున్నుండుగ వార్ధిఁ జొచ్చి వహన ♦ జ్వాలాభ హేమోజ్జ్వల
త్పుంఖాస్త్రంబునఁ గూల్చి వానిజఠరం ♦ బున్ వ్రచ్చి గోవిందుఁ [2]డ
ప్రేంఖచ్చిత్తుఁడు బాలుఁ గానక కురు ♦ ప్రేమోదితోద్యోగుఁడై 1425

క. దానవుని దేహజం బగుమానితశంఖంబు గొనుచు ♦ ముసలక బలుఁడుం
దోడ్నే తేరఁగ రథియై దానవరిపుఁ డరిగె దండ ♦ ధరుపురికి నృపా.

వ. చని సంయమనీనామనగరంబుఁ జేరి తద్ద్వారంబునఁ బ్రళయ కాల
మేఘగంభీరనినదభీషణం బగు శంఖంబు పూరించిన విని వెఱఁగుపడి.

శా. అస్మద్బాహుబలంబుగా కొనక శం ♦ ఖారావమున్ మానసా
పస్మారంబుగ నెవ్వఁడొక్కొ నగర ♦ ప్రాంతంబునం జేసె [3]మ
ద్విస్మేర వహరోషపావకునిచే ♦ [4]విధ్వస్తుఁడై వాఁడు దా
భస్మంబై చెడు నంచు నంతకుఁడు కో ♦ పప్రజ్వలన్మూర్తియై.

వ. వచ్చి రామకృష్ణుం గని వారు లీలామనుష్యు లయిన విష్ణుమూర్తు
లని యెఱింగి భక్తితోడ శుశ్రూష సేసి సర్వభూతమయుం డగు

1. ఆగడమవుదువు = అల్లరియగుదువు. 2. అప్రేంఖచ్చిత్తుఁడు = చలింపని మనస్సుగలవాఁడు. 2. మద్విస్మే......కునిచే = నాయొక్క యాశ్చర్యకరమగు కోపాగ్ని చేత. 4. విధ్వస్తుఁడై = ధ్వంసము చేయఁబడినవాఁడై.

కృష్ణునకు నమస్కరించి యేమి సేయుదు నానతి మ్మనిన నమ్మహాత్తుం డిట్లనియె. 1428

క. చెప్పెద మా గురు నందనుఁ దప్పఁగలుగఁ జూచి నీవు ♦ దండనమునకుం
దెప్పించినాఁడ వాతని నొప్పింపుము మాకువలయు♦నుత్తమచరితా.

క. అనిన విని వీఁడె వీనిం
గొనిపొండని భక్తితోడ ♦ గురునందను ని
చ్చినఁ గృష్ణుఁడు వీడ్కొనియెను
ఘనదురవదనును మహిమ ♦ గమనున్ శమనున్. 1430

వ. ఇట్లు జమునడిగి తెచ్చి రామకృష్ణులు సాందీపనికిం బుత్రునిసమర్పించి
యింక నేమి సేయవలయు నానతిం డనిన నతం డిట్లనియె. 1431

క. గురునకుఁ గోరిన దక్షిణఁ
గరుణన్ మున్నెవ్వఁ డిచ్చె ♦ ఘనులార భవ
ద్గురునకుఁ గోరిన దక్షిణఁ
దిరముగ నిచ్చితిరి మీరు ♦ దీపితయశులై. 1432

క. కాలునిపీటికిఁ జని మృత
బాలకుఁ దే నోరులవశమె ♦ భవదీయకృపన్
మేలు దొరకొనియె మాకు వి
శాల మగుం గాత మీ య ♦ శము లోకములన్. 1433

వ. మహాత్ములారా యేను గృతార్థుండ నైతి నని దీవించిన సాందీపని
వీడ్కొని [1]కృతకృత్యులై రామకృష్ణులు రథారోహణంబు సేసి
మధురకుం జనుదెంచి [2]పాంచజన్యంబు పూరించినం గని నష్టధనం
బులు గనినవారిభంగిం బ్రజలు ప్రమోదించి రంత నొక్కనాఁ
డేకాంతంబున. 1434

—♦ శ్రీకృష్ణుండు విరహార్తలగు గోపకాంతలచెంత నుద్ధవునిఁబంపుట ♦—

శా. నాపైఁ జిత్తము లెప్పుడున్ నిలుపుచున్ ♦ నారాకఁ గాంక్షించుచున్
నాపే రాత్మల నావహించుచు వగన్ ♦ నానాప్రకారంబులన్

1. కృతకృత్యులు = కార్యము నెఱవేర్చుకొన్నవారు. 2. పాంచజన్యము = పంచజనునుండి పుట్టినశంఖము.

గోపాలాంగన లెంత జాలిఁ బడిరో ◆ కోపించిరో దూఱిరో
వ్రేపల్లెన్ నిజధర్మ గేహములలో ◆ విభ్రాంతచైతన్యలై. 1435

వ. అని చింతించి.

క. సిద్ధవిచారు గభీరున్ వృద్ధవచో వర్ణనీయు ◆ వృష్ణిప్రవరున్
బుద్ధినిధినమరగురుసము నుద్ధవుని జూచి కృష్ణుఁ◆డొయ్యనఁబలికెన్.

శా. రమ్మా యుద్ధవ గోపకామినులు నా ◆ రాకల్ నిరీక్షించుచున్
సమ్మోహంబున నన్నియుం మఱచి యే ◆ చందంబునం గుందిరో
తమ్మున్ నమ్మినవారి డిగ్గ విడువన్ ◆ ధర్మంబుగా దండ్రు లే
పొమ్మా ప్రాణము లేక్రియన్ నిలిపిరో ◆ [1]ప్రోద్యద్వియోగాగ్నులన్.

క. లౌకిక మొల్లక నన్నా లోకించు [2]ప్రపన్నులకును ◆ లోఁబడి కరుణా
లోకనములఁ బోషింతును నా కాశితరక్షణములు ◆ నైసర్గికముల్.

క. సందేహము మానుం డరవిందాననలార మిమ్ము ◆ విడువను వత్తున్
బృందావనమున కని హరి సందేశము పంపెననుము ◆ సంకేతమునన్.

వ. అని మందహాస సుందర వదనారవిందుండై కరంబు కరంబున నవలంబించి సరసవచనంబు లాడుచు వీడుకొలిపిన నుద్ధవుండును రథారూఢుండై సూర్యాస్తమయ సమయంబునకు నంద వ్రజంబు చేరి వనంబులనుండి వచ్చు గోవుల చరణరేణువులం [3]బ్రచ్ఛన్న రథుండయి చొచ్చి నందు మందిరంబుఁ బ్రవేశించిన. 1441

—◆ నందోద్ధవ సంవాదము ◆—

శా. ఆ పుణ్యాత్ముని గౌఁగిలించుకొని నం ◆ దాభీరుఁ డానందియై
మా పాలింటికి కృష్ణుఁ డీతఁ డనుచున్ ◆ మన్నించి పూజించి వాం
ఛాపూర్ణంబుగ మంజులాన్న మిడి మా ◆ ర్గాయాసముం బాపి స
ల్లాపోత్సాహముతోడ నిట్లనియె సం ◆ లక్షించి మోదంబునన్. 1442

క. నామిత్త్రుఁడు వసుదేవుఁడు సేమంబుననున్నవాఁడె ◆ చెలువుగఁ బుత్త్రుల్
నేమంబున సేవింప మహామిత్త్రుండైన కంసుఁ ◆ డడఁగిన పిదపన్.

1. ప్రోద్యద్వియోగాగ్నులన్ = మిక్కిలి పెరుగుచున్న యెడబాటు చిచ్చుచేత.
2. ప్రపన్నులు = ఇతరచింతలేక ఒక్క భగవంతునే నమ్మినవారు. 3. ప్రచ్ఛన్నరథుండు = కప్పఁబడిన రథముకలవాఁడు.

శా. అన్నా భద్రమె తల్లిదండ్రుల సమర్క్ ♦ హర్షించి చింతించునే
తన్నుం బాసిన గోపగోపికల మి ♦ త్రవ్రాతమున్ గోగణం
బు న్నిత్యంబుఁ దలంచునే వననదీ ♦ భూముల్ ప్రసంగించునే
వెన్నుం డెన్నఁడు వచ్చునయ్యా యిట మా ♦ వ్రేపల్లెకున్నుద్ధవా. 1444

క. [1]అంకిలి కలుగక మా కకలంకేందుని పగిడిఁ గాంతి ♦ లలితంబగు త
త్పంకజనయనుని నెమ్మొగ మింక విలోకింపఁగలదె ♦ యీజన్మమునన్

క. అని హరి మున్నొనరించిన పను లెల్లను జెప్పి చెప్పి ♦ బాష్పాకులలో
చనుఁడై డగ్గుత్తికతో వినయంబున నుండె గోప ♦ వీరుం డంతన్.

క. పెనిమిటి బిడ్డల గుణములు
వినుతింప యశోద ప్రేమ ♦ విహ్వల మతియై
చను కొనలఁ బాలు గురియఁగఁ
గనుఁగొనలను జలము లొలుకఁ ♦ గా బెగ్గిలియెన్. 1447

వ. ఇట్లు [2]గోవింద సందర్శనాభావ విహ్వలు లైన యశోదానందులకు
నుద్ధవుం డిట్లనియె. 1448

క. జననీజనకుల మిమ్ముం గనుఁగొన శీఘ్రంబె వచ్చుఁ ♦ గని భద్రంబుల్
వనజాక్షుం డొనరించును మనమున వగవకుఁడు ధైర్య ♦ మండనులారా

మ. బలుఁడుం గృష్ణుఁడు మర్త్యులే వసుమతీ ♦ భారంబు వారింప వా
రలరూపంబులఁ బుట్టినాఁడు హరి ని ♦ ర్వాణప్రభుం డెవ్వఁ డు
జ్జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ ద ♦ త్సర్వేశుఁ జింతించు వాఁ
డలఘుశ్రేయముఁ బొందు బ్రహ్మమయుఁడై ♦ యర్కాభుఁడై నిత్యుఁడై.

సీ. అట్టి నారాయణుం ♦ డఖిలాత్మభూతుండు
కారణమానవా ♦ కారుఁడైనఁ
జిత్తంబు లతనిపైఁ ♦ జేర్చి సేవించితి
రతికృతార్థుల రైతి ♦ రనవరతము
శోభిల్లు [3]నింధన ♦ జ్యోతిచందంబున
నఖిలభూతములందు ♦ నతఁ డతనికి

---

1. అంకిలి కలుగక = అడ్డులేకుండ. 2. గోవింద........హ్వాలులు = కృష్ణుఁ
డగపడమిచే వివశులు. 3. ఇంధన జ్యోతిచందంబునన్ = సమిధలం దగ్నివలె.

జననీజనకదార ♦ సఖిపుత్త్రబాంధవ
శత్రు ప్రియాప్రియ ♦ జనులు లేరు
ఆ. జన్మకర్మములును ♦ జన్మంబులును లేవు శిష్టరక్షణంబు ♦ సేయ వలసి
గుణవిరహితుఁ డయ్యు ♦ గుణియయి సర్వరక్షణవినాశకేళి ♦ సలుపుచుండు.

వ. అని మఱియుఁ బెక్కువిధంబుల హరిప్రభావంబు లుపన్యసించుచు నా రేయి గడపి మఱునాఁడు దధిమథనశబ్దంబు లాకర్ణించుచు లేచి కృతానుష్ఠానుండై యుద్ధవుం డొక్క రహస్యప్రదేశంబున నున్న సమయంబున. 1452

శా. రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహో ♦ రస్కుండు పీతాంబరుం
డాజానుస్థితబాహుఁ డంబురుహమా ♦ లాలంకృతుం డుల్లస
ద్రాజత్కుండలుఁ డొక్కఁ డిప్పు డిచటన్ ♦ రాజిల్లుచున్నాఁడు మా
రాజీవాక్షునిభంగి నంచుఁ గని రా ♦ రాజాస్యలున్ గోపికల్. 1453

వ. కని [1]లజ్జాసహిత హాస విలోకనంబులు ముఖంబులకుఁ జెలువొసంగ నిట్లనిరి. 1454

— భ్రమరగీత —

చ. ఎఱుఁగుదు మేము నిన్ను వన ♦ జేక్షణ మిత్త్రుఁడ వీవు కూరిమిన్
మెఱయుచుఁ దల్లిదండ్రులను ♦ మే లెఱిఁగింపఁ బ్రియుండు పంపఁగా
వఱలెడు భక్తి వచ్చితివి ♦ వారల నైన మనంబు లోపలన్
మఱవఁడు మేలు శౌరి మఱి ♦ మాన్యులు రాజున కెవ్వ రిచ్చటన్.

క. మునివరు లైనను బంధుల ♦ ఘనసఖ్యము విడువ లేరు ♦ కాక విడువరే
[2]ననిమిత్తసఖ్య మాఁకటి ♦ పనిదీఱిన నళులు విరులఁ ♦ బాయునొ లేదో.

చ. అని యిటు గోపికల్ పలుక ♦ నందొక గోపిక కృష్ణపాద చిం
తనమునఁ జొక్కి చేరువను ♦ దైవవశంబునఁ గాంచె నుజ్జ్వల
త్సునిశిత సద్వివేకముఁ బ్ర ♦ సూనమరందమదాతిరేకమున్
ఘనమృదునాదసంచలిత ♦ కాముకలోకముఁ జంచరీకమున్. 1457

వ. కని హరి తన్నుఁ బ్రార్థింపఁ బుత్తెంచిన దూత యని కల్పించుకొని

1. లజ్జాస......నంబులు - సిగ్గుతోఁగూడిన నవ్వులు, చూపులు. 2. అనిమిత్త సఖ్యము - అకారణస్నేహము.

యుద్ధవునికి [1]నన్యాపదేశంబై మొఱకపడ నయ్యళికిం దొయ్యలి యిట్లనియె. 1458

మ. భ్రమరా దుర్జనమిత్ర ముట్టకుము మా ♦ పాదాబ్జముల్ [2] నాగర
ప్రమదాళీకుచ కుంకుమాంకిత లస ♦ త్ప్రాణేశదామ ప్రసూ
నమరందారుణితాస్య నుండ వగుటన్ ♦ నాథుండు మన్నించుఁగా
క మము న్నేఁపుచుఁ బౌరకాంతల కు♦భోగారంబులన్ నిత్యమున్

మ. ఒక పువ్వుందలి తేనె ద్రావి మధుపా ♦ యుత్సాహి వై నీవు వే
ఱొకటిం బొందెడుభంగి మ [3]మ్మధర పీ♦యూషంబునం దేల్చి మా
యకలంకోజ్జ్వల యౌవనంబు గొని య ♦ న్యాసక్తుఁడయ్యెన్ విభుం
డకటా యాతని కెట్లు దక్కె సిరి మి ♦ థ్యాకీర్తి నమ్మెం జుమీ.

శా. భృంగా కృష్ణుఁడు మంచివాఁ డనుచు సం ♦ ప్రీతిం బ్రశంసించె దీ
సంగీతంబున నేము సాక్షు లనుమె త ♦ చ్చారిత్రముల్ వింతలే
యంగీకారము గావు మాకుఁ బురకాం ♦ తాగ్రప్రదేశంబులన్
సంగీతం బొనరింపు వారిడుదు రో ♦ జన్ నీకు నిష్టార్థముల్. 1461

మ. సమదాళీశ్వర చూడు ముజ్జ్వలితహా ♦ స భ్రూవిజృంభంబులన్
రమణీయుండగు శౌరిచేఁ గరఁగరే ♦ రామల్ త్రిలోకంబులం
బ్రమదారత్నము లక్ష్మి యాతని పదా ♦ బ్జాతంబు సేవింప ని
క్కము నే మెవ్వర మా కృపాజలధికిం ♦ గారుణ్యముం జేయఁగన్.

శా. రోలంబేశ్వర నీకు దౌత్యము మహా ♦ రూఢంబు నీ నేరుపుల్
సాలున్ మచ్చరణాబ్జముల్ విడువు మ ♦ స్మన్నాథ పుత్రాదులన్
లీలం బాసి పరంబు డించి తనకున్ ♦ [4]లీనత్వముం బొందు మ
మ్మేలా పాసె విభుండు ధార్మికులు ము ♦ న్నీచందముల్ మెత్తురే.

శా. వాలిం జంపెను వేటకాని పగిదిన్ ♦ వంచించి దైత్యానుజన్
లోలంబట్టి విరూపఁ జేసెను బలిన్ ♦ లోభంబుతోఁ గట్టి యీ

---

1. అన్య+అపదేశంబు = ఇతరుల నుద్దేశించినట్లు. 2. నాగరప్రమదా........ దానునుండవు = నగరకాంతల కుచములందలి కుంకుమమంటిన కృష్ణుని పూలమాలలోని మరంద మంటుటచే నెఱ్ఱవారిన ముఖముగలవాఁడవు. 3. అధరపీయూషము = అధరామృతము. 4. లీనత్వము = ఐక్యము.

త్రైలోక్యంబు [1]మొఱఁగి పుచ్చుకొనిమో ♦ ధర్మజ్ఞుఁడే మాధవుం
డేలా షట్పద యెగ్గు మానఁడు నీ ♦ కెగ్గింపఁగా నేటికిన్. 1464

ఉ. పన్నుగ మింటిపై కెగసి ♦ పాఱు విహంగములైన వీనులం
దన్నొకమాఱు విన్న గృహ ♦ దారసుతాదులఁ బాసి విత్తసం
పన్నత డించి సంసరణ ♦ పద్ధతిఁ బాపెడువాఁడు నిత్యకాం
క్ష న్నెఱి నున్న మాబ్రతుకు ♦ సైఁచునెయేల మధువ్రతోత్తమా.

మ. కమనీయం బగు వేటకాని పలు కా ♦ కర్ణించి నిక్కంబుగాఁ
దమచిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ ♦ తద్బాణనిర్భిన్నలై
యమితోగ్రవ్యథ నొందుభంగి హరిమా ♦ యాలాపముల్ నమ్మి దుః
ఖములం జెందితి మంగజాస్త్ర జనితో ♦ గ్రశ్రాంతి నిందిందిరా. 1466

ఉ. బంధుల బిడ్డలన్ మగల ♦ భ్రాతలఁ దల్లులఁ దండ్రులన్ మనో
బాంధతఁ జేసి డించి శర ♦ ణాదిన మమ్ము వియోగదుర్దశా
సింధువులోనఁ ద్రోచి యిటు ♦ చేరక పోవుట పాడిగాదు పు
ష్పంధయ యీయధీశునకుఁ ♦ బాదములం బడి యొత్తిచెప్పవే. 1467

సీ. కాంచనరత్నసం ♦ ఘటితసౌధంబులే
మా కుటీరంబులు ♦ మాధవునకు
వివిధ నరేంద్ర సే ♦ విత రాజధానియే
మాపల్లె యదువంశ ♦ మండనునకు
సురభిపాదపలతా ♦ శోభితారామమే
మా యరణ్యము సింహ ♦ మధ్యమునకుఁ
గమనీయలక్షణ ♦ గజతురంగంబులే
మా ధేనువులు కంస ♦ మర్దనునకు

తే. [2]రూపవిభ్రమనైపుణ్య ♦ రూఢలైన
మగువలమె మేము మన్మథ ♦ మన్మథునకు
నేల చింతించు మముఁ గృష్ణుఁ ♦ డేల తలఁచుఁ
బృథివి నధిపులు నూతన ♦ ప్రియులు గారె. 1476

---

1. మొఱంగి = మోసగించి. 2. రూపవిభ్రమ.......రూఢలు = స్థిరమైన రూపము, విలాసములు, నేర్పులు కలవారు.

వ. అని మఱియు నిట్లనేకవిధంబులఁ గృష్ణసందర్శనలాలసలయి పలుకుచున్న గోపికల వచనంబులు విని యుద్ధవుండు మధురాలాపంబుల నూరార్చుచు నిట్లనియె. 1469

—♦ ఉద్ధవుఁడు గోపికల నూరార్చుట ♦—

మ. జపదానవ్రత హోమ [1]సంయమ తపఃస్వాధ్యాయ ముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు నే విభున్ మనములన్ ♦ నిల్పంగ లేరట్టి స
ద్విపులాకారునిపై మహామహిముపై ♦ విశ్వేశుపై మీ కజ
స్రపటుధ్యానము లిట్లు నిల్చెనె భవ ♦ చ్చారిత్రముల్ చిత్రముల్.

క. నను మీకడకుం గృష్ణుఁడు పనిఁ బంపెడువేళఁ బిలిచి♦పలికినపలుకుల్
వినుఁ డన్నియు వివరించెద వనజేక్షణలార మీరు♦వగవకుఁ డింకన్.

వ. అని హరివచనంబులుగా నిట్లనియె. 1472

సీ. ఎల్ల కార్యములకు ♦ నేను బ్రధానకా
రణము గావున మీకు ♦ రామలార
కలుఁగదు మద్వియో ♦ గము చరాచరరూప
ములలో మహాభూత ♦ ములు వసించు
కరణి నుండుదు సర్వ ♦ గతుఁడనై నే మనః
ప్రాణబుద్ధిగుణేంద్రి ♦ యాశ్రయుండ
నాత్మయం దాత్మచే ♦ నాత్మఁ బుట్టింతు ర
క్షింతును ద్రుంతు [2]హృ ♦ షీకభూత

తే. గుణగణాకార మాత్మకుఁ ♦ గొమరు మిగులు
నిబిడ మాయానుభవమున ♦ నిత్యశుద్ధ
మాత్మవిజ్ఞానమయము నై ♦ యమరు గుణముఁ
బ్రకృతికార్యమనోవృత్తిఁ ♦ బట్టి పొందు. 1473

చ. కలఁగని లేచి మున్ను గలఁ ♦ గన్న సమస్తవిధంబుఁ గల్లగాఁ
దలఁచినభంగి మానసప ♦ దార్థముచే నిఖిలేంద్రియార్థముల్
బలమునఁ గట్టి తద్జ్ఞుఁడు ప్ర ♦ పంచము లేదనుఁ దన్మనంబుఁ దా
రలయక కట్టుడున్ బుధులు ♦ కవ్వల నొండొక భేద మున్నదే.

---

1 సంయమము = ఇంద్రియ నిగ్రహము, 2. హృషీక......కారము = ఇంద్రియములవలనఁ బుట్టు గుణసముదాయరూపము.

ఆ. సాంఖ్యయోగనిగమ ♦ సత్యతపోదమ
ములు మనోనిరోధ ♦ మును గడపల
గాఁగ నుండు జలధి ♦ కడపలగాఁ గల
నదులభంగి నలిన ♦ నయనలార. 1475

మ. చెలువల్ దవ్వుల నున్న వల్లభులపైఁ ♦ జిత్తంబులం గూర్తు [1]రు
త్కలికం జేరువ వారికంటె నదియుం ♦ గాకెప్పుడున్ నన్ను మీ
రలు చింతించుచు నుండఁ గోరి యిటు దూ ♦ రస్థత్వముం బొందితిం
దలఁకంబోలదు నన్నుఁ గూడెదరు ని ♦ త్యధ్యానపారీణలై. 1476

వ. అని మీకుం జెప్పుమని కృష్ణుండు సెప్పె ననవుడు నుద్ధవునికి గోపి
కలు సంతసించి యిట్లనిరి. 1477

— ♦ కృష్ణవార్త విని గోపిక లుల్లసించి యుద్ధవునిచేఁ గబురంపుట ♦ —

ఉ. ఇమ్ములనున్నవాఁడె హరి ♦ యిక్కడి కెన్నఁడు వచ్చు వచ్చి మా
[2]యుమ్మలికంబు వాపునె ప్రి ♦ యుండిట వచ్చెదనన్న సైతురే
యమ్మధురాపురీరమణు ♦ లడ్డము వత్తురు గాక చెల్లరే
మమ్ము విధాత నిర్దయుఁడు ♦ మన్మథవేదనపాలు సేసెనే. 1478

చ. మఱచునొకో మదిం దలఁచి ♦ మాధవుఁ డా యమునాతటంబునన్
దఱచుఁగ [3]దివ్యసౌరభ ల ♦ తాగృహసీమల నేము దాఁగఁగా
మఱువులనుండి నీడలకు ♦ మ మ్మెలయించి కలంచి దేహముల్
మఱచినఁ దేర్చి నూల్కొలిపి ♦ మన్మథలీలలఁ దేల్చుచందముల్.

శా. నీతో నర్మగృహంబులం బలుకునే ♦ నే మెల్ల [4]వంశోల్లస
ద్గీతభ్రాంతలమై [5]కళిందతనయా ♦ తీరంబునం జేరినం
జేతోజాతసుఖంబులం దనిపి మా ♦ చిత్తస్థితుల్ చూడ లీ
లాతంత్రజ్ఞత దాఁగి మెల్లన మదా ♦ లాపంబు లాలించుటల్.

1. ఉత్కలికన్ = ఇష్టవస్తుప్రాప్తికై తహతహను. 2. ఉమ్మలికంబు = దుఃఖమును. 3. దివ్యసౌ......సీమలన్ = మేలితావులుగల పొదరిండ్లతో 4. వంశోల్లస...భ్రాంతలమై = పిల్లనగ్రోవియొక్క మేలైన పాటలచే భ్రమసినవారమై. 5 కళిందతనయాతీరంబునన్ = యమునానది యొడ్డున.

క. ముచ్చటవేళలఁజెప్పఁగ యచ్చుగమనునేమునోము♦నప్పుడుజలముల్
సొచ్చిన మాచేలంబులు ◆ మ్రుచ్చిలి యిచ్చినవిధంబు♦మూలంబెల్లన్.

శా. ఏకాంతంబున నీదుపైఁ గొరఁగి తా ♦ నేమేని భాషించుచో
మాకాంతుండు వచించునే [1]రవిసుతా ♦ మధ్యప్రదేశంబునన్
రాకాచంద్రమయూఖముల్ మెఱయఁగా ♦ రాసంబు మాతోడ నం
గీకారం బొనరించి బంధనియతిం ♦ గ్రీడించువిన్నాణముల్. 1482

సీ. తనుఁ బాసి యొక్కింత ♦ తడవైన నిటమీఁద
నేలపై మేనులు ♦ నిలువ వనుము
నేలపై మేనులు ♦ నిలుపక యట మున్న
ధైర్యంబు లొక్కటఁ ♦ దలఁగు ననుము
ధైర్యంబు లొక్కటఁ ♦ దలఁగిన పిమ్మటఁ
జిత్తంబు లిక్కడఁ ♦ జిక్క వనుము
చిత్తంబు లిక్కడఁ ♦ జిక్కక వచ్చిన
బ్రాణంబు లుండక ♦ పాయు ననుము

తే. ప్రాణములు వోవ మఱి వచ్చి ♦ ప్రాణవిభుఁడు
ప్రాణరక్షకుఁ డగు తన్నుఁ ♦ బ్రాణు లెల్లఁ
జేరి దూఱంగ మఱి యేమి ♦ సేయువాఁడు
వేగ విన్నప మొనరింప ♦ వే మహాత్మ. 1483

క. తగులరె మగలను మగువలు
దగులదె తను మున్ను కమల ♦ దగవు విడిచియుం
దగిలిన మగువల విడుచుట
దగుఁ దగ దని తగవు వలుకఁ ♦ దగుదువు హరికిన్. 1484

సీ. విభుఁడు మా వ్రేపల్లె ♦ వీథుల నేతేరఁ
జూతుమే యొకనాఁడుఁ ♦ జూడ్కు లలరఁ
బ్రభుఁడు మాతో నర్మ ♦ భాషలు భాషింప
విందుమే యొకనాఁడు ♦ వీను లలరఁ

1 రవి...ప్రదేశంబునన్ = యమునానదీ మధ్యమునందు.

దనువులు పులకింప ♦ నయితుండు డాసినఁ
గలుగునే యొకనాఁడు ♦ కౌఁగిలింపఁ
బ్రాణేశ మ మ్మేల ♦ పాసితి వని దూఱ
దొరకునే యొకనాఁడు ♦ తొట్రుపడఁగ

తే. వచ్చునే హరి మే మున్న ♦ వనముఁ జూడఁ
దలఁచునే భర్త [1]మాయింటి ♦ తగులు తెఱఁగు
దెచ్చునే విధి మన్నాథుఁ ♦ దిట్టు వడక
యెఱుఁగఁ బలుకు మహాత్మ నీ ♦ కెఱుఁగవచ్చు. 1485

వ. అని దుఃఖార్ణవమగ్నం బయిన గోపకులంబు నుద్ధరింపుము రమానాథ యని గోపికలు వగచి తదనంతరంబ మఱియు నుద్ధవనిగదితం బయిన కృష్ణసందేశంబువలన విరహావేదనలు విడిచి యుద్ధవునిం బూజించి రిట్లు కృష్ణలీలావర్ణనలు సేయుచు వ్రేపల్లె నుద్ధవుండు గొన్ని నెల లుండి నందాదుల వీడ్కొని మరలి రథారూఢుండై చని చని. 1486

క. సారమతిఁ బ్రణుతి సేయుచు నారయ నుద్ధవుఁడు గాంచె ♦ నఘసంహారిన్
హారిన్ మథురానగర విహారిన్ రిపుజనమదాప ♦ హారిన్ శౌరిన్.

వ. కని యథోచితంబుగా సంభాషించుచుఁ దనచేత నందాదులు పుత్తెంచిన కానుకలు బలకృష్ణులకు నుగ్రసేనునికి వేఱు వేఱ యిచ్చె నని చెప్పి శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 1488

—♦ కృష్ణుం డుద్ధవునితోఁ జేరుకొని కుబ్జాగృహంబున కరుగుట. ♦—

మ. తను ము న్నంగజకేళిఁ గోరిన లతా ♦ తన్విన్ రతిక్రీడలం
దనుపం గోరి జనార్దనుం డరిగె [2]ర ♦ త్నస్వర్ణ మాల్యానులే
పన భూషాంబర ధూపదీపపరిదీ ♦ ప్తంబై [3]మనోజ్ఞప్రదీ
పనమై యున్న తదీయగేహమునకుం ♦ బంచేషు పంచేషుఁడై.

---

1. మాయింటి తగులు = మాయింటితోఁగల సంబంధము (మాతోడి ప్రేమబంధమని భావము) 2. రత్నస్వర్ణ......దీప్తంబై = రత్నయుతములగు బంగారు హారములు, మైపూతలు, నగలు, వస్త్రములు, సుగంధధూపములు, దీపములు మొదలగు వానితో నొప్పునది. 3. మనో......నము = కామోద్రేకముఁ బ్రేరేచునది.

వ. ఇట్లరిగి తద్గేహమధ్యంబున. 1490

ఆ. కాముశరము వోలెఁ ♦ గమలారికళ వోలె
మెలఁగి యాడ నేర్చు ♦ మెఱుపు వోలె
నిఖిల భువనమోహి ♦ నీదేవతయుఁ బోలెఁ
జెలువు మెఱసియున్న ♦ చెలువఁ గనియె. 1491

మ. హరి యేతెంచిన లేచి సంభ్రమముతో ♦ [1]నాళీసమూహంబుచే
సిరి యొప్పన్ విహితోపచారములు తాఁ ♦ జేయించి సౌవర్ణసుం
దరతల్పస్థితుఁ జేసి యుద్ధవుని ను ♦ ద్యత్ప్రీతిఁ బూజించి భా
సురపీఠంబున నుంచు మంచు మది నౌ ♦ త్సుక్యంబు శోభిల్లఁగన్.

క. ఆళీనివహానివేదిత మాలామృగనాభిపంక ♦ మణిమయభూషా
చేలాలంకృత యగుచును హేలావతి గోరె వనరు ♦ హేక్షణుఁ గవయన్.

క. [2]లీలావతీ కృతోల్లస దేలాకర్పూర మిళిత ♦ హితమధురమహా
హాలారసపానమద శ్రీలాలిత యగుచు నబల ♦ చేరెం గృష్ణున్.

మ. సరసాలోకనవృష్టి పైఁ గురియుచున్ ♦ సమ్యగ్వచో వైఖరిం
గరఁగం జేసి సువర్ణకంకణసము ♦ గ్రంబైన సైరంధ్రి కేల్
కరపద్మంబునఁ బట్టి తల్పమున కా ♦ కర్షించి గంభీరతం
బరిరంభాదుల [3]నాన వుచ్చి మను సం ♦ భావించుచున్ వేడుకన్.

ఉ. జాతియుఁ గాలముం గళయు ♦ సత్త్వము దేశము భావచేష్టలున్
ధాతువుఁ బ్రాయముం గుణముఁ ♦ దద్దశయున్ హృదయంబుఁ జూడ్కియుం
బ్రీతి విశేషముం దెలిసి ♦ పెక్కు విధంబులఁ దొయ్యలిన్ మనో
జాత సుఖంబులం దనిపె ♦ శౌరి వధూహృదయాపహారియై. 1496

క. కరపద్మంబుల మాధవుఁ గర మొప్పం గౌఁగిలించి ♦ కామానలముం
గరభోరువు వర్జించెను గర మసదని తోడి శీత ♦ కరముఖి లలరన్.

1. ఆళీసమూహము = చెలికత్తెలగుంపు. 2. లీలావతీ........లాలిత = చెలికత్తెలచేఁ దయారుచేయఁబడిన చక్కని యేలకులపొడితోఁ బచ్చకర్పూరముతో నొప్పి రుచికరము మధురము విలువకలదియు నైన సుర్యరసమును త్రాగుటచేఁ గలిగిన మదశోభచే నందమును బొందినది 3. నాన వుచ్చి = సిగ్గు తొలఁగించి.

మ. సనకాదుల్ దలపోసి కానని విభున్ ♦ సర్వప్రభున్ దుర్లభున్
మును దా నిచ్చిన [1]యంగరాగసుకృతా♦మోదంబునం గూడియున్
ఘననిర్వాణవిభూతి యిమ్మనక యా ♦ కంజాక్షి యేఁ బాయ జా
ల ననుం గొన్నిదినంబు లంగభవలీ ♦ లం దేల్పవే నావుడున్.

ఆ. వనిత గోరుకొనిన ♦ వర మిచ్చి మన్నించి
యుద్ధవుండు దాను ♦ నువిదయిల్లు
వెడలె శౌరి తియ్య ♦ విలుకాఁడు [2]సురభితోఁ
దీఁగెయిల్లు వెడలు ♦ తెఱఁగు మెఱయ. 1499

క. ఏ వేదంబులఁ గానని దేవోత్తముఁ గాంచి ముక్తి♦ తెరువడుగక రా
జీవేక్షణ రతి యడిగెను భావింపఁ దదీయకర్మ ♦ ఫల మెట్టిదియో.

క. కారుణ్యంబునఁ గృష్ణుఁడు తారుణ్యము మెఱసి మదన♦తంత్రంబుల లీ
లారణ్యవీథిఁ దేల్చెను [3]సైరంధ్రిన్ విభవవిజిత ♦ శక్రపురంధ్రిన్.

వ. తదనంతరంబ కృష్ణుం డుద్ధవరామసహితుండై హాస్తినాపురంబునకు నక్రూరునిం బనుపం దలంచి తద్గృహంబునకుం జనిన నతండు వారలం గని లేచి రామకృష్ణులకు నమస్కరించి యుద్ధవుం గౌఁగిలించుకొని వారి నందఱ యథావిధిం బూజించి హరిపాదంబులు దన తొడలమీఁద నిడుకొని యిట్లనియె. 1502

క. అనుచరులుఁ దానుఁ గంసుఁడు సనియెన్ నీచేత జనుని♦సదనంబునకున్
ఘనులార మీబలంబున నొనరఁగ యాదవులవంశ♦ముద్ధృతమయ్యెన్.

వ. మహాత్ములారా మీరు విశ్వాదిపురుషులరు విశ్వకారణులరు విశ్వమయుల రగు మీకుఁ గార్యకారణంబులు లే వవధరింపుము పరమేశ్వరా నీవు రజోగుణంబున నఖిలంబును సృజియించి కారణరూపంబునఁ [4]దదనుప్రవిష్టుండవై కృతదృష్ట కార్యరూప ప్రపంచాకారంబున దీపించు చుందువు కార్యరూపచరాచర దేహంబులకుం గారణంబులైన భూప్రముఖంబు లనుగతంబులై కార్యరూపదేహంబులు నై ప్రకాశించు చందంబున నొక్కరుండవు కారణరహితుండవు

---

1. అంగరా......బునన్ = కలపమిచ్చిన పున్నెపు వాసనచే 2. సురభితో - వసంతునితో. 3. సైరంధ్రిన్ - ఒకరకమైన దాసిని. 4 తదనుప్రవిష్టుండవు = ఆ సృష్టి యందుఁ బ్రవేశించినవాఁడవు.

[1]నాత్మతంత్రుండవ్వనై యుండియు విశ్వాకారంబునఁ బెక్కగుదువు సృష్టిస్థితిలయంబులం జేయుచుండియు విజ్ఞానమూర్తి వగుటం బరిభ్రాంతుం డైన జీవునిభంగి గుణకర్మబద్ధుండవుగావు, కావున సిద్ధంబు తన్నిమిత్తంబున బంధహేతువును సిద్ధింపదు.

సీ. పరఁగ జీవుని నైన • బంధమోక్షము లంట
వంటునే పరతత్త్వ • మైన నిన్ను
నంటునె యీశ! దే • హాద్యుపాధులు నని
ర్వాచనీయములు గాన • వరుస నీకు
జన్మంబు జన్మసం • శ్రయభేదమును లేవు
కావున బంధమో • క్షములు లేవు
గణుతింప నిన్నులూ • ఖలబద్ధుఁ డనుటయు
[2]నహిముక్తుఁ డనుటయు • నస్మదీయ

ఆ. బాలబుద్ధిగాదె • పాషండముఖరమార్గములచేత నీజ • గద్ధితార్థ
మైన వేదమార్గ • మడఁగిపో వచ్చిన నవతరించి నిలుపు • దంబుజాక్ష.

క. ఆ నీవు ధరణిభారము మానిచి రక్కసుల నెల్ల • మర్దించుటకై
[3]యానకదుందుభియింటను మానుగ జన్మించితివి • సముంచితకీర్తిన్.

మ. [4]త్రిజగత్పావనపాదతోయములచే • దీపించి వేదామర
ద్విజముఖ్యాకృతి వైన నీవు కరుణన్ • విచ్చేయుటం జేసి మా
నిజగేహంబులు ధన్యతం దనరెడిన్ • నిన్నార్యు లర్చింపఁగా
[5]నజితత్వంబులు వారి కిత్తు వనుకం • పాయత్తచిత్తుండవై.

శా. ఏ పుణ్యాతిశయప్రభావముననో • యీజన్మమం దిక్కడన్
నీ పాదంబులు గంటి నిన్నెఱిఁగితిన్ • నీవుం గృపాళుండవై
నాపై నక్కఱఁ జేసి మాన్పఁగదవే • నానాధనాగారకాం
తాపుత్త్రాదులతోడి బంధనము భ • క్తవ్రాతచింతామణీ.

---

1. ఆత్మతంత్రుండవు = నీయంతట నీవే ప్రవర్తించువాఁడవు. 2. అహిముక్తుఁడు = సర్పముచే (కాళియునిచే) విడువఁబడినవాఁడు. 3. ఆనకదుందుభి = వసుదేవుఁడు 4. త్రిజగత్......తోయములచే = మూఁడు లోకములఁ బవిత్ర మొనరించు పాదజలములచే (నీ పాదములనుండి పుట్టిన గంగ మూఁడులోకములను బవిత్ర మొనరించుచున్నదని భావము). 5. అజితత్వము = ఓటమి లేకుండుట.

—♦ శ్రీకృష్ణుం డక్రూరుని పాండవవృత్తాంతము దెలియ
హాస్తినాపురంబునకుఁ బంపుట ♦—

వ. అని పలికిన నగుచు నక్రూరునికి మాటలవలన సంసారబంధం బగు మోహంబుఁ గీలుకొలుప్రచు హరి యిట్లనియె. 1509

క. బంధుండవు [1]సద్యోహిత సంధుండవు వావిఁజూడ♦జనకుఁడవు గృపా
సింధుండ వెల్లగుణముల నంధుండవు గావు బ్రోవ♦నర్హుఁడ వెందున్.

చ. కొలుతురు మర్త్యు లిష్టములు ♦ గోరి శిలామయ దేవసంఘముల్
జలమయ తీర్థసంఘమును ♦ సంతతము న్నటువారు గొల్వఁగా
వలదనరాదుగాక భగ ♦ వత్పదభక్తులరైన మీ క్రియన్
[2]సొలయక దేవతీర్థములు ♦ చూచినయంతనె కోర్కు లిచ్చునే.

వ. మహాత్మా పరమభాగవతుండవైన నీవు మా కభీష్టంబు లొందింప నర్హుండవు వినుము పాండురాజు పరలోకగతుండైనఁ గుంతీసహితు లైన పాండవులు ధృతరాష్ట్రశాసనంబున నేతెంచి కరిపురంబున నున్నవారఁట నిజపుత్రమోహితుండగు నయ్యంధనృపతి వారియందు సమత్వంబునం జరింపం డటు గావున. 1512

క. వారలు బంధులు గావున వారలకును మేలొనర్చి ♦ వార్తలరంగా
వారింపవలయు దుస్థితి వారిజరిపువంశ ప్రముఖ్య ♦ వారిం జూడన్.

వ. అని పలికి సంకర్షణోద్ధవసహితుండై హరి నిజగృహంబునకుం జను టయు నక్రూరుండు గౌరవరాజధాని యగు కరిపురి కరిగి యందు ధృతరాష్ట్ర భీష్మ విదుర బాహ్లిక భారద్వాజ గౌతమ దుర్యోధన కర్ణాశ్వత్థామాదులం గుంతీసహితులైన పాండవులం దక్కిన బాంధవు లనుం గని యథోచితసత్కారంబులు నంది తద్వర్తనంబు లెఱింగి కొనుచుఁ గొన్నిదినంబు లుండ నొక్కనాఁడు విదురుండు విన నేక తంబున నక్రూరునికిం గుంతి యిట్లనియె. 1514

శా. అన్నా తల్లులు దండ్రులున్ భగినులు ♦ న్నల్లుండ్రు మద్భ్రాతలున్
నిన్నుం బొమ్మనువేళ నే మనిరి మా ♦ [3]నెవ్వల్ విచారింతురే

1. సద్యోహిత సంధుండవు = వెంటనే మేలుగూర్చువాఁడవు. 2. సొలయక = విముఖత నొందక. 3. నెవ్వల్ = ఆపదలు.

యున్నారా సుఖయుక్తులై మృగి [1]వృక • వ్యూహంబులో నున్న రే
ఖ న్నె నిక్కడ నున్నదానఁ గుమనః • కౌరవ్యమధ్యంబునన్.

మ. కఱపించెన్ ఫణికోటిచే లతికలం • గట్టించి గంగానదిన్
నెఱిఁ ద్రోపించె విషాన్నితాన్న మొసఁగెన్ • నిద్రారతిం జెంది యే
మఱి యుండం బొడిపించె సాయకములన్ • మత్పుత్త్రులం దేమియుం
గొఱగాఁ డీధృతరాష్ట్రసూనుఁడు మహా • క్రూరుండు కార్యంబులన్.

మ. బలుఁడుం గృష్ణుఁడు నెన్నఁడైనఁ దమలో • భాషించి మేనత్త బి
డ్డలకున్ మేలు దలంతురే [2]వగపులన్ • డయ్యంగఁ బాలయ్యెనే
జలజాతాక్షుఁడు భక్తవత్సలుఁ డీలా • చక్రంబు భాగించి యి
మ్ముల నిప్పించునె నాకుమారకులకున్ • ముఖ్యప్రకారంబునన్.

వ. అని పలికి కృష్ణునిఁ జిత్తంబున నిల్పి నమస్కరించి సంకీర్తనంబు సేసి సర్వాత్మక సర్వపాలక పుండరీకాక్ష శరణాగత నైన నన్ను రక్షింపు మని వగచుచున్న కుంతికి నక్రూరుండు విదురసమేతుండై ప్రియవచనంబుల దుఃఖోపశమనంబు సేసి వీడ్కొని బంధుమిత్త్ర మధ్యంబున సుఖోపవిష్టుం డై యున్న ధృతరాష్ట్రున కిట్లనియె. 1518

—• అక్రూరుండు ధృతరాష్ట్రునితో హితోపదేశముగా సంభాషించుట. •—

ఉ. నీ యనుజుండు పాండు ధర • ణీ విభుఁ డీల్గిన నీవు భూమి ధ
ర్మాయతబుద్ధి నేలుచుఁ బ్ర • జావళిఁ గాచుచు గౌరవంబుతోఁ
బాయక లోకులందు సమ • భావన చేసితి వేని కీర్తియున్
శ్రేయముగల్గు వే ఱొకటి • సేసిన దుర్గతి గల్గు భూవరా.

సీ. అవనీశ పాండవు • లందు నీ నందను
లందు సమానుండ • వగుట బుద్ధి
యెవ్వనితో యోగ • మిం దెవ్వనికి నిత్య
మంగనాగార పు • త్త్రాదికముల

1. వృకవ్యూహంబులో = తోడేళ్ళగుంపులో. 2. వగపులన్ డయ్యంగఁ బాలయ్యెనే = విచారముచే కృశింప వలసెనే ?

వలన నయ్యెడిదేమి ♦ వసుమతి నొకజంతు
వు నయుంగ నొకజంతు ♦ వుక్కడంగు
నొకఁడు పుణ్యముఁ జెంద ♦ నొకఁడు పాపము నొందు
[1]మీనజీవనభూత ♦ మిళితజలము

ఆ. తత్తనూజు లెట్లు ♦ ద్రావుమ రట్లు మహా
ఘాత్మవిత్త మెల్ల ♦ నపహరింతు
రహితులైన కొడుకు ♦ లటుమీఁద మసియైనఁ
జచ్చియైనఁ దండ్రి ♦ జాడఁ జనరు. 1520

క. కావున మూఢాత్ముఁడవై నీ వార్జించిన ధనంబు ♦ నీ పుత్త్రులు దు
ర్భావులుపుచ్చుకొనంగా భూవర నిందితుఁడవగుదు♦భూనాకములన్.

శా. నిందం బొందకు మయ్య యీ తనువు దా ♦ నిద్రాకళాదృష్టవ
సందోహంబు విధంబు నిల్వదు సుమీ ♦ జాత్యంధతం బొందియున్
[2]మందప్రజ్ఞత లేల చేసెదవె స ♦ మ్యజ్ఞానచక్షుండ వై
సందేహింపక యిమ్ము పాండవులకున్ ♦ సర్వాంశహాః భాగమున్.

వ. అనిన ధృతరాష్ట్రుం డి ట్లనియె. 1522

సీ. నీమాట మంచిది ♦ నిశ్చయ మగు నైన
నస్థిరం బైన నా ♦ యంతరంగ
మందు నిల్వదు [3]సుదా ♦ మాచలస్ఫటిక శి
లాతలోద్యత్తటి ♦ ల్లతికభంగి
నమృతంబు నొందియు ♦ నానందితుఁడు గాని
నరుమాడ్కి నేను నా ♦ నంద మొంద
నీశ్వరాజ్ఞాపథ ♦ మెవ్వఁడు దప్పింప
నోపు విజ్ఞానియై ♦ యుండి యైన

ఆ. విశ్వమెల్లఁ జేసి ♦ విభజించి గుణముల
నెవ్వఁ డనుసరించె ♦ నెవ్వఁ డవని

1. మీనజీ......జలము = చేపలకు జీవనాధారమై కూడిననీరు. 2. మంద ప్రజ్ఞతలు = తెలివిమాలిన పనులు. 3. సుదామా......లతికభంగి = సుదామ పర్వతము మీఁది స్ఫటికపురాతిపైఁ బుట్టిన మెఱపువోలె.

భార మెల్లఁ బాయఁ ♦ బ్రభవించె దేవకి
కెవ్వఁ డాత్మతంత్రుఁ ♦ డీశ్వరుండు. 1523

వ. అట్టి కృష్ణునకు నమస్కరించెదఁ దచ్చిత్తంబునం గల తెఱం గగునని వీడ్కొలిపిన నక్రూరుం డతనితలం పెఱింగి యిట్లనియె నీతలంపుఁ గనుంగొంటి నీకిష్టంబగునట్లు వర్తింపుమని పలికి మరలి మధురకుం జనుదెంచి తదీయ వృత్తాంతంబు రామకృష్ణుల కెఱింగించె.

వ. అంతఁ గంసభార్యలగు నస్తియుఁ బ్రాప్తియు విధవలై దుఃఖించుచుం దమతండ్రియైన జరాసంధు నగరంబునకుం జని. 1525

శా. వాంఛక్ పీంద్రుఁడను రాజులే యనుచు గ ♦ ర్వప్రౌఢితో యాదవుల్
వేండ్రంబైన బలంబుతో మధురకున్ ♦ వే వచ్చి నిష్కారణం
బాంధ్రున్ బిడ్డలు బంధులున్ వగవఁ గం ♦ సాదిక్షమానాథులం
దండ్రీ చంపిరి కృష్ణుచేత నిటు లై ♦ ఘవ్యంబు వచ్చెంజుమీ. 1526

వ. అనిన విని ప్రళయకాలానలంబు తెఱంగున మండిపడి శోక రోషంబులు బంధురంబులుగా జరాసంధుం డిట్లనియె. 1527

శా. ఏమీ కంసునిఁ గృష్ణుఁడే రణములో ♦ హింసించె [1]నోచెల్ల నా
సామర్థ్యంబు దలంపఁ డించుకయు [2]ఉ ♦ చ్చండప్రతాపానలో
ద్దామార్చుల్ వడి నేఁడు గాల్చు యదు సం ♦ తానాటవీవాటికన్
భూమిం గ్రుంగిన మింటఁ దాఁగిన మహాం ♦ భోరాశిలోఁ జొచ్చినన్.

క. యాదవవిరహిత యగుఁ బో మేదిని నాచేత నేఁడు ♦ మీఁదు మిగిలి సం
పాదితబలులై హరి రు ద్రాదులు నింద్రాదు లెవ్వ ♦ రడ్డంబైనన్.

—♦ జరాసంధుండు మధురమీఁద దండెత్తివచ్చి కృష్ణునితో యుద్ధము చేయుట ♦—

వ. అని పలికి సమరసన్నాహ సంకులంబగు చిత్తంబునఁ గోపంబు దీపింప సంగరభేరి వ్రేయించి కదలి. 1530

క. దక్షుండై యిరువదిమూఁ [3]డక్షౌహిణులైన బలము ♦ లనుగతములుగా
నాక్షణమ జరాసంధుఁడు ప్రక్షోభముతోడ మధుర ♦ పైఁ జనియెన్నృపా.

---

1. ఓ చెల్ల = ఔరా! (ఆశ్చర్యార్థకము.) 2. ఉచ్చండ.....మార్చుల్ = తీవ్రమైన నా కోపాగ్నిజ్వాలలు. అక్షౌహిణి = రథములు 21870, గజములు 21870, అశ్వములు 65610, కాల్బంట్లు 109350 గల సేనాసమూహము.

క. [1]గంధేభతురగరథభట బంధురచరణోద్ధతోగ్ర ♦ పాంసుపటలయో
గాంధీభూతములై దివి మంథరగతినడచెఁ జంద్రము ♦ మార్తాండహరుల్.

వ. ఇట్లు చని నిరంతరకిసలయపత్ర [2]కోరక కుసుమఫలభారవినమిత వృక్ష విలసిత మహోద్యానంబును నుద్యానవనభాగవలమాన [3]జలోన్నయన దారుయంత్ర లతానిబద్ధకలశ విముక్త సలిలధారాశీకర పరంపరాసంపాదిత వర్షాకాలంబును గాలకింకర సదృశ వీరభట రథ తురగ సామజ సంకులంబును సదాచార ధర్మ ప్రవీణ పౌరజన భాసురంబును సురాభేద్యమాన మహోన్నత [4]అట్టాలక యంత్ర భయంకర ప్రాకార చక్రంబును చక్రసారస హంసాది కలకలారావకలితసరోవరంబులు సరోవరసంఫుల్ల [5]హల్లక కమలపరిమళమిళిత పవనవిరాజితంబును జితానేకమండలేశ్వర భూషణ మణిగణరజోనివారిత మదగజేంద్ర మదానజల ప్రభూతపంకంబును బంకరహిత యాదవేంద్ర దత్త సువర్ణాచల కల్పతరు కామధేను సమ్మర్దిత విద్వజ్జన నికేతనంబును కేతన సన్నిబద్ధ చామర చామీకర చాపశింజినీ నినద పరిపూరితాభ్రంబును నభ్రలిహ మహాప్రాసాదసౌధగవాక్ష రంధ్ర నిర్గత [6]ఘనశార ధూమ ధూమపటల విలోకన సంజనిత జలధర భ్రాంతి విభ్రాంత శిఖండితాండవ రుచిరంబును జరతరానేక దేవాలయ [7]జోఘుష్యమాణ తూర్య నినద పరిభావిత పారావార కల్లోల ఘోషంబును ఘోష కామినీ ప్రాణవల్లభ బాహుదండ పరిరక్షితంబునై పరులకు నలక్షితంబైన మధురానగరంబు చేరఁ వేలాలంఘనంబు చేసి వెల్లివిరిసిన మహార్ణవంబు తెఱంగునఁ బట్టణంబునకు ముట్టణంబు చేసి చుట్టునువిడిసిన జరాసంధుని [8]వేలంబులఁ గనుంగొని వేలావిదుండగు హరి తన మనంబున. 1533

1. గంధేభ......ధీభూతములు = మదపుటేనుఁగుల గుఱ్ఱముల రథముల వీరభటుల త్రొక్కుడిచే నెగసిన భయంకరమును దట్టమునైన ధూళిసముదాయముచే 2. కోరకములు = మొగ్గలు. 3. జలోన్నయనదారుయంత్రము = ఏతాము. 4. అట్టాలకము = కోటబురుజు. 5. హల్లకములు = ఎఱ్ఱగలువలు. 6. ఘనశారము (పా) ఘనసారము = కర్పూరము. 7. జోఘుష్యమాణ = మోగింపఁబడుచున్న. 8. వేలంబులు = శిబిరములు.

మ. [1]ఐదు న్నాలుగు నాలు రెండు నిరు మూఁ ♦ డక్షౌహిణుల్ సుట్టి సం
ఛాదించెం బుర మెల్ల మాగధునెడన్ ♦ సామంబు దానంబు సం
భేదంబుం బని లేదు దండవిధి శో ♦ భిల్లం బ్రయోగించి యీ
భూదేవీవర భార మెల్ల నుడుపం ♦ బోలున్ జయోద్భాసినై.

క. ఏ నవతరించు టెల్లను
మానుగఁ జతురంతధరణి ♦ మండలభరమున్
మానుపుకొఱకుం గాదే
పూనెద నిది మొదలు దగిలి ♦ భూభర ముడుపన్. 1535

ఆ. మగధనాథుఁ బోర ♦ మడియింపఁ బోలదు
మడియ కున్న పేఁడు ♦ మరలి మరలి
బలముఁ గూర్చుకొనుచుఁ ♦ బఱ తెంచుఁ బఱతేరఁ
ద్రుంప వచ్చు నేల ♦ దొసఁగు దొలఁగ. 1536

వ. అని యిట్లు తలపోయు చున్న సమయంబున నభోభాగంబున నుండి మహాప్రభాసమేతంబులును [2]నపరిచ్ఛదసూతంబులును ననేక బాణ బాణాసనచక్రాది వివిధాయుధోపేతంబులు నయిన రథంబులు రెండు మనోరథంబులు పల్లవింప దైవయోగంబునఁ జేర వచ్చినం జూచి హరి సంకర్షణున కిట్లనియె. 1537

శా. కంటే రామ రథంబు లాయుధములున్ ♦ గాఢప్రకాశంబులై
మింటన్ వచ్చెను వీనిఁ గైకొని సురల్ ♦ మెచ్చన్ నృపశ్రేణులన్
[3]బంటింపం బనిలేదు చంపుము ధరా ♦ భారంబు వారింపు మీ
వెంటన్ నీ యవతారమున్ సఫలమౌ ♦ వే వేగ లె మ్మాజికిన్.

వ. అని పలికి.

క. ఖరులై దృఢకవచధనుశ్శరులై యధిగతరథోను ♦ చరులై మదవ
త్కరులై ఘనహరులై బల హరు లయ్యెడ నాజి కేఁగి♦రతిభీకరులై.

వ. ఇట్లు సమరసన్నాహంబునం బురంబు వెడలి. 1541

1. ఐదున్నా........హిణుల్ = ఇరువదిమూఁడక్షౌహిణులు. 2. అపరిచ్ఛదసూతంబులు = సారథులు లేనివి. 3. పంటించుట = జాగుచేయుట.

ఉ. అన్యులు తల్లడిల్ల దను ♦ జాంతకుఁ డొత్తె [1] గభీరఘోష కా
రిన్యమహాప్రభావ విక ♦ టీకృత పద్మభవాండజంతు చై
తన్యము ధన్యమున్ దివిజ ♦ తాపసమాన్యముఁ బ్రేతభర్త రా
జన్యము భీతదుశ్చరిత ♦ శాత్రవసైన్యముఁ బాంచజన్యమున్.

క. సింధుర భంజనపూరిత బంధురతర శంఖనినద ♦ భారమున జరా
సంధునికిం గల సైన్యము లంధములై సంచలించె ♦ నాహవ భూమిన్.

వ. అయ్యవసరంబున మాగధుండు మాధవున కిట్లనియె. 1544

సీ. అదలించి రొప్పంగ ♦ నాలమందలు గావు
గంధ గజేంద్ర సం ♦ ఘములు గాని
పరికించి వినఁగ నం ♦ భారవంబులు గావు
వాజీంద్ర హేషార ♦ వములు గాని
పదహతిఁ గూల్పంగఁ ♦ బ్రాఁతబండ్లివి గావు
నగసమానస్యంద ♦ నములు గాని
ప్రియము లాడంగ నా ♦ భీరలోకము గాదు
కాలాభవైరి వ ♦ ర్గంబు గాని

తే. యార్ప వనవహ్ని గాదు బా ♦ ణాగ్ని గాని
[2]మురియ బృందావనము గాదు ♦ మొనలు గాని
యమున గాదు నటింప ఘో ♦ రాజి గాని
పోరు నీ కేల గోపాల ♦ పొమ్ము పొమ్ము. 1545

మ. తరుణిం జంపుటయో బకున్ గెడపుటో ♦ ధాత్రీజముల్ గూల్చుటో
ఖరముం ద్రుంచుటయో ఫణిం బఱపుటో ♦ గాలి న్నిబంధించుటో
గిరిహస్తంబునఁ దాల్చుటో [3]లయ మహో ♦ గ్ని స్ఫారమర్యాద దు
ర్భర బాణాహతి నెట్లు నిల్చెదవు స ♦ ప్రాణుండవై గోపకా. 1546

వ. అదియునుం గాక. 1547

1. గభీరఘో........జయచైతన్య = కఠినమైన పెద్దధ్వనిచేఁ జెదరఁ గొట్టఁబడిన లోకములోని ప్రాణుల జ్ఞానము గలది 2. మురియన్ = సంచరించుటకు. 3. లయమహాగ్ని......ణాహతిన్ = ప్రళయకాలాగ్నివలె మిక్కిలి వారింపరాని, భరింపరాని బాణముల దెబ్బచేత.

సీ. గోపికావల్లకీ ♦ ఘోషణంబులు గావు
శింజినీ రవములు ♦ చెవుడు పఱుచు
వల్లవీకరముక్త ♦ వారిధారలు గావు
శరవృష్టిధారలు ♦ చక్క సేయు
ఘోషాంగనాపాంగ ♦ కుటిలాహతులు గావు
నిశితాసి నిహతులు ♦ నిగ్రహించు
నాభీరకామినీ ♦ హస్తాబ్జములు గావు
ముష్టిఘాతంబులు ♦ మురువుడించు
తే. నల్ల వ్రేపల్లె గాదు [1]ఘో ♦ రావనీశ
మకర సంఘాత సంపూర్ణ ♦ మగధరాజ
వాహినీసాగరం బిది ♦ వనజనేత్ర
నెఱసి నిను దీవిక్రైవడి ♦ నేఁడు ముంచు. 1548

వ. అనిన శ్రీహరి యిట్లనియె. 1549

ఉ. పంతము లేల తొల్లి జన ♦ పాలురఁ బోరులఁ గెల్చినాఁడ వం
ద్రంతియ చాలదే బిరుదు ♦ లాడుట బంటుతనంబు త్రోవయే
యింతటఁ దీఱెనే మగధ ♦ మేటికిఁ బ్రేలెదు నీవ యేల క
ల్పాంతమహోగ్రపావకుని ♦ నైన హరింతు వరింతు సంపదన్.

క. గోపాలుఁడ వని పలికితి భూపాలక దీన నేమి ♦ పోరాడంగా
గోపాల మహీపాల వ్యాపారాంతరము దెలియ ♦ వచ్చుం బిదపన్.

వ. అనిన రోషబంధురుండై జరాసంధుం డిట్లనియె. 1552

ఉ. బాలుఁడ వీవు కృష్ణ బల ♦ భద్రునిఁ బంపు రణంబుసేయ గో
పాలకబాలుతోఁడ జన ♦ పాల శిఖామణి యైన మాగధుం
డాలము సేసె నంచు జను ♦ లాడెడి మాటకు సిగ్గు పుట్టెడిం
జాలుఁ దొలంగు దవ్వుశర ♦ జాలుర మమ్ము జయింపవచ్చునే.

వ. అనిన నగధరుం డిట్లనియె. 1554

1. ఘోరావనీశ...సాగరంబు = భయంకరులైన రాజు లనెడి మొసళ్ళగుంపుతోఁ గూడిన జరాసంధుని సేవ యనెడు సముద్రము.

క. పొగడుకొనుదు రేశూరులు మగఁటిమిఁ జూపుదురు గాక ♦ మాగధ నీకున్
మగతనము గలిగెనేనియుఁ దగు మానుము [1]వికత్థనములు ♦ దగవే పోరన్

వ. అనిన రోషించి. 1556

చ. పవనుఁడు మేఘరేణువుల ♦ [2]భానుకృశానులఁ గప్పుకైవడిన్
వివిధబలౌఘముం బనిచి ♦ వేగమ మాగధుఁ డావరించె [3]భూ
మ్యవనచరిష్ణులన్ గుణిమ ♦ తావనినాథనిరాకరిష్ణులన్
దివిషదలంకరిష్ణుల న ♦ తిస్థిరజిష్ణుల రామకృష్ణులన్. 1557

మ. హయహేషల్ గజబృంహితంబులు రథాం ♦ గారావముల్ శింజినీ
చయటంకారములున్ వివర్తితగదా ♦ చక్రాస్త్రనాదంబులున్
జయశబ్దంబులు భేరిభాంకృతులు ని ♦ స్సాణాదిఘోషంబులున్
భయదప్రక్రియ నొక్కపెట్ట నెగసెన్ ♦ బ్రహ్మాండభేదంబుగన్.

వ. మఱియు నయ్యెడ మాగధ మాధవ వాహినులు రెండు నొండొంటిం
దాఁకి రౌద్రంబున[4] సంవర్తసమయసముద్రంబులభంగి నింగికిం బొంగి
చెలంగి చలంబునం దలపడి పోరునెడ మసరు కవిసి మహారణ్యంబులు
వెలువడి మార్కొను మదగజంబులమాడ్కిని మహోత్కంఠంబు
లగు కంఠీరవంబుల తెఱంగున దుర్లభంబు లగు శరంబుల చాడ్పు
నం బ్రచండంబు లగు గండభేరుండంబుల గమనికం దమ తమ
మొనలకుం దలకడచి వీరరసంబు విషధరస్వాపంబులైన విధంబునం
బదుగురు నూర్వురు వేవురు గములై కులకుధర గుహాంతరాళంబులు
నిండ సింహనాదంబు లొనర్చుచు నార్చుచు నట్టహాసంబు సేయుచు
నరివీరుల రోయుచుఁ బటహ కాహళ భేరీ శంఖశబ్దంబులకు నుబ్బుచు
గర్వంబునం బ్రబ్బుచు గదల వ్రేయుచుఁ గాడంబుల నేయుచు
ముద్గరంబుల నొత్తుచు ముసలంబుల మొత్తుచు గుంతంబుల గ్రుచ్చి
యెత్తుచుఁ గరవాలంబులఁ ద్రెంచుచుఁ జక్రంబులం ద్రుంచుచు
శస్త్రంబులం దఱుగుచుఁ జిత్రంబుగఁ దిరుగుచు పరిఘంబులఁ
ద్రిప్పికొట్టుచుఁ బ్రాసంబులం బెట్టుచు శూలంబులఁ జిమ్ముచు

1. వికత్థనములు = పొగడికొనుటలు 2. భానుకృశానులన్ = సూర్యాగ్నులను. 3. భూమ్యవనచరిష్ణులన్ = భూరక్షణార్థమై చరించువారిని. 4. సంవర్త సమయము = ప్రళయ కాలము.

సురియలఁ గ్రుమ్మచు బహుభంగులఁ బరాక్రమించు వీరభటులును ¹నిబిడనీరంధ్రనేమినిర్ఘోషంబుల నాకాశంబు నిరవకాశంబుగ ననర్గళ చక్రమార్గంబులం బడు పదాతులు చదియ నరదంబులు దోలి వివిధా యుధప్రయోగంబుల వైరుల వ్రచ్చి చించఁజెండ వందఱలాడు రథికులును రథికశర పరంపరలఁ గంపింపక మహామోఘ మేఘధారలకుఁ జలింపని ధరణీధరంబుల ఛాప్పన రథంబులకుం గవిసి కల్పాంత కాల దండిగండ ప్రచండంబులగు శుండాదండంబులు సాఁచి పూఁచి కడనొగ లాడిసి తిగిచి కుదిచి విఱిచి ²కూబరములు నుఱుములుగఁ జిఱజిఱం ద్రిప్పివైచియు భటులఁ జటులగతిం బంతులక్రియ నెగుర వైచి దంతంబులఁ గ్రుచ్చియు ఘోటకంబుల వ్రచ్చియు విచ్చల విడిం దిరుగు కరులును వజ్రవజ్రధారలకుం దప్పి ³కకుప్పులకు నెగయు ఱెక్కలుగల గిరులకరణిం ⁴బక్కెలనతోడ హేషారవ భీషణంబులై మనోజవంబులగు తురంగంబులం బఱపి తురంగ పదపాంసుపటల ప్రభూత *బహులాంధకారంబులు గరకలితకఠోర ఖడ్గ మరీచిజాలంబుల నివారించుచు నానా ప్రకారంబులం బ్రతి వ్యూహంబులం జించి చెండాడు రాహుత్తులుం గలిగి ⁵సంగ్రామంబు భీమం బయ్యె నందు.

క. చెదురథములు దెగుహయులును
బడుకరులును మడియు భటులఁ ♦ బఱచు రుధిరమున్
మడియు తల లొఱఁగు తనువులు
పొడియగు తొడవులును మధుని ♦ పురిదెసఁ గలిగెన్. 1560

క. భీతంబై హత సుభట వ్రాతంబై భగ్నతరగ ♦ వారణ రథ సం
ఘాతంబై ⁶విజయ శ్రీ పీతంబై యదుబలంబు ♦ విఱిగె నరేంద్రా.

శా. యోధాగ్రేసరుఁ డీ హలాయుధుఁడు లో♦కోత్కృష్టబాహాబల
శ్రీధౌరేయుఁడు కృష్ణుఁ డిట్టి ఘనులన్ ♦ జిత్రంబు నేఁ డిట్లు సం

1. నిబిడ.....షంబులన్ = మిక్కిలి యెడతెగని పట్టాల-చప్పుళ్లచే, 2. కూబరములు = బండినొగలు. 3. కకుప్పులకు = దిక్కులకు. 4. పక్కెరలతోడన్ = గుఱ్ఱములకుఁ దొడుగు సంగీలతో. 5. రాహుత్తులు = గుఱ్ఱపు రౌతులు, 6 విజయశ్రీ పీతము = జయలక్ష్మిచే విడువఁ బడినది,

రోధించెన్ బలముం దెరల్చి మగధేం ♦ ద్రుండంచు నీక్షించుచున్
సౌధాగ్రంబులఁ బౌరకాంతలు మహా ♦ సంతప్తలై రెంతయున్.

వ. ఇట్లు తన మొనలు విఱిగిపాఱినం గనుంగొని సమరసంరంభంబున హరి విశ్వంభరాభరణ వేదండ శుండాభంబులగు బాహుదండంబులు పెంచి విజృంభించి బ్రహ్మాండ కుహరకుంభ పరిస్ఫోటనంబగు పాంచజన్యనినదంబు నిబిడ నిర్ఘాత శబ్దంబుగా నుదంచిత పింఛ దామంబు సంక్రందన చాపంబుగాఁ బ్రశస్త హస్తలాఘవంబున శరాకర్షణ సంధాన మోక్షణంబు లేర్పడక నిర్వక్ర చక్రాకారంబుతోడ మార్తాండ మండల ప్రభాప్రచండంబగు శార్ఙ్గకోదండంబు క్రొమ్మెఱుంగుగా దిగ్గజేంద్రకర భీషణంబులగు గుణఘోషణంబులు ఘుమఘుమారావదుస్సహంబులయిన గర్జనంబులుగా [1]రథతురంగమ రింఖాసముద్ధూత పరాగపటల పరంపరాసంపాదిత పుంజీభూతంబగు పెంజీకటి యిరులుగా ససమ సమర సన్నాహ చాతురీ విశేషంబులకుం జొక్కి నిక్కి కరంబులెత్తి నర్తనంబులం బ్రవర్తించు నారద హస్త విన్యాసంబులు లీలా తాండవ మండిత మహోత్కంఠంబులగు నీలకంఠంబులుగా సుందర స్యందననేమినిర్ఘోషభీతు లయి కుంభికుంభంబులపై వ్రాలు వీరులు మత్తమయూర కేకారవచకితులై యువతి కుచకుంభముల మీఁద వ్రాలెడు కాముకులుగా నానానరేంద్ర రక్తపిపాసాపరవశంబులై వాచఱచుచున్న భూతవ్రాతంబులు వర్షవర్షేతి నిస్వనంబు లొసంగు చాతకంబులుగా నభంగసంగరప్రేరకుం డగు హలాయుధండు వృష్టికారణం బగు మందసమీరణంబుగా ననల్పకల్పాంత కాల [2]నీలవలాహకంబుభాతిం బరఁగు మేనిచాయతోడం దోయజనాభుం డరాతిచతురంగ దేహక్షేత్రంబులం బుంఖానుపుంఖంబులుగ ససంఖ్యాత బహువిధ దివ్య బాణవర్షంబులు గురియునెడ శస్త్రాస్త్రపరంపరా సంఘట్టనజనితంబులగు మిడుఁగుఱులు వర్షాకాలవిహితవిద్యోతమాన [3]ఖద్యోతంబులుగా విశిఖవికీర్ణ వీరకోటీరఘటిత పద్మరాగ శక

---

1. రథతురంగ......జీభూతంబు = రథాశ్వముల డెక్కలచే నెగురఁ గొట్టఁబడిన ధూళి సముదాయముచేఁ బుట్టింపఁబడి మొత్తములుగాఁ గూడుచున్నది. 2. నీలవలాహకంబు = కారుమబ్బు. 3. ఖద్యోతంబులు = మెరుగుడు పురుగులు.

లంబు [1]లింద్రగోపంబులుగా మహితమార్గణవిదళితమత్తమాతంగ కుంభముక్తామౌక్తికంబులు వడగండ్లుగాఁ జటులార్ధచంద్రశరచ్ఛిన్న చరణంబు లయి కృష్ణ కృష్ణ నిలునిలుమని పలుకుచుం గూలెడు మేనులు [2]కృషీవలకర పరశుధారావిదళిత మహీజవిశాలసాలంబులుగా భాసుర భల్లభగ్నంబు లగు ననవరతహుంకారంబులవలన మల్లెడు దంతపుంజంబులు మాలతీకుసుమమంజరులుగా నవ్యనారాచభిన్న దేహంబులయి దిగ్గనఁ గ్రొగ్గండ్లవలన వెడలు రక్తస్యందసందోహంబులతో సంచరింపక ప్రాణంబులు విడుచుచు కుండాలంబులు సెలయేఱులతోడి కొండలుగాఁ గఠోరకాండ ఖండితంబు లయిన భుజాదండంబులతోడఁ గలసి పడిన వజ్రమయకంకణాభరణంబులు భోగిభోగసమేత కేతకీ సుమంబులుగాఁ బ్రళయార్కమండలోజ్జ్వలప్రసన్నిభంబు లయిన భేరీరవంబులు భేకరభేకనికాయరవంబులుగా దారుణశోణితపంకిలూన వాహ వారణమనుజ మస్తిష్కంబు రొంపియునై సొంపు మెఱయ నాభీలకీలాల ప్రవాహంబులు ప్రవహించె, నందు భుజంబులు భుజంగంబులుగను గపాలంబులు కమఠంబులుగను శిరోజంబులు శైవాలంబులుగను గరంబులు మీనంబులుగను హయంబులు నక్రంబులుగను గజంబులు దీవులుగను ధవళచ్ఛత్రంబులు నురువులుగను జామరంబులు కలహంసంబులుగను భూషణరత్న రేణురాసులు పులినంబులుగ నై యొప్పె నప్పుడు. 1563

**లయవిభాతి.** హసితహరినీలనిభ ♦ వసనము విశాలకటి ♦
[3]నసమనయనాద్రిపరి ♦ లసిత మగు మేఘో
ల్లసనము వహింపఁ గర ♦ కిసలయము హేమమణి ♦
విసరవలయద్యుతులు ♦ దెసలతుదలందిం
పెసలు గురియంగ సర ♦ భసమున బలుండు దర ♦
హసితము ముఖాబ్జమున ♦ నెసఁగ [4]ఘనకాలా ♦

---

1. ఇంద్రగోపంబులు = ఆరుద్రపురుగులు. 2. కృషీవల......లంబులుగా = సేద్యగాండ్ర చేతులందలి గొడ్డళ్ళచే మొదళ్ళు నఱుకఁబడిన పెద్ద వృక్షములుగా, 3 అసమనయనాద్రిపరిలసితము = శివుని కైలాసమున బాగుగాఁ బ్రకాశించునది. 4. ఘనకాలా......ముసలము = ఇనుముతోఁ దయారుచేయఁబడి పెద్దదై మిక్కిలి భయంకర మగు రోఁకలి.

యసమయ మహోగ్రతర ♦ ముసలము వడిన్ విసరి ♦
కసిమసఁగి శత్రువుల ♦ నసువులకుఁ బాపెన్. 1564

లయవిభాతి. ప్రళయసమయాంతకుని ♦ చెలువునఁ గటాక్షముల ♦
నలఘుచటులాగ్నికణ ♦ ములు చెదరఁ గోలా ♦
హాలముగ సువర్ణమణి ♦ వలయనిచయోజ్జ్వలిత ♦
హాలము వడిఁ జాచి శిర ♦ ములు నురములు న్ని
ర్దలితములుగన్ శకల ♦ ములుగ నొనరింపఁ గని ♦
బెలుకుఱి జరాసుతుని ♦ బలము రణవీథిం
జలిత దనుజావలికి ♦ బలికి భయభీతసుర ♦
ఫలికిఁ ద్రిజగచ్ఛలికి ♦ హలికిఁ గలడించెన్. 1565

శా. రోషోద్రేకకళాభయంకర మహా ♦ రూపంబుతో నొక్కచే
[1]సీపాదండము సాఁచి లాంగలము భూ ♦ మీశోత్తమగ్రీవలన్
భూపల్ రాలఁ దగిల్చి రాఁ దిగిచి సం ♦ పూర్ణోద్ధతిన్ రోఁకటన్
వేషంబుల్ సెడ మొత్తె రాముఁడు♦రణోర్విన్ నెత్తురుల్ జొత్తిలన్.

క. హలిహలహృతకరికుంభస్థల ముక్తాఫలములొలిఁ♦దనరెఁ [2]గృషికలాం
గలమార్గ కీర్ణబీజా వలి కైవడి నద్భుతాహ ♦ వక్షేత్రమునన్.

క. తఱిమి హలి హలము విసరుచు
నెఱిఁ గదిసిన బెగడి విమత ♦ నికరము లెడ లై
వెఱఁగుపడు నొదుగు నడఁగును
మఱుపడుఁ జెడు మడియుఁ బొరలు ♦ మరలుం దెరలున్. 1568

క. [3]హరి [4]తిగ్మగోశతంబుల హరిదంతర మెల్లఁ గప్పు♦నాకృతిఁగడిమిన్
హరి తిగ్మగోశతంబుల హరిదంతగ మెల్ల గప్పె ♦ నతిభీకరుఁడై.

సీ. పదుగు రేగురు దీర్ఘ ♦ బాణముల్ గాఁడిన
గుదులుగ్రుచ్చిన భంగి ♦ గూలువారు

1. ఈషాదండము = నాఁగటియేటికోల. 2. కృషిక......జావలి కైవడిన్ = కర్షకులు దున్నిన నాఁగటిచాలునందుఁ జెదరిన విత్తుల మొత్తమువలె. 3. హరి=సూర్యుఁడు కృష్ణుఁడు. 4. తిగ్మగోశతంబులన్ = వాడియైన కిరణసమూహముతో (కృష్ణపక్షమున) వాడియైన బాణ పరంపరలతో.

దలలు ద్రెవ్విన మున్ను ♦ దారు వీక్షించిన
వారల కొప్పించి ♦ వ్రాలువారు
పదములు దెగిపడ్డ ♦ బాహువుల్ జోరని
ర్మూలిత బాహులై ♦ మ్రొగ్గువారు
క్షతముల రుధిరంబు ♦ జల్లింప [1]నిర్ఝర
యుత శైలములభంగి ♦ నుండువారు
ఆ. భ్రాతృపుత్త్రమిత్త్ర ♦ బంధువుల్ వీగిన
నడ్డ మరుగుదెంచి ♦ యడఁగువారు
వాహనములు దెగిన ♦ వడి నన్యవాహనా
దిష్ఠు లగుచు నెదిరి ♦ ద్రెళ్ళువారు. 1571

శా. ఈ కాయంబులఁ బాసినంతటనె మా ♦ కెగ్గేమి [2]జేతృత్వమున్
నీకుం జెల్లదు కృష్ణ నిర్జరుల మై ♦ వి న్నోర్చు మా మీఁదటన్
వైకుంఠంబున నంచుఁ బల్కు క్రియను ♦ ర్వారాస్త్రభిన్నాంగులై
యాకంపింపక కొంద ఱాడుదురు గ ♦ ర్వాలాపముల్ కృష్ణునిన్.

వ. ఇవ్విధంబున. 1573

క. జగతీశ యేమి చెప్పుదు
నగణితలయవార్ధి భయద ♦ మై మ్రోఁగిన య
మ్మగధేంద్రుబలము నెల్లను
దెగఁ జూచిరి హరియుఁ ♦ దీవ్రక్రీడన్. 1574

క. భువన భవ స్థితి విలయము
లవలీలం జేయు హరికి ♦ నరినాశన మెం
తవిషయ మైన మనుజుఁ డై
భవ మొందుటఁ జేసి పొగడఁ ♦ బడియెం గృతులన్. 1575

వ. ఆ సమయంబున. 1576

శా. [3]అంహఃకర్ములు దల్లడిల్ల భయదా ♦ హంకారుఁడై [4]సీరి [5]దో
రంహం బొప్ప హలాహతిన్ రథ ధనూ ♦ రథ్యంబులం గూల్చి త

---

1. నిర్ఝరయుత శైలములభంగిన్ = కొండవాగులతోఁ గూడిన పర్వతములవలె.
2. జేతృత్వము = జయించుట. 3. అంహఃకర్ములు = పాపకృత్యములు చేయువారు.
4. సీరి = బలరాముఁడు. 5. దోరంహము = బాహువేగము.

త్సంహారస్పృహఁ జొచ్చి పట్టెను జరా ♦ సంధున్ మదాంధున్ మహా
సింహంబుం బ్రతిసింహముఖ్యము బల ♦ శ్రీఁ బట్టు నేర్పేర్పడన్.

వ. ఇట్లు పట్టుకొని. 1578

ఉ. కుంఠితులై పరుల్ వెగడ ♦ ఘోరబలుండు బలుండు వాని సో
ల్లుంఠము లాడుచున్ దిగిచి ♦ లోకభయంకరమైన ముష్టిచేఁ
గంఠగతాసుఁ జేసి తమ ♦ కంబున మొత్తఁగ [1]భూభరక్షయో
త్కంఠుఁడు చక్రి వారిఁ దెగఁగి ♦ కార్యము గల్దని మాన్పి యిట్లనున్.

శా. దుఃఖింపం బని లేదు పొమ్ము బలసం ♦ దోహంబులం దెమ్ము చే
తఃఖేదం బెడలంగ రమ్ము రిపులం ♦ దండింపు కాదేని భూ
స్వఃఖేలజ్జన మెల్ల మెచ్చ నృప నీ ♦ శౌర్యోన్నతుల్ చూపి మే
దఃఖండంబులు భూతముల్ దినఁ దను ♦ త్యాగంబు సేయం దగున్.

వ. అని నగుచు విడిపించిన విడివడి చిడిముడికి నగ్గలంబయిన సిగ్గున గ్రుగ్గి
నెమ్మొగంబు సూపక కోప కపట భావంబులు మనంబునం బెనం
గొనఁ దపంబు చేసియైన వీరలం జయించెద నని పలాయితులైన
రాజులంగూడికొనుచు జరాసంధుండు తిరిగి చనియె సురలు కుసుమ
వర్షంబులు గురియ హలియు హరియును మధురానగర జనవంది
మాగధ జేగీయమానులై వీణా వేణు మృదంగ శంఖ దుందుభినినదంబు
లాకర్ణించుచు [1]మృగమదజలసిక్త విమల వీథికా శతంబును వివిధ
విచిత్ర కేతనాద్యలంకృతంబును సువర్ణ మణిమయ జయస్తంభ నిబద్ధ
తోరణ సంయుతంబును వేదనాదనినాదితంబును సంతుష్ట జనసంకుల
గోపురంబు నైన పురంబుఁ బ్రవేశించి రంత. 1581

ఉ. వెల్లువ లైన వైరి నృప ♦ వీరుల నెల్ల జయించి వీటికిన్
బల్లిదు లైన కృష్ణబల ♦ భద్రులు వచ్చుచు నున్నవారు రం
డుల్లములారఁ జూత మని ♦ యున్నతసౌధము లెక్కి వారిపైఁ
బల్లవపుష్పలాజములు ♦ పౌరపురంధ్రులు చల్లి రెల్లెడన్. 1582

వ. ఇట్లు పురంబు ప్రవేశించి యుద్ధప్రకారం బెల్ల నుగ్రసేనున కెఱిం
గించి కృష్ణుం డిచ్ఛావిహారంబుల నుండె. మఱియు మహామత్సరం

1. భూభరక్షయోత్కంఠుఁడు = భూభారము దింపఁగోరిన వాఁడు 2. మృగ
మద...తంబును = కస్తూరి కలిపిన నీళ్లుచల్లుటచే నొప్పువీథుల సముదాయము కలది.

బున నమ్మాగధుండు మహీమండలంబునంగల దుష్టమహీపతుల నెల్లం గూడికొని [1]సప్తదశవారంబు సప్తదశాక్షౌహిణీ బలసమేతుండై మథురానగరంబుపై విడిసి మాధవభుజాప్రాకార రక్షితు లగు యాదవులతోడ నాలంబు సేసి నిర్మూలితబలుండై పోయి క్రమ్మఱ నష్టాదశయుద్ధంబునకు వచ్చునెడం గలహవిద్యావిశారదుం డగు నారదుండు గాలయవనుకడకుం జని యిట్లనియె. 1583

మ. యవనా నీవు సమస్తభూపతుల బా ♦ హాఖర్వగర్వోన్నతిం
బవనుం [2]డభ్రములన్ హరించుపగిదిన్ ♦ భంజించియున్నల యా
దవులన్ గెల్వవు వారలన్ ♦ మఱచియో దర్పంబు లేకుండియో
యవివేకస్థితి నొందియో వెఱచియో ♦ హైన్యంబునం జెందియో.

క. యాదవులలోన నొక్కఁడు మేదినిపై సత్త్వరేఖ ♦ మెఱసి జరాసం
ధాదులఁ దూలం దోలెను దాదృశుఁ డిల లేఁడు విన వె ♦ తత్కర్మంబుల్.

వ. అనిన విని కాలయవనుం డిట్లనియె. 1586

శా. ఏమీ నారద నీవు చెప్పిన నరుం ♦ డే రూపువాఁ డెంత వాఁ
డేమేరన్ విహరించు నెవ్వఁడు సఖుం ♦ డెందుండు నేపాటి దో
స్సామర్థ్యంబునఁ గయ్యముల్ సలుపు న ♦ స్మద్బాహుశౌర్యంబు సం
గ్రామక్షోణి భరించి నిల్వఁ గలఁడే ♦ గర్వాఢ్యుఁడే చెప్పుమా. 1587

వ. అనిన విని దేవముని యిట్లనియె. 1588

సీ. [3]నీలజీమూత స ♦ న్నిభ శరీరము వాఁడు
తామరసాభ నే ♦ త్రములవాఁడు
పూర్ణేందుబింబంబుఁ ♦ బోలెడి మోము వాఁ
డున్నత దీర్ఘ బా ♦ హులవాఁడు
శ్రీవత్సలాంఛనాం ♦ చితమహోరము వాఁడు
కౌస్తుభమణిపద ♦ కంబువాఁడు
శ్రీకరపీతకౌ ♦ శేయచేలము వాఁడు
మకరకుండలదీప్తి ♦ మలయువాఁడు

1. సప్తదశవారంబులు = పదునేడుమాఱులు. 2. అభ్రములన్ = మేఘములను, 3. నీల......రము = నల్లని మేఘముతో సమాన మగు శరీరము కలవాఁడు.

తే. రాజ యింతంతివాఁ డన ♦ రానివాఁడు
మెఱసి దిక్కులనెల్లను ♦ మెఱయువాఁడు
తెలిసి యే వేళలం దైనఁ ♦ దిరుగువాఁడు
పట్టనేర్చినఁగాని లోఁ ♦ బడనివాఁడు. 1589

వ. అని మఱియు నితరలక్షణంబులుం జెప్పిన విని సరకుసేయక. 1590

ఉ. యాదవుఁ డెంతవాఁడు ప్రళ ♦ యాంతకుఁ డైన నెదిర్చె నేనియుం
గా దనఁ బోర [1]మత్కలహ ♦ కర్కశబాహు ధనుర్విముక్త నా
నా దృఢ హేమపుంఖ కఠి ♦ న జ్వలదస్త్రపరంపరా సము
త్పాదితవహ్నికీలముల ♦ భస్మము సేసెదఁ దాపసోత్తమా. 1591

వ. అని పలికి కాలయవనుండు మూఁడుకోట్లమ్లేచ్ఛవీరులం గూడుకొని శీఘ్రగమనంబున దాడివెడలి మథురాపురంబుమీఁద విడిసినం జూచి బలభద్రసహితుం డై కృష్ణుం డిట్లని వితర్కించె 1592

సీ. యవనుండు పురమెల్ల ♦ నావరించెను నేఁటి
యెల్లింటి యెల్లుండి ♦ యీ నడుమను
మాగధుండును వచ్చి ♦ మనమీఁద విడియును
యవనమాగధులు మ ♦ హాప్రబలులు
పురి రెండువంకలఁ ♦ బోరుదు రట్టిచో
నోపినభంగి నొ ♦ క్కొక్కచోట
మనము యుద్ధము సేయ ♦ మఱియొక్కఁ డేతెంచి
బంధుల నందఱఁ ♦ బట్టిచంపు

తే. నొండెఁగొనిపోయి చెఱ బెట్టు ♦ నుగ్రకర్ముఁ
డైన మాగధుఁ డది గానఁ ♦ యదువరులకు
విడియఁ బోరాడఁగా రాని ♦ విషమభూమి
నొక్కదుర్గంబు సేసి యం ♦ దునుపవలయు. 1593

---

1 మత్కలహ..............కీలములన్ = యుద్ధములందు క్రూరులైన నా బాహువులందలి ధనువునుండి విడువఁబడిన బంగారు పిడికలిగిన పెక్కువిధములగు బాణ పరంపరనుండి పుట్టిన యగ్నిజ్వాలలచేత.

## విశ్వకర్మ కృష్ణునియోగంబున సముద్రములో ద్వారకానగరంబు నిర్మించుట

వ. అని వితర్కించి సముద్రము నడిగి సముద్రమధ్యంబునఁ బండ్రెండు [1]యోజనంబుల నిడుపు నంతియ వెడల్పుంగల దుర్గప్రదేశంబు సంపాదించి తన్మధ్యంబునం గృష్ణుండు సర్వాశ్చర్యకరంబుగ నొక్క నగరంబు నిర్మింపు మని విశ్వకర్మం బంచిన. 1594

ఆ. వరుణుపురముకంటె ♦ వాసవుపురికంటె
ధనదువీటికంటె ♦ దండధరుని
నగరికంటె బ్రహ్మ ♦ నగరంబుకంటెఁ బ్ర
స్ఫుటము గాఁగ నొక్క ♦ పురముఁ జేసె

వ. అందు.

క. ఆకసము[2]తోడిచూలనఁ బ్రాకారము పొడవుగలదు ♦ పాతాళమహా
లోకముకంటెను లోఁతెంతో కలదా[3]పరిఖ యెఱుఁగ ♦ దొరకదొకరికిన్.

క. కోటయు మిన్నును దమలోఁ బాటికి జగడింప నడ్డ ♦ పడి నిల్చిన వా
చాటుల రుచిఁ దారకములు [3]కూటువలై కోటతుదలఁ ♦ గొమరారుఁ బురిన్.

శా. సాధుద్వార కవాట కుడ్య వలభీ ♦ స్తంభార్గళా గేహళీ
వీథీ వేది గవాక్ష చత్వరసభా ♦ వేశ్మ ప్రఘాణ ప్రపా
సౌధాట్టాలక సాల హర్మ్య [5]విశిఖా ♦ సోపాన సంస్థానముల్
శ్రీధుర్యస్థితి నొప్పుఁ గాంచనమణి ♦ స్నిగ్ధంబులై యప్పురిన్.

క. కూడి గ్రహంబులు దిరుగఁగ మేడలతుదనిలువులందు ♦ మెలఁగెడి బాలల్
క్రీడింపరు పురుషులతో వ్రీడం దద్వేళలందు ♦ విను మా వీటన్.

ఉ. ఆయత వజ్రనీలమణి ♦ హాటకనిర్మితహర్మ్య సౌధ వా
తాయనరంధ్రనిర్గత సి ♦ తాభ్ర మహాగరు ధూపధూమముల్
తోయద పంక్తులో యనుచుఁ ♦ దుంగమహీరుహ రమ్యశాఖలం
జేయుచునుండుఁ దాండవ వి ♦ శేషము లప్పురిఁ గేకిసంఘముల్.

ఆ. సరస నడచు చుండి ♦ సౌధాగ్ర హేమకుం
భములలోన నినుఁడు ♦ ప్రతిఫలింప

---

1. యోజనము = ఆమడ (8 మైళ్ళు) 2. తోడిచూలు = తోఁబుట్టువు. పరిఖ = కందకము. 3. కూటువలు = గుంపులు, 4. ప్రఘాణము = అళిందము (తలవాకిలికి ప్రక్కగది). 5. విశిఖా = రాజవీథి.

నేర్పరింప లేక ♦ నిమ్నలు పెక్కం బ్రేంచుఁ
బ్రజలు చూచి చోద్య ♦ పడుదు రందు. 1602

ఉ. శ్రీరమణీయగంధములఁ ♦ జెన్నువహించుఁ బురీవనంబులం
గోరక జాలక స్తబక ♦ కుట్మల పుష్ప మరంద పూర విస్ఫారలతాప్రకాండ [1]విట ♦ పచ్ఛదపల్లవవల్లరీ శిఫా
సార పరాగ మూలఫల ♦ సంభృతవృక్షలతావిశేషముల్. 1603

క. శ్రీకరములుజనహృదయవశీకరములు [2]మందపవన ♦ శీర్ణ మహాంభ
శ్శీకరములు హంసవిహంగాకరములునగరికువల ♦ యాబ్జాకరముల్.

క. నవకుసుమామోద భరా
జవనము రతిఖిన్న దేహ ♦ జస్వేదాంభో
లవనము సమధిగతవనము
పవనము విహరించుఁ బౌర ♦ భవనము లందున్. 1605

క. బ్రహ్మత్వము లఘు వగు నని
బ్రహ్మయ బిరుదులకు వచ్చి ♦ పట్టఁడు గా కా
బ్రహ్మాదికళలఁ దప్పరి
బ్రహ్మజనుల్ బ్రహ్మఁ జిక్క ♦ పఱుపరె చర్చన్. 1606

క. [3]నగరీభూసురకృత లస
దగణిత మఖ ధూమపిహిత ♦ మై కాక మహా
గగనము నీలం బగునే
మిగులఁగ బెడఁ గగునె గ్రహస ♦ మృద్ధం బయ్యున్. 1607

క. తిరుగరు పలు కరులకును
[4]సురుఁగరు ధన మిత్త్రు లితర ♦ సుదతీమణులన్
మరుగరు రణమునఁ బిఱిఁదికి
నరుగరు రాజన్యతనయు ♦ లా నగరమునన్. 1608

1. విటపములు = చెట్ల కొమ్మలు. 2. మంద......కరములు = పిల్లగాలులచేఁ జెదరఁగొట్టఁబడిన విస్తారమైన నీటితుంపరలు కలవి. 3. నగరీభూసుర...పిహితము = ఊరిలోని బ్రాహ్మణులచేఁ జేయఁబడిన లెక్కలేని యజ్ఞముల యందలి పొగలచేఁ గప్పఁబడినది. 4. సురుఁగరు = తప్పించుకొనరు.

క. రత్నాకర మై జలనిధి
రత్నము లీ నేర దేటి ♦ రత్నాకరమో
రత్నములఁ గొనుదు రిత్తురు
రత్నాకరజయులు వైశ్య ♦ రత్నములు పురిన్. 1609

క. తుంగంబులు కరహతగిరి
శృంగంబులు దానజలవ ♦ శీకృత భృంగీ
భృంగంబులు పటుశైలస
మాంగంబులు నగరి మత్త ♦ మాతంగంబుల్. 1610

క. క్రియములు [1]జితపవనమనో
రయములు కృతజయము లధిక ♦ రమణీయ గుణా
న్వయములు సతిశయములు ని
ర్భయములు హతరిపుచయములు ♦ పట్టణహయముల్. 1611

క. పులులపగిదిఁ గంఠీరవ
ములక్రియ శరభములమాడ్కి ♦ ముదితమదేభం
బుల తెఱఁగున నానావిధ
కలహమహోద్భటులు భటులు ♦ గల రా వీటన్. 1612

క. ఆ వీటనుండువారికి భావింపఁగ లేవు క్షుత్పి ♦ పాసాదులు త
ద్గోవిందకృపావశమున దేవప్రతిమాను లగుచు ♦ దీపింతు రిలన్.

సీ. ఆసక్తి కృష్ణము ♦ ఖావలోకనమంద
హరిపాదసేవన ♦ మంద చింత
వెఱపు నారాయణ ♦ విముఖకార్యము లంద
పారవశ్యము విష్ణు ♦ భక్తి యంద
బాష్పనిర్గతి చక్రి ♦ పద్యసంస్తుతు లంద
పక్షపాతము శార్ఙ్గి ♦ భక్తు లంద
లేమి గోవిందాన్య ♦ లీలాచరణ మంద
శ్రమము గోవింద పూ ♦ జనము లంద

1. జితపవనమనోరయములు = వాయువేగ మనోవేగములను జయించినవి.

తే. బంధ మచ్యుతపరమప్ప • పథము లంద
స్వరము మాధవవిరహిత • క్షణము లంద
మత్సరము లీశకైంకర్య • మతము లంద
నరవరోత్తమ వినుము త • న్నాగరులకు. 1615

వ. మఱియు నప్పురవరంబునకుం బారిజాత మహీజంబును సుధర్మ యనియెడి దేవసభయును దేవేంద్రుం డిచ్చె. కర్ణైకదేశంబుల నలుపు గలిగి మనోజవంబులును శుక్లవర్ణంబులు నైన తురంగముల వరుణుం డొసంగె. మత్స్య కూర్మ పద్మ మహాపద్మ శంఖ ముకుంద కచ్ఛప నీలంబు లను నెనిమిది నిధులం గుబేరుండు సమర్పించె. నిజాధికారసిద్ధికొఱకుం దక్కిన లోకపాలకులును దొల్లి తమకు భగవత్కరుణాకటాక్షవీక్షణంబుల సంభవించిన సర్వసంపదలు మరల నతిభక్తితో సమర్పించి రివ్విధంబున. 1616

క. దర్పించి చేసి పురము స • మర్పించెను విశ్వకర్మ • [1]మంగళగుణసం
తర్పితగహ్వారికిని గురు దర్పితదుఃఖప్రవాహ • తారికి హరికిన్.

వ. ఇట్లు విశ్వకర్మనిర్మితంబైన ద్వారకానగరంబునకు నిజయోగప్రభావంబున మథురాపురజనుల నందఱం జేర్చి బలభద్రునకు నెఱింగించి తదనుమతంబున నందనవనంబు నిర్గమించు పూర్వదిగ్గజంబు పెంపున మేరుగిరిగహ్వరంబు వెలువడు కంఠీరవంబు తెఱంగున [2]హరిహయదిగంతరాళంబున నుదయించు [3]అంధకారపరిపంథి కైవడి మథురానగరంబు వెలువడి నిరాయుధుండై యెదురు వచ్చుచున్న హరిం గని.

— • శ్రీకృష్ణుండు నిరాయుధుండై కాలయవనుఁడు వెంటనంటఁ బరుగెత్తుట • —

మ. కరిసంఘంబులు లేవు రావు తురగా • ఘంబుల్ రథవ్రాతముల్
[4]పరిసర్పింపవు రారు శూరులు ధను • ర్బాణాసి ముఖ్యాయుధో
త్కరముం బట్టఁడు శక్రచాపయుతమే • ఘస్ఫూర్తితో మాలికా
ధరుఁ డొక్కండదె నిర్గమించె నగర • ద్వారంబునం గంటిరే. 1618

1. మంగళ.....గహ్వారికి = శుభగుణములచే భూమికిఁ దృప్తి గలిగించువానికి, 2. హరిహయ దిగంతరాళము = తూర్పుదెస నడుమ. 3. అంధకార పరిపంథి = చీకటి శత్రువు. (సూర్యుఁడు) 4. పరిసర్పింపవు = నడువవు

శా. ఎన్నే నయ్యె దినంబు లీ నగరిపై ♦ నేతెంచి పోరాటకుం
మున్నెవ్వండును రాఁడు వీఁడొకఁడు ని ♦ ర్ముక్తాయుధుం డేఁగుదెం
చెన్నన్నోర్వఁగనో ప్రియోక్తులకునో ♦ శ్రీఁగోరియో చూడఁ డం
చు న్నాతీప్రియ జనంబుతోడ యవనే ♦ శుండిట్లు తర్కింపఁగన్. 1619

క. విభులగు బ్రహ్మప్రముఖుల
కభిముఖుఁడై నడవకుండు ♦ నధిక గుణాఢ్యుం
డిభరాజగమన మొప్పఁగ
నభిముఖుఁడై నడచెఁ గాల ♦ యవనున కధిపా. 1629

వ. ఆ సమయంబున నయ్యాదవేంద్రు నేర్పడంజూచి. 1621

మ. వనజాతాక్షుఁడు సింహమధ్యుఁడు రమా ♦ వక్షుండు శ్రీవత్సలాం
ఛనుఁ డంభోధర దేహుఁడిందుముఖుఁడం ♦ చదీర్ఘబాహుండు స
ద్వనమాలాంగద హారకంకణ సము ♦ ద్యత్కుండలుం డీతఁ డా
ముని సూచించిన వీరుఁ డౌ ననుచు న♦ మ్మూర్ఖుండు గాఢోద్ధతిన్.

సీ. [1]చటుల వాలాభీల ♦ సైంహికేయుని భంగి
లాలితేతరజటా ♦ లతిక దూలఁ
బ్రళయావసర [2]బృహ ♦ ద్భాను హేతిద్యుతిఁ
బరుసారుణశ్మశ్రు ♦ పటలి వ్రేలఁ
[3]గాదంబినీ చ్ఛన్న ♦ కాంచన గిరిభాతిఁ
గవచ సంవృతదీర్ఘ ♦ కాయ మమర
వల్మీక సుప్తదు ♦ ర్వారాహి కైవడిఁ
గోశంబులో వాలు ♦ కొమరు మిగుల

ఆ. నార్చి పేర్చి మించి ♦ యశ్వంబు గదలించి
కమలసంభవాది ♦ ఘనుల కైనఁ
బట్టరాని ప్రోడఁ ♦ బట్టెద నని జగ
దవనుఁ బట్టఁ గదిసె ♦ యవను డధిప. 1623

---

1. చటులవాలా......భంగిన్ = తీవ్రమైన తోఁకచే భయంకరుఁడగు రాహువు వలె, 2. బృహద్భానుహేతిద్యుతిన్ = సూర్యుని కిరణముల కాంతివంటి కాంతితో, 3. కాదంబినీచ్ఛన్న కాంచనగిరిభాతిన్ = మేఘమాలచేఁ గప్పఁబడిన బంగారు కొండవలె.

క. ఇటు దన్నుఁ బట్ట వచ్చినఁ బటుతరజవ రేఖ మెఱసి ♦ పట్టుపడక ది
క్తటము లదర హరి వాఁటెంజటులగతిన్ వాఁడుఁదోడఁ ♦ జను దేరంగన్

వ. అప్పుడు కాలయవనుం డిట్లనియె. 1625

మ. యదువంశోత్తమ పోకు పోకు రణమీ ♦ నర్హాంబు కంసాదులం
గదనక్షోణి జయించి తీ వని సమి ♦ త్కామంబునన్ వచ్చితిన్
¹విదితఖ్యాతులు వీటిఁ బోవ నరికిన్ ♦ వెన్నిచ్చి యిబ్భంగి నే
గుదురే రాజులు రాజమాత్రుఁడవె నై ♦ గుణ్యంబు వచ్చుంజుమీ.

మ. బలిమిన్ మాధవ నేఁడు నిన్ను భువన ♦ ప్రఖ్యాతిగాఁ బట్టుదున్
జలముల్ సొచ్చిన భూమి క్రిందఁ జనినన్ ♦ శైలంబుపై నెక్కినన్
బలిదండన్ విలసించినన్ వికృతరూ ♦ పంబుం బ్రవేశించినన్
జలధిం దాఁటిన ²నగ్రజన్మహలికా ♦ శ్వాటాకృతుల్ దాల్చినన్.

వ. అదియునుం గాక. 1628

మ. శరముల్ దూఱవు మద్ధనుర్గుణరతా ♦ శబ్దంబు లేతేర వా
హరి రింఖోత్థితధూళి గప్ప దకటా ♦ హాస్యుండవై పాఱె దు
ర్వారత్పై నేక్రియఁ బోరితో కదిసి మున్ ♦ వాతాశితోఁ గేశితోఁ
గరితో మల్లురతో జరాతనయుతోఁ ♦ గంసావనీనాథుతోన్. 1629

వ. అని పలుకుచుఁ గాలయవనుండు వెంట నరుగుదేర సరకు సేయక మందహాసంబు ముఖారవిందంబునకు సౌందర్యంబు నొసంగ వేగిర పడకు రమ్ము ర మ్మనుచు హరియును.

సీ. అదె యిదె లోఁబడె ♦ నని పట్టవచ్చినఁ
గుప్పించి లంఘించుఁ ♦ గొంత తడవు
పట్టరా దీతని ♦ పరువగ్గలం బని
భావింపఁగా సమీ ♦ పమున నిలుచు
నడరి పార్శ్వంబుల ♦ కడ్డంబు వచ్చినఁ
³గేడించి యిట్టిట్టు ♦ ⁴గికురు వెట్టు

1. విదితఖ్యాతులు = ప్రసిద్ధమైన కర్తలు. 2. అగ్రజన్మ హలికాశ్వాటాకృతుల్ = బ్రాహ్మణుని, సేద్యగాని, యాశ్వికుని, రూపములు (బ్రాహ్మణుఁడు = పరశురాముఁడు, హలికుఁడు = బలరాముఁడు. అశ్వాటుఁడు = కల్కి) 3. కేడించి = తప్పుకొని (తొలఁగి). 4. కికురువెట్టు = మోసగించు, (1627 పద్యం) దశావతారవర్ణన.

వల్మీకతరు సరో ♦ వరము లక్ష్యం బైన
సవ్యాపసవ్య సం ♦ చరతఁ జూపుఁ

తే. బల్లముల శాఁగు దిబ్బల ♦ బయలువడును
నీడలకుఁ బోవు [1]నిఱుముల ♦ నిగిడి తెఱలు
నన్నుఁ బట్టిన నీవు మా ♦ నవ్యుఁడ వనుచు
యవనుఁ [2]డెగువంగ బహుజగ ♦ దవనుఁ డప్పుడు. 1631

వ. మఱియును. 1632

సీ. సకల భూతవ్రాత ♦ సంవాసుఁ డయ్యును
వనములు నగములు ♦ వరుస దాఁటు
లోకోన్నతుండును ♦ లోకచక్షుఁడు నయ్యు
మాటిమాటికి నిక్కి ♦ మగిడి చూచుఁ
బహువిపక్షసం ♦ బంధశూన్యుం డయ్యుఁ
దను విపక్షుఁడు వెంటఁ ♦ దగుల నిగుడు
విజయాపజయ భావ ♦ విరహితుం డయ్యుఁ దా
నపజయంబును జెంది ♦ నట్లు తోఁచు

ఆ. నభయ భయ విహీనుఁ ♦ డయ్యు భీతునిమాడ్కిఁ
గానఁబడును సర్వ ♦ కాలరూపుఁ
డయ్యుఁ గాలచకితుఁ డైన కైవడి వన
మాలి పఱచు వెఱపు ♦ మాలి యధిప. 1633

వ. ఇవ్విధంబున. 1634

క. దారితశాత్రవభవను న పారమహావేగవిజిత ♦ పవనున్ యవనున్
దూరము గొనిచని కృష్ణుఁడు
ఘోరంబగు నొక్క శైల ♦ గుహావడిఁ జొచ్చెన్. 1635

క. అదె లోఁబడె నిదె లోఁబడె నదెయిదె పట్టెదనటంచు♦నాశావశుఁడై
యదుసింహుని పదపద్ధతి వదలక గిరిగహ్వరంబు♦వాఁడుం జొచ్చెన్.

వ. ఇట్లు చొచ్చి మూఢహృదయంబునుంబోలెఁ [3]దమఃపూర్ణంబయిన

---

1. ఇఱుములు=పఱుఁగులు. 2 ఎగువంగఁ = తరుమఁగా. 3. తమఃపూర్ణము = గుహ; చీఁకటితో నిండినది, (మూఢహృదయము అజ్ఞానముతో నిండినది.)

గుహాంతరాళంబున దీర్ఘతల్పనిద్రితుండై గుఱువెట్టుచున్న యొక
మహాపురుషునిం గని శ్రీహరిగాఁ దలంచి. 1637

ఉ. ఆలము సేయ లేక పురు ◆ షాధము డుగ్ర భ కంటకద్రుమా
భీలమహాశిలా సహిత ◆ భీకర కుంజర ఖడ్గ సింహ శా
ర్దూల తరక్షు సంకలిత ◆ దుర్గపథంబునఁ బారుతెంచి యీ
శైలగుహన్ సనిద్రు క్రియుఁ ◆ జాఁగి ఘటించినఁ బోవనిత్తునే. 1638

క. ఎక్కడ నెవ్వారలకును జిక్కవనుచు నారదుండు ◆ సెప్పెను నాకుం
జిక్కితి వెక్కడఁ బోయెదు నిక్కముగా నిద్రపుత్తు ◆ నిన్నిఁకొండన్.

ఆ. అనుచు యవనుఁ [1]డట్ట ◆ హాసంబు గావించి
[2]చటుల కఠిన కులిశ ◆ సదృశ మైన
పాద మెత్తి తన్నెఁ ◆ బాఱి తద్దేహంబు
నగగుహం బ్రతిస్వ ◆ నంబు సిగుడ. 1640

ఉ. తన్నిన లేచి నీల్గి కను ◆ దమ్ములు మెల్లన విచ్చి లోపలన్
సన్నపుఁగిన్క వర్ధిల ది ◆ శల్ గని [3]దృష్టి సమిద్ధ విగ్రహో
త్పన్నమహాగ్నికీలముల [5] భస్మము సేసె నతండు [4]సాయక
చ్ఛిన్న విరోధికంఠవను ◆ శ్రీభవనున్ యవనున్ లఘుక్రియన్.

వ. ఇట్లీక్షణమాత్రంబున యవనుండు నీఱయ్యె ననిన విని రాజిట్లనియె.

—◆ ముచికుందుని పూర్వకథాభివర్ణనము. ◆—

ఆ. ఎవ్వఁ డాతఁ డతని ◆ కెవ్వాఁడు దండ్రి ఘో
రాద్రిగుహకు నేటి ◆ కతఁడు వచ్చె
నిద్రవోయె యవను ◆ నిటు గాల్చె నెట్లొకో
తెలియ బలుకు నాకు ◆ ధీవరేణ్య. 1643

వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు నతికుతూహలంబుతో శుకయోగి
వర్యుఁ డిట్లనియె నిక్ష్వాకుకుల సంభవుండు మాంధాత కొడుకు

1. అట్టహాసము = పెద్దనవ్వు. 2. చటుల.....సదృశము = తీవ్రమై కఠినమైన వజ్రముతో సమానము. 3. దృష్టిసమి.....కీలములన్ = చూపుల కాంతులచే విస్తరించి పుట్టిన గొప్ప యగ్నిజ్వాలలచే. 4. సాయకచ్ఛిన్న........కంఠవనున్ = బాణములచే నఱుకఁబడిన శత్రుకంఠము లనెడు వనము కలవాఁడు.

ముచికుందుం డనురాజు రాక్షసభీతు లైన వేల్పులం బెద్ద కాలంబు సంరక్షించిన మెచ్చి వా రమరలోకరక్షకుం డైన యా రాజకుమారుని కడకుం జేరి వరంబు వేఁడు మనిన వారలం గనుంగొని మోక్ష పదం బడిగిన వార లతని కి ట్లనిరి. 1644

మ. జగతీ నిర్గతకంటకం బయిన రా ♦ జ్యంబున్ విసర్జించి శూ
రగణాగ్రేసర పెద్దకాలము మమున్ ♦ రక్షించి తీలోన నీ
మగువల్ మిత్రులు బంధులున్ సుతులు సం♦బంధుల్ భువిన్ లేరు కా
లగతిం జెందిరి కాల మెవ్వరికి ను ♦ ల్లంఘ్యంబు దా నారయన్.

క. కాలము ప్రబలులకును బలి కాలాత్ముం డీశ్వరుం డ♦గణ్యుఁడు జనులం
గాలవశులఁగాఁ జేయును గాలము గడవంగ లేరు ♦ ఘను లెవ్వారున్

క. వర మిచ్చెద మర్థింపుము
ధరణీశ్వర మోక్షపదవి ♦ దక్కను మే మె
వ్వరమును విభులము గా మీ
శ్వరుఁ డగు హరి దక్క మోక్ష ♦ సంగతిఁ జేయన్. 1647

వ. అని పలికిన దేవతలకు నమస్కరించి ముచికుందుండు నిద్ర గోరి దేవదత్త నిద్రావశుం డై పర్వత గుహాంతరాళంబున శయనించి యుండె. యవనుండు నీ తైనపిమ్మట హరిముచికుందునిముందఱనిల్చిన

సీ. వనరుహాలోచను ♦ [1] వైజయంతీదామ
శోభితు రాకేందు ♦ సుందరాస్యు
మకరకుండల కాంతి ♦ మహిత గండస్థలుఁ
గౌస్తుభాలంకృతు ♦ ఘనశరీరు
[2] శ్రీవత్సలాంఛనాం ♦ చితవక్షు మృగరాజ
మధ్యుఁ జతుర్బాహు ♦ మందహాస్యుఁ
గాంచనసన్నిభ ♦ కౌశేయవాసు గాం
భీర్యసౌందర్యశో ♦ భితుఁ బ్రసన్ను

ఆ. న మ్మహాత్ముఁ జూచి ♦ యాశ్చర్యమును బొంది
తన్మనోజ్ఞదీప్తిఁ ♦ దనరుఁ జూడ

1. వైజయంతి = విష్ణుని పూలమాల, 2. శ్రీవత్సము = విష్ణుని పుట్టుమచ్చ
3. కాంచన,,.....వాసుఁ = బంగరువన్నె పట్టువస్త్రములు గలవానిని,

నలవి గాక చకితుఁ ♦ డై యెట్లు కేలకుఁ
బలికెఁ బ్రీతి నవని ♦ పాలకుండు. 1646

మ. శశివో యింద్రుఁడవో [2]విభావసుఁడవో ♦ [2]చండప్రభారాశివో
[3]శశిచూడామణివో [4]తామసహరుఁడవో ♦ చక్రాంకహస్తుండవో
దిశలున్ భూమియుమిన్నునిండె నిదె నీ ♦ తేజంబుఁజూడంగ దు
ర్వశమై యెవ్వఁడ వేల వచ్చి తిచటన్ ♦ వర్తించె దేకాకివై.

క. ఈ యడవి [5]విషమకంటక
భూయిష్ఠము ఘోరసత్త్వ ♦ పుంజాలభ్యం
బో యయ్య యెట్లు వచ్చితి
నీ యడుగులు కమలపత్త్ర ♦ నిభములు సూడన్. 1648

వ. మహాత్మా యేను నీ శుశ్రూషణంబు సేయం గోరెద నీ జన్మ గోత్రంబు లే నెఱుంగ నర్హుండనేని యెఱింగింపుము నే నిక్ష్వాకు వంశ సంభవుండ మాంధాతృనందనుండ ముచికుందుం డనువాఁడ దేవహితార్థంబు చిరకాల జాగరశ్రాంతుండ నయి నిద్రనొంది యింద్రియసంచారంబులు మఱచి. 1649

శా. ఏ నిద్రించుచు నుండ నొక్క మనుజుం ♦ డేతెంచి మమ్మ న్మహా
తా నీతెై చెడ నాత్మకిల్బిషమునన్ ♦ దర్పోగ్రుఁ డై యంటెటన్
శ్రీనాథాకృతి వైన నిన్నుఁ గని పే ♦ క్షింప న్నశక్తుండ నై
దీనత్వంబునఁ జెందితిన్ నను గృపా ♦ దృష్టిన్ విలోకింపవే. 1650

వ. అనిన విని మేఘగంభీరభాషణంబుల హరి యిట్లనియె. 1651

సీ. భూరజంబుల నైన ♦ భూనాథ యెన్నంగఁ
జనుఁ గాని నాగుణ ♦ జన్మ కర్మ
నామంబు లెల్ల నె ♦ న్నంగ నెవ్వరుఁ జాల
రది యేల నాకును ♦ నలవి గాదు
నేలకు [5]వ్రేగైన ♦ నిఖిలరాక్షసులను
నిర్జించి ధర్మంబు ♦ నిలువఁ బెట్ట

1. విభావసుఁడు = అగ్ని. 3. చండప్రభారాశి = సూర్యుఁడు. 3. శశిచూడామణి = శంకరుఁడు. 4. విషమకంటకభూయిష్ఠము = ఎగుడు దిగుడై ముండ్లతో నిండినది. 5. వ్రేఁగు = భారము.

బ్రహ్మచే మున్న నేఁ ♦ బ్రార్థింపఁబడి వసు
దేవునింటను వాసు ♦ దేవుఁ డనఁగఁ

ఆ. గరుణ నవతరించి ♦ కంసాఖ్యుతో నున్న
కాలనేమిఁ జంపి ♦ ఖలుల మఱియుఁ
ద్రుంచుచున్నవాఁడఁ ♦ దోడ నీ చూడ్కి [1]నీ
ఱైనవాఁడు కాల ♦ యవనుఁ డనఘ. 1655

వ. వినుము తొల్లియు నీవు నన్ను సేవించిన కతంబున నిన్ననుగ్రహింప నీ శైలగుహకు నేతెంచితి నభీష్టంబు లయిన వరంబు లడుగు మిచ్చెద మద్భక్తులగు జనులు గ్రమ్మఱ శోకంబున గర్హ్యులు గారనిన వానికి ముచికుందుండు నమస్కరించి నారాయణదేవుం డగుట యెఱింగి యిరువదియెనిమిదవ మహాయుగంబునందు నారాయణుం డవతరించు నని మున్ను గర్గుండు చెప్పుటఁ దలంచి. 1656

—♦ ముచికుందుఁడు శ్రీకృష్ణుని స్తోత్రముచేయుట ♦—

నీమాయఁ జిక్కి పురుష
స్త్రీమూర్తికజనము నిన్ను ♦ సేవింపదు వి
త్తా[2]మయగృహగతమై [3]సుఖ
తామసమై కామవంచితం ♦ బగు నీశా. 1657

ఉ. పూని యనేకజన్మములఁ ♦ బొంది తుదిం దన పుణ్యకర్మసం
తానము పేర్మిఁ గర్మవసు ♦ ధాస్థలిఁ బుట్టి ప్రపూర్ణదేహుఁడై
మానవుఁడై గృహేచ్ఛఁ బడు ♦ మందుఁ డజంబు తృణాభిలాషియై
కానక పోయి నూతఁబడు ♦ కైవడి నీపదభక్తిహీనుఁడై. 1658

క. తరుణీపుత్త్రధనాదుల మఱిగి మహారాజ్యవిభవ ♦ మదమత్తుఁడనై
నరతనులుబ్ధుఁడనగు నా కరయఁగ బహుకాలమీశ ♦ యాఱడిఁ బోయెన్.

క. [4]ఘటకుడ్యసన్నిభంబగు చటుల కళేబరముఁ జొచ్చి ♦ జనపతినంచుం
బటుచతురంగంబులతో నిటునటు దిరుగుదును నిన్ను ♦ నెఱుఁగక యీశా

---

1. నీఱైనవాఁడు = భస్మమైనవాఁడు. (నిగులు (రూ) నివులు = నీఱు)
2. ఆమయము = రోగము 3. సుఖతామసము = సుఖములచేఁ దెలివితప్పినది. 4. ఘటకుడ్యసన్నిభంబు = కుండతో గోడతో సమానము.

ఆ. వివిధకామభోగ ♦ విషయలాలసు మత్తు
నప్రమత్తవృత్తి ♦ నంతకుండ
వైన నీవు వేళ ♦ యరసి త్రుంతువు సర్ప
మొదిఁగి మూషికంబు ♦ నొడియునట్లు. 1661

క. నరవరసంజ్ఞితమై రథ కరిసేవితమైన యొడలు ♦ కాలగతిన్ భీ
కరమృగభక్షితమై [1]దు స్తరవిట్క్రిమి భస్మసంజ్ఞి ♦ తం బగు నీశా.

ఆ. సకలదిశలు గెలిచి ♦ సములు వర్ణింపంగఁ
జారుపీఠ మెక్కి ♦ సార్వభౌముఁ
డైన సతులగృహము ♦ లందుఁ గ్రీడాభోగ
వృత్తినుండు నిన్ను ♦ వెదకలేఁడు. 1663

ఆ. మానసంబు గట్టి ♦ మహితభోగంబులు
మాని యింద్రియముల ♦ మదము లడఁచి
తపము సేసి యింద్ర ♦ తయ కోరుఁ గాని నీ
యమృతపదము గోరఁ ♦ డజ్ఞుఁ డీశ. 1664

సీ. సంసారి వై యున్న ♦ జనునకు నీశ్వర
నీకృప యెప్పుడు ♦ నెరయఁ గల్గు
నప్పుడ బంధంబు ♦ లన్నియుఁ దెగిపోవు
బంధ మోక్షంబైనఁ ♦ బ్రాప్తమగును
సత్సంగమంబు స ♦ త్సంగమంబున నీదు
భక్తి సిద్ధించు నీ ♦ భక్తివలన
సన్ముక్తియగు నాకు ♦ సత్సంగమముకంటె
మును రాజ్యబంధని ♦ ర్మూలనంబు

తే. గలిగినది దేవ నీయను ♦ గ్రహము గాదె
కృష్ణ నీసేవ గాని త ♦ క్కినవి వలదు
[2]ముక్తిసంధాయి వగు నిన్ను ♦ ముట్టఁ గొలిచి
యాత్మబంధంబుఁ గోరునే ♦ యార్యుఁ డెందు. 1665

1. దుస్త...తంబు = దాఁటరాని మలము, క్రిమి, బూడిద, అను పేళ్లఁ గలది
2. ముక్తిసంధాయివి = జననమరణాదులనుండి విడుదల గలిగించువాఁడవు.

వ. కావున రజస్తమస్సత్త్వగుణంబుల యనుబంధంబులగు నైశ్వర్య శత్రు మరణ ధర్మాది విశేషంబులు విడిచి యీశ్వరుండును విజ్ఞానఘనుండును [1]నిరంజనుండును నిర్గుణుండును నద్వయుండును నైన పరమపురుషుని నిన్నాశ్రయించెదఁ జిరకాలంబు కర్మఫలంబుచేతనార్తుండనై క్రమ్మఱం దద్వాసనల సంతప్తుండనై తృష్ణం బాయక శత్రువులైన యింద్రియంబులాఱింటిని గెలువలేని నాకు శాంతి యెక్కడిది విపన్నుండనైన నన్ను నిర్భయుం జేసి రక్షింపు మనిన ముచికుందునికి హరి యిట్లనియె. 1666

ఉ. మంచిది నీదుబుద్ధి నృప ♦ మండన నీవు పరార్థ మెట్లు వ
ర్తించిననైనఁ గోరికల ♦ దిక్కునఁ జిక్కవు మేలు నిర్మలో
దంచితవృత్తి నన్ గొలుచు ♦ ధన్యులబుద్ధులు నిట్లు నీకు ని
శ్చంచలభక్తిఁ గల్గెడిని ♦ సర్వము నేలుము మాన నేటికిన్.

వ. నరేంద్రా నీవు తొల్లి క్షత్రధర్మంబున నిలిచి మృగయావినోదంబుల జంతువుల వధియించినాడవు. తపంబునఁ దత్కర్మ విముక్తుండవై తర్వాతిజన్మంబున [2]సర్వభూతసఖిత్వంబుగలిగి బ్రహ్మజ్ఞానసంపత్తినొంది నన్నుం జేరెదవని వీడ్కొలిపిన హరికిం బ్రదక్షిణంబు వచ్చి నమస్కరించె గుహ వెడలి సూక్ష్మప్రమాణదేహంబులతో నున్న మనుష్యపశు వృక్షలతాదులం గని కలియుగంబు ప్రాప్తంబగుననితలంచియుత్తరాభిముఖుండై తపోనిష్ఠుండగుచు సంశయంబులు విడిచి సంగంబులు పరిహరించి విష్ణునియందుఁ జిత్తంబుఁ జేర్చి గంధమాదనంబు ప్రవేశించి మఱియు నరనారాయణ నివాసంబైన బదరికాశ్రమంబుచేరి శాంతుండై హరి నారాధించుచుండె నిట్లు ముచికుందుని వీడ్కొని.

శా. అచ్ఛిద్రప్రకటప్రతాపరవిచే ♦ నాశాంతరాళంబులం
[3]బ్రచ్ఛాదించుచుఁ గ్రమ్మఱన్ మధురకుం ♦ బద్మాక్షుఁడేతెంచి వీ
డాచ్ఛాదించి మహాసిరోధముగఁ జ ♦ క్రాకారమై యున్న యా
మ్లేచ్ఛవ్రాతము నెల్లఁ ద్రుంచె రణభూమిం బెంపు సొంపారఁగన్.

---

1. నిరంజనుండు = దోషరహితుండు. 2. సర్వభూతసఖిత్వము = ఎల్లప్రాణులతోడి మైత్రి. 3 ప్రచ్ఛాదించుచు = కప్పుచు,

—♦ జరాసంధుండు ప్రవర్షణ గిరి దహించుట ♦—

వ. ఇట్లు మ్లేచ్ఛబలం బొరిగొని మఱియు నమ్మధురానగరంబునం గల ధనంబు ద్వారకానగరంబునకుం బంచిన మనుష్యులు గొనిపోవునెడ.

సీ. ఘోటకసంఘాత ♦ ఖురసమున్నిర్గత
ధూళి [1]జీమూత సం ♦ దోహముగను
మహనీయమదకల ♦ మాతంగకటదాన
ధారలు [2]కీలాల ♦ ధారలుగను
నిరుపమస్యందన ♦ నేమినిర్ఘోషంబు
దారుణగర్జిత ♦ ధ్వానముగను
నిశితశస్త్రాస్త్ర మా ♦ నితదీర్ఘ రోచులు
లలిత [3]సౌదామినీ ♦ లతికలుగను

తే. శత్రురాజప్రతాపాగ్ని ♦ శాంతముగను
వృష్టికాలము వచ్చిన ♦ విధము దోఁప
నేగుదెంచె జరాసంధుఁ ♦ డిరువదియును
మూఁడునక్షౌహిణులు దన్ను ♦ మొనసి కొలువ.

చ. ఇటు చనుదెంచియున్న మగ ♦ ధేశ్వరవాహినిఁజూచి యుద్ధసం
ఘటనము మాని మానవుల ♦ కైవడి భీరుల భంగి నోడి ముం
దటిధన మెల్లడించి మృదు ♦ తామరసాభపదద్వయుల్ క్రియా
పటువులు రామకేశవులు ♦ పాఱిరి ఘోరవనాంతరంబులన్.

వ. ఇట్లు పఱచు చున్న కృష్ణబలభద్రులం జూచి వారల ప్రభావంబు లెఱుంగక పరిహసించి.

ఉ. ఓ యదువీరులార రభ ♦ సోద్ధతిఁ బాఱకుఁ డిట్లు పాఱినం
బోయెదువాఁడఁ గాను మిము ♦ భూమి నడంగిన మిన్నుఁ బ్రాకినం
దోయధిఁ జొచ్చినం దగిలి ♦ ద్రుంచెద నంచు సమస్తసేనతోఁ
బాయక వచ్చె వెంటఁబడి ♦ బాహుబలాఢ్యుఁడు మాగధేశుఁడున్.

వ. మఱియుం బలాయమానులై బహుయోజనంబుల దూరంబు చని విశ్రాంతులై తమకు డాఁగ నెల వగు నని యింద్రుండు మిక్కిలి

---

1. జీమూత సందోహము = మేఘసమూహము, 2. కీలాలధారలు = జలధారలు,
3. సౌదామినీలతికలు = మెఱపుతీఁగలు,

వర్షింపఁ బ్రవర్షణాఖ్యం బై పదునొకండు యోజనంబుల పొడవును
నంతియ వెడలుపును గల గిరి యెక్కి రంత. 1675

శా. ఆ శైలేంద్రముఁ జుట్టి రా విడిచి రోషావిష్టుఁడై మాగధో
ద్రేకుం డావసుదేవనందనులఁ దా వీక్షింపఁగా లేక త
న్నాశేచ్ఛన్ [1]బిలసానుశృంగములఁ బూర్ణక్రోధుఁడై కాష్ఠముల్
రాసుల్ గా నిడి చిచ్చు వెట్టఁ బనిచెన్ రౌద్రంబుతో భృత్యులన్.

వ. ఇట్లు జరాసంధపరిజనప్రదీపితం బైన మహానలంబు దరికొనియె నందు.

క. పొగ లెగసెఁ బొగలతుదలను
మిగులుచు మిడుఁగుఱులు నిగిడె మిడుఁగుఱుగమి ము
న్నుగ బ్రహ్మాండము నిండెను
భగభగ మని మంట లెగసె భయదము లగుచున్. 1678

వ. మఱియు నమ్మహానలంబు బిలసానుశృంగవృక్ష లతాకుంజపుంజంబుల దరికొని శిఖలు కిసలయంబులుగ [2]విస్ఫులింగంబులు విరులుగ సముద్భూత ధూమపటలంబులు బంధురస్కంధ శాఖావిసరంబులుగ [3]ననోకహంబు కైవడి [4]నభ్రంకషం బై ప్రబ్బి [5]కఠోరసమీరణ సమున్నత మహోల్కాజాలతిరోహిత వియచ్చరవిమానంబును, వివిధ విధూమ విస్ఫులింగ విలోకన ప్రభూత నూతనతారకా భ్రాంతి విభ్రాంతగగన చరంబును, సంతప్యమాన సరోవరసలిలంబును విశాలజ్వాలాజాల జాజ్వల్యమాన తక్కోల చందనాగరు కర్పూర ధూమవాసనావాసిత గగనకుహరంబును, కరాళకీలాజాల దందహ్యమానకీచక నికుంజపుంజ సంజనిత చిటచిటారావ పరిపూరిత దిగంతరాళంబును, భయంకర బహుళతర శిఖాభిద్యమాన పాషాణఘోషణ పరిమూర్ఛిత ప్రాణి లోకంబును, [6]సంతప్యమాన శాఖిశాఖాంతర నిబిడ నీడనిహిత శాబక

---

1. బిల సాను శృంగములన్ = గుహలందు, చరియలందు, శిఖరములందును.
2. విస్ఫులింగంబులు = మిడుంగురులు, 3. అనోకహంబు = వృక్షము, 4. అభ్రంకషము = ఆకసము నొరయునది. 5. కఠోరసమీ......మానంబును = తీవ్రమైన వాయువుచే నెగసిన పెద్ద పెద్ద నిప్పుల సముదాయముచేఁ గప్పఁబడిన దేవతా విమానములు కలదియు.
6. సంతప్యమాన.........కులంబును = కాలుచున్న చెట్లకొమ్మలయందు దట్టములైన గూళ్లయందుంచఁబడిన తమ పిల్లలమోహఁబాటు దుఃఖముతో విడిచిపోలేని దరికిరాలేని పక్షిసముదాయములు కలదియు.

వియోగదుఃఖశోకాయమానవిహంగ కులంబును మహాహేతి సందీ
ప్యమాన కటిసూత్ర సంఘటిత మయూరపింఛ కుచకలశ యుగళ
భారాలస శబరకామినీ సమాశ్రిత నిర్ఝరంబును దగ్ధానేక మృగమిథు
నంబు నై యేర్పడెడ. 1679

క. ఇల నేకాదశ యోజనముల పొడవగు శైలశిఖరమునుండి వడిన్
బలకృష్ణులు గుప్పాలముల నెలి కుఱికి కానఁబడక ♦ విలసితలీలన్.

వ. ఇట్లు శత్రువుల వంచించి యాదవేంద్రులు [1]సముద్ర పరిఖంబైన
ద్వారకా నగరంబునకుం జనిరి. జరాసంధుండు వారలు దగ్ధులై రని
తలంచుచు బలంబులుం దానును మగధదేశంబునకు మరలి చనియె
నంత. 1681

—♦ రుక్మిణీ కల్యాణ కథా ప్రారంభము. ♦—

క. [2]ఆ వనజగర్భుపంపున నైవతుఁడను రాజు దెచ్చి ♦ రామున కిచ్చెన్
రేవతి యనియెడు కన్యను భూవర మును వింటి కాదె ♦ బుద్ధిం దెలియన్.

వ. తదనంతరంబ. 1683

మ. ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధ మున్ ♦ గైకొన్న చందంబునన్
జగతీనాథులఁ జైద్యపక్షచరులన్ ♦ సాళ్వాదులం గెల్చి భ
ద్రగుఁడై చక్రి వరించె భీష్మకసుతన్ ♦ రాజీవగంధిన్ [3]రమా
భగవత్యంశభవన్ మహాగుణమణిన్ ♦ బాలామణిన్ రుక్మిణిన్.

వ. అనిన రా జిట్లనియె. మున్ను రాక్షస వివాహంబున స్వయంవరంబు
నకు వచ్చిన హరి రుక్మిణిం గొనిపోయెనని పలికితివి: కృష్ణుం డొక్క
రుం డెవ్విధంబున సాళ్వాదులం జయించి తనపురంబునకుం జనియె
నదియునుం గాక. 1685

శా. కల్యాణాత్మకమైన విష్ణుకథ ♦ లాకర్ణించుచున్ [4]ముక్తవై
కల్యుం డెవ్వఁడు తృప్తుఁడౌ నని వినం ♦ గాఁ గ్రొత్తలౌచుండు సా

1. సముద్రపరిఖంబు = సముద్రమే కందకముగాఁ గలది. 2. ఆవనజగర్భుపంపు
నన్ = ఆ బ్రహ్మయాజ్ఞచే. 3. రమా......భవన్ = లక్ష్మీదేవి యంశముతోఁ బుట్టినది.
4. ముక్తవైకల్యుండు = మనోవైకల్యమేమియు లేనివాఁడు.

కల్యాణంబేర్పడ భూసురోత్తమ యెఱుం ♦ గం బల్కవే రుక్మిణీ
కల్యాణంబు వినంగ నాకుమదిలోఁ♦గౌతూహలం బయ్యెడిన్. 1686

క. భూషణములు సెవులకు బుధ
తోషణము లనేక జన్మ ♦ [1]దురితౌఘ విని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమను ♦ గుణ భాషణముల్. 1687

వ. అని రా జడిగిన శుకుం డిట్లనియె. 1688

చ. వినుము విదర్భ దేశమున ♦ వీరుఁడు కుండినభర్త భీష్మకుం
డను నొక దొడ్డరాజు గలఁ ♦ డాతని కేవురుపుత్త్రు లగ్రజుం
[2]డనయుఁడు రుక్మినాఁ బరఁగు ♦ నందఱకుం గడగొట్టు చెల్లెలై
మనుజవరేణ్యు పుట్టె నొక ♦ మానిని రుక్మిణినాఁ బ్రసిద్ధయై. 1699

క. బాలేందు రేఖ దోఁచిన లాలితయగు నపరదిక్కు ♦ లాగున ధరణీ
పాలుని గేహము మెఱసెను బాలికజన్మించియెదుగ♦భాసురమగుచున్.

వ. మఱియు దిన దిన ప్రవర్ధమానయై. 1691

సీ. పేర్వేర బొమ్మల ♦ పెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వి ♦ య్యంబులందు
గుజ్జెనగూళ్ళను ♦ గొమరొప్ప వండించి
చెలులకుఁ బెట్టించుఁ ♦ జెలువు మెఱయ.
రమణీయమందిరా ♦ రామ దేశంబులఁ
బువ్వుఁదీగెలకును ♦ బ్రోదివెట్టు.
సదమల మణిమయ ♦ సౌధభాగంబుల
లీలతో [3]భర్మడో ♦ లికల నూఁగు

తే. బాలికలతోడఁ జెలరేగి ♦ బంతులాడు
శారికాకీరపంక్తికిఁ ♦ జదువు సెప్పు
బర్హిసంఘములకు మురి ♦ పముల గఱపు
మదమరాళంబులకుఁజూపు ♦ మందగతులు. 1692

---

1. దురితౌఘవినిశ్శోషణము = పాపసముదాయములను బూర్తిగా నెండింపఁజేయునవి. 2. అనయుఁడు = నీతిహీనుఁడు, 3. భర్మడోలికలన్ = బంగారపు టుయ్యెలలందు.

వ. అంత. 1693

సీ. దేవకీసుతు కోర్కె ♦ తీఁగెలు వీడంగ
వెలఁదికి మైదీఁగె ♦ వీడఁ దొడఁగెఁ
గమలనాభుని చిత్త ♦ కమలంబు వికసింపఁ
గాంతి నింతికి ముఖ ♦ కమల మొప్పె
మధువిరోధికి లోన ♦ మదనాగ్ని పొడసూపఁ
బాలఁతికిఁ జనుదోయి ♦ పొడవుసూపె
శౌరికి ధైర్యంబు ♦ సన్నమై డయ్యంగ
జలజాక్షిమధ్యంబు ♦ సన్నమయ్యె

ఆ. హరికిఁ బ్రేమబంధ ♦ మధికంబుగాఁ గేశ
బంధ మధిక మగుడు ♦ బాల కమరెఁ
బద్మనయనువలనఁ ♦ బ్రసవంబు నిండార
నెలఁత మావనంబు ♦ నిండియుండె. 1694

వ. ఇట్లు రుక్మిరుక్మరథ రుక్మబాహు రుక్మకేశ రుక్మనేత్రులను నేవురకుం
జెలియలైన రుక్మిణీదేవి తన [1]యెలప్రాయంబున. 1695

క. తనతండ్రి గేహమునకుం
జనుదెంచుచు నున్న యతిథి ♦ జనులవలనఁ గృ
ష్ణుని రూప బల గుణాదులు
విని కృష్ణుఁడు దనకుఁ దగిన ♦ విభుఁడని తలఁచెన్. 1696

క. ఆ లలనరూపు బుద్ధియు శీలము లక్షణము గుణముఁ ♦ జింతించి తగన్
బాలారత్నముఁ దన కిల్లాలుగఁ జేకొందు ననుచు ♦ హరియుం దలఁచెన్.

వ. అంత. 1698

ఉ. బంధువులెల్లఁ గృష్ణునకు ♦ బాలిక నిచ్చెద మంచు [2]శేముషీ
సింధువులై విచారములు ♦ సేయఁగ వారల నడ్డపెట్టి దు
స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁ ♦ జాల విరోధముఁ జేసి మత్తపు
ష్పంధయవేణి నిత్తు శిశు ♦ పాలునకంచుఁ దలంచె నంధుఁడై. 1699

---

1. ఎలప్రాయము = లేఁబ్రాయము. 2 శేముషీసింధువులు = సముద్రమువలె నెడ
తెగని బుద్ధిగలవారు.

ఉ. అన్నతలంపు దా నెఱిఁగి ♦ యన్నవనీరజగంధి లోన నా
పన్నతనొంది యాప్తుఁడగు ♦ బ్రాహ్మణు నొక్కనిఁ జీరి [1]గర్వసం
ఛన్నుఁడు రుక్మి నేఁడు నను ♦ జైద్యున కిచ్చెద నంచునున్నవాఁ
డెన్నివిధంబులం జని బు ♦ ధేశ్వర చక్రికి విన్నవింపవే. 1700

క. అయ్యా! కొడుకువిచారము లయ్యయు వారింపఁజాలఁ ♦ డటుగాకుండన్
నెయ్యము మెఱిఁగించి చీకును చయ్యన భుజసేనకాను ♦ సారికి శౌరిన్.

వ. అని కొన్ని రహస్యవచనంబులు సెప్పిన విని బ్రాహ్మణుండు ద్వారకా
నగరంబునకుం జని [2]ప్రతిహారులవలనఁ దనరాక యెఱింగించి య
న్నగధరుండున్న [3]నగరు ప్రవేశించి యందుఁ గనకాసనాసీనుండయి
యున్న పురుషోత్తముం గాంచి పెండ్లికొడుకవు గమ్మని దీవించిన
ముసి ముసి నగవులు నగుచు బ్రహ్మణ్యదేవుం డైన హరి తనగద్దియ
దిగ్గన డిగ్గి బ్రాహ్మణుం గూర్చుండ నియోగించి తనకు దేవతలు
సేయు చందంబునం బూజలు సేసి సరసపదార్థ సంపన్నంబైన
యన్నంబుఁ బెట్టించి రెట్టించిన ప్రియంబున నయంబున భూసురుం
డైన భూసురుం జేరి లోకరక్షణ ప్రశస్తం బయిన హస్తంబున నతని
యడుఁగులు పుడుకుచు మెల్లన నిట్లనియె. 1702

సీ. జగతీసురేశ్వర ♦ సంతోషచిత్తుండ
వై యున్న నీధర్మ ♦ మతి సులభము
వృద్ధసమ్మత మిది ♦ విత్త మెయ్యది యైనఁ
బ్రాపింప హర్షించు ♦ బ్రాహ్మణుండు
తన ధర్మమున నుండఁ ♦ దరలఁ డా ధర్మంబు
కోరిక లతనికిఁ ♦ గురియుచుండు
సంతోషి గాఁడేని ♦ శక్రుఁడైన నశించు
నిర్ధనుం డైనను ♦ నిద్ర వోవు

ఆ. సంతసించెనేని ♦ [4]సర్వభూత సుహృత్త
ములకుఁ [5]బ్రాప్తలాభ ♦ ముదితమాన

---

1. గర్వసంఛన్నుఁడు = గర్వముచేఁ గప్పబడినవాఁడు. 2. ప్రతిహారులు = ద్వారపాలకులు. 3. నగరు = రాజగృహము 4. సర్వభూతసుహృత్తములకు = ఎల్లప్రాణుల యెడ స్నేహభావము కలవారికి. 5 ప్రాప్తలాభ.........నసులకు = తమకు లభించిన దానితో సంతోషించు స్వభావము కలవారికి.

సులకు శాంతులకును ♦ సుజనులకును గర్వ
హీనులకును వినతు ♦ లే నొనర్తు. 1703

ఉ. ఎవ్వని దేశమం దునికి ♦ యెవ్వనిచేఁ గుశలంబు గల్గు మీ
కెవ్వని రాజ్యమందుఁ బ్రజ ♦ లెల్ల సుఖింతురు వాఁడు మత్ప్రియుం
[1]డివ్వనరాశి దుర్గమున ♦ కెట్లరుదెంచితి వయ్య నీవు నే
నవ్వలఁ గావు నీతలఁపు ♦ నం గల మే లొనరింతు ధీమణీ. 1704

వ. అని యిట్లు లీలాగృహీత శరీరుం డైన యప్పరమేశ్వరుం డడిగిన ధరణీసురవరుం డతనికి సవినయంబుగా ని ట్లనియె. దేవా విదర్భ దేశాధీశ్వరుం డయిన భీష్మకుం డను రాజు గలం డా రాజుకూఁతురు రుక్మిణి యను కన్యకామణి గల దయ్యిందువదన నీకుం గైంకర్యంబు సేయం గోరి వివాహమంగళప్రశస్తం బయిన సందేశంబు విన్న వింపు మని పుత్తెంచె నవధరింపుము. 1705

సీ. ఏ నీ గుణములు క ♦ ర్ణేంద్రియంబులు సోఁక
దేహతాపంబులు ♦ దీఱి పోవు
నే నీ శుభాకార ♦ మీక్షింపఁ గన్నుల
కఖిలార్థలాభంబు ♦ గలుగు చుండు
నే నీ చరణసేవ ♦ లే ప్రొద్దు చేసిన
భువనోన్నతత్వంబుఁ ♦ బొందఁ గలుగు
నే నీ లసన్నామ ♦ మే ప్రొద్దు భక్తితోఁ
[2]దడవిన బంధసం ♦ తతులు వాయు

తే. నట్టి నీయందు నాచిత్త ♦ మనవరతము
నచ్చియున్నది నీయాన ♦ [3]నాన లేదు
కరుణఁ జూడుము కంసారి ♦ ఖలవిదారి
శ్రీయుతాకార మానినీ ♦ చిత్తచోర. 1706

శా. ధన్యున్ [4]లోకమనోభిరాముఁ గుల వి ♦ ద్యారూపతారుణ్య సౌ
జన్య శ్రీ బల దాన శౌర్య కరుణా ♦ సంశోభితున్ నిన్ను నే

1. ఇవ్వనరాశిదుర్గమునకు = ఈ సముద్రపుఁగోటకు. (సముద్ర మధ్యమునందున్న కోటకు) 2. తడవిన = పలికినచో, 3. నాన = సిగ్గు. 4. లోకమనోభిరాము = లోకుల మనస్సుల కింపు పుట్టించువాఁడు.

కన్యల్ గోరరు కోరదే మును రమా ♦ కాంతాలలామంబు [1]రా
జన్యానేకపసింహ నావలననే ♦ జన్మించె నే మోహముల్. 1707

ఉ. శ్రీయుతమూర్తి యోపురుషసింహము సింహముపాలి సొమ్ము [2]గో
మాయువు గోరుచందమున ♦ మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ
ధ్యాయినియైన నన్ను వడిఁ ♦ దాఁ గొనిపోయెద నంచు నున్న వాఁ
డాయధమాధముం డెఱుఁగ ♦ డద్భుత మైన భవత్ప్రతాపమున్.

మ. వ్రతముల్ దేవగురుద్విజన్మబుధసే ♦ వల్ దానధర్మాదులున్
గతజన్మంబుల నీశ్వరున్ హరి జగ ♦ త్కల్యాణుఁ గాంక్షించి చే
సితినేనిన్ వసుదేవనందనుఁడు నా ♦ చిత్తేశుఁడౌఁ గాక ని
ర్జితులై పోదురుగాక సంగరములోఁ ♦ జేదీశముఖ్యాధముల్.

ఉ. [3]అంకిలి సెప్పలేదు చతు ♦ రంగబలంబులతోడ నెల్లి యో
పంకజనాభ నీవు శిశు ♦ పాలజరాసుతులన్ జయించి నా
వంకకు వచ్చి రాక్షస వి ♦ వాహమునన్ భవదీయ శౌర్యమే
[4]యుంకువ సేసి కృష్ణ పురుషోత్తమ ♦ చేకొనిపొమ్ము వచ్చెదన్.

సీ. లోపలిసౌధంబు ♦ లోనవర్తింపంగఁ
దేవచ్చునే నిన్నుఁ ♦ దెత్తునేని
గావలివారలఁ ♦ గలబంధువులఁ జంపి
కాని తేరాదని ♦ కమలనయన
భావించితేని యు ♦ పాయంబు సెప్పెద
నాలింపు కులదేవ ♦ యాత్రఁ జేసి
నగరంబు వెలువడి ♦ [5]నగజాతకును మ్రొక్కఁ
బెండ్లికి మునుపడఁ ♦ బెండ్లికూఁతు

తే. నెలమి మావారు పంపుదు ♦ రేను నట్ల
పురము వెలువడి యేతెంచి ♦ భూతనాథు
సతికి మ్రొక్కంగ నీవు సా ♦ సమయమందు
వచ్చి కొనిపొమ్ము నన్ను న ♦ వార్యచరిత. 1711

1. రాజన్యానేకప సింహ = ఇతరరాజు లనెడు నేనుఁగులకు సింహమువంటివాఁడా
2. గోమాయువు = నక్క. 3. అంకిలి = అడ్డు. 4. ఉంకువ = ఓలి, 5. నగజాత = పార్వతి.

మ. ఘను [1]లాత్మీయ తమోనివృత్తికొఱకై ♦ గౌరీశుమర్యాద నె
వ్వని పాదాంబుజతోయమందు మునుఁగన్ ♦ వాంఛింతు రే నట్టి నీ
[2]యనుకంపన్ విలసింపనేని వ్రతచ ♦ ర్యన్ నూఱు జన్మంబులన్
నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ ♦ నిక్కంబు ప్రాణేశ్వరా.

సీ. ప్రాణేశ నీ [3]మంజు ♦ భాషలు వినలేని
కర్ణరంధ్రంబుల ♦ కలిమి యేల
పురుషరత్నమ నీవు ♦ భోగింపఁగాలేని
తనులతవలని సౌం ♦ దర్య మేల
భువనమోహన నిన్నుఁ ♦ బొడగానఁగాలేని
చక్షురింద్రియముల ♦ సత్త్వ మేల
దయిత నీ యధరామృ ♦ తం [4]బానఁగాలేని
జిహ్వకు ఫలరస ♦ సిద్ధి యేల

ఆ. నీరజాతనయన ♦ నీ వనమాలికా
గంధ మబ్బలేని ♦ [5]ఘ్రాణ మేల
ధన్యచరిత నీకు ♦ దాస్యంబు సేయని
జన్మ మేల యెన్ని ♦ జన్మములకు. 1713

వ. అని మఱియు రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశంబును రూపసౌందర్యాది విశేషంబులును బ్రాహ్మణుండు హరికి విన్నవించి కర్తవ్యం బెద్ది సేయ నవధరింపు మని [6]సవర్ణనంబుగా మఱియు నిట్లనియె. 1714

సీ. [7]పల్లవ వైభవా ♦ స్పదములు పదములు
[8]కనకరంభా తిర ♦ స్కారు లూరు
లరుణప్రభావమనో ♦ హరములు కరములు
కంబు సౌందర్య మం ♦ గళము గళము

1. ఆత్మీయ...కొఱకై = తమయజ్ఞానమును దొలఁగించుకొనుటకై. 2. అనుకంపన్ = దయతో. 3. మంజుభాషలు = చక్కని పలుకులు. 4. ఆనఁగాలేని = త్రాగలేని. 5. ఘ్రాణము = ముక్కు. 6. సవర్ణనంబుగా = వర్ణనసహితముగా, (వర్ణించుచు). 7. పల్లవ..................స్పదములు = చిగుళ్ల శోభను బోలిన శోభకు స్థానములు. 8. కనక......స్కారులు = బంగారపు అరఁటి స్తంభమును దిరస్కరించునవి.

మహిత భావాభావ ♦ మధ్యంబు మధ్యంబు
చక్షు రుత్పలదాయి ♦ చన్నుదోయి
[1]పరిహసితార్ధేందు ♦ పటలంబు నిటలంబు
[2]జిత మత్తమధుకర ♦ శ్రేణి వేణి

ఆ. భావజాశుగముల ♦ ప్రాపులు చూపులు
కుసుమశరుని వింటి ♦ కొమలు బొమలు
చిత్తశోషణములు ♦ చెలువ భాషణములు
జలజనయన ముఖము ♦ చంద్రసఖము. 1715

ఉ. ఆ యెలనాఁగ నీకుఁ దగు ♦ నంగనకుం దగు దీవు మా యుపా
ధ్యాయుల యాన పెండ్లి యగుఁ ♦ దప్పదు జాడ్యము లేల నీవు నీ
[3]తోయమువారుఁ గూడుకొని ♦ తోయరుహాననఁ దెత్తు గాని వి
చ్చేయుము శత్రులన్ నుఱుము ♦ సేయుము చేయుము శోభనంబులన్.

—♦ శ్రీకృష్ణుండు కుండిననగరంబునకు రథారూఢుండై చనుట ♦—

వ. అని యిట్లు పలికిన బ్రాహ్మణుని వలన విదర్భరాజతనయ పుత్తెంచిన సందేశంబును రూప సౌందర్యాది విశేషంబులును విన నవధరించి నిజకరంబున నతని కరంబు పట్టి నగుచు న య్యాదవేంద్రుం డి ట్లనియె. 1717

ఉ. కన్నియమీఁద నాతలఁపు ♦ గాఢము కూరుకు రాదు రేయి నా
కెన్నఁడు నా వివాహము స ♦ హింపక రుక్మి దలంచు కీడు నే
మున్నె యెఱుంగుదుం బరుల ♦ మూఁక వధించి కుమారి దెత్తు వి
ద్యున్నత మ్రాను ద్రచ్చి నవ ♦ వహ్నిశిఖన్ వడిఁ దెచ్చు కైవడిన్.

క. వచ్చెద విదర్భభూమికిఁ జొచ్చెద భీష్మకుని పురము ♦ సురుచిరలీలం
దెచ్చెద బాలన్ వేల్మిడి వచ్చెద నడ్డంబు రిపులు ♦ వచ్చినఁ బోరన్.

వ. అని పలికి రుక్మిణీదేవి పెండ్లినక్షత్రంబు దెలిసి తనపంపున రథసారథి యైన దారుకుండు సైన్య సుగ్రీవ మేఘ పుష్ప వలాహకంబు లను

1. పరిహసి......పటలంబు = అర్ధచంద్రమండలము నపహసించినది. 2. జిత మత్త......శ్రేణి = మదించిన తుమ్మెదల పంక్తిని జయించినది. 3. తోయమువారు = పరివారము.

తురంగంబులం బూన్చి రథ మాయత్తంబు సేసి తెచ్చిన [1]నమోఘ మనోరథుండై హరి దానును బ్రాహ్మణుండును రథారోహణంబు సేసి యేకరాత్రంబున నానర్తక దేశంబులుగడచి విదర్భదేశంబునకుం జనియె నందుఁ గుండిన పురీశ్వరుం డయిన భీష్మకుండు కొడుకునకు వశుండై తన కూఁతు శిశుపాలున కిత్తు నని [2]శోభనోద్యోగంబులు సేయించె నప్పుడు. 1720

సీ. రచ్చలు క్రంతలు ♦ రాజమార్గంబులు
విపణిదేశంబులు ♦ విశదములుగఁ
జేసిరి చందన ♦ సిక్తతోయంబులు
గలయంగఁ జల్లిరి ♦ [1]కలువడములు
రమణీయ వివిధ తో ♦ రణములుఁ గట్టిరి
సకల గృహంబులు ♦ సక్కఁ జేసి
కర్పూర కుంకుమా ♦ గరు ధూపములు వెట్టి
రతివలు పురుషులు ♦ నన్నియెడల

ఆ. వివిధ వస్త్రములను ♦ వివిధ మాల్యాభర
ణానులేపనముల ♦ నమరి యుండి
రఖిల వాద్యములు మ ♦ హా ప్రీతి మ్రోయించి
రుత్సవమున నగర ♦ మొప్పి యుండె. 1721

వ. అంత నా భీష్మకుండు విహిత ప్రకారంబునం బితృదేవతల నర్చించి బ్రాహ్మణులకు భోజనంబులు వెట్టించి మంగళాశీర్వచనంబులు సదివించి రుక్మిణీదేవి నభిషిక్తం జేసి వస్త్రయుగళ భూషితం గావించి రత్నభూషణంబు లిడం జేసె. ఋగ్యజుస్సామాథర్వణ మంత్రంబుల మంగళాచారంబు లొనరించి భూసురులు రక్షాకరణంబు లాచరించిరి. పురోహితుండు గ్రహశాంతికొఱకు [2]నిగమ నిగదిత న్యాయంబున హోమంబుఁ గావించె. మఱియు నా రాజు దంపతుల మేలు

1. అమోఘ మనోరథుండు = వ్యర్థముగాని కోఱిక గలవాఁడు. 2. శోభనోద్యోగంబు = శుభకార్య ప్రయత్నము. 3. కలువడములు = ఎత్తున వ్రేలఁగట్టిన పూలదండలు, 4. నిగమ నిగదితన్యాయంబునన్ = వేదోక్త విధమున.

కొఱకుఁ [1]దిల ధేను జలధౌత కనక చేలాది దానంబులు ధరణీదేవ తల కొసంగె న య్యవసరంబున. 1722

మ. భటసంఘంబులతో రథావళులతో ♦ [2]భద్రేభయూథంబుతోఁ
బటు వేగాన్విత ఘోటకవ్రజముతోఁ ♦ బంధుప్రియశ్రేణితోఁ
గటుసంరంభముతో విదర్భతనయం ♦ గైకొందు నంచున్ [3]విశం
కటవృత్తిం జనుదెంచెఁ జైద్యుఁడు గడుం ♦ గర్వించి యప్పోటికిన్

ఉ. బంధులఁ గూడి కృష్ణబల ♦ భద్రులు వచ్చినఁ బోరఁ ద్రోలి ని
ర్బంధరవృత్తిఁ జైద్యునికి ♦ మానినిఁ గూర్చెద మంచు నుల్ల స
[4]త్సింధుర వీర రథ్య రథ ♦ సేనలతోఁ జనుదెంచి రా జరా
సంధుఁడు దంతవక్త్రుఁడును ♦ సాల్వ విదూరక పౌండ్రకాదులున్.

వ. మఱియు నానాదేశంబులరాజు లనేకులేతెంచి రందు శిశుపాలు నెదుర్కొని పూజించి భీష్మకుం డొక్కనివేశంబున నతని విడియించె నంత నా వృత్తాంతంబు విని. 1725

చ. హరి యొక్కఁ డేగినాఁడు మగ ♦ ధాదులు [5]చైద్యహితానుసారులై
నరపతు లెందఱేనిఁ జని ♦ నారు కుమారికఁ దెచ్చుచోట సం
గర మగుఁ దోడు గావలయుఁ ♦ గంసవిరోధికి నంచు వేగఁ దా
నరిగె హలాయుధుండు కమ ♦ లాక్షుని జాడ ననేకసేనతోన్. 1726

క. ఆలోపల నేకతమున నాలోలవిశాలనయన ♦ యగు రుక్మిణి త
న్నాలోకలోచనుఁడు హరి యాలోకము సేసికదియఁ ♦ డనిశంకితయై

శా. లగ్నం బెల్లి వివాహముం గదిసె నే ♦ లారాఁడు గోవిందుఁ డు[6]
ద్విగ్నం బయ్యెడి మానసంబు వినెనో ♦ వృత్తాంతముం బ్రాహ్మణుం
డగ్నిద్యోతనుఁ డేటికిం దడసె నా ♦ యత్నంబు సిద్ధించునో
భగ్నంబై చనునో విరించికృత మె ♦ బ్భంగిం బ్రవర్తించునో.

1. తిల...దానంబులు = నూవులు, గోవులు, వెండి, బంగారు, వస్త్రములు, మొదలగువాని దానములు. 2. భద్ర + ఇభ + యూథములు = భద్రజాతి యేనుఁగు గుంపులు 3. విశంకటవృత్తిన్ = అడ్డులేని వర్తనముతో, 4. సింధురములు = ఏనుఁగులు. 5. చైద్యహితానుసారులు = శిశుపాలునకు మేలు నాచరించువారు. 6. ఉద్విగ్నము = తొందరపాటు చెందినది.

మ. ఘనుఁ డా భూసురుఁ డేగెనో నడుమ మా ♦ ర్గశ్రాంతుఁడై చిక్కెనో
విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో ♦ విచ్చేసెనో యీశ్వరుం
డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో ♦ యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో ♦ నాభాగ్య మెట్లున్నదో.

వ. అని వితర్కించుచు. 1730

ఉ. పోఁడను బ్రాహ్మణుండు యదు ♦ పుంగవు వీటికి వాసుదేవుఁడున్
రాఁడను నింకఁ బోయి హరి ♦ రమ్మని చీరెడి యిష్టబంధుఁడున్
లేఁడను రుక్మికిం దగవు ♦ లే దిటఁ జైద్యున కిత్తు నంచు ను
న్నాఁడను గౌరి కీశ్వరికి ♦ నావలనం గృప లేదు నేఁ డనున్. 1731

ఉ. చెప్పదు తల్లికిం [1]దలఁపుఁ ♦ జిక్కు దిశల్ [2]దరహాస చంద్రికం
గప్పదు [3]వక్త్ర తామరస ♦ గంధ సమాగత భృంగసంఘమున్
రొప్పదు నిద్రఁ గైకొన దు ♦ రోజ పరస్పరసక్త హారముల్
విప్పదు కృష్ణ మార్గగత ♦ వీక్షణపంక్తులు ద్రిప్ప దెప్పుడున్.

చ. తుడువదు కన్నులన్ వెడలు ♦ తోయకణంబులు కొప్పుఁ జక్కగా
ముడువదు నెచ్చెలిం గదిసి ♦ ముచ్చటకుం జన దన్న మేమియుం
గుడువదు నీరముం గొనదు ♦ కూరిమిఁ గీరము జేరి పద్యమున్
నొడువదు [4]వల్లకీగుణ వి ♦ నోదము సేయదు డాయ దన్యులన్.

సీ. మృగనాభి యలఁదదు ♦ మృగరాజమధ్యమ
జలముల నాడదు ♦ జలజగంధి
[5]ముకురంబు సూడదు ♦ ముకుర సన్నిభ ముఖి
పువ్వులు దుఱుమదు ♦ పువ్వుఁబోఁడి
వనకేళిఁ గోరదు ♦ వనజాత లోచన
హంసంబుఁ బెంపదు ♦ హంసగమన
లతలఁ బోషింపదు ♦ [6]లతికా లలితదేహ
తొడవులు తొడువదు ♦ తొడవు తొడవు

---

1. తలఁపుఁజిక్కు = మనసులోనిబాధ. 2. దరహాస చంద్రికన్ = నవ్వు వెన్నెల చేత. వక్త్రతా...ఘమున్ = ముఖపద్మమునందలి సువాసనకై వచ్చిన తుమ్మెదలగుంపును 4. వల్లకీగుణ వినోదము = వీణతీఁగెలపై వేడుక (గానమును) 5. ముకురము = అద్దము. 6. లతికా లలితదేహ = తీఁగవలె నందమైన శరీరము కలది.

ఆ. తిలక మిడదు నుదుటఁ ♦ దిలకించి తిలకంబు
కమలగృహముఁ జొరదు ♦ కమలహస్త
గారవించి తన్నుఁ ♦ గరుణఁ గైకొన వన
మాలి రాఁడు తగవు ♦ మాలి యనుచు. 1734

వ. మఱియును. 1735

మ. మలఁగున్ మెల్లనిగాలికిన్ బటుకట ♦ [1]న్మత్త ద్విరేఫాలికిం
దలఁకున్ గోయిలమ్రోఁతకై యలఁగు ను ♦ ద్యత్కీర సంభాషలం
గలఁగున్ వెన్నెలవేఁడిమిన్ సొలఁగు [2]మా ♦ కందాంకురచ్ఛాయకుం
దొలఁగుం గొమ్మ [3]మనోభవానల శిఖా♦దోధూయమానాంగియై.

వ. ఇట్లు హరిరాక కెదురు చూచుచు సకల ప్రయోజనంబులయందును విరక్తయై మనోజానలంబునం బొగిలెడి మగువకు శుభంబుఁ జెప్పు విధంబున వామలోచన భుజంబు లదరె నంతఁ గృష్ణు నియోగంబున వేగంబున బ్రాహ్మణుండు సనుదెంచిన నతని ముఖ లక్షణం బుపలక్షించి యాకలకంఠి మహోత్కంఠాక్రోడ నకుంఠిత యై మొగంబునం జిఱునగవు నిగుడ నెదురుసని నిలువంబడిన బ్రాహ్మణుం డిట్లనియె. 1737

ఉ. మెచ్చె భవద్గుణోన్నతి క ♦ మేయ ధనావళు లిచ్చె నాకుఁ దా
వచ్చె సుదర్శనాయుధుఁడు ♦ వాఁడె సురాసురులెల్ల నడ్డమై
వచ్చిన నైన [4]రాక్షస వి ♦ వాహమునం గొనిపోవు నిన్ను నీ
సచ్చరితంబు భాగ్యమును ♦ సర్వము నేఁడు ఫలించెఁ గన్యకా. 1738

వ. అనిన వైదర్భి యిట్లనియె. 1739

మ. జలజాతేక్షణుఁ దోడి తెచ్చితివి నా ♦ సందేశముం జెప్పి న
న్నిలువం బెట్టితి నీకృపం బ్రతికితిన్ ♦ నీయట్టి పుణ్యాత్మకుల్

1. మత్తద్విరేఫాలి = మదించిన తుమ్మెదపంక్తి, 2. మాకందాంకురచ్ఛాయకున్ = మామిడి చిగుళ్ళనీడకు. 3. మనోభ...నాంగియై = మన్మథాగ్ని జ్వాలలచేఁ దపింపజేయఁ బడుచున్న శరీరము కలదియై. 4. రాక్షస వివాహము = పెద్దలనోడించి వధువును బలాత్కారముగఁ గొనిపోయి చేసికొను పెండ్లి. (అష్టవిధ వివాహములలో నిదియొకటి)

గలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం • గావింప నే నేర నం
జలిఁ గావించెద భూసురాన్వయమణీ • సద్బంధుచింతామణీ. 1740

వ. అని నమస్కరించె నంత రామకృష్ణులు దన కూఁతువివాహంబునకు వచ్చుటవిని తూర్యఘోషంబులతో నెదుర్కొని విధ్యుక్తప్రకారంబున బూజించి మధుపర్కంబు లిచ్చి వివిధాంబరాభరణంబులు మొదలైన కానుక లొసంగి భీష్మకుండు బంధుజన సేనా సమేతులైన వారలకుఁ [1]దూర్ణంబున సకల సంపత్పరిపూర్ణంబు లైన నివేశంబులు కల్పించి విడియించె నిట్లుకూడిన రాజులకెల్లను వయో వీర్యబల విత్తంబు లెట్లట్లు కోరినపదార్థంబు లెల్ల నిప్పించి పూజించెనంతవిదర్భ పురంబు ప్రజలు హరి రాక విని వచ్చిచూచి నేత్రాంజలులం దదీయ వదన కమలపానంబు సేయుచు. 1741

మ. తగు నీచక్రికి విదర్భరాజసుతకుం • దథ్యంబు వైదర్భియుం
దగు నీచక్రికి నింత మంచి దగునే • దాంపత్య మీ యుద్ధతిం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా • [2]దర్పాహతారాతియై
మగఁడౌఁ గావుతఁ జక్రి యీరమణికిన్ • మాపుణ్యమూలంబునన్.

వ. అని పలికి రా సమయంబున. 1743

సీ. సన్నద్ధులై బహు • శస్త్రసమేతులై
బలసి చుట్టును వీర • భటులు గొలువ
ముందఱ నుపహార • ములు కానుకలు గొంచు
వర్గంబులై వార • వనిత లేఁగఁ
బుష్ప గంధాంబర • భూషణ కలితలై
పాడుచు భూసుర • భార్య లరుగఁ
బణవ మర్దళ శంఖ • పటహ కాహళ వేణు
భేరీధ్వనుల మిన్ను • పిక్కటిల్లఁగఁ

ఆ. దగిలి సఖులు గొలువఁ • దల్లులు బాంధవ
సతులుఁ దోడరాఁగ • సవినయముగ

1. తూర్ణంబునన్ = వేగముతో. 2. దర్పాహతారాతియై = శౌర్యముచే శత్రువులఁ గొట్టినవాఁడై.

నగరు వెడలి నడచె ♦ నగజాతకును మ్రొక్క
బాల [1]చికురవిహిత ♦ ఫాల యగుచు. 1744

వ. మఱియు సూత మాగధ వంది గాయక సాంశిక జను లంతంత నభినం
దించుచుం జనుదేర మందగమనంబున ముకుంద చరణారవిందం
బులు డెందంబునం దలంచుచు [2]ఇందుధర సుందరీ మందిరంబు
చేరి సలిలధారాధౌత కరచరణారవిందయై వార్చి శుచియై గౌరీ
సమీపంబునకుం జనియె, నంత ముత్తైదువలగు భూసురోత్తముల
భార్యలు భవసహితయైన భవానికి మజ్జనంబు గావించి గంధాక్ష
తంబు లిడి వస్త్రమాల్యభూషణాదుల నలంకరించి ధూపదీపంబు
లొసంగి నానావిధోపహారంబులు సమర్పించి కానుకలిచ్చి దీపమాలి
కల నివాళించి రుక్మిణీదేవిని మ్రొక్కించి రప్పుడు. 1745

ఉ. నమ్మితి నామనంబున [3]స ♦ నాతను లైన యుమామహేశులన్
మిమ్ముఁ [4]బురాణదంపతుల ♦ మేలు భజింతుఁ గదమ్మ మేటి పె
ద్దమ్మ దయాంబురాశివిగ ♦ దమ్మ హరిం బతిఁజేయు మమ్మ నిన్
నమ్మినవారి కెన్నఁడును ♦ నాశము లేదుగదమ్మ యీశ్వరీ. 1746

వ. అని గౌరీదేవికి మ్రొక్కి పతులతోడం గూడిన బ్రాహ్మణ భార్య
లకు [5]లవణాపూపంబులును దాంబూల కంఠసూత్రంబులును నిక్షు
దండంబులు నిచ్చి రుక్మిణీదేవి వారలం బూజించిన. 1747

ఆ. వార లుత్సహించి ♦ వలనొప్ప దీవించి
సేసలిడిరి యువతి ♦ శిరమునందు
సేసలెల్లఁ దాల్చి ♦ శివవల్లభకు మ్రొక్కి
మౌననియతి మాని ♦ మగువ వెడలె.

వ. ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు [6]క్రొక్కారు మెఱుంగు
తెఱంగున [7]మృగధర మండలంబు నిర్గమించి చరించు మృగంబు

1 చికురవిహితఫాల = ముంగురులచేఁ గప్పఁబడిన నుదురు కలదియై. 2. ఇందుధర సుందరీమందిరము = శివుని భార్యయగు దుర్గగుడి. 3. సనాతనులు = శాశ్వతులు 4. పురాణదంపతులు = ప్రాచీనులగు భార్యాభర్తలు. 5. లవణ + అపూపంబులు = ఉప్పును అప్పములును. 6. క్రొత్త + కారు + మెఱుంగు = వర్షకాలారంభము నందలి మెఱుపువలె. 7. మృగధర మండలము = చంద్రమండలము

చందంబునఁ [1] కమలభవనర్తకుం డెత్తిన [2]జవనిక మఱుఁగు దెరలి
పొడసూపిన మోహినీదేవతకై వడి [3]దేవదానవ సంఘాత కరతల
సవ్యాపసవ్య సమాకృష్యమాణ పన్నగేంద్ర పాశ పరివలయిత
పర్యాయ పరిభ్రాంత మాంధరాచల మంథాన మథ్యమాన ఘూర్ణిత
ఘుమఘుమాయిత మహార్ణవమధ్యంబుననుండి చనుదెంచు నిందరా
సుందరీ వైభవంబున బహువిధప్రభాభాసమానయై యిందుధర
గేహినీ మందిరంబు వెలువడి మానస కాసార హేమకమల కానన
విహరమాణ మదమరాళంబు భంగి మందగమనంబునఁ గనకకలశ
యుగళ సంకాశ కర్కశ పయోధరభార పరికంప్యమాన మధ్యయై
రత్న ముద్రికాలంకృతంబైన కెంగేల నొక్క సఖీలలామంబు
కైదండ గొని రత్ననివహ సమంచిత కాంచన కర్ణపత్రమయూఖం
బులు గండభాగంబుల నర్తనంబులు సలుప నరవింద పరిమళ
కుతూహలావతీర్ణ మత్త మధుకరంబుల మాడ్కి నరాళంబులైన
కుంతలజాలంబులు ముఖమండలంబులనం గ్రందుకొన సుందరమంద
హాసరోచులు దిశలందు బాలచంద్రికాసౌందర్యంబు నావహింప
[4]నధరబింబ ఫలారుణ మరీచిమాలికలు [5]రదన కుంద కుట్మలంబుల
కనురాగంబు సంపాదింప మనోజాత కేతన సన్నిభంబైన పయ్యెద
కొంగు దూఁగ సువర్ణ [6]మేఖలాఘటిత మణికిరణ పటలంబు [7]లకాల
శక్రచాప జనకంబులై మెఱయఁ జెఱకువిలుతుం డారవెఱికి వాఁడి
యిడి జళిపించిన ధగద్ధగాయమానంబు లగు బాణంబుల పగిది సురు
చిర విలోకన నికరంబులు రాజవీరుల హృదయంబులు భేదింపఁ
[8]శింజాన మంజు మంజీర నినదంబులు చెవుల పండువులు సేయఁ బాద

---

1. కమలభవనర్తకుండు = బ్రహ్మయనెడు నటకుఁడు. 2. జవనిక = తెర, 3. దేవదానవ......మధ్యంబుననుండి = దేవతల రాక్షసుల సముదాయముయొక్క కుడి యెడమ చేతులతో లాగఁబడుచున్న వాసుకియను త్రాటిచే బాగుగాఁ జుట్టఁబడి యొక మారు కుడివంక మఱి యొకమారెడమవంకఁ దిరుగుచున్న మందరగిరి యను కవ్వముచే మథింపఁబడుచు క్షోభితమై పెద్దధ్వని కలిగిన సముద్రము గర్భమునుండి 4. అధర... మాలికలు = దొండపండువంటి పెదవియొక్క యెఱ్ఱని కాంతి పంక్తులు. 5. రదనకుంద కుట్మలంబులు = మల్లె మొగ్గలవంటి దంతములు, 6. మేఖల = మొలనూలు, 7. అకాల శక్రచాపంబులు = అకాలమునందలి యింద్ర ధనువులు, 6. శింజాన......దంబులు = మువ్వలచే నందమైన యందెల చప్పుళ్ళు.

సంచారంబున హరి రాక కెదురుచూచుచు వీరమోహినియై చను దెంచుసమయంబున. 1749

మ. అళినీలాలకఁ బూర్ణచంద్రముఖి నే ♦ ణాక్షిం బ్రవాళాధరం
గలకంఠిన్ ¹నవపల్లవాంఘ్రియుగళం ♦ గంధేభ కుంభస్తనిం
బులినశ్రోణి నిభేంద్రయాన నరుణాం ♦ భోజాత హస్తన్ మహో
త్పల గంధిన్ మృగరాజ మధ్యఁ గని వి ♦ భ్రాంతాత్ములై రందఱున్.

వ. మఱియు నయ్యింతి దరహాస లజ్జావలోకనంబులం జిత్తంబు లేమఱి ధైర్యంబులు దిగనాడి గాంభీర్యంబులు విడిచి గౌరవంబులు మఱచి చేష్టలు దూలి యెఱుక లుడిగి యాయుధంబులు దిగవైచి గజతురగ రథారోహణంబులు సేయనేరక రాజులెల్ల నేలకు వ్రాలి రా యేణీలోచన తన వామకర నఖంబుల నలకంబులు దలంగం ద్రోయుచు నుత్తరీయంబు చక్కనొత్తుచుఁ గడగంటి చూపులం గ్రమంబున నా రాజలోకంబు నాలోకించుచు. 1751

మ. కనియెన్ రుక్మిణి చంద్రమండల ముఖుం ♦ ²గంఠీరవేంద్రావల
గ్ను నవాంభోజదళాక్షుఁ జారుతర వ ♦ క్షున్ మేఘ సంకాశదే
హు నగారాతి గజేంద్ర హస్త నిభ బా ♦ హుం జక్రిఁ బీతాంబరున్
ఘన భూషాన్వితుఁ గంబుకంఠు విజయో ♦ త్కంఠున్ జగన్మోహనున్.

—♦ శ్రీకృష్ణుఁడు శత్రురాజులు చూచుచుండ రుక్మిణీదేవిని గొనిపోవుట. ♦—

వ. కని తదీయ రూప వయో లావణ్య వైభవ గాంభీర్య చాతుర్య తేజో విశేషంబులకు సంతసించి మనోభవ శరాక్రాంతయై రథారోహణంబు గోరుచున్న ³వరారోహం జూచి పరిపంథి రాజలోకంబు సూచుచుండ మందగమనంబున గంధసింధురంబు లీలం జనుదెంచి ఫేరవంబుల నడిమి భాగంబు గొని చను కంఠీరవంబు కైవడి నిఖిల భూపాల గణంబుల గణింపక తృణీకరించి రాజకన్యకం దెచ్చి హరి తన రథంబుమీఁద నిడుకొని భూ నభోంతరాళంబులు

1. నవపల్లవాంఘ్రియుగళిన్ = క్రొత్త చిగుళ్ళవంటి యడుగుల జంట కలది. 2. కంఠీర.....లగ్ను = సింహము నడుమువంటి నడుము కలవాఁడు. 3 వరారోహ = ఉత్తమకాంత.

నిండ శంఖంబు పూరించుచు బలభద్రుండు తోడ నడువ [1]యాదవ వాహినీ పరివృతుండై ద్వారకా నగర మార్గంబు పట్టి చనియె నంత జరాసంధ వశులగు రాజులందఱు హరి పరాక్రమంబువిని సహింప నోపక. 1753

మ. ఘన సింహంబుల కీర్తి నీచ మృగముల్ ♦ గైకొన్న చందంబునన్
మనకీర్తుల్ గొని బాలఁ దోడ్కొనుచు ను♦న్మాదంబుతో గోపకుల్
సనుచున్నా రదె శౌర్య మెన్నఁటికి మీ ♦ శస్త్రాస్త్రముల్ గాల్పనే
తనుమధ్యన్ విడిపింపమేని నగరే ♦ ధాత్రీ జనుల్ క్రంతలన్. 1754

వ. అని యొండొరులం దెలుపుకొని రోషంబులు హృదయంబుల నిలుపుకొని సంరంభించి తనుత్రాణంబులు వహించి ధనురాది సాధనంబులు ధరియించి పంతంబులాడి తమ తమ చతురంగ బలంబులం గూడికొని జరాసంధాదులు యదువీరుల వెంటనంటి తాఁకి నిలు నిలుండని ధిక్కరించి పలికి యుక్కు మిగిలి మహీధరంబులమీఁద సలిల ధారలు గురియు ధారాధరంబుల చందంబున బాణవర్షంబులు గురిసిన యాదవ సేనలం గల దండనాయకులు కోదండంబు లెక్కిడి గుణంబులు మ్రోయించి నిలువంబడి రప్పుడు. 1755

క. అరిబలభట సాయకముల హరిబలములు గప్పఁబడిన ♦ నడరెడుభీతిన్
[2]హరిమధ్యసిగ్గుతోడను హరివదనముఁ జూచెఁ [3]జకిత♦హరిణేక్షణయై.

వ. ఇట్లు సూచిన. 1757

క. చొచ్చెదరదె యదువీరులు వచ్చెద రరిసేన నెల్ల ♦ వైరులు వెలుచన్
నొచ్చెదరును విచ్చెదరును జచ్చెదరును నేఁడు చూడు♦జలజాతాక్షీ.

వ. అని రుక్మిణీదేవిని హరి యూరడించె నంత బలభద్రప్రముఖులైన యదువీరులు ప్రళయవేళల మిన్నునం బన్ని బలువిడుగు లడరించు పెనుమొగుళ్ల వడువున జరాసంధాది పరిపంథి రాజచక్రంబుమీఁద నవక్ర పరాక్రమంబున [4]శిఖిశిఖా సంకాశ నిశిత శిలీముఖ నారాచ

---

1 యాదవ వాహినీ.....వృతుండు = యాదవ సేనలచేఁ జుట్టఁబడినవాఁడు 2. హరిమధ్య = సింహము నడుమువంటి నడుము కలది. 3. చకితహరిణేక్షణయై = బెదరిన లేడిచూపులవంటి చూపులు కలదియై. 4, శిఖిశిఖా......ముఖంబులు = అగ్నిజ్వాలలతో సమానమైన వాడియగు బాణములు (అచ్చపు టినుపబాణములు, బల్లెములు మొదలైనవి.)

భల్ల ప్రముఖంబు లైన బహువిధ బాణపరంపరలు గురియ నదియును విదళిత మత్తమాతంగంబును విచ్ఛిన్న తురంగంబును విభిన్నరథ వరూథంబును వినిహత పదాతియూథంబును [1]విఖండిత వాహవారణ రథారోహణ మస్తకంబును విశకలిత వక్షోమధ్య కర్ణ కంఠ కపోల హస్తంబును విస్ఫోటిత కపాలంబును వికీర్ణ కేశజాలంబును విపాటిత చరణజాను జంఘంబును విదళిత దంతిసంఘంబును విఘటిత వీర మంజీర కేయూరంబును విభ్రష్ట కుండల కిరీట హారంబును విస్మృత వీరాలాపంబును విదార్యమాణ గదా కుంతతోమర పరశుపట్టిక ప్రాస కరవాల శూల చక్రచాపంబును వినిపాతిత కేతన చ్ఛత్ర చామరంబును విలూనతనుత్రాణంబును [2]వికీర్యమాణఘోటక సంఘ రింఖా సముద్ధూత ధరణీ పరాగంబును వినష్ట రథ వేగంబును వినివారిత సూత మాగధ వంది నాదంబును వికుంఠిత [3]హాయహేషాపటహ భాంకార కరటిఘటాఘీంకార రథనేమి పటపటాత్కార తురంగ నాభి ఘంటా ఘణఘణాత్కార వీరహుంకార భూభణ ఝణఝణాత్కార నిస్సాణ ధణధణాత్కార మణినూపుర క్రేంకార కింకిణీ కిణకిణాత్కార శింజినీ టంకార భట పరస్పర ధిక్కార నాదంబును వినిర్భిద్యమాన రాజసమూహంబును విద్యమానరక్త ప్రవాహంబును విశ్రూయమాణ భూతభేతాళ కలకలంబును విజృంభమాణ ఫేరవకాక గృధ్రకంకాది సంకులంబును [4]ప్రచలిత కబంధంబును ప్రభూత పలల గంధంబును ప్రదీపిత మేదోమాంస రుధిర ఘాదంబును ప్రవర్తిత ఢాకినీ ప్రమోదంబును నై యుండె నప్పుడు.

చ. మగిడి చలించి పాఱుచును ♦ మాగధముఖ్యులు గూడి యొక్కచో
వగచుచు నాలిఁ గోల్పడిన ♦ వానిక్రియం గడు వెచ్చ నూర్చుచున్
మొగమున దప్పి దేరఁ దమ ♦ ముందరఁ బొక్కుచునున్న చైద్యుతోఁ
బగతురచేతిలోఁ బడక ♦ ప్రాణముతో దుత నున్నవాఁడవే. 1760

1. విఖండితవాహ...మస్తకంబును = తెగఁగొట్టబడిన గుఱ్ఱముల యేనుఁగుల రథముల నెక్కిన యోధుల శిరములు కలదియు, 2. వికీర్యమాణ......రాగంబును = చిమ్మఁబడిన గుఱ్ఱముల డెక్కలచే నెగురఁ గొట్టఁబడిన భూమియొక్క ధూళిగలదియు, 3. హాయహేషా = గుఱ్ఱపుసకిలింపు. 4. ప్రచలిత కబంధంబును = కదలుచున్న మొండెములుకలది.

వ. అని మఱియును. 1761

ఆ. బ్రతుక వచ్చు నొడలఁ ♦ బ్రాణంబు లుండిన
బ్రతుకు గలిగెనేని ♦ భార్యఁగలదు
బ్రతికి తీవు భార్యఁ ♦ బట్టు దయ్యె నెఱుంగ
వగవ వలదు చైద్య ♦ వలదు వలదు. 1762

వ. వినుము దేహధారి స్వతంత్రుండుగాఁడు జంత్రగానిచేత జంత్రపు బొమ్మకైవడి [1]నీశ్వరతంత్ర పరాధీనుండై సుఖదుఃఖంబులందు వర్తనంబులు సలుపుఁ, దొల్లి యేను మధురాపురంబుమీఁదఁ బదియేడు మారులు పరాక్రమంబున విడిసి చక్రిచేతం బరాజిత బలచక్రుండనై కామపాలుచేతం బట్టువడి కృష్ణుండు కరుణసేసి విడిపించిన వచ్చి క్రమ్మఱ నిరువదిమూఁ డక్షౌహిణులం గూడుకొని పదునెనిమిదవ మారు దాడి సేసి శత్రులం దోలి విజయంబు సేకొంటి నిట్టి జయాపజయంబులందు హర్షశోకంబుల నెన్నండును జెంద. దైవయుక్తంబయిన కాలంబునం జేసి లోకంబులు పరిభ్రమించుచుండు నదియునుంగాక. 1763

మ. తమకుం గాలము మంచిదైన మనలం ♦ [2]త్రైలోక్యవిఖ్యాతవి
క్రములన్ గెల్చిరి యాదవుల్ హరిభుజా ♦ గర్వంబునన్ నేఁడు కా
లము మేలై చనుదెంచెనేని మనముం ♦ లక్షించి విద్వేషులన్
సమరక్షోణి జయింత మింతపనికై ♦ శంకింప నీ కేటికిన్. 1764

వ. అని యిట్లు జరాసంధుండు నతనియొద్ది రాజులును శిశుపాలుని పరితాపంబు నివారించి తమతమ ధామములకుఁజనిరి. శిశుపాలుండు ననుచరుసమేతుండై తననగరంబునకుం జనియె నంత రుక్మి యను వాఁడు కృష్ణుండు రాక్షసవివాహంబునం దన చెలియలిం గొనిపోవుటకు సహింపక నేకాక్షౌహిణీబలంబుతోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెనుదవిలి పోవుచుఁ దనసారథితో నిట్లనియె. 1765

1. ఈశ్వర.........ధీనుండై = భగవంతుని కృత్యములకు లోఁబడినవాఁడై.
2. త్రైలోక్య......క్రములన్ = మూఁడు లోకములందుఁ బ్రసిద్ధి వహించిన శౌర్యములు గలవారిని.

ఉ. బల్లిదు నన్ను భీష్మజన ♦ పాలకుమారకుఁ బిన్నఁజేసి నా
చెల్లెలి రుక్మిణిం గొనుచుఁ ♦ జిక్కని నిక్కపుబంటుపోలె నీ
గొల్లఁడు పోయెడిన్ రథముఁ ♦ గూడఁగఁ దోలుము [1]తేజితోల్లస
ద్భల్లపరంపరన్ మదముఁ ♦ బాపెదఁ జూపెద నా ప్రతాపమున్.

వ. అని యిట్లు రుక్మిణియనువాఁడు హరికోలంది యెఱుంగక సారథి నదలించి రథంబుఁ గూడం దోలించి గోపాలక వెన్నమ్రుచ్చ నిమిష మాత్రంబు నిలునిలు మని తిరస్కరించి బలువింట నారి యెక్కించి మూఁడు వాఁడితూఁపుల హరి నొప్పించి యిట్లనియె. 1767

సీ. మాసరివాఁడవా ♦ మాపాపఁ గొని పోవ
నేపాటి గలవాఁడ ♦ వేది వంశ
మెందు జన్మించితి ♦ వెక్కడఁ బెరిఁగితి
వెయ్యది నడవడి ♦ యెవ్వఁ డెఱుఁగు
మానహీనుఁడ వీవు ♦ మర్యాదలుఁను లేవు
మాయఁ గైకొని కాని ♦ మలయరావు
నిజరూపమున శత్రు ♦ నివహంబుపైఁ బోవు
వసుధేశుఁడవు గావు ♦ వావి లేదు

ఆ. కొమ్మ నిమ్ము నీవు ♦ గుణరహితుండవు
విడువు విడవవేని ♦ [2]విలయకాల
శిఖిశిఖాసమాన ♦ శితశిలీముఖముల
గర్వ మెల్లఁ గొందుఁ ♦ గలహమందు. 1768

వ. అని పలికిన నగధరుండు నగి యొక్క బాణంబున వానికోదండంబు ఖండించి యాఱుశరంబుల శరీరంబు దూఱనేసి యెనిమిది విశిఖంబుల రథ్యంబులం గూల్చి రెండమ్ముల సారథిం జంపి మూఁడు వాఁడి తూఁపులఁ గేతనంబుఁ ద్రుంచి మఱియు నొక్కవిల్లందినం దునిమి వెండియు నొక్కధనువు పట్టిన విదళించి క్రమంబునం బరిఘపట్టిస శూల చర్మాసి తోమరంబులు ధరియించినం దునుకలు చేసి

1. తేజితో......పరంపరన్ = తేజోవంతములై ప్రకాశించు బాణపంక్తిచేత.
2. విలయకాల......ఖములన్ = ప్రళయకాలమందలి యగ్నిజ్వాలలవలె తీక్ష్ణమైన బాణములచేత.

క్రమ్మర నాయుధంబు లెన్ని యెత్తిన నన్నియు శకలంబులుగావించె నంతటఁ దనివిసనక వాఁడు రథంబు డిగ్గి ఖడ్గహస్తుండై దవానలంబు పయింబడు మిడుతచందంబునం గదిసిన ఖడ్గ కవచంబులు చూర్ణంబులు చేసి మెఱుంగులు చెదర నడిదంబు వెఱికి జళిపించి వాని శిరంబుఁ దెగ వ్రేయ గమకించి నడుచు చున్న నవసరంబు వచ్చి రుక్మిణీదేవి హరి చరణారవిందంబులు పట్టుకొని యిట్లనియె.

మ. నిన్ను నీశ్వర దేవదేవుని • నిర్ణయింపఁగ లేక యో
సన్నుతామరకీర్తి శోభిత • సర్వలోక శరణ్య మా
యన్న యీతఁడు నేఁడు సేసె మ • హాపరాధము నీయెడన్
నన్ను మన్నన సేసి కావు [1]మ • నాథ నాథ దయానిధీ. 1770

మ. కల్ల లేదని విన్నవించుట • గాదు వల్లభ యీతనిం
బ్రల్లదుం దెగఁ జూచితేనియు • భాగ్యవంతుల మైతి మే
మల్లుఁడయ్యె ముకుందుఁ డీశ్వరుఁ • డంచు మోదితులైన మా
తల్లిదండ్రులు పుత్రశోకముఁ • దాల్చి చిక్కుదు రీశ్వరా. 1771

మ. అని డగ్గుత్తికతో మహాభయముతో • నాకంపితాంగంబుతో
వినతశ్రాంతముఖంబుతో [2]శ్రుతిచల • ద్వేణీకలాపంబుతోఁ
గనుదోయిన్ జడిగొన్న బాష్పములతోఁ • గన్యాలలామంబు మ్రొ
క్కిన రుక్మిం దెగ వ్రేయఁ బోక మగిడెం • గృష్ణుండు [3]రోచిష్ణుఁడై.

వ. ఇట్లు చంపక బావా రమ్మని చిఱునగవు నగుచు వానిం బట్టి బంధించి గడ్డంబును మీసంబును తలయును రేవులువాఱ గొఱిగి విరూపిం జేసె, నంత యదువీరులు పరసైన్యంబులం బాఱఁద్రోలి తత్సమీపంబునకు వచ్చి రప్పాపు హతప్రాణుండై కట్టువడి యున్న రుక్మిం జూచి కరుణ చేసి బలభద్రుండు బంధంబులు విడిచి హరిడగ్గఱి యిట్లనియె. 1773

క. [4]తల మనక భీష్మనందను
తలయును మూఁతియును గొఱుఁగఁ • దగవే బంధుం

1. అనాథనాథ = దిక్కులేనివారికి దిక్కైనవాఁడా! 2. శ్రుతిచల........కంబుతో = చెవిపైఁ గదలుచున్న జడముడితో. 3. రోచిష్ణుఁడై = తేజోవంతుఁడై. 4. తలము = తొలఁగుము.

దలయును బూఁతియు గొఱుగుట
తలఁ దఱుఁగుటకంటెఁ జచ్చు ♦ తరము మహాత్మా. 1774

క. కొందఱు దుష్టులని కీడును గొందఱు హితులనుచు మేలు ♦ గూర్పవు నిజమీ
వందఱియందును సముఁడవు పొందఁగ నేలయ్య విషమ ♦ బుద్ధి ననంతా.

వ. అని తర్జించి పలికి రుక్మిణీదేవి నుపలక్షించి యిట్లనియె. 1776

—♦ సహోదరవిభంగమునకు ఖిన్నయగు రుక్మిణీదేవిని బలభద్రుండూరార్చుట. ♦—

శా. తోడం బుట్టినవాని భంగమునకున్ ♦ దుఃఖించి మా కృష్ణు నె
గ్గాడం జూడకు మమ్మ పూర్వభవక ♦ ర్మాధీనమై ప్రాణులం
గీడున్ మేలును జెందు లేఁ డొకఁడు శి ♦ క్షింపంగ రక్షింప నీ
తోడంబుట్టువు [1]కర్మశేష పరిభూ ♦ తుం డయ్యె నేఁడియ్యెడన్.

క. చంపెడిదోషము గలిగినఁ జంపఁ జనదు బంధుజనులఁ ♦ జనువిడువంగాఁ
జంపెనదోషము సిద్ధము చంపను మఱియేల మున్న ♦ చచ్చినవానిన్.

ఆ. బ్రహ్మచేత భూమి ♦ పతులకీ ధర్మంబు
కల్పితంబు రాజ్యకాంక్షఁ జేసి
తోడిచూలు నైనఁ ♦ దోడఁ బుట్టినవాఁడు
చంపు చుండుఁ గ్రూర ♦ చరితుఁ డగుచు. 1779

క. భూమికి ధన ధాన్యములకు
భామలకును మానములకుఁ [2]బ్రాభవములకుం
గామించి మీఁదు గానక
శ్రీమదమున మానధనులు ♦ చెనకుదు రొరులన్. 1780

వ. వినుము దేవమాయం జేసి దేహాభిమానులైన మానవులకుఁ బగవాఁడు బంధుం [3]డుదాసీనుం డను మోహంబు సిద్ధంబయి యుండు. జలాదులయందుఁ జంద్రసూర్యాదులును ఘటాదులందు గగనంబును వెక్కయి కానంబడు భంగి దేహధారుల కందఱికి నాత్మ యొక్కండయ్యును వెక్కండై తోఁచు, నాద్యంతంబులు గల యీ దేహంబు

---

1. కర్మశేషపరిభూతుండు = అనుభవింపఁగా మిగిలిన కర్మచే నవమానింపఁబడినవాఁడు. 2. ప్రాభవములు = ప్రభుత్వములు 3. ఉదాసీనుండు = తటస్థుఁడు (సంబంధములేనివాఁడు).

ద్రవ్యప్రాణ గుణాత్మకంబయి యీ శరీరంబు అవిద్యచేతఁ గల్పితంబై దేహి సంసారంబునం బ్రవిష్టుఁడై, సూర్యుండు తటస్థుండై యుండఁ బ్రకాశమానంబు లయిన దృష్టిరూపంబులుం బోలె నాత్మ తటస్థుండై యుండ దేహేంద్రియంబులు ప్రకాశమానంబు లగు నాత్మకు వేఱొక్కటితోడ సంయోగవియోగంబులు లేవు. వృద్ధి క్షయంబులు చంద్రకళకుఁగాని చంద్రునికి లేనికైవడి జన్మనాశంబులు దేహంబునకుంగాని యాత్మకుఁ గలుగ నేరవు. నిద్రవోయినవాఁ డాత్మను [1]విషయ ఫలానుభోగంబు సేయించు తెఱంగున నెఱుక లేనివాఁడు నిజము గాని యర్థంబుల ననుభవంబు నొందుచుండుఁ గావున. 1781

క. అజ్ఞానజ మగు శోకము విజ్ఞాన విలోకమున ♦ విడువుము నీకుం
[2]బ్రజ్ఞావతికిం దగునే యజ్ఞానులభంగి వగవ ♦ నంభోజముఖీ.

వ. ఇట్లు బలభద్రునిచేతఁ దెలుపంబడి రుక్మిణీదేవి దుఃఖంబు మానియుండె, నట రుక్మి యనువాఁడును బ్రాణావశిష్టుండై విడువంబడి తన విరూప భావంబునకు నెఱియుచు హరిని గెలిచి కాని కుండినపురంబు సొరనని ప్రతిజ్ఞ చేసి తత్పురసమీపంబున నుండె నివ్విధంబున. 1783

—♦ శ్రీకృష్ణుండు రుక్మిణీదేవిని బెండ్లియాడుట. ♦—

క. రాజీవలోచనుఁడు హరి రాజసమూహములఁ గెలిచి ♦ [3]రాజస మొప్పన్
రాజిత యగు తనపురికిని రాజాననఁ దెచ్చె బంధు♦రాజి నుతింపన్.

వ. అంత నయ్యాదవేంద్రుని నగరంబు సమారబ్ధ వివాహ కృత్యంబును బ్రవర్తమాన గీత వాద్య నృత్యంబును బ్రతిగృహాలంకృత విలసితాశేష నరనారీ వర్గంబును బరిణయ మహోత్సవ సమాహూయమాన మహీపాల [4]గజ ఘటా గండమండల దానసలిల ధారాసిక్త మార్గంబును బ్రతిద్వార మంగళాచార సంఘటిత [5]క్రముక కదళీకాకర్బూర కుంకుమాగరు ధూప దీప పరిపూర్ణ కుంభంబును విభూషిత సకల

1. విషయ......భోగంబు = ఇంద్రియ సుఖానుభవములు. 2. ప్రజ్ఞావతి = బుద్ధిమంతురాలు. 3. రాజసము = ఠీవి. 4. గజఘటా............ర్గంబును = ఏనుగు గుంపుల గండభాగములందలి మదజలధారలచేఁ దడుపఁబడిన మార్గములు గలది. 5. క్రముక కదళికా = పోక చెట్లు, అరటిచెట్లు.

గృహ వేదికా కవాట గేహళీ స్తంభంబును విచిత్రకుసుమాంబర రత్న
తోరణ విరాజితంబును సముచ్ఛ్రిత కేతన విభ్రాజితంబును నై యుండె
నయ్యవసరంబున. 1785

మ. ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజచే♦తోహారిణిన్ మానవై
భవగాంభీర్యవిహారిణిన్ నిఖిల సం♦పత్కారిణిన్ సాధు బాం
ధవ సత్కారిణిఁ బుణ్యచారిణి మహా♦దారిద్ర్య సంహారిణిన్
సువిభూషాంబరధారిణిన్ గుణవతిన్ ♦ జూడామణిన్ రుక్మిణిన్. 1786

క. సతులుం దారును బౌరులు హితమతిఁ గానుకలు దెచ్చి♦ యిచ్చిరి[1] కరుణో
న్నతవర్ధిష్ణులకును మానితరోచిష్ణులకు రుక్మి♦ణీకృష్ణులకున్.

క. హరిపెండ్లికి నై కేకయ కురుసృంజయ యదు విదర్భ♦కుంతినరేంద్రుల్
పరమానందము బొందిరి ధరణీశులలోన గాఢ ♦ తాత్పర్యములన్.

క. హరి యీ తెఱఁగున రుక్మిణి
నరుదుగఁ గొని వచ్చి పెండ్లి ♦ యాడుట విని దు
ష్కరకృత్య మనుచు వెఱఁగం
దిరి రాజులు రాజసుతులు ♦ దిక్కుల నెల్లన్. 1789

ఆ. అనఘు నాదిలక్ష్మి ♦ యైన రుక్మిణితోడఁ
గ్రీడ సలుపుచున్న ♦ కృష్ణుఁ జూచి
పట్టణంబులోని ♦ ప్రజ లుల్లసిల్లిరి
ప్రీతు లగుచు ముక్త ♦ భీతు లగుచు. 1790

వ. అని చెప్పి. 1791

క. [2]కువలయరక్షాతత్పర [3]కువలయదళనీలవర్ణ ♦ కోమలదేహా
కువలయనాథశిరోమణి కువలయజనవినుత విమల ♦ గుణసంఘాతా.

మాలిని. సరసిజనిభహస్తా ♦ సర్వలోకప్రశస్తా
నిరుపమశుభమూర్తీ ♦ నిర్మలారూఢకీర్తీ
పరహృదయవిదారీ ♦ భక్తలోకోపకారీ
గురుబుధజనతోషీ ♦ ఘోరదైతేయశోషీ. 1793

1. కరుణోన్నతవర్ధిష్ణులు = అధికమైన దయతో వృద్ధిపొందువారు. 2. కువలయరక్షాతత్పర = భూమండలమును రక్షించుటయం దాసక్తిగలవాఁడా! 3. కువలయ......దేహా! = కలువ రేకులవలె నల్లనిరంగుగల మృదువగు దేహముగలవాఁడా.

గద్యము. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రి పుత్త్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమన్మహాభాగవతం బను పురాణంబునందు దేవకీదేవి వివాహంబును, గగన వాణీశ్రవణంబును, గంసోద్రేకంబును, వసుదేవప్రార్థనంబును, యోగ మాయా ప్రభావంబును, బలభద్రు జన్మంబును, బ్రహ్మాదిసుర స్తోత్రం బును, కృష్ణావతారంబును, ఘోషప్రవేశంబును, యోగనిద్రాచరితం బును, నందపుత్త్రోత్సవంబును, పూతనాసంహారంబును, శకటభంజ నంబును, తృణావర్తు మరణంబును, గర్గాగమనంబును, నారాయణాది నామనిర్దేశంబును, బాలక్రీడయును, మృద్భక్షణంబును, వాసుదేవ వదనగహ్వర విలోక్యమాన చరాచర సమస్తలోక విలోకనంబును, నవనీతచౌర్యంబును, యశోదారోషంబును, నులూఖల బంధనంబును నర్జునతరుయుగళనిపాతనంబును, నలకూబర మణిగ్రీవుల శాపమోక్ష ణంబును, బృందావనగమనంబును, వత్సపాలకంబును, వత్సాసుర వధ యును, బక దనుజ విదారణంబును, నఘాసుర మరణంబును, వత్సాప హరణంబును, నూతన వత్సబాలక కల్పనంబును, బ్రహ్మవినుతియు, గోపాలనంబును, గార్దభాసురదమనంబును, గాళియఫణిమర్దనంబును, గరుడకాళియనాగ విరోధ కథనంబును, ప్రలంబాసుర హింసనంబును, దవానల పానంబును, వర్షర్తువర్ణనంబును, శరత్కాల లక్షణంబును, వేణువిలాసంబును, హేమంత సమయ సమాగమంబును, గోపకన్యా చరితహవిష్య వ్రతంబును, కాత్యాయనీసేవనంబును, వల్లవీవస్త్రాప హరణంబును, విప్రవనితాదత్తాన్నభోజనంబును, నింద్రయాగ నివార ణంబును, నందముకుందసంవాదంబును, బర్వతభంజనంబును, బాషాణ సలిలవర్షంబును, గోవర్ధనోద్ధరణంబును, వరుణకింకరుండు నందునిం గొనిపోయిన హరి తెచ్చుటయును, వేణుపూరణంబును, గోపికాజన ఘోషనిర్గమనంబును, యమునాతీర వన విహారణంబును, గృష్ణాంతర్ధా నంబును, ఘోషకామినీగణపరిదేవనంబును, గోపికాన్వేషణంబును, గోపికాగీతలును, హరిప్రసన్నతయును, రాసక్రీడనంబును, జలకేళి యును, సర్పరూపకుం డయిన సుదర్శన విద్యాధరుండు హరిచరణ తాడనంబున నిజరూపంబు వడయుటయును, శంఖచూడుం డను గుహ్యకుని వధించుటయును, వృషభాసుర విదళనంబును, నారదు వచ్చ

నంబున హరి జన్మకథ యెఱింగి కంసుఁడు దేవకీవసుదేవుల బద్ధులం జేయుటయును, ఘోటకాసురుం డయిన కేశి యను దనుజుని వధి యించుటయును, నారదస్తుతియును, వ్యోమదానవ మరణంబును, నక్రూరాగమనంబును, నక్రూర రామకృష్ణుల సల్లాపంబును, ఘోష నిర్గమనంబును, యమునాజలాంతరాళంబున నక్రూరుండు హరి విశ్వ రూపంబు గాంచుటయు, నక్రూర స్తవనంబును, మధురానగర ప్రవేశం బునురజకవధయును, వాయకమాలాకారసమ్మానంబును, గుబ్జాప్రసాద కరణంబును, ధనుర్భంగంబును, గంసుదుస్స్వప్నంబును, గువలయాపీడ పీడనంబును, రంగస్థలప్రవేశంబును, జాణూరముష్టికులవధయును, గంసవధయును, వసుదేవదేవకీబంధమోక్షణంబును, నుగ్రసేను రాజ్యస్థాపనంబును, రామకృష్ణులు సాందీపనివలన విద్య లభ్యసించుట యును, సంయమనీనగర గమనంబున గురుపుత్త్రదానంబును, నుద్ధవుని ఘోషయాత్రయును, భ్రమరగీతలును, గుబ్జావాసగమనంబును, గరి నగరంబునకు నక్రూరుండు నని కుంతీదేవినూఱార్చుటయుఁ, గంసభార్య లగున స్త్రిప్రాస్తులు జరాసంధునకుంగంసుమరణం బెఱింగించుటయును, జరాసంధుని దండయాత్రయును, మధురానగరనిరోధంబును, యుద్ధంబున జరాసంధుండు సప్తదశవారంబులు పలాయితుండగుట యును, నారదప్రేరితుండై కాలయవనుండు మధురపై దాడివెడ లుటయును, ద్వారకానగర నిర్మాణంబును, మధురాపుర నివాసులం దనయోగబలంబున హరి ద్వారకానగరంబునకుం దెచ్చుటయును, గాలయవనుండు హరివెంటం జని గిరిగుహాయందు నిద్రితుండైన ముచికుందుని కోపదృష్టివలన నీ ఱగుటయును, ముచికుందుండుహరిని సంస్తుతిచేసి తపంబునకుం జనుటయును, జరాసంధుండు క్రమ్మఱ రామకృష్ణులపై నేతెంచుటయును, ప్రవర్షణ పర్వతారోహణంబును, గిరిదహనంబును, గిరి డిగ్గనుఱికి రామకృష్ణులు ద్వారకానగరంబునకుం జనుటయును, రుక్మిణీజననంబును, రుక్మిణీ సందేశంబును వాసుదేవా గమనంబును, రుక్మిణీగ్రహణంబును, రాజలోకపలాయనంబును, రుక్మియనువాని భంగంబును, రుక్మిణీకల్యాణంబును నను కథలు గల, దశమస్కంధంబునందుఁ బూర్వభాగము.

— సంపూర్ణము —

శ్రీరస్తు.

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భాగవతము

## దశమస్కంధము - ఉత్తరభాగము

శ్రీకర [1]పరిశోషితరత్నాకర కమనీయ గుణగణాకర కారు
ణ్యాకర భీకర శరధారాకంపిత దానవేంద్ర రామనరేంద్రా!

వ. మహనీయ గుణగరిష్ఠు లగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీసమేతుండైన సూతుండిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు రుక్మిణీపరిణయానంతరంబున నైన కథావృత్తాంతం బంతయు వినిపింపుమనిన శుకయోగీంద్రుం డిట్లనియె.

ఉ. తామరసాక్షునంశమున [2]దర్పకుఁ డీశ్వరు కంటిమంటలం
దా మును దగ్ధుఁడై పిదపఁ దత్పరమేశుని [3]దేహలబ్ధికై
వేమఱు నిష్ఠఁ జేసి హరివీర్యమునం బ్రభవించె రుక్మిణీ
కామిని గర్భమం దసురఖండను [4]మాఱటమూర్తి యోయనన్.

వ. అంత నా డింభకుండు ప్రద్యుమ్నుం డను పేర విఖ్యాతుండయ్యె. నా శిశువు సూతికాగృహంబునం దల్లిపొదిఁగిట నుండం దనకు శత్రుం డని యెఱింగి శంబరుండను రాక్షసుండు దన మాయాబలంబునం గామరూపియై వచ్చి కొనిపోయి సముద్రంబులో వైచి తన గృహంబునకుం జనియె, నంత నా [5]శాబకుండు జలధిజలంబున దిగంబడ నొడిసి యొక మహామీనంబు మ్రింగె నంత. 4

క. జాలిఁబడి పాఱు జలచరజాలంబులఁ బోవనీక ఘని రోషాగ్ని
జ్వాలలు నిగుడఁగ నూరకజాలంబులు వైచి పట్టు జాలరులంతన్.

1. పరిశోషితరత్నాకర = సముద్రమును ఎండించినవాడా! 2. దర్పకుఁడు = మన్మథుఁడు. 3. దేహలబ్ధికై = దేహమును పొందుటకు. 4. మాఱటమూర్తి = ప్రతిబింబము 5. శాబకుండు = పిల్లవాఁడు.

వ. సముద్రంబులోన నా మీనంబును దత్స్వహాచరంబు లైన మీనంబు
లనుం బట్టుకొని తెచ్చి శంబరునకుం గానుకఁగా నిచ్చిన నతండు
వండి తెం డని [1]మహానసగృహంబునకుం బంచిన. 6

క. రాజనగరియెడ బాలలు । [2]రాజీవము కడుపు వ్రచ్చి ✽ రాజనిభాస్యన్
రాజశిశువుఁ గని చెప్పిరి । రాజీవదళాక్షి యైన ✽ రతికి నరేంద్రా.

వ. అంత నారదుండు వచ్చి బాలకుని జన్మంబును శంబరోద్యోగంబును
మీనోదరప్రవేశంబునుం జెప్పిన విని యా రతి మాయావతి యను
పేర శంబరునియింటఁ బాతివ్రత్యంబు సలుపుచు దహనదగ్ధుండైన
తనపెనిమిటి శరీరధారణంబు సేయుట కెదురుచూచు చున్నయది
గావున నయ్యర్భకుండు దర్పకుం డని తెలిసి మెల్లన పుత్రార్థిని
యైన తెఱంగున శంబరుని యనుమతి వడసి [3]సూపకారులయొద్ద
నున్నపాపనిం దెచ్చి పోషించుచుండె. ఆ కుమారుండును శీఘ్ర
కాలంబున నారూఢయౌవనుండై. 8

క. సుందరమగు తనరూపము । సుందరులోకమాఱు దేఱి ✽ చూచినఁ జాలున్
సౌందర్య మేమి చెప్పను । బొందెదమని డాయు బుద్ధిఁ ✽ బుట్టించు నృపా.

సీ. చక్కనివారల ✽ చక్కఁదనంబున
కుపమింప నెవ్వాఁడు ✽ యోగ్యుఁ డయ్యె
మిక్కిలి తపమున ✽ మెఱయు నంబికకు నై
శంకరు నెవ్వాఁడు ✽ సగము సేసె
బ్రహ్మత్వమును బొంది ✽ పరఁగు విధాతను
వాణికై యెవ్వాఁడు ✽ వాడి చెఱిచె
వేయి[4]డాఁగులతోడి ✽ [5]విబుధలోకేశుని
మూర్తికి నెవ్వాఁడు ✽ మూలమయ్యె

తే. మునులతాలిమి కెవ్వాఁడు ✽ ముల్లు సూపు
మగల మగువల నెవ్వాఁడు ✽ [6]మరులు కొలుపుఁ

1. మహానసగృహంబునకు = వంటయింటికి. 2. రాజీవము = మత్స్యవిశేషము. 3. సూపకారులు = వంటవారు. 4. డాఁగులు = కండ్లు. 5. విబుధలోకేశుని = ఇంద్రుని. 6. మరులు = మోహములు.

[1]కుసుమధనువున నెవ్వండు ♦ గొను విజయము
[2]చిగురువాలున నెవ్వండు ♦ చిక్కపఱచు.

వ. అని తన్ను లోకులు వినుతించు ప్రభావంబులు గలిగి పద్మదళలోచ
నుండును బ్రలంబబాహుండును జగన్మోహనాకారుండునైన పంచ
బాణుపిం గని లజ్జా హాస గర్భితంబులైన చూపులం జూచుచు
మాయావతి సురతభ్రాంతిం జేసినం జూచి ప్రద్యుమ్నుం డిట్లనియె.

మత్త. నా తన్భూభవుఁ డీతఁ డంచును ♦ [3]నాన యించుక లేక యో,
మాత నీవిది యేమి నేఁ డిటు ♦ మాతృభావము మాని సం
ప్రీతిఁ గామినిభంగి జేసెదు ♦ పెక్కువిభ్రమముల్ మహో
ఖ్యాతవృత్తికి నీకు ధర్మముగాదు మోహముసేయఁగాన్. 12

వ. అనిన రతి యిట్లనియె. నీవునారాయణనందనుండవైన కందర్పుండవు,
పూర్వకాలంబున నేను నీకు భార్యనైనరతిని, నీవు శిశువై యుండు
నెడ నిర్దయుండై దొంగిలి తల్లిం దొఱఁగఁజేసి శంబరుండుకొనివచ్చి
నిన్ను నీరధిలో వైచిన నొక్కమీనంబుమ్రింగ మీనోదరంబు వెడలి
తీవు, మీఁదటికార్య మాకర్ణింపుము. 13

క. మాయావి వీఁడు దుర్మతి
[4]మాయఁడు సంగరములం దశమర్త్యుల గెలుచున్
మాయికు రణమున వీనిన్
మాయింపుము మోహనాదిశమాయలచేతన్. 14

మత్త. పాపకర్ముఁడు వీఁడు నిన్నిటఁ ♦ బట్టితెచ్చిన లేచి నా
పాపఁ డెక్కడఁ బోయెనో సుతుఁ ♦ బాపితే విధియంచుఁ దాఁ
గ్రేపుఁ బాసిన గోవుభంగిని ♦ ఖిన్నయై వడి గాఢసం
తాపయై నిను నోఁచి కాంచిన ♦ తల్లికుయ్యిడుచుండునే. 15

వ. అని పలికి మాయావతి మహానుభావుండైన ప్రద్యుమ్నునికి సర్వ
శత్రుమాయా వినాశిని యయిన మహామాయావిద్య నుపదేశించె
నివ్విధంబున. 16

1. కుసుమధనువున = పుష్పధనుస్సుతో. 2. చిగురువాలున = చిగురుటాకు అనెడికత్తితో 3. నాన = సిగ్గు 4. మాయఁడు = నశించఁడు.

మ. గురుమాయాహరణవేదియై ✽ కవచియై కోదండియై బాణియై
హరిజుం డోరి నిశాట వైచిత్రివి నాఁ ✽ డంభోనిధిన్ నన్ను ఘో
ర రణాంభోనిధి నైతు నిన్ను నిదె వేఁ ✽ రమ్మంచుఁ జీరెన్ మనో
హరదివ్యాంబరు నుల్లసద్భుజసే✽నాడంబరున్ శంబరున్. 17

చ. అదలిచి యిట్లు కృష్ణసుతుఁ ✽ డాడిన నిష్ఠురభాషణంబులం
బదహతమై వడిం గవియు ✽ పన్నగరాజుఁబోలి శంబరుం
డదరుచు లేచి వచ్చి గద ✽ నచ్యుతనందను వ్రేసె [1]నుజ్జ్వల
ద్భిదురకఠోరఘోషసమ✽భీషణనాదము సేసి యార్చుచున్. 18

క. దనుజేంద్రుఁడు వ్రేసినగదఁ । దనగదచేఁ బాయనడిచి ✽ దనుజులు బెదరన్
దనుజాంతకుని కుమారుఁడు । దనుజేశునిమీఁద నార్చి ✽ తనగద వైచెన్.

వ. అంత నా రక్కసుండు వెక్కసంబగు రోషంబునఁ దనకుఁ దొల్లి మయుం డెఱింగించిన దైతేయమాయ నాశ్రయించి మింటికి నెగసి పంచబాణునిపై బాణవర్షంబు గురిసిన న[2]మ్మహారథుండు నొచ్చియు సంచలింపక మచ్చరంబున సర్వమాయావినాశిని యైన సాత్త్విక మాయం బ్రయోగించి దనుజుని బాణవృష్టి నివారించె, మఱియు వాఁడు [3]భుజగ గుహ్యక పిశాచమాయలు పన్ని నొప్పించిన నన్నియుం దప్పించి. 20

క. [4]దండధరమూర్తిఁ గైకొని । యొండాడక చక్రిసూనుఁ ✽ డుగ్రతరాసిన్
ఖండించె శంబరునితలఁ । [5]గుండలకోటీరమణులు ✽ కుంభిని రాలన్.

క. [6]చిగురాకడిదపుధారను । జగములఁ బరవశము ✽ సేయుచలపాదికి దొ
డ్డగునుక్కడిదంబునఁ దన । పగతుం దెగ వ్రేయు టెంత ✽ పని చింతింపన్.

క. బెగడుచునుండఁగ శంబరుఁ
దెగడుచుఁ [7]బూవింటిజోదు ✽ ధీరగుణంబుల్

---

1. ప్రకాశించు వజ్రాయుధపు ధ్వనితో సమమైన భయంకరధ్వనితో అఱచుచు, 2. మహారథుండు=పదునొకండువేల యోధులతో పోరాడువీరుఁడు. 3. భుజగగుహ్యకపిశాచమాయలు = సర్ప, దేవయోని, పిశాచములమాయలు. 4. దండధరమూర్తిన్ = యముని. 5. కుండలకోటీరమణులు = కుండల కిరీటముల యందలి మణులు, 6. చిగురాకడిదపుధారను = చిగురుటాకనెడి కత్తిఅంచుతో 7. పూవింటిజోదు = పూవిల్లుగల యోధుఁడు (మన్మథుఁడు)

పొగడుచుఁ గురిసిరి ముదమునఁ
నెగడుచుఁ [1]కుసుమముల ముసురు § నిర్జరు లధిపా. 23

—♦ రతీదేవి ప్రద్యుమ్న సహితయై గగనమార్గంబున ద్వారకకుం బోవుట ♦—

వ. ఇట్లు శంబరుని వధియించి విలసిల్లుచున్న [2]యించువిలుకానిం గొంచు నాకాశచారిణి యైన యా రతీదేవి గగనపథంబుఁ బట్టి ద్వారకానగరోపరిభాగంబునకుం జనుదెంచిన. 24

ఆ. [3]మెఱుఁగుఁదీఁగెతోడ § మేఘంబు కైవడి
యువిదతోడ మింట § నుండి కదలి
యరుగుదెంచె మదనుఁ § డంగనాశతములు
మెలఁగుచున్న లోన § మేడకడకు. 25

మ. [4]జలదశ్యాముఁ బ్రలంబబాహుయుగళుం § జంద్రాననుఁ [5]నీలసం
కులవక్రాలకుఁ బీతవాసు ఘనవక్షున్ సింహమధ్యున్ మహో
త్పలపత్రేక్షణు మందహాసలలితుం § బంచాయుధున్ నీరజా
క్షులు దారేమఱిపాటుచూచి హరియం § చుం డాఁగి రయ్యైయెడన్.

క. కొందఱు హరి యగు నందురు
కొందఱు చిహ్నములు కొన్ని § కొన్ని హరికి లే
వందురు మెల్లనె తెలియుద
మందురు [6]మరుఁ జూచి కొంద § ఱబలలు గుములై. 27

క. హరి యని వెనుచని పిదపన్
హరిఁ బోలెడువాఁడు గాని § హరి గాఁ డనుచున్
[7]హరిమధ్య లల్లనల్లన
[8]హరినందనుఁ డాయ వచ్చి § రాశ్చర్యమునన్. 28

---

1. కుసుమములముసురు = నిరంతరము కురిసెడు పూలవాన. 2. ఇంచువిలుకాఁడు=చెఱకువిలుగా గలవాఁడు. (మన్మథుఁడు) 3. మెఱుఁగుతీఁగతోడి = మెఱుపుతో. 4. జలదశ్యాము = మేఘమువలె నల్లనైనవాని. 5. నీలసంకులవక్రాలకున్= నల్లనైన వంపులు గల ముంగురులు (జుట్టు) గలవానిని. 6. మరున్ = మన్మథుని. 7. హరిమధ్యలు = సింహము నడుమువంటి నడుము గలవారు (స్త్రీలు). 8. హరినందనున్ = మన్మథుని.

ఉ. [1]అన్నులు సేర వచ్చి మరు । నందనుఁ జూడఁగఁ దానువచ్చి సం
పన్నగుణాభిరాము హరి । పట్టపుదేవి విదర్భపుత్త్రి ప్రేఁ
గన్నుల నా కుమారకునిఁ । గై వడి నేర్పడఁజూచి బోటితోఁ
జన్నులు సేఁప సిట్లపియె । సంభ్రమదైన్యము లుల్లసిల్లఁగన్. 29

శా. ఈ [2]కంజేక్షణుఁ డీ కుమారతిలకుం । డీ యిందుబింబాననుం
డీ [3]కంఠీరవమధ్యుఁ డిచ్చటికి నేఁ । డెందుండి యేతెంచెనో
యీకళ్యాణునిఁ గన్న భాగ్యవతి ము । న్నే నోములన్ నోఁచెనో
యేకాంతామణియందు వీనిఁ గనెనో । యేకాంతుఁ డీకాంతునిన్.

శా. [4]ఆలీ నాతొలుచూలిపాపనికి బో । ర్కాడించి నే సూతికా
శాలామధ్యవిశాలతల్పగతనై । చన్నిచ్చి నిద్రింప నా
బాలున్ నాచనుఁబాలకుం జెఱిచి యే । పాపాత్ము లేత్రోవ ము
న్నేలీలం గొనిపోయిరో శిశువుఁ దా । నే తల్లి రక్షించెనో. 31

క. కొడుకఁడు నాపొదిఁగిఁటిలోఁ
జెడిపోయిననాఁటనుండి । చెలియా తెలియం
బడ దేవార్తయు నతఁ [5]డే
వడువున నెచ్చోట నిలిచి । వర్తించెడినో. 32

క. ఇందాఁక వాఁడు బ్రతికిన
సందేహము లేదు దేహ । చాతుర్య వయ
స్సౌందర్యంబులు లోకులు
వందింపఁగ నితనియంత । వాఁడగుఁజుమ్మీ. 33

మ. అతివా సిద్ధము నాఁటిబాలకున కీ । యాకార మీవర్ణ మీ
గతి [6]యీ హాసవిలోకనస్వరము లీ । గాంభీర్య మీకాంతి వీఁ
డతఁడే కాఁదగు నున్నవారలకు నా । యాత్మేశసారూప్య సం
గతి సిద్ధింపదు వీనియందు మిగులం । గౌతూహలం బయ్యెడిన్. 34

---

1. అన్నులు = స్త్రీలు. 2. కంజేక్షణుఁడు = పద్మదళమువంటి నేత్రములు కలవాఁడు. 3. కంఠీరవమధ్యుఁడు=సింహమునడుమువంటి నడుము కలవాఁడు, 4. ఆలీ=చెలియా. 5. ఏవడువున = ఏవిధముగ. 6. ఈ హాసవిలోకనస్వరములు = ఈ చిరునవ్వు, చూపు, కంఠధ్వనులు.

క. [1]పొదలెడి మురిపమునఁ జిత్తము
గదలెడి నాయెడమమూఁపు ॥ గన్నులవెంటం
[2]బ్రిదిలెడి నానందాశ్రులు
మెదలెడిఁ బాలిండ్లఁ బాలు ॥ మేలయ్యెడినో. 35

వ. అని డోలాయమాన మానసయై వితర్కించుచు. 36

క. తనయుఁ డని నోడువఁ బలుచును
దనయుఁడు గాకున్న మిగులఁ ॥ [3]దతిగొని సవతుల్
తను నగియెద రని తలఁచు [4]న
తనుసంశయ మలమికొనఁగఁ ॥ [5]దనుమధ్య మదిన్. 37

వ. ఇట్లు రుక్మిణీదేవి విచారించుచుండ [6]లోపలినగరి కావలివారివలన విని కృష్ణుండు దేవకీవసుదేవులం దోడ్కొని చనుదెంచి సర్వజ్ఞుం డయ్యు నేమియు వివరింపక యూరకుండె, నంత నారదుండు చనుదెంచి శంబరుండు కుమారునిం గొనిపోవుట మొదలైనవార్త లెఱింగించిన. 38

క. చచ్చినబాలుఁడు గ్రమ్మఱ। వచ్చినక్రియ వచ్చెఁ బెక్కు ॥ వర్షములకునీ
సచ్చరితు నేఁడుగంటిమి। చెచ్చెరము న్నెట్టితపము ॥ సేయంబడెనో.

వ. అని యంతఃపురకాంతలును దేవకీవసుదేవ రామకృష్ణులును యథోచిత క్రమంబున నాదంపతుల దివ్యాంబరాభరణాలంకృతుల సత్కరించి సంతోషించిరి, రుక్మిణీదేవియు నందనుం గౌఁగిలించుకొని.

శా. అన్నా నా చనుఁబాపి నిన్ను దనుజుం ॥ డంభోనిధిన్ వైచెనే
యెన్నేవర్షము లయ్యెఁ బాసి సుత నీ ॥ వేరీతి జీవించి యే
సన్నాహంబున శత్రు గెల్చితివొ యా ॥ శ్చర్యంబు సంధిల్లెడిన్
నిన్నుంగాంచితి నింతకాలమునకున్ ॥ నే ధన్యతం జెందితిన్. 41

వ. అని కొడుకువలన సంతోషించి కోడలి గుణంబులు [7]కైవారంబులు సేసి వినోదించుచుండె, నంత ద్వారకానగరంబు ప్రజలు విని హర్షించి రందు. 42

---

1. పొదలెడి = పొంగివచ్చెడి. 2. ప్రిదిలెడి = పొంగిజారుచున్న. 3. తతి = సమయము. 4. అతనుసంశయము = గొప్పసందేహము. 5. తనుమధ్య = సూక్ష్మమగు నడుముకలది (రుక్మిణి). 6. లోపలినగరి = అంతఃపురము. 7. కైవారములు = స్తోత్రములు.

క. సిరివెనిమిటి పుత్త్రకుఁ డగు
మరుఁ గని హరిఁ జూచినట్ల మాతలు దమలోఁ
గరఁగుదురఁట పరకాంతలు
మరుఁ గని [1]మోహాంధకారమగ్నలు గారే. 43

వ. అని చెప్పి శుకుం డిట్లనియె. 44

—♦ శ్రీకృష్ణుండు లోకాపవాదనివృత్తికొఱకు శమంతకమణిని దెచ్చుట ♦—

క. సత్రాజిత్తు [2]నిశాచరశత్రునకుం గీడు సేసి సద్వినయముతోఁ
బుత్త్రిన్ శమంతకమణియును మైత్త్రిం గొని తెచ్చి యిచ్చె మనుజాధీశా.

వ. అనిన విని రా జిట్లనియె. 46

ఆ. శౌరి కేమి తప్పు సత్రాజితుఁడు సేసె
గూఁతు మణిని నేల కోరి యిచ్చె
నతని కెట్లు గలిగె నా శమంతకమణి
విప్రముఖ్య నాకు విస్తరింపు. 47

వ. అనిన విని శుకయోగివర్యుం డిట్లనియె. సత్రాజిత్తను వాఁడు సూర్యునకు భక్తుఁడై చెలిమి సేయ నతనివలన సంతసించి సూర్యుండు శమంతకమణి నిచ్చె, నా మణి కంఠంబున ధరియించి సత్రాజితుండు భాస్కరుని భంగి భాసమానుండై ద్వారకానగరంబునకు వచ్చిన దూరంబున నతనిం జూచి జనులు [3]మణిప్రభాపటల తిరోహిత దృష్టు లయి సూర్యుం డని శంకించి వచ్చి హరి కిట్లనిరి. 48

క. నారాయణ దామోదర నీరజదళనేత్ర చక్రి నిఖిలేశ గదా
ధారణ గోవింద నమస్కారము యదుపుత్త్ర నిత్యకల్యాణనిధీ.

మ. [4]దివిజాధీశ్వరు లిచ్చగింతురుగదా దేవేశ నిన్ జూడ యా
దవ వంశంబున గూఢమూర్తివి జగత్త్రాణుండవై యుండఁగా
భవదీయాకృతిఁ జూడ నేఁడిదె [5]రుచిప్రచ్ఛన్నదిగ్భాగుఁడై
రవియో [6]నీరజగర్భుఁడో యొకఁడు సేరన్ వచ్చె మార్గంబునన్.

1. మోహాంధకారమగ్నలు = మోహమనెడి చీకటిలో మునిఁగినవారు. 2. నిశాచరశత్రునకు = రాక్షసశత్రువునకు (కృష్ణునకు) 3. మణి ... దృష్టులై = మణి కాంతి సమూహము ... ... చేత అడ్డగింపఁబడిన చూపులుగలవారు. 4. దివిజాధీశ్వరులు = స్వర్గవాసులు (దేవతలు). 5. రుచి...గుఁడై = కాంతిచే ఆవరింపఁబడిన దిశలుగలవాఁడు 6. నీరజగర్భుఁడో = బ్రహ్మయో.

వ. అని యిట్లు పలికిన [1]మూఢజనులం జూచి గోవిందుండు నగి మణి సమేతుండైన సత్రాజితుండుగాని సూర్యుండుగాఁడని పలికె నంత సత్రాజితుండు శ్రీయుతం బయి మంగళాచార సంచారంబైన తన గృహంబునకుం జని [2]మహీసురులచేత నిజదేవతామందిరంబున నమ్మణిశ్రేష్ఠంబు ప్రవేశంబు సేయించె నదియును బ్రతిదినంబు [3]నెనిమిది బారువుల సువర్ణంబు గలిగించుచుండు. 51

క. ఏరాజేలెడు [4]వసుమతి । నారత్నము పూజ్యమానమగు నక్కడ రో
గారిష్ట సర్పమాయిక । మారీ దుర్భిక్షభయము మాను నరేంద్రా!

క. అమ్మణి యాదవవిభునకు । నిమ్మని హరి యడుగ నాతఁడీక ధనేచ్ఛం
బొమ్మని పలికెను జక్రికి । నిమ్మణి యీకున్న మీఁద నేమాననుచున్.

వ. అంత.

చ. అడరెడు వేడ్కఁ గంఠమున నమ్మణిఁ దాల్చి [5]ప్రసేనుఁ డొక్కనాఁ
డడవికి ఘోరవన్య [6]మృగయారతి నేగిన వానిఁ జంపి పైఁ
బడి మణిఁ గొంచు నొక్క [7]హరి పాఱఁగ దాని వధించి డాసి యే
ర్పడఁగనె జాంబవంతుఁడు ప్రభాత్తదిగంతము నా శమంతమున్.

క. కని జాంబవంతుఁ డామణిఁ గొని పోయి సమీపశైలగుహఁ జొచ్చి ముదం
బునఁ దన కూరిమిసుతకును ఘనకేళీ కందుకంబుగాఁ జేసె నృపా.

వ. అంత సత్రాజితుండు తన సహోదరుండైన ప్రసేనునిం గానక దుఃఖించుచు. 57

మ. మణి కంఠంబునఁ దాల్చి నేఁ డడవిలో మా వాఁడు వర్తింపఁగా
మణికై పట్టి వధించినాఁడు హరికిన్ మర్యాద లేదంచు దూ
షణముం జేయఁగ వాని దూషణము గంసధ్వంసి యాలించి యే
[8]వ్రణమున్ నాయెడ లేదు నింద గలిగెన్ వారించు టేరీతియో.

వ. అని వితర్కించి. 59

---

1. మూఢజనులన్ = తెలియనివారిని. 2. మహీసురులచే = బ్రాహ్మణులచే. 3. ఎనిమిది బారువులు = 160 మణుగులు. 4. వసుమతి = భూమి. 5. ప్రసేనుఁడు = సత్రాజిత్తు సోదరుఁడు. 6. మృగయారతిన్ = వేట యందలి యాసక్తితో. 7. హరి = సింహము. 8. వ్రణమున్ = తప్పును.

మ. తనవారెల్లఁ బ్రసేనుజాడఁ దెలుపం దర్కించుచున్ వచ్చి [1]త
ద్వనవీథిం గని నేలఁ గూలిన మహాశ్వంబుం, బ్రసేనుఁ, బ్రసే
నుని హింసించిన సింహముం, మృగపతిన్ ద్రొప్పించి ఖండించి యేఁ
గిన [2]భల్లూకము సొచ్చియున్న గుహయుం గృష్ణుండు [3]రోచిష్ణుఁడై.

వ. కని తనవెంట వచ్చిన ప్రజల నెల్ల గుహాముఖంబున విడిచి సాహసంబున మహానుభావుండైన హరి నిరంతర నిబిడాంధకార బంధురంబయి భయంకరంబై విశాలంబయిన [4]గుహాంతరాళంబు సొచ్చి చని యక్కడ నొక్క బాలిక కెదుర దర్శనీయ [5]కేళికందుకంబుగా బ్రేలం గట్టబడిన యమ్మణిశ్రేష్ఠంబుఁ గని హరియు [6]హరింప నిశ్చయించి. 61

క. మెల్ల నెపదములిడుచు యదువల్లభుఁడా శిశువుకడకు వచ్చినఁ గుండెల్
జల్లనఁగఁ జూచి కంపము మొల్లంబుగ [7]దానిదాది మొఱవెట్టె నృపా.

వ. అంత నాధ్వని విని బలవంతుండైన జాంబవంతుండు వచ్చి తన స్వామి యని కృష్ణు నెఱుంగక [8]ప్రాకృతపురుషుఁ డని తలంచి కృష్ణునితో రణంబు సేసె నందు. 63

క. [9]పలలమునకుఁ బోరెడు డే
గల క్రియ శస్త్రములఁ దరులఁ గరముల విజయే
చ్ఛల నిరువది యెనిమిది దిన
ములు పోరిరి [10]నగచరేంద్రముఖ్యుఁడు హరియున్. 64

క. [11]అడిదములుఁ దరులు విఱిగిన
బెడిదములగు మగతనములఁ బిఱుతివక వడిం
బిడుగుల వడువునఁ బడియెడి
పిడికిటి పోటులను గలనఁ బెరసి రిరువురున్. 65

---

1. తద్వనవీథిన్ = ఆ వనమార్గమున. 2. భల్లూకము = ఎలుఁగుబంటి. 3. రోచిష్ణుఁడై = ప్రకాశించువాఁడై. 4. గుహాంతరాళంబు = గుహా మధ్యభాగంబు. 5. కేళికందుకంబుగా=ఆటబంతిగా. 6. హరింపనిశ్చయించి=అపహరించ దలఁచి. 7. దానిదాది = ఆశిశువును రక్షించుదాని. 8. ప్రాకృతపురుషుఁడు = సామాన్యుఁడు. 9. పలలమునకు=మాంసమునకు. 10. నగచరేంద్రముఖ్యుఁడు = పర్వతమున సంచరించువారిలో ముఖ్యుఁడు (జాంబవంతుఁడు). 11. అడిదము = ఖడ్గము.

శా. స్పష్టాహంకృతు లుల్లసిల్ల హరియున్ ✽ భల్లూక లోకేశుఁడున్
[1]ముష్టాముష్టి నహర్నిశంబు జయస✽మ్మోహంబునం బోరుచోఁ
బుష్టిం బాసి ముకుంద ముష్టి హతులం ✽ బూర్ణశ్రమోపేతుఁడై
[2]పిష్టాంసోరు శరీరుఁడై యతఁడు దా ✽ భీతాత్ముఁడై యిట్లనున్. 66

వ. దేవా నిన్నుఁ బురాణపురుషు నధీశ్వరు విష్ణుఁ బ్రభవిష్ణు నెఱుంగుదు, సర్వ భూతంబులకుం బ్రాణప్రతాప ధైర్య బలంబులు నీవ, విశ్వంబునకు సర్గస్థితి లయంబు లెవ్వ రాచరింతురు వారికి సర్గస్థితి లయంబులఁ జేయు నీశ్వరుండవు నీవ, యాత్మకుం బరమాత్మవునీవ, యని మఱియును. 67

సీ. బాణాగ్ని నెవ్వఁడు ✽ పఱపి పయోరాశి
నింకించి బంధించి ✽ యేపు మాపెఁ
బరఁగ నెవ్వఁడు ప్రతా✽పప్రభారాశిచే
దానవ గర్వాంధ✽తమస మడఁచెఁ
గంజాతములు ద్రెంచు ✽ కరిభంగి నెవ్వఁడు
దశకంఠుకంఠ బృం✽దములు ద్రుంచెఁ
నాచంద్ర సూర్యమై ✽ యమరు లంకారాజ్య
మునకు నెవ్వఁడు విభీ✽షణుని నిలిపె

తే. నన్ను నేలిన లోకాధి✽నాథుఁ డెవ్వఁ
[3]డంచితోదార కరుణా✽రసాబ్ధి యెవ్వఁ
డాతఁడవు నీవ కావె మ✽హాత్మ నేఁడు
[4]మాఱుపడి యెగ్గు సేసితి ✽ మఱవవలయు. 68

వ. అని యిట్లు పరమభక్తుండయిన జాంబవంతుండు వినుతించిన నతని శరీరనిగ్రహనివారణంబుగా భక్తవత్సలుండయిన హరి తన కరంబున నతనిమేను నిమిరి మేఘగంభీర భాషణంబుల నిట్లనియె. 69

క. ఈ మణి మాచేఁ బడె నని
తామసు లొనరించు నింద ✽ దప్పెడుకొఱకై

1. ముష్టాముష్టి=పరస్పరము గ్రుద్దులతో యుద్ధముచేయుట. 2 పిష్టాం...డై=పిండియైన భుజములు గొప్ప శరీరము గలవాఁడై. 3. అంచి...రసాబ్ధి = తక్కువ కాక గొప్పదైన దయాసముద్రుఁడు. 4. మాఱుపడి=భేదముకలవాఁడనై.

నీమందిర మగు బిలమున
కేమఱు దెంచితిమి భల్లుకేశ్వర వింటే. 70

వ. అనిన విని సంతసించి జాంబవంతుఁడు మణియునుం దన కూఁతు జాంబవతియను కన్యకామణియునుం దెచ్చి హరికిఁ గానికఁగా సమర్పించె, నట మున్న హరివెంట వచ్చినవారలు బిలంబువాకిటం బండ్రెండుదినంబులు హరిరాక యెదురుచూచి వేసరి వగచి, పురంబునకుం జనిరంత దేవకీ వసుదేవులును రుక్మిణియును మిత్రబంధు జ్ఞాతిజనులును గుహాసొచ్చి కృష్ణుండు రాక చిక్కెనని శోకించి. 71

క. దుర్గమ మగు బిలమున హరి
నిర్గతుఁడయి చేరవలయు నేఁడని పౌరుల్
వర్గములై సేవించిరి
దుర్గం [1]గృతకుశలమార్గఁ దోషితభర్గన్. 72

క. డోలాయితమానసులై
జాలింబడి జనులు గొలువఁ జండిక పలికెన్
బాలామణితో మణితో
హేలాగతి వచ్చు నంబుజేక్షణుఁ డనుచున్. 73

క. యత్నము సఫలంబయిన స
పత్నసమూహములు బెగడఁ బద్మాక్షుం డా
రత్నముతోఁ గన్యాజన
రత్నముతోఁ బురికి వచ్చెఁ రయమున నంతన్. 74

క. మృతుఁడైనవాఁడు పునరాగతుఁడైన క్రియం దలంచి కన్యామణి సంయుతుఁడై వచ్చినహరిఁగని, వితతోత్సవకౌతుకముల వెలసిరిపౌరుల్.

వ. ఇట్లు హరి తన పరాక్రమంబున జాంబవతీదేవిం బరిగ్రహించి రాజసభకు సత్రాజిత్తుం బిలిపించి తద్వృత్తాంతంబంతయు నెఱింగించి సత్రాజిత్తునకు మణి నిచ్చె, నతండును సిగ్గువడి మణింబుచ్చుకొని పశ్చాత్తాపంబునొందుచుబలవద్విరోధంబునకు వెరచుచునింటికిఁజని

1. క్షేమమార్గమును చూపునది; శివుని సంతోషపెట్టినది.

క. పాపాత్ముల పాపములం । బాపంగా నోపునట్టి ✤ పద్మాక్షునిపైఁ
బాపము గలదని నోడిన । పాపాత్ముని పాపమునకుఁ ✤ బారము గలదే.

మ. [1]మితభాషిత్వము మాని యేల హరిపై ✤ [2]మిథ్యాభియోగంబు చే
సితిఁ బాపాత్ముఁడ నర్థలోభుఁడను దు ✤ శ్చిత్తుండ మత్తుండ దు
ర్మతి నీ దేహముఁ గాల్పవే మరిత మే ✤ మార్గంబునం బాయు నే
గతిఁ గంసారి ప్రసన్నుఁడై మనుచు నన్ ✤ గారుణ్యభావంబునన్.

ఆ. మణినిఁ గూఁతు నిచ్చి ✤ మాధవు పదములు
పట్టుకొంటి నేని ✤ బ్రతుకు గలదు
సంతసించు నతఁడు ✤ సదుపాయ మగు నిది
సత్య మితరవృత్తిఁ ✤ జక్కబడదు. 79

మ. అని యిబ్భంగి బహుప్రకారముల నే ✤ కాంతస్థుఁడై యింటిలోఁ
దనబుద్ధిం బరికించి నీతిగని స ✤ త్రాజిత్తు సంప్రాప్తశో
భనుఁడై యిచ్చె [3]విపత్పయోధితరికిన్ ✤ భామామనోహారికిన్
దనుజాధీశవిదారికిన్ హరికిఁ గాం ✤ తారత్నమున్ రత్నమున్.

ఉ. తామరసాక్షుఁ [4]డచ్యుతుఁ డు ✤ దారయశోనిధి పెండ్లియాడె నా
నామనుజేంద్రవందిత గు ✤ ణస్థితిలక్షణ సత్యభామ ను
ద్దామ పతివ్రతాత్వనయ ✤ ధర్మ విచక్షణతా దయా యశః
కామను సత్యభామను [5]ము ✤ ఖద్యుతినిర్జితసోమ నయ్యెడన్. 81

క. మణి యిచ్చినాఁడు [6]వాసరమణి నీకును మాకుఁ గలవు ✤ మణులు కుమారీ
మణి చాలు నంచుఁ గృష్ణుఁడు మణి సత్రాజిత్తునకును ✤ మరలఁగ నిచ్చెన్

వ. అంత నక్కడఁ గుంతీసహితు లయిన పాండవులు [7]లాక్షాగారంబున
దగ్ధులైరని విని నిఖిలార్థదర్శనుం డయ్యును గృష్ణుండు బలభద్ర

1. మితభాషిత్వము = తక్కువ మాట్లాడుట. 2 మిథ్యాభియోగంబు చేసితిన్ = అబద్ధపు మాటగా చేసితిని. 3. విపత్పయోధితరికిన్ = ఆపద యనెడి సముద్రమును దాఁటించువానికి. 4. అచ్యుతుఁడు = నాశనము లేనివాఁడు. 5. ముఖద్యుతి నిర్జితసోమన్ = ముఖకాంతిచే జయింపఁబడిన చంద్రుఁడుకలదానిని. 6. వాసరమణి = దివమునకుమణి (సూర్యుఁడు) 7. లాక్షాగారంబున = లక్క యింటియందు.

సహితుండై [1]కరినగరంబునకుం జని కృప విదుర గాంధారీ భీష్మ ద్రోణులం గని దుఃఖోపశమనాలాపంబు లాడుచుండె నయ్యెడ. 38

—♦ శతధన్వుఁడు సత్రాజిత్తును జంపి మణి నపహరించుట ♦—

సీ. జగతీశ వినవయ్య ✽ శతధన్వుఁ బొడగని
యక్రూర కృతవర్మ ✽ లాప్తవృత్తి
మన కిత్తు ననుచు స✽మ్మతిఁ జేసి తనకూఁతుఁ
బద్మాక్షునకు నిచ్చి ✽ పాడి దప్పె
ఖలుఁడు సత్రాజిత్తు ✽ గడఁక నేక్రియనైన
మణిపుచ్చుకొనుము నీ ✽ మతము మెఱసి
యని తన్నుఁ బ్రేరేఁప ✽ నా శతధన్వుండు
పశువుఁ గటికివాఁడు ✽ పట్టి చంపు

ఆ. కరణి నిదుర వోవఁ ✽ గడఁగి సత్రాజిత్తుఁ
బట్టి చంపి హాని ✽ భామలెల్ల
మొఱలువెట్ట లోభ✽మునఁ జేసి మణిఁగొంచుఁ
జనియె నొక్కనాఁడు ✽ జనవరేణ్య. 84

వ. ఇట్లు హతుండైన తండ్రిం గని శోకించి సత్యభామ యతనిం [2]దైల ద్రోణియందుఁ బెట్టించి హస్తిపురంబునకుం జని సర్వజ్ఞుండైన హరికి సత్రాజిత్తు మరణంబు విన్నవించిన హరియును బలభద్రుండు నీశ్వరు లయ్యును మనుష్యభావంబుల విలపించి, రంత బలభద్ర సత్యభామా సమేతుండై హరి ద్వారకానగరంబునకు మరలివచ్చి శతధన్వుం జంపెదనని తలంచిన నెఱింగి శతధన్వుండు ప్రాణ భయంబునఁ గృతవర్మ నింటికి జని తనకు సహాయుండవు గమ్మని పలికినం గృతవర్మ యిట్లనియె. 85

ఉ. అక్కట రామకృష్ణులు మ✽హాత్ములు వారల కెగ్గుసేయఁగా
నిక్కడ నెవ్వడోఁపు విను ✽ మేర్పడఁ గంసుఁడు బంధుయుక్తుఁడై
చిక్కఁడె మున్నుమాగధుఁడు ✽ సేనలతోఁ [3]బదియేడుతోయముల్
దిక్కులఁ బాఱఁడే మనకు ✽ దృష్టము [4]వారలలావు వింతయే. 86

---

1. కరినగరంబునకు = హస్తినాపురంబునకు. 2. తైలద్రోణియందు = నూనెగల దొప్పయందు. 3. పదియేడుతోయములు = పదియేడు పర్యాయములు 4. వారల లావు = బలరామకృష్ణులబలము.

వ. అని యుత్తరంబు చెప్పిన విని శతధన్వుం డక్రూరునింటికిం జని హరితోడి పగకుం దోడు గమ్మని చీరిన నక్రూరుండు హరి బలపరాక్రమ ధైర్యస్థైర్యంబు లుగ్గడించి మఱియు నిట్లనియె. 87

సీ. ఎవ్వాఁడు విశ్వంబు ✽ నెల్ల సలీలుఁడై
పుట్టించు రక్షించుఁ ✽ బొలియఁజేయు
నెవ్వనిచేష్టల ✽ నెఱుఁగరు బ్రహ్మాదు
లెవ్వనిమాయ మో✽హించు భువన
మేడేండ్లపాపఁడై ✽ యేవిభుఁ డొకచేత
గోరక్షణమునకై ✽ కొండ నెత్తె
నెవ్వాఁడు [1]కూటస్థుఁ ✽ డీశ్వరుఁ డద్భుత
కర్ముఁ [2]డనంతుఁడు ✽ గర్మసాక్షి

తే. యట్టి ఘనునకు శౌరికి ✽ ననవరతము
మ్రొక్కెదముగాక విద్వేష✽మునకు నేము
వెఱతు మొల్లము నీపొందు ✽ వేగఁబొమ్ము
చాలు బదివేలువచ్చె నీ ✽ సఖ్యమునను. 88

వ. అని యిట్లక్రూరుం డుత్తరంబు వలికిన నమ్మహామణి యక్రూరునొద్ద నునిచి వెఱచి శతధన్వుండు [3]తురగారూఢుండయి [4]శతయోజన దూరంబు చనియె, [5]గరుడకేతనాలంకృతంబైన తేరెక్కి రామకృష్ణులు వెను చని, రంత నతండును మిథిలానగరంబుఁ జేరి తత్సమీపవనంబునందు. 89

చ. తురగము డిగ్గి తల్లడము✽తో శతధన్వుఁడు పాదచారియై
పరువిడఁ బోకు పోకు మని ✽ పద్మదళాక్షుఁడు గూడఁ బాఱి భీ
కరగతి వాని మస్తకము ✽ ఖండితమై పడ వేసెఁ జక్రముం
[6]బరిహతదైత్యచక్రముఁ ✽ [7]బ్రభాచయమోదిత దేవచక్రమున్. 90

---

1. కూటస్థుఁడు = ఎలకాలము నొకరూపముగా నుండువాఁడు. 2. అనంతుఁడు = అంతములేనివాఁడు. 3 తురగారూఢుఁడై = గుఱ్ఱము నెక్కినవాఁడై 4. శతయోజనదూరంబు = నూఱామడ. 5. గరుడకేతనాలంకృతంబైన = గరుత్మంతుఁడుగల జెండాచే అలంకరింపఁబడిన. 6. పరిహత దైత్యచక్రము = రాక్షసులను పరాభవించిన చక్రము. 7. ప్రభాచయమోదిత = కాంతి సమూహముతో సంతోషపెట్టు.

వ. ఇట్లు హరి శతధన్వుని వధియించి వానివస్త్రంబులందు మణి వెదకి లేకుండుటఁ దెలిసి బలభద్రునికడకు వచ్చి శతధన్వుండూరక హతుండయ్యె, మణిలేదనిన బలభద్రుం డిట్లనియె. 91

సీ. ఆమణి శతధన్వుఁ డపహరించుట నిక్క
మెవ్వరిచే దాఁప నిచ్చినాఁడొ
వేగమ నీవేగి వెదకుము పురిలోన
నైదేహుఁ దర్శింప వాంఛ గలదు
పోయివచ్చెద నీవు పొమ్మని పేర్కొని
మెల్లన రాముండు మిథిలఁ జొచ్చి
పోయిన జనకుండు పొడగని హర్షించి
యెంతయుఁ బ్రియముతో నెదురువచ్చి

తే. యర్ఘ్యపాద్యాది కృత్యంబు లాచరించి
[1]యిచ్చగించిన వస్తువు లెల్ల నిచ్చి
యుండుమని భక్తి చేసిన నుండె [2]ముసలి
కువలయేశ్వర మిథిలలోఁ గొన్ని యేండ్లు. 92

వ. అంత దుర్యోధనుండు మిథిలానగరంబునకుం జనుదెంచి జనకరాజుచేత సన్మానితుండయి. 93

క. [3]చలమున గాంధారేయుఁడు లలితగదాయుద్ధకౌశలము నేర్చెదగన్
[4]హలిచే [5]నాశ్రిత నిర్జరఫలిచేఁ ద్రైలోక్యవీరభటగణబలిచేన్.

వ. అట కృష్ణుండును ద్వారకానగరంబునకుం జని శతధన్వుని మరణంబును మణి లేకుండుటయును సత్యభామకుం జెప్పి సత్యభామాప్రియకరుండు గావున సత్రాజిత్తునకుఁ బరలోకక్రియలు సేయించె, నక్రూర కృతవర్మలు శతధన్వు మరణంబు విని వెఱచి ద్వారకానగరంబు వెడలి బహు [6]యోజన దూరభూమికిం జని; రక్రూరుండు లేమింజేసి వానలు లేక మహోత్పాతంబులును శరీరమానస

1. ఇచ్చగించిన వస్తువులు = కోరినవస్తువులు. 2. ముసలి = బలరాముఁడు. 3. చలమున = పట్టుదలతో. 4. హలిచే = బలరామునిచే. 5. ఆశ్రిత నిర్జరఫలి = ఆశ్రయించినవారికి దేవతావృక్షమువంటివాఁడు. 6. యోజన = ఆమడ.

తాపంబులును ద్వారకానగరవాసులకు సంభవించిన నంతల వృద్ధజనులు బెగడి హరి కిట్లనిరి. 95

సీ. కమలాక్ష వినవయ్య ◆ కాశీశుఁ డేలెడి
[1]కుంభిని వానలు ◆ గురియ కున్నఁ
గోరి శ్వఫల్కునిఁ ◆ గొనిపోయి యతనికిఁ
గాందిని యనియెడు ◆ కన్యనిచ్చి
కాశీవిభుండు సత్కారంబు సేసిన
వానలు గురిసె నా ◆ వసుధమీఁద
నాతని పుత్త్రకుఁ ◆ డైన యక్రూరుండు
నంతటివాఁడు మ ◆ హాతపస్వి

ఆ. మరలి వచ్చెనేని ◆ మానును త్పాతంబు
లెల్ల వాన గురియు ◆ నీస్థలమున
దేవ యతనిఁ దోడి ◆ తెప్పింపు మన్నింపు
మానవులయుఁ బీడ ◆ మానవులకు. 96

వ. అని పలుకు పెద్దల పలుకు లాకర్ణించి దూతలం బంపి కృష్ణుం డక్రూరుని రావించి పూజించి ప్రియకథలు కొన్ని సెప్పి [2]సకలలోకజ్ఞుండు గావున మృదుమధుర భాషణంబుల నతని కిట్లనియె. 97

సీ. తా నేగుతఱి శతధన్వుండు మణిఁ దెచ్చి
నీయింటఁ బెట్టుట ◆ నిజము దెలిసి
నాఁడ సత్రాజిత్తునకుఁ బుత్త్రకులు లేమి
నతనికిఁ గార్యంబు ◆ లాచరించి
[3]విత్తంబు ఋణమును ◆ విభజించుకొనియెద
రతని పుత్త్రిక లెల్ల ◆ నతఁడు పరుల
చేత దుర్మరణంబుఁ ◆ జెందినాఁ డతనికై
సత్కర్మములు మీఁద ◆ జరుపవలయు

ఆ. మణి గ్రహింపు మీవ ◆ మాయన్న నను నమ్మఁ
డెలమి బంధుజనుల ◆ కెల్ల జూపు

1. కుంభిని = భూమిమీఁద. 2. సకలలోకజ్ఞుండు = సమస్తలోకముల చరిత్రలఁ దెలిసినవాఁడు. 3. విత్తము = ధనము.

మయ్యా నీగృహము- [1]హాటక వేదికా
సహిత [2]మఖము లమరు- సంతతమును. 98

వ. అని యిట్లు సామవచనంబులు హరిపలికిన నక్రూరుండు [3]వస్త్రచ్ఛన్నం
బైన మణిం దెచ్చి హరికిచ్చిన. 99

ఉ. సంతసమంది బంధుజన-సన్నిధికిన్ హరి దెచ్చి చూపె న
శ్రాంతవిభాసమానఘృణి-జాలపలాయిత భూనభోంతర
ధ్వాంతము హేమభారచయ-వర్షణవిస్మిత దేవమానవ
స్వాంతముఁ గీర్తిపూరితది-శావలయాంతము నా శమంతమున్.

క. [4]చక్రాయుధుఁడీక్రియఁ దన । యక్రూరత్వంబు జనుల- కందఁజేసను [5]ని
ర్వ్యక్రమముగఁ దెలిపి క్రమ్మఱ । నక్రూరునకిచ్చె మణిఁ గృ-పాకలితుండై.

క. [6]ఘనుఁడు భగవంతుఁ డీశ్వరుఁ
[7]డనఘుఁడు మణిదెచ్చి యిచ్చి-నట్టి కథనమున్
వినినఁ బఠించినఁ దలఁచిన
జనులకు దుర్యశముఁ బాప-సంఘముఁ దలఁగున్. 102

—♦ శ్రీకృష్ణుం డింద్రప్రస్థపురంబున కరుగుట. ♦—

వ. అంత నొక్కనాఁడు పాండవులంజూడ నిశ్చయించి సాత్యకి ప్రముఖ
యాదవులు గొలువఁ బురుషోత్తముం డింద్రప్రస్థపురంబునకు జనినం
బ్రాణంబుంగనిన యింద్రియంబులభంగి వారఖిలేశ్వరుండయిన
హరింగని కౌఁగిలించుకొని కృష్ణుని దివ్యదేహ సంగమంబున
[8]నిర్ధూతకల్మషులై యనురాగహాస విభాసితంబైన ముకుందముఖార
విందంబు సందర్శించి యానందంబునొందిరి. గోవిందుఁడును
యుధిష్ఠిర భీమసేనుల చరణంబులకు నభివందనంబులుచేసి యర్జును
నాలింగనంబున సత్కరించి నకుల సహదేవులు మ్రొక్కినఁ గ్రుచ్చి
యెత్తి యుత్తమ పీఠంబున నాసీనుఁడయి యుండెనపుడు. 103

1. హాటకవేదిక = బంగారు తిన్నె, 2. మఖము = యజ్ఞము. 3. వస్త్రచ్ఛన్నంబైన వస్త్రముచే కప్పఁబడిన. 4. చక్రాయుధుఁడు = చక్రమును ఆయుధముగాఁ ధరించినవాఁడు (విష్ణువు). 5. నిర్వ్యక్రము = మంచి స్వభావము. 6. ఘనుఁడు = గొప్పవాఁడు. 7. అనఘుఁడు = పాపములేనివాఁడు. 8. నిర్ధూతకల్మషులై = పోయిన పాపములుగలవారై.

క. చంచద్ఘనకుచ భారాకుంచితమై క్రొత్తపెండ్లికూఁతురగుట నిం
చించుక సిగ్గుజనింపఁగఁ బాంచాలతనూజ మ్రొక్కెఁ బద్మాక్షునకున్.

వ. అంత సాత్యకి పాండవులచేతం బూజితుండై యొక్కపీఠంబున నాసీనుండై యుండెఁ, దక్కిన యనుచరులును వారిచేతఁ బూజితులై కొలిచియుండిరి. హరియుఁ గుంతీదేవికడకుం జని నమస్కరించి యిట్లనియె. 105

క. అత్తా కొడుకులుఁ గోడలుఁ
జిత్తానందముగఁ బనులు సేయఁగ [1]నాత్మా
యత్తానుగవై [2]యాజ్ఞా
సత్తాదులు గలిగి మనుదె సమ్మోదమునన్. 106

చ. అనవుడుఁ బ్రేమవిహ్వలత నందుచు గద్గదభాషణంబులం
గనుఁగవ నశ్రుతోయములు గ్రమ్మఁగఁ గుంతి సుయోధనుండు సే
సిన యపకారముం దలఁచి చెందినదుఃఖములెల్లఁ జెప్పి యా
[3]దనుజవిరోధి కిట్లనియెఁ దద్దయుఁ బెద్దఱికంబు సేయుచున్. 107

సీ. అన్న నీచుట్టాల నరయుదు మఱవవు
నీవు పుత్తెంచిన నెమ్మితోడ
మాయన్న యేతెంచి మముఁ జూచిపోయెను
నిల్చియున్నారము నీబలమున
నాపిన్ననాండ్రకు నాకు దిక్కెవ్వరు
నేఁ డాదిగా నింక నీవకాక
యఖిలజంతువుల కీ వాత్మవు గావునఁ
బరులు నావారని భ్రాంతిసేయ

తే. వయ్య నాభాగ్య మెట్టిదో [4]యనవరతము
చిత్తమునఁనుండి కరుణ మా చిక్కులెల్ల
బాపుచుందువుగాదె యో పరమపుణ్య
యదుకుమారవరేణ్య [5]బుధాగ్రగణ్య. 108

---

1. ఆత్మాయత్తానుగవై = స్వేచ్ఛగలదానవై; 2. ఆజ్ఞా సత్తాదులు = ఆజ్ఞాపించుట, సామర్థ్యము మున్నగునవి 3. దనుజవిరోధి = రాక్షసశత్రువు (కృష్ణుఁడు) 4. అనవరతము = ఎల్లప్పుడు. 5. బుధాగ్రగణ్య = దేవతలలో మొదటివాఁడు.

వ. అనిన యుధిష్ఠిరుం డిట్లనియె. 109

ఉ. పట్టఁగఁ జేరు నిన్నుఁ [1]దమ ♦ భావములందు సనందనాదు లే
పట్టున నైన నట్టి [2]గుణ ♦ భద్రచరిత్రుఁడ వీవు నేఁడు మా
చుట్టమవంచు వచ్చెదవు ♦ చూచెద వల్పులమైన మమ్ము నే
మెట్టి తపంబు సేసితి మ ♦ తీశ్వర పూర్వశరీరవేళలన్. 110

వ. అని ధర్మజుండు దన్నుఁ బ్రార్థించిన నింద్రప్రస్థపురంబు వారలకు నయనానందంబు సేయుచు హరి కొన్ని నెలలు వసియించియుండె నం దొక్కనాఁడు. 111

మ. [3]తురగశ్రేష్ఠము నెక్కి కంకటధనుః ♦ తూణీశరోపేతుఁడై
హరితోడన్ వనభూమి కేగి విజయుం ♦ డాసక్తుఁడై చంపె శం
బర శార్దూల తరక్షు శల్య చమరీ ♦ భల్లూక గంధర్వ కా
సర కంఠీరవ ఖడ్గ కోల హరిణీ ♦ సారంగ ముఖ్యంబులన్. 112

క. అచ్చోటఁ బవిత్రములై । వచ్చినమృగరాజి నెల్ల ♦ జననాథునకుం
దెచ్చియొసంగిరి మెచ్చఁగ । జెచ్చెర నరుఁ గొల్చియున్న ♦ సేవకులధిపా.

వ. అంత నర్జునుండు నీరువట్టున డస్సిన యమునకుం జని యమ్మహారథులైన నరనారాయణు లందు వార్చి జలంబులు ద్రావి యొక [4]పులిన ప్రదేశంబున నుండి. 114

చ. [5]ఉపగతులైన యట్టి పురు ♦ షోత్తమపార్థులు గాంచి రాపగా
విపులవిలోల నీలతర ♦ వీచికలందు శిరోజభారరు
చ్యపహసితాళిమాలిక న ♦ వంచితబాలశశిప్రభాలికం
దపనునిబాలికన్ మదన ♦ దర్పణతుల్యకపోలపాలికన్. 115

వ. కని యచ్యుతుండు పంచిన [6]విజ్వచ్చుండు సని యాకన్య కిట్లనియె.

మ. సుదతీ యెవ్వరిదాన వేమికొఱ కి ♦ చ్చోటం బ్రవర్తించె దె
య్యది నీనామము గోర్కి యెట్టిది వివా ♦ హాకాంక్షతోఁ గూడి యీ

1. తమభావములందు = తమమనస్సులందు. 2. గుణభద్ర చరిత్రుఁడవు = గుణములచే మంగళమగు చరిత్ర కలవాఁడవు. 3. తురగశ్రేష్ఠము = గుఱ్ఱములలో శ్రేష్ఠము. 4. పులినప్రదేశంబున = ఇసుకతిన్నెలుగల స్థలమందు. 5. ఉపగతులైన = పొందిన (ఇసుకతిన్నెలమీద కూర్చున్న) 6. విజ్వచ్చుండు = అర్జునుఁడు.

నదికిఁ వచ్చినజాడ గానఁబడె ధన్యంబయ్యె నీరాక నీ
[1]యుదయాదిస్థితి నెల్లఁజెప్పు మబలా ! యుద్యత్కురంగేక్షణా.

వ. అనిన నర్జునునకుఁ గాళింది యిట్లనియె. 118

మ. నరవీరోత్తమ యేను సూర్యునిసుతన్ ! నాపేరు కాళింది [2]భా-
స్కర సంకల్పిత గేహమందు నదిలోఁ ! గంజాక్షు విష్ణుం బ్రభున్
వరుఁగాగోరి తపంబుసేయుదు నొరున్ ! వాంఛింపఁ గృష్ణుండు [3]వ
న్యరతిన్ వచ్చి వరించు నంచుఁబలికెన్ ! నాతండ్రి నాతోడుతన్.

వ. అనిన విని [4]ధనంజయుండా నీలవేణిపలుకులు హరికిం జెప్పిన
విని సర్వజ్ఞుండైన హరియు హరిమధ్యను రథంబుమీఁద నిడుకొని
ధర్మరాజు కడకుం జని వారలు గోరిన విశ్వకర్మను రావించి వారి
పురం బతివిచిత్రంబు సేయించె. 120

క. దేవేంద్రుని [5]ఖాండవమును
బావకునకు నీఁ దలంచి ! పార్థుని రథికుం
గావించి సూతుఁ డయ్యెను
గోవిందుఁడు [6]మఱఁదితోడి ! కూరిమి వెలయన్. 121

వ. ఇట్లు నరనారాయణులు సహాయులుగా [7]దహనుండు ఖాండవ
వనంబు దహించి సంతసించి విజయునకు [8]నక్షయ తూణీరంబులు
నభేద్యకవచంబును గాండీవ మనియెడి బాణాసనంబును దివ్యరథం
బును [9]ధవళరథ్యంబులు నిచ్చెనందు. 122

ఉ. వాసవసూనుచేఁ దనకు ! వహ్నిశిఖాజనితోగ్రవేదనల్
పాసినఁ జేసి యొక్క సభ ! పార్థునకిచ్చె మయుండు ప్రీతుఁడై
యాసభలోనఁగాదె గమనాగమనంబులఁ గౌరవేంద్రుఁ డు
ల్లాసముఁ బాసి యుండుట జలస్థలనిర్ణయబుద్ధిహీనుఁడై.

---

1. ఉదయాదిస్థితి = పుట్టినదిమొదలు చరిత్ర 2. భాస్కరసంకల్పిత గేహమందు = సూర్యనిర్మిత గృహమున. 3. వన్యరతిన్ = వనమునకు వచ్చు ఆసక్తిచే. 4. ధనంజయుఁడు = అర్జునుఁడు. 5. ఖాండవము = ఖాండవవనమును. 6. మఱఁదితోడి = బావమఱఁదితో. 7. దహనుండు = అగ్నిహోత్రుఁడు. 8. అక్షయతూణీరంబులు = తఱుగని అమ్ములుగల పొదులు 9. ధవళరథ్యంబులు = తెల్లనిగుఱ్ఱములు.

—♦ శ్రీకృష్ణుండు కాళింది మిత్రవింద నాగ్నజితి భద్ర లక్షణ యనువారలం బరిణయంబగుట ♦—

వ. అంతం గృష్ణుండు ధర్మరాజప్రముఖుల వీడుకొని సాత్యకి ప్రముఖ సహచరులు గొలువ మరలి తన పురంబునకుం జనుదెంచి బంధుజనంబులకుఁ బరమానందంబు సేయుచు నొక్క పుణ్యదివసంబున శుభలగ్నంబునం గాళిందిం బెండ్లి యయ్యె. మఱియు నవంతిదేశాధీశ్వరు లైన విందానువిందులు దుర్యోధనునకు వశ్యులై హరికి మేనత్తయైన రాజాధిదేవికూఁతు రైన తమ చెలియలి వివాహంబు సేయ నుద్యోగించి స్వయంవరంబుఁ జాటించిన. 124

క. [1]భూరమణులు సూడఁగ హరి। వీరతఁ జేకొనియె మిత్రవిందను నిత్యా
పూరితసుజనానందం। జారుచికురకాంతివిజితషట్పద బృందా. 125

సీ. జననాథ వినుము కోసలదేశ మేలెడి
నగ్నజిత్తను నరనాథుఁ డొకఁడు
సుమతి ధార్మికుఁడు త త్సుత నాగ్నజితి యను
కన్యక గుణవతి గలదు దానిఁ
బెండ్లి యాడుటకునై [2]పృథివీశు లేతెంచి
వాఁడికొమ్ములు గలవాని పీర
గంధంబు సోఁకినఁ గాలుద్రవ్వెడివాని
నతిమదమత్తంబు లైనవాని

తే. గోవృషంబుల నేడింటి గూర్చి [3]తిగిచి
బాహుబలమున నెవ్వండు పట్టి కట్టు
నతఁడు కన్యకుఁ దగువరుం డనిన వానిఁ
బట్టఁజాలక పోదురు ప్రజలు [4]బెగడి. 126

వ. ఇట్లు గోవృషంబుల జయించినవాఁ డక్కన్యకు వరుం డనిన భగవంతుం డయిన హరి విని సేనాపరివృతుండై కోసలపురంబునకుం జనినఁ గోసలాధీశ్వరుండు హరి నెదుర్కొని, యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి పీఠంబు సమర్పించి [5]ప్రతినందితుండయి యున్నయెడ.

1. భూరమణులు=రాజులు. 2. పృథివీశులు = రాజులు. 3. తిగిచి=ఆకర్షించి. 4. బెగడి = భయపడి. 5. ప్రతినందితుండయి = తిరిగి నమస్కరించినవాఁడై.

క. ఆ రాజకన్య ప్రియమున । నా [1]రాజీవాక్షు మోహనాకారుఁ ద్రిలో
కారాధితు మాధవుఁ దన । కారాధ్యుం డైన నాథుఁ గా నని కోరెన్నృపా.

వ. మఱియు నక్కన్యకారత్నంబు తన మనంబున. 129

ఆ. విష్ణుఁ [2]డవ్యయుండు । విభుఁడు గావలెనని
నోఁచినట్టి తొంటి । నోముఫలము
సిద్ధ మయ్యెనేనిఁ । జేకొనుఁ బో నన్నుఁ
జక్రధరుఁడు వైరిచక్రహరుఁడు. 130

మ. సిరియుం బద్మభవేశ దిక్పతులు మున్ । సేవించి యెవ్వాని శ్రీ
చరణాంభోజపరాగముల్ శిరములన్ । సమ్యగ్గతిం దాల్తు రీ
ధరణీచక్రభరంబు వాపుటకు నుద్యత్కేళిమూర్తుల్ దయా
పరుఁడై యెవ్వఁడు దాల్చు నట్టిహరి యెబ్భంగిం బ్రవర్తించునో.

వ. అని యిట్లు నాగ్నజితి విచారించు నెడఁ గృష్ణుం డా రాజుం జూచి
మేఘ గంభీర నినదంబున నిట్లనియె. 132

క. అన్యుల యాచింపరు రాజన్యులు సౌజన్యకాంక్షఁ । జనుదెంచితి మీ
కన్యక వేఁడెద నిమ్మా కన్యాశుల్కదుల మేము । గాము నరేంద్రా.

వ. అనిన విని రా జిట్లనియె. 134

శా. కన్యం జేకొన నిన్నిలోకముల నీ । కంటెన్ ఘనుం డైన రా
జన్యుం డెవ్వఁడు నీగుణంబులకు నా । శ్వర్యంబునుం బొంది తా
నన్యారంభము మాని లక్ష్మి భవదీ । యాంగంబునన్ నిత్యయై
ధన్యత్వంబును జెంది యున్నదిగదా । తాత్పర్యసంయుక్తయై.

శా. [4]చంచద్గోవృష సప్తకంబుఁ గడిమిన్ । సైరించి యెవ్వాఁడు భం
జించున్ వానికిఁ గూఁతు నిత్తునని యే । కీరించినన్ వైభవో
దంచద్గర్వులు వచ్చి రాజతనయుల్ । [5]తత్పాదశృంగాహతిం
గించిత్కాలము నోర్వ కేగుదు రసిం । గేడించి భిన్నాంగులై.

---

1. రాజీవాక్షున్ = ఎఱ్ఱకలువల దళములవంటి నేత్రములు కలవాఁడు, 2. అవ్యయుండు = నాశములేనివాఁడు. 3. నినదంబునన్ = ధ్వనితో. 4. చంచద్గోవృషసప్తకంబు = ఏడు ఆఁబోతులు. 5. తత్పాదశృంగాహతిన్ = వాని పాదముల కొమ్ముల దెబ్బలచే.

శా. [1]ఉష్ణాంశుండు తమంబుఁ దోలు క్రియ నీ వుగ్రాహవక్షోణిలోఁ
గృష్ణా వైరులఁ దోలినాఁడవు రణక్రీడావిశేషంబులన్
[2]నిష్ణాతుండవు సప్త గోవృషములన్ నేఁడాజి భంజించి రో
చిష్ణుత్వంబున నేఁడు సేకొనుము మా [3]శీతాంశుబింబాననన్. 137

వ. అని నగ్నజిత్తు దనకూఁతు వివాహంబునకుఁ జేసిన సమయంబు సెప్పిన విని, 138

చ. కనియె నఘారి వత్సబకకంసవిదారి ఖలప్రహారి దా
[4]ఘనతరకిల్బిషంబులనగణ్యభయంకర పౌరుషంబులన్
సునిశితశృంగనిర్దళితశూరసమూహముఖామిషంబులన్
హననగుణోన్మిషంబుల మహాపరుషంబుల గోవృషంబులన్. 139

ఉ. చేలము చక్కఁగట్టుకొని చిత్రగతిన్ వడి నేడుమూర్తులై
బాలుఁడు దారురూపములఁ బట్టెడుకైవడిఁ బట్టి [5]వీర శా
ర్దూలుఁడు గ్రుద్ది నేలఁ బడఁద్రోఁచి మహోద్ధతిఁగట్టి యీడ్చె భూ
పాలకులెల్ల మెచ్చ వృషభంబులఁ [6]బర్వతసన్నిభంబులన్. 140

వ. ఇట్లు వృషభంబుల నన్నింటిని గట్టి యీడ్చినం జూచి సంతసించి హరికి నగ్నజిత్తు నాగ్నజితి నిచ్చిన విధివత్ప్రకారంబునం బెండ్లి యయ్యె నా రాజసుందరు లానందంబునుం బొంది రా సమయంబున బ్రాహ్మణాశీర్వాదంబులును గీతపటహశంఖకాహళభేరీమృదంగనినదంబులును జెలంగె, నంత నా కోసలేంద్రుండు దంపతులరథారోహణంబు సేయించి పదివేల ధేనువులును విచిత్రాంబరాభరణ భూషితలైన యువతులు మూఁడువేలును దొమ్మిదివేల గజంబులును గజంబులకు [7]శతగుణములైన రథంబులును రథంబులకు శతగుణంబులైన [8]హయంబులును హయంబులకు శతగుణాధికంబైన భటసమూహంబును నిచ్చి పుత్తెంచిన వచ్చునప్పుడు. 141

---

1. ఉష్ణాంశుండు = సూర్యుఁడు. 2. నిష్ణాతుఁడవు = నేర్పుగలవాఁడవు. 3. శీత+అంశు+బింబ+ఆననన్ = చంద్రబింబమువంటి ముఖముకలదానిని, 4. ఘనతర కిల్బిషంబులన్ = మిక్కిలి గొప్పవైన పాపములను. 5. వీరశార్దూలుఁడు = వీరులలో శ్రేష్ఠుడు. 6. పర్వతసన్నిభంబులు = పర్వతములతో సమానములు. 7. శతగుణములైన = నూఱు రెట్లధికము అయిన 8. హయంబులను = గుఱ్ఱములను.

ఉ. భూతి నెలర్పఁ గోసలపుత్త్రికకై చనుదెంచి తొల్లి యా
బోతులచేత నోటువడి పోయినభూపతులెల్ల మాధవుం
డాతరుణిన్ వరించుట చరావలిచే విని క్రోధ సైన్యసం
ఘాతముతోడఁ దాఁకి రరిగర్వవిమోచనుఁ బద్మలోచనున్. 142

ఉ. దండి నరాతులెల్ల హరిఁ దాఁకిన నడ్డము వచ్చి వీఁకతోఁ
భండనభూమియందుఁ దన బాంధవులెల్లను సంతసింపఁగా
[1]గాండివచాపముక్తవిశిఖంబుల వైరులనెల్ల జంపె [2]నా
ఖండలనందనుండు [3]శశకంబుల సింహము చంపుకైవడిన్.

వ. ఇట్లు హరి నాగ్నజితిం బెండ్లియై [4]యరణంబు పుచ్చుకొని ద్వారకా
నగరంబునకు వచ్చి సత్యభామతోడం గ్రీడించుచుండె, మఱియును,

మ. జనవంద్యన్ శ్రుతకీర్తినంద్యఁ దరుణిన్ సందర్శనక్షోణిపా
ద్యనుజన్ మేనమఱందలిన్ విమలలోలాపాంగఁ గైకేయి ని
ధనయోన్నిద్రఁ బ్రపూర్ణ సద్గుణసముద్రన్ భద్ర నక్షుద్ర నా
వనజాతాక్షుఁడు పెండ్లియాడె నహితవ్రాతంబు భీతంబుగన్. 145

వ. మఱియును. 146

చ. అమరులఁ బాఱఁదోలి [5]భుజగాంతకుఁడైన [6]ఖగేశ్వరుండు ము
న్నమృతముఁ దెచ్చుకైవడి మదాంధుల రాజులనుక్కడంచి యా
కమలదళాయతేక్షణుఁడు గైకొని తెచ్చెను [7]మద్రకన్యకన్
సమదమృగేక్షణన్ నయవిచక్షణ లక్షణఁ బుణ్యలక్షణన్ 147

వ. ఇట్లు హరికిరుక్మిణియు జాంబవతియు సత్యభామయుఁ గాళిందియు
మిత్రవిందయు నాగ్నజితియు భద్రయు మద్రరాజనందనయైన లక్ష
ణయు ననంగా నెనమండ్రు భార్యలైరి. మఱియు నరకాసురుని
వధియించి తన్నిరుద్ధకన్యల షోడశ సహస్ర సంఖ్యల రోహిణీమొద
లైనవారిం బరిగ్రహించె ననిన విని. 148

1. గాండివ......ఖంబుల = గాండివమను ధనుస్సునుండి విడువఁబడిన బాణములు. గాండివము అర్జునుని ధనుస్సు పేరు. 2. ఆఖండలనందనుఁడు = ఇంద్రుని కుమారుఁడు. 3. శశకంబులన్ = కుందేళ్ళను. 4. అరణంబు = కట్నము, కానుక. 5. భుజగాంతకుఁడు = సర్పములచంపువాఁడు. 6. ఖగేశ్వరుండు = గరుత్మంతుఁడు. 7. మద్రకన్యకన్ = మద్రదేశరాజుకూఁతురు. 8. షోడశసహస్రసంఖ్యల = పదునాఱు వేలు.

క. ధరకుం బ్రియనందనుఁ డగు నరకుని హరి యేల చంపె ✱ నరకాసురుఁడా
వరకుంతల లగు చామీకరకుంభస్తనుల నేల ✱ కారియఁ బెట్టెన్.

వ. అనిన నరేంద్రునకు మునీంద్రుం డిట్లనియె. నరకాసురునిచేత నదితి కర్ణకుండలంబులును వరుణచ్ఛత్త్రంబును మణిపర్వత మనియెడు నమరాద్రి స్థానంబును గోలుపడుటయు నింద్రుం డువచ్చి హరికి విన్నవించిన హరి నరకాసుర వధార్థంబు గరుడవాహనారూఢుండై చను సమయంబున హరికి సత్యభామ యిట్లనియె. 150

-♦ శ్రీకృష్ణుండు సత్యభామతోఁ గూడ నరిగి మురాసుర నరకాసురుల వధించుట ♦-

శా. దేవా నీవు నిశాటసంఘముల ను✱ద్దీపించి చెండాడ నీ
ప్రావీణ్యంబులు సూడఁగోరుదుగదా ✱ ప్రాణేశ మన్నించి నన్
నీ వెంటం గొనిపొమ్ము నేఁడు కరుణన్ ✱ నేఁజూచి యేతెంచి నీ
దేవీసంఘము కెల్లఁ జెప్పుదు [1]భవ✱ద్దీప్తప్రతాపోన్నతుల్.

వ. అనినఁ బ్రాణవల్లభకు వల్లభుం డిట్లనియె. 152

సీ. సమదపుష్పంధయ✱ఝంకారములు గావు
భీషణకుంభీంద్ర✱బృంహితములు
వాయునిర్గతపద్మ✱వనరేణువులు గావు
తురగరింఖాముఖో✱ద్ధూతరజము
లాకీరజలతరం✱గాసారములు గావు
శత్రు [3]ధనుర్ముక్త✱సాయకములు
కలహంస సారస ✱ కాసారములు గావు
దనుజేంద్ర సైన్య క✱దంబకములు

తే. కమలకల్హార కుసుమ సం✱ఘములు గావు
చటుల రిపు శూల ఖడ్గాది✱సాధనములు
కన్య నీ వేడ రణరంగ✱గమన మేడ
వత్తు వేగమ నిలువుము ✱ వలదు వలదు. 153

వ. అనినఁ బ్రియునకుఁ బ్రియంబు జనియింప డగ్గఱి. 154

---

1. భవ...న్నతుల్ = నీ ప్రకాశించు ఉన్నతకీర్తులు. 2. సమద...రములు = మదముతోఁ గూడినతుమ్మెదలయొక్క ఝంకారములు, ఝుంకారనుధ్వనులు. 3. ధనుర్ముక్తసాయకములు = ధనుస్సునుండి వెలువడు బాణములు.

ఉ. దానవులైన నేమి మఱి దైత్యసమూహములైన నేమి నీ
మానితబాహుదుర్గముల మాటున నుండఁగ నేమి శంక నీ
తో నరుదెంతు నంచుఁ [1]గరతోయజముల్ ముకుళించి మ్రొక్కిన
మ్మానిని దన్ను భర్త బహుమానపురస్సరదృష్టిఁ జూడఁగన్.

వ. ఇట్లు తనకు మ్రొక్కిన సత్యభామను గరకమలంబులఁ గ్రుచ్చియెత్తి
తోడ్కొని గరుడారూఢుం డయి హరి గగనమార్గంబునం జని
గిరి శస్త్ర సలిల దహన పవన దుర్గమంబై మురాసుర పాశ పరివృతం
బయిన ప్రాగ్జ్యోతిషపురంబు డగ్గఱి. 156

మ. గదచేఁ బర్వతదుర్గముల్ శకలముల్ గావించి సత్తేజిత
ప్రదర శ్రేణుల శస్త్రదుర్గచయమున్ భంజించి చక్రాహతిం
జెదరన్ వాయు జలాగ్ని దుర్గముల నిశ్శేషంబులం జేసి భీ
ప్రదుఁడై వాలునఁ ద్రుంచెఁ గృష్ణుఁడు మురప్రచ్ఛన్నపాశంబులన్.

వ. మఱియును. 158

శా. ప్రాకారంబు [2]గదాప్రహారముల నుత్పాటించి యంత్రంబులున్
[3]నాకారాతుల మానసంబులును భిన్నత్వంబు పొందంగ న
స్తోకాకారుఁడు శౌరి యొత్తె [4]విలయోద్ధూతాభ్రనిర్ఘాత రే
ఖా కాఠిన్యముఁ బాంచజన్యము విముక్తప్రాణిచైతన్యమున్.

వ. అంత లయకాలకాలాభ్రగర్జనంబుపగిది నొప్పు నమ్మహాధ్వని విని
పంచశిరుండైన మురాసురుండు నిదుర సాలించి యావులించి నీల్గి
లేచి జలంబులు వెడలి వచ్చి హరిం గని ప్రళయకాలకీలి క్రైవడి
మండుచు దుర్నిరీక్ష్యుండై [5]కరాళించుచుం దన పంచముఖంబులం
బంచభూతమయంబయిన లోకంబుల మ్రింగ నప్పళించు చందంబునం
గదిసి యాభీల కీలాజటాలం బగు శూలంబున గరుడుని వైచి భూ
నభోంతరంబులు నిండ నార్చుచు. 160

1. కరతోయజముల్ = పద్మములవంటి హస్తములు. 2. గదాప్రహారముల = గదయొక్క దెబ్బలచే. 3. నాకారాతుల = రాక్షసులయొక్క. 4. విలయో ... కాఠిన్యము = ప్రళయకాలమందు బయలువెడలిన మేఘగర్జనముతీరునఁ బరుషమైనది. 5. కరాళించుచు = గర్జించుచు.

క. [1]దురదురఁబఱువడి బిరుసున
హరిహరి నిలు నిలువు మనుచు నసురయుఁ గదిసెన్
మురమురఁ దివిజులహృదయము
[2]మెరమెర యిదె యడఁగు ననుచు మెఱసెన్ హరియున్. 161

వ. అప్పుడు.

క. గరుడునిపైఁ బడ వచ్చిన
మురశూలము నడుమ నొడిసి ముత్తునియలుగాఁ
గరముల విఱిచి ముకుందుఁడు
మురముఖముల నిశితవిశిఖములు పడిఁ జొనిపెన్. 163

మ. గద వేసెన్ మురదానవుండు హరిపైఁ గంసారియుం దద్గదన్
గదచేఁ ద్రుంచి సహస్రభాగములుగాఁ గల్పించె నాలోన వాఁ
డెదురై హస్తములెత్తికొంచు వడి రా వీక్షించి లీలాసమ
గ్రదశన్ వాని శిరంబు లైదును వడిన్ ఖండించె జక్రాహతిన్.

వ. ఇట్లు శిరంబులు చక్రిచక్రధారాచ్ఛిన్నంబులయిన వజ్రి వజ్రధారాదళితశిఖరంబై కూలెడి శిఖరిచందంబున మురాసురుండు జలంబులందుఁ గూలిన వాని సూనులు జనకవధజనిత శోకాతురులై జనార్దనుమర్దింతుమని [3]రణకుర్దనంబునం దామ్రుండు నంతరిక్షుండు శ్రవణుండు విభావసుండు వసుండు నభస్వంతుండును నరుణుండు నన నేడ్వురు యోధులు సక్రోధులై కాలాంతకచోదితంబైన ప్రళయపవనసప్తకంబుభంగి నరకాసురప్రేరితులై రయంబునఁ బీఠుం డనియెడు దండనాథుం బురస్కరించుకొని యఱతెంచి హరిం దాఁకి శరశక్తిగదాఖడ్గ కరవాల శూలాది సాధనంబులు ప్రయోగించిన,

ఉ. ఆ దనుజేంద్రయోధ వివిధాయుధసంఘము నెల్ల నుగ్రతన్
మేదినిఁ గూలనేయుచు [4]సమిద్ధనిరర్గళమార్గణాళిఁ బ్ర
హ్లాదకులాంతకుం డసురహస్త భుజానన కంఠ జాను జం
ఘాదులఁ ద్రుంచి వైచెఁ దిలలంతలు ఖండములై యిలం బడన్.

1. దురదుర = శీఘ్రముగ 2. మెరమెర = మనోవ్యథ 3. రణకుర్దనము = యుద్ధక్రీడ. 4. సమిద్ధ...ణాళిన్ = మిక్కిలి శ్రేష్ఠములై యడ్డులేనిబాణపంక్తిచేత.

వ. మఱియు హరిశరజాలచక్రనిహతులయిన తనవారలు మడియుటకు వెఱఁగుపడి రోషించి గరుడగమనుని దూషించి తన్నుభూషించుకొని సరకుసేయక నరకుండు వరకుండలప్రముఖాభరణభూషితుండయి దానసలిలధారాసిక్తగండంబులును మహోద్దండశుండంబులును నైన వేదండతండంబులు నడవ వెడలి భండనంబునకుం జని. 167

మ. బలవంతుండు ధరాసుతుండు గనె శుంభద్భ్రాజబింబోపరి
స్థలశంపాన్వితమేఘమో యన ఖగేంద్రస్కంధపీఠంబుపై
లలనారత్నముఁ గూడి [1]సంగరకథాలాపంబులం జేయు ను
జ్జ్వలనీలాంగుఁ [2]గనన్నిషంగుఁ గుహనాసంగున్ రణాభంగునిన్.

వ. కని కలహంబునకు నరకాసురుండు గమకింపం దమకింపక విలోకించి సంభ్రమంబున. 169

శా. వేణిన్ జొల్లెము వెట్టి సంఘటితనీవీబంధయై భూషణ .
శ్రేణిం దాల్చి ముఖేందుమండలమరీచీజాలముల్ పర్వఁగాఁ
బాణిం బయ్యెదఁ జక్కఁగాఁ దుఱిమి శుంభద్వీరసంరంభయై
[3]యేణీలోచన లేచి నిల్చెఁ దనప్రాణేశాగ్రభాగంబునన్. 170

—♦ సత్యభామ నరకాసురునితో యుద్ధము సేయుట ♦—

క. [4]జన్యంబున దనుజుల దౌర్జన్యము లుడుపంగఁ గోరి చనుదెంచిన సౌ
జన్యవతిఁ జూచి యమరాజన్యశ్రేష్ఠుండు సరససల్లాపములన్.

క. లేమా దనుజుల గెలువఁగ లేమా నీ వేల కడఁగి లేచితి విటురా
లే మాను మాన వేనా లేమా విల్లందికొనుము లీలం గేలన్.

వ. అని పలికి. 173

క. [5]హరిణాక్షికి హరి యిచ్చెను సురనికరోల్లాసనమును శూరకఠోరా
సురసైన్యత్రాసనమును బరగర్వనిరాసనమును [6]బాణాసనమున్.

శా. ఆ విల్లంది బలంబు నొంది తదగణ్యానంత తేజోవిశే
షావిర్భూత మహాప్రతాపమున వీరాలోకదుర్లోకయై

1. సంగర = యుద్ధము. 2. కనన్నిషంగున్ = ప్రకాశించుచున్న యంబులపొది కలవానిని. 3. ఏణీలోచన = లేడికన్నులవంటి నేత్రములుగలది. 4. జన్యంబున = యుద్ధమందు. 5. హరిణాక్షి = లేడికన్నులవంటి కన్నులు గలది (సత్యభామ) 6. బాణాసనము = ధనుస్సు.

తావేగన్ సగుణంబుజేసె ధనువుం దన్వంగి దైత్యాంగనా
గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణక్రీడామహోత్కంఠతోన్.

క. నారి మొరయించె రిపుసేనారింఖణహేతువైన నాదము నిగుడన్
నారీమణి [1]బలసంపన్నారిభావికము మూర్ఛ నొంద నరేంద్రా.

సీ. సౌవర్ణ కంకణ ఝణఝణ నినదంబు
[2]శింజినీరవముతోఁ జెలిమి సేయఁ
తాటంక మణిగణ ధగధగ దీప్తులు
గండ మండల రుచిఁ గప్పికొనఁగ
ధవళతరాపాంగ ధళధళ రోచులు
బాణజాలప్రభాపటలి నడఁప
శరపాత ఘుమ ఘుమ శబ్దంబు పరిపంథి
సైనిక కలకలస్వనము నుడుప
తే. వీర శృంగార భయ రౌద్ర విస్మయములు
కలసి భామిని యయ్యెనో కాక యనఁగ
నిషువుఁ దొడుగుట దివుచుట యేయు టెల్ల
నెఱుఁగరాకుండ నని సేసె నిందువదన. 177

మ. పరుఁ జూచున్ [3]వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్
జరగం గన్నులఁ గెంపు సొంపుఁ బరఁగన్ జండాస్త్రసందోహమున్
సరసాలోకసమూహము న్నెఱపుచుం జంద్రాస్య హేలాగతిన్.

మ. అలినీలాలక చూడ నొప్పెసఁగెఁ [4]బ్రత్యాలీఢపాదంబుతో
నలిక స్వేదవికీర్ణ కాలకలతో నాకర్ణ కానీత స
ల్లలితజ్యానఖపుంఖదీధితులతో లక్ష్యావలోకంబుతో
వలయాకారధనుర్విముక్తవిశిఖవ్రాతాహతారాతియై.

సీ. బొమ్మపెండ్లిండ్లకుఁ బోనొల్ల నను బాల
రణరంగమున కెట్లు రాఁదలంచె

1. బల - ... కము = బలసంపదకల్గిన శత్రువులు, ఏనుఁగులు మొదలగునవి.
2. శింజినీరవము = ధనుస్సుయొక్క త్రాటిధ్వని 3. వరుఁజూచు = భర్తను జూచు = (సత్యభామ). 4. ప్రత్యాలీఢ పాదంబుతో = ముందుకు చాచఁబడినఎడమకాలితో.

మగవారిఁ గనినఁ దా ✽ మఱుఁగుఁ జేరెడు నింతి
పగవారి గెల్వ నే✽పగిదిఁ జూచెఁ
బసిడియుయ్యేల లెక్క ✽ భయమందు భీరువు
ఖగపతి స్కంధ ✽ మేకడిఁది నెక్కె
సఖుల కోలాహల✽స్వనము లోర్వనికన్య
పటహ భాంకృతుల కె✽బ్బంగి నోర్చె

ఆ. [1]నీలకంఠములకు ✽ నృత్యంబుఁ గఱపుచు
నలసి తలఁగి పోవు ✽ నలయుఁబోఁడి
యేవిధమున నుండె ✽ నెలమి నాలీఢాది
మానములను రిపుల✽మాన మడఁప. 180

సీ. వీణెఁ జక్కఁగఁ బట్ట ✽ వెర వెఱుంగని కొమ్మ
బాణాసనం బెట్లు ✽ పట్ట నేర్చె
మ్రాఁకునఁ దీగెఁ గూ✽ర్పంగ నేరని లేమ
గుణము నే క్రియ ధనుః✽కోటిఁ గూర్చె
సరవి ముత్యముగ్రువ్వఁ✽జాలని యబల యే
నిపుణత సంధించె ✽ [2]నిశితశరముఁ
జిలుకకుఁ బద్యంబు ✽ సెప్పనేరని తన్వి
యస్త్రమంత్రము లెన్నఁ ✽ డభ్యసించెఁ

ఆ. బలుకు మనినఁ బెక్కు ✽ పలుకని ముగుద యే
గతి నొనర్చె సింహ✽గర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిజగ✽దభిరామ గుణధామ
చారుసత్యభామ ✽ సత్యభామ. 181

శా. జ్యావల్లీ ధ్వని గర్జనంబుగ సురల్ ✽ సారంగయూథంబుగా
నావిల్లింద్రశరాసనంబుగ సరో✽జాక్షుండు మేఘంబుగాఁ
దా [3]విద్యుల్లతభంగి నింతి సురజి✽ద్దావాగ్నిమగ్నంబుగాఁ
[4]బ్రావృట్కాలము సేసె బాణచయ మం✽భశ్శీకరశ్రేణిగాఁ. 182

1. నీలకంఠములకు = నెమిళ్ళకు. 2. నిశితశరము = వాడిబాణము.
3. విద్యుల్లతభంగి = మెఱపుతీఁగవిధమున. 4. ప్రావృట్కాలముసేసె = వర్షకాలముగా జేసె.

సీ. రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ [1]నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై
యలరుఁ బూఁబోఁడి చేలాంచలంబు
భావజు పరిధియై ప్రళయార్కు పరిధియై
మెఱయు నాకృష్టమై మెలఁతచాప
మమృత ప్రవాహమై యనలసందోహమై
తనరారు నింతి సందర్శనంబు

ఆ. హర్షదాయి యై మహారోషదాయి యై
పరఁగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార
వీరరసము లోలి విస్తరిల్ల. 183

వ. ఇవ్విధంబున 184

క. [2]శంపా లతాభ బెడిదపుటంపరచే ఘోర దానవానీకంబుల్
పెంపఱి సన్నాహంబులసొంపఱి భూసుతుని వెనుకఁ బిరిచ్చెన్ విచ్చెన్

వ. అయ్యవసరంబునఁ గంససంహారి మనోహారిణిం జూచి సంతోషకారి యుం గరుణారసావలోకనప్రసారియు మధురవచన సుధారస విసారియుం దదీయ సమరసన్నాహ నివారియునై యిట్లనియె. 186

క. [3]కొమ్మా దానవనాథుని
కొమ్మాహవమునకుఁ దొలఁగె గురువిజయము గై
కొమ్మా మెచ్చితి నిచ్చెదఁ
గొమ్మాభరణములు నీవు కోరిన వెల్లన్. 187

వ. అని పలికి సమ్మాన రూపంబులును మోహన దీపంబులును దూరీకృత చిత్తవిక్షేపంబులు నైన సల్లాపంబులం గళావతిం దద్దయుఁ బెద్దఱి కంబు సేసి తత్కరకిసలయోల్లసిత బాణాసనంబు మరల నందు కొనియె, నప్పుడు సురవైరి మురవైరి కిట్లనియె. 188

1. నెమ్మొగంబు = అందమైనమోము. 2. శంపాలతాభ = మెఱపుతీగవంటి కాంతి. 3. కొమ్మా = స్త్రీ.

క. మగువ మగవారియందఱ
మగతనములు సూప, రణము మానుట నీకున్
మగతనము గాదు, దనుజులు
మగువల దెసఁ జనరు మగల మగలగుట హరీ. 189

వ. అనిన హరి యిట్లనియె. 190

క. నరకా ఖండించెద మ
త్కర కాండాసన విముక్త ఘనశరముల భీ
కరకాయు నిన్ను సురకి
న్నర కాంతలు సూచి నేఁడు నందం బొందన్. 191

వ. అని పలికి హరి నరకాసురయోధులమీఁద శతఘ్నియను దివ్యాస్త్రంబు ప్రయోగించిన నొక్క వరుసను వార లందఱు మహావ్యథం జెందిరి మఱియును. 192

మ. [1]శరవిచ్ఛిన్నతురంగమై [2]పటుగదాసంభిన్నమాతంగమై
యురుచక్రాహత వీరమధ్యపదబాహుస్కంధముఖ్యాంగమై
సురభిత్సైన్యము దైన్యముం బొరయుచున్ శోషించి హైన్యంబుతో
హరిమ్రోలన్ నిలుపంగలేక పఱచెన్ హాహానినాదంబులన్.

వ. అప్పుడు. 194

ఆ. మొనసి దనుజయోధముఖ్యులు నిగిడించు
శస్త్రసముదయముల జనవరేణ్యా
మురహరుండు వరుస మూఁడేసికోలల
ఖండితంబు సేసెఁ గదనమందు. 195

క. వెన్నునిసత్యనుమోచుచుఁ|బన్నగఁబదనఖరచంచుపక్షాహతులన్
భిన్నములుసేసెగరుడుఁడు|పన్నినగజసముదయములఁబౌరవముఖ్యా!

వ. మఱియు [3]విహగరాజపక్షవిక్షేపణసంజాతవాతంబు సైరింపంజాలక హతశేషంబైన సైన్యంబుపురంబు సొచ్చుటంజూచి నరకాసురుండు

1. శరవిచ్ఛిన్న తురంగమై = బాణముచేఁ గొట్టఁబడిన గుఱ్ఱములు గలదై.
2. పటుగదాసంభిన్నమాతంగమై = బలముగల గదలచే ముక్కలుఅయిన ఏనుఁగులు.
3. విహగ... వాతంబు = గరుత్మంతుని ఱెక్కలు విసరుటచే పుట్టిన వాయువు.

మున్న వజ్రాయుధంబుం దిరస్కరించిన తనచేతి శక్తిం గొని గరుడుని వైచె, నతండును విరులదండ వ్రేటు నం జలింపని మదోద్దండ వేదండంబునుం బోలె విలసిల్లె, నయ్యవసరంబున గజారూఢుండై కలహరంగంబున. 197

మ. సమదేభేంద్రము నెక్కి భూమిసుతుఁ డాశచక్రాయుధుఁ డై వశూలము జేఁబట్టిన యంతలోన రుచిమాలాభిన్నఘోరాసురో త్తమచక్రంబగు చేతిచక్రమున [1]దైత్యధ్వంసి ఖండించె [2]రత్నమయోదగ్రవినూత్న కుండల సమేతంబైన [3]తన్మూర్ధమున్.

శా. ఇల్లాలిం గిటియైన కాలమున ము న్నే నంచు ఘోషింతు వో తల్లీ నిన్నుఁదలంచియైన నిచటం దన్నుం గృపం గావఁడే చెల్లంబో తలఁ ద్రెంచె నంచు నిల నాక్షేపించు చందంబునం ద్రెళ్ళెం జప్పుడుగాఁగ భూమిసుతుఁ డుద్దీప్తాహవక్షోణిపై. 199

క. కంటిమి నరకుఁడు వడఁగా
మంటిమి నేఁ డనుచు వెస సమర్త్యులు మునులున్
మింటం బువ్వులు గురియుచుఁ
బంటింపక పొగడి రోలిఁ బద్మదళాక్షున్. 200

వ. అంత భూదేవి వాసుదేవుని డగ్గఱ నేతెంచి జాంబూనద రత్నమండితంబైన కుండలంబులును వైజయంతి యను వనమాలయును వరుణదత్తంబైన సితచ్ఛత్రంబు నొక్క మహారత్నంబును సమర్పించి మ్రొక్కి భక్తి తాత్పర్యంబులతోడం గరకమలంబులు ముకుళించి [4]విబుధవందితుండును విశ్వేశ్వరుండును నైన దేవదేవుని నిట్లని వినుతించె.

—♦ భూదేవి శ్రీకృష్ణుని స్తుతించుట ♦—

సీ. అంభోజనాభున కంభోజనేత్రున
కంభోజమాలాసమన్వితునకు

1. దైత్యధ్వంసి = రాక్షస శత్రువు. 2. రత్నమయ...తంబైన = నూతనమై గొప్పరత్నకుండలములతో కూడిన. 3. తన్మూర్ధమున్ = వానిశిరము. 4. విబుధ వందితుండు = దేవతలచే నమస్కరింపఁ దగినవాఁడు.

నంభోజపదున కనంతశక్తికి వాసు
దేవునకును దేవదేవునకును
భక్తులు గోరినభంగి నేరూపైనఁ
బొందువానికి నాదిపురుషునకును
నఖిలనిదానమై యాపూర్ణవిజ్ఞానుఁ
డైనవానికిఁ బరమాత్మునకును

ఆ. ధాతఁ గన్న మేటితండ్రికి నజునికి నీకు వందనంబు లేనొనర్తు
నిఖిలభూతరూప నిరుపమయోగీశ పరాపరాత్మమహిత యమితచరిత.

వ. దేవా నీవు లోకంబుల సృజించుటకు రజోగుణంబును, రక్షించుటకు సత్త్వగుణంబును సంహరించుటకుఁ దమోగుణంబును ధరియింతువు కాలమూర్తివి ప్రధానపూరుషుండవు పరుండవు నీవ నేనును [1]వారియు వహ్నియు ననిలుండు నాకాశంబుఁ [2]దన్మాత్రలు నింద్రియంబులును దేవతలును మనంబును గర్తయును మహత్తత్త్వంబును జరాచరంబైనవిశ్వంబు నద్వితీయుండవైన నీయందుసంభవింతును

చ. దయ నిటు చూడుమా నరకదైత్యునిబిడ్డఁడు వీఁడు నీదెసన్
భయమున నున్నవాఁడు గడు బాలుఁ డనన్యశరణ్యుఁ డార్తుఁ డా
శ్రయరహితుండు తండ్రిక్రియ శౌర్యము [3]నేరఁడు నీపదాంబుజ
ద్వయిఁ బొడగాంచె భక్తపరతంత్ర సువీక్షణ దీనరక్షణా. 204

వ. అని యిట్లు భూదేవి భక్తితోడ హరికిం బ్రణమిల్లి వాక్కుసుమంబులం బూజించిన నర్చితుండై భక్తవత్సలుండయిన పరమేశ్వరుండు నరకపుత్త్రుండయిన భగదత్తున కభయంబిచ్చి సర్వసంపద లొసంగి నరకాసురగృహంబు ప్రవేశించి యందు. 205

### శ్రీకృష్ణుఁడు పదాఱువేలకన్నియల వరించి దేవలోకమునకుఁ బోయి పారిజాతముఁ దెచ్చుట.

ఉ. రాజకులావతంసుఁడు పరాజితకంసుఁడు సొచ్చి కాంచె [4]ఘో
రాజుల రాజులం బటు శరాహతి నొంచి ధరాతనూజుఁ డు

1. వారియు = ఉదకము. 2. తన్మాత్రలు = శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు. 3. నేరఁడు = నేర్చినవాఁడు కాఁడు. 4. ఘోరాజులన్ = భయంకర యుద్ధములయందు.

త్తేజితశక్తిఁ దోర్మ్రి జెఱదెచ్చినవారిఁ బదాఱువేల ధా
త్రీజన కన్యలన్ గుణవతీవ్రతధన్యల రాజకన్యలన్.

మ. కని రా రాజకుమారికల్ పరిమళత్కౌతూహలాక్రాంతలై
దనుజాధీశచమూవిదారు నతమందారున్ శుభాకారు నూ
తనశృంగారు వికారదూరు [1]సుగుణోదారున్ [2]మృగీలోచనా
జనచేతోధనచోరు రత్నమకుటస్ఫారున్ మనోహారునిన్. 207

వ. కని యతనిసౌందర్యగాంభీర్యచాతుర్యాది గుణంబులకు మోహించి తమకంబులు జనియింప ధైర్యంబులు సాలించి సిగ్గులు వర్జించి పంచశరసంచలిత హృదయలై దైవయోగంబునం బరాయత్తంబులైన చిత్తంబుల నమ్మత్తకాశినులు దత్తరంబున మనోజుం డుత్తలపెట్ట నతండు దమకుఁ బ్రాణవల్లభుం డని వరియించి. 208

ఉ. పాపపురక్కసుండు చెఱపట్టినటంచుఁ దలంతు మెప్పుడుం
బాపఁడె వీనిధర్మమునఁ బద్మదళాక్షునిఁ గంటిమమ్మ ము
న్నీ పురుషోత్తముం గదియ నేమివ్రతంబులు సేసినారమో
యా [3]పరమేష్ఠి పుణ్యుఁడు గదమ్మ హరిన్ మముఁ గూర్చె నిచ్చటన్

క. ఉన్నతి నీతఁడు గాఁగిట | మన్నింపఁగ నింక బ్రతుకు మానినిమనలో
మున్నేమి నోము నోఁచెనొ | సన్నుతమార్గముల విపినజలదుర్గములన్.

క. విన్నారమె యీ చెలువము | గన్నారమె యిట్టి శౌర్యగాంభీర్యంబుల్
మన్నారమింతకాలము | గొన్నారమె యెన్నఁడైనఁ గూరిమి సిక్కన్.

సీ. వనజాక్షి నేఁ గన్నఁ వైజయంతిక నైన
గదిసి వ్రేలుదుఁ గదా కంఠమందు
బింబోష్ఠి నేఁ గన్నఁ బీతాంబరమునైన
మెఱసి యుండుదుఁ గదా మేననిండఁ
గన్నియ నేఁ గన్నఁ గౌస్తుభమణినైన
నొప్పుచూపుదుఁ గదా యురమునందు
బాలిక నేఁ గన్నఁ బాంచజన్యమునైన
మొనసి నొక్కుదుఁ గదా మోవిఁ గ్రోలి

1. సుగుణోదారున్=మంచిగుణములచే గొప్పవాని. 2. మృగీలోచనా...... చోరు = స్త్రీలమనస్సు అను ధనమును దొంగిలించినవాఁడు. 3. పరమేష్ఠి=బ్రహ్మ.

ఆ. [1]పద్మగంధి యేను ♦ [2]బర్హదామమునైనఁ
జిత్రరుచులయందు ♦ శిరమునందు
ననుచుఁ బెక్కుగతుల ♦ నాడిరి కన్యలు
గములు గట్టి గరుడగమనుఁ జూచి. 212

శా. భూనాథోత్తమ కన్యకల్ వరుస నంభోజాతనేత్రుండు న
న్నే నవ్వెం దగఁ జూచె డగ్గఱియె నన్నే చేర్చె వివేకించె స
న్మానించెం గరుణించెఁ జేడిగ నన్నాత్మీయ వర్గంబుతోఁ బెండ్లియా
నేనే చక్రికి దేవి నంచుఁ దమలో నెన్నంగ నై రందఱున్. 213

వ. ఇట్లు బహువిధంబులం దమతమ మన్ననలకు నువ్విళ్లూరు కన్నియలం బదాఱువేల ధవళాంబరాభరణమాల్యానులేపనంబు లొసంగి [3]యందలంబుల నిడి వారలను నరకాసుర భాండాగారంబునం గల నానావిధంబులైన మహాధనంబులను రథంబులను దురంగంబులను ధవళంబులై వేగవంతంబులై యైరావతకుల సంభవంబులైన [4]చతుర్దంతదంతావళంబులను ద్వారకానగరంబునకుం బనిచి దేవేంద్రునిపురంబునకుం జని యదితిదేవిమందిరంబు సొచ్చి యాపెద్దమ్మకు మ్రొక్కి సూపి మణికిరణపటల పరిభావిత భానుమండలంబులైన కుండలంబు లొసంగి శచీసమేతుండైన మహేంద్రునిచేత సత్యభామతోడం బూజితుండై పిదప సత్యభామ కోరిన నందనవనంబు సొచ్చి. 214

మ. హరి కేలం బెకలించి తెచ్చి [5]భుజగేంద్రారాతిపైఁ బెట్టె సుం
దర గంధానుగత భ్రమద్భ్రమర నాదవ్రాతముం బల్లవాం
కుర శాఖా ఫల పర్ణ పుష్ప కలికా ♦ గుచ్ఛాదికోపేతమున్
గిరిభిత్త్రాతముఁ బారిజాతముఁ ద్రిలోకీయాచకాఖ్యాతమున్.

వ ఇట్లు పారిజాతంబును హరించి యదువల్లభుండు [6]వల్లభయుం దానును విహగవల్లభారూఢుం డయి చనుచున్న సమయంబున.

---

1. పద్మగంధి = పద్మమువలె పరిమళముగలది. 2. బర్హదామము = నెమలి పింఛపుదండను. 3. అందలంబు = ప్రక్కలమరుగులేని పల్లకి. 4. చతుర్దంత దంతావళంబులను = నాలుగుదంతములుగల ఏనుఁగులను. 5. భుజగేంద్రారాతిపై = గరుడునిపై. 6. వల్లభయున్ = భార్యయు.

సీ. నరకాసురుని బాధ ✽ నలఁగి గోవిందుని
కడ కేఁగి తత్పాద✽కమలములకుఁ
దన కిరీటము సోఁక ✽ దండప్రణామముల్
గావింప నాచక్రి ✽ కరుణ సేసి
చనుదెంచి భూసుతు ✽ సమయించి తనవారిఁ
దన్ను రక్షించుటఁ ✽ దలఁప మఱచి
యింద్రుండు బృందార✽కేంద్రత్వమదమునఁ
బద్మలోచన పోకు ✽ పారిజాత

ఆ. తరువు విడువు మనుచుఁ ✽ దాఁకె నడ్డము వచ్చి
తరిమి సురలు నట్లు ✽ తాఁకి రకట
యెఱుకవలదె నిర్జ✽రేంద్రత గాల్పనే
సురలతామసమును ✽ జూడ నరిది. 217

వ. ఇట్లు తనకు [1]నొడ్డారించి యడ్డంబు వచ్చిన [2]నిర్జరేంద్రాదుల నిర్జించి తనపురంబునకుం జని నిరంతర [3]సురభికుసుమ మకరంద మాధురీ విశేషంబులకుఁ జొక్కి చిక్కక నాకలోకంబుననుండి వెంట నరుగుదెంచు తుమ్మెదలకు నెమ్మి దలంచుచున్న పారిజాతమ్ము నాశ్రిత పారిజాతుం డయిన హరి మహాప్రేమాభిరామ యగు సత్యభామతోఁ గ్రీడించు మహోద్యానంబున సంస్థాపించి నరకాసురుని యింటం దెచ్చిన రాజకన్యక లెంద ఱందఱకు నన్ని నివాసంబులు గల్పించి [4]గృహోపకరణంబులు సమర్పించి. 218

చ. అమితవిహారుఁ డీశ్వరుఁ డ✽నంతుఁడు దా నొకనాఁడు మంచి ల
గ్నమునఁ బదాఱువేల భవ✽నంబులలోనఁ బదాఱువేల రూ
పముల బదాఱువేల నృప✽బాలలఁ బ్రీతిఁ బదాఱువేల చం
దముల [5]విభూతి నొందుచు య✽థావిధితో వరియించె భూవరా.

ఉ. దానములందు సమ్మద వి✽ధానములం దవలోకభాషణా
హ్వానములందు నొక్కక్రియ ✽ నా లలితాంగుల కన్నిమూర్తులై

1. ఒడ్డారించి = ద్వేషించి. 2. నిర్జరేంద్రాదులన్ = దేవేంద్రుఁడు మొదలగు వారిని 3. సురభికుసుమము = పరిమళముగల పుష్పము. 4. గృహోపకరణంబులు = గృహమున నుండఁదగిన వస్తువులన్నియు. 5. విభూతినొందుచు = ఐశ్వర్యముపొందుచు.

తాననిశంబుఁ గానఁబడి తక్కువ ✽ యెక్కువ లేక యుత్తమ
జ్ఞానగృహస్థధర్మమునఁ ✽ జక్రి రమించెఁ [1]బ్రపూర్ణకాముఁడై.

క. తరుణులు పెక్కండ్రయినను। బురుషుఁడు మనలేఁడు సవతి✽పోరాటములన్
హరి దాఁ బదాఱువేవురు। తరుణులతో సమతమని యె✽ దక్షత్వమునన్.

శా. ఎన్నే భంగుల యోగమార్గముల బ్రహ్మేంద్రాదు లీక్షించుచున్
మున్నే దేవునిఁ జూడఁగానక తుదిన్ ✽ మోహింతు రా మేటి కే
విన్నాణంబుననో సతుల్ గృహిణులై ✽ విఖ్యాతి సేవించి [3]ర
చ్ఛిన్నాలోకన హాస భాషణ రతి ✽ శ్లేషానురాగంబులన్. 222

సీ. ఇంటికి వచ్చిన ✽ నెదు రేగుదెంచుచు
[4]నానీతవస్తువు ✽ లందికొనుచు
సౌవర్ణమణిమయా✽సనములు వెట్టుచుఁ
బదములు గడుగుచు ✽ భక్తితోడ
సంవాసితస్నాన✽జలము లందిచ్చుచు
సద్గంధవస్త్రభూ✽షణములొసఁగి
యిష్టపదార్థంబు ✽ లిడుచుఁ దాంబూలాదు
లొసఁగుచు విసరుచు ✽ నోజ మెఱసి

తే. శిరము దువ్వుచు శయ్యపైఁ ✽ జెలువు మిగుల
నడుగు లొత్తుచు దాసీస✽హస్రయుక్త
లయ్యుఁ గొలిచిరి దాసులై ✽ హరి నుదారుఁ
దారకాధిపవదనలు ✽ దారుఁ దగిలి. 223

శా. నన్నే పాయఁడు రాత్రులన్ దివములన్ ✽ నన్నే కృపం జెందెడిన్
నన్నే [5]దొడ్డుగఁ జూచు వల్లభలలో ✽ నాథుండు నాయింటనే
యున్నాఁ డంచుఁ బదాఱువేలు దమలో ✽ నూహించి సేవించి రా
యన్నుల్ గాఢపతివ్రతాత్వపరిచ✽ర్యాభక్తియోగంబులన్.

---

1 ప్రపూర్ణకాముఁడై = నిండిన కోరికకలవాఁడై. 2 దక్షత్వమునన్ = సమర్థతచే. 3. అచ్ఛిన్న......రాగంబులన్ = ఎడతెగని చూపులచే, నవ్వులచే, సంభాషణలచే, రతులచే, ఆలింగనములచే, అనురాగములచే. 4. ఆనీతవస్తువులు = తీసికొనివచ్చు వస్తువులు. 5. దొడ్డుగ = గొప్పగా.

క. [1]ఆరామలతో నెప్పుడుఁ
[2]పోరాములు చాలనెఱపి పురుషోత్తముఁడున్
గారామునఁ దిరిగెను [3]సౌ
ధారామలతాసరో విహారముల నృపా. 225

క. ఏదేవుఁడు జగముల ను
త్పాదించును మనుచుఁ జెఱుచుఁ బ్రాభవమున మ
ర్యాదా రక్షణమునకై
యాదేవుం డట్లు మెఱసె యాదవులందున్. 226

—♦ శ్రీకృష్ణుఁడు కేళీగృహమునందు రుక్మిణీదేవితో విరసోక్తులాడుట ♦—

వ. అంత నొక్కనాఁడు రుక్మిణీదేవి లోఁగిట మహేంద్రనీలమరకతాది మణిస్తంభ వలభి విటంక పటల దేహళీకవాట విరాజమానంబును శాతకుంభకుడ్యగవాక్ష వేదికా సోపానంబును విలంబమానముక్తాఫలదామవిచిత్రకౌశేయవితానంబును వివిధమణిదీపికావిసరవిభ్రాజమానంబును మధుకరకులకలిత మల్లికాకుసుమ మాలికాభిరామంబును జాలకరంధ్ర వినిర్గత కర్పూరాగరు ధూప ధూమంబును వాతాయన విప్రకీర్ణ శిశిరకర కిరణస్తోమంబును బారిజాతవనామోద పరిమిళిత పవన సుందరంబు నయిన లోపలిమందిరంబున శరచ్చంద్ర చంద్రికాధవళ పర్యంకమధ్యంబున జగదీశ్వరుండయిన హరి సుఖాసీనుండయి యుండ సఖీజనంబులుం దానును డగ్గఱి కొలిచియుండె.

సీ. కుచకుంభముల మీఁది కుంకుమతో రాయు
హారంబు లరుణంబు లగుచు మెఱయ
గరపల్లవము సాఁచి కదలింప నంగుళీ
యక కంకణప్రభ లావరింపఁ
గదలిన బహురత్నకలిత నూపురముల
గంభీరనినదంబుఁ గడలుకొనఁగ

1. ఆరామలతో = ఆస్త్రీలతో. 2. పోరాములు = స్నేహములు. 3. సౌధారామ లతా సరో విహారములన్ = మేడలయందు పూలతోటలయందు లతాగృహములందలి విహారములన్.

గాంచన మణికర్ణి ǂ కా మయూఖంబులు
గండపాలికలపై ǂ గంతు లిడఁగ

తే. గురులు నర్తింపఁ బయ్యెద ǂ కొంగు దూలఁ
[1]బోఁటిచేనున్న చామర ǂ పుచ్చుకొనుచు
జీవితేశ్వరు రుక్మిణి ǂ చేర నరిగి
[2]వేడ్క లిగురొత్త మెల్లన ǂ వీవఁ దొడఁగె. 228

వ. అప్పుడు. 229

మ. పతి యేరూపము దాల్చినం [3]దదనురూ ǂ పం బైన రూపంబుతో
సతి తా నుండెడు నట్టి రూపవతి నా ǂ చంద్రాస్య నాలక్ష్మి నా
సుతనుం రుక్మిణి నా యనన్యమతి నా ǂ సుదాంతరంగం గళా
చతురత్వంబున శౌరియిట్లనియెఁ జం ǂ చన్మందహాసంబుతోన్. 230

మ. బలశౌర్యంబుల భోగమూర్తి కులరూ ǂ పత్యాగసంపద్గుణం
బుల దిక్పాలురకంటెఁ జైద్యముఖరుల్ ǂ పూర్ణుల్ ఘనుల్ వారికిన్
[4]నెలఁతా తల్లియుఁ దండ్రియున్ సహజుఁడున్ ǂ నిన్నిచ్చినం బోక యీ
బలవద్భీరుల వార్ధిలీనుల మముం ǂ బాటింప నీ కేటికిన్. 231

సీ. లోకుల నడవడిఁ ǂ లోనివారము గాము
పరులకు మాజాడ ǂ బయలుపడదు
బలమదోపేతులు ǂ పగగొండ్రు మాతోడ
రాజపీఠము లకు ǂ రాము తెఱచు
శరణంబు మాకు నీ ǂ జలరాశి సతతంబు
[5]నిష్కించనుల మేము ǂ నిధులు లేవు
కలవారు చుట్టాలు ǂ గారు నిష్కించన
జనబంధులము ముక్త ǂ సంగ్రహులము

ఆ. [6]గూఢవర్తనులము ǂ గుణహీనులము భిక్షు
లైనవారిఁ గాని ǂ నాశ్రయింప

1. బోఁటిచేనున్న = చెలికత్తె చేతియందున్న. 2. వేడ్కలిగురొత్త = కోర్కెలుపుట్టునట్లు. 3. తదనురూపంబైన = తగిన వేషముకలదియై. 4. నెలఁతా = స్త్రీ. 5. నిష్కించనులము = తక్కువవారము. 6. గూఢవర్తనులము = రహస్యముగా సంచరించువారము.

మింటను ఖగులు తగుల ✽ నిటువంటి మముబోంటి
వారి నేల దగుల ✽ [1]వారిజాక్షి. 232

క. సిరియును వంశము రూపును । సరియైన వివాహసఖ్య ✽ సంబంధంబుల్
జరుగును సరి గాకున్నను । జరుగవు లోలాక్షి యెట్టి ✽ సంసారులకుల్.

క. తగదని యెఱుఁగవు మమ్ముం
దగిలితివి మృగాక్షి దీనఁ ✽ దప్పగు నీకుం
దగిన మనుజేంద్రు నొక్కని
[2]దగులుము గుణహీనజనులఁ ✽ దగునే తగులన్. 234

సీ. సాల్వ జరాసంధ ✽ చైద్యాది రాజులు
చెలఁగి నన్ వీక్షించి ✽ మలయుచుండ
నది గాక రుక్మి నీ ✽ యన్నయు గర్వించి
వీర్యమదాంధుఁడై ✽ వెలయుచున్న
వారి గర్వంబులు ✽ వారింపఁగాఁ గోరి
చెలువ ని న్నొడిచి తె ✽ చ్చితిమి గాని
[3]కాంతాతనూజార్థ ✽ కాముకులము గాము
కామమోహాదులఁ ✽ గ్రందుకొనము

తే. విను ముదాసీనులము క్రియా ✽ విరహితులము
పూర్ణులము మేము నిత్యాత్మ ✽ బుద్ధితోడ
వెలుగుచుందుము గృహాదిక ✽ విధము మెఱసి
నవలతా తన్వి మాతోడ ✽ నవయవలదు. 235

వ. అని యిట్లు భగవంతుండైన హరి దన్నుఁబాయక సేవించుటం బ్రియురాలను బట్టంపుదేవి నని యెడి రుక్మిణీదర్పంబు నేర్పున నుపసంహరించి యూరకుండిన నమ్మానవతి యప్రియంబులు నపూర్వంబులు నైన మనోవల్లభు మాటలు విని దురంతంబైన చింతాభరంబున సంతాపంబు నొందుచు. 236

సీ. కాటుక నెఱయంగఁ ✽ గన్నీరు వరదలై
కుచకుంభ యుగళ కుం ✽ కుమము దడియ

---

1. వారిజాక్షి = పద్మదళమువంటి నేత్రములుగలది. 2. తగులుము = పట్టుకొనుము. 3. కాంతా...కాము = భార్య, కొడుకులు, ధనములందు కోర్కెలేనివారము.

విడువక వెడలెడు వేఁడినిట్టూర్పుల
[1]లాలితాధరకిసలయము గందఁ
జెలువంబు నెఱి దప్పి చిన్నఁబోవుచు నున్న
వదనారవిందంబు వాడుదోఁప
[2]మారుతాహతిఁ దూలు మహిత కల్పకవల్లి
వడువున మేన్ వడవడ వడంకఁ

తే. జిత్త మెరియంగఁ జెక్కిటఁ జేయి సేర్చి
కౌతుకం బేది పదతలాగ్రమున నేల
వ్రాసి పెంపుచు [3]మోము వంచి వగలఁ
బొందె [4]మవ్వంబు గందిన పువ్వుఁ బోలె. 237

చ. అలికులవేణి తన్నుఁ బ్రియుఁ డాడిన యప్రియభాష లిమ్మెయిన్
సొలవక కర్ణరంధ్రముల సూదులు సొన్పిన రీతిఁ గాఁగ బె
బ్బులిరొద విన్న లేడి క్రియఁ [5]బొల్పఱి చేష్టలు దక్కి నేలపై
వల నఱి వ్రాలెఁ గీ లెడలి వ్రాలిన [6]పుత్తడిబొమ్మకైవడిన్ 238

వ. ఇట్లు వ్రాలిన. 239

మ. ప్రణతామ్నాయుఁడు కృష్ణుఁడంతఁ గదిసెన్ [7]బాష్పావరుద్ధారుణే
క్షణ విస్రస్త వినూత్నభూషణ దురుక్తక్రూర నారాచ శో
షణ నాలింగితధారుణిన్ నిజకులాచారైక సద్ధర్మచా
రిణి విశ్లేషిణి పీతతోషిణి బురంధ్రీగ్రామణిన్ రుక్మిణిన్. 240

సీ. కని సంభ్రమంబునఁ దనువునం దనువుగా
ననువునఁ జందనం బల్ల నలఁది
కన్నీరు పన్నీటఁ గడిగి కర్పూరంపుఁ
బలుకులు చెవుళ్లలోఁ బాఱి నూఁది
కరమొప్ప ముత్యాలసరుల చిక్కెడలించి
యురమునఁ బొందుగా నిరవు కొలిపి
తిలకంబు నునుఫాలఫలకంబుపైఁ దీర్చి
వదలినభూషణావలులు దొడిగి

---

1. లాలిత...యము=అందమైనచిగురుటాకువంటి అధరోష్ఠము. 2. మారుతాహతిన్ = గాలిదెబ్బచే. 3 మోమువంచి = ముఖమువంచి. 4. మవ్వంబు = కోమలత్వము 5. పొల్పఱి = లావణ్యము నశించి 6. పుత్తడిబొమ్మకైవడిన్ = బంగారు బొమ్మవలె. 7. బాష్పావరుద్ధారుణేక్షణన్ = కన్నీటిచేత అడ్డగింపఁబడి ఎఱ్ఱనైన చూపులుగల దానిని.

తే. కమలదళ చారు తాలవృం✽తముల విసరి
పొలుచు పయ్యెదఁ గుచములఁ ✽ బొందుపఱిచి
చిత్తమిగురొత్త నొయ్యన ✽ సేదదేర్చి
బిగియఁ గౌఁగిటఁ జేర్చి నె✽మ్మొగము నిమిరి. 241

తే. నెఱులు గల మఱునీలంపు✽టుఱుల సిరుల
నెఱులు గొనఁ జాలి నెఱులను ✽ మఱలు గొలిపి
యుఱులు గెలిచిన తుమ్మెద✽గములఁ దెగడు
కుఱుల నలికిచ్చి విరులిడి ✽ కొప్పు నెట్టె. 242

క. మురసంహారుఁ [1]డిందిందిరగరుదనిలచలత్ప్రసూన✽కలికాంచితసుం
దరశయ్యఁ జేర్చె భీష్మకవరపుత్త్రిన్ నతిచక్ర✽వారిజనేత్రన్.

— రుక్మిణీదేవి శ్రీకృష్ణలాలితయై యతని స్తుతించుట —

వ. ఇట్లు పానుపునం జేర్చి మృదుమధుర భాషణంబుల ననునయించిన.

క. పురుషోత్తము ముఖకోమల
సరసిజ మయ్యిందువదన ✽ సవ్రీడాహా
సరుచి స్నిగ్ధాపాంగ
స్ఫురదవలోకనము లోలయుఁ ✽ జూచిట్లనియెన్. 245

క. మురహర [2]దివసాగమదళదరవిందదళాక్ష దలఁప ✽ నది యట్టిద లే
నిరవధిక విమలతేజోవరమూర్తివి భక్తలోక✽వత్సల యెందున్.

తే. సంచితజ్ఞాన సుఖబలై✽శ్వర్య శక్తు
లాదిగాఁ గల సుగుణంబు ✽ లమరు నీకు
నేను దగుదునె సర్వలో✽కేశ్వరేశ
లీలమై సచ్చిదానంద✽శాలి వనఘ. 247

సీ. రూఢిమైఁ బ్రకృతి పూ✽రుష కాలములకు నీ
శ్వరుఁడవై భవదీయ ✽ చారుదివ్య
లలితకళాకౌశ✽లమున నభిరతుఁడై
కడఁగు నీరూప మె✽క్కడ మహాత్మ

1. ఇందిం...శయ్య = తుమ్మెదఱెక్కల గాలిచే కదలుచున్న పుష్పములతో మొగ్గలతో ఒప్పిన అందమైన పాన్పు. 2. దివసాగమ.....దళాక్ష=సూర్యోదయ సమయమున వికసించుచున్న పద్మమువంటి నేత్రములు కలవాఁడు.

[1]సత్త్వాదిగుణ సముచ్చయయుక్త మాహాత్మ్య
నయిన నే నెక్కడ [2]ననఘచరిత
కోరి నీ మంగళ గుణభూతి గానంబు
సేయంగఁబడునని చెందు భీతి

తే. నంబునిధి మధ్యభాగమం దమృత ఫేన
పటల పాండురనిభమూర్తి పన్నగేంద్ర
భోగశయ్యను బవ్వళించుచును దనరు
నట్టి యున్నతలీల దివ్యంబు దఁగఁ. 248

వ. శబ్దస్పర్శరూప రసగంధంబులనియెడు గుణంబులచేతఁ బరిగ్రహింపఁ బడిన మంగళ సుందర విగ్రహుండవై యజ్ఞానాంధకారనివారకంబైన రూపంబుఁ గైకొని భవదీయులయిన సేవకులకు ననుభావ్యుండ వైతి భవత్పాదారవింద మకరంద రసాస్వాదలోలాత్ములైన యోగీంద్రులకైనను [3]భవన్మార్గంబు స్ఫుటంబుగా దట్లగుటం జేసి యీ మనుజపశువులకు దుర్విభావ్యం బగుట యేమి చెప్ప నిట్టి యీశ్వరుండ వైన నీకు నిచ్ఛ స్వాతంత్రంబు గావున నదియును నా కధీనంబు గావున నిన్ను నే ననుసరింతు, దేవా నీ [4]వకించనుండవై తేని బలిభోక్తలయిన బ్రహ్మేంద్రాదు లెవ్వనికొఱకు బలి సమర్పణంబు చేసిరి నీవు సమస్త పురుషార్థమయుండ వనియును ఫలస్వరూపి వనియును నీ యందలి ప్రేమాతిశయంబులం జేసి విజ్ఞాన దీపాంకురంబున [5]నిరస్తసమస్తదోషాంధకారులై యిహసౌఖ్యంబులు విడిచి [6]సుమతులు భవదీయదాససంగంబు గోరుచుందు రట్లు సేయనేరక నిజాధికారాంధకారమగ్నులైన వారు భవత్తత్త్వంబుఁ దెలిసి బలిప్రక్షేపణంబులు సేయం జాలక మూఢులై సంసార చక్రంబునం బరిభ్రమింతు రదియునుం గాక. 249

ఆ. వరమునీంద్రయోగివర సురకోటిచే
వర్ణితప్రభావ వైభవంబు

1. సత్త్వాదిగుణసముచ్చయయుక్తమాహాత్మ్యను = సత్త్వరజస్తమోగుణములుగల మాహాత్మ్యముగలవాఁడను. 2 అనఘచరిత = పాపములులేని చరిత్రకలవాఁడా! 3. భవన్మార్గంబు = నీవిధము (చరిత్ర). 4. అకించనుండవై తేని = ఏవియులేనివాఁడవైనచో. 5. నిరస్తసమస్తదోషాంధకారులై = చీకట్లనెడి సకలదోషములను పోఁగొట్టుకొన్నవారై. 6. సుమతులు = బుద్ధిమంతులు.

గలిగి యఖిలచేతనులకు విజ్ఞాన ప్ర
దుండ వగుదు వభవ ! దురితదూర. 250

వ. దేవా [1]భవదీయ కుటిల భ్రూవిక్షేపోదీరిత కాలవేగంబుచేత విధ్వస్తమంగళు లగు కమలభవ భవ పాకశాసనాదులం దిరస్కరించినట్టి మదీయచిత్తంబున. 251

చ. నిను వరియించినం జెలుచ ! నీరజలోచన శార్ఙ్గ సాయకా
సన నినదంబులన్ సకల ! శత్రు ధరాపతులన్ జయించి భో
రనం బశుకోటిం దోలు మృగ ! రాజు నిజాంశము భూరిశక్తిం గై
కొనిన విధంబునన్ నను న ! సుంరితశూరతం దెచ్చి తీశ్వరా. 252

ఉ. అట్టి [2]నృపాలకీటముల నాజి నెదుర్పఁగ లేనివాని య
ట్లొట్టినభీతినై నిటు ప ! రామోధిశరణ్యుఁడనైతి వింతయున్
నెట్టన మాయగాక యివి ! నిక్కములే భవదీయభక్తులై
నట్టి నరేంద్రమౌళిమణు ! లంచిత రాజఋషుల్ ముదంబునన్.

ఆ. వితతరాజ్యగరిమ ! విడిచి కాననముల
నాత్మలందు మీ ప ! దాబ్జయుగము
వలఁతిఁ గాఁగ నిలిపి ! వాతాంబు పర్ణాశ
నోగ్రనియతు లగుచు ! నుందు రభవ. 254

మ. విమలజ్ఞాన నిరూఢులైన జనముల్ ! వీక్షింప మీపాదకం
జ మరందస్ఫుట దివ్యసౌరభము నా ! స్వాదించి నిర్వాణ రూ
పము సత్పూరుషవాగుదీరితము శో ! భా శ్రీనివాసంబు నౌ
మిము సేవింపక మానవాధముని దు ! ర్మేధాత్ము సేవింతురే.

వ. మఱియును దేవా భూలోకమునందును, నిత్య నివాసంబునందును, సకల ప్రదేశంబులందును జగదీశ్వరుండ వయిన నిను నభిమతంబు లయిన కామరూపంబులు గైకొని వరియింతురు, భవదీయ చరణారవింద మకరందాస్వాదన చాతుర్య ధుర్యభృంగిమైన కామిని యతిహేయంబైన త్వక్ శ్మశ్రు రోమ నఖ కేశంబులచేతఁ గప్పంబడి యంతర్గతంబయిన మాంసాస్థి రక్త క్రిమి విట్కఫ పిత్తవాతంబులు గల జీవచ్ఛవంబయిన నరాధముని మూఢాత్మయై కామించునే యదియుఁగాక. 256

1. భవదీయకుటిల భ్రూవిక్షేపోదీరిత = నీసంబంధమైన కనుబొమలయొక్క చలనముచేత ప్రోత్సహించఁబడిన. 2. నృపాలకీటములు = నింద్యులైన రాజులు

సీ. నీరదాగమ మేఘ ƒ నిర్యత్పయః పాన
 చాతకం బేగునే ƒ [1]చౌటిపడెనుఁ
పరిపక్వ మాకంద ƒ ఫల రసంబులు గ్రోలు
 కీరంబు చనునె [2]దు ƒ త్తూరములకు
ఘనరవాకర్ణనో ƒ త్కలిక మయూరము
 గోరునే కఠిన [3]ఝి ƒ ల్లీరవంబుఁ
కరికుంభ పిశితస ƒ ద్గ్రాస మోదిత సింహ
 మరుగునే శశక మాం ƒ సాభిలాషఁ

తే. ప్రవిమలాకార భవదీయ ƒ పాదపద్మ
యుగ సమాశ్రయ నైపుణో ƒ ద్యోగచిత్త
మన్యుఁ జేరునె తన [4]కుపా ƒ స్యంబు గాఁగ
భక్తమందార దుర్భవ ƒ భయవిదూర. 257

క. [5]వాసవవందిత భవకమలాసన దివ్యప్రభా స ƒ భావలి చెప్పుదురన్
నీ సమధిక చారిత్రకథాసురుచిరగాన [6]మవిత ƒ థం బయి చెల్లున్.

క. ధరణీనాథులు తమతమ| వరవనితామందిరముల ƒ వసియించుచు గో
ఖరమార్జాలంబులగతి| స్థిరబద్ధు లగుదురు నిన్నుఁ ƒ దెలియనికతనన్

ఆ. జలజనాభ సకల ƒ జంతురాత్మవై
నట్టి దేవ నీ ప ƒ దారవింద
యుగళి సానురాగ ƒ యుక్తమై నా మది
గలుగునట్లు గాఁగఁ ƒ దలఁపు మనఘ ! 260

ఆ. పృథురజోగుణ ప్ర ƒ వృద్ధమైనట్టి నీ
దృష్టిచేత నన్నుఁ ƒ దేఱుకొనఁగఁ
జూచు టెల్లఁ బద్మ ƒ లోచన నామీఁది
ఘనదయార్ద్రదృష్టి ƒ గాఁ దలంతు. 261

వ. అదియునుం గాక మధుసూదనా నీవాక్యంబులు [7]మిథ్యలుగావు,

1. చౌటిపడియు = నీరులేని ప్రదేశమునకు. 2. దుత్తూరములకు = ఉమ్మెత్త పూలకు. 3. ఝిల్లీరవంబు = ఈలపురుగుధ్వని. 4. ఉపాస్యంబు = సేవింపఁదగినది. 5. వాసవవందిత = ఇంద్రునిచే నమస్కరింపఁబడువాఁడా! 6. అవితథంబు = సత్యమైనది. 7. మిథ్యలుగావు = అబద్ధములుగావు.

తల్లి వచనంబుకూఁతున కభిమతంబుగాదె యౌవనారూఢమదంబున [1]స్వైరిణి యగు కామిని పురుషాంతరాసక్తయగుట విచారించి బరిజ్ఞానిమైనవాఁడు విడుచు నవివేకి యయిన పురుషుం డింద్రియలోలుండై రతిందగిలి దాని విడువనేరక పరిగ్రహించియుభయలోకచ్యుతుండగు నట్లుగావున నీయెఱుంగని యర్థంబు గలదే యని విన్నవించినరుక్మిణీదేవి వచనంబులకుఁగృష్ణుండు సంతసిల్లియిట్లనియె

—♦ శ్రీకృష్ణుండు రుక్మిణీదేవి నూఱడించుట. ♦—

చ. [2]అలికులవేణి నవ్వులకు ✽ నాడినమాటల కింత నీమదిం
గలఁగఁగనేల వేఁటలనుఁ ✽ గయ్యములన్ రతులందు నొవ్వఁగాఁ
బలికినమాట లెగ్గు లని ✽ పట్టుదురే భవదీయచిత్తముం
దెలియఁగఁ గోరి యేఁ బలికితిన్ ✽ మదిలో నిటు గుంద నేటికిన్.

వ. అదియునుం గాక. 264

ఉ. [3]కింకలు ముద్దుఁబల్కులును ✽ గెంపుఁగనుంగవ తియ్యమోవియున్
జంకెలు తేఱిచూపు లెక ✽ సక్కెములున్ నెలవంకబొమ్మలుం
గొంకక వీడ నాడుటలుఁ ✽ గూరిమియుం గల కాంతఁ గూడుటల్
[4]అంకిలిలేక జన్మఫల ✽ మబ్బుటగాదె [5]కురంగలోచనా. 265

వ. అని మఱియు నిట్లనియె.

ఉ. నీవు పతివ్రతామణివి ✽ నిర్మలధర్మవివేకశీల స
ద్భావవు నీమనోగతులఁ ✽ బాయక యెప్పుడు [6]నస్మదీయ సం
సేవయ కాని యన్యము ✽ భజింపవు పుట్టిననాఁటనుండి నీ
భావ మెఱింగియుండియును ✽ బల్కినతప్పు సహింపు మానినీ.

వ. అని వెండియు నిట్లనియె నీవాక్యంబులు శ్రవణసుఖంబులు గావించె, నీవు వివిధంబులైన కామంబులు గోరితివేని నివి యన్నియును నాయంద యుండుటఁ జేసి యేకాంతసేవాచతురవైన నీకు నవి యన్నియు నిత్యంబులై యుండు, నీ పాతివ్రత్యంబును నా యందలి స్నేహంబు నతివిశదంబు లయ్యె నా వాక్యంబులచేత భవదీయ

---

1. స్వైరిణి = స్వేచ్ఛగాతిరుగునది. 2. అలికులవేణి = తుమ్మెదలవంటి జడ గలది. 3. కింకలు = స్వల్పకోపములు. 4. అంకిలి = విఘ్నము. 5. కురంగలోచన = లేఁడిచూపులవంటి చూపులుగలది. 6. అస్మదీయ సంసేవయ=నాసంబంధమైన సేవయే.

చిత్తంబు చంచలంబుగాక నాయందులబుద్ధి దృఢం బగుంగావున సకలసంపద్విలసితంబైన ద్వారకానగర దివ్యమందిరంబులందు నీవు భాగ్యంబునం జేసి సంప్రాప్తవై వడి నీయందు బద్ధానురాగుండనై వర్తింతుఁ దక్కిన ప్రాణేంద్రియ పరవశత్వంబున వికృతశరీరధారిణి వైన సతి నన్నుం జెందుటదుష్కరం బదియునుం గాక [1]మోక్షప్రదుండ నైన నన్నుఁ గామాతురలైన [2]యల్పమతులు వ్రతతపోమహిమలచేత దాంపత్యభోగంబుకై సేవింతు రది యంతయు నా మాయావిజృంభితంబు దానంజేసి వారు మందభాగ్యులై [3]నిరయంబు నొందుదు రట్లుగావున నీసమానమైన కాంత యేకాంతలందైనఁగలదె నీ వివాహకాలంబున నేకరాజన్యవర్యులఁ గైకొనక భవదీయమధురాలాపశ్రవణాత్మకుండ నయిన నా సన్నిధికి నీశరీరం బితరయోగ్యంబు కాదు నీకు శేషంబనయి యున్నదాన నని యేకాంతంబునం బ్రాహ్మణుం బుత్తెంచిన నేనును జనుదెంచి నీ పరిణయవిషయంబున భవత్సహోదరుం బట్టి [4]విరూపుం గావించిన నదిగనుంగొనియు నాయందుల విప్రయోగభయంబున నూరకుండితి వది గావున బహుప్రకారంబులై వర్తించు నీసద్గుణంబులకు సంతసింతు నని యివ్విధంబున దేవకీసుతుండు నరలోకవిడంబనంబుగ గృహస్థునిభంగి నిజగృహకృత్యంబు లాచరించుచుండెనని శుకుండు మఱియు నిట్లనియె. 268

క. అని యిట్లు కృష్ణుఁ డాడిన
వినయవివేకానులాప వితతామృతసే
చనముదితహృదయయై య
వ్వనితామణి వికచవదన వనరుహ యగుచున్. 269

క. [5]నగ వామతించు చూపులు
నగధరు మొగమునను నిలిపి నయమునఁ గరముల్
మొగిచి వినుతించెఁ గృష్ణున్
ఖగవాహున్ రుచిరదేహుఁ గలితోత్సాహున్. 270

1. మోక్షప్రదుండను = మోక్షము నిచ్చువాఁడను. 2. అల్పమతులు = స్వల్ప బుద్ధులు కలవారు. 3. నిరయంబు = దుర్గతి, నరకము. 4. విరూపుంగావించిన = వికృతాకారునిచేసిన. 5. నగ......చూపులు = నవ్వును పిలుచుచున్న చూపులు.

చ. అతులవిరాజమానసుఖులై వివిధాంబర చారుభూషణ
¹ప్రతతులతోడఁ గోరిన వరంబులు దద్దయు నిచ్చెఁ గృష్ణుఁడు
న్నతశుభమూర్తి దేవగణవందితకీర్తి దమూనవర్తియై
యతిమృదువాణికిం గిసలయారుణపాణికి నీలవేణికిన్. 271

వ. ఇట్లు సన్మానించి కృష్ణుండు రుక్మిణియుం దానును దదనంతరంబ.

చ. ఎలమి ఘటింపఁగాఁ గలసి యీడెలనీడల మల్లికాలతా
వల్లిఁ గరవీరజాతి విరిదాదుల వీథులఁ గమ్మదెమ్మెరల్
పొలయు నవీనవాసముల బొన్నలఁ దిన్నెలఁ బచ్చరచ్చలం
గొలఁకుల ²లేఁగెలంకులను గోరిక లీరికలొత్తఁ గ్రొత్తలై. 273

క. ³ఆరామభూములందు విహారామలసౌఖ్యలీల నతిమోదముతో
నారామానుజుఁడుండెను నారామామణియుఁ దానునభిరామముగన్.

వ. మఱియు ననేకవిధ విచిత్ర మణివితానాభిశోభిత ప్రాసాదోపరిభాగంబులను లాలిత నీలకంఠ కలకంఠ కలవింక శుక కలాలాప కలిత మకరందపానమదవ దిందిందిర ఝుంకార సంకుల కమల కల్హార సుధాసార ⁴నీహారపూరిత కాసారతీరంబులను ధాతునిర్ఝర రంజిత సానుదేశగిరికుంజపుంజంబులను గృతకశైలంబులను గ్రీడాగృహంబులనుం జెలంగి నందనందనుండు విదర్భరాజనందనం దగిలి కందర్ప కేళీలోలాత్ముండయ్యె ననంతరం బాసుందరీలలామంబువలనఁ బ్రద్యుమ్నుండు చారుదేష్ణుండు సుదేష్ణుండు సుచారువు చారుదేహుండు చారుగుప్తుండు భద్రచారువు చారుచంద్రుండు విచారువు చారువు ననియెడు పదుగురు తనయులం బడసె నట్లు సత్యభామాజాంబవతీ నాగ్నజితీ కాళిందీ మాద్రి మిత్రవిందా భద్రలకు వేఱు వేఱ పదుగురేసి భద్రమూర్తులైన కుమారు లుదయించి రివ్విధంబున మఱియును. 275

చ. అనఘ పదాఱువేల సతులందు జనించిరి వేఱువేఱ ⁵నం
దనదశకంబు లత్సుత ప్రతానను గాంచి రనేక సూనుల

1. ప్రతతులతోడ = సమూహముల తోడ. 2. లేఁగెలంకులను = చిన్న చెరువులయందు. 3. ఆరామభూములందు = ఉద్యానవనములందు. 4. నీహారపూరిత = మంచుచే నిండిన. 5. నందనదశకంబు = పదిమంది కుమారులు.

న్నినయఁగ నిట్లు పిల్లచెఱ ♦ కీనిన కైవడిఁ బుత్త్రిపౌత్త్రివ
ర్ధనమున నొప్పెఁ గృష్ణుఁడు ము♦దంబునఁ దామరతంపరై భువిన్.

తే. అట్లు యాదవ వృష్ణి భో♦జాంధకాది
నామధేయాంతరముల నె♦న్నంగ నూట
యొక్కఁడై చాల వర్ధిల్లు ♦ నక్కులంబు
నృపకుమారులఁ జదివించు ♦ నేర్పు గలుగు. 277

తే. గురుజనంబులు విను మూఁడు ♦ కోట్లమీఁద
నెనుబదెనిమిదివేల పై ♦ నెసఁగ నూర్వు
రన్నుఁ దద్బాలకావలి ♦ నెన్నఁదరమె
శూలికైనను [1]దామ♦రమాలికైన. 278

వ. అందు గోవిందనందనుండైన ప్రద్యుమ్నునకు రుక్మికూఁతువలన ననిరుద్ధుండు సంభవించె ననిన మునివరునకు భూవరుం డిట్లనియె

క. బవరమునఁ గృష్ణుచే ము
న్నవమానము నొంది రుక్మి ♦ యచ్యుతు గెలువం
దివురుచుఁ దనసుత నరిసం
భవునకు నెట్లిచ్చె నెఱుఁగఁ ♦ బలుకు మునీంద్రా. 280

సీ. నావుడు శుకయోగి ♦ నరనాయకోత్తమ
నీవు చెప్పినయట్ల ♦ నెమ్మనమునఁ
బద్మాయతాక్షుచే ♦ బడిన [2]బన్నమునకుఁ
గనలుచు నుండియు ♦ ననుజతోడి
నెయ్యంబునను [3]భాగి♦నేయున కిచ్చెను
గూఁతు నంచిత పుష్ప ♦ కోమలాంగిఁ
దనపూన్కి దప్పినఁ ♦ దగ విదర్భేశుండు
విను మెఱిఁగింతుఁ ద♦ద్విధము దెలియఁ

తే. బరఁగ రుక్మవతీస్వయం♦వరమున కొగి
నరుగుదెండని భీష్మ భూ♦వరసుతుండు

---

1. తామరమాలికైన = బ్రహ్మకైన. 2. బన్నమునకు = అవమానమునకు.
3. భాగినేయునకు = తోఁబుట్టుకుమారునకు.

వగున రప్పించె రాజన్యవరకుమార
వరుల నను వార్త కలది యా హరిసుతుండు. 281

చ. వరమణిభూషణ ప్రభల వర్గమునన్ శుభభంగిఁ బర్వఁ బ్ర
స్ఫురిత రథాధిరోహణ విభూతి దలిర్ప మహోహరైక సు
స్థిరశుభలీల నేగె యదుసింహకిశోరము రాజకన్యకా
పరిణయవైభవాగత నృపాలకకోటికి రుక్మిపీటికిన్. 282

చ. చని పురిఁ జొచ్చి వృష్ణికులసత్తముఁ డచ్చట మూఁగియున్న య
మ్మనుజవరేణ్యనందనులు మానముదూలి భయాకులాత్ములై
చనఁగ ననేకచండతరసాయకసంపదఁ జూపి రుక్మినం
దనఁ గొనివచ్చి వేడ్క నిజధామము సొచ్చె నవార్యశౌర్యుఁడై.

వ. ఇట్లు తెచ్చి ప్రద్యుమ్నుండు హరిణనయనం బరిణయంబయిన
యనంతరంబ, 284

క. ధీరుఁడు కృతవర్మని సుకు
మారుఁడు వరియించె రుచిరమండనయుత నం
భోరుహముఖి రుక్మిసుతం
జారుమతీకన్యఁ బ్రకటసజ్జనమాన్యన్. 285

తే. ప్రకటచరితుండు భీష్మ భూపాలసుతుఁడు
మనము మోదింపఁ[1] దనకూర్మి మనుమరాలి
రుక్మలోచన నసమానరుక్మకాంతిఁ
జెలిమి ననిరుద్ధునకుఁ బెండ్లి సేయునపుడు. 286

క. పొలుపుగ రత్నవిభూషోజ్జ్వలులై శుభవేళ నవ్వివాహార్థము ని
ర్మల బహువైభవ శోభనకలిత విదర్భావనీశ కటకంబునకున్.

చ. హరియును రుక్మిణీపతియు నా బలభద్రుఁడు శంబరారియు
న్నరిమదభేది సాంబుఁడును నాదిగ రాజకుమారకోటి సిం
ధురరథవాజి సద్భటులతోఁ జని యందు సమగ్రవైభవా
చరితవివాహయుక్త దివసంబులు వేడుకఁబుచ్చి యంతటన్.

1. మోదింప = సంతసింపఁగా. 2. కటకంబునకు = రాజధానికి.

క. ఒకనాఁడు యదుకుమారకు | లకలంకసమగ్రవైభ✽వాటోపమహో
త్సుకులై యుండఁగఁ జూపో|పక యొకసక్కెమున నవని✽పాలురు వరుసన్.

ఉ. ఎచ్చరికం గళింగధర✽ణీశుఁడు రుక్మి మొగంబు చూచి నీ
[1]యొచ్చెము దీర్చుకో నిదియ ✽ యొప్పగువేళ బలుండు జూదమం
దిచ్చగలండుగాని పొల✽పెక్కిన నేర్పరిగాఁడు గాన నీ
కిచ్చు నవశ్యమున్ జయము ✽ నీఁగుము తొల్లిటఁబడ్డ బన్నమున్. 290

క. అని పురికొల్పిన రుక్మియుఁ
దనచేటు తలంపలేక ✽ తాలాంకునితో
డను జూదమాడఁ [3]దివిరెను
వనజాసనుకృతము గడచు✽వా రెవ్వరిలన్. 291

వ. అంత.

క. కోరి విదర్భుఁడు కుటిల విహారుండై పిలిచె జూద✽మాడ జితారిన్
హారిన్ సన్నుతసూరిన్ ✽ సీరిన్ [4]రైవతసుతార్ద్ర✽చిత్తవిహారిన్. 293

ఆ. పూని మనము గొంత ✽ ప్రొద్దువోకకు రామ
[5]నెత్తమాడ నీవు నేర్తు వనఁగ
వింద మిపుడు కొంత ✽ వెలయొడ్డి యాడుద
మనిన బలుఁడు లెస్స ✽ యని చెలంగి. 294

క. మదిలోనిచలము డింపక | పదియిరువదినూఱువేయి ✽ పదివేలిదె ప
న్నిదమఁయొడ్డుచునాడిరి| మదమున నిద్దఱు నుదురభి✽మానము పేర్మిన్

ఉ. ఆడినయాటలెల్లను హ✽లాయుధుఁ డోడుచు రుక్మి గెల్చె నం
దోడి నృపాలకోటి పరి✽తోషముఁ జెందఁ గళింగభూవిభుం
డోడె బలుండటంచుఁ బ్రహ✽సోక్తుల నెంతయు రాముఁ జుల్కఁగా
నాడెను దంతపంక్తి వెలి✽యై కనుపట్టఁగఁ జాల నవ్వుచున్. 296

తే. బలుఁడు గోపించి యొకలక్ష ✽ పణము సేసి
యాడి ప్రకటంబుగా జూద ✽ మపుడు గెల్చె

1. ఒచ్చెము = అవమానము. 2. ఈగుము = పోగొట్టుకొనుము. 3. తివిరెను = కోరెను. 4. రైవతసుతార్ద్రచిత్తవిహారిన్ = రేవతీదేవికిభర్తయగువాని. 5. నెత్తమాడ = జూదమాడ.

గెల్చినను రుక్మి యిది యేను గెల్చియుండ
గెలుపు నీ దని [1]కికురింప నలవి యగునె. 297

క. అనవుడు హలధరుఁ డచ్చటి జనపాలకసుతులఁ జూచి సత్యము పలుకుం
డని యడిగిన వారలు రుక్మినిహితులై పలుకరైరి మొగమోటమునన్.

ఉ. అప్పటి యట్ల యొడ్డి [2]ముసలాయుధుఁ డేపున నాడి జూదముం
జొప్పడ గెల్చె యీగెలుపు చూడఁగ నాదియొ వానిదో జనుల్
తప్పక చెప్పుఁడన్న విదితధ్వనితో నశరీరవాణి తా
నిప్పటిమాట రాముఁడె జయించె విదర్భుఁడె యోడె నావుడున్.

వ. విని సకలజనంబులు నద్భుతానందనిమగ్నమానసులైరి. కుటిలస్వభావులయిన భూవరులు రుక్మిం గైకొల్పిన నతఁడు తనతొల్లింటిపరాభవంబుఁ దలంచి యెదిరిం దన్ను నెఱుంగక బలాబలవివేకంబు సేయ నేరక విధివశానుగతుండై చలంబున బలునిం గని యిప్పటి మాటయు నేన గెల్చియుండ వృథా [3]జల్పకల్పనుండవయి నీవు గెల్చితినని పలికెద [4]వక్షవిద్యానైపుణిం గల భూపకుమారులతోఁ బసులకాపరులెత్తువత్తురే యని క్రొవ్వున నవ్వుచుం బలికిన నప్పలుకులు చెవులకు ములుకుల క్రియఁ దాఁకిన కోపోద్దీపితమానసుండై పెటపెటఁ బండ్లు గొఱుకుచుం గన్నుల నిప్పు లుప్పతిల్లఁ గినుకం దోఁక ద్రొక్కిన [5]మహోరగంబు నోజ రోఁజుచు దండతాడితం బయిన [6]పుండరీకంబులీల హుమ్మని మ్రోయుచుఁ బ్రచండ బాహుదండంబుఁ జాచి పరిఘం బందుకొని పరిపంథియైన రుక్మిని నతని కనుకూలం బయిన రాజలోకంబునుం బడలుపడ నడిచె నయ్యవసరంబున. 300

క. మును దంతపంక్తి వెలిగాఁ
దను నవ్విన యక్కళింగుఁ దలవట్టి రయం
బున వడఁ దిగిచి వదన మే
పునఁ బెడచేఁ బ్రేసి దంతములు వెస డులిచెన్. 301

1. కికురింప=మోసగింప. 2. ముసలాయుధుఁడు=బలరాముఁడు. 3. జల్పకల్పనుండవయి = పొసఁగని మాటలు కల్పించువాఁడవై. 4. అక్షవిద్య = పాచికలాడుట. 5. మహోరగంబు=గొప్పసర్పము 6. పుండరీకంబులీల = పెద్దపులివలె.

క. అంతంబోవక రుక్మిని
దంతంబులు మున్ను డులిచి ‡ తను వగలింప
న్నంతకుపురి కేఁగెను వాఁ
డెంతయు భయమంది రాజు ‡ లెల్లం గలఁగన్. 302

వ. అట్లు సేసి యయ్యాదవసింహం బసహ్యావిక్రమంబునం జెలంగెనంత.

క. భూవర పద్మాక్షుఁడు దన
బావ హతుం డగుట గనియుఁ ‡ బలుకక యుండెన్
భావమున రుక్మిణీబల
దేవుల కేమనఁగ నగ్గు‡దేఱునొ యనుచున్. 304

వ. అంత నా విదర్భానగరంబు నిర్గమించి. 305

క. పరమానురాగరస సం
భరితాంతఃకరణు లగుచుఁ ‡ బాటించి వధూ
వరులను రథమం దిడి హల
ధర హరి రుక్మిణులఁ గొల్చి ‡ తగ యదువీరుల్. 306

ఉ. మంగళతూర్యఘోషము లమందగతిం జెలఁగంగ మత్త మా
తంగ తురంగ సద్భటక‡దంబముతోఁ జని కాంచి రంగనా
రంగ లవంగ లుంగ విచ‡రన్మదభృంగ సురంగనాద సం
సంగతరంగిణీకలిత ‡ సంతత నిర్మల నా కుశస్థలిన్. 307

వ. ఇట్లు పురోపవనోపకంఠంబునకుం జని.

క. అందు వసించిరి నందిత చందనమందార[1]మాకంద ‡ చంద్ర లసన్మా
కందములనీడ హృద్యానందము సంధింప నంద‡నందనముఖ్యుల్.

వ. తదనంతరంబ పురప్రవేశంబు సేసి రని చెప్పి శుకయోగీంద్రుండు
పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 310

—♦ బాణాసురుం డీశ్వరప్రసాదంబు నొందుట ♦—

తే. అనఘ బలినందనులు నూర్వు ‡ రందులోన
[2]నగ్రజాతుండు బాణుఁ డ‡త్యుగ్రమూర్తి

1. మాకందము=తియ్యమామిడి. 2. అగ్రజాతుండు=మొదటపుట్టినవాఁడు.

చిరయశోహారి విహిత పూజితపురారి
యహిత తిమిరోష్ణకరుఁడు [1]సహస్రకరుఁడు. 311

క. బాణుఁడు విక్రమ జిత గీ
ర్వాణుఁడు సని కాంచె భక్తివశుఁడై సగణ
స్థాణున్ నిర్గళితాసమ
బాణున్ [2]దాండవ ధురీణు భక్తత్రాణున్. 312

క. కని ముకుళాగవికాసము
దనమనమునఁ గడలుకొనఁగ ధరఁ [3]జాఁగిలి వం
దన మాచరించి మోదము
దనరఁగఁ దాండవము సలుప్రకటి [4]నయ్యభవున్. 313

ఉ. సంచితభూరిబాహుబలసంపద పెంపున నారజంబు వా
యించి యనేకభంగుల నమేయుఁ ద్రిలోకశరణ్యునాత్మ మె
చ్చించి ప్రమోదియై నిజవశీకృత నిశ్చలితాంతరంగుఁ గాఁ
వించి తదాననాంబురుహవీక్షణుఁడై తగ మ్రొక్కి యిట్లనున్.

ఉ. శంకర భక్తమానస వశంకర దుష్టమదాసురేంద్ర నా
శంకర పాండునీలరుచి సంకరవర్ణ నిజాంగభోగిరా
ట్కంకణ పార్వతీహృదయకైరవకైరవమిత్ర యోగిహృ
త్పంకజ పంకజాప్త జయతాండవఖేలన భక్తపాలనా. 315

వ. అని వినుతించి.

ఉ. దేవ మదీయవాంఛితము తేటపడ న్నిటు విన్నవించెదన్
నీవును [5]నద్రినందనయు నెమ్మిని నాపురికోటవాకిటం
గావలియుండి నన్నుఁ గృప గావుము భక్తఫలప్రదాత యో
[6]భావభవారి నీచరణపద్మము లెప్పుడు నాశ్రయించెదన్.

వ. అని యభ్యర్థించినం బ్రసన్నుఁడై భక్తవత్సలుం డగు [7]పురాంత
కుండు గౌరీసమేతుండయి తారకాంతకాది భూతగణంబులతోడ

---

1. సహస్రకరుఁడు = వేయిచేతులుగలవాఁడు. 2. తాండవధురీణున్ = నాట్యము చేయుటలో గొప్పవాని. 3. చాఁగిలివందనము = సాష్టాంగ నమస్కారము. 4. అభవున్ = శివుని. 5. అద్రినందనయు = పార్వతియు, 6. భావభవారి = మనసునందుఁబుట్టిన మన్మథునకు విరోధి. 7. పురాంతకుండు = ఈశ్వరుఁడు.

బాణనివాసంబగు శోణపురంబు వాకిటఁగాఁపుండె బదఁపడి యొక్క
నాఁ డబ్బలినందనుండు.

తే. దర్పమునఁ బొంగి రుచిర సూ✽ర్యాంశుదీప్త
మండలముతోడ [1]మార్పడు ✽ మహితశోణ
మణికిరీటము త్రిపుర సం✽హారుని[2]పాద
వనజములు సోఁక మ్రొక్కి యి✽ట్లని నుతించె. 319

సీ. దేవ జగన్నాథ ✽ దేవేంద్రవందిత
వితతచారిత్ర సం✽గీతపవిత్ర
హాలాహలాహార ✽ [3]యహిరాజ కేయూర
బాలేందుభూష స✽ద్భక్తపోష
సర్వలోకాతీత ✽ సద్గుణసంఘాత
పార్వతీహృదయేశ ✽ [4] భవవినాశ
రజతాచలస్థాన ✽ గజచర్మ పరిధాన
సురవైరివిధ్వస్త ✽ శూలహస్త
తే. లోకనాయక సద్భక్త✽లోకవరద
సురుచిరాకార మునిజన✽స్తుతవిహార
భక్తజనమందిరాంగణ✽పారిజాత
నిన్ను నెవ్వఁడు నుతిసేయ ✽ నేర్చు నభవ. 320

వ. అని స్తుతియించి.

మ. అనిలో నన్ను నెదిర్చి బాహుబల శౌ✽ర్యస్ఫూర్తిఁ బోరాడఁ జా
లిన వీరుం డొకఁడైనఁ బందెమునకుం ✽ లేఁడయ్యె భూమండలి
[5]న్ననయంబున్ భవదీయదత్తకరసా✽హస్రంబు [6]కండూతి వా
యు నుపాయంబును లేద యీ భరము నె✽ట్లోర్తున్నుమానాయకా.

సీ. హుంకార కంకణ ✽ క్రేంకారశింజినీ
టంకార నిర్ఘోష ✽ సంకులంబు

---

1. మార్పడు = వేఱురూపమగు. 2. పాదవనజములు = పాదపద్మములు. 3. అహిరాజకేయూర = సర్పరాజు కంకణముగాఁగలవాఁడు. 4. భవవినాశ = సంసారకష్టమును పోఁగొట్టువాఁడు. 5. అనయంబున్ = ఎల్లపుడు. 6. కండూతి = తీఁట.

చండదోర్దండ భాస్వన్మండలాగ్రప్ర
కాండఖండిత రాజమండలంబు
శూలాహతక్షతోద్రేకకీలాల క
ల్లోలకేళీమహాలోకనంబు
శుంభ దున్మద కుంభి కుంభస్థలధ్వంస
సంభూతశౌర్య విజృంభణంబు
తే. గలుగు నుద్దామభీమ సంగ్రామ కేళి
ఘనపరాక్రమ విక్రమక్రమము గాఁగ
జరప లేనట్టి [1]కరములు [2]కరము దుఃఖ
కరము లగుఁగాక సంతోషకరము లగునె. 323

ఉ. కాన మదీయ చండ భుజగర్వ పరాక్రమ కేళికిన్ సముం
డీ నిఖిలావనిం గలఁడె [3]యిందుకళాధర నీవు దక్కఁగా
నా నిటలాంబకుండు దనుజాధిపు మాటకుఁ జాల రోసి లో
నూనిన [4]రోషవార్ధి గడలొత్తఁగ నిట్లని పల్కె భూవరా.
క. విను మూఢహృదయ [5]నీ కేతన మెప్పు డకారణంబ ధారుణిపైఁ గూ
లును నప్పుడ నీభుజావలి తునియఁగ నాయంతవాని దొరకొనఁగల్గున్.
వ. అని పలికిన నట్లు సంప్రాప్తమనోరథుండయి నిజ భుజ వినాశకార్య
ధురీణుం డగు బాణుండు సంతుష్టాంతరంగుండగుచు నిజవాసంబు
నకుం జని [6]తన ప్రాణవల్లభల యుల్లంబులు పల్లవింపం జేయుచు
[7]నిజధ్వజనిపాతంబు నిరీక్షించుచుండె దదనంతరంబ.
సీ. ఆ దానవేశ్వరు ననుఁగు గూఁతురు నుషా
కన్య సచ్చరిత సౌజన్య ధన్య
రూప విభ్రమ కళా రుచిర కోమలదేహ
యతను నాఙవబాణ మనఁగ బరఁగు
సుందరీరత్నంబు నిందుభానన
యలినీలవేణి పద్మాయతాక్షి

1. కరములు = హస్తములు. 2. కరము = మిక్కిలి. 3. ఇందుకళాధర = చంద్రకళను ధరించిన శంకరా. 4. రోషవార్ధి = కోపసముద్రము. 5. నీ కేతనము = నీ జెండా. 6. తన ప్రాణవల్లభల = తన భార్యల. 7. నిజధ్వజ నిపాతంబు = తన జెండా పడుట.

యొకనాఁడు రుచిర సౌధోపరివేదికా
స్థలమున మృదుశయ్య నెలమిఁ గూర్కి

తే. మున్ను దనచాల నెన్నఁడు విన్న యతఁడు
గన్నులారంగఁ దాఁ బొడగన్న యతఁడు
గాని యసమానరూపరేఖావిలాస
కలితు ననిరుద్ధు నర్మిలిఁ గవసినటులు. 327

చ. కలగని యంత మేలుకని కన్నుల బాష్పకణంబు లొల్కఁగాఁ
గలవలెఁ గాక నిశ్చయముగాఁ గమనీయ విలాస విభ్రమా
కలిత తదీయరూపము మనంబున వ్రేలినయట్ల దోఁచినం
గళవళ మందుచున్ బిగియఁ గౌఁగిటిచే బయ లప్పళించుచున్.

వ. మఱియును. 329

చ. సరసమృదూక్తులుం గుసుమశాయక కేళియు శాటికా కచా
కర్షణముల్ నఖక్రియలు గమ్రకపోల లలాట మేఖలా
కర కుచ బాహుమూలములుఁ గైకొని యుండుట లాదిగాఁ [2]దలో
దరి మది గాఢమై తగిలె దర్పకుఁ డచ్చున నొత్తినట్లయై. 330

సీ. కలికిచేష్టలు భావగర్భంబు లైనను
బ్రియుమీఁద గూరిమి బయలుపఱుపఁ
బిదపిదనై లజ్జ మదిఁ బద నిచ్చిన
జెలిమేనఁ బులకలు చెక్కు లొత్త
మదనాగ్ని సంతప్తమానసయగుటను
గురుకుచ హార వల్లరులు గందఁ
జిత్తంబు నాయకాయత్తమై యుంటను
మఱుమాట లాడంగ మఱపు గదుర

తే. సతివమనమున సిగ్గు మోహంబు భయముఁ
బొడమ నునుమంచు [3]నెత్తమ్మి బొదువుమాడ్కిఁ
బ్రథమ చింతాభరంబునఁ బద్మనయన
కోరి తెలచీర వాటింప నేరదయ్యె. 331

1. నఖక్రియలు = నఖక్షతములు (గిల్లులు) 2. తలోదరి = సూక్ష్మమైన కడుపు కలది. 3. నెత్తమ్మి = అందమైన పద్మము.

వ. ఇట్లు విరహవేదనా దూయమానమానసయై యుండె, నంత నెచ్చెలులు డాయం జనుదెంచినం దన మొగంబునం బొడము [1]మనోజవికారంబు మఱుఁగుపెట్టుచు నప్పడఁతు. 332

చ. పొలఁబొలఁ బుచ్చుచూర్పుగమిఁ బుక్కిట నుంచి కుచాగ్రసీమపైఁ
బెరసిన సన్నచేఁ జెమటఁ బెంపువు లొయ్యన నార్చి కన్నులం
దొరఁగెడు బాష్పపూరములు దొంగిలి ఱెప్పలనాని చుక్కలం
దరుణులు గంటఁ జూతురని తా మొగమెత్తును గూఢరాగయై.

వ. ఇవ్విధంబునం జరియించుచుండె నట్టియెడ. 334

తే. అంతకంతకు సంతాప మతిశయించి
వలుఁదచన్నులు గన్నీటివఱదఁ దడియ,
జెలులదెసఁ జూడఁ జాల లజ్జించి మొగము
వాంచి పలుకక యుండె నవ్వనరుహాక్షి. 335

వ. అంత. 336

తే. బలితనూభవు మంత్రి కుంభాండుతనయ
తన బహిఃప్రాణ మిదియనఁ దనరునట్టి
కామినీమణి ముఖపద్మకాంతివిజిత
[1]శిశిరకర చారురుచిరేఖ చిత్రరేఖ. 337

వ. కదిసి యబ్బాల నుపలక్షించి.

తే. భామినీమణి సొబగుని బయల వెదకు
విధమునను నాత్మవిభుఁ బాసి విహ్వలించు
వగను జేతికి లోనైన వానిఁ బాసి
భ్రాంతిఁ బొందినభావంబు ప్రకటమయ్యె. 339

తే. వనిత నాకన్న నెవ్వరైన వారు నీకుఁ
గలుగ నేర్తురె కోర్కెఁ దెలియఁ జెప్పు
కున్న మాయన్నతోడన్న కన్నుఁగవను
నలరు నును సిగ్గుతో నగ వామతింప. 340

1. మనోజవికారంబు = మన్మథ వికారము. 2. శిశిరకర చారు రుచిరేఖ = శిశిరఋతువునందలి చంద్రునివలె అందమైనది.

వ. ఇవ్విధంబునఁ జిత్రరేఖం గనుంగొని యిట్లనియె. 241

చ. చెలి కలలోన నొక్క సరసీరుహనేత్రుఁడు హారరత్నకుం
డల కటకాంగుళీయక కిరీటమణీమయభూషణుండు ని
ర్మల కనకాంబరుండు సుకుమారతనుండు సునీలదేహుఁ డు
జ్జ్వలరుచి నూతన ప్రసవసాయకుఁ డున్నతవక్షుఁ డొంతయున్.

చ. నను బిగియారఁ గౌఁగిట మనంబలరారఁగఁ జేర్చి మోదముం
దనుకఁగ నంచితాధరసుధారస మిచ్చి మనోజకేళికిం
బనుపడఁ జేసి మంజుమృదుభాషలఁ దేలిచి యంతలోన నే
చనియెను దుఃఖవార్ధిఁ బెలుచన్ ననుఁ ద్రోచి సరోరుహాననా.

వ. అనుచు [1]నమ్మత్తకాశిని చిత్తంబు చిత్తజాయత్తంబయి తత్తరంబున విరహానలం బుత్తలపెట్టఁ గన్నీరు మున్నీరుగా వగచుచు విన్ననయిన వదనారవిందంబు వాంచి యూరకున్నఁ జిత్రరేఖ తన మనంబున నయ్యింతిసంతాపంబు చింతించి యిట్లనియె. 344

చ. సరసిజనేత్ర యేటికి విచారము నాకుశలత్వ మేర్పడన్
నర సుర యక్ష కింపురుష నాగ నభశ్చర సిద్ధ సాధ్య కి
న్నరవరముఖ్యులం బటముపైన లిఖించినఁ జూచి నీ మనో
హరుఁగని వీఁడె పొమ్మనిన నప్పుడె వానిని నీకుఁ దెచ్చెదన్. 345

వ. అని యొడంబఱిచి మిలమిలని మించుతోడం బురుడించు ధళధళ మను మెఱుంగులు దుఱంగలి గొను [2]పటంబు నావటంబు సేసి వజ్రంబున మేదించి పంచవన్నియలు వేఱువేఱ [3]కనక రజత పాత్రంబుల నించి కేలం [4]దూలిక ధరించి యొక్కవిజనస్థలంబునకుం జని ముల్లోకంబులం బేరుగలిగి వయోరూప సంపన్నులయిన పురుషముఖ్యుల నన్వయగోత్ర నామధేయంబులతోడ వ్రాసి యాయితంబయిన యప్పటంబు దన ముందటఁ దెచ్చి పెట్టి యప్పటంబునం దగులని వారు వీరు వారని చెప్పెద సావధానంబుగా నాకర్ణింపుమని యిట్లనియె. 346

1. అమ్మత్తకాశిని = ఆ స్త్రీ. 2. పటంబు = చిత్రపువు, వస్త్రము. 3. కనక రజత పాత్రంబులు = బంగారు, వెండి పాత్రలు. 4. తూలిక = కుంచె.

సీ. కమనీయ సంగీత ♦ కలితకోవిదులు కిం
పురుషగంధర్వ కి♦న్నరులు వీరె
సతత యౌవన యదృ♦చ్ఛావిహారులు సిద్ధ
సాధ్యచారణ నభ♦శ్చరులు వీరె
ప్రవిమలసౌఖ్యసం♦పద్వైభవులు [1]సుధా
శన మను ద్యక్ష రా♦క్షసులు వీరె
నిరుపమరుచి కళా♦న్విత కామరూపులై
పొగ డొందునట్టి ప♦న్నగులు వీరె

తే. చూడుమని నెచ్చె దీపింపఁ ♦ జూపుటయును
జిత్తము నిజమనోరథ ♦ సిద్ధి వడయ
జాలకుండిన మధ్యమ ♦ క్ష్మాతలాధి
పతులఁ జూపుచు నిచ్చె న♦ప్పద్మనయన. 347

ఉ. మాళవ కొంకణ ద్రవిడ ♦ మత్స్యపుళింద కళింగ భోజ నే
పాళ విదేహ పాండ్య కురు ♦ బర్బర సింధు యుగంధ రాంధ్ర బం
గాళ కరూశ కుంకణ త్రి♦గర్త సుదేష్ణ మరాట లాట పాం
చాల నిషాద ఘూర్జరక ♦ సాళ్వ మహీశులు వీరె కోమలీ. 318

ఉ. సింధురనైకవిక్రముఁడు ♦ శీతమయూఖ మరాళికా పయ
స్సింధుపటీర నిర్మల వి♦శేష యశోవిభవుండు శౌర్యద
ర్పాంధరిపుక్షితీశ నిక♦రాంధతమఃపటలార్కుఁ డీ జరా
సంధునిఁ జూడు మాగధుని ♦ సద్బృహదశ్వసుతుం [2]గృశోదరీ. 349

మ. [3]సకలోర్వీతలనాథ సన్నుతుఁడు ♦ శశ్వద్దుర్వారి బాహాబలా
ధికుఁ డుగ్రాహవకోవిదుండు త్రిజగ♦ద్విఖ్యాత చారిత్రకుం
డకలంకోజ్జ్వల దివ్యభూషుఁడు విద♦ర్భాధీశ్వరుండైన భీ
ష్మకభూపాల కుమారుఁ జూడు మితనిన్ ♦ [4]మత్తద్విరేఫాలకా.

ఉ. సంగరరంగ నిర్దళిత ♦ చండవిరోధిపరార్థివేశ మా
తంగ తురంగ సద్భట ర♦థప్రకరైక భుజావిజృంభణా

---

1. సుధాశన = దేవత  2. కృశోదరీ = సూక్ష్మమైన కడుపు గలదానా
3. సకలోర్వీతలనాథసన్నుతుఁడు = అందఱు రాజులచేఁ గొనియాడఁ బడువాఁడు.
4. మత్తద్విరేఫాలకా = మదించిన తుమ్మెద రెక్కలవంటి ముంగురులు గలదానా.

భంగ పరాక్రమప్రకట భవ్యయశోమహనీయమూర్తి కా
ళిందిఁ గూడి పెండ్లియాడెఁ జూడు తరళీకృత చారుకురంగలోచనా.

మ. సుగుణాంభోనిధి ఫాలలోచను నమేయున్నాత్మ మెప్పించి శ
క్తిగరిష్ఠంబగు శూలముఁ బడసె నక్షీణ ప్రతాపోన్నతిన్
జగతిన్ మిక్కిలి మేటివీరుఁడు రణోత్సాహుండు భూపాత్మజుఁడీ
భగదత్తుం గనుగొంటె పంకజముఖీ ప్రాగ్జ్యోతిషాధీశ్వరున్. 352

మ. వికచాంభోరుహపత్త్రనేత్రుఁ డగు గోవిందుండు దాఁ బూను నం
దక చక్రాబ్జ గదాది చిహ్నములచేతన్ వాసుదేవాఖ్య ను
త్సుకుఁడై యెప్పుడు మచ్చరించుమదిఁ గృష్ణుం డన్న నీమేటిపౌం
డ్రకుఁ గాశీశసఖుం గనుంగొనుము శేష్కంజం దబింబాననా.

మ. [2]ద్విజశుశ్రూషయు సూనృతవ్రతమును వ్యాప్తి భుజాగర్వమున్
విజయాటోపముఁ జూపనై పుణియు ధీవిస్ఫూర్తియుం గల్గు నీ
[3]రజనీనాథకుల ప్రదీపకుల నాకారం జూడు పద్మాక్షి ధ
ర్మజ భీమార్జున మాద్రినందనుల సంగ్రామైకపారీణులన్. 354

మ. బలిమిన్ సర్వనృపాలుర న్నదిమి [4]కప్పంబుల్ దగంగొంచు ను
జ్జ్వల తేజోవిభవాతిరేకమున భాస్వత్కీర్తి శోభిల్లఁగాఁ
బాలుపొందం దను రాజరాజన మహాభూరిప్రతాపంబులుం
గల దుర్యోధనుఁ జూడు సోదరయుతుం గంజాతపత్త్రేక్షణా. 335

వ. అని యివ్విధంబున చప్పన్న దేశాధీశు లగు రాజలోకంబుల నెల్లఁ
జూపుచు యదువంశ సంభవులైన శూరసేన వసుదేవోద్ధవాదులం
జూపి మఱియును. 356

ఉ. శారద నీరదాబ్జ ఘనసార సుధాకర కాశ చంద్రికా
సార పటీరవర్ణు యదుసత్తము నుత్తమనాయకుం బ్రమ
త్తారినృపాలకానన హుతాశనమూర్తిఁ బ్రలంబదైత్య సం
హారుని గామపాలుని హలాయుధుఁ జూడుము దైత్యనందనా.

సీ. కమనీయశుభగాత్రుఁ గంజాతదళనేత్రు
వసుధాకళత్రుఁ బాంధవసుమిత్రు

---

1. తరళీకృతచారుకురంగలోచనా = కదలుచున్న లేడికన్నులవంటి కన్నులు కన్నులదానా. 2 ద్విజశుశ్రూషయు = బ్రాహ్మణశుశ్రూష. 3. రజనీనాథకులప్రదీపకుల = చంద్రవంశమందు శ్రేష్ఠమైనవారిని 4. కప్పంబుల్ = పన్నులు. 5. హలాయుధున్ = బలరాముని.

సత్యసంకల్పు నిశాచరోగ్ర వికల్పు
నతపన్నగాకల్పు [1]నాగతల్పుఁ
కౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు
శ్రితజనపోషు సంచితవిశేషు
నీల నీరద కాయు నిర్జిత దైతేయు
ధృత పీతకౌశేయు నతవిధేయు
తే. [2]నఘమహాగదవైద్యు వేదాంతవేద్యు
దివ్యమునిసన్నుతానాము దీర్ఘపాదు
జిష్ణు వరసద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ
జూచు దైతేయకులబాల సుభగలీల. 358

చ. స్ఫురదళిశింజినీన విభూషితపుష్ప ధనుర్విముక్త భా
స్వర నవచూత కోరక సుశాత శిలీముఖపాత భీత పం
కరుహభవాది చేతన నికాయు మనోజనిజాంశు రుక్మిణీ
వరసుతు రాజకీర వరవాహుని మారునిఁ జూచు కోమలి. 359

వ. ఇవ్విధంబునం జూపిన. 360

మ. వనితారత్నము కృష్ణనందనుని భావప్రౌఢిఁ దాఁ జూచి గ
ద్గద దన్నర్ద్రి వరించి చన్న సుగుణోత్తంసంబు కా నాత్మలో
నను మానించి యనంతరంబ యనిరుద్ధాఖ్యున్ సరోజాక్షు నూ
తన చేతోభవమూర్తి జూచి మది సంతాపించుచు న్నిట్లనున్.

ఉ. ఇంతి మదీయమానధన మెల్ల హరించిన [3]ముచ్చు నిమ్మెయిం
బంత మెలర్ప వ్రాసి పటభాగ నిరూపితుఁ జేసినట్టి నీ
యంతటి పుణ్యమూర్తిఁ గొనియాడఁగ నేర్తునె నీచరిత్రముల్
వింతలె నాకు నీమహితవీరు కులంబు బలంబుఁ జెప్పుమా. 362

చ. అనవుఁడుఁ జిత్రరేఖ జలజాక్షికి నిట్లను నీకుమారకుం
డనఘుఁడు యాదవాన్వయ సుధాంబుధి పూర్ణసుధాకరుండు నాఁ
దనరిన కృష్ణపౌత్త్రకుఁడు దుర్వార చరిత్రుఁడు భూరిసింహ సం
హననుఁ [4]డరాతిసైన్యతిమిరార్కుఁడు పే రనిరుద్ధుఁ డంగనా.

---

1. నాగతల్పు = పాముశయ్యగా గలవాడు. 2. అఘమహాగదవైద్యున్ = పాపమను రోగమునకు వైద్యునివంటివాని. 3. ముచ్చు = దొంగ. 4. అరాతిసైన్య తిమిరార్కుఁడు = శత్రుసైన్యమను చీఁకటికి సూర్యుఁడు.

వ. అని చెప్పి యే నతిత్వరితగతిం జని యక్కుమారరత్నంబుఁ దోడ్కొని వత్తు నంతకు సంతాపింప కుండుమని యాక్షణంబ [1]వియద్గమనంబునం జని చని ముందట. 364

క. సరసిజముఖి కనుఁగొనె శుభ
భరిత విలోకన విధూత భవవేదనముం
బరసాధనమును సుకృత
స్ఫురణాపాదనముఁ గృష్ణు [2]పుటభేదనమున్. 365

వ. కని డాయం జని తదీయ సుషమావిశేషంబులకుం బరితోషంబు నొందుచుం గామినీచరణ రణితమణి నూపుర ఝుణంఝుణధ్వనితమణి గోపురంబును నతివిభవవిజిత గోపురంబును నగు ద్వారకాపురంబు నిశాసమయంబునం [3]బ్రచ్ఛన్నవేషంబునం జొచ్చి కనకకుంభ కలిత సౌధాగ్రంబున మణిదీపనిచయంబు ప్రకాశింపఁ [4]జంద్రకాంత శిలాభవనంబున సుధాధామరుచి నిచయంబు నపహసించు హంస తూలికాతల్పంబున నిజాంగనారతిశ్రమంబున నిద్రాసక్తుండై యున్న యనిరుద్ధుం జేరి తన యోగవిద్యా మహత్త్వంబున నతని నెత్తుకొని మనోవేగంబున శోణపురంబునకుం జని బాణాసురనందన యగు నుషాసుందరితల్పంబునం దునిచి యిట్లనియె. 366

క. వనజాక్షి చూడు నీవిభు । ననిమిషనగధీరు శూరు నభినవమారున్
వనధిగభీరు నుదారుని । ననిరుద్ధకుమారు విదళితాహితవీరున్.

క. అనిన నుషాసతి దన మన
మున ననురాగిల్లి మేనఁ బులకాంకురముల్
మొనయఁగ నానందాశ్రులు
గనుఁగవ జడిగురియ ముఖవికాసమెలర్పన్. 368

వ. ఇట్లు మనంబున నుత్సహించి చిత్రరేఖం గనుంగొని యయ్యింతి యిట్లనియె. 369

సీ. అతివ నీ సాంగత్య మను భానురుచి నాకు
గలుగుటఁ గామాంధకార మడఁగెఁ

1. వియద్గమనము = ఆకాశగమనము, 2. పుటభేదనమున్ = పట్టణమును, 3. ప్రచ్ఛన్నవేషంబున = మాఱువేషంబున, 4. చంద్రకాంత శిలాభవనంబున = చంద్రకాంత మాణిక్య నిర్మితగృహమున.

దరళాక్షి నీ సఖత్వం బను నావచేఁ
గడిఁది [1]వియోగాబ్ధిఁ గడవఁ గంటి
నబల నీ యనుబంధ మను సుధావృష్టిచే
నంగజసంతాప మార్పఁ గంటి
వనిత నీచెలితనం బను [2]రసాంజనముచే
నామనోహరనిధానంబుఁ గంటిఁ

తే. గలలఁ దోఁచినరూపు గ్రక్కన లిఖించు
వారు నా నన్నఁ దోడ్తెచ్చు వారుఁ గలరె
నీటిలోఁ జాడఁ బుట్టించు నేర్పు నీక
కాక కల్గునె మూఁడులోకములయందు. 370

వ. అని వినుతించి చిత్రరేఖను నిజమందిరమునకుఁ బోవం బనిచి నం
జనియె, నంత వింతజనుల కెవ్వరికిం బ్రవేశింపరాని యంతఃపుర
సౌధాంతరంబున ననిరుద్ధుండు మేల్కని యయ్యింతిం గనుంగొని
యప్పుడు. 371

క. సురుచిరమృదుతల్పంబునఁ । బరిరంభణసరసవచన భావకళాచా
తురి మెఱసి రాకుమారుఁడు । తరుణీమణిఁ బొందె మదనతంత్రజ్ఞుండై.

వ. ఇవ్విధంబున నతిమనోహరవిభవాభిరామంబులగు దివ్యాంబరా
భరణమాల్యానులేపనంబులఁ గర్పూరతాంబూలంబుల వివిధాన్న
పానంబుల సురుచిరమణిదీపనీరాజనంబుల సుగంధబంధురాగరు
ధూపంబుల నాటలఁ బాటల వీణావినోదంబులం బరితుష్టిం బొంది
కన్యాకుమారకు లానందసాగరాంతర్నిమగ్నమానసులై యుదయా
స్తమయ నిరూపణంబు సేయనేరక ప్రాణంబు లొక్కటియైనతలంపు
లం గలసి యిష్టోపభోగంబుల సుఖయించుచుండి రంత. 373

క. ఆలోనన యతిచిరమగు । కాలము సుఖలీల జరగఁగా వరుస నుషా
బాలాలామకొయ్యన । జూలేర్పడి గర్భ మొదవె సురుచిరభంగిన్.

క. ఆ చిన్నె లంగజాలలు । చూచి భయాకులత నొంది సుక్కుచుఁ దమలోఁ
నోచెల్ల యెట్టులో యీ । రాచూలికిఁ జూలు నిలిచె రా యిబ్బంగిన్

1. వియోగాబ్ధిఁ గడవ = వియోగసముద్రమును దాఁటుట. 2. రసాంజనము = కాటుక. 3. అంగజాలలు = రాణివాసపు కావలివారు.

క. అని గుజగుజవోవుచు నిప్పని దప్పక [1]దనుజలోకపాలునితోడన్
వినిపింపవలయుననివే చని బాణునిఁజేరి మ్రొక్కి సద్వినయమునన్.

క. [2]మంతనమున దేవరక
న్యాంతఃపుర మేము గాచి యరయుచు నుండన్
వింతజనములకుఁ జొరఁగ దు
రంతము వినుఁ బోతుటీఁగకైన సురారీ. 377

తే. ఇట్టిచోఁ గావలున్న మే మెవ్వరమును
నేమి కనుమాయయో కాని యెఱుఁగ మధిప
నీకుమారిక గర్భంబు నివ్వటిల్లి
యున్నదన్నను విని రోషయుక్తుఁడగుచు. 378

వ. అట్టియెడ దానవేంద్రుండు రోషభీషణాకారుండయి కటము లదర బొమలు ముడివడం గనుఁగవల [3]ననలకణంబు లుప్పతిల్ల సటలు వెఱికినం జటులగతి నెగయు సింగంబువిధంబున లంఘించుచు భీకర కరవాలంబు కేలందాల్చి సముద్దండగతిం గన్యాసౌధాంతరంబునకుం జని. 379

—♦ బాణాసురుం డనిరుద్ధుని నాగపాశబద్ధునిఁ జేయుట ♦—

సీ. కనియె శుభోపేతుఁ గందర్పసంజాతు
మానితదేహు నాజానుబాహు
మకరకుండలకర్ణు మహితప్రభాపూర్ణుఁ
జిరయశోల్లాసుఁ గౌశేయవాసుఁ
గస్తూరికాలిప్తు ఘనకాంతికుముదాప్తు
హారశోభితవక్షు నంబుజాక్షు
యదువంశతిలకు మత్తాలినీలాలకు
నవపుష్పచాపుఁ బూర్ణప్రతాపు

తే. నభినవాకారు నక్షవిద్యావిహారు
మహితగుణవృద్ధు మన్మథమంత్రసిద్ధుఁ

1. దనుజలోకపాలునితోడన్ = రాక్షసరాజు (బాణాసురుని)తో 2. మంతనమున = రహస్యముగ 3. అనలకణంబులు = అగ్నికణములు.

గలితపరాబుద్ధు నఖిలలోకైకప్రసిద్ధుఁ
జతురు ననిరుద్ధు నంగనాజననిరుద్ధు. 380

చ. కని కన లగ్గలింప సురకంటకుఁ డుద్ధతి సద్భటావళిం
గనుఁగొని యానరాధమునిఁ గట్టుఁడు పట్టుఁడు కొట్టుఁడన్న వా
రనుపమహేతిదీధితు [1]లహర్పతి తేజము మాయఁజేయ డా
సిన నృపశేఖరుండు మదిఁ జేవయు లావును నేర్పు దర్పమున్.

చ. కలిగి మహోగ్రవృత్తిఁ బరిఘంబు కరంబున లీలఁ దాల్చి దో
ర్బలఘనవిక్రమప్రళయభైరవభంగి విజృంభణక్రియా
కలన నెదిర్చి దానవనికాయముతోఁ దలపాటుఁబోటునుం
జలము బలంబు ధైర్యమును శౌర్యము వ్రేటునువాటుఁజూపుచున్

చ. పదములు బాహులుం దలలుఁ బక్కలు సెక్కులుజానుయుగ్మమున్
రదములుఁ గర్ణముల్ మెడ లురంబులుమూఁపులు వీఁపులూరువుల్
చిదురుపలై ధరం దొరఁగ జిందఱ వందఱ సేయ సైనికుల్
కదనపరాఙ్ముఖక్రమముఁ గైకొని పాఱిరి కాందిశీకులై. 383

వ. ఇవ్విధంబున సైన్యంబు దైన్యంబునొంది వెఱచియుం బఱచియు విచ్చియుం జచ్చియుఁ గలంగియు నలంగియు విఱిగియు సురిఁగియు జెదరియుం బెదరియుఁ జేపడఁగి నుఱుముఱులై తన మఱుఁగుసొచ్చిన బాణుండు శౌర్యధురీణుండును గోపోద్దీపితమానసుండునై కదిసి యేసియు వ్రేసియుఁ బొడిచియు నడిచియుఁ బెనంగి. 384

క. క్రుద్ధుండై [2]యహిపాశ నిబద్ధుం గావించె నసురపాలుఁడు రణ స
న్నద్ధున్ శరవిద్ధు న్ననిరుద్ధున్ మహితప్రబుద్ధు రూపసమృద్ధున్.

వ. ఇట్లు కట్టి తెచ్చిన నుషాసతి శోకవ్యాకులితచిత్తయై యుండె నంత.

క. నీలపటాంచితమై సువిశాలంబై వాయుహతిఁ జండధ్వని నా
భీలమగు [3]నతని కేతన మాలోన నకారణంబ యవనిం గూలెన్.

క. అదిసూచి దనుజపాలుఁడు। [4]మదనాంతకుఁ డాడినట్టి మాట నిజముగా
[5]గదనంబు గలుగు నంచు। న్నెదు రెదురే చూచుచుండె నెంతయుఁ బ్రీతిన్.

వ. అంత నక్కడ. 389

1. అహర్పతి తేజము=సూర్యునియొక్క కాంతి. 2. అహిపాశ ... గావించె= పాములను త్రాళ్ళచే బద్ధుని గావించె. 3. అతని కేతనము=అతని జెండా. 4. మదనాంతకుఁడు=ఈశ్వరుఁడు. 5. కదనంబు=యుద్ధము.

క. ద్వారకలో ననిరుద్ధకుమారునిపోకకును యదుసమాజము వగలం
గూరుచు నొకవార్తయు విననేరక చింతింప నాలుగు నెల లరిగె నృపా.

వ. అయ్యవసరంబున, 391

— నారదునివలన ననిరుద్ధునివృత్తాంతమును విని కృష్ణుఁడు బాణాసురునిపై దండెత్తుట —

క. శారద కోమల నీరద [1]పారద రుచి దేహుఁ డతుల భాగ్యోదయుఁ డా
నారదముని యేతెంచె నపారదయామతి మురారి భజన ప్రీతిన్.

వ. అట్లు చనుదెంచిన యద్దివ్యమునికి నిర్మలమణివినిర్మితసుధర్మాభ్యంతరమున యదువృష్ణి భోజాంధకవీరులు గొలువం గొలువున్న కమలలోచనుండు ప్రత్యుత్థానంబు సేసి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి సముచిత కనకాసనాసీనుం జేసిన సత్తాపసోత్తముండు పురుషోత్తము నుదాత్త తేజోనిధిం బొగడి యనిరుద్ధువృత్తాంతం బంతయుఁ దేటపడ నెఱింగించి యప్పుండరీకాక్షునిచేత నామంత్రణంబువడసి యంతర్ధానంబునొందెఁ, దదనంతరంబ కృష్ణుండు శుభముహూర్తంబున దండయాత్రాభిముఖుండై ప్రయాణభేరి వేయించి బలంబులు వెడలింప బ్రద్దలవారిం బనిచి తానును గట్టాయితం బయ్యె నంత. 393

సీ. హారకిరీట కేయూరకంకణకట
కాంగుళీయకనూపురాది వివిధ
భూషణప్రతతిచేఁ బొలుపారి కరముల
ఘనగదాశంఖచక్రములు దనర
[2]సురభిచందనలిప్తసురుచిరోరస్స్థలిఁ
బ్రవిమలకౌస్తుభప్రభలు నిగుడఁ
జెలువారు పీతకౌశేయచేలము కాసె
వలనుగా రింగులువారఁ గట్టి

తే. శైబ్య సుగ్రీవ మేఘ పుష్పక వలాహ
కములఁ బూన్చిన [3]తేరాయితముగఁ జేసి

---

1. పారదరుచిదేహుఁడు = పాదరసమువంటి శరీరకాంతి గలవాఁడు. 2. సురభిచందనలిప్త = మంచిగంధముచే పూయఁబడిన. 3. తేరాయితముగఁ జేసి = రథము సిద్ధముగఁ జేసి.

దారుకుఁడు దేర నెక్కి మో§దంబెలర్ప
భానుఁ డుదయాచలం బెక్కు § పగిది మెఱయ. 394

వ. ఇట్లు రథారోహణంబుసేసి భూసురాశీర్వచన [1]పూతుండునుమహిత దూర్వాంకురాలంకృతుండును లలిత పుణ్యాంగనా కరకిసలయకలిత శుభాక్షతవిన్యాసభాసురమస్తకుండును మాగధ మంజులగానాను మోదితుండును వందిజనసంకీర్తనానందితుండును బారకిపఠన రవ వికాసితహృదయుండును నయి వెడలు నవసరంబున. 395

సీ. బలభద్రసాత్యకి § ప్రద్యుమ్నముఖ యదు
వృష్ణిభోజాంధక § వీరవరులు
దుర్వారపరిపంథి § గర్వభేదనకళా
చతురబాహాబలో § త్సాహలీల
వారణస్యందన § వాజిసందోహంబు
సవరణసేయించి § సంభ్రమమున
సముచితప్రస్థాన § చటులభేరీభూరి
ఘోష [2]మంభోనిధి § ఘోష మడఁప

తే. ద్వాదశాక్షోహిణీబలో § త్కరము లోలి
నడచెఁ గృష్ణునిరథము వె § న్నడిఁ జెలంగి
పృథులగతి మున్ను భగీరథు § రథము వెనుక
ననుగమించు [3]వియన్నది § ననుకరించి. 396

వ. ఇవ్విధంబునం గదలి కతిపయప్రయాణంబులశోణపురంబుచేరం జని వేలాలంఘనంబుచేసి యదువీరులంత. 397

మ. సరిదారామ సరోవరోపవన య§జ్ఞస్థానముల్ మాపి వే
పరిఖల్ పూడిచి యంత్రముల్ దునిమి వ§ప్రవ్రాతముల్ ద్రొబ్బిగో
పురముల్ గూలఁగఁద్రోచి సౌధభవనం§బుల్ నూకి ప్రాకారముల్
ధరణింగూల్చి [4]కవాటముల్ విఱిచి రు§ద్దండక్రియాలోలురై. 398

1. పూతుండును = పవిత్రమైనవాఁడును. 2. అంభోనిధిఘోష = సముద్రధ్వని. 3. వియన్నది = గంగానది. 4. కవాటముల్ = తలుపులు.

వ. ఇట్లనేక ప్రకారంబుల గాసిచేసి పురంబు నిరోధించి పేర్చి యార్చినం
జూచి యాగ్రహసమగ్రోగ్రమూర్తియుంబోలె సమరసన్నాహ
సంరంభవిజృంభమాణుండై బాణుండు సంగరభేరి వేయించిన. 99

సీ. ఆచక్రవాళాచలాచక్రమంతయు
బలసి కుమ్మరసారె ♦ పగిది దిరిగె
ఘనఘోణి ఖురకోటి ♦ ఘట్టితపదముల
కరణి నంభోనిధుల్ ♦ గలఁగి పొరలెఁ
గాలరుద్రాభీల ♦ కరశూలహతి రాలు
పిడుగులగతి [1]నుడుబృంద మెడలెఁ
జటులానిలోద్ధూత ♦ [2]శాల్మలీతూలంబు
చాడ్పున మేఘముల్ ♦ చదలఁదూలె

తే. గిరులు వడఁకాడెఁ దివి పెల్ల♦గిల్లె సురల
గుండె లవిసె రసాతల♦క్షోభ మొదవె
దిక్కులురిసె విమానముల్ ♦ దొరలి చెదరెఁ
గలఁగి గ్రహరాజచంద్రుల ♦ గతులు దప్పె. 400

వ. అట్టి సమరసన్నాహంబునకుఁ గట్టాయితండై మణిఖచిత భర్మవర్మ
నిర్మలాంశుజాలంబులును శిరస్త్రాణకిరీటకోటిఘటిత వినూత్నరత్న
ప్రభాపటలంబులును గనకకుండల గ్రైవేయహారకంకణ తులాకోటి
వివిధభూషణవ్రాతరుచినిచయంబులును బ్రచండబాహుదండ సహ
స్రంబున వెలుంగు శరశరాసన శక్తి ప్రాస తోమర గదా కుంత
ముసల ముద్గర భిండిపాల కరవాల పట్టిస శూల క్షురికా పరశు పరి
ఘాది నిశాత హేతివ్రాత దీధితులును వియచ్చరకోటినేత్రంబులకు
మిఱుమిట్లు గొలుపఁ గనకాచలశృంగసముత్తుంగం బగు రథం బెక్కి
[3]యరాతివాహినీసందోహంబునకుం దుర్లంఘ్యం బైన నిజసేనాసమూ
హంబు లిరుగడల నడవ బాణుం డక్షీణ ప్రతాపంబు దీపింప ననికి
వెడలె నయ్యవసరంబున. 401

1. ఉడుబృందము = నక్షత్రసమూహము. 2. శాల్మలీతూలంబు=బూరుగుదూది.
3. అరాతివాహినీసందోహము = విరోధిసైన్యసమూహము.

—◆బాణాసురసహాయభూతుం డగు శివునకుఁ గృష్ణునకు యుద్ధమగుట◆—

చ. వరదుఁ డుదారభక్తజనవత్సలుఁడైన హరుండు బాణునిం
గర మనురక్తి నాత్మజులకంటె దయామతిఁ జూచుఁగానఁ [1]దా
దర మొనరించు వేడ్కఁ బ్రమథుల్ గుహుఁడుఁ నిజభూతకోటియున్
సరస భజింప నుజ్జ్వలనిశాతభయంకర శూలహస్తుఁడై. 402

సీ. [2]ఖురపుటాహతి రేఁగు ధరణీపరాగంబు
పంకేరుహాప్తబింబంబుఁ బొదువ
విపులవాలాటోప విక్షేపజాత వా
తాహతి [3]వారివాహములు విరియఁ
గురుచ తిన్నని వాఁడికొమ్ములఁ జిమ్మిన
బ్రహ్మాండభాండ కర్పరము వగుల
[4]నలవోకవలె ఘణిల్లని ఱంకె వైచిన
రోదసీకుహరంబు భేదిలంగ

తే. [5]గళచలద్ఘర్మ ఘంటికా ఘణఘణ ప్ర
ఘోషమున దిక్తటంబు లాకులత నొంద
లీల నడతెంచు కలధౌతశైల మనఁగ
నఱ్ఱు మిఁగిలిన వృషభేంద్రు నెక్కి వెడలె. 403

వ. ఇట్లు వెడలి సమరసన్నాహసముల్లాసంబు మొగంబులకు వికాసంబు నాపాదింపం బ్రతిపక్షబలంబులతోఁ దలపడిన ద్వంద్వయుద్ధం బయ్యె నప్పు డప్పురాతనయోధుల యాయోధనంబుఁ జూచు వేడ్కం జను దెంచిన సరసిజసంభవప్రముఖ నిఖిలసురమునియక్షరాక్షస సిద్ధసాధ్య చారణ గంధర్వ కిన్నర కింపురుష గరుడోరగాదులు నిజవిమానారూఢులై వియత్తలంబుననిలిచి రట్టియెడం గృష్ణుండును హరుండును మారుండును గుమారుండును గూపకర్ణకుంభాండులును గామపాలుండును బాణపుత్రుండగు బలుండును సాంబుండును సాత్యకియును బాణుండును రథికులు రథికులను, [6]నాశ్వికులు నాశ్వికులును, గజా

1. తా దరమొనరించు = తానుయుద్ధముచేయు. 2. ఖుర = డెక్క, 3. వారివాహములు = మేఘములు. 4. అలవోకవలె = లీలగా 5. గళచలద్ఘర్మ...మున = కంఠమునందు కదలుచున్న బంగారు ఘంటలయొక్క ఘణఘణమనెడు పెద్దధ్వనిచేత. 6. ఆశ్వికులు = గుఱ్ఱముల నెక్కినవారు.

రోహకులు గజారోహకులును, బదాతులుఁ బదాతులుం దలపడి యితరేతర హేతి సంఘట్టనంబుల మిణుంగుఱులు సెదరం బరస్పరాహ్వాన బిరుదాంకిత సింహనాద హుంకార శింజినీటంకార వారణ ఘీంకార [1]వాజిహేషారవంబులును బటహ కాహళ భేరీ మృదంగ శంఖ తూర్య ఘోషంబులును బ్రహ్మాండకోటరంబు పరిస్ఫోటితంబయ్యె నయ్యవసరంబున. 404

చ. జలరుహనాభుఁ డార్చి నిజశార్ఙ్గశరాసనముక్త సాయకా
వలి నిగిడించి నొంచెఁ [2]బురవైరి పురోగములన్ రణక్రియా
కలితుల గుహ్యక ప్రమథ కర్బుర భూతపిశాచ ఢాకినీ
బలవ దరాతియోధులను బమ్మరపోయి కలంగి పాఱఁగన్. 405

వ. ఇట్లేసి యార్చిన కుంభినీధరు భుజావిజృంభణ సంరంభంబునకు సహింపక [3]నిటలాంబకుం డనలకణంబులుమియు నిశితాంబకంబులం [4]బీతాంబరుని నేసిన వాసినన్నింటి నడుమన ప్రతిబాణంబు లేసి చూర్ణంబులు సేసినం గనుంగొని మఱియును. 406

మ. [5]అనలాక్షుండు త్రిలోకపూజ్యమగు బ్రహ్మాస్త్రం బరింబోసి యా
వనజాతేక్షణుమీఁదఁ గ్రోధమహిమావ్యాకీర్ణుఁడై యేసె నే
సినఁ దద్దివ్యశరంబు చేతనె మఱల్చెం గృష్ణుఁ డత్యుద్ధతిన్
జనితాశ్చర్యరసాబ్ధిమగ్నులగుచున్ శక్రాదు లగ్గింపఁగన్. 407

శా. వాయవ్యాస్త్రము పేంద్రుపై నలిగి దుర్వారోద్ధతి న్నేయ దై
తేయధ్వంసియుఁ బార్వతాశుగముచేఁ ద్రెంచెం గతుధ్వంసి యా
గ్నేయాస్త్రం బడరించె సత్వగతి లక్ష్మీనాథుపై దాని వే
మాయం జేసెను నైంద్రబాణమునఁ బద్మాక్షుండు లీలాగతిన్.

వ. మఱియును. 409

ఉ. పాయని కిన్కతో హరుఁడు పాశుపతాస్త్రము నారిఁ బోసినం
దోయరుహాయతాక్షుఁడును దోడన లోకభయంకరోగ్ర నా

1. వాజి హేషారవంబులు = గుఱ్ఱముల సకిలింపు ధ్వనులు. 2. పురవైరి = ఈశ్వరుఁడు. 3. నిటలాంబకుండు = నిటల + అంబక = ముఖమునందుకన్నుగల ఈశ్వరుఁడు. 4. పీతాంబరుని = పచ్చని వస్త్రముగల వానిని (కృష్ణుని) 5. అనలాక్షుఁడు = ఈశ్వరుఁడు.

రాయణబాణరాజము దర్యయంబున నేసి మరల్చె దానిఁ జ
క్రాయుధుఁ డిత్తెఱంగునఁ బర్వాఁ శరావలి రూపు మాపినన్. 410

క. ఊహాకలంగియు విగతోత్సాహుండగు హరుని మీఁద జలజాక్షుఁడు స
మ్మోహనశిలీముఖంబు నవ్యాహతజయశాలి యగుచు నడరించె నృపా.

వ. ప్రక్షేసిన. 412

క. జృంభణశరపాతముచే శంభుఁడు నిజతనువు పరవశంబయి సోలన్
జృంభితుఁడై ఘననిద్రారంభమున[1]వృషేంద్రుమూఁపురముపై వ్రాలెన్

వ. ఇట్లు వ్రాలినం జక్రపాణి పరబలంబుల నిశితబాణ పరంపరలం దుని
మియు నొక్కయెడం గృపాణంబులం గణికలు సేసియు నొక్కచోట
గదాహతులం [2]దుత్తుమురుగా మొత్తియు నివ్విధంబునం బీనుంగుఁ
బెంటలు గావించెనంత. 414

చ. తఱిమి మురాంతకాత్మజుఁ డుదాత్తబలంబున బాహులేయుపైఁ
గఱకరిఁ దాఁకి తీవ్రశితకాండపరంపర లేసి నొంపఁగా
నెఱకులు గాఁడిపై దొరఁగ నెత్తుటఁ జొత్తిలి నైరులార్వఁ దాఁ
బఱచె మయూరవాహనముఁ బైకొని తూలుచు నాజిభీతుఁడై.

ఉ. [3]పంబి రణక్షితిన్ వర విపాటితశాత్రవవీరుఁడైన యా
సాంబుఁడు [4]హేమపుంఖశితసాయకజాలము లేర్చి భూరి రో
షంబున నేసినన్ బెదరి బాణతనూభవుఁ డోడి పాఱె శౌ
ర్యంబును బీరముం దగవు నారడిఁ బోవ బలంబులార్వఁగన్. 416

మ. వరబాహాబలశాలి యా హలి రణావష్టంభ సంరంభ వి
స్ఫుర దుగ్రాశనితుల్యమైన ముసలంబుం బూన్చి వ్రేసెన్ బోరిం
బోరిఁ గుంభాండక కూపకర్ణులు శిరంబుల్ వ్రస్సి మేధంబు నె
త్తురుఁ గర్ణంబుల వాతనుం దొరఁగి సంధుల్ వ్రీలి వే చావఁగన్.

వ. ఇట్టియెడ సైన్యంబు దైన్యంబునొంది యనాథంబయి చెడి విఱిగి
పాఱినఁగని బాణుండు సాత్యకిం గెడించి ప్రళయాగ్నియుంబోలె

1. వృషేంద్రమూఁపురముపై = ఎద్దుమూఁపురముపై. 2. తుత్తుమురుగా = ముక్కలు ముక్కలుగా. 3. పంబి = అతిశయించి. 4. హేమపుంఖశితసాయకజాలము = బంగారు పిడులుగల వాడి బాణసమూహములు.

విజృంభించి చెయివీచి బలంబుల సకలంబుఁ గొల్పి తానును ముంగలియై నడచె, నప్పుడుభయసైన్యంబు లన్యోన్యజయకాంక్షం దలపడు దక్షిణోత్తర సముద్రంబుల రౌద్రంబున వీఁకం దాకినం బోరు ఘోరంబయ్యె. అట్టియెడం గదల నడిచియుఁ [1]కుఠారంబులఁ బొడిచియు [2]సురియలం గ్రుమ్మియు శూలంబులఁ జిమ్మియు శక్తులనొంచియుఁ జక్రంబులం ద్రుంచియు [3]ముసలంబుల మొత్తియు ముద్గరంబుల నొత్తియు గుంతంబులఁ గ్రుచ్చియుఁ బంతంబులిచ్చియుఁ [4]బరిఘంబుల నొంచియుఁ [5]బట్టిసంబులం ద్రుంచియు శరంబులనేసియుఁ గరవాలంబుల వ్రేసియు సత్రాసులై పాసియు విత్రాసులై డాసియుఁ బెనంగినం దునిసిన శిరంబులును దునుకలైన కరంబులును దెగిన కాళ్ళును ద్రెస్సిన వ్రేళ్ళును దుమురులైన యెముకలును బ్రోవులైన ప్రేవులును నలిసిన మేనులును నలిసిన జానువులును నొగిలిన వర్మంబులును బగిలినచర్మంబులును వికలంబులయిన సకలావయవంబులును వికీర్ణంబు లయిన కర్ణంబులును విచ్ఛిన్నంబు లయిన నయనంబులును వెడలు రుధిరంబులును బడలుపడు బలంబులును గొండలవడువునంబడు మాంసఖండంబులును వాచఱచు కొఱప్రాణంబులును వ్రాలిన తేరులును గూలిన [6]కరులును నొఱలిన గుఱ్ఱంబులును దెరలిన కాలుబలంబులును గలిగి [7]పలల ఖాదన కుతూహల జనిత మదాంధీభూతపిశాచఢాకినీ భూత భేతాళ సమాలోల కోలాహల భయంకరారావబంధీకృత సకలదిశావకాశంబయి సంగరాంగణంబు భీషణం బయ్యె నయ్యవసరంబున. 418

చ. శరకుముదంబు లుల్లసితచామర ఫేనము లాతపత్త్ర భా
సురనవపుండరీకములు శోణితతోయము లస్థిసైకతో
త్కరము భుజాభుజంగమసికాయము కేశకలాపశైవల
స్ఫురణరణాంగణం బమరెఁ బూరితశోణనదంబుపోలికన్. 419

---

1. కుఠారము = గొడ్డలి. 2. సురియలం = చూరకత్తులచే. 3. ముసలంబులు = రోఁకళ్ళు, 4. పరిఘంబులన్ = బాణములను, 5. పట్టిసము = అడ్డకత్తి. 6. కరులు = ఏనుఁగులు. 7. పలలఖాదన...జనిత = మాంసము తినుటయందు పుట్టిన సంతోషము.

వ. అట్టియెడ బాణుండు కట్టలుకం గృష్ణునిపైఁ దనరథంబుఁ జఱపించి యఖర్వబాహాసహస్రదుర్వారగర్వాటోప ప్రదీప్తుండై కదిసి. 420

మ. ఒక [1]యేనూఱుకరంబులన్ ధనువు లత్యుగ్రాకృతిం దాల్చి త
క్కక యొక్కొక్కట [2]సాయకద్వయము పెక్కంబూన్చునాలోన నం
దకహస్తుండు తదుగ్రచాపచయ విధ్వంసంబుఁ గావించి కొం
జక తత్సారథిఁ గూలనేసి రథముం జక్కాడి శౌర్యోద్ధతిన్. 421

తే. [3]ప్రళయజీమూతసంఘాత భయద భూరి
భైరవారావముగ నొత్తెఁ బాంచజన్య
మఖిలజనులు భయభ్రాంతులై చలింపఁ
గడఁగి నిర్భిన్నరాక్షసీగర్భముగను. 422

వ. అట్టి యవక్రవిక్రమ పరాక్రమంబునకు వెగడుపడి బాణుండు [4]లేట
మొగంబువడి సేయునది లేక విన్ననయియున్నయెడ. 423

సీ. అత్తఱిఁ గోటర యను బాణజనయిత్రి
సుతుఁ గాచుమతము సన్మతిఁ దలంచి
వీడి శిరోజముల్ వ్రేలంగ నిర్ముక్త
[5]పరిధాన యై [6]మురాసురవిభేది
యెదురనిల్చినఁ జూడ మదిఁ జాలరోసి ప
రాఙ్ముఖుండై యున్న ననువు వేచి
తల్లడించుచు బాణుఁ డుల్లంబు గలఁగంగఁ
దలచీర వీడ యాదవులు నవ్వ

తే. నవ్యకాంచనమణిభూషణములు రాలఁ
బాదహతి నేలఁ గంపింపఁ బాసి యాత్మ
పురము వడిఁజొచ్చె నప్పుడు భూతగణము
లాకులతతోడ నెక్కడే నరుగుటయును. 424

క. శిరములు మూఁడును ఘనభీ
కరపదములు మూఁడు గలిగి కనలి మహేశ

1. ఏనూఱు = అయిదునూర్లు 2. సాయకద్వయము = రెండుబాణములు. 3. ప్రళయజీమూతసంఘాత = ప్రళయకాల మేఘసమూహము. 4. లేటమొగము = తిరుగుమొగము. 5. పరిధానము = పైవస్త్రము. 6. మురాసురవిభేది = కృష్ణుఁడు.

జ్వర ముఖఘోరాకృతితో
నరుదేరఁగఁ జూచి కృష్ణుఁ | డల్లన నగుచున్. 425

చ. పరువడి వైష్ణవజ్వరముఁ | బంచిన నయ్యుభయజ్వరంబులున్
[1]వెరవును [2]లావుఁ జేవయును | వీరము బీరము గల్గి ఘోర సం
గర మొనరింప నందు గిరి | శకంఠకృతజ్వర ముగ్రవైష్ణవ
జ్వరమునకోడి పాఱె నశి | వారణ వైష్ణవి వెంట నంటఁగన్. 426

తే. పాఱి యేదిక్కుఁ గానక | ప్రాణభీతి
నెనసి యేడ్చుచు హృషీ | కేశుపాద
కంజములఁ బడి ననుఁ గావు | కావు మనుచు
నిటలతటఘటితాంజలి | పుటయు నగుచు. 427

వ. ఇట్లు వినుతించె. 428

సీ. అవ్యయు ననఘు న | నంతశక్తిని బరు
లైనట్టి బ్రహ్మరు | ద్రామరేంద్ర
వరుల కీశ్వరుఁ డైన | వాని సర్వాత్మకు
జ్ఞానస్వరూపు న | జ్ఞానరహితు
వరదుని జగదుద్భ | వస్థితిసంహార
హేతుభూతుని హృషీ | కేశు నభవు
బ్రహ్మచిహ్నంబులై | పరఁగు సుజ్ఞాన శ
క్త్యాదుల నొప్పు బ్ర | హ్మంబు నీశు

ఆ. నజు [3]షడూర్మి రహితు | నిజయోగ మాయా వి
మోహితాఖిలాత్ము | ముఖ్యచరితు
మహితతేజు [4]నాద్య | మధ్యాంతహీనునిఁ
జిన్మయాత్ము నిను భ | జింతుఁ గృష్ణ. 429

వ. అదియునుంగాక లోకంబున దైవం బనేక ప్రకారంబులై యుండు, నది యెట్టిదనినం గళా కాష్ఠా ముహూర్తంబు లనంగల కాలంబును

1. వెరవు = యుక్తి. 2. లావు = బలము. 3. షడూర్మి = ఆకలి, ఆశ, శోకము, మోహము, ముసలితనము, మరణము అనునవి. 4. ఆదిమధ్యాంతహీను = మొదలు మధ్య చివరలు లేనివాని.

సుకృత దుష్కృతానుభవరూపంబులైన జీవకర్మంబులును స్వభావంబును సత్త్వరజస్తమోగుణాత్మకంబైన ప్రకృతియును సుఖదుఃఖాశ్రయంబైన శరీరంబును జగజ్జంతు నిర్వాహకంబైన ప్రాణంబును సకల పదార్థపరిజ్ఞానకారణంబైన యంతఃకరణంబును మహదహంకార శబ్ద స్పర్శ రూప రసగంధ తన్మాత్ర తత్కార్యభూత గగన పవనానల సలిల ధరాది పంచభూతంబులు నాదిగాఁగల ప్రకృతి వికారంబులును నన్నింటి సంఘాతంబును బీజాంకురన్యాయంబునం గార్యకారణ రూప ప్రవాహంబునునై జగత్కారణశంకితంబై యుండునది యంతయు భవదీయమాయావిడంబనంబు గాని యున్నదికాదు, తదీయ మాయానివర్తకుండవైన నీవు నానావిధ దివ్యావతారాది లీలలం జేసి దేవగణంబులను సత్పురుషులను లోకనిర్మాణచణులైన బ్రహ్మాదులను బరిరక్షించుచు లోకహింసాప్రవర్తకులైన దుష్టమార్గగతులం గ్రూరాత్ముల హింసించుచుందువు, విశ్వ విశ్వంభరాభార నివారణంబు సేయుటకుఁగదా భవదీయ దివ్యావతారప్రయోజనంబు గావున నిన్ను శరణంబు వేఁడెద. 430

సీ. శాంతమై మహిత తీ♦క్ష్ణ దుస్సహంబై యు
దారమై వెలుఁగొందు ♦ తావకీన
భూరిభాస్వత్తేజ♦మునఁ దాపమొందితిఁ
గడుఁ గృశించితి నన్నుఁ ♦ గరుణఁజూడు
మితరదేవోపాస్తి ♦ రతి మాని నీపాద
కమలముల్ సేవించు ♦ విమలబుద్ధి
యెందాఁక మదిఁ దోఁప ♦ దందాఁక నేకదా
ప్రాణులు నిఖిల తాప♦ములఁ బడుట

తే. యవిరళానన్యగతికుల ♦ నరసి ప్రోచు
బిరుదుగల నీకు ననుఁగాచు ♦ టరుదె దేవ
ప్రవిమలాకార సంసార ♦ భయ విదూర
భక్తజనపోష పరితోష ♦ పరమపురుష. 431

చ. అనినఁ బ్రసన్నుఁడై హరి యనంతుఁడు దైత్యనిభేది దాని కి
ట్లనియె మదీయసాధన మసహ్యనివారణ మాట నీమదిం
గని [1]నను నార్తిఁ జొచ్చితివి కావున మజ్జ్వరతీవ్రదాహ వే
దన నినుఁ బొంద దింకఁ బరితాపము దక్కుము నీమనంబునన్.

వ. అని మఱియు నప్పుండరీకాక్షుం డిట్లను, నెవ్వరేనియు నీయుభయ
జ్వరవివాదంబును నీవు మత్ప్రపత్తిం జొచ్చుటయుఁ జిత్తంబులం
దలంతు రట్టి పుణ్యాత్ములు శీతోష్ణజ్వరాదితాపంబులం బొరయ
రని యానతిచ్చిన నమ్మహేశ్వరజ్వరంబు పరమానందభరితహృద
యంబయి యా రథాంగపాణికి సాష్టాంగదండప్రణామం బాచరించి
నిజేచ్ఛం జనియె, నంత బాణాసురుండు నక్కడ. 433

—♦ బాణాసురుఁడు రెండవసారి యుద్ధమునకు వచ్చుట ♦—

సీ. కమనీయకింకిణీ ఘంటికాసాహస్ర
ఘణఘణధ్వనిచేత గగన మగల
నన్యజనాలోక నాభీలతరలోగ్ర
కాంచనధ్వజపతాకలు వెలుంగఁ
[2]బృథునేమిఘట్టనఁ బృథివి కంపింపంగ
వల నొప్పఁ బటు జవాశ్వములఁ బూన్చి
నట్టి యున్నతరథం బత్యుగ్రగతి నెక్కి
కరసహస్రమున భీకరతరాసి

తే. శరశరాసనముఖదివ్య సాధనములు
దనరఁ జలమును బలమును నుత్కటము గాఁగ
హర్ష మిగురొత్తఁ గయ్యంపు టాయితమునఁ
బురము వెలువడె బలిపుత్త్రుఁ [3]డురుజవమున. 434

క. చని రణభూమిని మధ్యందినమార్తాండప్రచండ దీప్తాకృతితోఁ
దనరుచుఁ [4]బరిపంథిబలేంధనదవశిఖియైన కృష్ణుఁ దాకెం బెలుచన్

ఉ. తాఁకి భుజావిజృంభణము దర్పము నేర్పును నేర్పడంగ నో
క్కూఁకున వేయుచేతుల మహోగ్రశరావళి పింజ పింజతోఁ

1. నను నార్తిఁజొచ్చితివి = నన్ను శరణుపొందితివి. 2. పృథునేమి ఘట్టనన్ = గొప్పచక్రములతాఁకుడుచే. 3. ఉరుజవమున = అతివేగముగ. 4. పరిపంథి బలేంధనము = విరోధి బలమనెడికట్టెలకు దావాగ్ని వంటివాఁడు.

దాఁకఁగ జేసినన్ మురవిదారుఁడు తోడన తచ్ఛరావళి
న్నాఁక గొనంగఁ ద్రుంచె నిశితార్ధశశాంక శిలీముఖంబులన్.

వ. అంత. 437

చ. నుతనవపుండరీకనయనుండన నొప్పు మురారి రోష ఘూ
ర్ణిత మహితారుణాబ్జదళనేత్రుఁడు దానటు పంచెదైత్యుపై
దితిసుతకానన ప్రకర దీపితశుక్రము రక్షితాంచితా
శ్రితజనచక్రమున్ సతతసేవితశక్రము దివ్యచక్రమున్. 438

వ. మఱియును బ్రచండమార్తాండమండలప్రభావిడంబితంబును భీషణ శతసహస్రకోటిదంభోళినిబిడ నిశిత ధారా సహస్ర ప్రభూత జ్వాలన జ్వాలికాపాస్తసమస్తకుటిలపరిపంథిదుర్వార బాహాఖర్వగర్వాంధకారంబును సకలదిక్పాలదేవతాగణ జేగీయమానంబును సమద దానవజనశోకకారణ భయంకరదర్శనంబును సముచితసజ్జనలోక ప్రియంకరస్పర్శనంబును నగు సుదర్శనం బసురాంతకప్రేరితంబై చని యారామకారుండు కదళికాకాండంబుల నేర్చుచందంబునం బేర్చి సమదవేదండశుండాదండంబుల విడంబించుచు కనకమణి వలయ కేయూరకంకణాలంకృతంబునగు తదీయ[1] బాహాసహస్రంబుఁ [2]గరచతుష్టయావశిష్టంబుగాఁ దునుము నవసరంబున. 439

—♦ శివుఁడు బాణుని రక్షింప శ్రీకృష్ణుని స్తుతించుట ♦—

తే. [3]కాలకంఠుఁడు బాణుపైఁ గరుణ గలఁడు
గాన యఖిలాండపతిఁ గృష్ణుఁ గదియవచ్చి
పురుషసూక్తంబు చదివి [4]సంపుటకరాబ్జుఁ
డగుచుఁ బద్మాయతాక్షు నిట్లని నుతించె. 440

వ. దేవా నీవు బ్రహ్మస్వరూపంబగు జ్యోతిర్మయుండవు నిఖిల వేద వేదాంత నిగూఢుండవు నిర్మలుండవు సమానాధిక రహితుండవు సర్వవ్యాపకుండవైన నిన్ను నిర్మలాంతఃకరణులైనవారలాకాశంబు

1. బాహాసహస్రంబు = వేయిబాహువులు. 2. కరచతుష్టయావశిష్టము = నాలుగుచేతులు మిగులునటుల. 3. కాలకంఠుఁడు = నలుపు కంఠముగలవాఁడు (ఈశ్వరుఁడు). 4. సంపుటకరాబ్జుఁడగుచు = దోసిలి పట్టినవాఁడై.

పగిది నవలోకింతు, రదియునుంగాక పంచోపనిషన్మయంబయిన భవదీయ దివ్యమంగళ మహావిగ్రహ పరిగ్రహంబు సేయునెడ నాభియందాకాశంబును ముఖంబునం [1]కృశానుండును శిరంబున స్వర్గంబును శ్రోత్రంబుల దిశలును నేత్రంబుల సూర్యుండును మనంబునఁ జంద్రుండును పాదంబుల వసుంధరయు నాత్మయందహంకారంబును జఠరంబున [2]జలధులును రేతంబున [3]నంబువులును భుజంబుల నింద్రుండును రోమంబుల మేఘమహీరుహౌషధి వ్రాతంబులును శిరోజంబుల బ్రహ్మలును జ్ఞానంబున సృష్టియు నవాంతర ప్రజాపతులును హృదయంబున ధర్మంబును గలిగి మహాపురుషుండవై లోకకల్పనంబుకొఱకు నీయకుంఠిత తేజంబు గుప్తంబుసేసి జగదుద్భవంబుకొఱకుఁ గైకొన్న భవదీయ దివ్యావతార వైభవంబెఱింగి నుతింపనెంతవారము, నీవు సకలచేతనాచేతన నిచయంబులకు నాద్యుండవు నద్వితీయుండవు పురాణ పురుషుండవు సకలసృష్టి హేతుభూతుండవు నీశ్వరుండవు [4]దినకరుండు [5]కాదంబినీ కదంబావృతుండగుచు భిన్నరూపుండై బహువిధచ్ఛాయలం దోఁచువిధంబున నీ యఘటిత ఘటనానిర్వాహకంబైన సంకల్పంబునఁ ద్రిగుణాతీతుండవయ్యును సత్త్వాదిగుణ విధానంబుల ననేకరూపుండవై గుణవంతులైన సత్పురుషులకుఁ దమోనివారకంబైన దీపంబురూపంబునం బ్రకాశించుచుందువు. భవదీయ మాయావిమోహితు లయిన జీవులు పుత్త్రిదారగృహక్షేత్రాది సంసారరూపంబైన పాపపారావార మహావర్తగర్తంబున మునుంగుచుం దేలుచుందురు, దేవా భవదీయదివ్యరూపానుభవంబు సేయంజాలక యింద్రియ పరతంత్రుండై భవత్పాద సరసీరుహంబులఁ జేరనెఱుంగని మూఢాత్ముం డాత్మవంచకుండనంబడు, విపరీతబుద్ధిం జేసి ప్రియుండవైన నిన్నొల్లక యింద్రియార్థానుభవంబు సేయుట యమృతంబు మాని హాలాహలంబు సేవించుటగాదె. జగదుదయ పాలన లయ లీలాహేతువై శాంతుండవయి సుహృజ్జన భాగధేయుండవై సమానాధిక వస్తుశూన్యుండవైన

1. కృశానుండు = అగ్నిహోత్రుఁడు. 2. జలధులును = సముద్రములును, 3. అంబువులును = ఉదకములును, 4. దినకరుండు = సూర్యుండు 5. కాదంబినీ = మేఘపంక్తి.

నిన్ను నేనును బ్రహ్మయుం బరిణతాంతఃకరణులైన మునిగణంబు
లును భజియించుచుందుము. మఱియును, 441

తే. అవ్యయుండ వనంతుండ వచ్యుతుండ
వాదిమధ్యాంతశూన్యుండ వఖిలధృతివి
నిఖిలమం దెల్ల వర్తింతు నీవు దగిలి
నిఖిల మెల్లను నీయంద నెగడుఁ గృష్ణ. 442

సీ. అని సన్నుతించిన హరి యాత్మ మోదించి
మొగమునఁ జిఱునవ్వు మొలకలెత్త
లలిత బాలేందుకళామౌళి కిట్లను
శంకర నీమాట సత్య మరయ
నేది నీ కిష్టమై యొసఁగెదు దాని
వేఁడుము నీకిత్తు వీఁ [1]డవధ్యుఁ
డది యెట్టి దనినఁ బ్రహ్లాదుండు మద్భక్తుఁ
డతనికి వరము నీ [2]యన్వయమున

తే. జనన మందినవారలఁ జంప ననుచు
గడఁక మన్నించితిని నది కారణముగ
విశ్వవిశ్వంభరాభార విపులభూరి
బలభుజాగర్వ మడఁపంగ వలయుఁ గాన. 443

క. కరములు నాలుగు చిక్కం బరిమార్చితి వీఁడు నీదుభక్తుల కగ్రే
సరుఁడై పొగడొంది జరామరణాదిభయంబుఁ దక్కి మనునిటమీఁదన్.

వ. అని యానతిచ్చిన నంబికావరుండు సంతుష్టాంతరంగుం డయ్యె,
నబ్బలినందనుం డట్లు రణరంగవేదిం గృష్ణదేవతాసన్నిధిం బ్రజ్వలిత
చక్రకృశానుశిఖాజాలంబులందు నిజబాహాసహస్రశాఖాసమిత్ప్రచ
యంబును దత్తతోద్వేలకీలాలమహితాజ్యధారాశతంబును బర
భయంకర వీర హుంకార మంత్రంబుల తోడ వేల్చి పరిశుద్ధిం
బొంది విజ్ఞాన దీపాంకురంబున భుజాఖర్వ గర్వాంధకారంబు నివా
రించె ననవరత పూజిత స్థాణుండగు నబ్బాణుండు భుజవనవిచ్ఛేద

1. అవధ్యుఁడు = వధింపఁదగనివాఁడు. 2. అన్వయము = వంశము.

జనిత విరూపిత స్థాణుండయ్యును దదీయవరదాన కలితానందహృద
యారవిందుండగుచు గోవింద చరణారవిందంబులకుఁ బ్రణామంబు
లాచరించి యనంతరంబ. 415

—♦ ఉషానిరుద్ధసహితుండై కృష్ణుండు ద్వారకాపురంబున కరుగుట ♦—

క. పురమున కేఁగి యుషాసుందరికిని ననిరుద్ధునకుముదంబున భూషాం
బర దాస దాసికాజన । వరవస్తువితాన మొసఁగి వారని భక్తిన్.

క. [1]కనకరథంబున నిడికొని । ఘనవైభవ మొప్పఁగన్యకాయుక్తముగా
ననిరుద్ధుని గోవిందుం । [2]డనుమోదింపంగఁ దెచ్చి యర్పించె నృపా.

ఉ. అంత మురాంతకుండు త్రిపురాంతకు వీడ్కొని బాణునిల్పి య
త్యంతవిభూతిమై నిజ దళావలితోఁ జనుదేర నా యుషా
కాంతుఁడు మున్నుగాఁ బటహ కాహళ తూర్యనినాద పూరితా
శాంతరుఁడై వెసం జనియె నాత్మపురీముఖుఁడై ముదంబునన్.

మ. కనియెన్ గోపకుమారశేఖరుఁడు రంగత్ఫుల్లరాజీవ కో
కనదోత్తుంగ తరంగసంగత లసత్కాసారకన్ భూరి శో
భన నిత్యోన్నతసౌఖ్యభారకను శుంభద్వైభవోదారకన్
జనసంతాప నివారకన్ సుజన భాస్వత్తారకన్ ద్వారకన్.

వ. కని డాయం జని పురలక్ష్మి కృష్ణసందర్శనకుతూహలయై చేసన్నలం
జీరుచందంబున నందంబు నొందు నుద్ధూత తరళ విచిత్ర కేతుపతా
కాభిశోభితంబును [3]మహనీయ మరకతతోరణ మండితంబును గనక
మణివినిర్మితగోపురసౌధప్రాసాదవీథికావిలసితంబును మౌక్తికవితాన
విరచిత మంగళవల్లీ విరాజితంబును శోభనాకలిత విన్యస్త కదళికా
స్తంభ సురభి కుసుమమాలికాక్షతాలంకృతంబును [4]కుంకుమసలిల
సిక్తవిపణిమార్గంబును శంఖదుందుభిభేరీమృదంగ పటహ కాహళాది
మంగళారావకలితంబును వందిమాగధ సంగీత ప్రసంగంబును నై

1. కనకరథంబున = బంగారు రథమున. 2. అనుమోదింపఁగన్ = సంతోషించఁగా. 3. మహనీయ......తంబును = గొప్పమరకత మాణిక్య తోరణములచే నలంకరింపఁబడినదియు. 4. కుంకుమ సలిల ...... ర్గంబును = కుంకుమ జలముచేఁ దడుపఁబడిన బజారువీథిగలదియు.

యతిమనోహర విభవాభిరామం బైన యప్పురవరంబు సచివపురోహితసుహృద్బాంధవముఖ్యులెదురుకొన [1]భూసురాశీర్వాదంబులను బుణ్యాంగనాకరకలిత పవిత్రాక్షతలనుగైకొనుచుం గామినీమణులు కర్పూర నీరాజనంబులు నివాళింపం బ్రవేశించి నిజమందిరంబున కేఁగి యప్పుండరీకాక్షుండు పరమానందంబున సుఖంబుండె నంత.

క. శ్రీకృష్ణునివిజయం బగు|నీకథఁ బఠియించువారి కెప్పుడు జయముం
గైకొనియిహపరసౌఖ్యము|నాకల్పోన్నతి వహింతు రవనీనాథా.

క. అని చెప్పినశుకయోగికి|జననాయకుఁ డనియెఁగృష్ణ చరితమువిననా
మనమెప్పుడుఁ [2]దనియదింకను|వినవలతుంగరుణఁజెప్పవే మునినాథా.

వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండిట్లనియె. 453

—— నృగమహారాజు చరిత్రము ——

సీ. ధరణీశ యొకనాఁడు హరితనూజులు రతీ
శ్వరసాంబసారణ చారు భాను
లాదిగా యదుకుమారావలి యుద్యాన
వనమున కతివైభవమున నేఁగి
వల నొప్ప నిచ్చానువర్తులై సుఖలీల
జరియించి ఘనపిపాసలను జెంది
[3]నెఱిదప్పి సలిల మన్వేషించుచును వేగ
వచ్చుచో నొకచోట [4]వారిరహిత

తే. కూపమును నందులో నొక కొండవోలె
విపుల మగు మేని [5]యూసరవెల్లిఁ గాంచి
చిత్తముల విస్మయం బంది తత్తరమున
దాని వెడలించువేడుకఁ దగులుటయును. 454

చ. పరువిడి పోయి తెచ్చి ఘన పాశచయంబుల సంటఁ గట్టి య
గ్గురుభుజు లందఱుం గదిసి కో యని యార్చుచుదాని నెమ్మెయిం

1. భూసురాశీర్వాదంబులు = బ్రాహ్మణుల దీవనలు. 2. తనియదు = తృప్తి పొందదు. 3. నెఱిదప్పి = క్రమము తప్పి. 4. వారిరహిత కూపమును = నీరులేని బావిని. 5. ఊసరవెల్లి = ముదిరినతొండ.

దరలఁగ దీయ లేక దగ దట్టముగా మది దుట్టగిల్ల నొం
డొరుఁ గడవంగ వేచని [1]పయోరుహనాభున కంతఁ జెప్పినన్.

చ. విని సరసీరుహాక్షుఁ డతి విస్మితుఁడై జలశూన్యకూప మ
ల్లన కదియంగ నేగి [2]కృకలాసము నొక్క తృణంబుఁ బోలె గొ
బ్బున వెడలించె వామకర పద్మమున న్నది యంతలోనఁ గాం
చనరుచి మేనఁగల్గు పురుషత్వముతోఁ బొడసూపి నిల్చినన్. 456

వ. చూచి కృష్ణుం డతని వృత్తాంతం బంతయు నెఱింగియు నక్కడి జనం
బులుం గుమారవర్గంబును దెలియుకొఱకు నతనిచేతఁ దద్వృత్తాంతం
బంతయు నెఱిఁగించువాఁడయి యిట్లనియె. 457

చ. కన దురు రత్నభూషణ నికాయుఁడవై మహనీయమూర్తివై
యనుపమకీర్తి శోభితుఁడవై విలసిల్లుచు ధాత్రిమీఁదఁ బెం
పొనరిన నీకు నేమిగతి నూసరవెల్లితనంబు చొప్పడెన్
విన నిది చోద్యమయ్యె సువివేకచరిత్ర యెఱుంగఁ జెప్పుమా.

క. అని యడిగిన మురరిపుపద
వనజంబులఁ దనకిరీటవర మణు లొరయన్
వినయమున మ్రొక్కి యిట్లను
ఘనమోదముతోడ నిటలఘటితాంజలియై. 459

తే. విశ్వసంవేద్య మహిత యీ విశ్వమందుఁ
బ్రకటముగ నీ వెఱుంగని దొకటి గలదె
యైన నాచేత విన నిష్టమయ్యె నేని
నవధరింపుము వినుపింతు [3]నంబుజాక్ష. 460

శా. ఏనిక్ష్వాకుతనూజుఁడన్ నృగుఁడనా నేపారు భూపాలుఁడన్
దీనవ్రాతము నర్థిఁ బ్రోచుచు ధరిత్రీనాయకుల్ గొల్వ స
మ్మానింపం జతురంతభూభరణసామర్థ్యుండనై సంతత
శ్రీనిండారినవాఁడ నల్లసిత కీర్తి స్ఫూర్తి శోభిల్లఁగన్. 461

1. పయోరుహనాభునకు = పద్మము బొడ్డునఁ గలవానికి. (విష్ణువునకు)
2. కృకలాసము = తొండ. 3. అంబుజాక్ష = పద్మదళములవంటి నేత్రములు గలవాఁడ!

చ. పలుకులఁ దన్నుఁదాఁబొగడఁ ♦ బాతక మందు రటుండెఁ దారకా
వలి [1]సికతావ్రజంబు [2]హిమవారికణంబులు లెక్కపెట్టఁగా
నలవడుఁగాని నే ను [3]వసుధామరకోటికి దానమిచ్చు గో
వుల గణుతింప ధాతయును ♦ నోఁపడు మాధవ యేమి సెప్పుదున్. 463

వ. అదియునుంగాక.

చ. పొలుచు [4]సువర్ణశృంగ ఖురముల్ దనరం దొలుచూలులై సువ
త్సలు గల పాఁడియావుల నుదాత్త తపోవ్రత వేదపాఠముల్
గలిగి కుటుంబులై విహిత ♦ కర్మములం జరియించు పేదవి
ప్రులకు సదక్షిణంబుగ విభూతి దలిర్పఁగ నిత్తు నచ్యుతా. 464

వ. మఱియు న్యాయసముపార్జిత విత్తమ్ముల గోభూహిరణ్యరత్ననివాస
రథహస్తివాజికన్యా సరస్వతీ వస్త్ర తిల కాంచన రజిత శయ్యాది
బహువిధదానంబు లనూనంబులుగా ననేకంబులు సేసితిఁ [5]బంచమహా
యజ్ఞంబు లొనరించితి వాపీకూప తటాక వననిర్మాణంబులు సేయిం
చితి నివ్విధంబునం జేయుచో నొక్కనాఁడు. 465

క. అనఘా మునుపడఁ గశ్యపుఁ డను విప్రునకే నకల్మషాత్ముఁడనై యి
చ్చినగోవు దప్పి నామందను గలసినఁ దెలియ లేక ♦ తగ నాగోవున్.

క. ఒండొక [6]భూమిసురకులమండనునకు దానమిచ్చి ♦ మసలక యావి
ప్రుండాగోవుంగొనిచనుచుండన్ మునుధారగొన్న ♦ యుర్వీసురుడున్

క. మదిరోష మొదవ దోవతిఁ వదలి నఁబిగియించుకొనుచు ♦ వచ్చియిదియనా
[7]మొదవు నడిపీథిఁ దొంగిలి వదలక కొనిపోయె దిట్టి ♦ వారుం గలరే.

చ. అనవుఁడు నాతఁ డిట్లనియె ♦ నాతనితో నృపు డేను దీని నీ
జనపతిచేత ధారగొని ♦ సాధుగతిం జన నీది యంట వె
ట్లనిన నతండు నేనును ధరాధిపుచే మును ధారగొన్న యా
వని వినిపింప నిద్దరకు ♦ నన్యో న నేక వివాద మచ్చుటన్. 469

---

1. సికతావ్రజంబు = ఇసుకసమూహము. 2. హిమవారికణంబులు = మంచు నీటిబిందువులు. 3. వసుధామరకోటికి = బ్రాహ్మణసముదాయమునకు. 4. సువర్ణ శృంగఖురముల్ = బంగారు కొమ్ములు డెక్కలు. 5. పంచమహాయజ్ఞంబులు = దేవ, పితృ, బ్రహ్మ, అతిథి, భూతయజ్ఞములు. 6. భూమిసుర...నునకు = బ్రాహ్మణశ్రేష్ఠునకు. 7. మొదవు = పాడియావు.

వ. ఇట్లు విప్రు లిద్దఱుం దమలో నంతకంతకు మచ్చరంబునఁ బెచ్చు
పెరిఁగి కలహించి నా యున్న యెడకుం జనుదెంచి మున్నునాచేత
గోదానంబు గొన్న బ్రాహ్మణుం డిట్లనియె. 470

సీ. మనుజేంద్ర ప్రజ లధర్మ । ప్రవర్తనముల
నడవ కుండఁగ నాజ్ఞ । నడపు నీవు
మనమున నేధర్మ । మని యాచరించితి
మును నాకు నిచ్చిన । మొదవు దప్పి
వచ్చి నీమందలోఁ । జొచ్చిన నిప్పుడీ
భూసురునకు ధార । వోసి యిచ్చి
[1]తగవుమాలితివి దా । తవు నపహర్తవు
నైన ని న్నేమందు । నవనినాథ

తే. యనిన మాటలు చెవులు సోఁ । కినఁ గలంగి
భూసురోత్తము యజ్ఞాన । పూర్వకముగ
నిట్టి పాపంబు దొరసె నే । నెఱిఁగి సేయఁ
గొనుము నీకిత్తు నొకలక్ష । గోధనంబు. 471

క. అనిమఱియునునవ్విప్రుని।సునయోక్తులననునయించు।చునునిట్లంటిన్
ననుగావునరకకూపం।బునఁబడఁగాఁజాలఁబుధ।పుంగవయనుచున్.

తే. ఎంత వేఁడిన మచ్చరం । బంత పెరిఁగి
మొదల నాకిచ్చినట్టి యీ । మొదవె కాని
యెనయ నీరాజ్యమంతయు । నిచ్చితేని
నొల్లనని విప్రుఁ డచ్చట । నుండ కరిగె. 473

వ. అట్లు తం డరిగిన నా రెండవ బ్రాహ్మణుని బ్రార్థించిన నతండును
జలంబు డింపక పదివేలేటి కోఁటిన పాఁడిమొదవుల నిచ్చిననైనను
దీనిన కాని యొల్లనని నిలువక చనియె, నంతఁ గాలపరిపక్వం బైన
నన్ను దండధర కింకరులు గొనిపోయి [2]వైవస్వతు ముందటం బెట్టిన
నతండు నన్ను నుద్దేశించి యిట్లనియె. 474

1. తగవుమాలితివి=న్యాయము విడిచినావు. 2. వైవస్వతుఁడు=యముఁడు.

మ. మనుజేంద్రోత్తమ వంశపావన జగన్మాన్య క్రియాచార నీ
ఘనదాన క్రతు ధర్మముల్ త్రిభువనఖ్యాతంబులై చెల్లెడిన్
మును దుష్కర్మఫలంబునొంది పిదపం బుణ్యానుబంధంబులై
చను సౌఖ్యంబులఁబొందు పద్మజునియాజ్ఞం ద్రోవఁగావచ్చునే.

వ. అని వేగంబున [1]ద్రొబ్బించిన నేను బుడమిం బడునపుడ యీనికృష్టం బయిన యూసరవెల్లిరూపంబుఁ గైకొంటి నింతకాలంబు తద్దోష నిమిత్తంబున నిద్దురవస్థం బొందవలసెఁ బ్రాణులకుఁ బుణ్యపాపంబులు [2]ననుభావ్యంబులు గాని యూరక పోనేరవు నేఁడు [3]సమస్తదురిత నిస్తారకం బయిన భవదీయపాదారవింద సందర్శనంబునం జేసియీ ఘోరదుర్దశలం బాసి నిర్మలాత్మకుండనైతి నని పునఃపునః ప్రణామంబు లాచరించి మఱియు నిట్లనియె. 476

ఆ. కృష్ణ వాసుదేవ కేశవ పరమాత్మ
యప్రమేయ వరద హరిముకుంద
నిన్నుఁ జూడఁ గంటి నీకృపఁ గనుఁగొంటి
నఖిలసౌఖ్యపదవు లందఁగంటి. 477

వ. అని యనేకభంగులం గొనియాడి గోవిందుని పాదారవిందంబులు దనకిరీటంబు సోకం బ్రణమిల్లి దేవా భవదీయ పాదారవిందంబులు నా హృదయారవిందంబునం బాయకుండునట్లుగాఁ బ్రసాదింపవే యని తదనుజ్ఞాతుండై యచ్చటిజనంబులు సూచి యద్భుతానందంబులం బొంద నతుల తేజోవిరాజిత దివ్యవిమానారూఢుండై దివంబునకరిగె నంత నమ్మాధవుండు నచ్చటనున్న పార్థివోత్తములకు ధర్మబోధంబుగా నిట్లనియె. 478

సీ. నరనాథకులకాననము దహించుటకును
నవనీసురులవిత్త మగ్నికీల
జననాయకుల నిజైశ్వర్యాబ్ధి నింకింప
బ్రాహ్మణక్షేత్రంబు [4]బాడబంబు

1. ద్రొబ్బించిన = పడఁద్రోసిన, 2. అనుభావ్యంబులు = అనుభవింపఁదగినవి. 3. సమస్తదురితనిస్తారకంబు = సమస్తపాపంబులు పోగొట్టునవి. 4. బాడబంబు = బడబానలము.

పార్థివోత్తముల సంకీర్ణచ్ఛైలములఁ గూల్చు
భూసురధనము [1]దంభోళిధార
జగతీవరులకీర్తిచంద్రిక మాప వి
ప్రోత్తముధనము సూర్యోదయంబు

తే. విప్రతతిసొమ్ము కంటెను విషము మేలు
గరళమునకును బ్రతికృతి గలదుగాని
దానిమాన్పంగ భువి నౌషధములు లేవు
గాన బ్రహ్మస్వములు గొంట గాదు పతికి. 479

క. ఎఱుఁగమినైనను భూసురవసులధనం బపహరింప వలవదు పతికిన్
మఱపున నసనము ముట్టిన దరికొని వెసఁగాల్చు కున్నె తను వెరియంగన్

వ. మఱియును దనధనంబు పరులచేతఁ గోల్పడిన విప్రుండు దుఃఖమున రోదనంబు సేయ నురలిన యశ్రుకణంబుల నవనిరేణువు లెన్ని తడియు నన్నివేలేండ్లు తనుపేక్షాపరుండైన పతి దారుణవేదనలు గల కుంభీపాకనరకంబులం బొందు మఱియు నతనితోడఁ గ్రిందటఁ బదితరంబులవారును మీఁదటఁ బదితరంబులవారును బొందుదురు స్వదత్తంబైన బరదత్తంబైన [2]నర్థలోభంబునం జేసి దుశ్శీలుండై బ్రాహ్మణక్షేత్రసంభూతధాన్య ధనాదికంబుభుజించు నప్పాపాత్ముం డఱువదివేల సంవత్సరంబులు మలకూపంబులం గ్రిమిరూపంబున వర్తించునట్లగుట యెఱింగి విప్రుండెంత తప్పుచేసిన నెన్నికొట్టిన నెన్ని దిట్టిన నతని కెదురుపలుకక వినయంబున వందనం బాచరించు పుణ్యాత్ములు నాదుపాలింటివా రదియునుంగాక యేనును బ్రతిదినంబును భూసురుల నతివినయంబున బూజింతు నిట్లు సేయక విపరీతవర్తనులైన తామసుల నేను వెదకి దండింతు నదిగావున మీరలు బ్రాహ్మణజనంబులవలనం బరమభక్తిగలిగి మెలంగుడని యానతిచ్చి యాదవప్రకరంబులు సేవింప నఖిలలోక శరణ్యుండైన యప్పుండరీకాక్షుండు నిజనివాసంబునకుం జనియెనని చెప్పి శుకుం డిట్లనియె. 481

1. దంభోళిధార = వజ్రాయుధపువాయి. 2. అర్థలోభంబునం = ధనమందలి ఆశచే.

క. ఈ కథఁ జదివిన వారలుఁ
గైకొని వినువారు [1]విగతకలుషాత్మకులై
లౌకిక సౌఖ్యము నొందుదు
రా [2]కైవల్యంబుఁ గరతలామలక మగున్. 482

— బలరాముండు సుహృద్బంధుజన దర్శనార్థమై వ్రేపల్లెకుఁ బోవుట —

సీ. నరనాథ విను మొకనాఁడు [3]తాలాంకుండు
చుట్టాల బంధులఁ జూచువేడ్క
సుందర కాంచనస్యందనారూఢుఁడై
భాసిల్లుచున్న వ్రేపల్లెకరిగి
చిరకాలసంగతస్నేహులై గోపగో
పాంగనానికర మాలింగనములు
సముచితసత్కృతుల్ సలుపఁగైకొని మహో
త్సుకలీల నందయశోదలకును

తే. వందనం బాచరించిన వారు మోద
మంది బిగియారఁ గౌఁగిళ్ల నొందఁ జేర్చి
సమత దీవించి యంకపీఠమునఁ జేర్చి
శిరము [4]మూర్కొని [5]చుబుకంబు గరము పుణికి. 483

వ. మఱియు నానందబాష్పధారాసిక్తకపోలయుగళంబుతోడం గుశల
ప్రశ్నంబుగా నిట్లని రన్నా నీవును నీచిన్నితమ్ముండగు వెన్నుం
డును లెస్సయి యున్నవారె మమ్మెప్పుడు నరసి రక్షింపవలయు
మాకు [6]నేడుగడయు మీరకాక యొరులు గలరే యని సముచిత
సంభాషణంబులం బ్రొద్దుపుచ్చుచుండ నంత. 484

క. గోపాలవరులు ప్రమదం । బాపోవనిమది నివర్తితాఖిలగేహ
వ్యాపారులగుచు హలధరు । శ్రీపాదంబులకు నతులఁ జేసిరి వరుసన్.

1. విగతకలుషాత్మకులై = పోయిన పాపములుగలవారై. 2. కైవల్యంబు = మోక్షము. 3. తాలాంకుండు = బలరాముఁడు. 4. మూర్కొని = వాసనచూచి. 5. చుబుకంబు = గడ్డము. 6. ఏడుగడయు = రక్షించుట. 7. హాలధరుని = బలరాముని.

క. [1]సీరియు వారికిఁ గరుణోదారుండై నడపె సముచిత క్రియ లంతం
గోరి తనయీడు గోపకుమారులఁ గ్రీడించె బలుఁడు కనుపక్రమతుఁడై

క. నిజసుందర దేహద్యుతి । రజతాచలకుచములఁ దెగడ రాముఁడు వారల్
భజియింప నేఁగి యొకచో । విజనస్థలమున వసించి విలసిల్లు నెడన్

కవి. చరణములం గనకస్ఫుటనూపుర జాలముల్ గల్లనుచుం జెలఁగం ।
గరములఁ గంకణముల్ మొరయన్ నటి కౌ[2] [3]నసియాడఁ గుచా
గ్రములన్ । సరులు నటింపఁ గురుల్ గునియన్ విఖన్మణికుండల
కాంతులు వి।స్ఫురిత కపోలములన్ బెరయన్ వ్రజసుందరు లంద
ఱమందగతిన్. 488

కవి. చని బలభద్రుని శౌర్యసముద్రుని సంచితపుణ్యు నగణ్యునిఁ జం
దన [4]ఘనసార [5]పటీరతుషారసుధారుచికాయు విధేయు [6]సుధా
శనరిపుఖండను సన్మణిమండను సారవివేకు నశోకు మహా
త్మునిఁ గని గోపిక లోపిక లేక యనుప్రభు నిట్లని రుత్కలికన్.

చ. హలధర నీసహోదరుఁ డుదంచితకంజవిలోచనుండు స
ల్లలిత పురాంగనా జన విలాస విహారసమగ్ర సౌఖ్యముల్
గలిగి సుఖించునే మము నొకానొక వేళనయేని బుద్ధిలోఁ
దలఁచునొ నూతనప్రియులఁ దారొకని యేమి ఋఁబల్కకుండునో.

క. జననీజనకుల ననుజుల । దనుజుల బంధువుల మిత్రకేతుల విడిచి నె
మ్మనమున నొండుదలంపక । తమునమ్మిన వారివిడువఁ దగునె హరికిన్.

సీ. [7]సలలితయామున సైకతస్థలముల
నుండి మమ్మేమని యూఱడించె
విమల బృందావనవీథి మా [8]చుబుకముల్
బుడుకుచు నేమని బుజ్జగించెఁ
బుష్పవాటికలలోఁ బొలుచు మా కుచయుగ్మ
మంటుచు నేమని యాదరించెఁ

1. సీరియు = బలరాముఁడు. 2. కౌను = నడుము. 3. ఉసియాడన్ = చలింపఁగా. 4. ఘనసారము = కర్పూరము. 5. పటీరము = గంధము. 6. సుధా ... మండనున్ = రాక్షససంహారిని. 7. సలలి......స్థలములన్ = చక్కని యమునానది యిసుక తిన్నెలమీఁద. 8. చుబుకముల్ = గడ్డములు.

గాసారముల పొంతఁ § గౌఁగిట మముఁజేర్చి
నయ మొప్ప నేమని § నమ్మబలికె

తే. నన్నియు మఱచెఁ గాఁబోలు § నెన్నఁడాత్మ
గోరి తా జాయఁగా నైన § వారి విడుచు
నట్టి కృష్ణుఁడు తము బట్టు § నెట్టు ననక
యేలనమ్మిరి పురసతుల్ § బేల లగుచు. 492

మ. అని యిబ్భంగి సరోజలోచనుని న § ర్మాలాపముల్ నవ్వులు
న్ననుబంధుల్ పరిరంభణంబులు రతి § వ్యాసంగముల్ భావముల్
వినయంబుల్ సరసోక్తులుం దలఁచి యు § ద్విఘ్నారుచిత్తంబులన్
జనితానంగశరాగ్నిచేత దురవ § స్థం బొంది శోకించిరన్. 493

వ. అంత బలభద్రుండు వారలమనంబుల సంతాపంబులు వాయ
నుపాయంబు లగు సరసచతుర వచనంబులఁ గృష్ణుని సందేశంబులు
చెప్పి విగతఖేదలం జేసి యచ్చట మాసద్వయంబు నిలిచి వసంత
వాసరంబులు గడపుచుఁ గాళిందీతీరంబున. 494

సీ. [1]మాకంద జంబీర § మందార ఖర్జూర
ఘనసార శోభిత § వనములందు
[2]నేలాలతాలోల § మాలతీమల్లికా
వల్లీమతల్లికా § వాటికలను
దరళతరంగశీ § కరసాధుశీతల
[3]సైకతవేదికా § స్థలములందు
మకరందరసపాన § మదవదిందిందిర
పుంజరంజిత మంజు § కుంజములను

తే. విమలరుచి గల్గు సానుదే § శములయందు
లలిత శశికాంతఘనశిలా § తలములందు
లీల నిచ్ఛావిహార వి § లోలుఁ డగుచు
సుందరీ జనములు గొల్వఁ § జూడ నొప్పె. 495

1. మాకందజంబీర = మామిడి, నిమ్మ. 2. ఏలాలతా = ఏలకుల తీగ.
3. సైకతవేదిక = ఇసుకతిన్నె.

తే. అట్లు విహరింప వరుణుని యాజ్ఞఁ జేసి
వారుణీదేవి మద్యభావంబు నొంది
[1]నిఖిలతరుకోటరములందు నిర్గమించి
మించు వాసనచేత వాసించె వనము. 496

వ. అట్టియెడ. 497

మ. కర మొప్పారు నవీన వాసనల నాఘ్రాణించి గోపాల సుం
దరులుం దానును డాయ నేగి యతిమోదం బొప్ప సేవించి యా
తరళాక్షుల్ మణిహేమకంకణ ఝణత్కారానుకారంబులై
కరతాళంబులు మ్రోయఁ బాడుచును వేడ్కన్ నానాసుచర్యన్ సోలుచున్

సీ. తనమీఁది బిరుదాంకితములైన గీతముల్
పాడుచు రా బలభద్రుఁ డంత
మహిత కాదంబరీ మధుపాన మదవిహ్వ
లాక్షుండు లలిత నీలాలకుండు
నాలోలనవపుష్పమాలికోరస్స్థలుఁ
డనుపమమణికుండలాంచితుండు
ప్రాలేయసంయుక్త పద్మంబుగతి నొప్పు
సలలితానన ఘర్మజలకణుండు

తే. నగుచు వనమధ్యమున సలీలావగాహ
శీలుఁడయి జలకేళికిఁ జేర యమున
నిందు రమ్మని పిలువఁ గాళింది యతని
మత్తుఁ డని [2]సడ్డ సేయక మసలుటయును. 499

చ. ఘనకుపితాత్ముఁడై యమునఁ గన్గొని రాముఁడు పల్కె డాయఁ జీ
రినఁ జనుదేక తక్కితి [3]పురే నిను నిందఱుఁ జూడ మద్భుజా
[4]సునిశితలాంగలాగ్రమున సొంపఱ నిప్పుడు నూఱుత్రోవలై
చన వెసఁ జించివైతునని చండపరాక్రమ మొప్ప నుగ్రుఁడై.

1. నిఖిలతరుకోటరములు = అన్ని చెట్లతొఱ్ఱలు. 2. సడ్డసేయక = లక్ష్యము చేయక. 3. పురే = బాపురే. 4. సునిశితలాంగలాగ్రమునన్ = వాడియైననాగేటి కొనచేత.

వ. అట్లు కట్టలుక రాముం డుద్దామంబగు బాహుబలంబున హలంబు సాఁచి యమ్మహావాహినిం దగిల్చి పెకలి రాఁ దిగిచిన నన్నది భయభ్రాంతయై సుందరీరూపంబు గైకొని యతిరయంబునం జనుదెంచి యయ్యదువంశతిలకుండగు హలధరుని పాదారవిందంబులకు వందనం బాచరించి యిట్లనియె. 501

మ. బలరామా ఘనబాహ నీయతులశుంభద్విక్రమం బంగనల్
తెలియం జాలెడివారె యీయఖిల ధాత్రీభార ధౌరేయ ని
శ్చలసత్త్వుండగు [1]కుండలీశ్వరుఁడునుం జర్చింప నీ సత్కళా
కలితాంశప్రభవుండు నీగురుభుజాగర్వంబు సామాన్యమే. 502

చ. అని వినుతించి యేను భవదంఘ్రిసరోజము లాశ్రయించెదన్
ననుఁ గరుణింపు మన్న యదునందనుఁ డన్నదిఁ బాప్వమార్గనై
చను మని కామినీనికరసంగతుఁడై జలకేళి సల్పె నిం
పెనయఁ [2]గరేణుకాయుత మదేభము చాడ్పున నమ్మహానదిన్.

తే. అంత జలకేళి సాలించి సంతసంబు
నందుచుండ వినీల వస్త్రాదిరత్న
మండనంబులుఁ గాంచన మాలికయును
దెచ్చి హలికిచ్చి చనె నా నదీలలామ. 504

క. అవి యెల్లఁ దాల్చి హలధరుఁ
డవిరళగతి నొప్పి వల్లవాంగనలును దా
దివిజేంద్రుఁ బోలి మహితో
త్సవమున వర్తించుచుండె సౌఖ్యోన్నతుఁడై. 505

క. అవనీశ యిట్లు హలమునఁ దివిచిన కాళింది వ్రయ్యె దెలుపై నేఁడున్
భువినుతికెక్కెను రాముని ప్రవిపులతరమైన బాహుబలసూచకమై.

వ. అంత బలభద్రుండు వ్రజసుందరీసమేతుండై నందఘోషంబునం బరితోషంబు నొందుచుండె నంత నక్కడఁ గరూశాధిపతి యైన పౌండ్రకుండు తన దూతం బిలిచి యిట్లనియె. 507

1. కుండలీశ్వరుఁడు = శేషుఁడు. 2. కరేణుకా...చాడ్పున = ఆడేనుఁగుతోఁ గూడిన మదించిన మొగ యేనుఁగువలె.

—♦ శ్రీకృష్ణుండు పౌండ్రకవాసుదేవునిమీఁద దండెత్తిపోయి వానిఁ జంపుట ♦—

సీ. మనుజేశ బలగర్వమున మదోన్మత్తుఁడై
యవనిపై వాసుదేవాఖ్యుఁడ నఁగ
నే నొక్కరుఁడఁ గాక యితరుల కీనామ
మలవడునే యని యదటు మిగిలి
తెగి పౌండ్ర వాసుదేవుఁడు ననుకొను
నఁట పోయి వలదను మనుచు దూతఁ
బద్మాయతాక్షునిపాలికిఁ బొమ్మన్న
నరిగి వాఁ డంబుజోదరుఁడు పెద్ద
తే. కొలువుఁ గైకొని యుండఁ సంకోచపడక
వినుము మాఱాజు మాటగా వనజనాభ
యవని రక్షింప వాసుదేవాఖ్య నొంది
నట్టి యే నుండ సిగ్గు వోఁ దట్టి నీవు. 508

క. నాపేరును నాచిహ్నము। లేపున ధరియించి తిరిగెదిది పంతమె యిం
తే పో మదిఁ బరికించిన । నేపంత మెఱుంగు గొల్లఁడేమిట నైనన్

ఆ. ఇంతనుండి యైన నెదిరిఁ దన్నెఱిఁగి నా
చిన్నె లెల్ల విడిచి చేరికొలిచి
బ్రతుకు మనుము కాక పంతంబు లాడెనా
యెదురు మనుము [1]ఘోరకదనమునకు. 510

క. అను దుర్భాషలు సభ్యులు
విని యొండొరు మొగముచూచి విస్మితు లగుచున్
జనులార యెట్టి క్రొత్తలు
వినఁబడియెడు నిచట లెస్స వింటిరె యనఁగన్. 511

వ. అట్టియెడఁ గృష్ణుండు వాని కిట్లనియె. 512

మ. వినరా మీనృపుఁ డన్న చిహ్నములు నే వే వచ్చి ఘోరాజిలోఁ
దనమీఁదన్ వెస నైవఁ [2]గంకముఖ[3]గృధ్రవ్రాతముల్ మూఁగఁగా

1. ఘోరకదనమునకు=భయంకర యుద్ధమునకు. 2. కంకముఖ = రాబందులు
3. గృధ్రములు = గ్రద్దలు.

నవిత్రో దర్పము దూలి కూలి వికలంబై [1]సారమేయాళికి
న్నవనయంబుల్ శరణంబ చయ్యెదను మే నన్నట్లుగా వానితోన్.

క. అని యుద్రేకముగా నాడినమాటల కులికి వాఁడు డెందము గలఁగం
జని తన మేలిక కంతము వినిపించెను నతనిమదికి విరసముగ దురన్.

వ. అంతఁ గృష్ణుండు దండయాత్రోత్సుకుండై వివిధాయుధకలితంబును
విచిత్రకాంచన పతాకాకేతు విలసితంబును నగు సుందరస్యందనంబు
బటుజవతురంగంబులఁ బూన్చి దారుకుండు దెచ్చిన నెక్కి యతి
త్వరితగతిం గాశికానగరంబున కరిగినం బౌండ్రకుండును రణోత్సా
హంబు దీపింప నక్షౌహిణీ ద్వితయంబుతోడం బురంబు వెడలె నప్పు
డతని మిత్రుండైన కాశీపతియును మూఁ డక్షౌహిణులతోడం దోడు
పడువాఁడై వెడలె ని[2]ట్లాప్తయుతుండై వచ్చువాని. 515

సీ. చక్రగదా శంఖ శార్ఙ్గాది సాధనుఁ
[3]గృత్రిమకౌస్తుభ శ్రీవిలాసు
మకరకుండల హార మంజీర కంకణ
మణిముద్రికా వనమాలికాంకుఁ
దరళ విచిత్ర పతంగపుంగవ కేతు
జెలువొందు పీతకౌశేయవాసు
జవనాశ్వకలిత కాంచన రథారూఢుని
రణకుతూహలు లసన్మణికిరీటు

తే. [4]నాత్మసమవేషు రంగవిహారకలిత
నటసమానునిఁ బౌండ్రభూనాథుఁ గాంచి
హర్ష మిగురొత్త నవ్వేఁ బద్మాయతాక్షుఁ
డంత వాఁడును నుద్వృత్తుఁ డగుచు నడరి. 516

క. పరిఘ శరాసన పట్టిస శర ముద్గర ముసల కుంత చక్రగదాతో
మర భిండివాల శక్తి [5]క్షురికాసి ప్రాసపరశు శూలముల వెసన్.

1. సారమేయాళికిన్ = కుక్కల గుంపునకు. 2. ఆప్తయుతుండై = మిత్రులతోఁ గూడినవాఁడై. 3. కృత్రిమకౌస్తుభము = అబద్ధపు కౌస్తుభము. 4. ఆత్మసమవేషు = తనవేషముతో సమానమైన వేషముగలవాఁడు. 5. క్షురిక = మంగలకత్తి.

చ. పరువడి నైచినన్ దనుజభంజనుఁ డంత యుగాంతకాల భీ
కర మహితోగ్రపావకుని కైవడి నేచి విరోధిసాధనో
త్కరముల నొక్కటన్ [1]శరనికాయములన్ నిగిడించి త్రుంచి భా
స్వరగతి నొత్తె సంచలితశాత్రవసైన్యముఁ బాంచజన్యమున్.

ఉ. వారనియుల్కతోఁ గినిసి వారిజనాభుఁడు వారిసైన్యముల్
మారి మసంగినట్లు నుఱుమాడినఁ బీనుఁగుఁ బెంటలై వెసం
దేరులు వ్రాలె నశ్వములు ద్రెళ్ళె గజంబులు మ్రొగ్గె సద్భటుల్
ధారుణిఁ గూలి రిట్లు నెఱిదప్పిచనెన్ హతశేష సైన్యముల్.

వ. అట్టియెడ రుధిర ప్రవాహంబులును మేదోమాంస పంకంబులునై సంగరాంగణంబు ఘోరభంగి యయ్యె నయ్యవసరంబున గయ్యంబునకుఁ గాలుద్రవ్వు నప్పౌండ్రకునిం గనుంగొని హరి సంబోధించి యిట్లనియె.

మ. మనుజేంద్రాధమ పౌండ్రభూపసుత నీమానంబు బీరంబు నేఁ
డనిలో మాపుదు నెద్దు క్రొవ్వి పిలుచ న్నాఁబోతుపై ఱంకె వై
చినచందంబున దూతచేత నను నాక్షేపించి వల్దన్న పే
రును జిహ్నంబులు నీపయిన్ విడుతు [2]నర్చుల్ పర్వ నేఁడాజిలోన్.

క. అది గాక నీకు శరణము | పదపడి యేఁ జొత్తు నీవు బలవిక్రమ సం
పదగలపోటరి వేనియుఁ | గదలక నిలుమనుచు [3]నిశితకాండములంతన్

మ. చల మొప్పన్ నిగిడించి వానిరథముం జక్కాడి తత్సారథిం
దల వే త్రుంచి హయంబులన్ నఱికి యుద్దండ ప్రతాపక్రియం
బ్రళయార్క ప్రతిమానచక్రమున నప్పౌండ్రున్ వెసం ద్రుంప వా
డిలఁ గూలెం [4]గులిశాహతిం నొరగు శైలేంద్రాకృతిన్ భూవరా.

చ. మడవక కాశికావిభుని [5]మస్తక ముద్ధతిఁ ద్రుంచి బంతికై
వడి నది పింజపింజగఱవన్ విశిఖాళి నిగిడ్చి వాని యే
లెడిపురిలోన వైచె నవలీల మురాంతకుఁ డిట్లు వైరులం
గడఁగి జయించి చిత్తమునఁ గౌతుకముం జిగురొత్త నత్తఱిన్.

---

1. శరనికాయములన్ = బాణసమూహములను. 2. అర్చుల్ పర్వ = కాంతులు వ్యాపింపగా. 3. నిశితకాండముల్ = వాడి బాణములు. 4. కులిశాహతిన్ = వజ్రాయుధపు దెబ్బ 5. మస్తకము = శిరస్సు.

క. సురగంధర్వనభశ్చర। గరుడోరగసిద్ధసాధ్యగణమునుతింపన్
మరలిచనుదెంచి హరినిజ। పురమునసుఖముండెనతి విభూతిదలిర్పన్

క. వనజోదరుచిహ్నంబులు। గొనకొనిధరియించిపౌండ్రకసుతుమచ్చరియై
¹యనవరతముహరిదనతలఁ। పునఁగలుగుటఁజేసిముక్తిబొందెనరేంద్రా

సీ. అక్కడఁ గాశిలో నారాజుమందిరాం
గణమునఁ గుండలకలిత మగుచుఁ
బడి యున్న తలఁ జూచి పౌరజనంబులు
దమరాజుతల యని తగ నెఱింగి
చెప్పిన నానృపు జీవితేశ్వరులును
సుతులు బంధువులును హితులుఁ గూడి
మొనసి హాహాకారమున నేడ్చి రత్తఱిఁ
²దత్తనూభవుఁడు సుదక్షిణుండు

తే. వెలయఁ దండ్రికి బరలోకవిధు లొనర్చి
జనకు ననిలో వధించిన చక్రపాణి
³నడరి మర్దింపఁ దగు నుపాయంబు దలఁచి
చతురుఁడగునట్టి తన పురోహితునిఁ బిలిచి. 527

క. అతఁడుం దానును జని పశు
పతి పదసరసిజములకును బ్రమదముతో ⁴నా
నతుఁడయి యద్దేవుని బహు
గతులం బూజింప నతఁడు కరుణాన్వితుఁడై. 528

క. మెచ్చితి నేవర మైనను। నిచ్చెద నను వేఁడుమనిన నీశ్వర నిన్నున్
నచ్చినరక్షింతువు⁵పార। పాచ్చెము సేయక మహేశ పురహరయభవా

క. దేవా మజ్జనకుని వసుదేవాత్మజుఁ డాజిలో వధించెను నే నా
గోవిందుని ననిలోపల నేవిధమున గెలుతు నానతీవె పురారీ.

తే. అనిన శంకరుఁ డతనికి ననియె ననఘ
నీవు ఋత్విజులును భూసురావలియును

1. అనవరతము = ఎల్లప్పుడు. 2. తత్తనూభవుఁడు = వానికుమారుఁడు.
3. అడరి=విజృంభించి 4. ఆనతుఁడయి=నమస్కరించినవాఁడై. 5. పారపాచ్చెము = కపటము, న్యూనత.

ప్రీతి [1]నభిచార మొనరింప భూతయుక్తుఁ
డగుచు ననలుండు దీర్పు నీ కభిమతంబు, 531

తే. అనిన నాచంద్రవదనాళి వాక్యములభంగి
భూరినియమముతో నభిచార హోమ
మొనరఁ గావింప నగ్ని యథోచితముగఁ
జెలఁగి [2]దక్షిణావలమాన శిఖల వెలిఁగె. 532

వ. అందుఁ [3]దామ్రశ్మశ్రు కేశ కలాపంబులును [4]నశనిసంకాశంబులైన నిడుద కోఱలును నిప్పులుప్పతిల్లు చూడ్కులును ముడివడిన బొమలును జేవురించిన మొగంబును గలిగి కృత్య యతిరౌద్రాకారంబునఁ బ్రజ్వరిల్లుచుఁ గుండంబు వెలువడి యనుదిన [5]నిహన్యమాన ప్రాణి రక్తారుణ మృత్యుకరవాలంబు లీలం జూపట్టు నాలుకను సెలవుల నాకికొనుచు నగ్ని కీలాభీలంబగు శూలంబు కేలందాల్చి భువన కోలాహలంబుగా నార్చుచు నుత్తాలతాల ప్రమాణ పాదద్వయాహతులం దూలు పెంధూళి నింగి ప్రమింగ భూతంబులు సేవింప [6]నగ్నవేషయై నిజవిలోచన సంజాత సముద్భూత నిఖిల భయంకర జ్వాలికా జాలంబుల దిశాజాలంబు నోలిఁ బ్రేలుచు నుద్వేగ గమనంబున నగధరునగరంబున కరుగుదేరఁ బౌరజనంబులు భయాకుల మానసులై దావదహనునిం గని పఱచు వనమృగంబుల చాడ్పునం బఱచి సుధర్మాభ్యంతరంబున జూదంబాడు దామోదరుం గని రక్షరక్షేతి రవంబుల నార్తులయి కృష్ణకృష్ణ పెనుమంటలం బురంబు గాల్పం బ్రళయాగ్ని చనుదెంచె నన వారిం జూచి వోడకోడకుఁడని భయంబు నివారించి సర్వరక్షకుండైన పుండరీకాక్షుండు జగదంతరాత్ముండు గావునఁ దద్వృత్తాంతంబంతయుఁ దనదివ్యచిత్తంబున నెఱింగి కాశిరాజపుత్త్రప్రేరితమైన యమ్మహాకృత్యను నిగ్రహింపం దలంచి నిజపార్శ్వవర్తియై యున్న యద్దివ్యసాధనంబుఁ గనుంగొని యప్పుడు. 533

1. అభిచారము = హింసార్థమైన హోమము. 2. దక్షిణావలమాన = కుడిప్రక్కకుతిరిగిన 3. తామ్రశ్మశ్రుకేశకలాపంబులు = ఎఱ్ఱని మీసములు, జుట్టు సముదాయములును. 4. అశని సంకాశంబులై = పిడుగుతో సమానములై 5. నిహన్యమాన = చంపఁబడిన 6. నగ్నవేషయై = దిగంబరియై.

సీ. భీమమై బహుళిఖాధామమై హతరిపు
స్తోమమై సుమహితోద్దామమగుచుఁ
జండమై విజితమార్తాండమై పాలితా
జాండమై విజయ ప్రకాండ మగుచు
దివ్యమై నిఖిలగంతవ్యమై సుజన సం
భావ్యమై సద్భక్త సేవ్యమగుచు
నిత్యమై నిగమసంస్తుత్యమై వినమితా
దిత్యమై నిర్జితదైత్య మగుచు

తే. [1]విలయ సమయ సముద్భూత విపులభాస్వ
దళికలోచన లోచనానలసహస్ర
ఘటిత పటు సటాజ్వాలికా జటిల సర్వ
భయదచక్రంబు కృత్యపైఁ బంపె శౌరి. 534

వ. అదియును బ్రళయవేళాసంభూత [2]జీమూత సంఘాత ప్రభూత ఘుమ ఘుమాటోపనినదాధరీకృత మహోదుస్సహ కహకహ నిబిడ నిస్వన నిర్ఘోష పరిపూత బ్రహ్మాండ కుహరంబును [3]నభ్రంలిహ కలా సముత్కట పటుచిటచిట స్ఫుటస్ఫుట ద్విస్ఫులింగ విసరంబునుసకల దేవతాగణ జయజయశబ్దకలితంబును ననంత తేజోవిరాజితంబును నగుచుం గదిసినం బంటింపక కంటగించుకృత్తినిగెంటి వెంటనంటిన నది తన తొంటిరౌద్రంబు విడిచి మడిచి కాశీపురంబుసొచ్చి పౌర లోకంబు భయాకులతం బొంది వాపోవ రోషభీషణాకారంబుతో నప్పుడు [4]ఋత్విజ్ఞికాయయుతంబుగా సుదక్షిణుని దహించె, నత్తఱిఁ జక్రంబును దన్నగరంబు సౌధప్రాకారగోపు[5]రాట్టాలకాది వివిధవస్తువాహన నికరంబులతో భస్మంబుగావించి మరలి యమ రులు వెఱఁగందఁ గమలలోచన పార్శ్వవర్తియై నిజప్రభావంబు వెలుఁగొందఁ గొల్చియుండె ననిచెప్పి మఱియు నిట్లనియె. 535

1. విలయ......చక్రంబు = ప్రళయమునఁబుట్టి విస్తరించు ప్రకాశించు వేల కొలఁది శిఖనికంటిమంటలతోఁ గూడి వృద్ధిపొందిన జడలవంటి జ్వాలలతో దట్టమై యెల్లరకు భయముకలిగించు చక్రాయుధమును. 2. జీమూతసంఘాత = మేఘసమూహము. 3. అభ్రంలిహ = ఆకాశము నొరయుచున్న. 4. ఋత్విజ్ఞికాయయుతంబుగా = ఋత్విక్సమూహముతోఁగూడ. 5. అట్టాలకములు = బురుజాలు.

క. మురరిపు విజయాంకిత మగు
చరితము సద్భక్తిఁ దగిలి ✽ చదివిన విన్నన్
దురితములఁ బాసి జను లిహ
పరసౌఖ్యము లతనిచేతఁ ✽ బడయుదు రధిపా. 536

వ. అనిన శుకయోగికి రాజయోగి యిట్లనియె. 537

—♦ బలరాముఁడు ద్వివిదుఁ డను వానరుని సంహరించుట ♦—

క. బలభద్రుఁ డప్రమేయుం
డలఘుఁ డనంతుండు నతని ✽ యద్భుతకర్మం
బులు వినియుఁ దనియ దింకను
దెలియఁగ నానతిమ్ము ✽ దివ్యమునీంద్రా. 538

వ. అనిన రాజునకు శుకుం డిట్లనియె. 539

క. జననాయక విను సుగ్రీ
వునిసచివుఁడు మైందునకు స✽హోదరుఁ డనఁగా
వినుతికి నెక్కిన ద్వివిదుం
డను [1]ప్లవగుఁడు నరకసఖ్యుఁ ✽ డతిదర్పితుఁడై. 540

సీ. చెలికానిపగఁ దీర్పఁ ✽ దలఁచి కృష్ణుండేలు
పురములు జనపదం✽బులు దహించి
సరిదుపవనసరో✽వరములు [2]గోరాడి
మందలఁ [3]గొందల✽ మందఁ జేసి
ప్రాసాదములు ద్రొబ్బి ✽ [4]పరిఘలు మాయించి
చతురంగబలముల ✽ సమయఁ జేసి
పురుషుల సతులను ✽ భూధరగుహాలలోఁ
బెట్టి వాకిలి గట్టి ✽ బిట్టు నొంచి
తే. ఫలితతరువులఁ ద్రుంచి సా✽ధుల నలంచి
కోట లగలించి పడుచుల ✽ నీట ముంచి
ధరణి నిబ్బంగిఁ బెక్కు బా✽ధలఁ జలంబు
పరఁగఁ జేయుచు నొకనాఁడు ✽ ప్లవగవరుఁడు. 541

1. ప్లవగుఁడు = కోఁతి. 2. గోరాడి = చిందరవందరజేసి. 3. కొందలము = క్షోభము. 4. పరిఘలు = కందకములు.

క. చతురమృదుగీతరవము । న్నతిపై తెంచినఁ జెలంగి నగచరుఁడా రై
వతగిరి[1]కందరమున కా । యతగతిఁ జనియందు నెత్తమాడెడువానిన్.

చ. లలితవినీలవస్త్రుని విలాసవతీయుతుఁ జాంద్రచంద్రికా
కలితమహోన్నతాంగు మణికాంచన దివ్యవిభూషణోన్నతున్
విలసిత[2]వారుణీసమదవిహ్వలలోచనుఁ గాంచె [3]సీర ని
ర్దళిత రిపుక్షితీశ నిజధాముని రాముని గామపాలునిన్. 543

సీ. కనుఁగొని తత్పురోగమభూమిరుహశాఖ
లెక్కి యూఁచుచుఁ జాల వెక్కిరించుఁ
గికురించుచును బండ్లిగిల్చి చూపుచు వెసఁ
గొమ్మకొమ్మకు నుఱుకుచు నదల్చు
దోఁక నూరక మేనసోఁకఁగ నులివెట్టు
వెడ వెడ నాలుక వెడలఁ బెట్టు
[4]బరుల నఖంబుల గిర గిర గోఁకుచుఁ
బారిఁ బారి ఫలములు గఱచి వైచు

తే. గోళ్ళు తెగఁ గోర్కి యుమియును గుదము సూపు
బలసి మర్కటజాతి యిప్పగిదిఁ జూపఁ
గోపమున హాలధరుఁ డొక గుండు వైవ
దానిఁ దప్పించుకొని ప్రల్లవమున నతని. 544

క. నగి [5]యాసవకలశముఁ గొని । జగతీరుహశాఖ యెక్కి చాపలమున న
జ్జగతిపయి వైచెఁ దద్ఘట । మగలఁగ నది చూచి కోపమగ్గలమొదవన్.

వ. మఱియును. 546

క. సీరిని దనమనమున నొక । చీరికిఁ గైకొనక కదిసి చీరలు చింపన్
వారక తఁడు భువిజనముల । గారించుట మాన్పఁదలఁచి ఘనకుపితుండై.

వ. ఇట్లు కోపోద్దీపితమానసుండయి కనుంగొని హాలాయుధుం డప్పుడు.

---

1. కందరము = గుహ. 2. వారుణి = మద్యము. 3. సీరనిర్దళిత...ధాముని = నాఁగటిచేఁ జీల్చివేయఁబడిన శత్రురాజుల నివాసములు కలవాఁడు. 4. బరులు = ప్రక్కలు. 5. ఆసవకలశము = మద్యపాత్ర.

చ. ముసలముఁ దీవ్రశాతహలమున్ ధరియించి [1]సమస్తచేతన
గ్రసనమునాఁడు పొంగు లయకాలునిభంగి నదల్చి నిల్వ వాఁ
డసదృశ విక్రమక్రమ విహార మెలర్ప సమీపభూజమున్
వెసఁ బెకలించి [2]మస్తకము వ్రేసెఁ జలంబు బలంబు చొప్పడన్.

వ. ఇట్లు వ్రేయ బలుం డప్పుడు. 550

చ. ఉరవడి దండతాడిత మహోరగుభంగి గడంగి పేర్చి సా
గరమున నేచి హేమకటకంబుల నొప్పు సునందనామ భీ
కరముసలంబునన్ ద్వివిదు కంఠము వ్రేసినఁ బొల్చెవాఁడు జే
గురు గల కొండచందమునఁ గోయని యార్చి సురల్ నుతింపగన్

మత్త. అంత వాఁ డొక యింతమూర్ఛిలి యంతలోఁ దెలివొంది దు
ర్దాంత భూరి భుజా విజృంభణుఁడై మహీజముఁ బూన్చి దై
త్యాంతకాగ్రజు వ్రేసె వ్రేసిన నాగ్రహంబున దాని సిం
తింతలై ధర రాలఁ జేసె నహీనవిక్రమశాలి యై. 552

క. మఱియును జల ముడుగక వెసఁ
దరుచరుఁ డొక తరువు వ్రేయఁ [3]దాలాంకుం డా
తరువును దునిమిన వెండియుఁ
దొరఁగించెఁ గుజంబు లతఁడు దోడ్తోఁ దునుమన్. 553

క. ఆచందంబున వనచరుఁ
డేచి మహీరుహచయంబు లెల్లను హలిపై
వైచి యవి శూన్య మగుటయుఁ
జూచి శిలావృష్టిఁ గురిసె సుర లగ్గింపన్. 554

క. బలుఁ డపుడు ఱాలు దుమురై
యిలరాలఁగఁ జేసి యార్వ నే పుడుగక యా
[4]వలిముఖుఁడు [5]తాలసన్నిభ
ములయిన నిజబాహుదండముల నుగ్రుండై. 555

1. సమస్తచే...నాఁడు = ప్రళయదినమునందు. 2. మస్తకము = శిరస్సు. 3. తాలాంకుఁడు = బలరాముఁడు. 4. వలిముఖుఁడు = వానరుఁడు. 5. తాలసన్నిభములయిన = తాటిచెట్లతో సమానమైన.

క. వడిఁబిడుగువోని పిడికిటఁ
బొడిచిన వడి సెడక బలుఁడు ♦ ముసలము హలమున్
విడిచి ప్లవంగుని మెడఁ గడు
వెడ వెడ బిగియించె గ్రుడ్లు ♦ వెలి కుఱుకంగన్. 556

క. వదనములఁ జెవుల రుధిరము
మెదడును దొరఁగంగ వాఁడు ♦ మేదినిమీఁదం
జదికిలఁబడి యొకయింతయు
మెదలక [1]మిడుకంగలేక ♦ మృతిఁబొందె నృపా. 557

తే. వానిపాటున కప్పుడు ♦ వనసమేత
మగుచు నా శైలరాజ మగ్గల్లలాడె
సురగణంబులు రాముపై ♦ [2]సురభికుసుమ
వృష్టిఁ గురియించి రతుల సంతుష్టి మెఱసి. 558

వ. ఇవ్విధంబున భువనకంటకుం డయిన [3]దుష్టశాఖామృగేంద్రుని వసుంధరకుం బలిసేసి సకలజనంబులు పరమానంద కందళిత హృదయారవిందులై తన్ను నందింప నయ్యాదునందనుండు నిజనగరంబునకరుగుదెంచె నని శుకుండు వెండియు నమ్మనుజపతి కిట్లనియె. 559

—♦ బలరాముండు హస్తినాపురమును గంగలోఁ ద్రోయఁబూనుట ♦—

సీ. కోరి సుయోధను ♦ కూఁతురు సర్వల
క్షణములు గల్గి లక్షణ యనంగ
మహి నొప్పు కన్యకామణి వివాహంబునఁ
జక్రహస్తుని తనూజాతుఁ డయిన
సాంబుండు ఘనసాహసమున నెత్తుకపోవ
గౌరవుల్ వీక్షించి ♦ కడఁగి క్రొవ్వి
పొడుచు వాఁ డొకఁ డదె ♦ బాలికఁ గొనిపోవు
చున్నాఁడు గైకొను ♦ కుక్కఁ బిగిలి

1. మిడుకుట = త్రుళ్ళుట. 2. సురభికుసుమవృష్టిన్ = పరిమళ పుష్పవర్షము. 3. దుష్టశాఖామృగేంద్రుని = దురాత్ముఁడైన వానరుని.

తే. యిట్టి దుర్మదుఁ గయిముట్టి పట్టి తెచ్చి
జనులు వెఱఁగందఁ జెఱఁబట్టి యునిచితేని
యదువులు మనల నేమి సేయంగఁ గలరొ
యనుచు గురువృద్ధజనముల యనుమతమున. 560

వ. ఇట్లు గడంగి యుద్ధసన్నద్ధులై బల శౌర్యోపేతులగు కర్ణ శల్య భూరి
శ్రవోయజ్ఞకేతు సుయోధనాదులు సమున్నత రథారూఢులై కూడ
నరిగిన వారలం గనుంగొని జాంబవతీనందనుండు మందస్మితవదనార
విందుం డగుచు సింగంబుభంగి గర్జించుచు మణిదీప్తం బైనచాపంబుఁ
బూని నిల్చిన వారును సాంబు నదల్చి నిలు నిలు మని. 561

తే. [1]చండకోదండముక్త నిశితశాత విశిఖ
జాలమందంద పఱప యతిభీలముగను
నందనందన నందన స్యందనంబు
ముంచి రచలేంద్రమును మంచు ముంచుపగిది. 562

వ. మఱియును. 563

శా. శౌర్యాటోపవిజృంభణంబుల సరోజాతాక్షు సూనున్ సురా
హార్యస్థైర్యుని మీఱ నేయ నతఁ డవ్యగ్రదుర్వారి బాహా బలా
వార్యుండై [2]శితసాయకాలి నవి మాయంజేసినన్ దేవతా
[3]తూర్యంబుల్ దివి మ్రోసె నంత నతఁ డస్తోకప్రతాపోన్నతిన్.

వ. ఇట్లు గడంగి బాణజాలంబులు పరఁగించి యందఱ కన్నిరూపులై
రథరథ్య సూతధ్వజ పతాకాతపత్త్రంబులు చూర్ణంబులుగావించి
విరథులంజేసి వారల మెయిమఱువు లఱువుళ్ళు గావించి యొక్కొ
క్కనిఁ బెక్కు బాణంబుల నచ్చిపోనేసిన వారలు [4]శోణితదిగ్ధాంగులై
కుసుమిత కింశుకంబులుం బోలె నుండి రంత. 565

1. చండకో......జాలము = తీవ్రమైనధనువునుండి విడువఁబడిన వాడియైన బాణసముదాయము. 2. శితసాయకాలిన్ = వాడియగు బాణ సమూహమును. 3. తూర్యంబుల్ = వాద్యవిశేషములు. 4. శోణితదిగ్ధాంగులై = నెత్తురుచేత తడిసిన దేహములుగలవారై.

ఉ. వారలనేకులయ్యు బలవంతులునయ్యు మహోగ్రసంగరో
దారపరాక్రమప్రకటదక్షులునయ్యుఁ గుమారకున్ జగ
ద్వీరుని నొక్కనిం జెనకి వ్రేలును వంపఁగలేక సిగ్గునం
గూఁడనచింత నొండొరులఁ గూడుచు విచ్చుచు వెచ్చనూర్పుచున్.

వ. మగిడి సమరసన్నద్ధులై సంరంభించి, 567

ఉ. అందఱు నొక్కపెట్ట దనుజాంతకనందనుఁ జుట్టుముట్టి యం
దంద నిశాతసాయక చయంబుల ముంచి రథంబు నుగ్రలీ
లం దునుమాడి చాపము చలంబునఁ ద్రుంచి హయాలిఁ జంపి సూ
తుం దెగటార్చి యంత విరథుండగుచున్ వెసఁ జొచ్చి పట్టినన్.

తే. బాలకుఁడు చేయునది లేక పట్టువడియెఁ
గౌరవులు తమమనములఁ గౌతుకంబు
లోలయ సాంబునిఁ గన్యకాయుక్తముగను
బురమునకుఁ దెచ్చి రతుల విభూతి మెఱసి. 569

వ. అంత ద్వారకానగరంబు. 570

ఉ. జాంబవతేయువార్త యదుజాతులు నారదయోగిచే సమ
స్తంబును విన్నవారగుచు [1]సంగరకౌతుక ముప్పతిల్లఁ జి
త్తంబులఁ గౌరవాన్వయ కదంబము నొక్కట నుక్కడంచు కో
పంబున నుగ్రసేన జనపాలు ననుజ్ఞ ననూనసైన్యముల్. 571

తే. కూడి నడవంగఁ గని వారి కోడ బలుఁడు
ధార్తరాష్ట్రులు మనకు నెఁకేయును డాసి
నట్టి బంధులు వారిపై నిట్టియలుక
నెత్తి చనుచుంట యిది నీతియే తలంప. 572

వ. అని వారల వారించి తత్క్షణంబ బంధుప్రియుండైన బలరాముం
[2]డనలార్క సంకాశం బగు కాంచనరథం బెక్కి యనురక్తులైన
భూసురులు నుద్ధవాది కుల వృద్ధులును సేవింపం గరిపురంబునకుం
జని [3]తత్పురోపకంఠవనంబున సురభికుసుమ ఫలభరిత తరుచ్ఛాయా

1. సంగరకౌతుకము = యుద్ధముకొఱకైన వేడుక. 2. అనలార్కసంకాశం బగు = అగ్ని సూర్యులతో సమానమైన. 3. పురోపకంఠము = పట్టణసమీపము.

విచిత్ర చంద్రకాంత శిలాతలంబునందు వసియించి మహిత గృహ
మధ్యగతుండైన పూర్ణచంద్రుని ననుకరించి యుండె, నంత గార్గ్య
బోధనంబు సేయుటకై కౌరవులకడకుఁ బ్రబుద్ధుఁడైన యుద్ధవునిం
బనిచిన నతఁ జని యతం డాంబికేయ ధనురాచార్యాపగాతనూభవ
సుయోధనులకుం బ్రణమిల్లి వారిచేత నభినందితుండై యిట్లనియె.

సీ. భూరియశోధనులార తాలాంకుండు
చనుదెంచి నగరోపవనమునందు
నున్నవాఁ డనిన వా రుత్సాహమున బలుఁ
బొడగను వేడుక బుద్ధిఁ బోవఁ
దనరారు కానుకల్ గొని చని యర్ఘ్యపా
ద్యాది సత్కృతులు నెయ్యమునఁ జేసి
ధేనువు నిచ్చి సన్మానించి యందఱు
నందంద వందనం బాచరించి

తే. యుచితభంగిని నచటఁ గూర్చున్న యెడను
గుశలమే మీకు మాకును గుశలమనుచుఁ
బలికి రాముఁడు కురు నరపాలుఁ జూచి
యచటి జనములు వినఁగ నిట్లనియెఁ దెలియ. 574

ఉ. మా నరనాథునాజ్ఞ [1]నిజమస్తములన్ ధరియించి కౌరవుల్
మానుగఁ జేయు టొప్పగుఁ గుమారకు నొక్కనిఁ బెక్కు [2]యూథపుల్
పూనిన లావుమై నెదిరి పోర జయించుట మీఁది తప్పు త
ప్పైనను గాచె బాంధవ హితాత్మకుఁడై మనుజాధినాథుఁడున్.

క. అను మాటలు విని కౌరవ|జననాయకుఁ డాత్మ నలిగి చాలుఁబు రేమే
మనఁగలదు కాలగతి చ|క్కనగాలం దొడుగు పాదుకలు దలకెక్కన్.

ఆ. మనము బంధువరుస మన్నించు మన్ననఁ
గాదె రాజ్యభోగ గరిమఁ బొదలి
వసుధఁ బేరు గలిగి వాసికి నెక్కుట
దమకు ననుభవింపఁ దగనియట్టి. 577

1. నిజమస్తములన్ = తమశిరములందు. 2. యూథపుల్ = సేనానాయకులు.

వ. [1]సితచ్ఛత్రచామర శంఖ కిరీట చిత్రశయ్యా సౌధ సింహాసనంబులు
గైకొంట మన [2]మందెమేలంబునంగాదె, యిట్టిచో సరివారునుం
బోలె నూరక గర్వించు యదుకులులతోడి సంబంధ సఖ్యంబులు
చాలుఁ బాములకుఁ బాలువోసి పెంచిన విషంబు దప్పునే మమ్ముం
దమపంపు సేయుమనుట సిగ్గు లేకుంటఁగాదె యదియునుంగాక దివ్యా
స్త్రకోవిదులైన గంగానందన గురు గురుకుమార కర్ణాదియోధులకు
లోఁబడ్డవానిని మహేంద్రునకైనను విడిపింపనచ్చునే యహహా
[3]వృథాజల్పంబుల కేమి పనియని దుర్భాషలాడుచు దిగ్గన లేచి నిజ
మందిరంబునకుం జనియె, నప్పుడు హలాయుధుం డమ్మాటల
కదిరిపడి. 578

ఉ. కౌరవుఁ డాడి పోయిన య✽గౌరవభాషల కాత్మఁ గిన్కదై
వాఱఁగ నుల్లసత్ప్రళయ✽భానునికైవడి మండి చండరో
షారుణితాంబకుం డగుచు ✽ యాదవవృద్ధులఁ జూచి పల్కెఁ బెం
పారిన రాజ్యవైభవమ✽దాంధులమాటలు మీరు వింటిరే. 579

తే. శ్రీమదాంధులు సామంబు✽చేతఁ జక్కఁ
బడుదురే యెందు బోయఁడు ✽ పసులఁ దోలు
పగిది నుగ్రభుజావిజృం✽భణసమగ్ర
సుమహితాటోప మసలోనఁ ✽ జూపకున్న. 580

క. కౌరవులసమయఁ జేయనుదారత యదువీరవరులు✽దామోదరుఁడున్
రా రావల దని యచ్చట। వారించితిఁగాదె బంధు✽వత్సలయుక్తిన్.

వ. అదియునుం గాక. 582

సీ. ఏదేవు భృత్యులై ✽ యింద్రాది దిక్పాల
వరులు భజింతురు ✽ వరుసతోడ
నేదేవు మందిరం ✽ బేపారు దేవతా
తరు సభా విభవ సుం✽దరతఁ జెంది
యేదేవు పదయుగం ✽ బే ప్రొద్దు సేవించు
నఖిల జగన్మాత ✽ యైన లక్ష్మి

1. సితచ్ఛత్ర = తెల్లగొడుగు. 2. మందెమేలము = ఉపేక్ష. 3. వృథాజల్పంబులకు = వ్యర్థపు మాటలకు.

యే దేవు చారు సమిష్టకళాంశసం
భవులము [1]పద్మజ భవులు నేను

తే. నట్టి దేవుండు దుష్టసంహారకుండు
హరి ముకుందుఁడు పంపు సేయంగ నొప్పు
నుగ్రసేనుని రాజ్యసమగ్రగరిమ
యంతయును దార యిచ్చినవాఁట తలంప. 583

చ. అదియునుగాక యెవ్వని పదాంబుజచారురజోవితాన పూ
త్రిదివవరాదిదిక్పతి కిరీటములందు నలంకరించు భూ
విదితపుఁ దీర్థముం గడు పవిత్రము సేయును నట్టి కృష్ణు చేఁ
బొదలిన రాజ్యచిహ్నములఁ బొందఁగ రాదఁట యేమిచోద్యమో.

క. తామఁట తలఁపందలఁట । యేమఁట [2]పాదుకలమాఁట గశింపఁగ రాజ్య
శ్రీమదమున నిట్లాడిన । యీమనుజాధమునిమాట కేమనవచ్చున్.

వ. అని సక్రోధమానసుండై యప్పుడు.

క. ధారుణినిటమీఁదట [3]నిష్కౌరవముగఁ జేయుదునఁ గాదని యుగ్రా
కారుండై బలభద్రుఁడు । సీరము వెసఁ బూన్చి లావుఁ జేవయు నెఱఁగన్

వ. ఇట్లు పూన్చి కౌరవరాజధానియైన కరినగరంబు కడతల హలాగ్రంబున జొనిపి య[4]ప్పుటభేదన విస్తారంబగు గడ్డ భుజాగర్వ దుర్వారుండై పెకలించి తిగిచి గంగాప్రవాహంబునం బడఁద్రోయ గమకించిన నప్పుడు మహాజలమధ్య విలోలంబగు నావచందంబున నన్నగరంబు వడవడ వడంకుచుఁ గోపురవప్రప్రాకార సౌధాట్టాలకతోరణ [5]ధ్వజ ద్వార కవాట కుడ్య వీథి యుతంబుగా నొడ్డగెడవైనఁ బౌరజనంబులు పుడమి నడుగు లిడంగ రాక తడంబడుచు నార్తులై కుయ్యిడుచుండి రట్టియెడ [6]నమ్మహోత్పాతంబులు గనుంగొని తాలాంకుండు కినుకవోడమి కావించిన యుపద్రవంబుగా

1. పద్మజభవులు = బ్రహ్మరుద్రులు. 2. పాదుకలు = కాలిచెప్పులు
3. నిష్కౌరవము న్ = కౌరవులు లేకుండునట్లుగా. 4. పుటభేదనము=పట్టణము.
5. ధ్వజ......యుతంబు = జెండాలు, ద్వారములు, తలుపులు, గోడలతోఁగూడిన వీథులుగల పట్టణమును. 6. మహోత్పాతంబులు = మిక్కిలి దుశ్శకునములు.

నెఱింగి దానికిఁ బ్రతీకారంబు లేమిని గళవళంబున భయాకులమానసులై పుత్ర మిత్ర కళత్ర బాంధు భృత్య పౌరజన సమేతంబుగా భీష్మ దుర్యోధనాది కౌరవులు వేగంబున నతని చరణంబుల శరణంబుగాఁ గలంచి సాంబునిం గన్యకాయుక్తంబుగా ననేకమణిమయభూషణాంబర జాలంబులతోడఁ గొని వచ్చి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిడ్చి యిట్లనిరి.

క. రామ సమంచిత ముక్తాదామయశఃకామ ఘనసుధాధామ రుచి
స్తోమ జయసీమ జగదభిరామగుణోద్దామ [1]నిఖిల రాజలలామా!

క. నీమహిమ యెఱిఁగి పొగడఁగ
నేమెంతటివార మఖిల[2]నేతవు త్రిజగ
త్క్షేమంకరుఁడవు సుమతివి
తామసులము మమ్ముఁ గావఁ దగు హలపాణీ. 590

క. భూచక్రమెల్లఁ దాల్చిన యాచక్రీశ్వరుఁడు తావకాంశుఁడు బలదే
వా చక్రికి నగ్రజుఁడవు నీచక్రియ లుడుపఁ జెల్లు నీకు [3]జితారీ.

క. రక్షింపుమురక్షింపుముపేక్షింపక [4]నమితనిఖిల బృందారక [5]ఘో
రక్షణదాచరవిషనిటలాక్షభయాతురుల మమ్ము నరయుమనంతా.

వ. మఱియును దేవా యీ సచరాచరంబు లయిన జగంబుల నీలీలావినోదంబులం జేసి దుష్టజనమర్దనంబును శిష్టజన రక్షణంబునుం జేయుచు జగదుత్పత్తి స్థితి లయ హేతువైన నీకు నమస్కరింతుమని వెండియు నిట్లనిరి.

తే. [6]అవ్యయుండవు సర్వభూతాత్మకుఁడవు
సర్వశక్తిధరుండవు శాశ్వతుఁడవు
[7]విశ్వకరుఁడవు గురుఁడవు విమలమూర్తి
వయిన నిన్ను నుతింప బ్రహ్మకును దరమె. 595

1. నిఖిల... లామా = రాజులందఱిలో శ్రేష్ఠుఁడా. 2. నేతవు = నాయకుఁడవు 3. జితారీ = జయించిన శత్రువులుకలవాఁడా. 4. నమిత నిఖిల బృందారక = అందఱిదేవతలచేత నమస్కరింపఁబడినవాఁడా. 5. ఘోరక్షణదాచరులు = భయంకర రాక్షసులు. 6. అవ్యయుండవు=నాశనము లేనివాఁడవు. 7. విశ్వకరుఁడవు=బ్రహ్మవు.

చ. అని వినుతించినం బ్రముదితాత్మకుఁడై హలపాణి వారలం
గనుఁగొని యోడ కోడకుఁడు కార్యగతిం దగిలిట్లు మీరు సే
సిన యవినీతిచేత నిటు సేసితి నింక భయంబుఁదక్కి పొం
డనిన సుయోధనుండు వినయంబున నల్లునిఁ గూఁతునుం దగన్.

క. అనుపుచు [1]నరణము దాసీ
జనముల వేయింటి లక్ష సైంధవములఁ దా
నినుమడి యేనుంగులఁ గాం
చన రథముల నాఱువేల సమ్మతి నిచ్చెన్. 596

వ. ఇట్లిచ్చి యనిచిన బలభద్రుండు గొడుకునుం గోడలిం దోడ్కొనుచుఁ బరమానందంబు నొందుచు నక్కడక్కడి జనంబులు పదివేల విధంబులం బొగడ నిజపురంబున కరిగి యచ్చట యాదవులతోడఁ దాఁ గరిపురంబునకుం బోయిన విధంబును వారలాడిన దురాలాపంబులును దా నందులకై యొనర్చిన ప్రతీకారంబును నెఱిగించి సుఖంబుండె. [2]వారణపురంబు నేఁడును దక్షిణంబెగసి యుత్తరభాగం బొకించుక గంగకై క్రుంగి బలభద్రుని మాహాత్మ్యంబుఁ దెలుపుచున్నదని యమ్మహాత్ముని భుజవీర్యం బవార్యంబని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 597

—◆ షోడశసహస్ర స్త్రీసంగతుండైన శ్రీకృష్ణునిమహిమ నారదుం డరయుట ◆—

చ. నరవర యొక్కనాఁడు విను నారద సంయమి మాధవుండు దా
నరకునిఁ ద్రుంచి వానిభవనంబున నున్న పదాఱువేల సుం
దరులను నొక్కమాఱు ప్రసువంబున నందఱ కన్ని రూపులై
పరిణయ మయ్యె నావిని శుభస్థితిఁ దద్విభవంబుఁ జూడగన్.

వ. ఇట్లు తలంచి కృష్ణపరిపాలితంబయిన ద్వారకానగరంబు డాయంజని ముందట. 599

సీ. శుక శారికా శిఖి పిక కూజిత ప్రస
వాంచితోద్యాన వనౌఘములను

1. అరణము = కూఁతునకిచ్చు ధనము. 2. వారణపురంబు = హస్తినాపురంబు.

గలహంస సారస కైరవ కమల క
ల్హార శోభిత కమలాకరములఁ
గలమాది సస్యసంకులవ [1]దిక్షు క్షేత్ర
భూరి లస న్నదీతీరములను
గిరి సానుపతిత నిర్ఝరకణ సందోహ
సంతత హేమంతసమయములను

తే. గమలసంభవ [2]కాంచనకార రచిత
చిరతరైశ్వర్య నగర లక్ష్మీకరాబ్జ
ఘటిత నవరత్నమయ [3]హేమకటక మనఁగ
సొబగు మీఱిన కోటయుఁ జూచె మౌని. 600

వ. మఱియును సముత్తుంగ మణి సౌధ గవాక్ష రంధ్ర నిర్గత నీరంధ్ర [4]ఘనసార చందనాగరు ధూప ధూమ పటల విలోకసంజనిత [5]పయోధరాభిశంకాంగీకృత తాండవ కేళీ విలోల పుర కామినీ జనోపలాలిత నీలకంఠ సముదయంబును జంద్రకాంతమణి స్ఫటిక స్తంభ సంభృత మరకత పద్మరాగఘటిత నవరత్న కాంచన ప్రాసాదశిఖ [6]రాగ్రన్యస్త బహు సూర్య విభ్రమ కృదంచిత శాత కుంభ కుంభనిచయంబును సమస్త వస్తు విస్తార సమర్పిత వైశ్యాగారవీథీవేదికా కలితంబును మహితాతప నివారణ తరళ విచిత్ర కేతనాబద్ధ మయూర శింజినీ నినదపూరితాశాంతరిక్షంబును సరోజనాభ పూతనాచేతనాపహారాది నూతన విజయ సందేశ లిఖిత స్వర్ణ వర్ణావళి విభాసిత గోపుర మణి విటంక ప్రదేశంబును యాదవేంద్ర దర్శనోత్స [7]వాహూయమాన [8]సమాగత నానాదేశాధీశ భూరివారణ దానజల ప్రభూత పంకనిరసనైక గతాగత జనసమ్మర్ద కటకంకణ కర్షణావికీర్యమాణ రజఃపుంజంబును వినూత్నరత్నమయ మంగళ రంగవల్లీ విరాజిత ప్రతిగృహ ప్రాంగణంబును గుంకుమ

1. ఇక్షుక్షేత్ర = చెఱకుగల భూములు. 2. కాంచనకర = కమసాలి. 3. హేమకటకము = బంగారు కడియము. 4. ఘనసార = మంచి కర్పూరము. 5. పయోధర = మేఘము. 6. అగ్రన్యస్త = చివర భాగమందుంచిన. 7. ఆహూయమాన = పిలువఁబడిన. 8. సమాగత = వచ్చిన.

సలిల సిక్త విపణి మార్గంబును వందిమాగధ సంగీత మంగళారావ విలసితంబును భేరీ మృదంగ కాహళ శంఖ తూర్య రవా ధరీకృత సాగర ఘోషంబును నై యమరావతీ పురంబునుంబోలె వసుదేవ నందన నివాసంబై యనల ప్రటభేదనంబునుంబోలెఁ గృష్ణమార్గ సంచార పూతం బై సంయమనీ నామ నగరంబునుంబోలె హరి తనూభవాభిరామంబయి నైరృతినిలయంబునుంబోలెఁ [1]బుణ్యజనా కీర్ణంబయి వరుణ నివాసంబునుంబోలె గోత్రరక్షణ భువన ప్రశస్తంబై ప్రభంజన పట్టణంబునుంబోలె మహాబల సమృద్ధంబై [2]యలకాపురంబునుం బోలె ముకుంద వర శంఖ మకరాంకకలితం బయి రజతాచలంబునుంబోలె నుగ్ర సేనాధిపార్యాలంకృతంబయి నిగమంబునుంబోలె వివిధవర్ణ క్రమవిధ్యుక్త సంచారంబయి గ్రహ మండలంబునుం బోలె గురు బుధ కవిరాజమిత్ర విరాజితం బయి సంతత కల్యాణవేదియుం బోలె వైవాహికోపేతంబై బలిదానవ కరతలంబునుంబోలె సంతత దానవారియుక్తంబై యొప్పునప్పురంబు ప్రవేశించి యందు విశ్వకర్మ నిర్మితంబైన యంతఃపురంబున నుండు [3]షోడశ సహస్రహర్మ్యంబులందు. 601

సీ. పటికంపుఁ గంబముల్ ✽ పవడంపుఁ బట్టెలు
మరకత రచితముల్ ✽ మదిరలమర
వైడూర్య మణి గణ ✽ వలభులఁ బద్మ రా
గంబుల మొగడుల ✽ కాంతు లొలయ
సజ్జాతి వజ్రాల ✽ సజ్జాల రుచులతో
భాసిల్లు నీలసో ✽ పానములును
[4]గరుడ పచ్చల విటంకములును ఘనరుచి
వెలసిన [5]శశికాంత ✽ వేదికలును

1. పుణ్యజన = రాక్షసులు (పుణ్యాత్ములు) 2. అలకాపురంబు = కుబేరుని పురము, 3. షోడశ సహస్రహర్మ్యంబులందు = పదునారు వేల మేడలయందు. 4. గరుడ...కములును = మరకతమాణిక్యములచే చేయఁబడిన గువ్వల గూడులు. 5. శశికాంత వేదికలును = చంద్రకాంతశిలలచే నిర్మించిన అరుగులు.

తే. వఱలు [1]మౌక్తిక ఘటిత కవాటములును
ప్రవిమల [2]స్వర్ణమయ సాలభంజికలును
మించు కలశంపు మొనఁగఁ గ్రీడించు మిథున
లీల నొప్పు [3]కపోతపాలికలుఁ గలిగి. 602

తే. చేటికానీక పదతులాకోటిమధుర
నినదభరితమై రుచిర మాణిక్యదీప
మాలికయుఁ గల్గి చూపట్టఁగాలు నొక్క
[4]జలజలోచన నిజసౌధతలమునందు. 603

తే. కనకకంకణఝణఝణత్కారకలిత
చంద్రబింబాననాహస్తజలజఘటిత
చామరోద్ధూత మారుత చలితచికుర
పల్లవునిఁ గృష్ణు వల్లవీపల్లవునిని. 604

వ. మఱియు హాటకనిష్కంబు లఱ్ఱులందు వెలుఁగొందఁ గంచుకంబులు శిరోవేష్టనంబులుఁ గనకకుండలంబులు ధరియించి సంచరించు [5]కంచుకులును సమానవయోరూపగుణ విలాసవిభ్రమ కలితలయిన విలాసినీ సహస్రంబులును గొలువం గొలువున్న యప్పద్మలోచనుం గాంచనసింహాసనాసీనుం గాంచె, నప్పుండరీకాక్షుండును నారదుం జూచి ప్రత్యుత్థానంబు సేసి యప్పుడు. 605

క. మునివరు పాదాంబుజములు
తనచారుకిరీటమణి వితానము సోఁకన్
[6]వినమితుఁడై నిజ సింహా
సనమునఁ గూర్చుండఁబెట్టి సద్వినయమునన్. 606

క. తనపాదకమలతీర్థం
బున లోకములం బవిత్రముగఁ జేయు పురా

1. మౌక్తిక...లును = ముత్యములతోఁ గూర్పఁబడిన తలుపులును, 2. స్వర్ణమయ సాలభంజికలు = బంగారుబొమ్మలు. 3 కపోతపాలికలు = పావురములగూళ్ళు 4. జలజలోచన = పద్మములవంటి నేత్రములు గలది. 5. కంచుకులును = అంతఃపురము కాచువారును. 6. వినమితుఁడై = నమస్కరించినవాఁడై.

తనమాని లోకగురుఁ డ
మ్మునిపదతీర్థంబు మస్తకమున ధరియించెన్. 607

వ. ఇట్లు బ్రహ్మణ్యదేవుండును నరసఖుండును నైన నారాయణుం డశేష తీర్థోత్తమానం బయిన మునీంద్రపాదతీర్థంబు ధరియించినవాఁ డయి సుధాసారంబు లైన మితభాషణంబుల నారదున కిట్లనియె. 608

క. ఏపని వంచినఁ జేయుదు|దాపసవరయనుడు నతడు దామోదర చి
ద్రూపక భవదవతార|వ్యాపారము దుష్టని|గ్రహార్థమ కాదే. 609

తే. అఖిలలోకైకపతివి దయార్ద్రమతివి
విశ్వసంరక్షకుండవు శాశ్వతుఁడవు
వెలయ నేపని యైనఁ గావింతు ననుట
యార్తబంధుండ విది నీకు నద్భుతంబె. 610

తే. అబ్జసంభవ హర దేవతార్చనీయ
భూరిసంసారసాగరోత్తారణంబు
నవ్యయానంద మోక్షదాయకము నైన
నీపదధ్యాన మాత్మలో నిలువనీవె. 611

వ. అని [1]యభ్యర్థించి యద్దేవునివలనం బ్రసన్నత వడసి తన్మందిరంబు వెడలి మునివరుం డమ్మహాత్ముని యోగమాయా ప్రభవంబు దెలియంగోరి వేఱొక చంద్రబింబాననాగేహంబునకుం జని యందు [2]నెత్తమాడుచున్న పురుషోత్తము నుద్ధవయుతుం గని యద్భుతంబు నొందుచు నతనిచేత సత్కృతుండై యచ్చోటు వాసి చని. 612

క. మునివరుఁడు గాంచె నొండొక|వనజాయతనేత్ర నిజనివాసంబున నం
దనయుతు జిష్ణు సహిష్ణున్ | వినుతగుణాలంకరిష్ణు విష్ణుం గృష్ణున్.

క. నారదుఁ డటుచని కనె నొక | వారిజముఖి యింటనున్న వానిమురారిన్
హారిన్ [3]దానవకుల సం|హారిం [4]గమలామనోవిహారిన్ శౌరిన్.

వ. ఇట్లు గనుంగొనుచుం జనుచుండ నొక్కయెడ నమ్మునీంద్రునకు ముకుం దుండు ప్రత్యుత్థానంబు సేసి మునీంద్రా సంపూర్ణకాము లయిన

---

1. అభ్యర్థించి = ప్రార్థించి, 2. నెత్తము + ఆడుచున్న = పాచికలాడుచున్న. 3. దానవకులసంహారిన్ = రాక్షసకులము సంహరించినవానిని. 4. కమలామనోవిహారిన్ = లక్ష్మిమనస్సులో విహరించువానిని.

మిమ్ము నపూర్ణకాములమైన మే మేమిటఁ బరితృప్తి నొంద జేయంగలవారము. భవదీయదర్శనంబున నిఖిలశోభనంబులనందెద మని ప్రియపూర్వకంబుగాఁ బలికిన నా నందనందను మాటలకు నానందకందళిత హృదయారవిందుండును మందస్మిత సుందర వదనారవిందుండును నగుచు నారదుండు వెండియుం జని చని. 615

క. [1]అనఘాత్ముఁడు గనుఁగొనె నొక
వనితామణి మందిరమున వనకేళీసం
జనితానందుని [2]ననిమిష
వినమితచరణారుణారవిందు ముకుందున్. 616

క. పరమేష్ఠిసుతుఁడు గనె నొక
తరుణీభవనంబునందుఁ దను దాన మనో
ంబురుహమునఁ దలఁచుచుండెడి
నరకాసురదమను శౌరి నందకుమారున్. 617

వ. మఱియునుం జని చని. 618

సీ. ఒకచోట నుచిత సంధ్యోపాసనాసక్తు
నొకచోటఁ బౌరాణికోక్తికలితు
నొకచోటఁ బంచయజ్ఞోచితకర్ముని
నొకచోట నమృతోపయోగలోలు
నొకచోట మజ్జనోద్యోగానుషక్తుని
నొకచోట దివ్యభూషోజ్జ్వలాంగు
నొకచోట ధేనుదానోత్కలితాత్ముని
నొకచోట నిజసుతప్రకరయుక్తు

తే. నొక్కచోటను [3]సంగీతయుక్తచిత్తు
నొక్కచోటను [4]జలకేళియుతవిహారు

1. అనఘాత్ముఁడు = పాపములేని మనస్సుగలవాఁడు (నారదుఁడు.) 2. అనిమిష...విందున్ = దేవతలచే నమస్కరింపఁబడు పాదపద్మములు గలవానిని. 3. సంగీతయుక్త చిత్తున్ = సంగీతమున లగ్నమైన మనస్సు గలవానిని. 4. జలకేళియుత విహారు = జలకేళితోఁగూడిన విహారము కలవానిని.

నొక్కచోటను సన్మంచ § కోపయుక్తి
నొక్కచోటను బలభద్ర § యుక్తచంతు. 619

వ. మఱియును.

సీ. సకలార్థసంవేది § యొకయింటిలోపల
జెలితోడ ముచ్చటల్ § సెప్పుచుండు
విపులయశోనిధి § వే ఱొక్కయింటిలో
సరసిజాననఁ గూడి § సరస మాడుఁ
బుండరీకదళాక్షుఁ § డొండొకయింటిలోఁ
దరుణికి హారవ § ల్లరులు గ్రుచ్చు
గరుణాపయోనిధి § మఱియొక యింటిలోఁ
జెలిఁగూడి విడియము § సేయుచుండు

ఆ. వికచకమలనయనుఁ § డొకయింటిలో నవ్వ
బవిమలాత్ముఁ డొకటఁ § బాడుచుండు
యోగిజనవిధేయుఁ § డొకయింట సుఖగోష్ఠి
సలుపు ననఘుఁ డొకటఁ § జెలఁగుచుండు. 621

వ. ఇట్లు సూచుచుం చని జని. 622

క. చతురానన నందనుఁడం। చితమతిఁ జని కాంచె నొక్క § చెలి గేహమునం
గ్రతుకర్మాచరణుని నా। శ్రితభయహరణుఁ సురేంద్ర § సేవితచరణుఁ

క. [1]వృత్రారినుతునిఁ బరమప। విత్రుని నారదుఁడు గాంచె § వేఱొకయింటం
బుత్రక పౌత్రక దుహితృ క। ళత్రసమేతుని ననంత § లక్షణవంతున్.

క. సుందర మగు నొకసుందరి
మందిరమునఁ బద్మభవ కు § మారుఁడు గాంచెన్
నందితనందుఁ సుజనా
నందుఁ గోవిందు నత స § నందు ముకుందుఁ. 625

క. [2]జలజభవసుతుఁడు గనె నొక। నలినాక్షినివాసమందు § నతభద్రేభుఁ
జలదాభుఁ గతలోభు। [3]న్నలకాళిజితద్విరేభు § నంబుజనాభుఁ.

---

1. వృత్రారినుతుని = ఇంద్రునిచేఁ గొనియాడఁబడు వానిని. 2. జలజభవసుతుఁడు = బ్రహ్మపుత్రుఁడు (నారదుఁడు). 3. అలకాళిజితద్విరేభున్ = తుమ్మెదల నోడించిన ముంగురులుగల వానిని.

మ. ఒకయింటం గజవాజిరోహకుఁడునై యొక్కింట భుంజానుఁడై
సకలాత్ముండు పరుండు షోడశసహస్రస్త్రీనివాసంబులం
దొకబోటింటను దప్పకుండ నిజమాయోత్సాహుఁడై యుండ న
య్యకలంకున్ వరదున్ మహాపురుషు బ్రహ్మణ్యున్ నతాబ్జాసనున్

క. ¹అస్తోకచరితు నమిత సమస్తసుధాహారు వేదమస్తకతల వి
న్యస్తపదాంబుజయుగళు ²నపాస్తశ్రితనిఖిలపాపుఁ బరమున నంతున్

ఆ. పరమభాగవతుఁడు పరమేష్ఠితనయుండు
మనుజలీలఁ జెంది మహితసౌఖ్య
చిత్తుఁడైన యా హృషీకేశుయోగ మా
యాప్రభావమునకు నాత్మనలరి. 629

క. మాయురె హరిహరి వరద య
మేయగుణా యనుచు నాత్మ మెచ్చి మునీంద్రుం
డా యదునాయకు సుజన వి
ధేయుని నిట్లనియె దేవ త్రిజగములందున్. 630

క. నీమాయఁ దెలియువారలె | తామరసాసనసురేంద్రతాపసులైనన్
ధీమంతులు నీభక్తిసు | ధామాధుర్యమునఁ బొదలు ధన్యులు దక్కన్

క. అనిహర్షించుచు నీక నేఁ | బనివినియెద నిఖిలలోకపావనము నస
జ్జనహితమునైన నీకీ | ర్తన మఖిలజగంబులందుఁ దగ నెఱిఁగింతున్

క. అని ³తద్వచనసుధాసే | చనమున ముదితాత్ముఁడగుచు సంయమిచిత్తం
బునఁ దన్మూర్తిం దగనిడు | కొనిచనియెన్ హరినుతైకకోవిదుఁడగుచున్

క. ఈపగిది లోకహితమతి | నా పరమేశ్వరుఁడు మానవాకృతిఁ ద్రిజగ
ద్దీపితచారిత్రుఁడు బహు | రూపములం బొందె సుందరుల నరనాథా.

చ. అని హరి యిట్లు షోడశసహస్రవధూమణులం బ్రియంబునన్
మనసిజకేళిఁ దేల్చిన యమానుషలీల సమగ్రభక్తితో

---

1. అస్తోకచరితున్ = గొప్పచరిత్రము గలవానిని. 2. అపాస్తశ్రితనిఖిలపాపున్ = ఆశ్రయించినవారి పాపములు పోగొట్టువానిని. 3. వచనసుధా సేచనమునన్ = మాటలనెడి యమృతమును జిలుకుటచే,

వినినం బఠించినం గలుగు ♦ విష్ణుపదాంబుజ భక్తియున్ మహా
ధనపశుపుత్త్రమిత్రవసు♦ధాముఖ సౌఖ్యములున్ నరేశ్వరా.

వ. అని చెప్పి [1]యప్పారాశర్య నందనుం డభిమన్యునందనున కిట్లనియె. నా నిశావసానంబునం బద్మబాంధవాగమనంబును గమలినీ లోకంబునకు మునుకలుగ నెఱింగించు చందంబునం గలహంస సారస రథాంగ ముఖ జల విహంగంబుల రవంబులు సెలంగ నరుణోదయంబున మంగళపాఠక సంగీత మృదుమధుర గాన నినదంబును లలితమృదంగ వీణావేణు నినాదంబును వీతేర మేలుకని తనచిత్తంబునం జిదచిదానంద మయుం బరమాత్ము నవ్యయు నవికారు నద్వితీయు నజితు ననంతు నచ్యుతు నమేయు నాద్యునాద్యంతవిహీనుం బరమ బ్రహ్మంబు నైన తన్నుం దానొక్కింత చింతించి యనంతరంబ విరోధిరాజన్యనయన కల్హారంబులు ముకుళింప భక్తజననయన కమలంబులు వికసింప [2]నిరస్తనిఖిల దోషాంధకారుండైన గోవిందుండు మొగిచిన లోచనసరోజంబులు వికసింపం జేయుచుం దల్పంబు డిగ్గి చనుదెంచి యంత. 636

సీ. [3]మలయజ కర్పూర ♦ మహితవాసిత హేమ
కలశోదకంబుల ♦ జలక మాడి
నవ్యలసన్మృదు ♦ దివ్యవస్త్రంబులు
వల నొప్ప రంగులు ♦ వారఁ గట్టి
మకరకుండలహార ♦ మంజీర కేయూర
వలయాది భూషణా♦వళులు దాల్చి
ఘనసార కస్తూరి♦కా హరిచందన
మిళితపంకము మేన ♦ నలర నలఁది

తే. మహితసౌరభ నవకుసు♦మములు దుఱిమి
పొసఁగ రూపైన శృంగార♦రస మనంగ
మూర్తిఁ గైకొన్న కరుణా స♦ముద్ర మనఁగ
రమణ నొప్పుచు లలితద♦ర్పణము చూచి. 637

1. అప్పారాశర్య నందనుండు = శుకుఁడు. 2. నిరస్త......కారుండు = సమస్తపాపములు పోఁగొట్టువాఁడు. 3. మలయజము = మంచిగంధము.

తే. కడఁగి సారథి దెచ్చిన ✽ కనకరథము
[1]సత్యకసుత ప్రియోద్ధవ ✽ సహితుఁ డగుచు
నెక్కి నిజకాంతి దిక్కులఁ ✽ బిక్కటిల్ల
బూర్వగిరిఁదోఁచు భానుని ✽ బోలి వెలిఁగె. 638

సీ. [2]అభినవనిజమూర్తి ✽ యంతఃపురాంగనా
నయనాబ్జములకు నా ✽ నంద మొసఁగ
సలలితముఖచంద్ర ✽ చంద్రికాతతి పౌర
జనచకోరముల కు ✽ త్సవము సేయ
మహనీయకాంచన ✽ మణిమయభూషణ
దీప్తులు దిక్కులఁ ✽ దేజరిల్ల
నల్లనల్లనవచ్చి ✽ యరదంబు వెసడిగ్గి
హాల కులిశాంకుశ ✽ జలజ కలశ

తే. లలిత రేఖలు ధరణి న ✽ లంకరింప
నుద్ధవుని గరతల మూని ✽ యొయ్య నడచి
మహితగతి దేవతా సభా ✽ మధ్యమునను
రుచిరసింహాసనమునఁ గూ ✽ ర్చుండె నెలమి. 639

చ. అతివిభవంబునం దనరి ✽ [3]యాత్మతనుద్యుతి తేజరిల్లఁగా
హితులు పురోహితుల్ వసుమ ✽ తీశులు మిత్రులు బాంధవుల్ బుధుల్
సుతులును మాగధుల్ కవులు ✽ సూతులు మంత్రులు భృత్యులున్ సభ
స్థితి గొలువంగ నొప్పె [4]నుడు ✽ సేవితుఁడైన సుధాంశుఁడో యనన్

క. కరుణార్ద్రదృష్టి ప్రజలం । బరిరక్షించుచు వివేక ✽ భావకళాచా
తురి మెఱసియిష్టగోష్ఠిం । బరమానందమున రాజ్య ✽ భారకుఁడగుచున్

—◆ జరాసంధభీతులయిన రాజులపంపున విప్రుఁడు కృష్ణసన్నిధి కేతెంచుట ◆—

వ. ఇవ్విధంబునం బ్రతిదివసంబును నుండు నవసరంబున నొక్కనాఁ
డపూర్వదర్శనుండయిన భూసురుం డొక్కరుండు సనుదెంచి సభా

1. సత్యకసుతుఁడు = సాత్యకి. 2. అభినవనిజమూర్తి = మిక్కిలి నూతనమైనతనరూపము. 3. ఆత్మతనుద్యుతి = తనదేహకాంతి. 4. ఉడుసేవితుఁడు = నక్షత్రములచే సేవింపఁబడువాఁడు.

మధ్యంబునం గొలువున్న ముకుందునిం బొడగని దండప్రణామం
బాచరించి వినయంబునం గరంబులు మొగిచి యిట్లనియె. 642

క. కంజవిలోచనదానవ।భంజన యోగీంద్రవిమల భావ లసద్బో
ధాంజన దీప్తినిదర్శన।రంజితశుభమూర్తికృష్ణ రాజీవాక్షా.

తే. అవధరింపు జరాసంధుఁ డతుల బలుఁడు
దనకు మ్రొక్కని ¹ధారుణీధవుల నెల్ల
వెదకి తెప్పించి యిరువదివేల నాఁకఁ
బెట్టినాఁడు గిరివ్రజపట్టణమున.

తే. వారు ²పుత్తేర వచ్చినవాఁడ నేను
నరవరోత్తమ నృపుల విన్నపము గాఁగ
విన్నవించెద నామాట వినినమీఁద
ననఘ నీదయ వారిభాగ్యంబుకొలఁది. 645

వ. అని ధరాధిపులవిన్నపంబుగా నిట్లనియె. 646

ఉ. వారిజనాభ భక్తజనవత్సల దుష్టమదాసురేంద్ర సం
హార సరోరుహాసనపురారిముఖామరవంద్యపాద పం
కేరుహ సర్వలోకపరికీర్తితదివ్యమహాప్రభావ సం
సారవిదూర నందతనుజాత రమాహృదయేశ మాధవా. 647

ఆ. ఆర్తజనుల మమ్ము నరసి రక్షింపు మ
హాత్మ భక్తజన భయాపహరణ
నిన్ను మది నుతింతు నీకు మ్రొక్కెదము నీ
చరణయుగము మాకు ³శరణ మనఘ. 648

క. బలియుర దండింపఁగ దు
ర్బలులను రక్షింప జగతిపై నిజలీలా
కలితుఁడవై యుగయుగమున
నలవడ నుదయింతుకాదె యభవ యనంతా. 649

క. నీమదిఁ దోఁపనియర్థం।బీమేదినియందుఁ గలదె యీశ్వర భక్త
స్తోమ సురభూజ త్రిజగ।త్క్షేమంకర దీనరక్ష సేయు మురారీ. 650

1. ధారుణీధవులన్ = రాజులందఱిని. 2. పుత్తేరన్ = పంపఁగా. 3. శర
ణము = రక్షకము.

క. నీపంపు సేయకుండఁగ । నా పద్మభవాదిసురుల కైనను వశమే
శ్రీపతి శరణాగతులం । జేపట్టి విరోధముడుపఁ జేయుము కృష్ణా.

క. అభవుఁడవయ్యును జగతిం
[1]బ్రభవించుట లీలగాక భవమందుటయే
ప్రభువులకుం బ్రభుఁడవు మము
సభయాత్ముల నరసి కావఁ జను నార్తిహరా. 652

క. [2]కదనమున నీభుజార్గళి । కెదిరింపఁగ లేక పాఱఁడే విక్రమసం
పద చెడఁగ జరాసంధుఁడు । పదునెనిమిదిమార్లు ధరణిపాలురు నవ్వన్.

వ. ఇట్లు తనపడిన [3]బన్నములం దలంపక సింహంబు సమద[4]దంతావళం
బుల నరికట్టి కారించుచందంబున మమ్ముం జెఱపట్టి బాధించుచున్న
యప్పాపాత్ముని మర్దించి కారాగృహబద్ధులమగు మానిర్బంధంబులు
వాపి సుతదారమిత్రవర్గంబులం గూర్చి యనన్యశరణ్యులమైన మమ్ము
రక్షింపుమని విన్నవించిరని బ్రాహ్మణుండు విన్నపంబు సేయు
నవసరంబున. 654

—♦ నారదుండు శ్రీకృష్ణునితో ధర్మజు రాజసూయము నెఱవేర్పుమని చెప్పుట ♦—

సీ. శారదచంద్రికా సారంగ రుచిరోడ
జడముడి కెంపుచే సఱచి నవ్య
[5]శరదంబుదావృత సౌదామనీ లతా
శోభఁ గాంచన కటిసూత్ర మలర
లలిత పూర్ణేందు మండల కలంకముగతి
మృదుమృగాజినరుచి మించఁ జూపఁ
గల్పశాఖాగ్ర సంగత [7]పుష్పగుచ్ఛంబు
లీలఁ గేలను [8]నక్షమాల యమర

1. ప్రభవించుట = పుట్టుట, 2. కదనమున = యుద్ధమునందు. 3. బన్నములం = కష్టములను (అవమానములను). 4. దంతావళంబులన్ = ఏనుఁగులను. 5. శరదంబుద = శరత్కాలమేఘము. 6. సౌదామనీలత = మెఱపుతీఁగె. 7. పుష్పగుచ్ఛంబు = పూలగుత్తి. 8. అక్షమాల = జపమాల.

తే. భూరిపుణ్యా నదీతోయ ♦ పూరితముగఁ
దగు కమండలు వొక్క హ ♦ స్తమునఁ దనర
[1]వెల్లజన్నిద మఱుత శో ♦ భిల్ల వచ్చె
నారదుండు వివేకవి ♦ శారదుండు. 655

క. చనుదెంచె నట్లు ముని నిజ
తనుకాంతుల [2]నఖిలదిగ్వి ♦ తానము వెలుఁగన్
వనజాప్తుఁ బోలి యయ్యెడ
జనములుఁ గృష్ణుండు లేచి ♦ సంప్రీతి మెయిన్. 656

క. వినయమున మ్రొక్కి కనకా
సనమునఁ గూర్చుండఁబెట్టి ♦ సముచిత వివిధా
ర్చనములఁ దనిపి మురాంతకుఁ
డనియెన్ వినయంబు దోఁప ♦ నమ్మునితోడన్. 657

తే. ఇప్పుడెందుండి వచ్చితి ♦ విందులకును
నఖిలలోకైకసంచారి ♦ వగుటఁ జేసి
నీ యెఱుంగనియర్థంబు ♦ నిఖిలమందు
నరయ లేదండ్రు మిమ్మొక ♦ టడుగవలయు. 658

తే. పాండునందను లిప్పు డే ♦ పగిది నెచట
నున్నవారలొ యెఱిఁగింపు ♦ మన్న మౌని
కరసరోజాతములు మోడ్చి ♦ [3]కడఁకతోడఁ
బలికెఁ గమలాక్షుఁ జూచి స ♦ ద్భక్తి మెఱసి. 659

వ. దేవా విశ్వనిర్మాణకర్తవై మాయివై సకలకార్యోత్పాదనాది శక్తియుక్తుండవై పావకుండు [4]దారువులందు నంతర్హిత ప్రకాశుండై యున్నచందంబున వర్తించుచున్న నీదు దురత్యయం బయిన మాయాశతంబులఁ బెక్కుమాఱులు పొడగంటి నదియు నాకు నద్భుతంబుగాఁ దదియునుం గాక నీ సంకల్పంబున జగం బుద్భవంబై భవత్పరతంత్రంబు నగు నట్టి నీకిష్టంబైన వస్తువు సాధు

1. వెల్లజన్నిదము = తెల్లనియజ్ఞోపవీతము. 2. అఖిలదిగ్వితానము = అన్ని దిక్కుల సమూహము. 3. కడఁకతోడన్ = ప్రయత్నముతోడ. 4. దారువులందు = కట్టెలయందు.

తరంబుగాఁ దెలియ నెవ్వండును సమర్థుం, డేపదార్థంబు ప్రమాణ మూలంబునం దోఁచునది యును[1] లోకవిచక్షణుండవై ననీదురూపంబు మఱియును ముక్తిమార్గంబు నెఱుంగక సంసారపరవశులైన జీవుల మాయాంధకారంబు నివర్తింపఁజేయ సమర్థంబగు నీదివ్యలీలావతారంబులం గలుగుకీర్తియను ప్రదీపంబుఁ బ్రజ్వలింపఁ జేసి కృప సేయు దట్టినీకు నమస్కరించెద, నది గావున నీ ప్రపంచంబున నీ యెఱుంగని యర్థంబును గలదే యని కృష్ణునకు నారదుండిట్లనియె.

సీ. అయినను వినిపింతు ♦ నవధరింపుము దేవ
పాండుతనూజుండు ♦ పారమేష్ఠ్య
కామానుమోదియై ♦ కావింపనున్నాఁడు
[2]రాజసూయమహాధ్వ♦రంబు నిష్ఠ
[3]తవణింప లోకవి♦డంబనార్థము గాక
పరికింపఁ దన కాత్మ♦బాంధవుఁడవు
భక్తవత్సలుఁడవు ♦ పరమపూరుషుఁడవు
యజ్ఞరక్షకుఁడవు ♦ యజ్ఞభోక్త

తే. వగు భవత్సేవ చాలదే ♦ సుగతి వడయ
నైన నీమేనబావ ధ♦ర్మాత్మజుండు
అతని యజ్ఞంబు రక్షింప ♦ నంబుజాక్ష
వలయు విచ్చేయు మచటికి ♦ వలను మెఱసి. 661

క. నీపేరు వినిన నొడివినఁ । బాపంబులు దూలిపోవు ♦ పద్మాక్ష జగ
ద్దీపక నీదర్శనమున । నేపారవె భక్తజనుల ♦ కిహపర సుఖముల్.

మ. భవదీయోజ్జ్వలకీర్తిదిగ్వితతుల౯ ♦ భాసిల్లు యుష్మత్పదో
ద్భవనైర్మల్యజలంబు లుత్కలికఁ బా♦తాళంబునం బాఱు భో
గవతీనామమునం దనర్చి ధరణిం ♦ గంగానదీ రూపమై
దివి మందాకినియై జగత్త్రియమునం ♦ దీపించుఁగాదే హరీ. 663

---

1. లోకవిచక్షణుండవు = లోకములందలి చరిత్ర తెలిసినవాఁడవు.
2. రాజ...రంబు = రాజసూయమను యజ్ఞము. 3. తవణింప = ఒప్పునట్లుగా.

క. [1]ఆ మఖవేళ సమస్తధ
రామండలిఁ గల్గు మేటి రాజులు [2]మౌని
స్తోమంబును భవదీయ మ
హామహిమముఁ జూచి సత్కృతార్థతఁ బొందన్. 664

క. కల రని చెప్పిన నమ్ముని
పలుకులకు ముదంబు నొంది పంకజనాభుం
డెలనవ్వు మొగమునకుఁ జెలు
వొలయఁగఁ బాటించి యుద్ధవున కిట్లనియెన్. 665

శ్రీకృష్ణుం డుద్ధవుని యాలోచనచొప్పున ధర్మరాజుపాలికిఁబోవుట

క. ఉద్ధవ మహితవివేక సబుద్ధ నచోవిభవ కార్య మెఁగతినడచున్
వృద్ధవరానుమతంబుగ బోద్ధవ్యముగాఁగఁ జెప్పు పురుషనిధానా.

తే. అనఘచారిత్ర నీవు మా [4]యక్షియుగము
వంటివాఁడవు మనకు సర్వజ్ఞ మగుచు
జేయఁ దగినట్టి కార్యంబుఁ జెప్పు నీవు
నేమి పంచినఁ గావింతు నిద్ధచరిత. 666

వ. అని సర్వజ్ఞుండైన హరి యజ్ఞుండువోలెఁ దన్ను నడిగినఁ బురుషోత్త
ముని భాషణంబులకు మనంబున సంతసిల్లి యతని పాదాంబుజంబులు
దనమనంబున నిడికొని వృద్ధానుమతంబుగా నా మెఱింగిన తెఱంగు
విన్నవించెద నవధరింపుము. దేవా దేవముని చెప్పినట్లు భవదీయ
భక్తుండైన యుధిష్ఠిరు [5]యాగపాలనంబు సేయంగైకొనుట కార్యంబు,
బదియునుంగాక నిఖలదిగ్విజయమూలంబగు రాజసూయ కృత్యంబు
నందు జరాసంధమర్దనంబును నతనిచేత బద్ధులైన రాజులం గారా
గృహవిముక్తులం గావించుట యుం జేకూరు, నదియునుంగాక నాగా
యుత సత్త్వుండును శతాక్షౌహిణీ బలాన్వితుండును నగు మాగధుని
వధియింప మన ప్రభంజననందనుండు గాని యొండొరులు సమ

1. ఆమఖవేళన్ = ఆ యజ్ఞ సమయమున. 2. మౌనిస్తోమంబు =ముని సమూహము. 3. బోద్ధవ్యము = తెలియునట్లుగా. 4 అక్షియుగము = నేత్ర ద్వయము. 5. యాగపాలనంబు = యజ్ఞరక్షణము.

ర్థులు గా రట్లగుట నతండు భూసురు లేమిఁగోరిన నయ్యర్థంబు
వృథసేయక యిచ్చుం గావునఁ గపటవిప్రవేషంబునం జని యా
జరాసంధుని [1]నాహవభిక్ష వేఁడి భవత్సన్నిధానంబున [2]నప్పవమాన
తనయుం డతని వధియించు, నట్టి కార్యంబు సేఁత బహుళార్థ
సాధనం బగు నని పలికిన విని నారదుండును యాదవ జనంబులును
సభికులునుం బొగడి రంత. 668

సీ. తరలవిచిత్రక స్థగితప్రభావలిఁ
దనరారు [3]గరుడకేతనము వెలుఁగఁ
గాంచనచక్ర సంఘటితఘంటాఘణ
ఘణవినాదముల దిక్కరులు బెదర
సలలిత మేఘ పుష్పక వలాహక శైబ్య
సుగ్రీవ తురగ విస్ఫురణ దనర
బాల సూర్యప్రభా భాసమానద్యుతి
దిగ్వితానంబుల దీటుకొనఁగఁ

తే. ప్రకటరుచి నొప్పు తేరు దారుకుఁడు దేర
నెక్కి వెడలెను నప్పుడు పెంపెనయఁ జెలఁగె
శంఖ కాహళ పటహ నిస్సాణ డిండి
మాది రవములు భరిత దిగంతములుగ. 669

క. మనుజేశ్వరునకు [4]దాలాం
కునకును గురువృద్ధజనులకును జెప్పి ప్రియం
బున ననుపఁ గాంచన స్యం
దన సామజ వాజి భట కదంబము గొలువన్. 670

తే. వందిమాగధసూత కైవారరవము
వసుమతీసురకోటి దీవనలమ్రోఁత
లనుగమింపఁగ సతులు [5]సౌధాగ్రశిఖర
సీమలందుండి ముత్యాల సేస లొలుక. 671

1. ఆహవభిక్ష = యుద్ధభిక్ష. 2. అప్పవమానసుతుండు = ఆ భీముఁడు. 3. గరుడకేతనము = గరుత్మంతుఁడుగల జెండా. 4. తాలాంకునకు=బలరామునకు. 5. సౌధాగ్ర = మేడ చివరభాగము.

క. లీలం జని కృష్ణుఁడు వాహ్యాలిన్ నవకుసుమ ఫలభరానతశాఖా
లోల ఘనసార సాల రసాలవనస్థలములందుఁ జతురత విడిసెన్.

వ. అట్టియెడ సరోజనాభు [1]శుద్ధాంతంబున. 673

సీ. వికచమరంద సంపీన సౌరభ లస
న్మందార [2]కుసుమదామములు దుఱిమి
చారు సుగంధ కస్తూరికా ఘనసార
మిళిత చందన పంక మెలమి నలఁది
కనక కుండల కన త్కంకణ నూపుర
ముద్రికాభూషణములు ధరించి
యంచిత ముక్తా ఫలాంచల మృదుల [3]ది
వ్యాంబరములు చెలువారఁ గట్టి

తే. యర్ధచంద్రుని నెకసక్కె మాడునట్టి
యలిక ఫలకలఁ దిలకము లలరఁ దీర్చి
పెంపు దీపింప [4]నుడురాజబింబముఖులు
నవ చతుర్విధ శృంగార మవధరించి. 674

తే. జలజలోచను కడకు [5]నుత్కలికతోడ
దనరు [6]శిబికల నెక్కి సతనులుఁ దాముఁ
గడఁక నేతేరఁ బ్రతిహార జనులు [7]వేత్ర
కలితులై పౌరులను నెడ గలుఁగ జడియ. 675

క. అసమాస్త్రుఁడు పులుకడిగిన
కుసుమాస్త్రములన్ హసించు కోమలతనువుల్
మిసమిస మెఱవఁగ వేశ్యా
విసరము దాసీజనంబు విభవ మెఱర్పన్. 676

ఆ. హరుల [8]వేసడములఁ గరులనునెక్కి తో
నరుగుదేర బహువిధాయుధములు

1. శుద్ధాంతంబున = అంతఃపురంబున. 2. కుసుమదామములు=పూలమాలలు. 3. దివ్యాంబరములు=దేవతావస్త్రములు. 4. ఉడురాజు=నక్షత్రరాజు (చంద్రుఁడు). 5. ఉత్కలికతోడ = సంతోషముతో. 6. శిబికలన్ = పల్లకీలయందు. 7. వేత్రకలితులై = బెత్తములుకలవారై. 8. వేసడములు = కంచరగాడిదలు.

దాల్చి సుభటకోటి దగిలి రా నంతఃపు
రాంగనలు సితాంబుజాక్షుకడకు. 677

వ. వచ్చిరంత, 678

క. నారదుని మాధవుఁడు స
త్కారంబున వీడుకొలుప నతఁడును హృదయాం
భోరుహమునఁ గృష్ణునకును
వారక మ్రొక్కుచును వెస దివంబున కరిగెన్. 679

క. నరవరులదూతయును ముర
హరుచే నభయప్రదాన మంది ధరిత్రీ
వరులకడ కేగి పద్మో
దరువచనము సెప్పి సమ్మదంబునఁ దేల్చెన్. 680

వ. అంతఁ గృష్ణుండు నిజకాంతా తనయ బంధు సుహృజ్జన సమేతుండై కదలి చనునెడ. 681

ఉ. [1]కటపట రత్నకంబళ నికాయకుటీరము లుల్లసిల్ల ను
త్కటపటు చామరధ్వజ పతాక కిరీట సితాతపత్ర వి
స్ఫుట ఘనహేతి దీధితి నభోమణిఁ గప్పఁగ దూర్యఘోషముల్
చటుల తిమింగిలోర్మిరవ సాగరఘోషము నాక్రమింపఁగన్.

క. కరిహరిరథసుభటసముత్కరములు సేవింప మురవిదారుఁడు గడచెన్
సరిదుపవన దుర్గ సరోవర జనపదపుర పుళింద వనగోష్ఠములన్.

వ. ఇట్లు గడచి చనుచు నానర్తక సౌవీర మరుదేశంబులు దాఁటి యిందుమతిని దర్శించి దృషద్వతి నుత్తరించి సరస్వతీనది దాఁటి పాంచాల మత్స్య [2]విషయంబులు లోనుగాఁ గడచి యింద్రప్రస్థ నగరంబు డాయంజని తత్పురోపకంఠవనంబున విడిసిన. 684

—♦ పాండవులు శ్రీకృష్ణు నెదుర్కొని తోడ్కొనిపోవుట ♦—

క. హరిరాక యెఱిఁగి ధర్మజుఁ
[3]డఱలేని ముదంబుతోడ ననుజులు బంధుల్

1. కటపట = చాపలు, వస్త్రములు 2. విషయంబులు = దేశంబులు.
3. అఱలేని ముదంబుతో = కొఱఁతలేని సంతోషముతో.

గురుజన సచివ పురోహిత
పరిచారక కరి రథాశ్వ భటయుతుఁ డగుచున్, 685

క. చిందములు మొరయ గాయక
బృందంబుల నుతులు సెవుల బెరయఁగ భక్తిన్
[1]డెందము దగులఁగఁ బరమా
నందంబున హరి నెదుర్కొనం జనుదెంచెన్. 686

వ. అట్లు చనుదెంచి ధర్మనందనుండు సమాగతుండైన సరోజనాభునిం బెద్దతడవు గాఢాలింగనంబు సేసి రోమాంచ కంచుకిత శరీరుండై యానందబాష్పధారాసిక్త కపోలుండై నిర్భరానంద కందళితహృదయుండై బాహ్యంబు మఱచియుండె, నప్పుడు హరిని [2]వాయునందన వాసవ తనూభవులు కౌఁగిటం జేర్చి సమ్మదంబు నొందిరి, [3]మాద్రేయులు దండప్రణామంబు లాచరించి, రంతఁ బుండరీకాక్షుండు విప్ర వృద్ధ జనంబులకు నమస్కారంబులు సేసి వారలు గావించు వివిధార్చనలం బరితుష్టుండై కేకయ సృంజయాదిభూవిభులమన్నించి సూత మాగధాదుల కనేక పదార్థంబులొసంగి చతురంగ బలసమేతుండై వివిధమణి తోరణాది విచిత్రాలంకృతంబు నతి వైభవోపేతంబు నైన పురంబు బ్రవేశించి రాజమార్గంబునం జనుచుండఁ బౌరకామిను లట్టియెడ. 687

సీ. [4]కొఱనెలపై దోఁచు [5]నిరులు నాఁ జెలువొంది
నొసలిపైఁ గురులు తుంపెసలు [6]గునియ
హాటకమణిమయ తాటంకరోచులు
గండభాగంబుల గంతులిడఁగ
స్ఫురితవిద్రుమనిభా ధరబింబరుచితోడ
దరహాసచంద్రిక సరసమాడ
నొండొంటితో రాయు నుత్తుంగకుచకుంభ
ములు మొగంబులకును బుటము లెగయ

1. డెందము = హృదయము. 2. వాయునందన...భవులు = భీమార్జునులు. 3. మాద్రేయులు = నకులసహదేవులు. 4. కొఱనెల = అర్ధచంద్రుఁడు. 5. ఇరులు = చీఁకట్లు. 6. గునియ = కులుకు

తే. బడుగునడుములు వడఁకంగ * నడుగు లిడఁగ
రవళిమట్టెలు మణినూపు*రములు మొరయఁ
బొలుచు [1]కచబంధములు భుజం*బుల నటింపఁ
బయ్యెదలు పిడిమూడ సం*భ్రమముతోడ. 688

వ. ఇట్లు కృష్ణసందర్శన కుతూహల పరస్ప[2]రాహూయమానలై గురు
పతిసుత బంధుజనంబులు వారింప నతిక్రమించి సమున్నతధర్మ
హర్మ్యశిఖరాగ్రంబు లెక్కి కృష్ణుం జూచి తమలో నిట్లనిరి. 689

సీ. విశ్వగర్భుండు నా * వెలయు వేల్పుల యశో
దానందులకుఁ బ్రియ*సూనుఁ డయ్యె
బ్రహ్మాదిసురలకు * భావింపఁగారాని
బ్రహ్మంబు గోపాల*బాలుఁ డయ్యె
వేదశాస్త్రంబులు * వెదకి కానఁగలేని
గట్టి [3]వ్రేతలఱోలఁ * గట్టువడియె
దివిజుల కమృతంబు * దవిలి యిచ్చిన భక్త
సులభుండు నవనీ*చోరుఁ డయ్యె

తే. నెనయఁ గమలాపతికిఁ జిత్త*మీని వేల్పు
గొల్లయిల్లాండ్ర యుల్లముల్ * పల్లవింపఁ
జేసె నని [4]కామినులు సౌధ*శిఖరములను
గూడి తమలోన ముచ్చట*లాడి రధిప. 690

వ. మఱియును. 691

సీ. గోపాలబాలురఁ * గూడి యాడెడినాఁడు
వ్రేపల్లెలోపల * నేపు రేఁగి
చల్ల లమ్మఁగ బోవు * సతులకొంగులు పట్టి
మెఱుఁగుఁజెక్కిళ్లను * మీటిమీటి
[5]కలికియై ముద్దాడఁ * గౌఁగిటఁ జేర్చిన
పూఁబోఁడిపుచములు * పుణికి పుణికి

1. కచబంధములు = కొప్పులు. 2. ఆహూయమానలై = పిలువఁబడినవారై.
3. వ్రేతలు = గోపికలు. 4. కామినులు = స్త్రీలు. 5. కలికి = నేర్పరి.

సాయనియనురక్తిఁ గడాయఁ జేరిన యింతి
యధరసుధారసంగ్రాని యాని

తే. యురుసమాధిపరాష్టాంగ యోగయుక్తు
లైన యోగీశ్వరులుగాన నట్టి [1]జెట్టి
వల్లవీజనకల్పక వల్లియన్యో
ననుచుఁ బొగడిరి కృష్ణు నబ్జ్యబ్జముఖులు. 692

మ. అని యిబ్భంగి సరోజలోచనలు సౌధాగ్రంబులం దుండి య
వ్వనజాతాక్షుని దివ్యమూర్తిఁ దమభావంబం బందుఁ గీలించి సం
జనితానందరసాబ్ధిమగ్న లగుచున్ సంప్రీతిఁ దద్భవ్యకీ
ర్తనలై చల్లిరి నవ్యలాజములు [2]మందార ప్రసూనావలుల్.

వ. తదనంతరంబు శోభనపదార్థములు గొనివచ్చి ధరామర ధరావర
వణిక్పుంగవులు దామోదరునకు కానుకలిచ్చిరి. పుణ్యాంగనా
జనంబులు పసిండిపళ్ళెరంబులఁ గర్పూరనీరాజనంబులు [3]నివాళింప
నంతఃపురంబుసొత్తెంచె, నంతం గుంతిభోజనందనయుం గృష్ణునింగని
పర్యంకంబు డిగ్గి కౌఁగిలింప నా యదువల్లభుండు మేనత్తకుం
బ్రణామం బాచరించెఁ. బాంచాలియు ముకుందునకు నభివందనం
బొనరించి కుంతిపంపున గోవిందుభామినులగురుక్మిణి మొదలగువారికి
గంధాక్షత కుసుమ తాంబూలంబు లిడి లలితమకూలముక్తాభూష
ణంబులం బూజించె, యుధిష్ఠిరుండును గమలనయనుని వధూజనుల
ననుగతబంధుమిత్ర పుత్ర సచివపురోహిత పరిచారకసముదయంబుల
నుచితంబులగు స్థలంబుల విడియింప నియమించి దినదినంబు నభిన
వంబు లగు వివిధోపచారంబులు గావించుచుండె. 694

క. హరియు యుధిష్ఠిరు సముచిత
పరిచర్యల కాత్మ నలరి [4]పార్థుఁడుఁ దానున్
సరసవిహార క్రియలను
సురుచిరగతిఁ గొన్ని నెలలు సుఖముండె నృపా. 695

వ. అంత. 696

1. జెట్టి = మల్లుఁడు. 2. మందార ప్రసూనావలుల్ = మందార పుష్ప సమూహములు. 3. నివాళింపన్ = హారతులివ్వగా. 4. పార్థుఁడు = అర్జునుఁడు.

—♦ ధర్మరాజు శ్రీకృష్ణు ననుమతంబున భీమాదుల దిగ్విజయంబునకుఁ బంపుట ♦ ...

సీ. ధరణీశ యొకనాఁడు ♦ ధర్మతనూజుండు
ప్రవిమలనిజసభా ♦ భవనమందు
హితులు మంత్రులు పురో ♦ హితులును సుతులును
మిత్రులు బంధువుల్ ♦ క్షత్త్రివరులు
పరిచారకులు సూత ♦ పాఠక కవిబుధ
వరులును మునులును ♦ వరుసఁ గొలువఁ
జిరలీల నవరత్న ♦ సింహాసనస్థుఁడై
కొలువుండి వినతుఁడై ♦ నళిననాభు

తే. భువనరక్షణదక్షు న ♦ ద్భుతచరిత్రు
యదుకులేశ్వరు [1]మురదైత్య ♦ మదవిభేది
నాప్త నయవేదిఁ [2]జతురుపా ♦ య ప్రవీణుఁ
జూచి యిట్లని పలికె [3]న ♦ స్తోకచరిత. 697

తే. అనఘచారిత్ర రాజసూయాధ్వరంబు
నెమ్మిగావించు వేడుక ♦ నెమ్మనమున
నెనయుచున్నది యది నిర్వ ♦ హింప నీవ
కాక నాకాత్మబంధువుల్ ♦ గలరె యొరులు. 698

ఉ. ఎవ్వరు నీపదాంబుజము ♦ లెప్పుడుఁ గొల్తురు భక్తినిష్ఠులై
యెవ్వరు నిన్నుఁ బ్రేమ నుతి ♦ యింతురు భూరివివేకశాలురై
యవ్విమలాత్ము లందుదు రు ♦ దంచితశోభననిత్యసౌఖ్యముల్
నివ్వటిలంగఁ గృష్ణ నిను ♦ నేర్చిభజించిన రిత్తవోవునే. 699

వ. అనిన గృష్ణుండు ధర్మనందనున కిట్లనియె. 700

చ. నయగుణశాలి పాండునృప ♦ నందన నీతలఁపొప్పు నీక్రతు
క్రియ మునిదేవతాపితృ సు ♦ కృత్యము నై [4]నిఖిలోగ్రశాత్రవ

1. మురదైత్యమదవిభేది = మురాసురుఁడను రాక్షసుని గర్వమణంచినవానిని.
2. చతురుపాయ ప్రవీణున్ = సామదాన భేద దండోపాయములందు సమర్థుని.
3. అస్తోకచరిత = గొప్పచరిత్ర కలవాఁడా! 4. నిఖిలోగ్ర......మును = సమస్తమైన గొప్పశత్రువుల నాశనమును.

క్షయమును బాంధవప్రియము సంచితపుణ్యము నిత్యకీర్తియున్
జయమును గూర్చు దీనిఁ గురుసత్తమ వేగ యుపక్రమింపవే. 701

క. మనుచరిత నీసహోదరు । లనుపమ దివ్యాస్త్రవేదు లాహవభూమిం
జెనకినవైరి నృపాలురఁ । దునుమఁగఁజాలుదురు శౌర్యదుర్దమభంగిన్

క. గెలుపుము విమతనృపాలుర । వెలయుము బుధవినుతమైన విస్ఫురితకీర్తిన్
నిలుపుము నిఖిలధరామం । డలిని [1]భవచ్ఛాసనము దృఢంబుగ జెల్లన్.

క. నీపంచు కార్య మొరులం । జూపక యేఁ జేయ నిన్నుఁ బుట్టిన వేళం
జూపఁగవచ్చునె సకల ధ । రాపతులకు నీకుఁ జేయరానిది గలదే.

వ. కావున. 705

క. విమలమతి నిట్టి [2]మఖరా । జమునకుఁ దెప్పింపవలయు సంభారంబుల్
సమకూర్పుము నీయనుజుల । సమదగతిం బంపు నిఖిలశత్రుల గెల్వన్

క. అనుమాటలు విని కుంతీ । తనయుడు మోదమును బొంది తామరసాక్షున్
వినుతించి శౌర్యకలితుల । ననుజుల దెసఁ జూచి పలికె హర్షము తోడన్.

క. సృంజయ భూపాలకులును । గుంజర రథ వాజి సుభట కోటులు నినుఁ గొ
ల్వం జనుమని సహదేవుని । సంజకపొమ్మనియె [3]దక్షిణాశ జయింపన్.

క. ప్రకటచతుర్విధసేనా । ప్రకరంబులు గొలువఁ బంచె బడమటి శకున్
నకులున్ విదళితరిపుభూ । పకులన్ శౌర్యంబు మెఱసి పార్థివముఖ్యా!

క. దుర్జనభంజను [4]శౌర్యో । పార్జితవిజయప్రకాండు నాహవనిపుణు
న్నర్జునమహితయశోనిధి । నర్జును నుత్తరపుదిశకు ననిచె నరేంద్రా!

ఆ. మహితశౌర్యనిధులు మత్స్యకేకయ మద్ర
భూతలేంద్రబలసమేతముగను
దర్ప మొప్పఁ బంచెఁ దూర్పుదిక్కునకు ను
ద్దామనిహత వైరిధాము భీము. 711

చ. పనిచిన వార లేఁగి ఘన బాహుపరాక్రమ విక్రమంబుల
న్ననుపమ శౌర్యులైన చతురంత మహీశుల నోర్చి కప్పముల్

1. భవచ్ఛాసనము = నీయాజ్ఞ. 2. మఖరాజమునకు = శ్రేష్ఠమైన యజ్ఞమునకు. 3. దక్షిణాశ = దక్షిణదిక్కు. 4. శౌర్యో.....కాండున్ = శౌర్యముచేఁ బెక్కుజయముల నార్జించినవానిని.

కనకవిభూషణరత్నతురగప్రముఖాఖిల వస్తుజాతముల్
గొని చనుదెంచి ధర్మజున కొసంగఁ బ్రణమిల్లి యుదాత్తచిత్తులై.

చ. తమ తమ పోయి వచ్చిన విధంబులు భూపతులన్ జయించుటల్
క్రమమునఁ జెప్ప నందుల జరాతనయుం డరిపెట్టడయ్యె నం
చమరవరేణ్యనందనుఁ డహంకృతి దక్కఁగ విన్నవించినన్
[1]యమసుతుఁ డూరకుండె వికలాత్మకుఁడై విని యంతఁ గృష్ణుడున్.

తే. ధర్మనందనుఁ జూచి [2]యుత్కలికతోడఁ
బలికె మాగధుఁ బోరఁ జయింపఁగ నుపాయ
మొకటి గల దది సెప్పెద నుద్ధవుండు
నాకుఁ జెప్పిన చందంబు నయచరిత్ర. 714

చ. విను మగధేశ్వరుం డెపుడు విప్రజనావలియందు భక్తియున్
వినయముఁ గల్గి యొద్దియును వేఁడినచో వృథ సేయ కిచ్చుఁగా
వునఁ దగ నర్జునుండు పవనోద్భవుఁ డేనును బ్రాహ్మణాకృతిం
జని రణభిక్ష వేఁడిన వశంవదుఁడై యతఁ డిచ్చుఁ గోరికల్.

వ. అట్టియెడ. 716

—♦ శ్రీకృష్ణ భీమార్జునులు జరాసంధుని వధింపఁబోవుట ♦—

తే. తవిలి యప్పుడు మల్లయుద్ధమున వానిఁ
బిలుకుమార్పింపవచ్చును భీముచేత
ననిన ధర్మజుఁ డిదిలెస్స యన[3]విప్ర
వేషములు దాల్చి యరిగిరి విశదయశులు. 717

వ. అట్లు కృష్ణభీమార్జునులు బ్రాహ్మణవేషంబులు దాల్చి [4]త్రేతాగ్ను
లుం బోలెఁ దమశరీర తేజోవిశేషంబులు వెలుంగ నతిత్వరితగతిం
జని గిరివ్రజంబు సొచ్చి యందు నతిథిపూజలు శ్రద్ధాగరిష్ఠ
చిత్తుండై కావించుచున్న జరాసంధునిం గనుంగొని యిట్లనిరి.

1. యమసుతుఁడు = ధర్మరాజు. 2. ఉత్కలిక = విలాసము. 3. విప్రవేషములు = బ్రాహ్మణవేషములు. 4. త్రేతాగ్నులు = గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్నియను మూఁడగ్నులు.

క. ధరణీశ యతిథిపూజా
పరుఁడవు నీ వనుచు దిశలఁ బలుకఁగ విని మే
మరుదెంచితిమి మదీప్సిత
మఱసేయక యిమ్ము సువ్రతాచారనిధీ. 719

క. అతిథిజనంబుల భక్తిన్
సతతముఁ బూజించి యుచిత సత్కారము లు
న్నతి నడపు సజ్జనులు శా
శ్వతకీర్తులు ధరణిఁ బడయఁజాలుదు రనఘా. 720

క. పరికింపఁగ దేహం బస్థిరమని నిజబుద్ధిఁ దలఁచి చిరతరకీర్తి
స్ఫురణం బ్రస్తుతి కెక్కని పురుషుఁడు జీవన్మృతుండు భూపవివేకా.

క. ధారుణిలోన వదాన్యుల | కీరానిపదార్థ మొక్కటేనియు గలదే
కోరినఁ దన మేనెముకలు | ధీరుండయి యిచ్చెనఁ దధీచి వినమే.

క. అడిగిన వృథసేయక తన | యొడలాఁకలిఁగొన్న యెఱుక [1]కోగిరముఁగ నే
ర్పడనిచ్చి కీర్తిఁగనెనని | పుడమిన్ మును వినమె యల [2]కపోతము ననఘా.

క. ఆయింద్రాగ్నులు [3]శ్యేనక | వాయసరూపములఁ దన్ను వలతిఁగ వేడన్
ధీయుతుఁడయి మును శిబి తన [4]కాయము గోసిచ్చె ననజగంబుల వినమే.

ఆ. ధీరమతులు రంతిదేవ హరిశ్చంద్ర
బలుల నుంఛవృత్తి బ్రాహ్మణునిని
మున్ను సెప్ప వినమె సన్నుతచరితులు
సన్ననైన నేఁడు నున్నవారు. 725

వ. అనిన విని జరాసంధుండు వారల రూపంబులును మేఘగంభీర భాషణంబులును గుణకిణాంకంబులును మహాప్రభావంబులును జూచి తనమనంబున వీరలు బ్రాహ్మణ వేషధారులైన రాజేంద్రులుగా నోపుదు రని తలంచి యిమ్మహాత్ములు గోరిన పదార్థంబ కాదు ప్రాణంబులేనియు నిత్తు, నదియునుం గాక తొల్లి బలీంద్రుండు [5]విప్ర

1. ఓగిరముగ = ఆహారముగా. 2. కపోతము = పావురము. 3. శ్యేనకము = డేగ.
4. కాయము = దేహము. 5. విప్రవ్యాజంబునన్ = బ్రాహ్మణ వేషముతో.

వ్యాజంబున నడిగిన విష్ణుదేవునకు నాత్మపదభ్రష్టత్వం బెఱింగియు విచారింపక జగత్త్రయంబు నిచ్చి కీర్తి పరుం డయ్యె, క్షత్త్రబంధుం డను వాఁడు బ్రాహ్మణార్థంబు నిజప్రాణ పరిత్యాగంబు సేసి నిర్మలం బగు యశంబు వడసె, న దిగావున ననిత్యంబైన కాయంబు విచారణీయంబు గాదు కీర్తి వడయుట లెస్సయని తలంచి యుదారుండయి కృష్ణార్జున భీములం గని యిట్లనియె. 726

క. భూరిగుణులార మీ మది । గోరిక యెఱిఁగింపుఁ డేమి కోరిన నైనన్
ధీరత నొసఁగుటయే కా । దారయ నా శిరము ద్రుంచి యైనను నిత్తున్.

ఉ. నావుడుఁ గృష్ణుఁ డమ్మగధనాథున కిట్లను భూవరేణ్య నీ
భావము సూనృతవ్రత శుభస్థితిఁ జెందు టెఱుంగవచ్చె మా
కీవలె [1]నాజిభిక్ష యితఁ డింద్రతనూభవుఁ డే నుపేంద్రుఁడం
బావని యీతఁ డిం దొకనిఁ బైకొని యెక్కటి పోరఁగాఁ దగున్.

చ. అన విని వాఁడు నవ్వి యహహా వినవింతలు పుట్టెమున్ను న
న్నని మొన నోర్వఁజాలక భయంబునఁ బాఱితి పెక్కుమార్లు వం
చన మథురాపురిన్ విడిచి సాగర మధ్యమునందుఁ డాఁగవే
వనరుహనాభ నీబిరుదు వాఁడితనంబును నాకు వింతయే. 72

క. [2]ఇన్నేల సెప్ప మాయలఁ । బన్నిన బోవిడువ గోపబాలక బలసం
పన్నుని మాగధభూవరు। నన్నెఱుఁగవె తొల్లి నందనందన పోరన్.

ఉ. కాన [3]రణోర్వి నన్నెదురఁ గష్టము గానఁ దలంగు [4]గోత్రభి
త్సూనుఁడు భూరిబాహుబల సమృద్ధుఁ డయ్యును బిన్న యీ [5]మరు
త్సూనుఁడు మామక ప్రకట దోర్బలశక్తికిఁ జూడఁ దుల్యుఁడౌ
వీని నెదుర్తు నంచుఁ జెయి వీచె జరాసుతుఁ డుగ్రమూర్తి యై.

క. [6]కరువలిసుతునకు నొకభీ । కరగద నిప్పించి యొక్క గదఁ దన కేలన్
ధరియించి నలువురు నగ। చ్చఱంబురి వెలి కేఁగి యచట సమతలభూమిన్

1. ఆజిభిక్ష = యుద్ధపుభిక్ష (యుద్ధము చేయుట). 2. ఇన్నేల సెప్ప = ఇంత చెప్పుటయేల. 3. రణోర్వి = యుద్ధభూమి. 4. గోత్రభిత్సూనుఁడు = ఇంద్రసుతుఁడు (అర్జునుఁడు). 5. మరుత్సూనుఁడు = వాయుసుతుఁడు (భీముఁడు). 6. కరువలిసుతునకు = భీమునకు.

—శ్రీకృష్ణసహాయుండగు భీముండు జరాసంధునితో యుద్ధముచేయుట—

సీ. [1]పర్వతద్వంద్వంబు [2]పాథోధియుగళంబు
[3]మృగపతిద్వితయంబు [4]వృషభయుగము
[5]పావకద్వయము [6]దంతావళయుగళంబు
దలఁపడు వీక నద్దడ లీలఁ
గదిసి యన్యోన్య భీకరగదాహతుల ను
గ్రంబుగ విస్ఫులింగములు సెదరఁ
గెరలుచు సవ్యదక్షిణమండలభ్రమ
ణములను సింహచంక్రమణములను
తే. గదిసి పాయుచుఁ బాసి డగ్గఱుచు మింటి
కెగసి క్రుంగుచుఁ గ్రుంకి పైకెగసి భూమి
పగుల నార్చి ఛటచ్ఛటోద్భటమహోగ్ర
ఘనగదాఘట్టనధ్వని గగన మగల. 733

వ. పోరునంత.

మ. గద సారించి జరాతనూభవుఁడు హుంకారప్రఘోషంబులం
జద లల్లాడఁగఁ బాదఘట్టనములన్ సర్వంసహా భాగముం
గదలన్ వాయుజు వ్రేసె వ్రేయ నాతఁడు నుగ్రక్రోధదీప్తాస్యుఁడై
యదితప్పించి [7]విరోధిమస్తకము వ్రేయన్ వాఁడు వోఁదట్టుచున్.
చ. మడవక భీమసేనుఁడును మాగధరాజు గడంగి [8]బెబ్బులుల్
విడివడు లీల నొండొరుల వీఁపులు మూఁపులు నుం [9]బ్రకోష్ఠముల్
నడితల లూరు జానుజఘనప్రకరంబులు బిట్టు వ్రయ్యఁగాఁ
బిడుగులఁబోలు పెన్గదల బెట్టుగ వ్రేయుచుఁ బాయుచున్ వెసన్.
లయ. బెడ గడరు పెన్గదలు పోడిపోడిగఁ దాఁకఁ బెను
పిడుగు లవనిం దొరఁగ [10]నుడుగణము రాలన్

1. పర్వతద్వంద్వంబు = రెండుపర్వతములు. 2. పాథోధియుగళంబు = రెండుసముద్రములు. 3 మృగపతిద్వితయంబు = రెండు సింహములు. 4. వృషభయుగము = రెండుఎఁబోతులు. 5. పావకద్వయము = రెండు అగ్నిహోత్రములు. 6. దంతావళయుగళంబు = రెండుఏనుఁగులు. 7. విరోధిమస్తకము = శత్రుశిరము. 8. బెబ్బులులు = పెద్దపులులు. 9. ప్రకోష్ఠముల్ = ముంజేతులు. 10. ఉడుగణము = నక్షత్రసమూహము.

మిడుఁగుఱులు పొరిఁ[1]జదల ꣻ నడర హరిదంతములు ꣻ
వడఁక [2]జలధుల్ గలఁగ ꣻ బుడమి చలియింపన్
గడచఱువ మొత్తియును ꣻ దడఁబడఁగ నొత్తియును ꣻ
గడమగుడ లాఁచి తిరుꣻగుడు పడఁగ ద్రోయన్
వడవడ వడంకుచును ꣻ సుడివడక డాసి చల ꣻ
ముడుగక కపు డొండొరులు ꣻ వడిచెడక పోరన్. 737

వ. ఇవ్విధంబున బోరుచుండ నొండొరుల గదాదండంబులు దుమురు లైనం బెంపువడక సమదదిగ్వేదండశుండాదండమండిత ప్రచండంబు లగు బాహుదండంబు లప్పళించి ముష్టియుద్ధంబునకు డగ్గఱి. 738

లయ. కాల వెస దాఁచియును ꣻ గీలెడలఁ ద్రోచియును ꣻ
దాలుములు దూలఁ బెడꣻకేల వడి వ్రేయన్
ఫాలములు కక్షములు ꣻ తాలువులు వక్షములు ꣻ
వ్రీల నెముకల్ మెదడు ꣻ నేలకుమురై వే
రాల విపులక్షతని ꣻ లోల మగు నెత్తురులు ꣻ
జాలు గొని యోలిఁ బెనుꣻగాలువలుగం బే
తాలమదభూతములు ꣻ ఖేలనల జేతులను ꣻ
దాళములు తట్టుచు సꣻలీలగతి నాడన్. 739

ఉ. ప్రక్కలు చెక్కలున్ మెడలు ꣻ పాణితలంబులచేఁ బగుల్చుచున్
ముక్కులునక్కులుం జెవులు ꣻ [3]ముష్టిహతిన్ నలియంగ గ్రుద్దుచున్
డొక్కలుఁబిక్కలున్ ఘనꣻకఠోర పదాహతినొందుచున్ నెఱుల్
దక్కక స్రుక్క కొండొరులఁ ꣻ దార్కొని పేర్కొని పోరి రుగ్రతన్.

ఉ. హుమ్మని మ్రోగుచుం బెలుచ ꣻ హుంకృతులిచ్చుచుఁ బాసిడాసి కో
కొమ్మనుచు న్నొడళ్ళగల ꣻ గుల్లల తిత్తులు గాఁ బదంబులం
గ్రుమ్ముచు ముష్టిఘట్టనల ꣻ స్రుక్కుచు నూర్పులు సందడింపఁగా
సొమ్మలువోవుచుం దెలియు ꣻ చుఁ మదిఁ జేవయుల్లావుఁ జూపుచున్.

1. చదలనడరన్ = ఆకాశమున నొప్పునట్లుగా. 2. జలధుల్ = సముద్రములు. 3. ముష్టిహతిన్ = పిడికిళ్ళదెబ్బలచే.

వ. ఇవ్విధంబున వజ్రసన్నిభంబు లగు నితరేతరముష్టిఘట్టనంబుల భిన్నాంగులై [1]రక్తసిక్తశరీరంబులతోడం బుష్పితాశోకంబుల వీకను జేగురుగొండలచందంబునను జూపట్టి పోరుచుండఁ గృష్ణుండు జరాసంధుని జన్మమరణప్రకారంబు లాత్మ నెఱుంగుటం జేసి వాయుతనూభవున కలయిక లేక లావును జేవయుఁ గలుగునట్లుగాఁ [2]దద్గాత్రంబునందుఁ దనదివ్యతేజంబునిలిపి యరినిరసనోపాయం బూహించి [3]సమీరనందనుండు సూచుచుండ నొక్కశాఖాగ్రంబు రెండుగాఁ జీరి వైచి వాని నట్లచీరి చంపు మని సంజ్ఞగాఁ జూపిన నతండు నాకిలు దెలిసి యవక్రపరాక్రముండై మాగధుం బడఁద్రోచి వానిపదంబు పదంబునఁ ద్రొక్కి బాహుయుగళంబున రెండవపదంబుఁ గదల కుండం బట్టి [4]మస్తకపర్యంతంబుఁ బెళపెళ యను చప్పుడు ప్రభవిల్ల మత్తదంతావళంబు తాళవృక్షంబు చీరు చందంబునఁ బాదజాను జంఘోరుకటిమధ్యోదరాంసకర్ణనయనంబులు వేఱు వేఱు భాగంబులుగాఁ బ్రయ్యలు వాపి యార్చినఁ బౌరజనంబులు గనుంగొని భయాకులులై హాహాకారంబులు సేసి రంత. 742

—♦ కారాగృహవిముక్తులగు రాజులు శ్రీకృష్ణుని స్తుతించుట ♦—

క. అనిలజుని దేవపతినం।దనుఁడును బద్మాక్షుఁడును నర వారతనాలిం
గనములు సేసి పరాక్రమ।మునకద్భుతమంది మోదమునఁ బొగడిరొగిన్

క. వనజాక్షుఁ డంతఁ గరుణా।వననిధియును భక్తలోకవత్సలుఁడునుగా
వున మాగధసుతు సహదే।వునిఁ బట్టముగట్టెఁ దన్మహోన్నతపదవిన్

క. మగధాధినాథునకు ము।[5]న్నగపడి చెఱసాలలను మహాదుఃఖములన్
[6]నొగులుచు దనపాదాంబుజ।యుగళము చింతించుచున్న యుర్వీశ్వరులన్

వ. అయ్యవసరంబునఁ గృష్ణుండు దనదివ్యచిత్తంబున మఱవ నవధరింపక చెఱలు విడిపించిన వారలు బెద్దకాలంబు కారాగృహంబునఁ బెక్కు-

1. రక్తసిక్త శరీరంబులతోడన్ = రక్తముచే దడిసిన దేహములతోడ. 2. తద్గాత్రంబునందు = వాని శరీరమునందు. 3. సమీరనందనుండు = వాయుకుమారుఁడు (భీముఁడు) 4. మస్తక పర్యంతంబు = శిరస్సువఱకు. 5. అగపడి = లోఁబడి, 6. నొగులుచు = బాధపడుచు.

బాధలం బడి[1]కృశీభూతశరీరులగుటం జేసి రక్తమాంసశూన్యంబులై [2]త్వగస్థిమాత్రావశిష్టంబులు ధూళిధూసరంబులు నైన దేహంబులు గలిగి కేశపాశంబులు మాసి జటాబంధంబులైన శిరంబులతో మలినవస్త్రులై చనుదెంచి యప్పుడు. 746

సీ. నళినపద్మలోచను ᵹ భవబంధమోచను
భరితశుభాకారు ᵹ దురితదూరుఁ
గంకణ కేయూరుఁ ᵹ గాంచనమంజీరు
వివిధశోభితభూషు ᵹ విగతదోషుఁ
బన్నగాంతకవాహు ᵹ భక్తమహోత్సాహు
నతచంద్రజూటు న ᵹ వ్వులితకిరీటు
హరినీలనిభకాయుఁ ᵹ బరిపీతకౌశేయుఁ
గటిసూత్రధారు జ ᵹ గద్విహారు

తే. హారవనమాలికామహి ᵹ తోరువక్షు
శంఖచక్రగదాపద్మ ᵹ శార్ఙ్గహస్తు
లలిత శ్రీవత్సశోభితు ᵹ లక్షణాంగు
సుభగచారిత్రు దేవకీ ᵹ సుతుఁ గాంచి. 747

చ. భరిత [3]ముదాత్ములై [4]విగత ᵹ బంధనులై నిజమస్తముల్ మురా
సురరిపుపాదపద్మములు ᵹ సోఁకఁగ జాఁగిలి మ్రొక్కి నమ్రులై
కరములు మోడ్చి యో పరమ ᵹ కారుణికోత్తమ సజ్జనార్తిసం
హరణ వివేకశీల మహి ᵹ తాశ్రిత పోషణ [5]పాపశోషణా. 748

ఆ. వరద పద్మనాభ ᵹ హరికృష్ణ గోవింద
దాసదుఃఖనాశ ᵹ వాసుదేవ
యవ్యయాప్రమేయ ᵹ [6]యనిశంబుఁ గావింతు
మిందిరేశ నీకు ᵹ వందనములు. 749

---

1. కృశీభూతశరీరులు = చిక్కిన శరీరములు గలవారలు. 2. త్వగ...శిష్టంబులు = చర్మము నెముకలుమాత్రము మిగిలినవి. 3. ముదాత్ములై = సంతోషము గలవారై. 4. విగతబంధనులై = పోయిన బంధములు కలవారై. 5. పాపశోషణా = పాపములు పోఁగొట్టువాఁడా. 6 అనిశంబు = ఎల్లవేళలయందు.

ఉ. ధీరవిచార మమ్ము భవదీయపదాశ్రయులన్ జరాసుతో
దారనిబంధనోగ్ర పరితాపము [1]నీకరుణావలోకనా
సారముచేత నార్చితివి సజ్జనరక్షయు దుష్టశిక్షయు
న్నారయ నీకుఁగార్యములు యాదవవంశపయోధిచంద్రమా.

సీ. అవధరింపుము మాగధాధీశ్వరుఁడు మాకుఁ
బరమబంధుఁడుగాని పగఱగాఁడు
ప్రకటితరాజ్య వైభవ మదాంధీభూత
చేతస్కులము మమ్ముఁ జెప్పనేల
కమనీయ జలతరంగముల కైవడి దీప
శిఖవోలెఁ జూడ నస్థిరములైన
గురుసంపదలు నమ్మి పరసాధన క్రియా
గమ మేది తద్వ్యాధికంబు లగుచుఁ

తే. బరఁగు నన్యోన్యవైరానుబంధములను
బ్రజలఁ గారించుచును దుష్టభావచిత్తు
లగుచు నాసన్న మృత్యుభయంబు దక్కి
మత్తులై తిరుగుదురు దుర్మనుజు లంత. 751

చ. కడపటిసేఁత [2]నైహిక సుఖంబులఁ గోల్పడి [3]రిత్తకోర్కి వెం
బడిఁ బడి యెండమావులను బాలిశులై సలిలాశ డాయుచుం
జెను మనుజుల్ భవాబ్ధిదరిఁ జేరగలేక నశింతు రట్టి యా
యిడుమలఁ బొందఁజాలము రమేశ త్రిలోకశరణ్య మాధవా.

ఉ. వేదవధూశిరోమహితవీథులఁ జాల నలంకరించు మీ
పాద సరోజ యుగ్మము శుభస్థితి మా హృదయంబులందు ని
త్యోదిత భక్తిమైఁ దగిలియుండు నుపాయ మెఱుంగఁబల్కు దా
మోదర భక్తదుర్భవ పయోనిధితారణ సృష్టికారణా. 753

క. అని తను శరణము వేఁడిన|జననాథులవలను సూచి సదమలభక్తా
వనచరితుఁడు పంకజలో|చనుఁ డిట్లను వారితోడ సదయామతినై.

1. నీకరుణా ...రముచేత = దయగల నీ చూపులచే. 2. ఐహికసుఖంబులు= ఈ లోకమందు సుఖములు. 3. రిత్తకోర్కి = ఫలములేని కోరిక.

చ. జనపతులార! మీ పలుకు సత్యము రాజ్యమదాంధచిత్తులై
ఘనముగ విప్రులం బ్రజలఁ గాఱియఁబెట్టుటఁ జేసి కాదె వే
న నహుష రావణాసురులు నాశము నొందిరి కాన ధర్మపా
లనమునఁ గాక నిల్చునె కులంబు బలంబుఁ జిరాయు రున్నతుల్.

వ. అది గావున మీ మనంబుల దేహం బనిత్యంబుగాఁ దెలిసి 756

ఉ. మీరలు ధర్మముం దగవు మేరయుఁ దప్పక భూజనాళిఁ బెం
పారఁగ సౌఖ్యసంపదల నందఁగఁ బ్రోచుచు [1]భూరి యజ్ఞముల్
గారవవృత్తి మత్పరము గా నొనరించుచు [2]మామకాంఘ్రిసం
కేరుహముల్ భజించుచు [3]నకిల్బిషులై చరియింపుఁ డిమ్ములన్.

వ. అట్లయిన మీరలు బ్రహ్మసాయుజ్య ప్రాప్తులయ్యెదరు, మదీయపాదార
విందంబులందుఁ జలింపని భక్తియుఁ గలుగునని యానతిచ్చి యా
రాజపుంగవుల మంగళ స్నానంబులు సేయించి వివిధ మణి భూషణ
మృదులాంబర మాల్యానులేపనంబు లొసంగి భోజన తాంబూ
లంబులం బరితృప్తులం జేసి యున్నత రథాశ్వ సామజాధిరూఢులం
గావించి నిజరాజ్యంబులకుఁ బూజ్యులం జేసి యనిచిన. 758

క. నరవరు లీచందంబున । మురసంహారుచేత బంధమోక్షణులై సు
స్థిరహర్షంబులతో నిజ । పురములకుం జనిరి శుభవిభూతిదలిర్పన్

క. హరిమంగళ గుణకీర్తన । నిరతముఁ గావించుచును వినిర్మలమతులై
గురుబంధుపుత్త్రజాయా । పరిజన మలరంగఁ గృష్ణుఁ బద్మదళాక్షున్.

వ. బహుప్రకారంబులం బొగడుచుఁ దమతమ దేశంబులకుం జని. 761

క. నళినదళలోచనుఁడు దముఁ
దెలిపిన సద్ధర్మపద్ధతిని దగవరులై
యిలఁ బరిపాలించుచు సుఖ
ముల నుండిరి మహిత నిజ విభుత్వము లలరన్. 762

వ. ఇట్లు కృష్ణుండు జరాసంధవధంబును రాజలోకంబునకు బంధ
మోక్షణంబును గావించి వాయునందన వాసవతనయులుం దానును

1. భూరియజ్ఞముల్ = గొప్ప యజ్ఞములు. 2. మామ......రుహముల్ = నాపాద పద్మములు. 3. అకిల్బిషులై = పాపములేనివారై.

జరాసంధతనయుండగు సహదేవుండు సేయు వివిధంబులగు పూజలు గైకొని యతని నందు నియమించి యచ్చోటు గదలి [1]కతిపయ ప్రయాణంబుల నింద్రప్రస్థపురంబునకుం జనుదెంచి తద్వార పదేశంబున విజయశంఖములు పూరించినం బ్రతిపక్షభయదంబును బాంధవ ప్రమోదంబును నగు నమ్మహాఘోషంబు విని పౌరజనంబులు జరాతనయు మరణంబు నిశ్చయించి సంతసిల్లిరి. వారిజాక్షుండును భీమసేన పార్థులతోఁ బురంబు ప్రవేశించి ధర్మనందనునకు వందనం బాచరించి తమ పోయిన తెఱంగును నచ్చట జరాసంధుని వధియించిన ప్రకారంబును సవిస్తరంబుగా నెఱింగించిన నతండు [2]విస్మయవికచలోచనంబులనానందబాష్పంబులు గురియ నమ్మాధవు మాహాత్మ్యంబునకుం దమయందలి భక్తిస్నేహదయాదిగుణంబులకుం బరితోషంబు నొందుచుఁ గృష్ణునిఁ జూచి యిట్లనియె. 763

సీ. కమలాక్ష సర్వలోకములకు గురుఁడ నై
తేజరిల్లెడు భవదీయమూర్తి
యంశాంశసంభవు లగు లోకపాలురు
నీయాజ్ఞఁ దలమోచి నిఖిలభువన
పరిపాలనిపుణులై భాసిల్లుచున్నవా
రట్టి నీ కొక నృపు నాజ్ఞ సేయు
టరయ నీ మాయగా కది నిక్కమే యేక
మై యద్వితీయమై యవ్యయంబు
తే. నైన నీ తేజమున కొక హాని గలదె
[3]చిన్మయాకార నీపాద సేవకులకు
[4]నాత్మ పర భేదబుద్ధి యెందైన గలదె
పుండరీకాక్ష గోవింద భువనరక్ష. 764

-♦ ధర్మరాజు చేసెడు రాజసూయంబునందు శ్రీకృష్ణుండు శిశుపాలుని వధియించుట ♦-

వ. అని గోవిందునిం బొగడి యద్దేవుననుమతంబున నం గుంతీసుతాగ్రజుండు పరతత్త్వవిజ్ఞానులైన ధరణీసురులను ఋత్విజులంగా వరించి.

---

1. కతిపయప్రయాణములు=కొన్నిప్రయాణములు. 2. విస్మయ...నంబులన్=ఆశ్చర్యముచే విప్పారినకన్నులందు. 3. చిన్మయాకార = జ్ఞానస్వరూపుఁడా. 4. ఆత్మపరభేదబుద్ధి = తాను పరులు నను భేదభావము.

సీ. సాత్యవతేయ కశ్యప భరద్వాజోప
హయాత్రి విశ్వామిత్ర వీతిహోత్ర
మైత్రేయ పైల సుమంతు మధుచ్ఛంద
గౌతమ సుమతి భార్గవ వసిష్ఠ
వామదేవాకృత వ్రణ కణ్వజైమిని
ధౌమ్య పరాశ రాథర్వ కవషు
లసిత వైశంపాయ నాసురి భార్గవ
క్రతువీరసేన గర్గ త్రికవ్య

ఆ. ముఖ్యులైన పరమ మునులను గృపుని గాం
గేయు కుంభజాంబికేయ విదుర
కురుకుమార బంధుకులవృద్ధ ధారుణీ
సుర నరేంద్ర వైశ్య శూద్రవరుల. 766

క. రప్పింపవారు మార్గము। లుప్పతిలఁగ వేగుదెంచి యుచితక్రియలం
దప్పకకనుఁగొనుచుండఁగ।నప్పుడువిధ్యుక్తనియతులై భూమిసురుల్

ఆ. కడఁగి సవనభూమిఁ గనక [1]లాంగలముల
నర్థి దున్ని పాండవాగ్రజునకు
నచట దీక్ష చేసి యంచిత స్వర్ణమ
యోపకరణముల [2]నలోపముగను. 767

వ. ఇట్లు నియమంబున సముచితక్రియా [3]కలాపంబులు నడపుచుండి
రప్పుడు. 768

క. సకలావనీశు లిచ్చిన
యకలంక సువర్ణరత్న హయ ధన వస్త్ర
ప్రకరంబులు మొదలగు కా
నుక లందుకొనన్ సుయోధనుని నియమించెన్. 769

సీ. అర్థిజాతము గోరి నట్టి వస్తువులెల్లఁ
దగఁ బంచి యిడఁగ రాధాతనూజు

1. లాంగలము = నాఁగలి. 2. అలోపముగన్ = లోపములేకుండగ. 3. కలాపంబులు = సముదాయములు.

సరసాన్నపానాది సకల పదార్థముల్
[1]పాకముల్ సేయింపఁ బవనతనయుఁ
బంకజోదరు నొద్దఁ బాయక పరిచర్యఁ
దవిలి కావింప వాసవతనూజు
సవన నిమిత్తంబు సంచిత ద్రవ్యంబుఁ
బెంపుతో వేగఁ దెప్పింప నకులు

తే. దేవ గురు వృద్ధ ధాత్రీసురావలులను
నరసి పూజింప సహదేవు నఖిల జనులఁ
గొలుచు [2]మృష్టాన్నతతులఁ దృప్తులను జేయ
ద్రౌపదిని నియోగించెను ధర్మసుతుఁడు. 771

వ. అయ్యవసరంబున. 772

చ. హరి శిఖి దండపాణి నికషాత్మజ పాశి సమీర గుహ్యకే
శ్వర శశిమౌళి పంకరుహసంభవ చారణ సిద్ధ సాధ్య కి
న్నర గరుడోరగామర గణంబులు వచ్చి మఖంబుఁ జూచి య
చ్చెరువడి తొల్లి యెవ్వరును జేయు మఖంబులు నింతయొప్పునే.

క. అదిగాక యిందిరావిభు । పదములు సేవించునట్టి భాగ్యము గలుగన్
దుదిఁబడయరాని బహుసం । పద లెవ్వియుఁ గల వె యనుచుఁ బ్రస్తుతి సేయన్.

వ. అప్పుడు. 775

చ. అమరసమానులై తనరు యాజకవర్గములోని రాజసూ
యమఖవిధానమంత్రముల నగ్నిముఖంబుగఁ జేసి ధర్మజుం
గ్రమమున వేలిపింపఁ గ్రతురాజ సమాప్తిదినంబునన్ నృపో
త్తముఁడు గడంగి యాజక సదస్య గురుద్విజకోటి బెంపునన్.

వ. పూజించు నప్పుడం దగ్రపూజార్హు లెవ్వరని యడిగిన సదస్యులు దమకుఁ దోఁచిన విధంబులం బలుక వారి భాషణంబులు వారించి వివేకశీలుండును జతురవచనకోవిదుండును నగు సహదేవుండు భగవంతుండును, యదుకుల సంభవుండును నైన శ్రీకృష్ణునిం జూపి

1. పాకముల్ సేయింప = వండించుటకు. 2. మృష్టాన్నతతుల = పంచభక్ష్య పరమాన్నములతో.

యిమ్మహాత్ముని సంతుష్టుం జేసిన భువనంబు లన్నియుం బరితుష్టిం
బొందుననని చెప్పి ధర్మజుం జూచి యిట్లనియె. 777

ఉ. కాలము దేశమున్ గ్రతువుఁ గర్మముఁ గర్తయు భోక్తయుం జగ
జ్జాలము దైవమున్ గురువు సాంఖ్యము మంత్రమునగ్నియాహుతుల్
వేళలు విప్రులుం జనన వృద్ధి లయంబుల హేతుభూతముల్
లీలలు దానయై తగ వెలింగెడు నెక్కటి తేజ మీశుఁడున్. 778

చ. ఇతఁడె యితండు గన్నులొకయించుక మోడ్చిన నీ చరాచర
స్థితభువనంబు లన్నియు నశించు నితం డవి విచ్చిచూచినన్
వితతములై జనించుఁ బ్రభవిష్ణుఁడు విష్ణుఁడు నైనయట్టి యీ
క్రతుఫలదుండు గాక యొరుఁ డొకఁడెటు లర్హుఁడు శిష్టపూజకున్.

ఉ. ఈపురుషోత్తమున్ జగదధీశు ననంతుని సర్వశక్తుఁ జి
ద్రూపకు నగ్రపూజ బరితోషితుఁ జేయ సమస్తలోకముల్
వే పరితృప్తిఁ బొందు నృపప్రవర కావున నీవు కృష్ణునిన్
శ్రీపతిఁ బూజసేయు మెదఁ జేయక మాటలు వేయు నేటికిన్. 780

క. అని సహదేవుఁడు పలికిన
విని యచ్చటి జనులు మనుజవిభులును ఋషులున్
మునుకొని మనముల మోదము
దనుకఁగ నిది లెస్సయనిరి ధర్మజుఁ డంతన్. 781

క. మునిజనమానసమధుకర
వనజాతము లైన యట్టి వారిజదళలో
చను పదయుగళప్రక్షా
ళన మొగి గావించి తజ్జలంబులు భక్తిన్. 782

క. తానును గుంతియు ననుజులు
మానుగ ద్రుపదాత్మజయును మస్తకముల బెం
పూనిన నియతి ధరించి మ
హానందము బొంది రతిశయప్రీతిమెయిన్. 783

క. చంచత్కాంచనరుచిరోదంచిత వస్త్రములనూత్నార్కప్రభలన్
మించిన రత్నములం బూజించెన్ ధర్మజుఁడు కృష్ణు జిష్ణుసహిష్ణున్.

వ. ఇట్లు పూజించి యానందబాష్పజల బిందుకందళిత నయనారవిందం
బులం గోవిందుని సుందరాకారంబు దర్శింపంజాలకుండె నట్లు
పూజితుండై తేజరిల్లు పుండరీకాక్షు నిరీక్షించి హస్తంబులు నిజ
మస్తకంబుల ధరించి వినుతులు సేయుచు నఖిల జనంబులు
జయజయశబ్దంబు లిచ్చిరి. దేవతలు వివిధతూర్య ఘోషంబుల
తోడం బుష్పవర్షంబులు గురియించి రయ్యవసరంబున. 785

క. దమఘోషసుతుఁడు తద్విభవముసూచి సహింప కలుక ✽ వట్రిలఁగాఁ
బీఠముడిగ్గి నిలిచి నిజహస్తములెత్తి మనోభయంబు ✽ వక్కాణవాఁడై.

వ. అప్పుండరీకాక్షుండు వినుచుండ సభాసదులంజూచి యిట్లనియె. 787

క. చాలుఁ బురే యహహా యీ
కాలము కడపంగ దురవ ✽ గాహం బగు నీ
తేలాతప్పెను నేఁ డీ
బాలకువచనములచేతఁ ✽ బ్రాజ్ఞుల బుద్ధుల్. 788

వ. ఇట్లు తప్పిన తెఱం గెట్లనినఁ బాత్రాపాత్ర వివేకంబు సేయనేర్చిన
విజ్ఞాన నిపుణులు నున్నత సత్యగరిష్ఠులు బహువిధ తపోవ్రత
నియమశీలురు [1]ననల్పతేజులు మహదైశ్వర్యశక్తిధరులు బరతత్త్వ
వేదులు నఖిలలోకపాలపూజితులు [2]విగతపాపులు బరమయోగీం
ద్రులు నుండ వీరిం గైకొనక వివేకరహితులై గోపాలబాలునిం
బూజసేయుటకు నెట్లు సమ్మతించిరి. పురోడాశంబు [3]సృగాలంబున
కర్హంబగునే యదియునుంగాక. 789

సీ. గురు దేవ శూన్యుండు ✽ కుల గోత్ర రహితుండు
దలిదండ్రు లెవ్వరో ✽ తెడవఁగాన
మప్పులఁ బారలెడు ✽ నాదిమధ్యావసా [illegible]
నంబులం దరయ మానంబు లేదు
బహురూపియై పెక్కు ✽ భంగుల వర్తించు
వాని వర్తనములు ✽ వరుస లేవు

1. అనల్పతేజులు = తక్కువకాని తేజస్సు కలవారు. 2. విగతపాపులు = పాపములు పోయినవారు. 3. సృగాలంబునకు = నక్కకు.

పరికింప విగతసంబంధుండు దలపోయ
మా నిమిత్తంబున మానిసయ్యెఁ

తే. బరఁగ మున్న యయాతి శాపమునఁ జేసి
వాసి కెక్కఁడ యీ యదువంశమెల్ల
బ్రహ్మతేజంబునెల్లఁ గోల్పడిన యితఁడు
బ్రహ్మఋషి సేవ్యుఁడగునె గోపాలకుండు. 790

క. జారుఁడు [1]జన్మావధియును
జోరుఁడు [2]మువ్వేకలాఁడు సుమహితపూజా
చారక్రియలకు నర్హుఁడె
వారక నితఁ డనుచు నశుభవాక్యస్ఫూర్తిన్. 791

చ. అని తను దూఱనాడిన మురాంతకుఁ డా శిశుపాలువాక్యముల్
విని మదిఁ జీరికిం గొనఁడు విశ్రుత ఫేరవరావ మాత్మఁ గై
కొనని మృగేంద్రురీతి మునికోటియు రాజులుఁ బద్మనాభు నా
డిన యవినీతి భాషలకు [3]డెందమునం గడు వంత నొందుచున్.

ఉ. వీనులు మూసికొంచు విన విస్మయమంచు ముకుంద మాధవ
శ్రీనిధి వీని నే గతికిఁ జేర్చెదొ యంచు దురాత్ముఁ దిట్టుచు
[4]న్నా నరనాథులున్ మునులు నచ్చట నిల్వక పోవఁ బాండు సం
తానము లప్రమేయ బల దర్ప మహోద్ధత రోషచిత్తులై. 793

వ. అప్పుడు కేకయ సృంజయ భూపతులుం దామును వివిధాయుధ
పాణులై యదల్చి నిల్చిన వాఁడునుం బిఱుతివక యదల్చి పలుకయు
[5]వాలునుం గైకొని భుజాగర్వ దుర్వారుండై గోవిందునిఁ దదను
వర్తులైనవారలం గుపితుండై నిందింప నమ్ముకుందుం డాగ్రహంబున
లేచి తన కట్టెదుర నెదిర్చియున్న శిశుపాలుని రూక్షేక్షణంబుల
[6]నీక్షించుచు నాక్షణంబ [7]తన్మస్తకంబు నిశిత ధారాకరాళంబైన

---

1. జన్మావధియు = జన్మము మొదలుకొని. 2. మువ్వేకలాఁడు = త్రిగుణాత్మకుఁడు. 3. డెందమున = హృదయమున. 4. ఆ నరనాథులు = ఆ రాజులు. 5. వాలునుం = కత్తిని. 6. ఈక్షించుచు = చూచుచు. 7. తన్మస్తకంబు = వాని శిరము.

చక్రంబున నవక్ర పరాక్రముండై రుధిరంబు దొరఁగం దునుము
నమ్మహా కలకలం బాకర్ణించి చైద్యబలంబులును దదీయ పక్షచరు
లైన భూపతులును గనుకనిం బఱచి రయ్యవసరంబున. 794

క. మునివరులును జనపతులును
గనుఁగొని వెలిఁ గంద జైద్యు[1]గాత్రమునందుం
డనుపమ తేజము వెలువడి
వనజోదరు దేహమందు వడిఁ జొచ్చె నృపా. 795

వ. అనిన మునివరునకు భూవరుం డిట్లనియె. 796

క. కమలాక్షుని నిందించిన
దమఘోషతనూభవుండు దారుణ మలకూ
పమునం బొందక యే క్రియ
సుమహితమతిఁ గృష్ణునందుఁ జొచ్చె మునీంద్రా. 797

వ. అనిన శుకయోగి రాజయోగి కిట్లనియె. 798

మ. మధుదైత్యాంతకు మీఁది మత్సరమునన్ సుత్తిల్లి జన్మత్రయా
వధి నేప్రొద్దుఁ దదీయ రూప గుణ దివ్యధ్యాన పారీణ ధీ
నిధియౌటన్ శిశుపాల భూవిభుఁడు దా[2]నిర్ధూతసర్వాఘుఁడై
విధి రుద్రాదుల కందరాని పదవిన్ వే పొందె సర్వేశ్వరా. 799

వ. అంత ధర్మనందనుండు ఋత్విగ్గణంబులను సదస్యులను బహుదక్షిణ
లం దనిపి వివిధార్చనలం బూజించి [3]యవభృథ స్నానక్రియా పరి
తోషంబున, 800

సీ. మురజ మృదంగ గోముఖ శంఖ డిండిమ
పణవాదిరవము లంబరము నిండఁ
గవి సూత మాగధ గాయక వంది వై
తాళిక వినుతు లందంద బెరయ
వితతమర్దళ వేణువీణారవంబుల
గతులకు నర్తకీగతులు సెలఁగఁ

1. గాత్రమునందు = దేహమునందు, 2. నిర్ధూత సర్వాఘుఁడై = పోఁగొట్టఁబడిన పాపములుకలవాఁడై. 3. అవభృథస్నానము = యజ్ఞాంతమునచేయు స్నానము.

దరళవిచిత్రక ధ్వజపతాకాంకిత
[1]స్యందన గజ వాజి చయము లెక్క

తే. సుత సహోదర హిత పురోహిత జనంబు
కటక కేయూర హార కంకణ కిరీట
వస్త్రమాల్యాను లేపన వ్రాతములను
విభవ మొప్పారఁ గైసేసి వెడల నంత. 801

వ. మఱియు యదు సృంజయ కాంభోజ కురు కేకయ కోసల భూపాల ముఖ్యులు [2]చతుర్విధ సేనాసమేతులై ధరణి కంపింప వెన్నడి నడ తేర ఋత్విఙ్నికాయంబును సదస్యులను బ్రహ్మఘోషంబులొలయ [3]మున్నిడికొని శోభమానా నూన ప్రభా భాసమాన సువర్ణమయ మాలికా దివ్య మణిహారంబులు కంఠంబునం దేజరిల్ల [4]నున్నత జవాశ్వంబులం బూన్చిన పుష్పరథంబు కళత్రసమేతుండై యెక్కి యతిమనోహర విభవాభిరాముండై చనుదెంచుచుండె నప్పుడు [5]వారాంగనాజనంబులు తమతమ వారలం గూడికొని. 802

సీ. కనకాద్రిసాను సంగత కేకినుల భాతిఁ
గ్రొమ్ముళ్ళు వీఁపుల గునిసి యాడఁ
దరళ తాటంక ముక్తాఫలాంశుద్యుతుల్
చెక్కుటద్దములతోఁ జెలిమి సేయఁ
బొలసి యదృశ్యమై పోసి క్రొమ్మెఱుంగుల
గతులఁ గటాక్ష [6]దీధితులు దనర
మంచుపై నెగయ నూఁకించు [7]జక్కవ లనఁ
జన్నులు జిలుఁగుకంచెలల నఱుము

తే. మహిత కుచభార కంపిత మధ్య లగుచు
నర్థి మొలనూళ్ళు మెఱయఁ బయ్యెదలు జారఁ

---

1. స్యందన గజవాజి చయములు = రథములు, ఏనుఁగులు, గుఱ్ఱముల సమూహములు. 2. చతుర్విధ సేనాసమేతులై = రథ గజ తురగముల నధిష్ఠించినవారు, కాలి నడక నడచువారు. 3. మున్నిడుకొని = ముందుంచుకొని. 4. ఉన్నతజవాశ్వంబులం = ఎత్తు, వేగముగల గుఱ్ఱములు. 5. వారాంగనాజనంబులు = వేశ్యాస్త్రీలు, 6. దీధితులు = కాంతులు. 7. జక్కవలనన్ = చక్రవాక పక్షులనునట్లు.

గరసరోజాత కంకణ క్[1]క్వణనములును
జరణ నూపుర ఘోషముల్ సందడింప. 803

వ. మఱియు నయ్యిందువదన లందంద మందగమనంబునం జెందు [2]ఘర్మజలబిందు సందోహ కందళిత మందహాస చంద్రికా సుందర వదనారవిందంబుల నిందిందిర రుచిర చికుర బృందంబులు చిందఱ వందఱలై సందడిగొన నమందానంద హృదయలై సువర్ణ శృంగ సంగతంబు లైన సంకుమద మలయజముఖ సురభి తోయంబులు సముదాయంబులై తమ [3]తోయంబుల వారిపయిం జల్లుచు బెందోవల గొందలిరుల రచియించిన [4]చిమ్మనఁ గ్రోవులం దావులు గల పూఁదేనియలు నించి [5]వావులు దెలిపి తేఁలు మీఱఁ గ్రేవలనుండి [6]యిమ్ములంగని చిమ్ముచు మృగమద కుంకుమ పంకంబునుం గొంకక బింకంబుల జంకెలొలయం బంకజ సన్నిభంబులగు మొగంబుల [7]నేమఱించి చరుముచు నుల్లంబులు పల్లవింపం బెల్లడరి యందియలు గల్లుగల్లని మొరయఁ [8]గ్రేళ్ళు దాఁటుచుం జారుచంద్రికా సార [9]ఘనసారధూళి మిళిత రజనీపరాగంబు రాగంబు రంజిల్లం గరంబులం బుచ్చికొని శిరంబులం జల్లుచుఁ జిత్తంబుల నమ్మత్తకాశినుల వృత్తంబు లగు కుచంబుల కెత్తువత్తు మని బిత్తరించు పువ్వుగుత్తులం దత్తఱంబునఁ ద్రేవయుచుఁ బరిహసించుచు [10]ననోన్యకరకిసలయ కనక కరండ భరితంబగు పన్నీటం జెంగావి జిలుఁగు బుట్టంబులు దట్టంబుగాఁ దోఁగి మర్మంబులు బయలు పడిన నగ్గలంబు లగు సిగ్గులకు నొప్పిదంబులగు తమ కనుఱెప్ప లడ్డంబు సేయుచుఁ బురుషులుం దాము నారామ లభిరామ లీలాంసోక్తు లెనయ నంతరంగంబుల సంతసంబునం బంతంబు లిచ్చుచు [11]వసంతంబు లాడి రవ్వేళ నతులవిమానారూఢులై నయింద్రపురంధ్రీ జనంబులుం బోలె

---

1. క్వణనములు = ధ్వనులు. 2. ఘర్మజలబిందు = చెమట బిందువులు 3. తోయంబుల = ఉదకముల. 4. చిమ్మనఁ గ్రోవులన్ = జలక్రీడయందు నీళ్ళుచల్లు గొట్టములలో. 5. వావులు = బంధుత్వములు. 6. ఇమ్ములన్ = సాధనములను. 7. ఏమఱించి = ప్రమాదపడ. 8 క్రేళ్ళుదాటుచు = ఎగిరిపడుచు. 9. ఘనసార = మంచికర్పూరము. 10. అన్యోన్య = పరస్పరము. 11. వసంతంబులాడి = పారాణి నీటిచే ఆడుట.

హాటక [1]శిబిక లెక్కి నిజచేటికా జనంబులు సేవింపం జనుదెంచు [2]భూకాంత కాంతాజనంబులు తమ సరసంబులకు నర్హంబు లైన ధరణీపాల వధూలలామంబు లాదరించు చెలులపైఁ దమసఖీజనంబులం బురికొల్పి చల్లించుచు భావగర్భితంబు లగు వారి చతుర సరసోక్తుల మందహాస చంద్రికలు ముఖకమల లీలా విలాసలక్ష్మిం బ్రోది సేయంజని యివ్విధంబున నిజ సామ్రాజ్య విభవంబు పూజ్యంబుగా [3]నజాతశత్రుండు గంగాప్రవాహంబున కరిగి యందు నిజ వధూయుక్తుండై శాస్త్రోక్తప్రకారంబున నవభృథస్నానం బాచరించె నాసమయంబున. 804

క. [4]అనిమిష దుందుభి ఘనని
స్వనములు వీతెంచె బుష్ప ✽ వర్షము గురిసెన్
ముని దేవ పితృమహీసుర
వినుతుల రవ మొసఁగె నపుడు ✽ విమలచరిత్రా. 805

క. నరు లెట్టి పాపు లైనను
గరమర్థిని నద్దిచేసి ✽ [5]గతకల్మషులై
చరియింతు రట్టి యవభృథ
మరుదుగ గావించి రెలమి ✽ నఖిలజనంబుల్. 806

ఆ. అంత ధర్మతనయుఁ ✽ డభినవమ్మృదుల దు
కూల సురభికుసుమ ✽ మాలికాను
లేపనములు రత్న ✽ దీపితభూషణా
వళులు దాల్చి వైభ ✽ వమున నొప్పె.

వ. అంత నవభృథస్నానానంతరంబున మరలి చనుదెంచి. 808

ఉ. పాండుతనూభవాగ్రజుఁడు ✽ పాండుయశోనిధిభాసమాన[6]మా
ర్తాండనిభుండు యాజక స ✽ దస్యమహీసుర మిత్రబంధు రా

1. శిబికలు = పల్లకులు. 2. భూకాంతకాంతాజనంబులు = రాజస్త్రీలు. 3. అజాతశత్రుండు = శత్రువులు లేనివాఁడు (ధర్మరాజు). 4. అనిమిష...... నులు = దేవతల దుందుభిధ్వనులు. 5. గతకల్మషులై = పోయినపాపములు గలవారై. 6. మార్తాండనిభుండు = సూర్యునితో సమానమైనవాఁడు.

ణ్మండలిఁ బూజ చేసి బుధ✽మాన్యచరిత్రుఁడు వారికిచ్చె నొం
డొండ దుకూలరత్నకన✽కోజ్జ్వల భూషణ ముఖ్యవస్తువుల్.

వ. అట్లు నారాయణపరాయణులై దేవసమాన ప్రకాశ ప్రభాసంబుల సకల నర నారీలోకంబు [1]లనర్ఘ్యరత్నమయ భూషణమాల్యానులేపనంబులు ధరియించి పరమానందభరితాత్ములై యొప్పియుండి రంత. 810

చ. సునిశితభక్తిఁ దన్మఖముఁ ✽ జూడఁగ వచ్చిన యట్టి దేవతా
ముని ధరణీసుర ప్రకర ✽ భూవర [2]విడ్జనశూద్రకోటి య
జ్జనవరచంద్రుచే నుచిత ✽ సత్కృతులం బరితోషితులై
వినయముతోడ ధర్మజుని ✽ వీడ్కొని పోవుచుఁ బెక్కుభంగులన్.

చ. హరిచరణాంబుజాతయుగ✽ళార్చకుఁడై పెనుపొందు పాండుభూ
వరసుతురాజసూయ [3]మఖ ✽ వైభవమున్ నుతియించుచున్ సమా
దరమున నాత్మభూముల కు✽దారత నేగిరి ధర్మసూనుఁడున్
సరసిజనేత్రుఁ దా ననుప✽జాలక యుండు మటంచు వేఁడినన్.

వ. ఇట్లు పాండవాగ్రజు ప్రార్థనం గైకొని దామోదరుండు సమస్త యాదవులను గుశస్థలికిఁ బోవం బనిచి [4]కతిపయపరిజనంబులుం దానును నతనికిం బ్రియంబుగాఁ దన్నగరంబునఁ బ్రమోదంబున నుండెనని చెప్పి మఱియు నిట్లనియె. 813

చ. జనవర పాండుభూపతన✽జాతుఁడు దుస్తరమౌ మనోరథా
బ్ధిని సరసీరుహాక్షుఁ డను ✽ తెప్పకతంబున దాఁటి భూరిశో
భనయశుఁడై మనోరుజయుఁ ✽ బాసి ముదాత్మకుఁడై వెలింగె న
వ్వనరుహనాభుదాసజన✽వర్యులకుం గలవే యసాధ్యముల్. 814

వ. ఇట్టియెడ. 815

ఆ. రాజసూయమఖవ✽రప్రభావమునకు
నఖిలజనులు మోద✽మంది రపుడు

---

1. అనర్ఘ్య = విలువలేని, 2. విడ్జన = వైశ్యులు, 3. మఖవైభవమున్ = యజ్ఞవిభవమును, 4. కతిపయ = కొంత.

కలుషమానసుండు కులపాంసనుఁడు సుయో
ధనుఁ డొకండు దక్క ధరణినాథ. 816

వ. అనిన విని శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 817

ఆ. అఖిలజనుల కెల్ల నానందజనకమై
యెనయు [1]మఖము కురుకులేశ్వరునకుఁ
[2]గర మసహ్యమైన కారణ మెయ్యది
యెఱుఁగఁ బలుకు నాకు సిద్ధచరిత. 818

చ. అనిన మునీంద్రుఁ డిట్లను ధరాధిపుతోఁ గురురాజు పాండునం
దనుల దెస [3]ననేకదురితంబులు నిచ్చలు సేయుచుండు నై
నను నొకనాఁడు పంకరుహనాభదయాపరిలబ్ధ భూరిశో
భనజితదేవదైత్య నరపాలక రాజ్యరమామహత్త్వమై. 819

చ. వెలయు [4]ననూనసంపదల విశ్రుతకీర్తులు మిన్ను ముట్టఁ బెం
పలరిన పాండుభూవరసుతాగ్రజుఁ డంతిపురంబులోన ను
జ్జ్వలమణిభూషణాంశురుచిజాలము పర్వఁ బయోజనాభు ను
త్కలిక భజించుచున్ ఘనసుఖస్థితి భూమనోహరాకృతిన్. 820

వ. ఉండం గనుంగొని యదియునుం గాక యొక్కనాఁడు లలితాష్టమీ
శశాంకబింబంబుల విడంబించుచు నింద్రనీలరుచి నిచయంబు నపహ
సించుకుటిలకుంతలంబులు నటనంబు సలుపం దనరు నిటలఫలకంబు
లును బుష్పచాప చాపంబు రూపు నేర్పు మాపు భ్రూయుగోపాంతంబులై
సౌదామనీదామరుచిస్తోమంబులై కర్ణాంతసీమంబులై యంజనంబుల
తోడ రంజిల్లు నేత్రకంజంబులును నవమల్లికా ముకుళవిభాసితదంత
మరీచికా నిచయోద్దీపిత మందహాస చంద్రికా ధవళితంబులును
ముకురోపమితంబులునై కర్ణకుండల మణి మరీచి జాలంబులు బెరసి
బహుప్రకారంబులఁ బర్వం బొలుచు కపోలపాలికలును విలసిత
గ్రైవేయక ముక్తాహారఫల నిచయంబుల కిమ్ము చూపక మిసమిసని
పసగల మెఱుఁగులు గిఱికొన మీటినం బగులునన బాగడం దగి

1. మఖము = యజ్ఞము. 2. కరము = మిక్కిలి. 3. అనేకదురితంబులు = అనేకపాపములు. 4. అనూనసంపద = తక్కువకాని సంపత్తులు. 5. ధవళితంబులును = తెల్లనైనవియు.

మొగంబులకుం బుటంబు లెగయు నత్తుంగ పీన కుచభారంబుల వ్రేఁగు లాఁగలేక తూఁగాడుచుం గరతలపరిమేయంబు లగు మధ్యభాగంబులును ఘన జఘనమండలావతీర్ణ కాంచన కాంచీకలాప కింకిణీ కలకలనినాదోల్లసితంబు లగు కటిప్రదేశంబులును సల్లలిత హల్లకపల్లవ కాంతులమొల్లంబులఁ గొల్లలుగొని యభిరామంబులై శోభిల్లు పదపాణితలంబులును నలసగతులం బదంబులం దనరు మణి నూపురంబులు గోపురంబులం [1]ప్రతిస్వనంబు లొలయ మొరయ నలరు చరణారవిందంబులును రత్నవలయ కంకణాంగుళీయకాది వివిధ భూషణద్యుతి నిచయంబు లుష్ణమరీచికరనిచయంబుల ధిక్కరింప వెలుంగు కరకంజంబులును మృగమద ఘనసార హరిచందన నాగరు కుంకుమ పంకంబుల భాసురంబులగు వాసనలు [2]నాసారంధ్రంబులకు వెక్కసంబులై పొలయు సౌభాగ్యంబులుం గలిగి చైతన్యంబు నొందిన మాణిక్యపుబొమ్మల విధంబున గగనమండలంబు నిర్గమించి వసుధాతలంబున సంచరించు చంద్రరేఖలచెలువున శృంగారరసంబు మూర్తీభవించి జగంబుల మోహపఱుచు మోహినీదేవతల చందంబున విలసించు మాధవవధూసహస్రంబుల సంగతిని సౌదామనీలతయునుం బోలె నొప్పుచుండెను ద్రుపదరాజనందన విభవంబును రాజసూయ మహాధ్వరోత్సవంబునం జూచి చిత్తం బుత్తలపడ సుయోధనుండు సంతాపానలంబునం గ్రాఁగుచుండె, నంత నొక్కనాఁడు ధర్మనందనుండు నిర్మలం బగు సభా[3]భవనంబునకుం జని. 621

సీ. సుత సహోదర పురోహిత బాంధవామాత్య
    పరిచారభటకోటి బలసి కొలువఁ
గలిత మాగధ మంజుగానంబుఁ బాఠక
    పఠన రవంబును బ్రమద మొసఁగఁ
గంకణ ఝణఝణత్కారంబు శోభిల్ల
    సరసిజాననలు చామరము లిడఁగ

1. ప్రతిస్వనంబులొలయ = ప్రతిధ్వను లొప్పునటుల. 2. నాసారంధ్రంబుకు = ముక్కురంధ్రములకు. 3. భవనంబునకు = గృహమునకు.

మయవినిర్మిత సభా మధ్యంబునను భాస
మానసింహాసనా సీనుఁ డగుచు

తే. నమరగణములు గొలువఁ బెంపారు [1]ననిమి
షేంద్రుకైవడి మెఱసి యహేంద్రుఁ డలర
సరసఁ గొలుఁ వున్న యతఱి దురభిమాని
క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు. 822

ఉ. కాంచనరత్నభూషణ నికాయముఁ దాల్చి సముజ్జ్వలప్రభో
[2]దంచితమూర్తి నొప్పి [3]పణిహారులు ముందటఁ గ్రందువాయ వా
రించ సహోదరుల్ నృపవరేణ్యులు పార్శ్వములన్ భజింప నే
తెంచెను రాజసంబున యతిస్ఫిరుపాలికి నైభవోన్నతిన్. 823

వ. అట్లు చనుదెంచి మయమాయామోహితం బైన సభాస్థలంబునందు.

క. సలిలములు లేని తావున
[4]వలువలు వెస నెగయఁ దిగిచి వారక తోయం
బులుగల చోటను [5]చేలం
బులు దడియఁగఁ బడియె నిజప్రభుత్వము దఱుఁగన్. 825

క. ఆవిధమంతయుఁ గనుఁగొని| [6]పావనివృత్తి యునచ పార్థివులును గాం
తావలియును యమతనయుఁడు| వావిరిఁ జేసన్నఁ దమ్ము వారింపంగన్.

వ. దామోదరానుమోదితు లయి మహారవంబుగాఁ బరిహాసంబులు చేసిన సుయోధనుండు లజ్జావనతవదనుం డయి కుపితమానసుం డగుచు నయ్యెడ నిలువక వెలువడి నిజపురంబున కరిగె నయ్యవసరంబున ధీవిశాలురైన సభాసదులగు నచ్చటి జనంబుల కోలాహలంబు సంకులం బైన నజాతశత్రుండు చిత్తంబున విన్ననై యుండె నప్పుండరీకాక్షుండు భూభారనివారణకారణుం డగుటం జేసి దుర్యోధను నపహాసంబునకుం గా దనం డయ్యెనంత. 827

క. హరి ధర్మసుతుని వీడ్కొని
తరుణీహితబంధుజన[7]కదంబము గొలువం

1. అనిమిషేంద్రుకైవడి = ఇంద్రునివలె. 2. ఉదంచిత = ఒప్పుచున్న. 3. పణిహారులు = ద్వారపాలకులు. 4. వలువలు = వస్త్రములు. 5. చేలంబులు = వస్త్రములు. 6. పావని = భీముఁడు. 7. కదంబము = సమూహము.

బరితోషమమునఁ గుశస్థల
పురమునకుం జనియె మోదమున నరనాథా! 828

చ. జనవరబంధమోక్షణముఁ జైద్యవధంబును బాండురాజనం
దన మఖరక్షణంబును నుదాత్తఁ జేసిన యట్టి దేవకీ
తనయుచరిత్ర భాసురకథా పఠనాత్ములు గాంతు రిష్ట శో
భన బహుపుత్రకీర్తులను [1]భవ్యవివేకము విష్ణులోకముల్. 829

క. అని శుకయోగీంద్రుం డ
మ్మనుజేంద్రునిఁ జూచి పలికె మఱియును శ్రీకృ
ష్ణుని యద్భుతకర్మంబులు
వినిపింతుం జిత్తగింపు విమలచరిత్రా. 830

—సాళ్వుండు శివప్రసాదంబున సౌభకవిమానంబు వడసి ద్వారకాపురిపై దండెత్తుట—

సీ. వసుధేశ విను మును వైదర్భిపరిణయ
వేళ దుర్మద శిశుపాల భూమి
వరునకు దోడ్పడ నరుదెంచి సైనికా
వలితోడఁ బోడిమి దోర్బలము దూలి
హరిచేత నిర్జితులైన రాజులలోనఁ
జైద్యుని చెలికాఁడు సాల్వభూమి
పతి జరాసంధాద పార్థివప్రకరంబు
విన మత్సరానల విపులశిఖల

తే. ధాత్రి నిలమీఁద [2]వీతయాదవము గాఁగఁ
గడఁగి సేయుదు నని దురాగ్రహముతోడ
బంతముఁ బల్కి యట చని భరితనిష్ఠఁ
దపము గావింపఁ బూని సుస్థలమునందు. 331

క. ధృతి వదలక యుగస్థితిఁ
బ్రతిదినమును బిడికెఁ [3]డవనిరజ మశనముగా

1. భవ వివేకము = మంగళముతో గూడిన విజ్ఞానము. 2. వీతయాదవము = యాదవులు లేనట్టుగా. 3. అవనిరజము + అశనము గాన్ = భూమిమీఁద దుమ్ము అన్నముగా భక్షించుట.

సతినియమముతో నా పసు
పతి శంకరు ఫాలనయను ✽ భర్గు నుమేశున్. 832

క. చెదరని నిజభక్తిని ద
త్పదపద్మము లాత్మనిలిపి ✽ పాయక యొకయేఁ
డుదితక్రియ భజియించిన
1మదనారియు వానిభక్తి✽మహిమకు వశుఁడై. 833

క. బోరనఁ బ్రత్యక్షుండై
కోరినవర మేమియైనఁ ✽ 2గొసరక యిత్తున్
వారక వేఁడు మటన్నను
నారాజతపోధనుండు ✽ హరునకుఁ బ్రీతిన్. 834

తే. వందనం బాచరించి యా✽నంద వికచ
వదనుఁడై నొస లంజలిఁ ✽ గదియఁజేర్చి
శ్రితదయాకార నన్ను ర✽క్షించె దేని
నెఱుఁగ వినుపింతు వినుము మ✽దీప్సితంబు. 835

తే గరుడ గంధర్వ యక్ష రా✽క్షస సురేంద్ర
వరులచే సాధ్యపడక నా✽వలయు నెడల
3నభ్రపథమునఁ దిరిగెడు ✽ నట్టి మహిత
వాహనము నాకు దయచేయు ✽ వరద యీశ. 836

వ. అని 4యభ్యర్థించినం బ్రసన్నుండై హరుండు వానికోర్కె కను
రూపంబైన విమానంబు నిర్మింప మయుని నియోగించిన నతండును
నట్లసేసెద నని కామగమనంబును నతివిస్తృతంబునుగా లోహంబున
నిర్మించి సౌభకంబనునామంబిడి సాల్వునకిచ్చిన వాఁడును బరమా
నందంబునం బొంది తద్విమానారూఢుండై యాదవులవలని పూర్వ
వైరంబుఁ దలంచి దర్పాంధచేతస్కుండై ద్వారకానగరంబుపైఁ జని
నిజసేనాసమేతంబుగాఁ దత్పురంబు నిరోధించి. 837

---

1. మదనారియు = శివుడును, 2 గొసరక = సంకోచింపక. 3. అభ్రపథమున = ఆకాశమార్గమున, 4. అభ్యర్థించినన్ = కోరగా.

సీ. సరిదుపవన సరో§వరములు [1]మాయించి
బావులు గలఁచి కూ§పములు చెఱిచి
కోటలు వెస పీట§తాటముల్ గావించి
[2]పరిఖలు పూడ్చి [3]వ§ప్రములు [4]ద్రొబ్బి
యట్టళ్ళు ధరఁగూల్చి § యంత్రముల్ దునుమాడి
కాంచనధ్వజపతా§కములు నఱకి
భాసురగోపుర § ప్రాసాదహర్మ్యంబు
శాలాంగణములు భ§స్మములు సేసి
తే. విమలకాంచనరత్నాది § వివిధవస్తు
కోటి నెల్లను నందంద § కొల్ల పుచ్చి
ప్రజలఁ జెఱపట్టి దారలను § భంగపెట్టి
తఱిమి యిబ్బంగిఁ బెక్కు బా§ధల నలంచి. 838

చ. మదమున నంతఁ బోవక వి§మానయుతంబుగ [5]నభ్రవీథికిన్
గొదకొని యేపుమై నెగసి § క్రొంకక శక్తి [6]శిలామహీరుహ
[7]ప్రదరము లోలిమైఁ గురిసి § బంధురభూమి పరాగశర్కరల్
వదలక చల్లుచున్ వలయ § వాయువుచే దిశ లావరించుచున్.

వ. అట్టియెడ. 840

క. చటులపురత్రయదనుజో
త్కటదుష్కరబాధ్యమాన § ధారుణిగతి న
ప్పటుభేదన మెంతయు వి
స్ఫుటపీడం జెంది వగల § సుడివడు చుండన్. 841

చ. కని భగవంతుఁడున్ రథి§కామణియున్న గు రౌక్మిణేయుఁ డ
జ్జనముల నోడకుండుఁడని § సంగరకౌతుక మొప్ప దివ్యసా
ధనములఁ బూని సైనిక క§దంబము గొల్వ సమానమానకే
తనరుచి గ్రాల నున్నత ర§థస్థితుఁడై వెడలెన్ [8]రణోర్వికిన్.

---

1. మాయించి = నశింపజేసి. 2. పరిఖలు = కోటచుట్టునుండు అగడ్తలు. 3. వప్రము = ప్రాకారము 4. ద్రొబ్బి = పడగొట్టి. 5. అభ్రవీథికిన్ = ఆకాశమార్గమునకు. 6. శిలామహీరుహ = రాళ్ళు, వృక్షములు. 7. ప్రదరములు = బాణములు. 8. రణోర్వికిన్ = యుద్ధభూమికి.

వ. అయ్యవసరంబున.

చ. సమధికబాహుశౌర్యజిత చండవిరోధులు వెళ్ళి రున్నత
క్షమ గద భానువింద శుక సాత్యకి సారణ చారుదేష్ణ సాం
బ మకరకేతనాత్మజ [1]శ్వఫల్కతనూభవ తత్సహోదర
ప్రముఖయదూత్తముల్ విమతభంజనులై కృతవర్మ మున్నుగన్

క. వారణ వాజి స్యందన
వీరభటావలులు నడిరి విశ్వము వడఁకన్
ఘోరాకృతి వివిధాయుధ
భూరిద్యుతు లర్కబింబమును గబళింపన్. 845

వ. చని యాగోవిందనందన [2]స్యందనంబును బలసందోహంబునుం దల
కడచి యదుసైన్యంబులు సాల్వబలంబులతోడం దార్కొని పెనయు
నప్పుడు దేవదానవ సంకులసమరవిధంబునం [3]దుములం బయ్యె
నయ్యెడ. 846

మ. [4]వితతజ్యాచయ టంకృతుల్ మదజలావిర్భూతశుండాల ఘీం
కృతులు ద్యద్భటహుంకృతుల్ మహితభేరీభాంకృతుల్ భీషణో
ద్ధతనిస్సాణధణంకృతుల్ ప్రకటయోధవ్రాతసింహాంకృతుల్
కుతలంబున్ దివి నిండ మ్రోసె రిపుసంక్షోభంబుగా భూవరా.

మ. [5]హరిరింఖారథనేమి సద్భటపద వ్యాఘట్టనోద్భూత దు
స్తరధూళీపటల ప్రభూత నిబిడ ధ్వాంత ప్రవిధ్వంస కృ
త్కరశాతాసిగదాదిహేతిరుచు లాకాశంబు నిండన్ [6]వియ
చ్చరదృక్కుల్ మిఱుమిట్లు గొల్ప సమరోత్సాహంబు సంధిల్లగన్

చ. తలకొని సైనికుల్ గవిసి తార్కొని పేర్కొని పాసి డాసి యం
కిలి గొన [7]నెమ్ము [8]లమ్ములఁ బగిల్చి నొగిల్చి తరేతరుల్ తలల్

1. శ్వఫల్క......యదూత్తముల్ = శ్వఫల్కుఁడు, వాని కుమారులు, సోదరులు యాదవులు లోనగువారు. 2. స్యందనంబు = రథము. 3. తుములంబు = దొమ్మి. 4. వితత .. కృతుల్ = వ్యాపించిన వాద్యధ్వనులు. 5. హరిరింఖారథనేమి = గుఱ్ఱపుడెక్కలు రథ చక్రములు. 6. వియచ్చరదృక్కుల్ = అంతరిక్షమున సంచరించువారి చూపులు. 7. ఎమ్ములు = ఎముకలు. 8. అమ్ములన్ = బాణములచే.

నలియఁగ మొత్తి యొత్తి నయనంబుల నిప్పులు రాల లీల నా
దలలు లలాటముల్ ఘన గదాహతి నొంచి కలంచి పోరఁగన్.

వ. అయ్యవసరంబునఁ బ్రద్యుమ్నుండు గనుంగొని. 850

మ. అనయంబుం గలుషించి సౌభపతిమాయాకోట్లు చంచచ్ఛరా
సననిర్ముక్త నిశాతదివ్య మహితాస్త్ర శ్రేణిచే దత్క్షణం
బున లీలాగతి నభ్రభాగుల్ మనముల్ భూషింప మాయించె న
వ్వనజాతాప్తుఁడు భూరిసంతమసమున్ వారించు చందంబునన్. 

వ. మఱియును. 852

చ. అతిరథికోత్తముం డన నుదంచిత [1]కాంచన పుంఖ పంచ విం
శతి విశిఖంబుల న్నతని సైనికపాలుని నొంచి యుగ్రుడై
శతశత కోటికోటి నిభ సాయకముల్ వరఁగించి సాల్వభూ
పతి [2]కకుదంబునొంచి లయభైరవుఁడై వడిఁ బేర్చి వెండియున్.

చ. పదిపది [3]యమ్ములన్ మనుజపాలవరేణ్యుల నొంచి రోషముం
గదురఁగ మూఁడుమూఁడు [4]శితకాండములన్ [5]రథదంతివాజులం
జదియఁగ నేసి యొక్కొక [6]నిశాతశరంబున సైనికావళిన్
మదము లడంచి యిట్లతఁడమానుషలీలఁ బరాక్రమించినన్.

క. దుర్మానవహరు నద్భుత
కర్మమునకు నుభయ సైనికప్రకరంబుల్
నిర్మలమతి నుతియించిరి
ధర్మాచల ధైర్య విగతభయుఁ బ్రద్యుమ్నున్. 855

వ. అయ్యవసరంబున. 856

ఉ. సాంబుని సాల్వభూవిభుఁడు సాయకజాలము లేసి నొంచినన్
జాంబవతీతనూభవుఁడు చాపము [7]సజ్యము సేసి డాసి సా

1. కాంచన..... బులన్ = బంగారపు పిడులుగల వాడిగల యిరువదియైదు బాణములను. 2. కకుదంబు = మెడభాగము 3. అమ్ములన్ = బాణములను. 4. శిత కాండములన్ = వాడియగు బాణములను. 5. రథదంతివాజులం = రథగజతురగము లను. 6. నిశాతశరంబునన్ = వాడిబాణమున. 7. సజ్యముసేసి = వింటికినారిచేర్చి.

ల్వుం బదిసేను బాణముల నున్నతవక్షము గాఁడ నేసి [1]శా
తాంబక వింశతి న్నతని సౌభక మల్లలనాడ నేసినన్. 857

చ. గదుఁడు మహోగ్రవృత్తి నిజకార్ముక నిర్గత విస్ఫురద్విధుం
తుదవదనాభ బాణ వితతుల్ పఱఁగించి విరోధిమస్త్రముల్
గుదులుఁగ గ్రుచ్చి యెత్తుచు నకుంఠిత విక్రమ కేళిఁ గోలుఁడై
[2]చదల సురల్ నుతింప నధికశస్త్రముఁ దొప్పె నరేంద్రచంద్రమా.

ఉ. సాత్యకి చండరోషమున సాల్వ మహీవరు భూరిసౌభ సాం
గత్య చతుర్విధోగ్రబల గాఢ తమఃపటలంబు భాసు [3]రా
దిత్య మయూఖపుంజరుచి తీవ్రశరంబుల మాపి సైనిక
స్తుత్య పరాక్రమ ప్రకట దోర్బలుఁడై విలసిల్లె భూవరా.

ఉత్సాహము. భానువిందుఁ డుద్ధతిన్ విపక్షపక్ష సైన్య దు
ర్మానకాననానలోపమాన చండకాండ సం
తాన మూన నేసి చూర్ణితంబు సేసెఁ జాప వి
ద్యానిరూఢి దేవతావితాన మిచ్చ మెచ్చఁగన్.

ఉత్సాహము. చారుదేష్ణుఁ డాగ్రహించి శత్రుభీషణోగ్రదో
స్సారదర్ప మేర్పడన్ నిశాత బాణకోటిచే
దారుణ ప్రతాపసాల్వ దండనాథ మండలిన్
మారి రేఁగినట్లు పిల్కు మార్చి పేర్చి యార్చినన్.

క. శుకుఁ డాయోధన విజయో
త్సుకమతి బాహాబలంబు చొప్పడ [4]విశిఖ
ప్రకరంబులఁ దను శౌర్యా
ధికుఁ డన [5]విద్వేషిబలతతిం బరిమార్చెన్ 862

ఉ. సారణుఁ డేపుమైఁ గదిసి శాత్రవవీరులు సంచలింప [6]దో
స్సార మెలర్పఁ గుంతశర శక్తి దాక్షురికాది హేతులన్

---

1. శాతాంబక వింశతి = వాడియైన ఇరువది బాణములు. 2. చదల = ఆకాశమున. 3. ఆదిత్య......శరంబుల = సూర్యకిరణ సమూహములయొక్క కాంతివంటి తీవ్రమైన బాణములను. 4. విశిఖప్రకరంబుల = బాణసమూహముల. 5. విద్వేషిబలతతిన్ = శత్రుసేనాసమూహమును. 6. దోస్సారము = బాహుబలము.

వారక వాజిదంతి రథసద్గములం దునుమాడి కాల్వురన్
వీరముతోడఁ బంపె [1]జముపీటికిఁ గాఁపురముగ్రమూర్తియై.

క. అక్రూరుఁడుఁ దదనుజులు న
వక్ర పరాక్రమము మెఱసి వైరులబాహా
విక్రమమున వధియించిరి
చక్రప్రాసాది వివిధసాధనములచేన్. 864

మ. కృతవర్మక్షితినాయకుండు [2]విశిఖశ్రేణిం బ్రమత్తాన్యధి
శ్రితవర్మంబులఁ జించి మేనుల [3]శతచ్ఛిద్రంబులం జేసి న
ద్భుతకర్మంబని సైనికుల్ వొగడ శత్రుల్ దూలుచో సంగర
క్షితిధర్మంబుఁ దలంచి కాచె రథికశ్రేష్ఠుండు భూమీశ్వరా. 865

వ. అయ్యవసరంబున సాల్వుండు కోపోద్దీపిత మానసుండై యుండ
మాయావిడంబకంబైన సౌభకంబప్పుడు. [illegible]

సీ. ఒకమాటు [4]నభమునఁ బ్రకటంబుగాఁ దోఁచు
నొకమాటు ధరణిపై నొయ్య నిలుచు
నొకమాటు [5]శైలమస్తకమున వర్తించు
నొకపరి చరియించు [6]నుదధినడుమ
నొక్క తోయంబున నొక్కటియై యుండు
నొక్కెడఁ గనుఁగొనఁ బెక్కులగును
నొకమాటు సాల్వ సంయుక్తమై పొడసూపు
నొకతోయ మన్నియు నుడిగి తోఁచు

ఆ. నొక్క తేప కొఱవి యుడుగక త్రిప్పిన
గతి మహోగ్రవృత్తిఁ గానవచ్చు
మఱియుఁ బెక్కు గతుల నరివరుల్ గలఁగంగఁ
దిరిగె సౌభకంబు ధీవరేణ్య. 867

వ. ఇవ్విధంబున సౌభకంబు వర్తించుటం జేసి యదు సైన్యంబులచే

1. జముపీటికి = యమపట్టణమునకు. 2. విశిఖశ్రేణిం = బాణపంక్తిని. 3. శతచ్ఛిద్రంబులన్ = నూఱురంధ్రములచే. 4. నభమున = ఆకాశమున. 5. శైలమస్తకమున = పర్వతశిఖరభాగమున. 6. ఉదధినడుమ = సముద్రమధ్యమందు.

దైన్యంబు నొందిన నిజసైన్యంబుల మరలం బురికొల్పి సాల్వుం
డప్పుడు. 868

క. స్ఫుర[1]దనలాభ శరంబులు
పోరఁ బోరఁ బుంఖానుపుంఖ ॥ ములుగా నేయం
దెరలియు మరలియు ముఱిసియు
విఱిసియుఁ [2]బిఱుతివక పోరె ॥ వెస యదుబలముల్. 869

క. అయ్యెడ మానము వదలక
డయ్యక మగపాడితో దృఢంబుగఁ బోరన్
[3]దయ్యా మెఱుంగును నెక్కటి
కయ్యం బపు డయ్యెఁ బేరుగల యోధులకున్. 870

క. మును ప్రద్యుమ్న కుమారుని
ఘననిశితాస్త్రములచేతఁ ॥ గడు నొచ్చిన సా
ల్వుని మంత్రి ద్యుమనాముఁడు
[4]సునిశిత గద చేనమర్చి ॥ సుమహిత శక్తిన్. 871

చ. వెరవున [5]లావుఁ జేవయును ॥ వీరము [6]బీరముఁ గల్గి డాసి యా
సరసిజనాభనందను వి ॥ శాల భుజాంతరముం బగిల్చినన్
విరవిర వోయి మేను నిడు ॥ పెంౘుక నెట్టఁగఁ జేతి సాధనో
త్కరములు దేహపై వదలి ॥ కన్నులు మూయుచు మూర్ఛనొందినన్.

ఆ. [7]సమర ధర్మవేది ॥ సమధిక నయవాది
దారుకుని సుతుండు ॥ ధైర్యయుతుఁడు
రథముఁ ద్రోలికొనుచు ॥ రణభూమి వెడలి [8]వే
చనియె మూర్ఛఁ దేఱి ॥ శంబరారి. 873

ఉ. సారథిఁ జూచి యిట్లనియె ॥ శాత్రవ వీరులు సూచి నవ్వఁగాఁ
దేరు రణక్షితిన్ వెడలఁ ॥ దెచ్చితిఁ దెచ్చితి దుర్యశంబు పం

1. అనలాభశరములు = అగ్ని వంటి బాణములు. 2. పిఱుతివక = వెనుకకు తిరుగకుండ 3. దయ్యము = దైవము. 4. సునిశిత గద = వాడియగు గద. 5. లావు = బలము. 6. బీరము = పరాక్రమము. 7. సమరధర్మవేది = యుద్ధ ధర్మశాస్త్రము తెలిసినవాఁడు. 8 వేచనియె = వెంటనె వెడలె.

కేసుహానాభుఁడున్ హలియు గెలిగొనన్ యదువంశ సంభవుల్
బీరముదప్పి యిప్పగిదిఁ బెల్కుఱిపోవుదురే రణంబునన్. 874

వ. అనిన నతం డతని కిట్లనియె.

క. [1]రథి రిపుచే నొచ్చిన [2]సా
రథియును [3]సారథియు నొవ్వ రథియును గావం
బృథు సమరధర్మ మిఁక న
వ్యథచిత్తుఁడ వగుచుఁ గడఁగు వైరుల గెలువన్. 876

వ. అనిన విని. 877

ఉ. సంచిత భూరిబాహుబల శౌర్యుఁడు సారథిమాట కాత్మమో
దించి రవి ప్రకాండరుచి దీపిత చాపముఁ బూల్చి [3]మౌర్వి సా
రించి [4]గుణధ్వనిన్ మహదరాతి ప్రకరంబుల భీతి ముంచి తో
లించె రథంబు మేదిని చలింపఁగ నా ద్యుమువిూఁద నేర్పునన్.

వ. అట్లు డగ్గఱి. 879

చ. అరితను వష్టబాణముల నాగ్రహవృత్తి బగిల్చి నాల్గిటం
దురగములన్ వధించి యొక [5]తూపున నాతనిఁ బ్రదుంచి రెంట ని
ష్ఠురతర [6]కేతుచాపములు చూర్ణముచేసి యొకమ్మునన్ భయం
కరముగఁ ద్రుంచె నద్యుముని కంఠ మనంతవిక్రమోద్ధతిన్.

మ. కని సాంబప్రముఖాది యోధవరు లుత్కంఠాత్ములై మీనకే
తను నగ్గించి సువర్ణపుంఖ నిశితాస్త్రశ్రేణి సంధించి సా
ల్వుని సైన్యావళి మస్తముల్ వెఱపులారన్ మీఱఁగా నొక్కయె
త్తున వ్రేతుంచిరి తాటిపండ్లు ధరఁ దోరత్తో రాల్చు చందంబునన్.

వ. అట్టియెడ. 882

స్రగ్ధర. కూలున్ గుఱ్ఱంబు లేనుంగులు ధరఁ గెడయుం గుప్పలై
నుగ్గునూచై ప్రాలున్ దేరుల్ హతంబై వడిఁబడు [7]సుభటవ్రాత

---

1. రథి = రథము నెక్కినవాఁడు. 2. సారథి = రథము తోలువాఁడు.
3. మౌర్వి = వింటినారి 4. గుణధ్వనిన్ = నారిధ్వనిని. 5. తూపున = బాణముచే.
6. కేతుచాపములు = జండాధనుస్సులను. 7. సుభటవ్రాతముల్ = మంచిభటుల సమూహములు.

ముల్ [1]శోణితంబుల్ ద్రోలున్ మాంసంబు నంజుం గై కొఱుకు
నెముకలన్ గుంపులై సోలుచున్ బేతాళ క్రవ్యాదభూతోత్కర
ములు జతలై తాళముల్ దట్టియాడున్. 883

వ. మఱియు నొక్కెడ. 884

సీ. ఖండితశుండాల గండముల్ [2]నక్రముల్
భూరితుండంబులు [3]భుజగసమితి
పదతలంబులు [4]కచ్ఛపంబులు దంతముల్
శుక్తులు కుంభసమ్ముక్తమౌక్తి
కములు రత్నములు [5]వాలములు [6]జలూకముల్
మెదడు [7]భేకంబులు మెదడు రొంపి
ప్రేవులు [8]పవడంపుఁ దీవెలు నరములు
నాఁచు మజ్జంబు [9]ఫేనంబు [10]లస్థి

ఆ. [11]సైకతములు రక్తచయము తోయంబులు
నొరగు నెడల నొరలు మొఱలు ఘన త
రంగరవముగా మతంగజాయోధన
స్థలము [12]జలధిఁ బోల్పఁదగె నరేంద్ర. 885

వ. ఇవ్విధంబున యదుసాల్వ బలంబులు చలంబునఁ బరస్పర జయకాంక్షలం దలపడిపోరు పూర్వపశ్చిమ సముద్రంబుల వడువున నిరువదియేడు దినంబు లతిఘోరంబుగాఁ బోరు నెడ నింద్రప్రస్థపురంబుననుండి ద్వారకానగరంబునకు నగధరుండు చనుదేర ముందఱం గానవచ్చు [13]దుర్నిమిత్తంబులం గనుంగొని కృష్ణుండు [14]దారుకునిం జూచి యిట్లనియె. 886

---

1. శోణితంబుల్ = రక్తములను. 2. నక్రముల్ = మొసళ్లు. 3. భుజగసమితి = పాముల సమూహము. 4. కచ్ఛపంబులు = తాఁబేలు ?. 5. వాలములు = తోఁకలు. 6. జలూకముల్ = జలగలు. 7. భేకంబులు = కప్పలు. 8. పవడంపుదీవెలు = పగడపుతీఁగెలు. 9. ఫేనంబు = నురుగు. 10. అస్థి = ఎముక. 11. సైకతములు = ఇసుకతిన్నెలు. 12. జలధిన్ = సముద్రమును. 13. దుర్నిమిత్తంబులు = అపశకునములు. 14. దారుకుని = కృష్ణసారథిని.

శా. కంటే దారుక దుర్నిమిత్తము లనేకంబుల్ మహాభీలముల్
[1]మింటన్ మేదినిఁ దోఁచుచున్నయవి నెఱిమ్మిం గాండవప్రస్థ మే
నంటం జైద్యహితక్షితీశ్వరులు మాయోపాయులై మత్పురిన్
గెంటింపం జనుదేరఁ బోలుదురు పఱపి తేరు వేగంబునన్.

వ. అని యతిత్వరితగతిం జనుదెంచి తత్పురంబు డగ్గఱి మహాబలపరా
క్రమంబులం బ్రతిపక్షబలంబుతోడ దలపడి పోరు యదుబలంబు
లను నభోవీథి నభేద్యమాయా విడంబనంబునఁ బ్రతిపీడు లెంత
కాలంబునకు నేయుపాయంబు నను సాధింపనలవిగాని సౌభకవిమా
నంబునందున్న సాల్వునిం గని తద్విమానంబుడాయం దన తేరు
దోల సారథిఁ నియమించి కదియం జను మురాంతకుని వీక్షించి
యదుసైనిక ప్రకరంబులు పరమానందంబునం బొందిరి. [2]మృత
ప్రాయంబులై యున్న సైన్యంబులఁ గనుంగొని సౌభకపతి విక్రమ
క్రియాకలాపుండగుచు [3]నురవడించి. 889

చ. మిడుఁగుఱు లెల్లెడం జెదరి మింటను మంటలు పర్వ ఘంటికా
ఘణఘణభూరి [4]నిస్వననికాయమునన్ హరిదంతరాళముల్
వణఁక మహోగ్రశక్తిఁ గొని వారక దారుకుమీఁద నైవ దా
రుణగతి నింగినుండి నిజరోచులతోఁ బడు చుక్కయై వడిన్.

క. వడిఁ జనుదేరఁగఁ గని య
ప్పుడు నగధరుఁ డలఁతిలీలఁ బోలెన్ దానిం
బొడిపొడియై ధరఁ దొరఁగఁగ
నడుమన వెసఁ ద్రుంచె నొక్క నారాచమునన్. 890

చ. గురుభుజుఁ డంతఁ బోవక యసంతతశూరత శత్రుసైన్యముల్
దెరలఁగ నుగ్రతం గొఱవిఁ ద్రిప్పినకై నడిమింట దిర్దిరం
దిరుగుచు దుర్నిరీక్ష్య మగు దీపితసౌభము సాల్వుఁ జండ భా
స్కరకిరణాభషోడశసుశాతశరంబులఁ గాఁడ నేసినన్. 891

1. మింటన్ = అంతరిక్షమున. 2. మృతప్రాయంబులై = చచ్చిపోయిన వారితో సమానమైన 3. ఉరవడించి = తొందరపడి. 4. నిస్వననికాయమునన్ = ధ్వని సమూహమున. 5. చండభాస్కర .....శరంబులన్ = తీవ్రమైన సూర్యకిరణముల కాంతితో సమానమైన వాడియగు పదునాఱుబాణములను.

చ. కడు వడి నల్గి వాఁడు నిజకార్ముకము న్జలదస్వనంబుగై
వడి మొరయించుచు న్నెడఁద వాఁడిశరంబులఁ బద్మలోచను
న్నెడమభుజంబు గాఁడ నడి నేసినఁ దంపఱి చేతిశార్ఙ్గమున్
విడిచె రథంబుపై గగనవీథి సురల్ భయమంది చూడఁగన్.

క. హాహా యని భూతావలు
లాహాకారములు సేయ నంతటఁ దేజ
న్నాహరిఁ గనుఁగొని యతఁడు
త్సాహంబునఁ బలికె బాహుశౌర్యస్ఫూర్తిన్. 893

చ. నళినదళాక్ష మత్సఖుఁడు నాఁదగు చైద్యుఁడు కోరినట్టి కో
మలి నవినీతిమైఁ దగవ్రతాలి వరించితి వంత బోక దో
ర్బలమున ధర్మనందను సభాస్థలి నేమఱి యున్నవాని న
చ్చలమునఁ జంపి తట్టి కలుషంబున నేఁడు రణాంగణంబునన్.

క. తల చెడి పాఱక బాహా
బల మొప్పఁగ నాదురదృష్టిపథమున ధృతితో
నిలిచిన నిష్ఠుర విశిఖా
ర్చుల ముంచి మదీయసఖుని సూడిటు దీర్తున్. 895

చ. అనిశ మరాంతకుండు దరహాసము మోమునఁ దొంగలింప సా
ల్వునిఁ గని యోరి లావు బలువుం గల పోటరివోలెఁ బ్రేలెదే
మనినను [1]బాటు సన్నిహితమాట యెఱుంగవు మూఢచిత్త పా
ప్మని గదఁ గేలఁ ద్రిప్పి యభిమానుని శత్రుని వ్రేసె నద్దతిన్. 896

వ. అట్లు వ్రేసిన.

క. [2]పెనుమూర్ఛ నొంది వెస ము
క్కున వాతను నెత్తురొల్కఁ గొంతవడికి నో
య్యనఁ దెలిసి నిలువరింపక
చనె వాఁడు నదృశ్యుఁడగుచు సౌభముఁ దానున్. 898

---

1. పాటు సన్నిహితమాట = చావుసమీపించుట. 2 పెనుమూర్ఛనొంది = పెద్దమూర్ఛపొంది.

వ. అయ్యవసరంబున. 899

తే. గగనమునుండి యొకఁ డార్తిఁ దగుచు వచ్చి
నందనందనుపాదారవిందములకు
వందనము చేసి యానకదుందుభి మ
హోగ్రుఁడై పట్టి తెచ్చె సాల్వుండు గడఁగి. 900

తే. దేవ మీ కెఱిఁగింపఁగా దివిరి యిటకు
దేవకీదేవి నన్నుఁ [1]బుత్తెంచె ననఁగ
విని సరోరుహనాభుండు ఘనవిషాద
మగ్నుఁ డయ్యెను గురుమీఁది మమతఁ జేసి. 901

క. నర గంధర్వ సురాసుర|వరులకు నిర్జింపరాని వాఁడు బలుండే
మఱి కరయహీనబలుచేఁ|బరికింపఁగ నెట్లు పట్టువడెనొకో యనుచున్

వ. మఱియును. 903

క. భావంబు గలఁగ నాహా|దైవకృతం బెవ్వరికిని దప్పింపఁగ రా
దే విధి నైనను నని శో|కావిలమతిఁ బలుకుచున్న యత్తఱి వాఁడున్

వ. తనమాయాబలంబునఁ గ్రమ్మఱిం దోఁచు కృతకవసుదేవునిం గల్పించి
యతనిం బంధించి కొని తెచ్చి పుండరీకాక్షు నిరీక్షింపు భవజ్జనకుండు
వీఁడె యిప్పుడు నీవు గనుంగొనఁ వీనితలఁ ద్రుంతు నింక నెవ్వనికిం
గా మనియెదు కావంగల శక్తి గలదేనియుం గావుమని దురాలా
పంబు లాడుచు మృత్యుజిహ్వాకరాళంబైన [2]కరవాలంబుఁ [3]గేలం
బూని జళిపించి యమ్మాయావసుదేవునిశిరంబు దునిమి [4]తన్మస్తకంబు
గొని [5]వియద్వర్తియై చరియించు సౌభకవిమానంబు సొచ్చె, నంత
గోవిందుండు గొంతదడవు మనంబున ఘనంబగు శోకంబునం గుందు
చుండి యాత్మసైనికులు దెలుపం దెలివొంది యది మయోదితంబైన
సాల్వుని మాయోపాయంబని యెఱింగె, నంత దనకు వసుదేవుండు
పట్టువడెనని చెప్పిన దూతయు నిమ్మాయాకళేబరంబును నాక్షణంబ
విచిత్రంబుగా మాయంబై పోయె నంతరంబ. 905

1. పుత్తెంచెన్ = పంపించెను. 2. కరవాలంబు = ఖడ్గము. 3. కేల బూని = హస్తమున ధరియించి. 4. తన్మస్తకంబు = వానిశిరము. 5. వియద్వర్తియై = అంతరిక్షమున సంచరించువాఁడై.

క. మును లప్పుడు గొంద ఱచటికిఁ
జనుదెంచి విమోహాత్మైన జలజదళాక్షుం
గనుఁగొని సమధికభక్తిన్
వినయంబునఁ బలికి రంత విష్ణుఁ జిష్ణున్. 906

సీ. కమలాక్ష సర్వలోకములందు సర్వమా
నవులు సంసారనానావిధైక
దుఃఖాబ్ధిమగ్నులై తుదిఁ జేరఁజేరక
వికలత్వమునఁ బొందువేళ నిన్నుఁ
దలఁచి దుఃఖంబులఁ [1]దరియింతు రట్టి స
ద్గుణనిధివై దేవకోటి కెల్లఁ
బట్టుగామైన పరబ్రహ్మఖ్యఁ బొగడొంది
పరమయోగీశ్వర ప్రకరగూఢ

తే. పర చిదానందదివ్యరూపమున వెలుఁగు
దనఘ నీవేడ నీచజన్మాత్మజనిత
ఘనభయస్నేహ మోహ శోకంబు లేడ
ననుచు సంస్తుతి చేసి వారరిగి రంత. 907

చ. హరి తనమీఁద ఘోరనిశితాశుగజాలము లేయు సాల్వభూ
వరు వధియింపఁ గోరి బహు[2]వారిదనిర్గత భూరివృష్టి వి
స్ఫురణ [3]ననూన తీవ్రశరపుంజములన్ గగనంబుఁ గప్పి క్ర
చ్చఱ రిపుమౌళిరత్నమును జాపము వర్మముఁ ద్రుంచి వెండియున్

మ. వితతక్రోధముతోడఁ గృష్ణుఁడు జగద్విఖ్యాతశౌర్యక్రియో
ద్ధతశక్తిన్ వడిఁ ద్రిప్పి మింట మెఱుఁగుల్ దట్టంబుగాఁ బర్వ ను
గ్రతఁ జంచద్గద వైచి త్రుంచె వెసఁ జూర్ణంబై ధరన్ రాల నా
యతభూరిత్రిపురాభమున్ మహిత మాయాశోభమున్ సౌభమున్.

వ. అట్లు కృష్ణుం డమ్మయనిర్మిత మాయావిమానంబు నిజగదాహతి
నింతింతలు [4]తునియలై సముద్రమధ్యంబునం దొరంగం జేసిన
సాల్వుండు కోఱలు పెఱికిన భుజంగంబుభంగి గంపడంగి విన్ననై

1 తరియింతురు = దాఁటుదురు. 2. వారిదనిర్గతి = మేఘమునుండి వెలువడు.
3. అనూన = తక్కువకాని. 4. తునియలై = ముక్కలై.

విగతమాయాబలుండయ్యెను బొలివోవనిబిరంబున వసుధాతలంబు
నను [1]డిగ్గి యుగ్రాగ్రహంబున. 910

క. కరమునఁ [2]బవినిభమగు భీ
కరగద ధరియించి కదియఁ జొరఁ జనుదేరన్
మురహరుఁ డుద్ధతి సాల్వుని
కరము గదాయుక్తముగను ఖండించె నృపా. 911

క. అంతం బోవక కినుక ననంతుఁడు విలయార్కమండలాయతరుచిదు
ర్దాంతంబగుచక్రంబున నితాంతంబుగఁ బూన్చి సాల్వధరణిపుమీఁదన్

క. గురుశక్తి వైచి వెస భా
సురకుండల మకుట రత్న శోభిత మగు త
చ్ఛిరము వడిఁ ద్రుంచె నింద్రుఁడు
వర[4]కులిశముచేత వృత్రు వధియించు క్రియన్. 913

—♦ శ్రీకృష్ణుండు దంతవక్త్రుని సంహరించుట. ♦—

వ. ఇట్లు మాయావి యైన సాల్వుండును సౌభకంబును గృష్ణుచేతం బొలియుటఁ గనుంగొని నిజసఖు లగు సాల్వపౌండ్రక శిశుపాలురకుఁ బారలౌకిక క్రియలు మైత్రిం గావించి దంతవక్త్రుం డతిభీషణాకారంబుతో నప్పుడు. 914

చ. పెటపెటఁ బండ్లు గీఁటుచును బెట్టుగ మ్రోయుచుఁ గన్నుఁ గ్రేవలం
జిటచిట విస్ఫులింగములు చింద మహోద్ధతపాదఘట్టన
న్నట యిట యై ధరిత్రి వడఁకాడ వడిన్ గద కేలఁ ద్రిప్పుచున్
మిటమిట మండువేసవిని మించు [5]దివాకరుఁబోలి యుగ్రతన్,

చ. వడిఁ జనుదేరఁ జూచి యదువల్లభుఁ [6]డుల్లము పల్లవింప న
ప్పుడు గదఁ గేలఁ బూని రథమున్ రయమొప్పఁగ డిగ్గి యుగ్రతం
గడఁగి విరోధికి న్నెదురుగాఁ జన వాఁ డతి నీచవర్తియై
యడరుచు [7]నట్టహాసము ఘనంబుగ వలచే గదఁద్రిప్పుచున్ హరిన్.

1. డిగ్గి = దిగి. 2. పవినిభమగు = వజ్రాయుధముతో సాటియగు. 3 నితాంతంబుగన్ = మిక్కిలి బలముగ. 4. కులిశముచేత = వజ్రాయుధముచేత. 5 దివాకరున్ = సూర్యుని. 6. ఉల్లము=హృదయము. 5. అట్టహాసము = వీరరౌద్ర రసముల వలనఁ గలిగిన పెద్దనవ్వు.

వ. కనుంగొని పరిహాసోక్తులుగా నిట్లనియె, నీవు మదీయ భాగ్యంబునం జేసి నేఁడు నా దృష్టిపథంబునకు గోచరుండ వైతివి. మిత్రద్రోహి వైన నిన్ను [1]మాతులేయుండవని మన్నింపక దేహంబునందు వర్తించు నుగ్రవ్యాధి నౌషధాది క్రియల నివర్తింపంజేయు చికిత్సకుని చందంబున బంధురూప శాత్రవుండవు గావున నిన్ను దంభోళి సంరంభ గంభీరంబైన మదీయ గదా దండహతిం [2]బరేత నివాసంబునకు ననిచి మున్ను నీచేత నిహతులైన నా సఖుల ఋణంబుఁ దీర్తు నని దుర్భాషలాడుచు డగ్గఱి. 917

చ. [3]పెనుగదఁ బూన్చి కృష్ణుతల పెట్టుగ మొత్తిన నంకుశాహతిం
గనలెడి గంధ సింధురము కైవడి సింధుర భంజనుండు పెం
పున [4]పవిభాసమాన గదఁ బూని మహోగ్రతఁ ద్రిప్పి దంతవ
క్త్రుని యురముం బగిల్చిన గడున్ మల్కానుచున్ రుధిరంబు గ్రక్కుచున్

వ. తత్క్షణంబ పర్వతాకారంబగు దేహంబుతో నొఱలుచు నేలంగూలి కేశపాశంబులు చిక్కువడం దన్నుకొనుచుఁ బ్రాణంబులు విడిచె, నప్పుడు నిఖిలభూతంబులు నాశ్చర్యంబునొంద దద్గాత్రంబుననుండి యొక్క సూక్ష్మతేజంబు వెలువడి గోవిందుని దేహంబుఁ బ్రవేశించె, నయ్యవసరంబున నగ్రజుమరణంబుఁ గనుంగొని కుపితుండై కనుంగవల నిప్పులుప్పతిల్ల విదూరథుండు కాలానల జ్వాలాభీల కరాళంబైన [5]కరవాలంబును బలకయుం గేలం దాల్చి దామోదరు దెసకుఁ గవయుటయుం గనుంగొని. 919

చ. జలరుహలోచనుండు నిజసాధనమై తనరారు చక్రమున్
వలనుగఁ బూన్చి వైవ నది వారక వాని శిరంబుఁ ద్రుంచె న
బ్బలియుఁడు సౌభ సాల్వ శిశుపాల సహోదర తత్సహోదరా
వలుల వధించి తక్కులను వారి ననేకులఁ ద్రుంచె నీగతిన్. 920

వ. అయ్యవసరంబున. 921

---

1. మాతులేయుండు = మేనమామ. 2. పరేత నివాసంబునకు = యమలోకమునకు. 3. పెనుగద = పెద్దగద. 4. పవిభాసమాన = వజ్రాయుధమువలె ప్రకాశించు. 5. కరవాలంబు = ఖడ్గము.

క. నర ముని యోగి సురాసుర
గరుడోరగ సిద్ధ సాధ్య గంధర్వ [1]నభ
శ్చర కిన్నర కింపురుషులు
హరిమహిమ నుతించి రద్భుతానందములన్. 922

వ. మఱియు నప్సరోజనంబులు నృత్యంబులు సలుప వేల్పులు కుసుమ వర్షంబులు గురియ [2]దేవతూర్యంబు [3]లవార్యంబులై మొరయ యదు వృష్ణి ప్రవరులు సేవింపఁ బరమానందంబునం బొంది నిజ విజయాంకితంబులైన గీతంబులు [4]వందిజనంబులు సంకీర్తనంబులు సేయ నతిమనోహర విభవాభిరామంబును నూతనాలంకారంబును నైన ద్వారకానగరంబు శుభ ముహూర్తంబునం బ్రవేశింపం జనునెడ 923

క. పురసతులు [5]విరులు లాజలు
గురు సౌధాగములనుండి కురియఁగ వికచాం
బురుహాక్షుం డంతఃపుర
వర మధ్యం జొచ్చె వైభవం బలరారన్. 924

వ. అట్లు సని యోగీశ్వరుండును [6]షడ్గుణైశ్వర్య సంపన్నుండును నిఖిల జగదీశ్వరుండును నైన పురుషోత్తముండు సుఖంబుండె నంత. 925

క. కౌరవ పాండవ పృథు సమ
రారంభ మెఱింగి తీర్థయాత్ర నెపముగా
[7]సీరాంకుఁ డుభయకులులకు
నారయ సముఁ డగుటఁ జేసి యరిగె నరేంద్రా! 926

—♦ బలరాముండు తీర్థయాత్రకుఁ జనుట. ♦—

వ. అట్లు చని మొదలం బ్రభాసతీర్థంబున [8]నవగాహంబు సేసి యందు

1. నభశ్చర = ఆకాశమున సంచరించు. 2. దేవతూర్యంబులు = దేవతల వాయిద్య విశేషములు. 3. అవార్యంబులై = ఆపకుండగ. 4 వందిజనంబులు = రాజస్థానమందలి మంగళపాఠకులు. 5. విరులు లాజలు = పూలు పేలాలు. 6. షడ్గుణైశ్వర్య సంపన్నుండును = శక్తి, జ్ఞానము. బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు అను నారు ఐశ్వర్యములు గలవాఁడు. 7. సీరాంకుఁడు = బలరాముఁడు. 8. అవగాహము = స్నానము.

[1]సర్వపాప నిష్కృతి యగు నని పలుకు నంతం బర్వసమాగమం బైన. 938

సీ. మునులు యజ్ఞక్రియోత్సవముఖ లౌటఁ గనుఁగొని
పఱతెంచి యసుర తీవ్రపవనములను
రక్త విణ్మూత్ర సురా మాంసజాలంబు
నించి హేయంబు గావించి పెలుచఁ
బెంధూళి ఱాలును బెల్లలు నురిలెడు
చక్రానిలము వీచి [2]చదల నపుడు
కాటుకకొండ సంగతిఁ బొల్చు మేను [3]తా
మ్రశ్మశ్రుకేశ సమాజములును
తే. నన్యచర్మాంబరము [4]భూరి నాసికయును
గఱకు మిడిగ్రుడ్లు నిప్పులు గ్రక్కు దృష్టి
వ్రేలు పెదవులు దీర్ఘ కరాళ జిహ్వి
కయును ముడివడ్డ బొమలును గలుగువాని. 939

మహాస్రగ్ధర.

కనియెం దాలాంకుఁ డత్యుత్కటచటులసటత్కాలదండాభశూలుం
జనరక్తాసిక్తతాలుం సమధిక సమరోత్సాహలోలుం గఠోరా
శనితుల్యోదగ్ర[5]దంష్ట్రాజటిలశిఖికణాచ్ఛాదితాశాంతరాళున్
హననవ్యాపారశీలున్నతిదృఢఘనమస్తాస్థిమాలుం గరాళున్ 940

ఉ. వెండియుఁ గ్రొమ్మెఱుంగు [6]లుడువీథి వెలుంగఁగ నుల్లసద్గదా
దండముఁ గేలఁ ద్రిప్పుచు నుదారత రా బలభద్రుఁ డాసురో
ద్దండవిఘాతులౌ ముసలదారుణలాంగలముల్ దలంప మా
ర్తాండనిభంబులై యెదురఁ దత్క్షణమాత్రన తోఁచినన్ వెసన్. 941

వ. అట్లు సన్నిహితంబులైన కార్యసాధనంబు లగు నిజసాధనంబులు ధరియించి యప్పుడు. 942

1 సర్వపాపనిష్కృతి = పాపములన్నియు పోవుట. 2. చదల = ఆకాశమున. 3. తామ్రశ్మశ్రుకేశ = ఎఱ్ఱనైన గడ్డము జుట్టు. 4. భూరి నాసికయు = పెద్దముక్కును. 5. దంష్ట్రి = కోఱ. 6. ఉడువీథి = నక్షత్రవీథియందు.

చ. గగనమునం జరించు సురకంటకు కంఠము చేతినాఁగటం
దగిలిచి రోఁకటనెత్తి బెడిదం బడరన్ నడునెత్తి మొత్తినన్
భుగభుగ నెత్తురొల్క నిలఁ బోరగిలం బడె వజ్రధారచేఁ
దెగి ధరఁ గూలు భూరి ¹జగతీధరముం బురుడింపఁ బెంపుగాన్. 943

వ. అట్లు పల్వలుండు మడిసిన. 944

క. మునివరులు రామపాలుని | వినుతించిరి వేయు వేలవిధముల వృత్రా
దునిమిన యింద్రుని నమరులు | వినుతించినరీతి నప్పుడు విమలచరిత్రా

తే. అంత నభిషిక్తుఁ జేసి ²యత్యంతసురభి
మంజులామ్లానకంజాత మాలికయును
నంచితాభరణములు దివ్యాంబరములు
నర్థి నిచ్చినఁ దాల్చి యా హలధరుండు. 946

క. దేవేంద్రుఁబోలి యొప్పెను
ధీవిలసితుఁ డగుచు ³మునితతిన్ వీడ్కొని తన్
సేవించుచుఁ గతిపయ వి
ప్రావలి చనుదేరఁ గౌశికాఖ్యంబునకున్. 947

వ. చని యమ్మహానదిం గృతస్నానుండై యచ్చోటువాసి సరయువు
నందుఁ ⁴గ్రుంకులిడి ప్రయాగ నవగాహనంబు సేసి దేవర్షి పితృతర్ప
ణంబు లాచరించి పులస్త్యాశ్రమంబుసొచ్చి గోమతిని దర్శించి గండకీ
నది ⁵నుత్తరించి విదళితభవపాశ యగు విపాశయందుఁ దోఁగి శోణ
నదంబున నాప్లావితుండై గయ నాడి గంగాసాగర సంగమంబు
దర్శించి మహేంద్రనగంబున కరిగి. 948

క. రాముఁడు గనుగొనె భార్గవ | రామున్ రజనీశకుల ధరావరనగసు
త్రామున్ సన్నుతసుగుణ | స్తోముం గారుణ్యసీము సుజనలలామున్

ఆ. కని నమస్కరించి కౌతుకం బలరార
నతని వీడుకొని హలాయుధుండు

---

1. జగతీధరము = పర్వతము. 2. అత్యంత.....మాలికయును = మిక్కిలి అందమై పరిమళముగల వాడని పూలమాల. 3. మునితతిన్ = మునిసమూహమును. 4. క్రుంకులిడి = స్నానముచేసి. 5. ఉత్తరించి = దాఁటి.

గోమరు మిగిలి సప్తగోదావరికి నేగి
యందుఁ దీర్థమాడి యచటు గదలి. 950

వ. వేణీపంపాసరస్సులం జూచి భీమనది కేగి యందుఁ గుమారస్వామిని దర్శించి శ్రీశైలంబునకుం జని వేంకటాచలంబు దర్శించి కామకోటి శక్తి నిరీక్షించి కాంచీపురంబుఁ గాంచి కావేరికిం జని [1]యమ్మహావాహిని నవగాహనంబు సేసి. 951

స్రగ్ధర.

సేవించెన్ రంగధామున్ శ్రితనివహపయస్సింధుసంపూర్ణసోముం
గావేరీమధ్యసీమున్ ఘనకలుషమహాకాలకూటోగ్రభీమున్
దేవారిశ్రీవిరామున్ దివిజవినుతసందీపితానంతనామున్
ధీవిజ్ఞానాభిరాముం ద్రిభువనవిలసద్దేవతాసార్వభౌమున్. 952

వ. అచ్చోటు వాసి వృషభాద్రి నెక్కి హరిక్షేత్రంబుఁ ద్రొక్కి మధురాపురంబున కరిగి సేతుబంధనంబు మెట్టి యచటం బదివేల [2]పాఁడిమొదవుల భూసురుల కిచ్చి రామేశ్వరుని దర్శించి తామ్రపర్ణికిం జని మలయాచలం బెక్కి యగస్త్యునిం గని నమస్కరించి దక్షిణసముద్రంబు దర్శించి కన్యాఖ్యదుర్గాదేవి నుపాసించి పంచాప్సరసంబను తీర్థంబున నాప్లవనం బాచరించి గోకర్ణంబున నిందుమౌళిని దర్శించి ద్వీపవతియైన కామదేవి నిరీక్షించి తాపిం బయోష్ణిని దర్శించి నిర్వింధ్యంబు గడచి దండకావనంబున కరిగి మాహిష్మతీపురంబున వసియించి మనుతీర్థంబాడి క్రమ్మఱం బ్రభాసతీర్థంబునకు వచ్చి యచ్చటి బ్రాహ్మణజనంబులవలనం బాండవ ధార్తరాష్ట్రుల భండనంబునందు సకల రాజలోకంబు పరలోకగతులగుటయు వాయునందనసుయోధనులు గదాయుద్ధసన్నద్ధులై యుండుటయు నెఱింగి వారల వారించుతలంపున నచ్చటికిం జని. 953

తే. ధర్మనందనుఁ డనకు వందనము సేయ
కృష్ణు నరు మాద్రిసుతుల వీక్షించి యేమి
వలుక కుగ్రగదాదండపాణు లగుచుఁ
గ్రోధమునఁ బోరు భీమసుయోధనులను. 954

1. అమ్మహావాహినిన్=ఆగొప్ప ప్రవాహమును. 2. పాఁడిమొదవుల=పాలిచ్చేఆవులను.

వ. చూచి వారల డాయంజని యిట్లనియె. 955

సీ. వీరపుంగవులార వినుఁడు మీలోపల
భూరిభుజాసత్త్వమున నొకండు
ప్రకటితాభ్యాస సంపద్విశేషంబున
నొక్కండు నధికుఁడై యుంటఁ జేసి
సమబలు లటు గాన చర్చింపగా నిందు
జయ మొక్కనికి లేదు సమరమందుఁ
గాన యూరక పోరఁగా నేల మీ కని
వారింప నన్యోన్యవైరములను

తే. నడరి తొల్లింటి దుర్భాషణాత్మలందుఁ
దలఁచి తద్భాషణము [1]లపథ్యములు గాఁగ
మొక్కలంబునఁ బోర నా ముష్టికాసు
రారి వీక్షించి వీరి శుభాశుభములు. 956

వ. ఎట్లు గావలయు నట్ల యయ్యెడుం గాక యని యచ్చోట నిలువక యుగ్రసేనానిబంధుప్రకరంబులు పరితోషంబున నెదుర్కొన ద్వారకాపురంబు సొచ్చి యందుండి మగిడి నైమిశారణ్యంబునకుం జని యందుల మునిపుంగవు లనుమతింప నచ్చట [2]నొక్కమఖంబు గావించి బహుదక్షిణ లొసఁగి యంచితజ్ఞాన పరిపూర్ణులకు నట్లుగా వరంబిచ్చి రేవతియునుం దానును బంధుజ్ఞాతియుతంబుగా [3]నవభృథస్నానం బాచరించి యనంతరంబ. 957

చ. విలసితమాల్యచందన నవీనవిభూషణరత్నవస్త్రముల్
పొలుపుగఁ దాల్చి యంచితవిభూతిఁ దలిర్చెను బూర్ణచంద్రికా
కలిత సుధాంశురేఖ నెసకం బెసగన్ నిజబంధులోచనో
త్పలచయ ముల్లసిల్లఁ బరిపాండురచారు యశోవిలాసుఁడై.

వ. ఇవ్విధంబున ననంతుండు నప్రమేయుండును మాయామానుషవిగ్రహుండును నసంఖ్యబలశాలియు నైన బలదేవుం డతివైభవంబున నిజపురంబు ప్రవేశించి సుఖంబుండె నని చెప్పి యిట్లనియె.

---

1. అపథ్యములు = ఇష్టములుకానివి. 2. ఒక్కమఖంబు = ఒక యజ్ఞము.
3. అవభృథస్నానము = యజ్ఞాంతమునచేయు స్నానము.

—◆ కుచేలోపాఖ్యానము ◆—

క. హాలధరుఁ [1]డమర్త్యచరితుం
డలఘు భుజాబలుఁ డొనర్చు నద్భుతకర్మం
బులు పెక్కు [2]నాల్గుమోములు
గల మేటియు లెక్కపెట్టఁ గలఁడె నరేంద్రా! 960

చ. అనిన మునీంద్రుఁ గన్గొని ధరాధిపుఁ డిట్లనుఁ బద్మపత్రలో
చనుని యనంతవీర్యగుణ సంపద వేమఱు విన్ననైననుం
దనియదు చిత్త మచ్యుతకథావిభవం బొకమాటు వీనులన్
వినిన [3]మనోజపుష్పశరవిద్ధుఁడునైన విరామ మొందునే.

వ. అదియునుంగాక. 963

చ. హరిభజియించు హస్తములు హస్తములచ్యుతుఁ గోరి మ్రొక్కుత
చ్ఛిరము శిరంబు చక్రధరుఁ జేరినచిత్తము చిత్త మిందిరా
వరుఁ గను దృష్టిదృష్టి మురవైరి నుతించిన [4]వాణివాణి య
తురుకథ లాను కర్ణములు కర్ణములై విలసిల్లుఁ బో భువిన్.

క. హరిపాదతీర్థసేవా
పరుఁడై విలసిల్లు నట్టి భాగవతుని వి
స్ఫురితాంగము లంగము లా
పరమేశ్వరు నెఱుఁగ నాకుఁ బలుకు మునీంద్రా. 964

సీ. అనుడు వేదవ్యాస తనయుఁ డా యభిమన్యు
తనయునిఁ జూచి యిట్లనియెఁ బ్రీతి
జనవర గోవింద సఖుఁడు కుచేలుండు
నా నొప్పు విప్రుండు మానధనుఁడు
విజ్ఞానరాగాది విరహితస్వాంతుండు
శాంతుండు ధర్మవత్సలుఁడు ఘనుఁడు

---

1. అమర్త్యచరితుఁడు = దేవచరిత్ర కలవాఁడు. 2. నాల్గుమోములుగల మేటియు = బ్రహ్మయు. 3. మనోజపుష్పశరవిద్ధుఁడునైన = మన్మథవికారుఁడైనను. 4. వాణి = వాక్కు.

జితేంద్రియుఁడు బ్రహ్మ । వేత్త దారిద్ర్యంబు
బాధింప నోరులఁ । [1]గార్పణ్యవృత్తి

తే. నడుపఁ బోవక తనకుఁ దా । వచ్చినట్టి
కాసు పదివేల [2]నిష్కముల్ । గాఁ దలంచి
యాత్మమోదించి పుత్రదా । రాభిరక్ష
యొకవిధంబున నడుపుచు । నుండ నంత. 965

సీ. లలిత పతివ్రతా । తిలకంబు వంశాభి
జాత్య తద్భార్య దు । స్సహదరిద్ర
పీడచేఁ గడు నొచ్చి । పెడవులు దడుపుచు
శిశువు [3]లాఁకటిచిచ్చు । చేఁ గృశించి
మలమల మాఁడుచు । మానసం బెరియంగఁ
బట్టెఁ [4]డోరెము మాకుఁ । బెట్టు మనుచుఁ
పాత్రభాజనధృత । పాణులై తనుఁ జేరి
వేఁడిన వీనులు । సూఁడినట్లు

తే. నైన నొకనాఁడు వగచి నిజాధినాథుఁ
జేరి యిట్లని పలికె నో । జీవితేశ
[5]తట్టుముట్టాడు నిట్టి పే । దఱికి మిట్లు
నోంప దీని కుపాయ మూ । హింపవైతి. 966

వ. అని మఱియు నిట్లనియె. 967

తే. బాలసఖుఁడైన యప్పద్మ । పత్రనేత్రుఁ
గాన నేగి దారిద్ర్యాంధ । కారమగ్ను
లైన మము నుద్ధరింపుము । హరికృపాక
టాక్ష రవిదీప్తి పడసి మ । హాత్మ నీవు. 968

వ. మఱియును. 969

---

1. కార్పణ్యవృత్తి = నీచభావము. 2. నిష్కముల్ = బంగారములు. 3. ఆఁకటిచిచ్చుచే = ఆకలియను నగ్నిచేత. 4. ఓరెము = అన్నము. 5. తట్టుముట్టాడు = చుట్టుకొన్న.

చ. వరదుఁడు సాధుభక్తజన వత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడు దాఁ గుశస్థలీ
పురమున యాదవప్రకరముల్ భజియింపఁగ నున్నవాఁడు నీ
వరిగిన నిన్నుఁ జూచి విభుఁ డప్పుడ యిచ్చు [1]ననూనసంపదల్

మ. కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁడై నట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలఁప న్నంతన మెచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్ సుని
శ్చలభక్తిన్ భజియించువారి కిఁకఁ డే [2]సంపద్విశేషోన్నతుల్. 971

క. అని చెప్పిన నమ్మానిని । సునయోక్తుల కలరి భూమిసురుఁ డా కృష్ణుం
గన నేఁగుట [3]యిహపర సా। ధనమగునని మదిఁ దలంచి తనసతితోడన్.

తే. నీవు సెప్పినయట్ల రాజీవనేత్రు । పాదపద్మంబు లాశ్రయింపంగఁ జనుట
పరమశోభనమా చక్రపాణి కిపుడు । గాను కే మైనఁ గొంపోవఁ గలదె మనకు

తే. అనిన నయ్యింతి యాఁ గాక యనుచు విభుని
శిథిల వస్త్రంబు కొంగునఁ [4]బృథుక తండు
లముల నొక కొన్ని ముడిచి నెయ్యమున ననుపఁ
జనియె గోవిందదర్శనోత్సాహి యగుచు.

వ. అట్లు చనుచుం దనమనంబున. 975

సీ. ద్వారకానగరంబు నేరీతిఁ జొత్తును
భాసురాంతఃపురవాసి యైన
యప్పుండరీకాక్షు నఖిలేశు నెబ్భంగిఁ
దర్శింపఁ గలనొ తద్ద్వారపాలు
రెక్కడి విప్రుఁడ విం దేల వచ్చెద
వని యడ్డపెట్టిరే నప్పుడు వారి
కేమైనఁ [5]బరిదాన మిచ్చి చొచ్చెద నన్న
నూహింప [6]నర్థశూన్యుండ నేను

1. అనూనసంపదల్ = తక్కువకాని సంపదలు. 2. సంపద్విశేషోన్నతుల్ = విశేషసంపదలు. 3. ఇహపరసాధనము = రెండులోకములు దాఁటుటకు సాధనము. 4. పృథుకతండులములు = అటుకుగింజలు. 5. పరిదానము = వస్తువుల మార్పు (లంచము). 6. అర్థశూన్యుండ = ధనములేనివాఁడను.

తే. నైన నాభాగ్య మతని దయార్ద్రదృష్టి
గాక తలపోయగా నొండు గలదె యాతఁ
డేల నన్ను నుపేక్షించు నేటిమాట
లనుచు నాద్వారకాపుర మతఁడు సొచ్చి. 976

వ. ఇట్లు ప్రవేశించి రాజమార్గంబునం జనిచని [1]కక్ష్యాంతరంబులు గడచిచని ముందట. 977

సీ. విశదమై యొప్పు షోడశసహస్రాంగ నా
కలితవిలాససంగతిఁ దనర్చి
మహనీయత నీయ మణిమయగోపుర
ప్రాసాదసౌధహర్మ్యములు సూచి
మనము బ్రహ్మానంద మునఁ బొంద గడు నుబ్బి
సంతోషబాష్పములు జడిగొనంగఁ
బ్రకటమై విలసిల్లు నొకవధూమణిమంది
రమున నింతులు చామరములు వీవఁ

తే. దనరు మృదు హంసతూలికాతల్పమందుఁ
దానుఁ బ్రియయును బహువినోదములఁ దనరి
మహితలావణ్యు మన్మథమన్మథుండు
ననఁగఁ జూపట్టు పుండరీకాయతాక్షు. 978

సీ. ఇందీవరశ్యాము [2]వందితసుత్రాముఁ
గరుణాలవాలు భాసుర కపోలుఁ
గౌస్తుభాలంకారుఁ గామితమందారు
సురుచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహాస్తు జగత్ప్రశస్తు
[3]ఖగకులాధిపయానుఁ గౌశేయ పరిధానుఁ
బన్నగశయను సరోజాతనయను

1. కక్ష్యాంతరంబులు = ప్రాకారంబులు. 2. వందితసుత్రాము = ఇంద్రునిచే నమస్కరింపఁ బడువాఁడు. 3. ఖగకులాధిపయానుఁ = గరుత్మంతునిమీఁద నెక్కి సంచరించువానిని.

తే. మకరకుండల సద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు. 979

మ. కని డాయం జనునంతఁ గృష్ణుఁడు దళత్కంజాక్షుఁ డప్పేదవి
ప్రుని నల్లంత దరిద్రపీడితుఁ గృశీభూతాంగు [1]జీర్ణాంబరున్
ఘనతృష్ణాతురచిత్తు హాస్యనిలయున్ [2]ఖండోత్తరీయుం గుచే
లుని నల్లంతనె చూచి సంభ్రమవిలోలుండై దిగెం దల్పమున్.

క. కర మర్థి నెదురుగాఁ జని । పరిరంభణ మాచరించి బంధుస్నేహ
స్ఫురణం దోడ్తెచ్చి సమా।దరమునఁ గూర్చుండఁ బెట్టె దనతల్పమునన్.

తే. అట్లు గూర్చుండఁ బెట్టి నెయ్యమునఁ గనక
కలశ సలిలంబుచేఁ గాళ్ళు గడిగి భక్తిఁ
దజ్జలంబులు [3]దనదు మస్తమునఁ దాల్చి
లలితమృగమద ఘనసారమిళిత మైన. 982

తే. [4]మలయజము మేన జొబ్బిల్ల నలఁది యంత
శ్రమము వాయంగఁ [5]దాళవృంతమున విసరి
బంధు రామోదకలిత ధూపంబు లొసఁగి
మించు మణిదీపముల [6]నివాళించి మఱియు. 983

వ. సురభికుసుమ మాలికలు సిగముడిచి దుఱిమి కర్పూరమిళిత తాంబూలంబు నిడి ధేనువు నొసంగి సాదరంబుగా స్వాగతం బడిగిన నవ్విప్రుండు మేనంబులకాంకురంబు లంకురింప నానందబాష్ప జలబిందుసందోహుండయ్యె, నట్టియెడం బద్మలోచనుండు మన్నించు నంగనామణియగు రుక్మిణి కర కంకణరవంబు లొలయం జామరలు వీవఁ దజ్జాతవాతంబున [7]ఘర్మసలిలంబు నివారించుచుండఁ జూచి

1. జీర్ణాంబరున్ = చినిఁగిన వస్త్రములుగలవానిని. 2. ఖండోత్తరీయున్ = ఉత్తరీయముముక్క కలవానిని. 3. తనదుమస్తమున=తనశిరమున. 4. మలయజము= మంచిగంధము. 5. తాళవృంతమున = తాటివిసనకఱ్ఱచే. 6. నివాళించి = ఆరతులిచ్చి. 7. ఘర్మసలిలంబు = చెమటనీరు.

శుద్ధాంత కాంతానివహంబులు తమ మనంబున నద్భుతంబంది
యిట్లనిరి. 984

ఉ. ఏమితపంబు సేసె నొకొ యీ [1]ధరణీదివిజోత్తముండు తొల్
బామున యోగివిస్ఫురదుపాస్యకుఁడై తనరారు నీజగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్నవాఁ
డీమహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్.

వ. అదియునుంగాక. 986

చ. తన మృదుతల్పమందు వసి తామణియైన రమాలలామ పొం
దును నెడఁగాఁ దలంపక యతండు ప్రహృష్టుఁడు రేగి మోదముం
దనకఁగఁ గౌఁగిలించి యుచితక్రియలం బరితుష్టుఁ జేయుచున్
వినయమునన్ భజించె ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుఁడో.

వ. అను నయ్యవసరంబున. 988

క. మురసంహారుఁడు కుచేలుని
కరము గరంబునఁ దెమల్చి కడఁకన్ మన మా
గురు గృహమున వర్తించిన
చరితము లని కొన్ని నుడివి చతురత మఱియున్. 989

సీ. బ్రాహ్మణోత్తమ వేద పాఠనలబ్ధ
శుత గల చారు వంశంబునలరఁ
[2]బరిణయంబైనట్టి భార్య సుశీల వ
ర్తనమునఁ దగ భవత్సదృశి యగునె
తలఁప గృహక్షేత్ర ధన దార పుత్రాదు
లందు నీ చిత్తంబు సెందకుంట
తోఁచుచున్నది యేను దది లోకసంగ్రహా
ర్థంబు కర్మాచరణంబు సేయు

తే. గతి మనంబులఁ గామమోహితులు గాక
నర్థిమై యుక్త కర్మంబు లాచరించి

1. ధరణీ...త్తముండు = బ్రాహ్మణశ్రేష్ఠుండు. 2. పరిణయంబైనట్టి = వివాహమైనట్టి.

ప్రకృతి సంబంధములు బాసి భవ్యనిష్ఠ
దవిలి యుందురు కొందఱు తత్త్వములు భువిని. 990

వ. అని మఱియు నిట్లనియె. 991

క. ఎఱుఁగుదువె మనము గురు మం
దిరమున వసియించి యాతఁడు తెలుపఁగ నెరుస
న్నెఱుఁగఁగ వలసిన యర్థము
లెఱిఁగి పరిజ్ఞానమహిమ లెఱుఁగుట లెల్లన్. 992

వ. అని మఱియు గురుప్రశంస సేయం దలంచి యిట్లనియె. 993

తే. [1]తిమిరి యజ్ఞానతిమిర ప్రదీప మగుచు
నవ్యయం బైన బహ్మంబు ననుభవించు
భరితసత్త్వుండు సత్కర్మనిరతుఁ డతుల
భూసురశ్రేష్ఠుఁ డనఘుండు [2]బుధనుతుండు. 994

వ. అమ్మహాత్మునివలన సకలవర్ణాశ్రమంబులవారికి నేను విజ్ఞానప్రదుండ నగు గురుఁడ నై యుండియు గురుభజనంబు పరమ ధర్మంబని యాచరించితి నది గావున. 995

క. భూసురులకెల్ల ముఖ్యుఁడ। నై సకలకులాశ్రమంబులందును నెపుడున్
ధీసుజ్ఞానప్రదుఁ డన। దేశికుఁ డన నొప్పుచుండు ధృతి నెల్లెడలన్

తే. అట్టి వర్ణాశ్రమంబుల యందు నర్థ
కుశలు లగువారు నిఖిలైకగురుఁడ నైన
నాదువాక్యంబుచే [3]భవార్ణవము వెలుచ
దాఁటుదురు మత్పదాంబుజధ్యానపరులు. 997

వ. అదియునుం గాక సకల భూతాత్మకుండ నైన యేను దపోవ్రత యజ్ఞదానశమదమాదులచేత సంతసింపను గురుజనంబులఁ బరమ భక్తి సేవించువారలం బరిణమింతునని చెప్పి మఱియు మనము గురుమందిరంబున నున్నయెడ నొక్కనాఁడు గురుపత్ని నియుక్తుల మై [4]యింధనార్థం బడవికిం జనిన నయ్యవసరంబున. 998

1. తిమిరి = హరి. 2. బుధనుతుఁడు = దేవతలచే స్తుతింపఁదగినవాఁడు.
3. భవార్ణవము = సంసారసముద్రము. 4. ఇంధనార్థంబు = కట్టెలనిమిత్తము.

సీ. ఘుమఘుమారావ సంకుల [1]ఘోరజీమూత
పటల సంఛన్నాభ్రభాగ మగుచుఁ
జటుల ఝంఝానిలోత్కట సముద్ధూత నా
నావిధజంతు సంతాన మగుచుఁ
జండ[2]దిగ్వేదండ తుండ నిభాఖండ
వారిధారాపూర్ణ వసుధ యగుచు
విద్యోతమానోగ్ర [3]ఖద్యోతకిరణాజి
[4]విద్యుద్ద్యుతిచ్ఛటా విభవ మగుచు

తే. నడరి జడి గురియంగ [5]నినుఁ డస్తమింప
భూరినీరంధ్ర [6]నిబిడాంధకార మేచి
[7]సూచికాభేద్య మై వస్తు గోచరంబు
గాని యట్లుండ మనము నవ్వానఁ దడిసి. 999

తే. బయలు గొందియుఁ బెనుమిఱ్ఱు పల్లమంబు
రహితసహితస్థలంబు లేర్పఱుపరాక
యున్న యత్తఱి మనము నొండొరుల చేతు
లూఁతగాఁ గొని నడచుచు నుండునంత. 1000

క. బిసబిస నెప్పుడు నుడుగక
విసరెడి [8]వలిచేత వడఁకు విడువక మనముం
బస చెడి మార్గముఁ గానక
మసలితి మంతటను [9]నంశుమంతుఁడు బొడిచెన్. 1001

క. తెలతెలవాఱెడివేళం | గలకలమని పలికెం బక్షిగణ మెల్లెడలం
మిలమిలని ప్రొద్దుపొడుపున | ధళధళమను మెఱుఁగుదిగ్వితానము నిండెన్.

క. అప్పుడు సాందీపని మన | [10]చొప్పరయుచు వచ్చి వానసోఁకున నవలిం
దెప్పిఱిలుటఁ గని ఖేదం | బుప్పతిలం బలికె నకట యోవటులారా.

---

1. ఘోరజీమూత = భయంకరమగు మేఘములు. 2. దిగ్వేదండ = దిగ్గజము (ఏనుగు) 3. ఖద్యోతకిరణ = సూర్యకిరణములు. 4 విద్యుద్ద్యుతి = మెఱుపుకాంతి. 5. ఇనుఁడు = సూర్యుఁడు. 6. నిబిడాంధకారము = దట్టమైన చీఁకటి. 7. సూచికాభేద్యమై = సూదిగ్రుచ్చుటకుఁగూడ అవకాశము లేకుండఁగా. 8. వలిచేత = గాలిచేఁ. 9. అంశుమంతుఁడు = సూర్యుఁడు. 10. చొప్పరయుచు = జాడవెతుకుచు.

చ. కటకట యిట్లు మాకొఱకుఁగాఁ జనుదెంచి మహాటవిన్ సము
త్కట పరిపీడ నొందితిరి గావున శిష్యులు మా ఋణంబు నీఁ
గుట కిది కారణంబు సవ సారెడి బో యిటమీఁద మీకు వి
స్ఫుట ధనబంధు దారబహుపుత్రవిభూతి జయాయురున్నతుల్.

క. అని [1]గారవించి యాయన
మనలం దోడ్కొనుచు నాత్మమందిరమునకుం
జనుదెంచుట లెల్లను నీ
మనమునఁ దలఁతే యటంచు మఱియుం బలికెన్. 1005

వ. అనఘా మన మధ్యయనంబు సేయుచు నన్యోన్యస్నేహవాత్సల్యంబులం జేయు కృత్యంబులు మఱవుగదా యని యివియెల్లఁ దలంచి యాడు మాధవ మధురాలాపంబులు విని యతనిఁ గనుంగొని కుచేలుం డిట్లనియె.

క. వనజోదరగురుమందిర|మునమనమువసించునాఁడు ముదమునఁగావిం
పనిపనులెవ్వియుఁగలవే|వినుమవియట్లుండనిమ్ము విమలచరిత్రా.

క. గురుమతిఁ దలఁపఁగ ద్విజగ
ద్గురుఁడ వనంవగిన నీకు గురుఁ డనఁగా నొం
డొరుఁ డెవ్వఁ డింతయును నీ
[2]కరయంగ [3]విడంబనంబ యగుఁ గాదె హరీ. 1009

వ. అని సాభిప్రాయంబుగాఁ బలికిన పలుకులు విని సమస్త భావాభిజ్ఞుం డైన పుండరీకాక్షుండు మందస్మిత సుందరవదనారవిందుం డగుచు నతనిం జూచి నీ విచ్చటికి వచ్చునప్పుడు నాయందుల భక్తిం జేసి నాకు [4]నుపాయనంబుగా నేమిపదార్థంబుఁ దెచ్చితి వప్పదార్థంబు లేశ మాత్రం బైనఁ బదివేలుగా నంగీకరింతు నట్లుగాక నీచవర్తనుం డై మద్భక్తిందగులని దుష్టాత్ముండు [5]హేమాచలతుల్యం బైన పదార్థంబు నొసంగిన నది నామనంబునకు సమ్మతంబుగాదు గావున.

క. దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైనఁ బాయనిభక్తిం

1. గారవించి = గౌరవించి. 2. ఆరయంగ = ఆలోచించఁగా. 3. విడంబనము = అనుకరించుట 4. ఉపాయనంబుగా = కానుకగా. 5. హేమాచల = బంగారు కొండ.

గొలిచిన జను లర్పించిన
నెలమిన్ సుచిరాన్నముగనె ♦ యేను భుజింతున్. 1010

క. అని పద్మోదరుఁ డాడిన|వినయోక్తుల కాత్మ నలరి ♦ విప్రుఁడు దాఁ దె
చ్చినయడుకులుదగనర్పిం|పను నేరక మోమువాంచి ♦ పలుకక యున్నన్

వ. అవ్విప్రుండు చనుదెంచిన కార్యంబు కృష్ణుండు దన దివ్యచిత్తంబున
నెఱింగి యితండు [1]పూర్వభవంబున నైశ్వర్యకాముండై నను
సేవింపండైన నిక్కుచేలుండు నిజకాంతాముఖోల్లాసంబు కొఱకు
నాయొద్దకుఁ జనుదెంచిన వాఁడితనికి నింద్రాదులకుం బడయరాని
బహువిధంబులైన సంపద్విశేషంబు లీక్షణంబ యొసంగవలయు
నని తలంచి యతండు జీర్ణవస్త్రంబు కొంగున ముడిచి తెచ్చిన
యడుకుల ముడియఁ గని యిది యేమియని యొయ్యన నమ్ముడియఁ
దనకరకమలంబుల విడిచి యయ్యడుకులు గొన్ని పుచ్చికొని యివియ
సకలలోకంబులను నన్నును బరితృప్తిం బొందింపఁ జాలునని
యప్పుడు. 1012

క. సురహరుఁడు పిడికెఁ డడుకులు
గర మొప్పఁగ నారగించి ♦ కౌతూహలియై
మఱియును బిడికెఁడు గొనఁ ద
త్కర మప్పుడు పట్టె [3]కమల ♦ కరకమలములన్. 1013

క. సొంపారఁగ నితనికి బహు
సంపద లందింప నివియ ♦ చాలును నీక భ
క్షింపఁగ వలవదు త్రిజగ
త్సంపత్కర దేవదేవ ♦ సర్వాత్మహరీ. 1014

వ. అని యిట్లు వారించె, నక్కుచేలుండును నారాత్రి గోవిందు మందిరంబునఁ దనకు హృద్యమానందకరంబు లగువివిధపదార్థంబు లనుభవించి మృదులశయ్యాతలంబున నిద్రించి తనమనంబునం దన్ను [4]సమధిక స్వర్గభోగానుభవుంగాఁ దలంచుచు మఱునాఁ డరుణో

1. పూర్వభవంబున = గత జన్మమునందు. 2. ఒయ్యన = మెల్లఁగా. 3. కమల = లక్ష్మి. 4. సమధిక స్వర్గభోగానుభవుంగా = అధికసంపదల భోగము కలవానిఁగా.

దివసంబున మేల్కాంచి కాలోచితకృత్యంబులు దీర్చి యిందిరారమ
ణుండు పనుపఁగొంతదవ్వనిపి యామంత్రితుం జేయఁ జనుచు నంద
నందనసందర్శనానందలోలాత్ముండయి తనమనంబున నిట్లనియె.

క. నాపుణ్యమరయ నెట్టిదొ
యా పుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల
వ్యాపకు బ్రహ్మణ్యునిఁ జి
ద్రూపకుఁ బురుషోత్తమునిఁ బరముం గనుఁగొంటిన్. 1016

సీ. పరికింపఁ గృపణస్వభావుండ నైనట్టి
యే నేడ నిఖిలావనీశ్వరి యగు
యిందిరాదేవికి నెనయంగ నిత్య ని
వాసుఁడై యొప్పు సర్వాత్ముదేవుఁ
డేడ న[1]న్నర్థిమైఁ దోడఁబుట్టినవాని
కైవడిఁ గౌఁగిటఁ గదియఁ జేర్చి
దైవంబుగా నన్ను భావించి [2]నిజతల్ప
మున నుంచి సత్క్రియల్ పూని నడపి

తే. చారు నిజవధూకరసరోజాతకలిత
చామరానిలమున [3]గతశ్రమునిఁ జేసి
[4]శ్రీకుచాలిప్తచందనాంచితకరాబ్జ
తలములను నడ్గులొత్తె పరవత్సలత మెఱసి. 1017

వ. కావున.

ఉ. శ్రీనిధి యిట్లు నన్నుఁ బరిచరించి ఘనంబుగ [5]విత్త మేమియు
నీనితెఱంగు గానఁబడె నెన్న దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁ జేరఁడని కాక శ్రితార్తిహరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తుపరిపూర్ణునిఁగా నను జేయకుండునే. 1019

వ. అనితనమనంబున వితర్కించుచు నిజపురంబునకుం జనిచని ముందట.

---

1. అర్థిమైన్ — కోరి. 2. నిజతల్పమున = తనమంచముపైఁద. 3. గతశ్రమునిఁ = శ్రమలేనివానిఁగా. 4. శ్రీకుచా...కరాబ్జతలములను = లక్ష్మియొక్క స్తనములయందలి మంచిగంధముచే చిహ్నితమైన పద్మములవంటి హస్తములచే. 5. విత్తమేమియు = ధనమేమియును.

సీ. భానుచంద్రప్రభా ✽ భాసమానస్వర్ణ
చంద్రకాంతోపల ✽ సౌధములును
[1]గలకంఠ [2]శుక నీల ✽ కంఠ సముత్కర
మానితకుజాతో ✽ ద్యానములును
[3]ఫుల్లసితాంభోజ ✽ హల్లక కల్హార
కైరవోల్లసిత కా ✽ సారములును
మణిమయ కనక కం ✽ కణముఖాభరణ వి
భ్రాజిత దాసదా ✽ సీజనములుఁ

తే. గలిగి చెలువొందు [4]సదనంబు ✽ గాంచి విస్మ
యమును బొందుచు నెట్టి పు ✽ ణ్యాత్ముఁ డుండు
నిలయ మొక్కొ యపూర్వమై ✽ నెగడె మహిత
వైభవోన్నత లక్ష్మీని ✽ వాస మగుచు. 1021

వ. అని తలపోయుచున్న యవసరంబున. 1022

తే. దివిజవనితలఁ బోలెడు ✽ తెఱవ లపుడు
డాయ నేతెంచి యిందు వి ✽ చ్చేయుఁ డనుచు
విమలసంగీత నృత్యవా ✽ ద్యములు సెలఁగ
గరిమఁ దోడ్కొని చని రంత ✽ ఃపురమునకును. 1023

వ. ఇట్లు చనుదేర నతనిభార్యయైన సతీలలామంబు దనమనంబున నానంద రసమగ్న యగుచు నప్పుడు. 1024

సీ. తనవిభురాక మ్రుం ✽ గటఁ గని మనమున
హర్షించి వైభవం ✽ బలర మనుజ
కామినీరూపంబుఁ ✽ గైకొన్న [1]యిందిరా
వనితచందంబునఁ ✽ దనరుచున్న
కలకంఠి తనవాలుఁ ✽ గన్నులఁ గేవల
నానందబాష్పంబు ✽ లంకురింప

1. కలకంఠ = అవ్యక్తమధురమైన కంఠములు గలవి. 2. శుక నీలకంఠ = చిలుకలు, నెమళ్ళు. 3. ఫుల్ల..కాసారములును = వికసించిన తెల్లతామరలు, ఎఱ్ఱకలువలుఁగల కొలఁకులను. 4. సదనంబు = గృహము. 5. ఇందిరా = లక్ష్మి.

వలనిపాదంబుల కాత్మలో మ్రొక్కి భా
వంబున నాలింగనంబు సేసి

తే. [1]ఆ ధరాదేవుఁ డత్తుల దివ్యాంబరాభ
రణవిభూషితులై రతిరాజుసాయ
కములగతి నొప్పు పరిచారికలు భజింప
లలిత సౌభాగ్యయగు నిజలలనఁ జూచి. 1025

క. ఆనారీరత్నంబును దానును ననురాగరసము దళుకొత్తఁగ ని
త్యానందము నొందుచుఁ బెం పూనినహరిలబ్ధవైభవోన్నతి మెఱయన్.

సీ. కమనీయ పద్మరాగస్తంభకంబులుఁ
గోమరారు పటికంపు [2]గోడ్యములును
మరకతనవరత్నమయకవాటంబులుఁ
గీలిత హరినీలజాలకములు
దీపిత చంద్రకాంతోపలవేదులు
నంచిత వివిధపదార్థములును
దగు హంసతూలికాతల్పంబులును హేమ
లాలిత శయనస్థలములుఁ దనరు

తే. సమధికోత్తుంగ [3]భద్రపీఠములు సిరులు
మానితోన్నత చతురంతయానములును
వలయు సద్వస్తుపరిపూర్ణవాటికలును
గలిగి చెలువొందు మందిరంబు చెలిమిఁ జొచ్చి. 1027

వ. సుఖంబుననుండు నట్టియెడం దనకు మనోవికారంబులు వొడమకుండ వర్తించుచు నిర్మలం బగు తన మనంబున నిట్లను, నింతకాలం బత్యంతదురంతం బగు దారిద్ర్య [4]దుఃఖార్ణవంబున మునింగి యున్న నాకుం గడపటఁ గలిగిన విధంబున నిప్పుడు 1028

ఆ. ఎన్నఁ బ్రాప్తమైన యిట్టి సంపదలు నా
కబ్బుటెల్ల హరి దయావలోక

1. ఆ ధరాదేవుఁడు=ఆబ్రాహ్మణుఁడు (కుచేలుఁడు) 2. గోడ్యములను=గోడలను; 3. భద్రపీఠములు = మంగళములైనపీఠములు. 4. దుఃఖార్ణవమున = దుఃఖమను సముద్రమున

నమునఁ జేసి కాదె ✽ నళినాక్షు సన్నిధి
కర్థి నగుచు నేను ✽ నరుగుటయును. 1029

క. ఘను నా వృత్తాంతంబును
దనమనమునఁ గనియు నేమి ✽ దడవక నన్నుఁ బో
మ్మని యీసంపద లెల్లను
నొనరఁగ నొడఁగూర్చి నన్ను ✽ [1]నొడయునిఁ జేసెన్. 1030

వ. అట్టి పురుషోత్తముండు భక్తవిశిష్టులైన సజ్జనులు లేశమాత్రంబగు పదార్థంబైన భక్తిపూర్వకంబుగా సమర్పించిన నదియ [2]కోటిగుణితంబుగాఁ గైకొని మన్నించుటకు నిదియ దృష్టాంతంబు గాదె, మలినదేహుండును జీర్ణాంబరుండు నని చిత్తంబున [3]హేయంబుగాఁ బాటింపక నాచే నున్నయడుకు లాదరంబున నారగించి నన్నుం గృతార్థునిం జేయుట యతని [4]నిర్హేతుకదయయ కాదె, యట్టి కారుణ్యసాగరుండైన గోవిందుని చరణారవిందంబులయందు భక్తి ప్రతిభవంబును గలుగుం గాక యని యప్పుండరీకాక్షునియందుల తాత్పర్యంబునం దగిలి పత్నీసమేతుండయి నిఖిలభోగంబులయందు నాసక్తిం బొరయక రాగాది విరహితుండును నిర్వికారుండును నై యఖిలక్రియలందు ననంతుని యనంతధ్యాన సుధారసంబునం జొక్కుచు[5] విగతబంధనుండయి [6]యపవర్గప్రాప్తిం బొందె మఱియును

ఆ. దేవదేవుఁ డఖిల ✽ భావజ్ఞుఁ డాశ్రిత
వరదుఁ డయిన హరికి ✽ ధరణిసురులు
దైవతములు గాన ✽ ధారుణీదివిజుల
కంటె దైవ మొకఁడు ✽ గలదె భువిని. 1032

క. మురహరుఁ డిట్లు కుచేలునిఁ
జరితార్థునిఁ జేసినట్టి ✽ చరితము విను స
త్పురుషుల కిహపరసుఖములు
హరిభక్తియు యశముఁ గలుగు ✽ నవనీనాథా. 1033

---

1. ఒడయని=రాజుగా. 2. కోటిగుణితంబుగా=కోటిరెట్లుగా. 3. హేయంబుగాన్=అసహ్యముగా. 4. నిర్హేతుక = కారణములేని. 5. విగతబంధనుండై=సంసారబంధములగు కష్టములు పోఁగొట్టినవాఁడై, 6. అపవర్గము=మోక్షము.

—◆ శ్రీకృష్ణుఁడు కుటుంబముగా గ్రహణస్నానమునకుఁ బోవుట. ◆—

వ. అని మఱియుఁ బరాశరపౌత్రున [1]కర్జునపౌత్రుం డిట్లనియె.

ఆ. దుష్టశిక్షణంబు । [2]దురితసంహారణంబు
శిష్టరక్షణంబు । చేయఁ దలఁచి
భువిని మనుజుఁ డగుచుఁ । బుట్టిన శ్రీకృష్ణు
విమలచరిత మెల్ల । విస్తరింపు. 1035

వ. అనిన శుకుం డిట్లనియె. 1036

సీ. ధరణీశ బలుఁడును । సరసిజోదరుఁడు న
వోన్నతసుఖలీల । నుండు నంతఁ
జటులోగ్రకల్పాంత । సమయమందును బోలె
దృగసహ్యమై సము । ద్దీప్త మగుచు
రాజిల్లు సూర్యోప । రాగంబు చనుదెంచు
టెఱిఁగి భూజను లెల్ల । వరుసఁ గదలి
మును జమదగ్ని రా । ముఁడు పూని [3]ముయ్యేడు
మాఱులు ఘనబలో । దారుఁ డగుచు

తే. నిజభుజాదండ మండిత । నిబిడనిశిత
చటులదంభోళి రుచిర భా । స్వత్కుఠార
మహితధారావినిర్భిన్న । మనుజపాల
దేహనిర్ముక్తరుధిర ప్ర । వాహములను. 1037

తే. ఏను మడువులు గావించె । నెచట నేని
నట్టి పావనసుక్షేత్ర । మగు శమంత
పంచకంబున కపుడు సం । భ్రమముతోడఁ
జనిరి బలకృష్ణులును సంత । సం బెలర్ప. 1038

వ. ఇట్లు [4]నిష్కర్ములైన రామకృష్ణులు లోకధర్మానుపాలన ప్రవర్త
నులై ద్వారకానగరరక్షణంబునకు ప్రద్యుమ్న గదసాంబ సుచంద్ర

1. అర్జునపౌత్రుఁడు = అర్జునుని మనుమఁడు. (కొడుకుకుమారుఁడు) 2. దురిత సంహారణంబు = పాపములు పోఁగొట్టుట. 3. ముయ్యేడుమాఱులు = ఇరువదియొక్క పారులు. 4. నిష్కర్ములైన = కర్మరహితులైన.

శుకసారణానిరుద్ధ కృతవర్మాది యోధవరుల నియమించి తాము నక్రూర వసుదేవోగ్రసేనాది సకల యాదవులుం గాంతాసమేతులై [1]స్రక్చందనాభరణవస్త్రాదులు ధరియించి శోభనాకారంబులతోడం బుష్పక విమానంబు లనం బొలుచు [2]శకటంబులను మేఘంబుల ననుకరించు గజంబులను మనోవేగంబులైన తురంగంబుల నెక్కి దివియచ్చరులం [3]బురుడించు పురుషులు దమ్ము సేవింపం జని యుష్ణాక్ష్యా తీర్థంబుల [4]నవగాహనంబు సేసి యుపవసించి యనంతరంబ 1039

క. భూసురవరులకు ననుపమ । వాసోలంకారధేను వసురత్నధరి
త్రీసుమహితవస్తువు లు । ల్లాసంబున దానమిచ్చి లాలితులగుచున్.

క. [5]పునరవగాహనములు పెం । పొనరంగావించి బంధుయుక్తముగా భో
జనకృత్యంబులు తీర్చి స । దనురాగము లుల్లసిల్ల నచ్చోటఁదగన్.

క. ఘనశాఖాకీర్ణములై । యనఘమ్ములు దూరితార్క యెసకం బెసఁగన్
ననిచిన పొన్నల నీడల । నలచిన వేడుకల నందనందనముఖ్యుల్.

క. తనరిన పల్లవరుచిరా । సనముల నాసీనులగుచు సత్సుఖగోష్ఠిం
బెనుపొందఁగ నట వసియిం । చినచోఁ దత్పుణ్యతీర్థసేవారతులై.

వ. మున్న చనుదెంచియున్న మత్స్యోశీనర కోసల విదర్భ కురు సృంజయ కాంభోజ కేకయ మద్ర కుంత్యారట్ట కేరళాది భూపతులును మఱియుం దక్కిన రాజవరులును హితులును నంద గోపాది గోపాలురును గోపికా జనంబులును ధర్మరాజానుగతులై వచ్చిన భీష్మ ద్రోణ ధృతరాష్ట్ర గాంధారీ కుంతీ పాండవ తద్దారనివహ సంజయ విదుర కృప కుంతిభోజ విరాట భీష్మక నగ్నజి ద్ద్రుపద శైబ్య ధృష్టకేతు కాశీరాజ దమఘోష విశాలాక్ష మైథిలయుధామన్యు సుశర్మలును సపుత్త్రకుండైన బాహ్లికుండును మొదలుగా ననేకులు నుగ్రసేనాది యాదవ ప్రకరంబులం బూజలం దృప్తులం జేసిన వారునుం బ్రముదితాత్ములై రయ్యెడ. 1044

---

1. స్రక్చందన = పూలమాలలు, గంధము. 2. శకటంబులను = రథములను. 3. పురుడించు=పోలిన. 4. అవగాహనంబుల = స్నానముల. 5. పునరవగాహనములు= తిరిగి స్నానములు.

క. ఆరాజులు గాంచిరి [1]నిజనారీయుతు లగుచు నంగనాపరివారున్
ధీరున్ దానవకుల సంహారున్ గోపీ మనోవిహారు నుదారున్.

వ. కని యమ్మాధవ బలదేవులు సేయు సముచిత పూజా విధానంబులం
బరితృప్తులై యమ్ముకుందు సాన్నిధ్యంబు గలిగి తదీయ సంపద్విభ
వాభిరాములై విలసిల్లుచున్న యుగ్రసేనాది యదు వృష్ణిపుంగవులం
జూచి వారలం గూడ నా రాజవరులు సాధువృందము విన నిట్లనిరి.

మ. మఃశాస్త్రంబులు వాక్కులున్ మనములున్ మాంగల్యముం బొందిపా
వనమై యొప్పెడి నీ రమావిభుని భాస్వత్పాదపంకేజసే
చన తోయంబుల నే మహాత్ముని పదాబ్జాతంబు లెం దేని సోఁ
కిన చోటెల్లను ముక్తిహేతు వగు నీ కృష్ణుండె పో చూడఁగన్.

చ. సనకసనందనాది మునిసత్తము లంచిత యోగదృష్టిచేఁ
బనివడి యాత్మలన్ వెదకఁ బట్ట [2]నగోచరమైన మూర్తి యి
[3]ట్లనవరతంబు మాంసనయనాంచల గోచరుఁ డయ్యె నక్కటా యే
మనసగు వీరి పుణ్యమున కావట నెట్టి తపంబు సేసిరో. 1048

మ. [4]నిరయస్వర్గము లాత్మఁ గైకొనక తా నిర్వాణమూర్తైన యా
హరిఁ జూడన్ హరితోడఁ బల్కఁ హరి మేనంటన్ హరిం బాడఁగా
హరితో నేగ సహాసనాస్తరణ శయ్యావాసులై యుండఁగన్
హరి బంధుత్వ సఖిత్వముల్ గలుగు భాగ్యం బెట్లు సిద్ధించెనో.

తే. అనుచు యాదవ వృష్ణి భోజాంధకులును
హరి దయాలబ్ధ నిఖిలార్థు లగుచు నున్న
మనికిఁ దమచిత్తములఁ బలుమాఱు పొగడి
పరిణమించిరి యంత నా పాండుమహిషి. 1050

వ. అప్పుడు. 1051

క. తనసుతులకు గాంధారీతనయులు గావించు [5]నపకృతంబుల కాత్మన్
ఘనముగ నెరియుచు నచ్చటఁ గనుఁగొని వసుదేవు విగతకల్మషభావున్.

---

1. నిజనారీయుతులగుచున్ = తమ భార్యలతో కూడినవారలై. 2. అగోచరమైన = అగపడని. 3. అనవరతంబు = ఎల్లప్పుడు. 4. నిరయస్వర్గములు = నరకస్వర్గములు. 5. అపకృతంబులకు = అపకారములకు.

వ. అట్లు గనుంగొని యతనితో నిట్లనియె. 1053

క. ఓయన్న పాండు తనయులు
నీయల్లుం డ్రడవులందు నెఱి మృగములలోఁ
బాయని [1]యిడుములఁ బడఁ గను
ణాయత్తుల రగుచు మీర లరయఁగ వలదే. 1054

వ. అని బహుప్రకారంబుల సంతాపించుచు మఱియు నిట్లనియె. 1055

క. అతి బలవంతపు విధి దాఁ
బ్రతికూలం బైన గలరె బంధువు లనుచున్
ధృతి గలఁగ బాష్ప జలపూ
రితలోచన యగు సహోదరిం జూచి యనెన్. 1056

సీ. తల్లి నీ కేల సంతాపింప మనమునఁ
దలఁపక విధి నేల [2]సొలసె దింత
యఖిల నియామకుం డగు నీశ్వరుఁడు మాయ
[3]యవనికాంతరుఁ డైన యట్టిసూత్ర
ధారుని కైవడిఁ దగిలి నటింపఁగ
మనుజులు కీలు బొమ్మలు దలంపఁ
గావున విధిసేతఁ గడచి వర్తింపఁగ
దేవతలకు నైనఁ దీఱ దట్లు

తే. క్రోధచిత్తుఁడు కంసుండు బాధపఱుప
[4]నిలయములు దప్పి నేమడవులఁ జరింప
ఘన కృపానిధి యీ హరి గలుగఁబట్టి
కోరి మా కిండ్లు గ్రమ్మఱఁ జేరఁ గలిగె. 1057

వ. అని యూరడిలం బలుకు నవసరంబున. 1058

క. నంద యశోదలు గోపక
బృందంబులు గోపికలును [5]బిరిగొని పరమా

1. ఇడుములన్ = కష్టములను. 2. సొలసెదు = కష్టపడెదవు. (సంతాపించెదవు) 3. అవనికాంతరుఁడైన = తెరచాటుననున్న. 4. నిలయములు = స్థానములు. 5. పిరిగొని = గుంపులుగా.

నందంబునఁ జనుదెంచిరి
మందరధరుఁ జూచు వేడ్క ✽ మనములఁ బొడమన్. 1059

వ. ఇట్లు సనుదెంచి. 1060

క. అతి చిరకాల సమాగతు । నతని నిరీక్షించి వృష్ణి ✽ యాదవభోజ
[1]ప్రతతులు నెదు రేగి సము । న్నతితో నాలింగనముల ✽ నడపిరి వరుసన్.

క. వసుదేవుఁడు వారికి సం
తసమునఁ గావించె సముచి ✽ తక్రియ లంతన్
[2]ముసలియు హరియును మ్రొక్కిరి
వెస నంద యశోదలకును ✽ వినయం బెసఁగన్. 1062

వ. అట్లు నమస్కృతులు సేసి యాలింగనంబులు గావించి నయనార
విందంబుల నానందబాష్పంబు దొరఁగ నెఱలేని స్నేహంబులు
చిత్తంబుల నత్తమిల్ల నేమియుం బలుకకుండి, రంత నయ్యశోదా
దేవి రామకృష్ణుల నిజాంకపీఠంబుల నునిచి యక్కునం గదియం
దిగిచి చెక్కులు ముద్దుగొని శిరంబులు [3]మూర్కొని [4]చిబుకంబులు
పుడుకుచుఁ [5]బునః పునరాలింగనంబు గావించి పరమానందంబునం
బొందుచు నున్నంతఁ బదంపడి. 1063

చ. సితమతితోడ రోహిణియు ✽ దేవకియుం దగ నంద గోపసుం
దరిఁ గని కౌఁగిలించికొని ✽ తత్కృతులెల్లఁ దలంచి యిట్లని నీ
వరుఁడును నీవు బంధుజన ✽ వత్సలతన్ మును జేయు సత్కృతుల్
మఱువఁగవచ్చునే తలఁప ✽ మాకిఁక నెన్నటికం దలోదరీ! 1064

క. జనసంబంధిన మొదలుగ
ఘనమోహముతోడఁ బెంచు ✽ కతమునఁ దమకున్
జననీజనకులు వీరని
మనమునఁ దలపోయలేదు ✽ మము నీతనయుల్. 1065

---

1. ప్రతతులు = సమూహములు. 2. ముసలియు = బలరాముఁడును, 3. మూర్కొని = వాసన చూచి. 4. చిబుకంబులు = గడ్డములు, 5. పునఃపునరాలింగనము = మఱియుమఱియు ఆలింగనములు చేయుచు.

క. అంటిన ప్రేమస్ఫూర్తిం । గంటికి రెప్పడ్డమైన కరణిం బొందంగ మా
కంటెన్నన రాటను మీ । యింటం గొలిచి యుండ నెన్నడు గల్గున్.

వ. అని యిట్లు ప్రియాలాపంబులు వలుకుచుండు నవసరంబున గోపాల సుందరు లమందానంద కందళిత హృదయలయి హృదయేశ్వరుం డయిన గోవిందుని జిరకాల సమాగతుండగు నంజేసి యతనిం జూచు తలంపు లుల్లంబుల నల్లిగొనం జేరి. 1067

చ. నలినదళాక్షుఁ జూచి నయనంబులు మోడ్చి యోగజాలకాత్మలం
దలఁచి తదీయమూర్తి విభవంబుఁ దలంచుచుఁ గౌఁగిలించుచుం
బులకలు మేన జాదుకొన బోటులు చొక్కిరి బ్రహ్మము న్మనం
బులఁగని చొక్కు యోగిజనముం [1]బురణింపఁగ మానవేశ్వరా.

చ. పొలఁతుల భావమాత్మఁగని ఫుల్లసరోరుహలోచనుండు వా
రలనపు డేకతంబునకు రమ్మని తోకొనిపోయి యందు న
ర్మిలిఁ [2]బరిరంభణంబు లొనరించి లసద్దరహాస చంద్రికా
కలితకపోలుఁడై పలికెఁ గాంతల భక్తినితాంతచిత్తలన్. 1069

చ. వనజదళాక్షులార బలవద్రిపువర్గములన్ జయింపఁగాఁ
జని తడవయ్యె దీనికి భృశంబుగ మీమది నల్గకుండుఁడీ
యనయము దైవమిట్లు సచరాచరజాలము నొక్కవేళఁ గూ
ర్చును నొకవేళఁ బాపును మరుద్ధత తూల తృణంబులుం బలెన్.

సీ. తరళాక్షులార మద్భక్తిచేతనులకుఁ
దనరు మోక్షానంద దాయకంబు
జపతపోవ్రతదాన సత్కర్మములభక్తి
కలుగంగ నేరదు గానఁ దలఁప
విధి శివ సనకాది విమలచిత్తంబులఁ
బొడమని భక్తి మీ బుద్ధులందు
జనియించె మీ పూర్వ సంచిత సౌభాగ్య
మెట్టిదో యిది తుద ముట్టె నిక్క

1. పురణింపఁగ = పోలఁగా. 2. పరిరంభణము = కౌఁగిలింత. 3. సచరాచర = కదలి కదలనివానితో.

తే. నటమటముగాదు మీకు § నెన్నటికినైనఁ
గలుగనేరవు [1]నిరయ § సంగతములైన
జన్మకర్మము లిటమీఁద § మన్మనీష
సుమహితధ్యానలార యో § రమణులార! 1071

సీ. అఖిలభూతములకు § నయంబు నాది మ
ధ్యాంతకాంతర్బహి § ర్వ్యాప్తినైన
ఘటపటాదికభూత § కార్యంబులకును బ్ర
ధానకారణము లై § తనరునట్టి
గగనానిలానల § కక్షోణులను భూత
పంచకం బైక్యత § వడయుఁగాదె
లోకంబులందుఁ బం § చీకరణ వ్యవ
స్థలచేత నట్టి భూ § తములరీతి

తే. గగనముఖభూత తత్కార్య § కారణములఁ
దగిలి యాధారహేతు భూ § తంబునైన
నాకుఁ బర మన్యుఁ డొకఁడు నె § న్నంగలేఁడు
విమలమతులార మాటలు § వేయునేల. 1072

తే. అనినఁ దెలివొందివారు దే § హాభిమాన
ములు సమస్తంబు విడిచి యో § నళిననాభ
నిఖిల జగదంతరాత్మ మా § నిత చరిత్ర
భక్తజనమందిరాంగణ § పారిజాత. 1073

తే. ఘోరసంసార సాగరో § త్తారణంబు
ధీయుతజ్ఞానయోగ హృ § ద్ధ్యేయవస్తు
వగుచుఁ జెలువొందు నీచర § ణాంబుజాత
యుగళములు మామనంబులఁ § దగుల నీవె. 1074

క. అని వేడినఁ గృష్ణుఁడు ముని|వినుతుఁడు గరుణించి [2]వల్ల § వీజనములుగో
రినయట్లనిచ్చెఁ గరుణా | వననిధి సద్భక్తలోక § వత్సలుఁ డంతన్.

చ. ధర్మతనూభవుంగని ప § దంబులకు న్నతుఁడై సపర్యలన్
నిర్మలభక్తిమై నడిపి § నీవును దమ్ములు బంధుకోటిన

1. నిరయము = నరకము. 2. వల్లవీజనములు = గోపికలు.

తత్కర్మచరిత్రులై తగు సుఖంబుల నొప్పుచున్నవారె నా
నర్మిలిఁ బాండవాగ్రజుఁడు నమ్మధుసూదనుతోడ నిట్లనున్.

క. సరసిజనాభ భవత్పద।సరసీరుహమాశ్రయించు జను లతి సౌఖ్య
స్ఫురణం బాలుపారుచు భువిఁ।జరియింపరె భక్తపారిజాత మురారీ!

వ. అదియునుంగాక. 1078

సీ. సుమహిత స్వప్న సుషుప్తి జాగరములన్
మూఁడవస్థలఁ బాసి వాడిమిగిలి
వెలినుందు లోనుందు విశ్వమై యుందువు
విశ్వంబు నీయందు వెలుఁగుచుండు
భవదీయ మహిమచేఁ బాటిల్లు భువనంబు
లుదయించు నొకవేళ నుడిగి మడుఁగు
సంచితాఖండిత జ్ఞానివై యొప్పుచు
నవిహతయోగమాయాత్మఁ దనరి

తే. దురితదూరులు నిత్యముక్తులకుఁ జెంద
నలవియై పెంపుదీపింతు వంబుజాక్ష
ఘనకృపాకర నిఖిల వికారదూర
నీకు మ్రొక్కెద సర్వలోకైకనాథ.

క. అని వినుతించిన నచ్చటి।జనపాలక బంధుమిత్రసకలజనంబుల్
విని యనురాగిల్లిరి నె।మ్మనముల నానందజలధిమగ్నులగుచున్.

తే. అట్టి యొప్పగువేళ నైశ్వర్యంబు మెఱసి
యొక్కచోటను సంతోషయుక్తులగుచు
[1]దానవాంతకసతులును ద్రౌపదియును
గూడి తమలోన ముచ్చట లాడుచుండి. 1081

—♦ లక్షణ యను శ్రీకృష్ణుని యష్టభార్య ద్రౌపదీదేవికిఁ దన వివాహవృత్తాంతంబు దెలుపుట. ♦—

వ. అట్టియెడఁ గృష్ణకథావిశేషంబులు పరితోషంబున నగ్గడించుచుఁ బ్రసంగవశంబున నారుక్మిణీదేవి మొదలగు శ్రీకృష్ణుభార్యలం

1. దానవాంతకసతులును = శ్రీకృష్ణభార్యలును.

గనుంగొని పాంచాలి యిట్లనియె. మిమ్ముఁ బుండరీకాక్షుండు వివాహం బయిన తెఱంగులు వివరింపుఁ డనిన నారును దమ పరిణయంబుల తెఱంగులు మున్ను నే నీకుం జెప్పిన యర్థంబున వినిపించి రంత సవిస్తరంబుగాఁ దెలియం బలుకని మద్రరాజకన్యకా వివాహవృత్తాంతం బామానిని పాంచాలికిం జెప్పిన విధంబు వినుమని శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 1082

సీ. పాంచాలితో మద్రపతి సుత యిట్లను
సంగీతవిద్యా విశారదుండు
నారదుచేతి వీణాస్వనకలితమై
నట్టి గోవింద సత్కథామృతంబు
దవిలి యేఁ గ్రోలి చిత్తము తన్మయత్వంబు
నొంది మోదించుచు నుండు నంత
[1]దుహితృవత్సలుఁడు [2]మద్గురుఁడు దా నది విని
సదుపాయ మొక్కటి మదిఁ దలంచి

తే. [3]చదల నెబ్బంగినైన గోచరముగాక
వారిమధ్యములోఁ బ్రతివ్యాప్తిఁ దోఁచు
మత్స్యయంత్రంబు గల్పించి మనుజు లెంత
వారలైనను దివ్యమోహంబు గొనరాని. 1083

తే. ధనువుఁ బ్రచండనిష్ఠురాస్త్రంబు నచట
నంచితంబైన గంధ పుష్పాక్షతలను
బూజగావించి యునిచి యే పురుషుఁడేని
సిద్ధబలమున నీచాప మెక్కువెట్టి. 1084

క. [4]ఈసాయకంబు నారిం
బోసి వెసన్ మత్స్యయంత్రమున్ ధరఁ గూలన్
వేసిన శౌర్యధురీణుఁడు
నాసుత వరియించు నని ప్రచారంబులు వినఁగన్. 1085

1. దుహితృవత్సలుఁడు = కూఁతు నెడఁ బ్రేమగలవాఁడు 2. మద్గురుఁడు = నాతండ్రి. 3. చదల = ఆకాశము. 4. ఈ సాయకంబు = ఈ బాణము.

క. చాచింపని నవ్వార్తకుఁ । బోటించిన సంభ్రమములఁ ॥ బాణాసన మౌ
ర్వీటంకార మహారవ । పాటితశాత్రవులు బాహు ॥ బలసంపన్నుల్.

క. సుందరతనులు తదుత్సవ । సంవర్ధనకుతుకు లమిత ॥ సైన్యులు [1]భూభృ
న్నందనులేతెంచిరి జ । నందితయశులగుచు మద్ర ॥ నగరంబునకున్.

క. చనుదెంచిన వారికి మ । ద్రజనకుఁడు వివిధార్చనములు ॥ సమ్మతిఁ గావిం
చిన నా బాహుబలాఢ్యులు । ధనువుం జేరంగ నరిగి ॥ ధైర్యస్ఫూర్తిన్.

వ. ఇట్లు డగ్గఱి య ద్ధనువుం గనుంగొని. 1089

ఉ. కొందఱు పూనలేక చనఁ ॥ గొందఱు పూని కదల్పలేక పోఁ
గొంద ఱొకింత యెత్తనేక ॥ కొందఱు మోపిడలేక దక్కఁగాఁ
గొంద ఱొకింత యెక్కిడుచుఁ ॥ గోత్రనృపాలకు లిట్లు సిగ్గునుం
జెంది తలంగిపోవుచును ॥ నీ యిటకేఁగుట నీతి తప్పనన్. 1090

వ. అట్టియెడ. 1091

క. భీముఁడు [2]రాధేయుఁడు ను
ద్దామ గతి న్నెక్కుఁ ద్రోచి ॥ తగన [3]మీనం
బేమఱక తిరుగుచుంటయుఁ
దామేమియు నెఱుఁగ లేకఁ ॥ తలఁగిన పిదపన్. 1092

క. అమరేంద్రతనయుఁ డమ్మ
త్స్యమునేయ నుపాయ మెఱిఁగి ॥ తగనేసియు మీ
నము ద్రుంపలేక సిగ్గున
విముఖుండై చనియె నంత ॥ వికలుండగుచున్. 1093

వ. ఇట్లు సకల రాజకుమారులుం దమ తమ ప్రయత్నంబులు విఫ లంబులైన ముఖారవిందంబులు ముకుళించి దైన్యంబున విన్ననై చూచుచున్న యెడ. 1094

చ. సరసిజపత్త్రలోచనుఁడు ॥ చాపము [4]సజ్యముసేసి యుల్లస
చ్ఛర మఱిఁబోసి ॥ కార్ముక వి॥శారదుఁడై యలవోకవోలె ఖే
చర మగు మీనము న్దునిమె ॥ సత్వరతన్ సుర సిద్ధ సాధ్యఖే
చర జయశబ్ద మొప్పఁ బెలు॥చం గురిసెం దివిఁ బుష్పవర్షముల్

1. భూభృన్నందనులు = రాజకుమారులు. 2. రాధేయుఁడు = కర్ణుఁడు.
3. మీనము = చేప. 4. సజ్యముసేసి = ఎక్కుపెట్టి.

వ. అయ్యవసరంబున నేను బరితుష్టాంతరంగనై పరమానంద వికచవద
నారవిందనగుచు నిందిందిర సన్నిభంబులగుచికురబృందంబులువిలస
దలిక ఫలకంబునం దళుకు లొలుకు [1]ఘర్మజలకణంబులం గరంగు
మృగమదతిలకంపుటసలున మసలుకొనినం గరకిసలయంబున నొస
రించుచు మిసమిసమను మెఱుంగుగములు గిఱికొను నెఱిగొను వడ
వడ వడంక నల్లనడు మందగమనంబున. 1096

చ. లలితపదాబ్జనూపురకలధ్వనితో దరహాసచంద్రికా
కలితకపోలపాలికలఁ గ్రమ్మ సువర్ణ వినూత్నరత్నకుం
డలరుచు లొప్పఁగంకణఝణంకృతు లింపెసలార రంగభూ
తలమున కేగుదెంచి ముఖతామరసంబుపుడెత్తి చూచుచున్.

చ. నరపతులం గనుంగొని మనంబున వారిఁ దృణీకరించి [2]మ
త్కరజలజాతదివ్యమణికాంచనమాలిక నమ్మురారికం
ధరమున లీలమై నిడి పరిదంపడి నవ్యమధూకదామ మా
హారికబరిం దగిల్చితి సమయంబునఁ గన్నుల[3]లజ్జదేఱఁగన్. 1098

వ. అప్పుడు. 1099

చ. కొలఁదికి మీఱఁగా డమరు గోముఖ డిండిమ మడ్డు శంఖ కా
హళ మురళీ మృదంగ పణ వానక దుందుభి ఢక్క కాంస్య మ
ర్దళ మురజారజాది వివిధధ్వను లేపున భూనభోంతరం
బులఁ జెలఁగెన్ నటీనటసమూల్ దనరారె మనోహరాకృతిన్.

వ. అంత. 1191

చ. [4]అమరగణంబుఁ దోలి [5]యురగారి [6]సుధాకలశంబుఁగొన్న చం
దమున సమస్తశత్రువసుధామరకోటిఁ దృణీకరించి య
క్కమలవిలోచనుండు ననుఁ గౌఁగిటనొప్పగఁ జేర్చి సింహచం
క్రమణ మెలర్పఁ గొంచుఁ జనెఁ గాంచనచారు రథంబుమీఁదికిన్.

1. ఘర్మజలకణంబులన్ = చెమటబిందువులను. 2 మత్కర..మాలిక = హాస్తమునందలి దివ్యమాణిక్యవికారమగు పద్మమాలను. 3. లజ్జదేఱఁగన్ = సిగ్గు గలుగునట్లుగా. 4. అమరగణంబు = దేవతాసమూహము. 5. ఉరగారి = గరుత్మంతుఁడు. 6. సుధాకలశంబు = అమృతకలశమును.

వ. అట్లు రథారోహణంబు సేసిన. 1103

చ. [1]తురగచతుష్కమున్ విమత దుర్గమ శూరతఁ బూన్చి దారుకుం
డరదము ద్రొప్ప శత్రునికరాంధతమఃపటల ప్రచండ భా
స్కరరుచి నొప్పనట్టి నిజ కార్ముక యుక్తగుణ ప్రఘోషసం
భరితదిగంతరుం డగుచుఁ బద్మదళాక్షుఁడు వోవుచుండఁగన్. 1104

వ. అట్టియెడ సకల రాజలోకంబును గృష్ణుని విభవంబునకుఁ జూపోపక యసంఖ్యంబు లగు మూఁకలుగట్టి యమ్మహాత్ముని మాహాత్మ్యంబు దెలియక దర్పాంధులై కడంగి. 1105

ఉ. [2]భావభవ ప్రసూనశర బాధితమానసులై సమస్త ధా
త్రీవరనందనుల్ బలుపుఁ దెంపును పెంపును సొంపు నేర్పడన్
దేవ కిరీటరత్నరుచి దీపిత పాదసరోజుఁడైన రా
జీవదళాక్షుఁ దాఁకిరి విశృంఖలవృత్తి నతిప్రయత్నులై. 1106

వ. అంత. 1107

చ. సరసిజలోచనుండు నిజ శార్ఙ్గశరాసన ముక్తహేమపుం
ఖరుచిర శాతసాయక నికాయములన్ రిపుకోటి నేసి సిం
ధురరిపువిక్రమ ప్రకట దోర్బలుఁడై విలసిల్లి యొత్తె దు
స్తరచలితాన్య సైన్యమును సజ్జనమాన్యముఁ [3]బాంచజన్యమున్.

ఉ. ఆతతిఁ భూరిబాహుబలులైన విరోధి నరేశ్వరుల్ మృగ
వ్రాతము లొక్కపెట్ట మృగరాజకిశోరముపై నెదిర్చిన
ట్లేతరులై చతుర్విధ పరిచ్ఛద బలంబులతోడఁ గూడి ని
ర్ధూతకళంకుఁడైన నవతోయజనేత్రునిఁ జుట్టుముట్టినన్. 1109

చ. అలిగి మురాంతకుండు గురుశోభ శరంబుల నూత్నరత్నకుం
డలములతో శిరంబులు రణన్మణినూపురరాజితోఁ బదం
బులుఁ గటకాంగుళీయక విభూషణచాప శరాలితోడఁ జే
తులు నిలఁ గూలఁగా విజయదోహలియై తునుమాడె వెండియున్.

1. తురగచతుష్కము = నాలుగు గుఱ్ఱములు. 2. భావ .....మానసులై మన్మథ వికారముగల మనస్సులు కలవారై. 3. పాంచజన్యము = విష్ణుమూర్తి శంఖము.

క. [1]హతశేషులు చోరక్ష్మాకుల
గతిఁ దూల నిశాతపరిణత కాండముల సము
ద్ధతిఁ జేసి శౌరి విజయో
న్నతుఁడయి నిజనగరి కేఁగె నగధరుఁ డంతన్. 1111

వ. అట్లు మహిత మంగళాలంకృతంబును నతి మనోహర విభవాభిరామంబునగు ద్వారకానగరంబున కరుదెంచిన మజ్జనకుండును బ్రియంబున దోడన చనుదెంచి, 1112

చ. రణితకనూత్నరత్నరుచిరస్ఫుటనూపుర హార కర్ణభూ
షణ కటకాంగుళీయ కనత్పరిధాన కిరీట తల్ప వా
రణ రథ వాజి హేతి కనకంబులనుం బరిచారికాతతిం
బ్రణుతిగుణోత్తముండయి పద్మదళాక్షున కిచ్చె నెమ్మితోన్.

వ. ఇట్లు మహనీయ తేజోనిధి యైన మాధవుఁ డపరిచ్ఛిన్నాఖిలవస్తువిస్తారుఁడయ్యును నిజాధికారసిద్ధికొఱకు మఱలం గన్యారత్నంబును వినూత్నరత్నవ్రాతంబును సమర్పించెనని భూసురవిసరంబులు వినుతింప మాతండ్రియైన బృహత్సేనుండును నప్పుడు సమస్తవస్తువులను గృష్ణునకు సమర్పించి క్రమ్మఱ సకలయాదవులనుం బూజించి మరలి నిజపురంబునకు జనియె, నని చెప్పినఁ గుంతియు గాంధారియు గృష్ణయు నఖిలనృపాలకాంతాజనంబును గోపికలుం దమతమ మనంబుల సర్వభూతాంతర్యామియు లీలామానుషవిగ్రహుండును నైన పుండరీకాక్షు చరణారవింద స్మరణానంద పరవశలై కృష్ణుం బ్రశంసించి రంత. 1114

—♦ నారదాదిమహర్షులు శ్రీకృష్ణదర్శనంబు చేసికొని వసుదేవుని చేఁ గ్రతువు చేయించుట ♦—

చ. బలవదరాతిమర్దనులఁ బాండురనీలనిభప్రభాంగులం
గలితనిజాననాంబుజవికాసజితాంచితపూర్ణచంద్రమం
డలులఁ బరేశులన్ నరవిశేషంబులం గరుణాపయోధులన్
విలసదలంకరిష్ణుల నవిరళసహిష్ణుల రామకృష్ణులన్. 1115

1. హతశేషులు = చావగ మిగిలినవారు.

వ. సందర్శించుతలంపులం దమ హృదయానందంబుఁ బ్రేమంబు
సందడిగొన నప్పుడు. 1116

ఉ. ధీమతిఁ ద్వైప త్రితక దేవల సాత్యవతేయ కణ్వభా
నారద గౌతమ చ్యవన నాకుజ గార్గ్య వసిష్ఠ గాలవాం
గీరస కశ్యపాసిత సుకీర్తి మృకండుజ కుంభసంభవాం
గిరులు యాజ్ఞవల్క్య మృగశృంగముఖాఖిల తాపసోత్తముల్.

వ. చనుదెంచినం గృష్ణుండు వారలకుఁ బ్రత్యుత్థానంబు సేసి వందనంబు
లాచరించి వివిధార్చనలు గావించి యిట్లనియె. 1118

సీ. సన్మునీశ్వరులార జన్మభాక్కుల మైన
మాకు నిప్పాట సమ్మతిని దేవ
నికరంబు ప్రాప్యులు నిరుపమయోగీంద్రు
లైన మీదర్శనం బబ్బెఁ గాదె
ధృతి మందభాగ్యు లింద్రియపరతంత్రులు
నైన మూఢాత్ముల కనఘులార
భవదీయదర్శన స్పర్శన చింతన
పాదార్చనలు దుర్లభంబు లయ్యు

తే. నేఁడు మాకిట సులభమై నెగడెఁ గాదె
జగతిపైఁ దీర్థభూతులు సాధుమతులు
మిమ్ము దర్శించుటయు చాలు [1]నెమ్మితోడ
వేఱ తీర్థంబు లవనిపై వెదకనేల. 1119

వ. అదియునుం గాక యుదకమయంబు లైన తీర్థంబులును మృచ్ఛిలా
మయంబు లైన దేవగణంబులును దీర్థదేవతారూపంబులు గాకుం
డుట లే దైన నవి చిరకాలసేవనార్చనలం గాని పావనంబులు సేయవు
సత్పురుషులు దర్శనమాత్రంబునం బావనంబు సేయుదురని
వెండియు. 1120

సీ. ఆదిత్యచంద్రాగ్ని మేదినీతారాంబు
మారుతాకాశవాఙ్మనము లోలిఁ

---

1. నెమ్మితోడ = ప్రేమతోడ.

పరికింపఁ దత్తదుపాసనంబులఁ [1]బునీ
తములు సేయఁగ సమర్థములు గావు
సకలార్థ గోచర జ్ఞానంబు గల మహా
త్మకులు దారు ముహూర్తమాత్ర సేవఁ
జేసి పావనములు సేయుదు రదియు న
ట్లుండె [2]ధాతుత్రయ యుక్తమైన

తే. కాయమం దాత్మబుద్ధియుఁ గామినీకు
మారులందు స్వకీయాభిమానములును
దివిరి జలమునఁ దీర్థబుద్ధియును జేయు
నట్టి మూఢుండు పశుమార్గుఁ డనఁగ బరఁగు. 1121

వ. అని యివ్విధంబునం గృష్ణుండాడిన [3]సాభిప్రాయంబులగు వాక్యంబులు విని యమ్మునీంద్రులు విభ్రాంత హృదయులై యూరకుండి ముహూర్తమాత్రంబున నమ్మహాత్ము ననుగ్రహంబు వడసి మందస్మితముఖులై పుండరీకాక్షున కిట్లనిరి. దేవా మేమును దత్త్వవిదుత్తములయిన బ్రహ్మరుద్రాదులును భవదీయ మాయా విమోహితులమై యుందుము నిగూఢంబయిన నీయిచ్ఛచేత మమ్ము ననుగ్రహించితివి. భవదీయ చరిత్రంబులు విచిత్రంబు లిమ్మేదిని యొక్కటి యయ్యును బహురూపంబులఁ గానంబడు విధంబున నీవు మొదలఁ గారణరూపంబున నేకంబయ్యును ననేకరూపంబులు గైకొని జగదుత్పత్తి స్థితిలయంబులకు హేతుభూతంబు నా నద్భుత కర్మంబులం దగిలి లీలావతారంబులు గైకొని దుష్టజన నిగ్రహంబును శిష్టజన రక్షణంబును గావించుచుందు, వదియునుంగాక వర్ణాశ్రమ ధర్మంబు లంగీకరించి పురుషరూపంబున వేదమార్గంబు [4]విదితంబు సేసిన బ్రహ్మరూపివి తపస్స్వాధ్యాయ నియమంబులచేత నీహృదయంబు పరిశుద్ధంబుగావున బ్రహ్మ స్వరూపంబైన వేదంబునందు వ్యక్తావ్యక్త స్వరూపంబు లేర్పడఁగా నుందువు గావున బ్రాహ్మణ కులంబునెల్ల బ్రహ్మకులాగ్రణివై రక్షించిన మహానుభావుండవు

1. పునీతములు = పవిత్రములు. 2. ధాతుత్రయ = వాత, పిత్త, శ్లేష్మములు.
3. సాభిప్రాయంబు = అభిప్రాయముతోఁ గూడిన. 4. విదితంబు = తెలియఁబఱచిన.

[1]మాయాజవనికాంతరితుండవైన నిన్ను నీ భూపాలవర్గంబును నేమును దర్శింపం గంటిమి మాజన్మ విద్యాతపోమహిమలు సఫలంబు లయ్యె నీకు నమస్కరించెదము అని బహువిధంబులఁ గృష్ణు నభినందించి యమ్మురాంతకుచేత నామంత్రణంబు వడసి తమతమ నివాసంబులకుఁ బోవం దలంచు నవసరంబున. 1122

సీ. అమ్మునీశ్వరులకు నానకదుందుభి
యతిభక్తి వందనం బాచరించి
తాపసోత్తములార ధర్మతత్త్వజ్ఞులు
మన్నించి వినుఁడు నా విన్నపంబు
సత్కర్మవితతిచే [2]సంచితకర్మచ
యంబు వాపెడు నుపాయంబు నాకు
ఘనదయామతిఁ జెప్పఁగదనిన నమ్మునివరుల్
భూవరుల్ విన వసుదేవుఁ జూచి

తే. వెలయఁ బలికిరి నిఖిల యజ్ఞేశుఁడైన
కమలలోచనుఁ గూర్చి యాగంబు సేయు
కర్మమునఁ బాయు నెట్టి దుష్కర్మమైన
నిదియె ధర్మంబు గాఁగ నీమదిఁ దలంపు. 1123

వ. అదియునుం గాక. 1124

క. దేవర్షి పితృఋణంబులు । భూవర మఖ వేదపాఠ పుత్త్రులచేతన్
వావిరినీఁగని పురుషుఁడు । పోవు నధోలోకమునకుఁ [3]బుణ్యచ్యుతుఁడై.

వ. అట్లగుటం జేసి నీవును. 1126

క. వరతన గ్రంథ్యయనంబులఁ దరియించితి [4]ఋణయుగంబు దడయక ధరణీ
వర దేవఋణము [5]సవనా । చరణుఁడవై యీఁగుటొప్పు సమ్మతితోడన్

క. అనవుడు నవ్వ్యాసుదేవుఁడు । మునివరులకు ననియె వినయమున మీరలు చె
ప్పినయట్ల మఖము సేసెద । దినకరనిభులార మీరు దీర్పఁగవలయున్.

---

1. మాయాజవనిక = మాయయను తెర. 2. సంచితకర్మ = సంపాదించినకర్మ. 3. పుణ్యచ్యుతుఁడై = పుణ్యము నశించినవాఁడై. 4. ఋణయుగంబు = పితృఋణము, ఋషి ఋణము, 5. సవనాచరణుఁడవై = యజ్ఞము చేసినవాఁడవై.

వ. అని యభ్యర్థించి యమ్మునీంద్రుల యాజకులఁగా వరించి యప్పుణ్య
తీర్థోపాంతంబున మహేంద్రామిత వైభవంబున [1]నష్టాదశ భార్యా
సమేతుండై దీక్షఁ గైకొని యమ్మహాధ్వరంబు వేదోపదిష్టవిధిం బరి
సమాప్తించి ఋత్విఙ్నికాయంబుల బహుదక్షిణలఁ దనిపి భార్యా
సమేతుండై యవభృథస్నానం బాచరించి వివిధమణి విభూషణ విచి
త్రాంబర సురభికుసుమానులేపనంబులు ధరించి నిఖలభూదేవ ముని
బంధు రాజలోకంబుల నుచిత సత్కారంబులఁ బ్రీతులఁ గావించిన
వారును గృష్ణానుమతి నాత్మ నివాసంబులకు జని రందు. 1129

ఉ. ఆతఱి నుగ్రసేన వసు✽ధాధిప పంకజనాభ ముష్టికా
రాతులు దమ్ము నర్థి మధు✽ర ప్రియ భాషల నిల్వ వేఁడినం
గౌతుక మాత్మ నిచ్చటిల✽గా వసియించిరి గోప గోపికా
వ్రాతముతోడ నచ్చట ధ✽రావర నంద యశోద లిమ్ములన్.

క. హరి నయముల హరి ప్రియముల
హరి మధురాలాపములను ✽ హరికథల మనో
హరలీలఁ దగిలి నందుఁడు
నిరుపమగతి నచట మూఁడు ✽ నెలలుండె నృపా. 1131

చ. జలరుహలోచనాది యదు✽సత్తము లందఱు సన్నిభంగులం
గలిత విభూషణాంబరని✽కాయము లిచ్చి బహూకరించి వీ
డ్కొలిపిన నందముఖ్యులు ము✽కుంద పదాబ్జమరంద పానస
ల్లలిత నిజాత్మ [2]షట్పదము✽లన్ మరలించుచు నెట్టకేలకున్.

వ. చని చని. 1133

ఆ. మరలి మరలి కృష్ణ ✽ మాధవ గోవింద
పద్మనాభ భక్త ✽ పారిజాత
దేవ దేవ యనుచుఁ ✽ దివిరి చూచుచు మధు
రాభిముఖులు నగుచు ✽ నరిగి రంత. 1134

క. క్రమమున నచ్చటఁ [3]బ్రావృ
ట్సమయం బగుటయును బంధు✽జన యాదవ వ

---

1. అష్టాదశ భార్యాసమేతుండై = పదునెనిమిదిమంది భార్యలతో కూడినవాఁడై,
2. షట్పదములన్ = తుమ్మెదలను. 3. ప్రావృట్సమయము = వర్షాకాలము.

ర్గము లోలిఁ గొలువ సురగణ
నమితులు బలకృష్ణులాత్మ • నగరంబునకున్. 1135

వ. వచ్చి సుఖం బుండు నంత. 1136

— శ్రీకృష్ణ బలభద్రులు మృతులైన తమ సహోదరులఁ దెచ్చి దేవకీదేవికిఁ గనఁబఱచుట —

సీ. అవనీశ యొక్కనాఁ • డానకదుందుభి
భార్య పద్మాక్షుఁడు • బలుఁడుఁ దొల్లి
[1]శరధిలోఁ జొచ్చిన • గురుతనూభవుని
మరలంగఁ దెచ్చిన • మహిమ లెల్ల
జనములు దమలోన • సన్నుతుల్ సేయంగ
విని తనసుతులు దు•ర్వృత్తుఁ డైన
కంసుచే నిహతులై • [2]కాలునిపురి నున్న
వారి నందఱఁ జూడ•గోరి కృష్ణ

తేఁ. బలులకడ కేగి కన్నుల • బాష్పకణము
లొలుక నోరామ రామ ని•త్యోన్న తాత్మ
పరమపావనమూర్తి యో • మురవిభేది
యిందిరానాథ యోగీశ్వ•రేశ కృష్ణ. 1137

క. మురకంస చైద్యపౌండ్రక।నరకజరాతనయ యవన • నరనాయకులం
దురితాత్ములఁబోరఁ గొని భూ।భర ముడిపిన యట్టి మేటి• బలులుదలంపన్.

ఆ. జనన వృద్ధి విలయ • సంగతి నిఖిలంబుఁ
బొందఁ జేయు పరమ • పురుషులార
మీకు లీల లౌట • మీరని నమ్మిన
దాన నేను వినుఁ [3]ఉ•దారులార. 1139

వ. అని యనేక విధంబుల వినుతించుచు నిట్లనియె, మీరలు మహాను
భావులరు, మీరు తొల్లి యనేక కాలంబు చనిన క్రిందట మృతుం
డై [4]దండధరు మందిరంబున నున్న గురు కుమారుని మీ మహా

1. శరధి = సముద్రము. 2. కాలునిపురము = యమపట్టణము.
3. ఉదారులార = గొప్పవారలారా! 4. దండధరుని = యముని.

ప్రభావంబులు లోకంబులం బరిపూర్ణంబులై ప్రకాశింప నక్కాలుని
చెంత నుండి మగుడం దెచ్చి గురుదక్షిణగా నొసంగితి, రివ్విధంబున
గంసునిచేత హతులైన మత్పుత్రుల నందఱ మరలం దెచ్చి నా
మనంబున నున్న దుఃఖంబు నివారింప వలయునని దేవకీదేవి
ప్రార్థించినం దమతల్లి యాడిన మృదుమధురవాక్యంబు లత్యాదరం
బున నాదరించి యప్పుడు బలకృష్ణులు దమ యోగమాయా
మహత్త్వంబున సుతలంబునకుం జని రట్టియెడ. 1140

మ. కనియెన్ దానవుఁ డింద్రసేనుఁడు దళత్కంజాక్షులన్ దక్షులన్
ఘనహారాంబుదవర్ణులన్ నిఖిలలోకైక ప్రభాపూర్ణులం
దనరారన్ హలచక్రపాణులను భక్తత్రాణులన్ నిత్యశో
భనవర్ధిష్ణుల రామకృష్ణుల జయభ్రాజిష్ణులన్ జిష్ణులన్. 1141

చ. కని హితకోటితో నెదురుగాఁ జనుదెంచి మహానురాగ సం
జనిత కుతూహలుం డగుచుఁ జాఁగిలి మ్రొక్కి సమగ్ర [1]కాంచనా
సనముల నుంచి తచ్చరణసారససేచన సర్వలోక పా
వన సలిలంబు [2]తౌదల ధ్రువంబుగఁ దాల్చి సుభక్తియుక్తుఁడై.

సీ. సురభికాలాగరు [3]హరిచందనైలాది
ధూపంబు లావిశ్వరూపకులకుఁ
గాంచనపాత్ర సంగతరత్నకర్పూర
దీపంబు లాజగద్దీపకులకుఁ
బాయసాపూపాన్న పక్వఫలాదినై
వేద్యంబు లా [4]వేదవేద్యులకును
దనరు వినూత్న రత్నప్రభా భాసితా
భరణంబు లా దైత్యహరణులకును
తే. మిలమిలని మించుతోఁ బొలు పలరు బహువి
ధాంబరంబులు నీలపీతాంబరులకు

---

1. కాంచనాసనములు = బంగారు ఆసనములు. 2. తౌదల = శిరమున. 3. హరిచందనము = పసుపురంగుగల గంధము. 4. వేదవేద్యులు = వేదములచేఁ దెలియఁబడువారు.

సలలితకుసుమమాలికా ♦ మలయజాను
లేపనంబులు భూరి నిశ్శ్రేష్ఠులకును. 1143

వ. సమర్పించి యప్పుండరీకాక్షుని చరణారవిందంబు లొత్తుచు నానంద బాష్పపూరంబు తోరంబుగా రోమాంచకంచుకిత శరీరుండగుచుం గరకమలంబులు ఫాలభాగంబునం గదియించి. 1144

ఉ. ధీయుతుఁడై నమో భగవతే హరయే పరమాత్మనే ముకుం
దాయ సమస్తభక్తవరదాయ నమః పురుషోత్తమాయ కృ
ష్ణాయ మునీంద్రవంద్యచరణాయ సురారిహరాయ సాంఖ్యయో
గాయ వినీలభాస్వదలకాయ రథాంగధరాయ వేధసే. 1145

వ. అని యభినందించి యిట్లనియె. 1146

ఉ. రాజసతామసాత్ములకు ♦ రాదు గదా నినుఁ గాన నవ్యయం
భోజదళాయతాక్ష మునిగేయపవిత్రచరిత్ర విస్ఫుర
ద్రాజకళాధరాజసుర ♦ రాజముఖామర మౌళిరత్న వి
భ్రాజితపాదపీఠ భవబంధవిమోచన పద్మలోచనా. 1147

మ. మదినూహింపఁగ యోగివర్యులు [1]భవవన్మాయాలతా బద్ధులై
యిది మిథ్యమ్మనలేరు తామసులమై ♦ యేపారు మాబోఁటి దు
ర్మదు లేరీతి నెఱుంగఁజాలుదురు సద్విజ్ఞానధీయుక్తి నీ
పదముల్ చేరెడి త్రోవఁజూపి [2]భవకూపంబుం దరింపింపవే. 1148

ఉ. వైరముచేతఁ జేదినృపవర్గముఁ గామముచేత గోపికల్
మీఱిన భక్తి నాశ్రితులు ♦ మిమ్ము నహర్నిశముల్ మనంబులం
దాఱఁగనీక రూపగుణ ♦ తత్పరులై మిముఁ బొందుకై వడిన్
భూరివివేకసత్త్వగుణముల్ గల దేవత లందనేర్తురే. 1149

క. కాన భవత్పదపద్మ | ధ్యానంబునఁ గాని శాస్త్రతత్త్వంబులచేఁ
గానరు శ్రుతిసంవేద్యం|బైన భవత్పదముఁ జిన్మయాకార హరీ.

వ. దేవా యేనరుండైననేమి శ్రద్ధాగరిష్ఠచిత్తుండయి నిన్ను సేవించునట్టి

1. భవ.........బద్ధులై = నీమాయయను లతలచేఁ గట్టఁబడిన వారై
2. భవకూపంబు = సంసారమను బావి.

మహాత్ముండవు విధిచోదితంబయిన ప్రమాణంబువలన విముక్తుం
డయి వర్తించునట్టి గావున యోగీశ్వరేశ్వరుండవైన నీ [1]ఈశితవ్యుల
మైన మమ్ము [2]నిష్పాపులం జేయుమని నుతించి మఱియు నిట్లనియె.

మత్త. కంటిఁ గంటి భవాబ్ధిదాఁటఁగఁ గంటిముక్తినిధానమున్
గంటి నీకరుణావలోకముఁ గంటిఁ బాపము వీడ ము
క్కంటి తామరచూలియుం బొడఁగాన నట్టి మహాత్మ నా
యింటికిం జనుదెంచి తీర్పఁ గృతార్థతం బొందితిన్.

వ. దేవా యేను భవద్దాసుండ నేది పంచినం జేయుదు నిచ్చటికి
మీరలు విజయంబు చేసినకార్యం బానతీయవలయునని కరంబులు
మొగిచి విన్నవించినం బుండరీకాక్షుం డతని వాక్యంబులకు
సంతసిల్లి యిట్లనియె. 1153

సీ. బలిదైత్య విను మున్ను ప్రథమయుగంబున
నామరీచికి భార్యయైన వర్ణ
యను నింతివలన నందను లార్వు రుద్భవ
మైరి వా రొక్కనాఁ డబ్జభవుఁడు
దనపుత్త్రిపై మోహమునఁ గూడి రతికేళి
యొనరింప మీఱి నవ్వుటయుఁ గ్రోధ
మంది యాసురయోనియందుఁ బుట్టుం డని
ఘనశాప మిచ్చె [3]నవ్వనజజుండు

తే. తన్నిమిత్తమునను వారు తగిలి హేమ
కశిపునకుఁ బుట్టి రంత నాకౌకసార్థ
మొదవ వీరలఁదెచ్చి యయ్యోగమాయ
యడరి దేవకిగర్భంబునందుఁ జొనుప.

క. దొరఁకొని కంసుఁడు దోడ్తోఁ | బొరిగొనెఁ దత్పుత్త్రశోకమునఁ దనచిత్తం
బెరియఁగ దేవకి వారల | దరిశింపఁగఁ గోరిన ననుపఁ దగ నసురేంద్రా.

క. వచ్చితిమి వారిఁ గ్రమ్మఱఁ | దెచ్చెదమని తల్లి కొసఁగఁ దీర్పఁగ నిపుడే
యిచ్చటికి దెనీకడఁ బొర | పొచ్చెము లేకున్నవారె పాపవిరహా.

---

1. ఈశితవ్యులము = రాజమాత్రులము. 2. నిష్పాపులన్ = పాపములులేని వారిని. 3 అవ్వనజజుండు = ఆ బ్రహ్మ.

క. వీరలదోకొని యిపుడే । ధారుణికి న్నేగి [1]జనని ॥ తాపమువాపఁ
వీరలు నంతట శాపము । దీఱి మదీయప్రసాద ॥ ధీయుతులగుచున్.

క. పొలుపుగఁ సుగతిం బొందఁగఁ
గల రని హరి యానతిచ్చి ॥ కరుణాన్వితుఁడై
బలిచే ననుమతిఁ గొని వా
రలఁ దోకొని వచ్చె నిద్ధ ॥ రామండలికిన్. 1158

వ. అట్లు వారలం దోడితెచ్చి తల్లి కిట్లనియె. 1159

క. కనుగొనుమువీరె నీ నం । దనులని జనయిత్రికడ ముఁ ॥ దంబున వారి
న్నునిచిన నద్దేవకియును । ఘనపుత్రస్నేహమోహ ॥ కలితాత్మకయై.

క. చన్నులుదిగ్గనఁ జేపఁగఁ । గన్నులనానందబాష్ప ॥ కణములుదొరఁగన్
గ్రన్ననఁగౌఁగిటనిడినను । గన్నన్నలువచ్చిరనుచుఁ ॥ గాతుకమొప్పన్.

వ. అట్లు కౌఁగిటం జేర్చి నిజాంకపీఠంబున నునిచి శిరంబులు [2]మూర్కొని [3]చిబుకంబులు పుణుకుచుం బ్రేమాతిశయంబున మేనఁ బులక లొలయం జన్నిచ్చినవారును వైష్ణవమాయామోహితులై స్తన్యపానంబు సేయుచు భగవంతుఁడయిన రథాంగపాణి యంగ సంగంబున విగత కల్మషులై విధిశాపసాగరంబు హరిదయా కటాక్షంబను నావచేతం దరించి స్వరూపంబులు ధరించి కృష్ణునకుఁ దల్లిదండ్రులకు వందనం బాచరించి గగనపథంబున నిజస్థానంబున కరిగిరంత. 1162

క. చచ్చినబాలురఁ గ్రమ్మఱఁ
దెచ్చుట కడుఁ జిత్రమనుచు ॥ దేవకి మదిలో
నచ్చెరువడి యిది యంతయు
నచ్చపుహరిమాయ గాక ॥ యని తలఁచె నృపా. 1163

క. పరమాత్ముఁ డఖిలజగదీ
శ్వరుఁ డగు కృష్ణుండు సేయు ॥ సత్కృత్యంబుల్
పరికింప నెన్నఁ బెక్కులు
ధరణీవర యనిన రాజు ॥ దా ముని కనియెన్. 1164

1. జననితాపము = తల్లివిచారము. 2. మూర్కొని = వాసనచూచి.
3. చిబుకంబులు = గడ్డములు.

## —♦ సుభద్రాపరిణయము ♦—

సీ. మునినాథ పార్థుండు ✽ వనజనాభునిసహో
దరి సుభద్రను నేవి✽ధమునఁ బెండ్లి
యయ్యెను నావిధం ✽ బంతయు నాకును
దెలియంగ నెఱిఁగింపు ✽ ధీవిశాల
యనవుడు నావ్యాస✽తనయుఁ డాతనిఁ జూచి
వినవయ్య నృప దేవ✽విభునిసుతుఁడు
మునుతీర్థయాత్రాస✽ముత్సుకుం డయి చని
రమణఁ బ్రభాసతీ✽ర్థమున నుండి

తే. యా తల్లోదరితోడి నె✽య్యంబు కలిమిఁ
జూడఁ గోరుచు రాముండు ✽ సుందరాంగిఁ
గౌరవేంద్రున కీ సమ✽కట్టె ననుచుఁ
దనకు నెఱుఁగఁగ నా పురం✽దరసుతుండు. 1165

వ. ఇట్లు సుభద్రాదర్శనోత్సాహంబు దనమనంబున సందడిఁగొనం
[1]త్రిదండివేషంబు ధరించి ద్వారకాపురంబునకుం జనుదెంచి యప్పౌ
రజనంబులు భక్తిస్నేహంబుల [2]ననిశంబు బూజింపం దనమనోరథ
సిద్ధి యగునంతకుం గనుపెట్టుకొని వానకాలంబు చనునంతకు
నప్పట్టణంబుననుండు సమయంబున. 1166

క. రాముఁడు తత్కపటాకృతిఁ
దా మదిఁ దెలియంగ లేక ✽ తగ నొకనాఁ డా
భూమీవరతాపసుఁ బో
రామిం గని యాత్మమంది✽రమునకుఁ దెచ్చెన్. 1167

ఆ. తెచ్చి భిక్ష సేయ ✽ [3]దేవేంద్ర తనయుండు
గుడుచుచుండి యచటఁ ✽ గోరి మెలఁగు
నసమబాణ మోహ✽నాస్త్రంబు కైవడి
వీర మోహినన వి✽హారలీల. 1168

---

1. త్రిదండివేషంబు=సన్యాసివేషము. 2. అనిశంబు=ఎల్లప్పుడు. 3. దేవేంద్రతనయుండు = అర్జునుఁడు.

వ. అట్లు సుభద్ర విహరించుచున్న సమయంబున. 1169

చ. జలరుహపత్త్రనేత్రు ననుసంభవ చారు వధూలలామ స
ల్లలిత విహార విభ్రమ విలాసము లాత్మకు విందు సేయ న
బ్బలరిపు నందనుండు గని భావజసాయక బాధ్యమాన వి
హ్వల హృదయాబ్జుఁడై నిలిపె న త్తరుణీమణియందుఁ జిత్తమున్.

ఉ. ఆతరుణీ శిరోమణియు నర్జును [1]నర్జున చారుకీర్తి వి
ఖ్యాతుని నింద్రనందను నకల్మష మానసుఁ గామినీ మనో
జాతునిఁ జూచి పుష్పశర సాయకజర్జరితాంతరంగయై
భీతిలియుండె సిగ్గు ముకుళింపును మోహముఁ దేఱుచూపులన్.

వ. ఇట్లా నృపసత్తమ మత్తకాశినులు లొండొరుల చిత్తంబులు చిత్తజాయత్తంబులై కోర్కులు దత్తఱింపం దాల్ములు వీడ సిగ్గునం జిట్టుముట్టాడుచున్న యంతి నొక్కనాఁడు దేవతా మహోత్సవనిమిత్తంబు మత్తలోదరి పురంబు వెలుపలికి నరుగుదెంచిన నర్జునుండు కృష్ణ దేవకీ వసుదేవుల యనుమతంబువడసి తానును దోడన చని యప్పుడు. 1172

సీ. సాంద్ర శరచ్చంద్ర చంద్రికా స్ఫూర్తిచే
రాజిల్లు పూర్ణిమా [2]రజనిపోలెఁ
బూర్ణేందు బింబావతీర్ణమై యిలమీఁద
భాసిల్లు [3]హరిణ డింభంబుపోలె,
సులలిత మేఘ మండలమును నెడఁబాసి
వసుధఁ గ్రుమ్మరు [4]తటిద్వల్లి పోలె
మాణిక్యరచిత సన్మహిత చైతన్యంబు
పొందిన [5]పుత్తడిబొమ్మపోలె

తే. లలిత విభ్రమరుచి కళాలక్షణములఁ
బొసఁగ రూపైన శృంగార రసముపోలె
నర్థిఁ జరియించుచున్న పద్మాయతాక్షిఁ
బ్రకట సద్గుణ భద్ర సుభద్ర జూచి. 1173

1. అర్జున = వెండివలె తెల్లనైన. 2. రజనిపోలె = రాత్రివలె. 3. హరిణ డింభము = లేఁడిపిల్ల. 4. తటిద్వల్లి = మెఱుపుతీఁగ. 5. పుత్తడి = బంగారము.

—♦ సు భ ద్రా ప రి ణ య ము ♦—

సీ. మునినాథ పార్థుండు ♦ వనజనాభునిసహో
దరి సుభద్రను నేవి♦ధమునఁ బెండ్లి
యయ్యెను నావిధం ♦ బంతయు నాకును
దెలియంగ నెఱిఁగింపు ♦ ధీవిశాల
యనవుడు నావ్యాస♦తనయుఁ డాతనిఁ జూచి
వినవయ్య నృప దేవ♦విభునిసుతుఁడు
మునుతీర్థయాత్రాస♦ముత్సుకుం డయి చని
రమణఁ బ్రభాసతీ♦ర్థమున నుండి

తే. యా తలోదరితోడి నెయ్యంబు కలిమిఁ
జూడఁ గోరుచు రాముండు ♦ సుందరాంగిఁ
గౌరవేంద్రున కీ సమ♦కట్టె ననుచుఁ
దనకు నెఱుఁగఁగ నా పురం♦దరసుతుండు. 1165

వ. అట్లు సుభద్రా దర్శనోత్సాహంబు దనమనంబున సందడిగొనం [1]త్రిదండివేషంబు ధరించి ద్వారకాపురంబునకుం జనుదెంచియప్పౌరజనంబులు భక్తిస్నేహంబుల [2]ననిశంబు బూజింపం దనమనోరథసిద్ధి యగునంతకుం గనిపెట్టుకొని వానకాలంబు చనునంతకు నప్పట్టణంబుననుండు సమయంబున. 1166

క. రాముఁడు తత్కపటాకృతిఁ
దా మదిఁ దెలియంగ లేక ♦ దగ నొకనాఁ డా
భూమీవరతాపసుఁ బో
రామిం గని యాత్మసుందిర♦మునకుఁ దెచ్చెన్. 1167

ఆ. తెచ్చి భిక్ష సేయ ♦ [3]దేవేంద్ర తనయుండు
గుడుచు చుండి యచటఁ ♦ గోరి మెలఁగు
నసమబాణ మోహ♦నాస్త్రంబుకై వడి
వీర మోహినన వి♦హారలీల. 1168

---

1. త్రిదండివేషంబు = సన్యాసివేషము. 2. అనిశంబు = ఎల్లప్పుడు. 3. దేవేంద్రతనయుండు = అర్జునుఁడు.

వ. అట్లు సుభద్ర విహరించుచున్న సమయంబున. 1169

చ. జలరుహపత్త్రనేత్రు ననుసంభవ చారు వధూలలామ స
ల్లలిత విహార విభ్రమ విలాసము లాత్మకు విందు సేయ న
బ్బలరిపు నందనుండు గని భావజసాయక బాధ్యమాన వి
హ్వల హృదయాబ్జుఁడై నిలిపె న త్తరుణీమణియందుఁ జిత్తమున్.

ఉ. ఆతరుణీ శిరోమణియు నర్జును [1]నర్జున చారుకీర్తి వి
ఖ్యాతుని నింద్రనందను నకల్మష మానసుఁ గామినీ మనో
జాతునిఁ జూచి పుష్పశరసాయకజర్జరితాంతరంగ యై
భీతిలియుండె సిగ్గు మురిపెంబును మోహముఁ దేఱుచూపులన్.

వ. అట్లా నృపసత్తమ మత్తకాశిను లొండొరుల చిత్తంబులు చిత్తజా
యత్తంబులై కోర్కులు దత్తఱింపం దాల్ములు వీడ సిగ్గునం జిక్కు
ముట్టాడుచున్న యంత నొక్కనాఁడు దేవతా మహోత్సవనిమిత్తం
బత్తలోదరి పురంబు వెలుపలికి నరుగుదెంచిన నర్జునుండు కృష్ణ
దేవకీ వసుదేవుల యనుమతంబువడసి తానును దోడన చని
యప్పుడు. 1172

సీ. సాంద్ర శరచ్చంద్ర చంద్రికా స్ఫూర్తిచే
రాజిల్లు పూర్ణిమా [2]రజనివోలెఁ
బూర్ణేందు బింబావతీర్ణమై యిలమీఁద
భాసిల్లు [3]హరిణ డింభంబువోలె,
సులలిత మేఘ మండలమును నెడఁబాసి
వసుధఁ గ్రుమ్మరు [4]తటిద్వల్లి వోలె
మాణిక్యరచిత సన్మహిత చైతన్యంబు
పొందిన [5]పుత్తడిబొమ్మవోలె

తే. లలిత విభ్రమరుచి కళాలక్షణములఁ
బొసగ రూపైన శృంగార రసమువోలె
నర్థిఁ జరియించుచున్న పద్మాయతాక్షిఁ
బ్రకట సద్గుణ భద్ర సుభద్ర జూచి. 1173

1. అర్జున = వెండివలె తెల్లనైన. 2. రజనివోలె = రాత్రివలె. 3. హరిణ డింభము = లేఁడిపిల్ల. 4. తటిద్వల్లి = మెఱుపుతీఁగ. 5. పుత్తడి = బంగారము.

వ. అప్పుడు డాయంజని యరదంబుపై నిడుకొని పోవుచుండఁ గనుంగొని యదుబలంబులు మదంబున నంటం దాఁకిన నప్పుడ దయ్యాఖండల నందనుండు ప్రచండ గాండీవ కోదండ నిర్ముక్త కాండంబులం దూలించి యఖండ బాహాదండవిజయ ప్రకాండుండయి ఖాండవ ప్రస్థపురంబున కరిగె, నట బలభద్రుం డవ్వార్త విని కలియ సమయ సమీరసఖుని కైవడిం బటురోష భీషణాకారుండయి క్రోధించినం గని కృష్ణుం డాదిగాఁ గల బంధుజనంబు లతని చరణంబులకుం బ్రణమిల్లి మృదుమధుర భాషణంబుల ననునయించి ప్రమోదంబగునట్లుగా నాడిన నతండును సంతుష్టుండయి మనంబునఁ గలంక దేఱి యప్పుడు. 1174

క. కరులం దేరుల నుత్తమ
హయులన్ మణిహేమభూషణాంబరభృత్యో
త్కర దాసికా జనంబుల
నరణంబుగ నిచ్చి పంపె ననుజునకుఁ బ్రీతిన్. 1175

వ. ఇట్లు కృష్ణున కభిమతంబుగా నర్జున సుభద్రల కరణంబిచ్చి పంపె నని శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె. 1176

—♦ శ్రీకృష్ణుఁడు ఋషిసమేతుండయి మిథిలానగరంబునకుఁ బోవుట. ♦—

సీ. నరనాథ విను భువనప్రసిద్ధంబుగ
దీపించునట్టి విదేహదేశ
మందు భూకాంతకు నాననదర్పణం
బనఁ దనర్చిన మిథిలను పురమునఁ
గలఁడు శ్రీహరిపాదకంజాత భక్తుండు
గళితరాగాది వికారుఁ డమల
చరితుఁ డక్రోధుండు శాంతుండు [1]నిగమార్థ
కోవిదుం డగు శ్రుతదేవుఁ డనెడి

తే. భూసురోత్తముఁ డొకఁ డనిచ్ఛాపరాగ
తంబు [2]తుషమైన హేమశైలంబుగాఁగ

---

1. నిగమార్థకోవిదుడు = వేదములు తెలిసినవాఁడు. 2. తుషము = పొట్టు.

దలంచి పరితోషమందుచుఁ ✽ దన గృహస్థ
ధర్మమున నుండె సముచిత ✽ కర్ముఁ డగుచు. 1177

ఉ. ఆపురి నేలువాఁడు బహుళా✽శ్వుఁడు నానుతి కెక్కినట్టి ధా
త్రీపతి యా ధరాసురుని ✽ రీతిని నిష్కలుషాంతరంగుఁడై
యేపనులందు ధర్మగతి ✽ నేమఱ కర్థిఁ జరించుచుండె ల
క్ష్మీపతి వారిపైఁ గరుణ ✽ సేసి ప్రసన్నముఖాంబుజాతుఁడై.

వ. అట్లు కృష్ణుండు వారలం జూచువేడ్క [1]నిజస్యందనారూఢుం డయి నారద వామదేవాత్రి కృష్ణ రామ సితారుణ ద్విజ గురు కణ్వ మైత్రేయచ్యవనులును నేనును మొదలైన మును లనుగమింపం జనుచుఁ దత్తద్దేశనివాసులగు నానర్తధన్వకురుజాంగలవంగమత్స్య పాంచాల కుంతి మధు కేకయ కోసలాది భూవరులు వివిధవస్తుప్రచయంబులు గానుక లిచ్చి సేవింప గ్రహమధ్యగతుం డయి దీపించు సూర్యుని బోలి యప్పుండరీకాక్షుండు మందస్మిత సుందర వదనారవిందుం డగుచు వారలం గరుణార్ద్రదృష్టిం జూచి యోగక్షేమంబు లరసి సాదరభాషణంబుల నాదరించుచుఁ గతిపయ ప్రయాణంబులం జని చని విదేహ నగరంబు డాయం జనుటయు నా బహుళాశ్వుం డను జనకుండు సమ్మాధవు రాక విని మనంబున హర్షించుచు వివిధ పదార్థంబులు కానుకలుగాఁ గొని తానును శ్రుతదేవుండును నెదురుగాఁ జనుదెంచి యప్పుడు. 1179

ఉ. ఆ మునికోటికిన్ వినయ ✽ మారఁగ వందన మాచరించి యా
తామరసాభలోచనుఁ డు✽దారచరిత్రుఁడు పాపగోత్రసు
త్రాముడు భక్తలోకశుభ✽దాయకుడైన రమేశు సద్గుణ
స్తోముని పాదపద్మములు ✽ సోకఁగ మ్రొక్కి వినమ్రులై తగన్.

చ. కరములు మోడ్చి యో పరమ✽కారుణికోత్తమ నీవు నీమునీ
శ్వరులును మద్గృహంబునకు ✽ వచ్చి మముం గృపసేసి యిచ్చటం
గర మనురక్తిఁ బూజనలు ✽ గైకొనుఁ డంచు నుతించి వేఁడ నా
హరి మన మందు వారి విన✽యంబుల కెంతఁ బ్రమోదమందుచున్.

1. నిజస్యందనారూఢుండై = తనరథముమీఁద కూర్చున్నవాఁడై.

చ. [1]తిరముగ వారియిష్టములు దీర్పఁ దలంచి మరాసురారి యొం
డొరుల నెఱుంగకుండ [2]ముని యూథముఁ దానును నేగె వారిమం
దిరముల కేకకాలమున ధీరత నా ధరణీవరుండు వా
రిరుహదళాయతాక్షు మునిబృందములం [3]గనకాసనంబులన్.

సీ. కూర్చుండ నియమించి కొమరారు కాంచన
కలధౌతకలశోదకముల చేతఁ
బాదముల్ గడిగి [4]తత్పావనజలములు
దానును సతియు బాంధవజనంబుఁ
గర మర్థి నిజమస్తకంబుల ధరియించి
వివిధార్చనములు సద్విధి నొనర్చి
మణిభూషణాంబర మాల్యానులేపన
రాజితధూపనీరాజనములు

తే. భక్తిఁ గావించి పరిమృష్ట బహువిధాన్న
పాయసాపూపపరిపక్వ ఫలము లోలి
నారగింపఁగఁ జేసి కర్పూరమిళిత
లలిత తాంబూలములు నెయ్య మలర నొసఁగె. 1183

వ. ఇట్లు సమర్పించిన యనంతరంబ యమ్మిథిలేశ్వరుండయిన జనకుండు
పరమానందంబును బొంది. 1184

చ. హరిపదపద్మయుగ్మము నిజాంకతలంబునఁ జేర్చి యొత్తుచుం
బురుషవరేణ్య యీ నిఖిల భూతగణావళియాత్మలందు సు
స్థిరమతిఁ గర్మసాక్షివి సుధీవర నీపదభక్తకోటితో
నరయ నుమాధినాథ చతురాస్యులుఁ బోల రటందు వెప్పుడున్.

వ. అట్టి లోకవిదితంబయిన భవద్వాక్యంబు [5]నిక్కంబుగా భవదీయ
పాదారవిందంబులందు నొకానొకవేళ లేశమాత్రధ్యానంబు గల
నాగృహంబున [6]నకించనుండని చిత్తంబునం దలంపక భక్తవత్సలుండ

---

1. తిరముగ = స్థిరముగ. 2. ముని యూథమున్ = మునిసమూహము. 3. కనకాసనంబులన్ = బంగారుఆసనములను. 4. తత్పావనజలముల్ = ఆపవిత్ర ఉదకములు. 5. నిక్కంబుగా = నిశ్చయముగా. 6. అకించనుండని = తక్కువవాఁడని, (దరిద్రుఁడని).

వగుటం జేసి విజయంబు చేసితివి, భవత్పాదపంకేరుహ సేవారతిం
దగిలిన మహాత్ములు త్వద్ధ్యానంబు వదలం జాలుదురే నిరంతరంబును
శాంతచిత్తులై [1]నిష్కించను లైన యోగీంద్రులకు నీవలనం గోరిక
గలవారలకు నిన్నైన నిత్తువుగదా యని వెండియు నిట్లనియె. 1186

తే. కృష్ణ పరమాత్మ యదుకుల క్షీరవార్ధి
పూర్ణచంద్రమ దేవకీపుత్త్ర సుజన
వినుత నారాయణాచ్యుత వేదవేద్య
భక్తజనపోష దురితశోష పరమపురుష 1187

ఉ. శ్రీపురుషోత్తమాఖ్య యదుసింహకిశోరక భక్తలోకర
క్షాపరతంత్ర నీవు మునిసంఘముఁ గొన్నిదినంబులుండ వే
నీపదపద్మరేణువులు నెమ్మి మదీయగృహంబు సోఁకినం
దాపసవంద్య యే నిపుడ ధన్యుఁడ నయ్యెదఁ గాదె మాధవా.

వ. అని [2]యభ్యర్థించినం బ్రసన్నుండయి యప్పుండరీకాక్షుండు నిమికుల
ప్రదీపకుండయిన జనకచక్రవర్తిం గరుణించి యమ్మిథిలానగరంబున
బౌరజనంబులకు నున్నతశోభనంబులు గావించుచుఁ గొన్నిదినంబు
లుండె నంత. 1189

మ. శ్రుతదేవుండును మోదియై మునిజన స్తోమంబుతో నిందిరా
పతిఁ దోకొంచు నిజాలయంబునకు నొప్పన్నేగి యచ్చోట స
మ్మతి దర్భాస్తరణంబుల న్నునిచి సమ్యగ్జ్ఞానపారీణుఁడై
సతియుందానుఁ బదాబ్జముల్ గడిగి సద్భక్తిం [3]దత్తోయముల్

చ. శిరములఁ దాల్చి సవ్యతులసీదళదామ కుశప్రసూన వి
స్ఫుర దరవిందమాలికలఁ బూజలొనర్చి గృహాంధకూప సం
చరణుఁడ నైన నాకడకుఁ జక్రి తనంతనె వచ్చునట్టి సు
స్థిరమతి నేతపంబు మును సేసితినో యని సంతసించుచున్. 1191

తే. మఱియుఁ దత్పాదతీర్థంబు మందిరమున
గలయఁ జిలికించి సంప్రీతి గపలుకొనఁగ

---

1. నిష్కించనులు = కోరికలేనివారలు. 2. అభ్యర్థించిన = కోరిన.
3. తత్తోయముల్ = ఆ ఉదకములు.

బత్త్రఫలపుష్పతోయముల్ ✽ భక్తి నొసఁగి
హరి మురాంతకుమూర్తి [1]ని✽జాత్మ నిలిపి. 1192

తే. మానితంబుగ విశ్వని✽దానమూర్తి
యైన కృష్ణుండు తనయింట ✽ నారగించెఁ
దనమనోరథసిద్ధియుఁ ✽ దనకు నబ్బె
ననుచుఁ [2]బైపుట్ట మల్లార్చి ✽ యాడుచుండె. 1193

చ. తరుణియుఁ దానుఁ బుత్త్రులుఁ బ✽దంపడి కృష్ణుభజించుచుండి త
చ్చరణము లంకపీఠమునఁ ✽ జాఁచిన మెల్లన నొత్తుచుఁ రమా
వరుఁ గని పల్కె భక్తజన✽వత్సల మామకభాగ్య మెట్టిదో
హర చతురాస్యులు న్నెఱుఁగ✽నట్టి నినుం గనుఁగొంటి నెమ్మితోన్.

క. మునియోగిమానసస్ఫుట
వనజంబుల నెల్లప్రొద్దు ✽ వర్తించు భవ
ద్ఘనదివ్యమూర్తి నాలో
చనగోచరమయ్యెఁ గాదె ✽ సర్వాత్మహరీ. 1195

వ. దేవా నీసచ్చరిత్రంబులు కర్ణరసాయనంబులుగా నాకర్ణించుచు నీకుం బూజలొనర్చుచు నీచరణారవిందంబులకు వందనంబులు సేయుచు నీదివ్యనామసంకీర్తనంబులు సేయుచుం దమశరీరంబులు భవదధీనంబులుగా మెలంగు నిర్మలబోధాత్ములగువారి చిత్తంబులను [3]దర్పణంబులం గానంబడుచుందువు, కర్మవిక్షిప్తచిత్తులైన వారిహృదయంబులనుండియు దూరగుండ వగుదు వని మఱియు నిట్లనియె. 1196

సీ. నీకు మ్రొక్కెదఁ గృష్ణ ✽ [4]నిగమాంతసంవేద్య
లోకరక్షకభక్త✽లోకవరద
నీపాదసేవన ✽ నిరతుని నన్నునే
పనిఁ బంపె [5]దానతి✽యిమ్మనినఁ గృష్ణుఁ

1. నిజాత్మ=తనమనమున. 2. పైపుట్టము = పైవస్త్రము. 3. దర్పణంబులన్ = అద్దములయందు. 4. నిగమాంతసంవేద్య = ఉపనిషత్తులచే తెలియఁబడు వాఁడ. 5. ఆనతిమ్మనిన = ఆజ్ఞయిమ్మనఁగా.

డెలనవ్వు మోమునఁ జెలువొంద నావిప్ర
కర మాత్మకరమునఁ గదియఁ జేర్చి
పాటించి యతనితోఁ బలికెఁ దపశ్శక్తి
వఱలిన యమ్మునివర్యు లెపుడుఁ

తే. దమపదాంబుజరేణువితానములను
దపలి లోకంబులను బవిత్రంబు సేయు
వారు నన్నుఁ గూడి మెప్పొందు వలయు నెడల
కరుగు దెంతురు నీభాగ్యగరిమ నిటకు. 1197

వ. చనుదెంచిరి పుణ్యస్థలంబులును విప్రులును దేవతలును సంస్పర్శన దర్శనార్చనంబులం బ్రాణులను సమస్త [1]కిల్బిషంబులం బాయం జేయుదు, రదియునుం గాక బ్రాహ్మణుండు జననమాత్రంబున జీవకోటియందు ఘనుం డై యుండు జపతపోధ్యానాధ్యయనాధ్యాత్మలం జతురుం డై మత్కళాశ్రయుం డయ్యేనేని యతం డుత్తముం డై వెలుంగు నతనిం జెప్పనేల యని వెండియు నిట్లనియె. 1198

క. నామదివిప్రులపై గల | ప్రేమము నాతనువునందుఁ బెట్టని[2]కతనన్
భూమీసురు లర్హులు నీవిమునులం బూజసేయు మిద్ధచరిత్రా !

క. ఇదియే నాకిష్టము నన్నుఁ బదివేలవిధంబులొలయ భజియించుటనా
మది కింపగునటుగావున వదలనిభక్తిన్ భజింపు [3]వసుధామరులన్.

క. అని సర్వలోకవిభుఁ డగు | వనజోదరుఁ డానతిచ్చు వాక్యంబుల జా
డన భూమీసురుఁ డమ్ముని | జనులకు సద్భక్తిఁబూజ సలిపెన్వరుసన్.

చ. ఎనయఁగ గృష్ణుఁ డంత మిథిలేశ్వర భూసురులం గృపావలో
కన మొలయ న్ననూనసుభగస్థితిఁబొందఁగఁ జేసి వారి వీ
డ్కొని రథమెక్కి దివ్యముని కోటియుఁ దానునువచ్చెఁ గమ్మఱన్
జనవర మోక్షదంబగు కుశస్థలికిం బ్రమదాంతరంగుడై.

1. కిల్బిషములను = పాపములను, 2. కతనన్ = విధమున, 3. వసుధామరులన్ = బ్రాహ్మణులను.

—♦ శ్రుతిగీతలను పరమతత్త్వార్థ ప్రతిపాదకమైన పురాత నేతిహాసము. ♦—

వ. అని చెప్పిన బాదరాయణికి నభిమన్యునందనుం డిట్లనియె. మునీంద్రా! [1]ఘటపటాది వస్తుజాతంబుభంగి నిర్దేశింప నర్హంబుగాక సత్త్వాది గుణశూన్యంబైన బ్రహ్మంబునందు సత్త్వాది గుణగోచరంబులైన వేదంబు లేక్రమంబున వర్తించునట్టి చందంబు నాకెఱింగింపు మనిన భూవరునకు మునివరుం డిట్లనియె. సకల చేతనాచేతనాంతర్యామి యైన సర్వేశ్వరుండు సర్వశబ్దవాచ్యుండు గావున సకల జంతునివహంబులకు బుద్ధీంద్రియ మనఃప్రాణశరీరంబులను సృజియించి చేతన వర్గంబునకు జ్ఞానప్రదుం డగుం గావున [2]సకలనిగమ సమూహంబులును దత్స్వరూపగుణవైభవ ప్రతిపాదకంబులు గావున ముఖ్యంబై ప్రవర్తించు శ్రుతి స్తోత్రం బుపనిషత్తుల్యంబు ననేక పూర్వఋషి పరంపరాయాతంబును నైన దీనిని శ్రద్ధాయుక్తుండై యెవ్వండను సంధించు నతనికి మోక్షంబు సులభంబు. దీనికి నారాయణాఖ్యాతం బగు నొక్క [3]యుపాఖ్యానంబు గలదు వినిపింతు వినుము. భగవత్ప్రియుండైన నారదుం డొక్కనాఁడు నారాయణాశ్రమంబునకుం జని ఋషిగణ సమేతుండైన నారాయణఋషిం గనుంగొని నీవు నన్నడిగినట్ల యమ్మహాత్ముని నడిగిన నతండు మున్నియర్థంబు శ్వేతద్వీపవాసులైన సనకసనందనాది దివ్యయోగీంద్రులు ప్రశ్న సలిపిన వారలకు సనందనుండు చెప్పిన ప్రకారంబు నీ కెఱింగించెద నని చెప్పందొడంగె. [4]శయానుండయిన రాజశ్రేష్ఠుని దత్పరాక్రమ దక్షతాదిచిహ్నంబులను నుతియించు వందిజనంబుల చందంబున జగదవసాన సమయంబున ననేక శక్తియుక్తుండయి యోగనిద్రావశుం డయిన సర్వేశ్వరుని వేదంబులు స్తోత్రంబు సేయువిధంబు నారాయణుండు నారదునకుం జెప్పిన తెఱంగున వినుమని యిట్లనియె.

సీ. జయజయ హరి దేవ ✻ సకలజంతువులకు
జ్ఞానప్రదుండవు ✻ గాన వారి
వలన దోషంబులు ✻ గలిగిన సుగుణసం
తానంబుగాఁ గొని ✻ జ్ఞాన శక్తి

---

1. ఘట పట = కుండ, వస్త్రము, 2. సకలనిగమ = వేదములన్నియు, 3. ఉపాఖ్యానంబు = కథ. 4. శయానుండైన = పరుండియున్న.

ముఖ్య 1షడ్గుణపరిపూర్ణతం జేసి మా
యాత్మవిశిష్టుండ వగుచుఁ గార్య
కారణాత్మకుఁడవై కడఁగి చరించుచు
నున్న నీయందుఁ బరమోరుహాక్ష

తే. తివిరి 2యామ్నాయములు ప్రవర్తించుఁ గాన
బ్రకటత్రిగుణాత్మకంబైన ప్రకృతితోడి
యోగ మింతయు మాన్పవే యోగిమాన
సాంబుజాత మధువ్రత యని నుతించి. 1204

వ. అదియునుం గాక. 1205

సీ. పరమవిజ్ఞాన సంపన్నులైనట్టి యో
గీంద్రులు మహిత నిస్తంద్రలీలఁ
బరిదృశ్యమానమై భాసిల్ల నిమ్మహీ
పర్వత 3ముఖర ప్రపంచ మెల్లఁ
బరఁగ బ్రహ్మస్వరూపము గాఁగఁ దెలియుదు
రెలమి నీవును జగద్విలయవేళ
4నవశిష్టుఁడవు గాన ననఘ నీయందు నీ
విపులవిశ్వోదయ విలయము లగు

తే. ఘట 5శరావాదు లగు మృద్వికారములు మృ
దాత్మకంబైన యట్లు పద్మాయతాక్ష
తవిలి కారణరూపంబుఁ దాల్చి లీలఁ
గడఁగు నీయందుఁ బుద్ధివాక్కర్మములను. 1206

క. అలవడఁ జేయుచు నుందురు
బలుకొని యిలఁ బెట్టఁబడిన పదవిన్యాసం
బులు పతనకారణముగా
సలవున సేవించుచును గృతార్థులు నగుచున్. 1207

1. షడ్గుణ = ఐశ్వర్యము, వీర్యము, యశము, శ్రీ, జ్ఞానము వైరాగ్యము.
2. ఆమ్నాయములు = వేదములు. 3. ముఖర = మొదలైన. 4. అవశిష్టుఁడవు = మిగిలినవాఁడవు. 5. శరావము = మూఁకుడు.

క. లీలం బ్రాకృతపూరుష । కాలాదికనిఖిలమగు జగంబులకెల్లన్
మాలిన్యనివారక మగు । నీలలిత [1]కథాసుధాబ్ధినిం గ్రుంకి తగన్.

చ. భరితపదాఘతప్తుఁ డగు ♦ పాంథుఁడు శీతలవారి గ్రుంకి దు
ష్కర మగు తాపముం దొరఁగు ♦ కైవడి సంసరణోగ్రతాపమున్
దెరవునఁ బాయుచుండుదురు ♦ నిన్ను భజించు మహాత్మకుల్ జరా
మరణమనోగుణంబుఁ గ్రమంబునఁ బాయుట సెప్పనేటికిన్.

వ. అదియునుంగాక, 1210

సీ. అనయంబు దేహి నిత్యానిత్య సద్విల
క్షణమునఁ [2]బంచకోశ వ్యవస్థ
నభివృద్ధిఁ బొరయుచు ♦ నందులోపల నున్న
ప్రాణాన్న బుద్ధి విజ్ఞానమయము
లను చతుష్కోశంబు ♦ లవ్వల వెలుఁగొందు
నానంద మయుఁడవు ♦ గాన దేవ
సురుచిర స్వప్రకాశుండవు నీ పరి
గ్రహము గల్గుటఁ జేసి ♦ కాదె ప్రకృతి
తే. మహదహంకార [3]పంచతన్మాత్ర గగన
పవనతేజోంబు భూ భూత ♦ పంచకాది
కలిత తత్త్వముల్ బ్రహ్మాండ ♦ కార్యకరణ
మందు నెపుడు సమర్థంబు ♦ లగుటఁ జూడ. 1211

క. కోరి శరీరులు భవదను । సారంబున నిహపరైక ♦ సౌఖ్యంబులఁ బెం
పారఁగ నందుచు నుందురు । ధీరజనోత్తములనంగ ♦ దివిజారిహరా.

ఆ. నిన్ను ననుసరింప ♦ నేరని కుజనులు
పవనపూర్ణ [4]చర్మ ♦ భస్త్రిసమితి
యోజఁ జేయుచుందు ♦ రుచ్ఛ్వాసనంబులు
బలసి యాత్మదేహ ♦ భజను లగుచు. 1213

---

1. కథాసుధాబ్ధి = కథ లను అమృతసముద్రము. 2. పంచకోశ = అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ, 3. పంచతన్మాత్రలు = శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు. 4. చర్మభస్త్రి = తోలుతిత్తి.

సీ. దేవ కొందఱు సూక్ష్మ * దృష్టులై నట్టి మ
హాత్మకు లుదరస్థుఁ * డయిన వహ్ని
గా మదిఁ దలఁతురు * కైకొని మఱికొంద
ఱారుణు లను పేర * నమరు ఋషులు
లీల సుషుమ్నా నాడీ * మార్గగతుండవై
హృత్ప్రదేశమునఁ జరించు చున్న
రుచిదహరాకాశ * రూపిగా భావింతు
రట్టి హృత్పద్మంబు * నంను వెడలి

తే. వితతమూర్ధన్య నాడికా * గతుల నోలి
బ్రహ్మరంధ్రంబుఁ బ్రాపించి * పరమ పురుష
సుమహితానందమయపరం * జ్యోతిరూపి
వైన నినుఁ బొంది మఱి పుట్ట * రవనియందు. 1214

వ. మఱియు వివిధ కాష్ఠాంతర్గతుం డయిన వాయుసఖుండు తద్గతదోషంబునం బొరయక నిత్యశుద్ధుండయి తరతమభావంబున వర్తించుచందంబునస్వసంకల్పకృతంబులయినవిచిత్రశరీరంబులందు ²నంతర్యామివై ప్రవేశించి తత్తద్విచిత్రయోనిగతంబైన హేయంబులం బొరయక సకలాత్మ సమంబై యేకరసంబై బ్రహ్మంబయిన నిన్ను నైహికాముష్మిక ఫలసంగమంబు లేక విగతరజోగుణంబులు గలిగి కొందఱు భజియించు చుందురు, రదియునుంగాక దేవా భవదీయ సంకల్పాధీనంబు లయిన శరీరంబులం బ్రవేశించి యున్న జీవ సమూహంబు నీకు శేషభూతంబని తెలిసి కొందఱు భవ నివారకం బయిన శ్రీమత్త్వచ్చరణారవిందంబులు సేవించి కృతార్థులగుదురు మఱియును. 1215

సీ. అనఘ దుర్గమ మైన * యాత్మతత్త్వంబుఁ బ్ర
వర్తించుకొఱకు దివ్యంబులైన
యంచిత రామకృష్ణాద్యవతారముల్
భజియించియున్న నీ * ³భవ్యచరిత

1. కాష్ఠాంతర్గతుండు = దారువులోనున్న (కట్టెలోనున్న) 2. అంతర్యామివై = జీవాత్మలోనుండే పరమాత్మవు. 3. భవ్యచరితము = మంగళచరిత్రము.

మను సుధాంభోనిధి § [1]నవగాహనము సేసి
విశ్రాంతచిత్తులై § వెలయుచుండి
మోక్షంబు బుద్ధి న§పేక్షింప నొల్లరు
మఱియుఁ గొందఱు భవ§చ్చరణపంక

ఆ. జములఁ దగిలి పుణ్య§తములైన హంసల
వసువు నొంది భాగ§వతజనముల
నొనరువారు ప్రకట § యోగిజన ప్రాప్య
మైన ముక్తిఁ గోర § రాత్మలందు. 1216

ఉ. కొందఱు నీశరీరము ల§సంతతభక్తి భవద్వశంబులై
చెందఁగ నీపదాబ్జములు § సేరిభజించుచుఁ దత్సుఖాత్ములై
యుందురు కొంద ఱీతనువు § లోలిధరించి భవత్పదాబ్జముల్
పొందఁగఁ గొల్వలేక నిలఁ § బుట్టుచుఁ జచ్చుచునుందు రవ్యయా.

చ. యమనియమాది యోగమహి§తాత్మకులైన మునీంద్రులున్ విరో
ధమునఁ దలంచు చైద్యవసు§ధావరముఖ్యనృపుల్ ఫణీంద్ర భో
గము లనవొప్పు బాహువులు § గల్గిన నిన్ను భజించు గోపికల్
క్రమమున నేమునున్ సరియ § కామె భవత్కృప [2]కంబుజోదరా.

మ. అరవిందాక్ష భవత్స్వరూప మిలఁ బ్ర§త్యక్షంబునం గాన నె
వ్వారికిం బోలదు శాస్త్రగోచరుఁడవై § వర్తింతు వీసృష్టి ముం
దర సద్రూపుఁడ వైన నీవలననే § ధాత్రాద్యమర్త్యుల్ జనిం
చిరి నిన్నంతకు మున్నెఱుంగఁగలమే § చింతింప నే మచ్యుతా.

వ. అట్టి నిన్నుఁ బరమాణుకారణవాదులైన కణ్వాగౌతమాదులును ప్రకృతికారణవాదులయిన సాంఖ్యులును దేహాత్మవాదులయిన బౌద్ధులును వివిధంబులైన కుతర్కంబులచేతం బరస్పరవ్యాహతంబులైన మతంబులు దమతమ తర్కవాదంబుల సమర్థించుచు నిన్నుం దెలియలేరు. మహాభాగ్యవంతులయిన యోగీంద్రులకు నీవు ప్రత్యక్షంబైన నివి యన్నియు [3]నసత్యంబులని కానవచ్చు, వెండియుఁ గొందఱు సచరా

1. అవగాహనము = స్నానము. 2. అంబుజోదరా! = నాభియందుపద్మము గలవాఁడా. 3. అసత్యంబులని = అబద్ధములని.

చర వస్తుజాతంబులకు నంతర్యామివై సర్వంబును నీవ యగుటం దెలియ లేక నిత్యంబనియు ననిత్యంబనియు విపరీతబుద్ధిం దెలియుదురు గాని భవదీయదివ్యతత్త్వంబు నిక్కంబుగం దెలియంజాలరు. కొందఱు జగచ్ఛరీరుండవు గాన జగద్రూపకుండవైన నిన్నుం గటక మకుట కర్ణికాది వివిధభూషణ భేదంబులం గనకంబు నిజస్వరూపంబు విడువక వర్తించుచందంబునజగద్వికారానుగతుండ వయ్యును నిఖిల హేయప్రత్యనీకకల్యాణ గుణాత్మకుండవై యుందు వని యాత్మ విదులయినవారు తెలియుదు రదియునుం గాక. 1220

మ. వనజాతాక్ష భవత్పదాబ్జయుగ సేవాసక్తులై నట్టి య
జ్జనముల్ మృత్యుశిరంబుం దన్ని ఘన సంసారాంబుధిన్ దాఁటి పా
వనులై లోకములుం [1]బునీతములుగా వర్తించుచున్ నిత్యశో
భనమై యొప్పెడి ముక్తిం బొందుదురు సంపద్భద్రవైభవోపేతులై.

మ. మిము సద్భక్తి భజింప నొల్ల కిల దుష్కర్మైథం బ్రవర్తించు నీ
చమతివ్రాతము సేర్పునం బనులం బాశశ్రేణి బంధించు చం
దమునం బెక్కగు నామరూపములచేతన్ వారి బంధించి దు
ర్గమ [2]సంసారపయోధిం దోతువు దశగ్రీవకంఠజాతపత్త్రేక్షణా.

వ. దేవా కర్మమూలంబులయిన పాణిపాదంబులు లేనివాఁడ వయ్యును స్వతంత్రుడవుగావున బ్రహ్మాదులు భవత్పరతంత్రులై యుండుదురు. స్థిరచరరూపంబులుగల చేతనకోటికినీవు సర్వవిధ[3]నియంతవుగావున నీ కృపావలోకనంబుగలవారికి మోక్షంబు కరస్థితంబయియుండు భవత్కృపావలోకనంబులేని కష్టాత్ములు దుర్గతిం గూలుదు, రట్టి జీవులు దేవతిర్యఙ్మనుష్య స్థావరాది శరీరంబులు సొచ్చి యణురూపులై యుందు రందును నీవుందు వంతరాత్మవగుచుమఱియును.

క. మదిం దలపోయగ [4]జలబు
ద్బుదములు ధరం బుట్టి పోలియు పోలిక గల యీ
త్రిదశాది దేహములలో
వదలక వర్తించు నాత్మవర్గము నోలిన్. 1224

1. పునీతములుగా=పవిత్రములుగా. 2. సంసారపయోధి=సంసారసముద్రము.
3. నియంతవు = నాయకుఁడవు. 4. జలబుద్బుదములు = నీటిబుడగలు.

ఆ. ప్రళయవేళ నీవు ✽ భరియింతు వంతకు
గారణంబ వగుటఁ ✽ గమలనాభ
భక్తపారిజాత ✽ [1]భవభూరితిమిర ది
నేశ దుష్టదైత్యనాశ కృష్ణ. 1225

చ. అనఘ జితేంద్రియ స్ఫురణు ✽ లయ్యును జంచలమైన మానసం
బను తురగంబు బోధ మహి ✽ తాత్మవివేకపు నూల్త్రాట న
ల్లన గుదియంగఁ బట్టుచు ✽ రిలంచుచు ముక్తికుపాయలాభ మే
యనువున లేమికిన్ వగల ✽ నందెదు నాత్మలువో తలంపఁగన్.

చ. గురుపదపంకజాతములు ✽ గొల్వనివారలు వో మహాబ్ధి [2]ని
స్తరణకుఁ [3]గర్ణధారరహి ✽ తం బగు నావను సంగ్రహించు [4]బే
హారి తి భూరి దుస్తర భ ✽ వాంబుధిలోన మునుంగుచుందు రం
బురుహదళాక్ష నీవు పరి ✽ పూర్ణుఁడవై తనరారఁగా నొగిన్.

తే. పుత్త్రదార గృహక్షేత్ర ✽ భూరి విషయ
ఘనసుఖాసక్తుఁ డగుచు నే ✽ మనుజుఁడేని
నర్థిఁ జరియించువాఁడు భ ✽ వాబ్ధిలోనఁ
జెంది యెన్నాళ్లకును దరిఁ ✽ జేర లేఁడు. 1228

సీ. జగతిపై బహుతీర్థ ✽ సదనంబు లనఁ గల్గి
పుణ్యానువర్తన ✽ స్ఫూర్తు లగుచుఁ
బాటించి నీయందు ✽ బద్ధమత్సరములు
లేక భక్తామరా ✽ నోకహంబ
వగు భవత్పాదాబ్జ ✽ యుగళంబు సేవించి
భవపాశముల నెల్లఁ ✽ బాఱఁ ద్రోలి
సమమతులై యదృ ✽ చ్ఛాలాభతుష్ట మేరు
సమముగాఁ గైకొని ✽ సాధు లగుచుఁ

తే. పాదతీర్థంబు గల మహా ✽ భాగవత జ
నోత్తమోత్తము లైనట్టి ✽ యోగివరుల

1. భవ భూరితిమిర దినేశ = సంసారమను గొప్ప చీఁకటిని పోఁగొట్టుటలో సూర్యుఁడవు. 2. నిస్తరణకు = దాఁటుటకు. 3. కర్ణధార రహితంబగు = చుక్కాని పట్టి నడుపువాఁడు లేక. 4. బేహారి = వర్తకుఁడు.

వారికెప్పుడు సేవించుకవాఁడు పొందుఁ
బ్రవిమలానందమయ మోక్షపదము మఱియు. 1229

వ. సత్తైన ప్రకృతివలన నుత్పన్నంబైన యీ జగత్తు సత్తుగావలయు, నది యెట్లనినం గనకోత్పన్నంబులైన భూషణంబులు కనకమయంబులయి కానంబడుచుండుంబున నని సాంఖ్యుండు పలికిన, విని యద్వైతవాది యిట్లను: నెయ్యది యుత్పన్నంబుగాదది సత్తుగాదను వ్యతిరేకవ్యాప్తి నియమంబు నిత్యసత్యంబయిన బ్రహ్మంబునందుఁ దప్రహతంబగుఁ గావునం బ్రపంచంబు మిథ్యయని నిరూపించిన, నా ప్రపంచంబు బ్రహ్మవిశేషణంబయి కార్యకారణావస్థలు గలిగి యున్నయంతమాత్రంబున మిథ్యగానేరదా ప్రపంచంబునకుఁ గార్యకారణావస్థలు నిత్యంబులు గావున నవస్థాద్వయయుక్తం బయిన ప్రపంచంబు నిత్యంబనిన, వెండియు నద్వైతి యిట్లను, బహుగ్రంథప్రతిపాదితంబయిన జగ[1]న్మిథ్యాత్వంబు లేమి యెట్లనిన నదియునుం గర్మవశులైన జనుల నవిద్యాప్రతిపాదకంబయి కుతర్కసమేతంబైన భారతి యంధపరంపరా వ్యవహారంబునం జేసి భ్రమియించుఁ గారణావస్థయందును బ్రహ్మవిశేషంబైన సూక్ష్మరూపంబునం బ్రపంచంబు సత్తైయుండు సత్యంబు బాధాయోగ్యంబు గావున నీకు శేషంబయి యుండుఁ, గావున నీవు దేహగతుండైన దేహియందు నంతర్యామివయ్యుం గర్మఫలంబులం బొరయక కర్మఫలభోక్తయైన జీవునకు సాక్షిభూతంబవై యుండు వట్టినిన్ను నజ్ఞులైన మానవులు నిజకంఠలగ్నంబయిన కంఠికామణి నిత్యసన్నిహితంబయి వెలుఁగుచుండినను గానక వర్తించు తెఱంగున హృదయపద్మమధ్యంబున ననంత తేజోవిరాజమానుండవై ప్రకాశించు నిన్నుం దెలియలేరు, సకల బ్రహ్మాండనాయకుండవైన నీయందు శ్రుతులు ముఖ్యవృత్తిం బ్రవర్తించునని శ్రుత్యధిదేవతలు నారాయణు నభినందించిన తెఱంగున సనందనుండు మహర్షుల కెఱింగించిన ప్రకారంబని నారాయణర్షి నారదునకుం జెప్పిన నమ్మహాత్ముండు మజ్జనకుండయిన వేదవ్యాస మునీంద్రునకు

1. మిథ్యాత్వంబు = అబద్ధము.

నుపన్యసించె నయ్యర్థంబు నతండు నాకుం జెప్పినవిధంబున నీకుం జెప్పితి, నీ[1]యుపాఖ్యానంబు సకల వేదశాస్త్ర పురాణేతిహాససారం బుపనిషత్తుల్యంబు; దీనిఁ బఠించువారును, వినువారును [2]విగతకల్మషులై యిహపర సౌఖ్యంబుల నొంది వర్తింతురని చెప్పిన శుకయోగీంద్రునకు రాజేంద్రుం డిట్లనియె. 1230

—♦ పరీక్షిత్తునకు శుకయోగి విష్ణుసేవాప్రాశస్త్యంబు చెప్పుట ♦—

మ. మునినాథోత్తమ దేవమానవులలో ♦ [3]ముక్కంటి సేవించు వా
రనయంబున్ బహువస్తుసంపదల సౌ ♦ ఖ్యానందులై యుండ న
వ్వనజాతాక్షు రమామనోవిభుని శ ♦ శ్వద్భక్తి సేవించు స
ద్ఘనపుణ్యుల్ గడుఁ బేదలౌకతను జ ♦ క్కన్ నా కెఱింగింపవే.

సీ. నావుడు శుకయోగి ♦ నరనాథుఁ గనుఁగొని
విను మెఱింగింతుఁ ♦ దద్విధము దెలియ
ఘనశక్తి సహితుండు ♦ కాలకంధరుఁడు దా
వినుతగుణత్రయా ♦ న్వితుఁడు గాన
రాగాదియుక్తమై ♦ రాజిల్లు సంపద
లాతనిఁ గొలుచువా ♦ రందు చుందు
రచ్యుతుఁ బరము న ♦ నంతు గుణాతీతుఁ
బురుషోత్తముని నాది ♦ పురుషు ననఘు

తే. నర్థి భజియించువారు రా ♦ గాది రహితు
లగుచు దీపింతు రెంతయు ♦ ననఘచరిత
ధర్మనందనుఁ డశ్వమే ♦ ధంబు సేసి
పిదప సాత్వికకథనముల్ ♦ ప్రీతితోడ. 1232

ఉ. నారదసంయమీంద్రుపల ♦ కన్ వినుచుండి యనంతరంబ పం
కేరుహనాభుఁ జూచి యడి ♦ గెం దగ నిప్పుడు నీవు నన్ను నిం
డారెనభక్తిమై నడిగి ♦ నట్ల యతండును మందహాస వి
స్ఫార కపోలుఁడై పలికెఁ ♦ బాండుతనూభవుతోడఁ జెచ్చెరన్.

1. ఉపాఖ్యానము=కథ. 2. విగత కల్మషులై = పాపములు పోయినవారై.
3. ముక్కంటి = ఈశ్వరుఁడు.

సీ. వసుమతీనాథ యెవ్వనిమీఁద నాకను
గ్రహబుద్ధి వొడము నా ఘనుని విత్త
మంతయుఁ గ్రమమున నపహరించిన వాఁడు
ధనహీనుఁ డగుచు సంతాపమంద
విడుతురు బంధు లవ్విధమున నొంటరి
యై చేయునది లేక యఖిలకార్య
భారంబు లుడిగి మద్భక్తులతో మైత్రి
నెఱపుచు విజ్ఞానపరతుఁ డగుచుఁ
తే. బిదప వాఁ డవ్యయానంద పరమయాత్మ
బరఁగ శ్రీవిష్ణులోక సంప్రాప్తినొందు
గాన మత్సేవ మిగుల దుష్కరమటంచు
వదలి భజియింతు రితర దేవతల నెప్పుడు. 1234

క. సేవింప వారు దమకుం । గావించిన శోభనములు గని నిజములుగా
భావించివారిమఱతురు । భావములఁగృతఘ్నవృత్తిపని తమపనిగన్.

క. మెలఁగుచునుందురు దీనికిఁ । గలదొక యితిహాసమిపుడు గైకొని నీకుం
దెలియఁగఁజెప్పెదదానన । యలవడునీవడుగు ప్రశ్నకగునుత్తరముల్

— శివ ద్రోహంబు సేయంబూనిన వృకాసురుండు విష్ణుమాయచే మడియుట —

క. శకుఁ డను దైత్యుని తనయుఁడు
వృకుఁ డనువాఁ డొకఁడు దుర్వివేకుఁడు సుజన
ప్రకరముల నలపఁ దెరువున
నొకనాఁ డొడిగుండి దివ్యయోగిం గడఁకన్. 1237

వ. కనుంగొని. 1238

క. కరములు ముకుళించి మునీ । శ్వర నారద లలితధీవిశారద నన్నుం
గరుణించి యానతీ శుభ । కరులగుహరిహర హిరణ్యగర్భులలోనన్.

ఆ. కడఁగి కొలువ శీఘ్రకాలంబులోనన
యిష్టమైన వరము లిచ్చునట్టి
దైవ మెవ్వఁడనిన దానవుఁ గనుఁగొని
మునివరుండు పలికె ముదముతోడ. 1240

వ. వినుము దుర్గుణసుగుణంబులలో నొక్కటి మెచ్చుటఁగలుగు నచ్చట
నాక్షణంబ కోపప్రసాదఫలంబులు చూపువాఁ డమ్మువ్వురయందు
[1]ఫాలలోచనుం డివ్విధంబు దెలిసినవారై బాణాసుర దశకంధరులు
సమగ్రభక్తియుక్తులై సేవించి యసమాన సామ్రాజ్య వైభవంబులఁ
బొంది ప్రసిద్ధులై రట్లు గావున నీవు నమ్మహాత్ముని సేవింపు మతని
వలన నభిమతఫలంబులు వేగంబ ప్రాప్తం బయ్యెడి నని చెప్పిన నతం
డాక్షణంబ. 1241

సీ. దీపించు కేదార తీర్థంబునకు నేగి
యతిసాహసాత్మకుం డైన యసుర
లోకముల్ వెఱఁగంద నా [2]కాలకంధరు
వరదుని నంబికావరుని గూర్చి
తనమేనికండ లుద్దండుఁడై ఖండించి
యగ్నికాహుతులుగా నలర వేల్చి
దర్పకారాతి ప్రత్యక్షంబు గాకున్న
జడియక సప్తవాసరమునందుఁ

తే. బూని తత్తీర్థమునఁ గృతస్నానుఁ డగుచు
వెడలి మృత్యువుకోఱనా వెలయునట్టి
గండ్రగొడ్డంటఁ [3]దనమస్తకంబు దునుము
కొనఁగఁబూనిన నయ్యగ్నికుండమునను. 1242

క. అరుదుగ వెలువడి రుద్రుఁడు
కరుణ దలిర్పంగ వానికర మాత్మకరాం
బురుహమునఁ బట్టి తెగువకుఁ
జొరవలవదు మెచ్చువచ్చె సుమహితచరితా. 1243

క. నీమదిఁ బొడమిన కోరిక
లేమైనను వేఁడు మిపుడ యిచ్చెద ననినం
దా మనమున సంతసపడి
యా [4]మనుజాశనుఁడు హరుపదాంబుజములకున్. 1244

---

1. ఫాలలోచనుఁడు = ఈశ్వరుఁడు. 2. కాలకంధరు = ఈశ్వరుని. 3. తన మస్తకంబు = తన తలను. 4. మనుజాశనుఁడు = రాక్షసుఁడు.

తే. వందనం బాచరించి యో ◆ యిందుమకుట
ఫాలలోచన వరద ◆ మత్పాణితలము
నేను నెవ్వనితలమీఁద ◆ నిడిన వాని
మస్తకము నూఱువ్రయ్యలై ◆ మడియ నీవె. 1246

క. అని వేఁడిన నమ్మాటలు | విని మదనారాతి నవ్వి ◆ విబుధాహితుకో
రినవరముఁ దడయ కిచ్చిన | దనుజుఁడు తద్వరపరీక్షఁ ◆ హరుఁ జేయుటకున్.

వ. ఆక్షణంబ వరదానగర్వంబున నుద్వృత్తుండై కడంగి.

క. ఆ హరు మస్తకమునఁ గను | సాహసమునఁ జేయి సాఁచి ◆ జడియక కదియ
నోహో తన మెచ్చులు దన | కాహా పై వచ్చె ననుచు ◆ నభవుఁడు[1] భీతిన్.

క. దనుజుఁడు దన వెనువెంటం | జనుదే మల్లోకములును ◆ [2]సంత్రాసముగాఁ
గొనిపాఱ సురలు మనములఁ | దనికిరి దానికిని బ్రతివి ◆ ధానము లేమిన్.

వ. అట్లు చని చని.

సీ. నిరుపమానందమై ◆ నిఖిలలోకములకు
నవలదై యమృత ప ◆ దాఖ్యఁ దనరి
దినకర చంద్ర దీ ◆ ధితులకుఁ జొరరాక
సలలిత సహజ తే ◆ జమున వెలుఁగు
సమధికం బగు శుద్ధ ◆ సత్త్వగరిష్ఠమై
కర మొప్ప యోగీంద్ర ◆ గమ్య మగుచు
హరిపదధ్యాన ప ◆ రాయణులైన త
ద్దాసుల కలరు ని ◆ వాస మగుచుఁ

తే. ప్రవిమలానంత తేజోవి ◆ రాజమాన
దివ్యమణి హేమకలిత సం ◆ దీప్తభవ్య
సౌధమండపతోరణ ◆ స్తంభ విపుల
గోపురాకీర్ణ సరము వై ◆ కుంఠపురము. 1251

వ. కనుంగొని యమ్మహాస్థానంబు డాయం జనుటయు నప్పుండరీకాక్షుం డఖండ వైభవంబునం గుండలీశ్వరభోగ తల్పంబునం బరమానంద కందళిత హృదయారవిందుండై యిందిరానయన చకోరంబుల నిజ

1. అభవుఁడు = ఈశ్వరుఁడు. 2. సంత్రాసమున్ = భయమును.

మందహాస సాంద్ర [1]చంద్రికా వితతిం దేల్చుచు నార్త భక్త జన, రక్షణంబు పనిగా మెలంగుచు వివిధ వినోదంబులం గలిగియుండియు ఫాలలోచనుం డద్దనుజపాలునకుం దలంపక యిచ్చిన వరంబు తన తలమీఁద వచ్చినం గలంగి చనుదెంచుట తన దివ్యచిత్తంబున నెఱింగి య [2]క్కాలకంధరుని యవస్థ నివారింపం దలంచి యయ్యిందిరాదేవితోడి వినోదంబు చాలించి యప్పుడు. 1252

సీ. తా పింఛరుచితోడఁ దత్తరించెడు మేనుఁ
బసిఁడి ముంజియుఁ దగు పట్టుగోడుగు
ధవళాంశు రుచి [3]జన్నిదంబును దిన్నని
దండంబుఁ జేతఁ గమండలువును
బసుపుగోఁచియుఁ జిన్ని పట్టెవర్ధనమును
రాజితం బైన మృగాజినంబుఁ
దూలాడు సిగయును వ్రేలు మాఱుట గోఁచి
వేలిమి బొట్టును వ్రేళ్ళ దర్భ
తే. దనర సందీప్త [4]హవ్య వాహన సమాన
కాంతిఁ జెలువొంది యద్భుతక్రమ మెలర్ప
జతురగతి నప్డు వటుక వేషంబుఁ దాల్చి
వచ్చి యానీచదానవవరునిఁ జేరి. 1253

వ. [5]కైతవంబున నతనికి నమస్కరించి మృదుమధుర భాషణంబుల నపనయించుచు నయ్యసురవరున కిట్లను, నివ్విధంబున మార్గపరిశ్రాంతుండవై యింతదూరంబేల చనుదెంచితి సకల సౌఖ్య కారణంబైన యీశరీరంబు నిరర్థకంబుచేసి వృథాయాసంబున దుఃఖపఱుపం దగునే యియ్యెడం గొంత తడవు విశ్రమింపు మీ ప్రయాసంబునకుఁ [6]గతంబెయ్యది కపట హృదయుండవు గాక నీయధ్యవసాయం బెఱింగింపం దగునేని యెఱింగింపుమని మృదుమధురంబుగాఁబలికిన నమ్మహాత్ముని సుధారస తుల్యంబు లయిన వాక్యంబులు విని

1. చంద్రికా = వెన్నెల. 2. కాలకంధరు = ఈశ్వరుని. 3. జన్నిదంబును = యజ్ఞోపవీతమును. 4. హవ్యవాహ = అగ్నిహోత్రము. 5. కైతవంబున = మిషచే. 6. కతంబు = కారణము.

సంతసిల్లి [1]యప్పిశితాశనుండు దన పూనిన కార్యం బతని కెఱిం
గించిన.

చ. హరి దరహాస మొప్పఁ బిశితాశనుఁ గన్గొని పల్కె దానవే
శ్వర ముని దక్షుశాపమునఁ జాలఁ బిశాచపతౌట సూనృత
స్ఫురణము మాలి సంతతముఁ బొంకుచునుండు పురారిమాట నీ
వెఱుఁగక వెంట నేఁగ దగ దీతని చేతలు మాకు వింతలే. 1255

ఆ. నిజముపలికెనేని నెఱిఁ దన తలమీఁద
నీకరంబు మోపనీక తలఁగి
వచ్చునొట్టు నితనివలనఁ బ్రత్యయమునఁ
దగుల నేమి గలదు దనుజవర్య. 1256

ఆ. అశుచి యగుచు నతని నంటఁగఁ బని గాదు
కాలుఁ జేయిఁ గడిగి కడఁకవార్చి
యతని వెంట వేడ్క నరుగుము వే నీవు
నవల నంటఁదగును నసురనాథ. 1257

మ. అతి దుశ్శంకలు మాని పొమ్మనిన దైత్యారాతి మాయా విమో
హితుఁడై విస్మృతిఁ బొంది తామసముచే నేపారి వాఁ డాత్మపా
ణితలంబున్ దన నెత్తిమోపికొని తా నేలన్ వెసం గూలె వి
స్రుత దంభోళిహతిన్ వడింబడు [2]మహాక్షోణీధరంబో యనన్.

వ. అట్లు తన తల నూఱువ్రయ్యలయి నేలం గూలిన యసురం గని
యప్పుడు. 1259

క. సుర లసురాంతకుమీఁదన్ | [3]వరమందార ప్రసూనవర్షము లోలిం
గురిసిరి తుములంబై దివి | మొరసెన్ సురదుందుభి ప్రముఖతూర్యంబుల్

క. పాడిరి గంధర్వోత్తము | లాడిరి దివి నప్సరసలు నన్యోన్యములై
కూడిరి గ్రహములు భయముల | వీడిరి మనుకోటులంత విమలచరిత్రా.

క. మురహరుఁ డెలనవ్వొలయఁగఁ
బురహరుఁ దగఁ జూచి పలికె భూతేశ్వర యీ

1. అప్పిశితాశనుండు = ఆ రాక్షసుఁడు. 2. మహాక్షోణీధరంబో = గొప్ప పర్వతమో యన. 3. వర..... వర్షము = శ్రేష్ఠమయిన మందారపుష్ప వర్షము

నరభోజనుఁడు నీ కి
త్తఱి నెగ్గొనరింపఁ దలఁచి తా నే పొలిసెన్. 1262

వ. అది యట్టిద కాదె యిజ్జగంబున నధికుండైన వానికి నపకారంబు గావించిన మానవునకు శుభంబు గలుగునే యదియునుం గాక జగద్గురుండ వగు నీ [1]కవజ్ఞ దలంచు కష్టాత్ముండు పొలియుటం జెప్ప నేల యిట్టి దుష్టచిత్తున కిట్టి వరంబు లిచ్చుట కర్జంబు కాదు యప్పురాంతకు పేర్కొలిపిన నతండు మురాంతకుని ననేక విధంబుల [2]నభినందించి నిజమందిరంబునకుం జనియె నని చెప్పి యిట్లనియె.

క. మానవనాయక యీ యా
ఖ్యానంబు జదువ వినిన ఘనపుణ్యులు ని
త్యానంద సౌఖ్యములు పెం
పూనుదు రటమీఁద ముక్తిఁ బొందుదు రెలమిన్. 1264

వ. అని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె.

క. జననాయక యొకనాఁ బురా | తనవృత్తం బొకటి వినుఁ దగ నెఱిఁగింతున్
వినుము తపోమహిమలఁ జెం | దిన మునిజనములు సరస్వతీనది పొంతన్.

— భృగుమహర్షి త్రిమూర్తుల ప్రాశస్త్యంబు శోధించుటకుఁ బోవుట. —

క. వితతక్రియ లొప్పఁగ స | త్క్రతువుల నొనరించుచుచట గైకొని లక్ష్మీ
పతిభవపితామహులలో | నతులితముగ నెవ్వ రధికు లని తమలోనన్.

వ. ఇట్లు తలపోసి తన్మహత్త్వం బంతయుం దెలిసి రమ్మని భృగుమహాముని నమ్మువ్వురువేల్పులకడకుం బంపిన నత్తాపసోత్తముండు చని చని ముందట. 1268

క. జలరుహసంజాత సభా
స్థలమున కొగి నేగి యతని సత్త్వగుణంబుం
దెలియుటకై నుతి వందన
ములు సేయక యున్న నజుఁడు ముస ముస యనుచున్.

1. అవజ్ఞ = తిరస్కారము. 2 అభినందించి = స్తుతించి (గౌరవించి).

క. మనమునఁ గలఁగుచుఁ భృగుఁ దన
తనుజాతుం డనుచు బుద్ధిఁ దలఁచినవాఁడై
ఘనరోష స్ఫురితాగ్ని
న్ననయము శాంతోదకముల నల్లన యార్చెన్. 1270

చ. మహిత తపోధనుండు మునిమండనుఁ డయ్యెడఁ బాసి వెండియు
న్నహికతిభూషుఁ గాన రజతాద్రికి నేగిన నగ్గిరీంద్రుపైఁ
[1]తుహినమయూఖ శేఖరుఁడు దుర్గయుఁదానును విశ్రమింప మచటన్
దుహిణతనూభవుండు సనుదెంచుట కాత్మఁ బ్రమోదమందుచున్.

క. కనుఁగొని భ్రాతృస్నేహం
బునఁ గౌఁగిటఁ జేర్చుననుచు ముక్కంటి రయం
బున నెదురేగిన ముని రు
ద్రునియందుల సత్త్వగుణ మెఱుంగుటకొఱకై. 1272

వ. అతనిం గైకొనక యూరకుండిన. 1273

ఉ. ఆ నిటలాంబకుండు కమలాసన నందనుఁ జూచి భూరికా
లానలరోష వేగ భయదాకృతిఁ దాల్చి పటుస్ఫులింగ సం
తానము లొల్క శూలమునఁ దాపసముఖ్యు నురంబు వ్రేయఁగాఁ
బూనినఁ బార్వతీరమణి బోరన నడ్డమువచ్చి చెచ్చెరన్. 1274

క. తనవిభుపాదములకు వం
దనముం గావించి సముచితప్రియముల న
య్యనలాక్షునికోపము మా
న్పిన నమ్మునినాథుఁ డచట నిలువక చనియెన్. 1275

సీ. పొలుపొందు వైకుంఠపురమున కర్థితోఁ
జని యందు సమధికైశ్వర్య మొప్పఁ
గమలాంకపర్యంకగతుఁడై సుఖించు న
క్కౌస్తుభభూషు వక్షస్స్థలంబుఁ
దన పాదమున బిట్టు దన్నెఁ దన్నినఁ బాన్పు
డిగి వచ్చి మునిఁ జూచి [2]నగధరుండు

1. తుహినమయూఖశేఖరుఁడు = ఈశ్వరుఁడు 2. నగధరుండు = విష్ణుమూర్తి.

పదముల కెఱఁగి యో పరమ తపోధన
యీగతి నీవచ్చు టెఱుఁగ లేక

తే. నన్ను నాతప్పు మన్నించి నన్నుఁ గరుణఁ
జూచి యీ దివ్య మణిమయస్ఫూర్తిఁ దనరు
రుచిర సింహాసనమునఁ గూర్చుండు దివ్య
తాపసోత్తమ యభయప్రదాన నిపుణ. 1276

క. అలఘు పవిత్ర భవత్పద।జలములు నను నస్మదీయ జఠరస్థజగం
బుల లోకపాలురను బాలు।పలరఁగఁ బుణ్యులను జేయు ననఘచరిత్రా

వ. మునీంద్రా భవదీయ పాదాబ్జహతి మద్భుజాంతరంబునకు భూషణం
బయ్యె, భవదాగమనంబు మాబోఁటివారికి శుభావహంబగుం గాదె,
యేను ధన్యుండనైతినని మృదుమధురాలాపంబుల ననునయించిన
యమ్మునివరుండు లక్ష్మీనాథు సంభాషణంబులకుఁ జిత్తంబునం బర
మానందంబునొంది యమ్ముకుందు ననంతకల్యాణగుణనిధి నభినం
దించి యానందబాష్ప ధారాసిక్త కపోలుండగుచుఁ దద్భక్తిపార
వశ్యంబున నొండు వలుకనేరక యతనిచేత [1]నామంత్రణంబు వడసి
మరలి సరస్వతీతీరంబుననున్న మునుల సన్నిధికిం జనుదెంచివారలం
గనుంగొని.

సీ. మునినాయకులతోడఁ జనవోయి వచ్చిన
తెఱఁగులుఁ దనమది దృష్టమైన
మూఁడు మూర్తుల విధంబును నెఱిఁగించిన
విని వారు మనముల విస్మయంబు
నంది చిత్తంబున సందేహమును బాసి
చిన్మయాకారుఁడు శ్రీసతీశుఁ
డనుపముఁ డనవద్యుఁ డఖిల కల్యాణ గు
ణాకరుఁ డాదిమధ్యాంతరహితుఁ

తే. డై తనర్చిన పుండరీకాక్షుఁ డొకఁడ
కాక గణుతింప దైవ మొక్కరుఁడు వేఱ

1. ఆమంత్రణంబు = పిలుచుట.

కలఁడే యనుబుద్ధి విజ్ఞానకలితు లగుచు
హరిపదాబ్జాత యుగళంబు నర్థిఁ గొలిచి. 1279

వ. అట్లు సేవించి యవ్యయానందంబయిన వైకుంఠధామంబుఁ బొందిరని
చెప్పి వెండియు నిట్లనియె. 1280

—♦ శ్రీకృష్ణుండు మృతులయిన విప్రసుతులఁ దెచ్చుట ♦—

సీ. నరనాథ యొకనాఁడు నలినాయతాక్షుండు
పాలుచు కుశస్థలీ పురమునందు
సుఖ ముండ నొక్కభూసురవర్యు భార్యకుఁ
బుత్త్రుండు జన్మించి పుట్టినపుడ
మృతుఁడైన ఘన శోకవితతిచేఁ గ్రాఁగుచు
నాడింభకునిఁ గొంచు నవనిసురుఁడు
చనుదెంచి పెలుచ రాజద్వారమునఁ బెట్టి
కన్నుల బాష్పాంబుకణము లొలుక

తే. బాపురే విధి నను దుఃఖపఱుపఁ దగునె
యనుచు దూఱుచుఁ దనుఁ దిట్టికొనుచు వగల
డెంద మందంద యెరియ నాక్రందనంబు
సేయుచును వచ్చి యావిప్రశేఖరుండు. 1281

సీ. అధికశోకంబున నలమటఁ బొందుచు
నచ్చటి జనులతో ననియెఁ బెలుచ
బ్రాహ్మణవిద్వేషపరుఁడయి తగ శాస్త్ర
పద్ధతి నడపక పాపవర్తి
యై క్షత్త్రబంధువు నగువాని [1]దురితంబు
చేత మత్పుత్త్రుండు జాతమైన
యప్పుడ మృతుఁ డయ్యె నక్కట హింసకు
రోయక యెప్పుడు నన్యాయకారి

తే. యగుచు విషయానుగతచిత్తుఁ డైన యట్టి
రాజు దేశంబు ప్రజలు నిరాశు లగుచు

1. దురితంబు = పాపము.

దుఃఖములఁ జాలఁ బొందుచుండురని మిగుల
వేడ్చుచును నట నిర్వేక మేఁగె నప్పుడు. 1282

వ. ఇవ్విధంబున మఱియును తన సుతులు మృతులయిన వారలంగొని వచ్చి యవ్విప్రుండు రాజు [1]మొగసాలం బెట్టి రోదనంబు సేయుచు నప్పటియట్ల కొన్ని గాథలు సదివి వాపోవుచుండె, నవ్విధంబున మృతుండైన వాని నెత్తికొని వచ్చి యెప్పటి విధంబునం బలవరించుచున్న యాబ్రాహ్మణుం గని యర్జునుం డిట్లనియె: 1283

క. ఈపగిది నీవు వగలన్ । వాపోవఁగఁ జూచి యకట వారింపంగా
నోపినవిలుకాఁ డొక్కఁ । డీపురి లేఁడయ్యె నయ్యయిది పాపమగున్

సీ. పుత్త్రులఁ గోల్పోయి భూరిశోకంబున
వనటఁ బొందుచు విప్రవరులు చాల
నేరాజు రాజ్యమం దేని వసింతురు
నారాజుఁ దప్పోయ నవనిమీఁద
నటునిగా నాత్మ నెన్నందగు నీపుత్త్రు
నే బతికించెద నిప్పుడు పూని
యటు సేయనైతినే ననలంబు సొచ్చెద
నని భూసురుఁడు వెఱఁగందఁ బలికె

తే. నతఁడు గడు [2]వ్రేఁగుమాటలి ట్లాడఁ దగునె
భూరి విక్రమశాలి రాముండు మేటి
బలుఁడు హరియును శౌర్య సంపన్ను లనఁగఁ
దనరు ప్రద్యుమ్నుఁ డతని నందనుఁడు మఱియు. 1285

తే. వినుతబలులైన యాదవ వీరవరులుఁ
గలుగ వారలచేఁ గాని కార్య మీవు
చక్కఁబెట్టుట యెట్లు నీ చనెడి త్రోవఁ
బొమ్మ [3]నావుఁడు నయ్యింద్రపుత్త్రుఁ డపుడు. 1286

---

1. మొగసాల = నగరి తలవాకిటి సావిడియందు 2. వ్రేఁగుమాటలు = భారమైనమాటలు, 3. నావుఁడు = అనఁగా.

క. మనమున దురహంకారము
ఘనముగఁ బొడముటయు నప్పుడు కవ్వడి విప్రుం
గనుఁగొని యచ్చటి జనములు
వినఁగా నిట్లనియె రోషవిహ్వలమతియై. 1287

మ. బలుడం గాను మురాసురాంతకుఁడఁ గాఁ బ్రద్యుమ్నుఁడం గాను నేఁ
దెలియం దత్తనయుండఁ గానని విరోధివ్రాతమున్ భీషణో
జ్జ్వలగాండీవ [1]ధనుర్విముక్త నిశితాస్త్రశ్రేణిచేఁ బీన్గు పెం
టలు గావించు పరాక్రమప్రకట చండస్ఫూర్తి నేఁ బార్థుఁడన్.

వ. అదియునుం గాక. 1289

చ. బలిమి పురాంతకుం దొడరి బాహువిజృంభణ మొప్ప నెక్కటిం
దలపడి పోరినట్టి రణధైర్యుని నన్ను నెఱుంగ వక్కటా
పెలుకుఱ మృత్యుదేవతను బింక మడంచి భవత్తనూజుల
న్నలవుఁ జలంబుఁ జూపి కొనియాడఁగ నిప్పుడ తెచ్చియిచ్చెదన్.

వ. అనినమ్మంబలికిన యర్జును ప్రతిజ్ఞకు భూసురుండు మనంబున నూఱ
డిల్లి యతని నభినందించుచు నిజమందిరంబునకుఁజని కొన్ని దినంబు
లుండు నంత భార్యకుం బ్రసూతివేదనా సమయం బయినం జను
దెంచి [2]వివ్వచ్చుం గని తద్విధం బెఱింగించిన నయ్యైంద్రనందనుం
డప్పుడు. 1291

చ. లలితవిశిష్టసంచిత జలంబుల నాచమనంబు సేసి సు
స్థలమున నిల్చి రుద్రునకు సమ్మతి మ్రొక్కి మహాస్త్రశస్త్ర ని
ర్మల శుభమంత్ర దేవతల మానసమందుఁ దలంచి గాండివం
బలవడ నెక్కు ద్రోచి బిగియం గదియించి నిషంగయుగ్మమున్.

వ. ఇవ్విధంబునఁ గట్టాయితంబయి యప్పుడు. 1293

సీ. భూసురువెంట నిమ్ముల నేగి సూతికా
భవనంబు చుట్టును బాణవితతి
నరికట్టి దిక్కులు నాకాశపథము ధ
రాతలం బెల్ల నీరంధ్రముగను

1. ధనుర్విముక్త = ధనుస్సునుండి విడువఁబడిన. 2. వివ్వచ్చున్ = అర్జుని.

శరపంజరముఁ గట్టి | శౌర్యంబు దీపింపఁ
గడు నప్రమత్తుఁడై | కాచియున్న
యెడ నమ్మహీసురు | కింతికిఁ బుత్త్రుండు
జనియించె నప్పు | డచ్చటి జనంబు

తే. పోయెఁ బోయెఁ గదే యని | బొబ్బ లిడఁగ
బొందితోడన యాకాశ | మునకు మాయఁ
జెందె నప్పుడ దుఃఖంబు | నొంది భూమి
సురుఁడు విలపించుచును మురహరునికడకు. 1294

వ. అప్పుడు చని, 1295

క. ముందఱ నిల్చి ముకుంద స|నందనమునివినుత నంద|నందన పరమా
నంద శరదిందుచందన | కుందయశస్సాంద్ర కృష్ణ | గోవిందహరీ.

వ. అవధరింపుము దేవా యర్జునుం డనెడి పౌరుష విహీనుం డాడిన వృథాజల్పంబులు నమ్మి పుత్త్రుం గోలుపడితి నేల నైన నన్ను నేమందు నిఖిల విశ్వోత్పత్తిస్థితిలయంబులకుఁ బ్రధానహేతుభూతుండవయిన నీవు సమర్థుండవయ్యు వారింపజాలక చూచుచుండ నొక్క మనుష్యమాత్రుండు దీర్పఁజాలెడువాఁడు గలఁడే యని వెండియు. 1297

క. ఎక్కడి పాండుతనూభవుఁ
డెక్కడి విలుకాఁడు వీని | కెక్కడిసత్త్వం
బెక్కడి [1]గాండీవము దన
కెక్కడి దివ్యాస్త్రసమితి | యేమనవచ్చున్. 1298

క. అని తను నొడక నిందిం
చిన విని యయ్యర్జునుండు | చిడిముడిపడుచుం
దనవిద్య మహిమ పెంపునఁ
జనియెను వెస [2]దండపాణి | సదనంబునకున్. 1299

క. చని యందు ధారుణీసుర|తనయులు లేకుంటఁ దెలిసి | తడయక నింద్రా
గ్ని నిరృతి వరుణ సమీరణ|ధన దేశానాలయములు | దగఁ బరికించెన్.

వ. వెండియు. 1301

1. గాండీవము = అర్జునునిధనుస్సు. 2. దండపాణి = యముఁడు.

చ. నర సుర యక్ష కింపురుష నాగ నిశాచర సిద్ధసాధ్య ఖే
చర విహగేంద్ర గుహ్యక పిశాచరవాసములందు రోసి భూ
సురసుతు లేగినట్టి గతి చొప్పడ కుండుటఁ జూచి క్రమ్మఱన్
ధరణికి నేగుదెంచి బెడిదంబుగ నగ్నిసొరంగఁ బూనినన్.

వ. అవ్విధం బంతయు నెఱింగి యమ్మురాంతకుండు విప్రనందనుల నీకుం
జూపెదనని యనలంబు సొరకుండ నివారించి యప్పుడు. 1303

ఉ. సుందరదివ్యరత్నరుచి శోభితమై తనరారు [1]కాంచన
స్యందన మంబుజాప్తుఁ డుదయాచల మెక్కువిధంబుదోఁపఁ బా
రందరి దాను నెక్కి తనుకరమ్ములు దిగ్వితతిన్ వెలుంగ గో
విందుఁ డుదారలీలఁ జనె విప్రతనూజ [2]గవేషణార్థియై. 1304

చ. చని పుర గోష్ఠ దుర్గవన జానపదాచల [3]పక్కణ ప్రభూ
త నద నదీ సరోవరయుతక్షితి నంతయు దాఁటి [4]సప్తవా
రినిధుల దీవులం గుల గిరి ప్రకరంబుల [5]నుత్తరించి మే
రునగము నాక్రమించుచు మరుద్గతితో రథ మేగె నత్తఱిన్.

చ. మసలక భూరిసంతమస మండలముం దఱియంగఁ జొచ్చి సా
హసమునఁ బోవఁ బోవఁగ భయంకరమై మది గోచరింపమిన్
వస మఱి మోకరిల్లి రథ వాజులు మార్గము దప్పి నిల్చినన్
బిసరుహపత్రలోచనుఁ డభేద్యతమఃపటలంబు వాపగన్. 1306

సీ. బాలభానుప్రభా భాసమానద్యుతి
గర మొప్పు నిజరథాంగంబుఁ బనుప
నమ్మహాస్త్రంబేగి చిమ్మచీఁకటి నెల్ల
నఱిముఱి నందంద నఱికివైచి
యగ్రభాగంబున నతులితగతి నేగ
నామార్గమున నిజ స్యందనంబు
గడువడిఁ దోలి యా[6]కడిఁది తమోభూమిఁ
గడవ ముందఱికడఁ గానరాక

1. కాంచనస్యందనము = బంగారురథము. 2. గవేషణార్థియై = వెదకఁదలఁచినవాఁడై. 3. పక్కణ=బోయపల్లె. 4. సప్తవారినిధులు=ఏడుసముద్రములు. 5. ఉత్తరించి = దాఁటి. 6. కడిఁది = గొప్పదైన.

తే. మిక్కుటంబుగ దృష్టి మిఱుమిట్లు గొనఁగ
[1]జడల వెలుఁగొందు దివ్యతేజంబు సూచి
మొనసి గాండీవి కన్నులు మూసికొనుచు
నాత్మ భయ మంది కొంతదవ్వరిగి యరిగి. 1307

తే. కడఁగి దుర్వార మారుతోత్కటవిధూత
చటుల సర్వంకషోర్మి భీషణగభీర
[2]వారి పూరంబు సొచ్చి తన్నీరమధ్య
భాగమునఁ గోటిసూర్య ప్రభలు వెలుంగ. 1308

వ. ఇది మఱియుం జారు దివ్యమణి [3]సహస్ర స్తంభాభిరామంబును
నాలంబిత కమనీయ నూత్న రత్నమాలికాలంకృతంబును భాను
శశివాయ్వగమ్యంబును ననంత తేజోవిరాజితంబును [4]బునరావృత్తి
రహిత మార్గంబును నిత్యైశ్వర్య దాయకంబును నవ్యయంబును
సత్యానంతంబును సమానవిభవంబును బరమ యోగీంద్ర గమ్యం
బును బరమ భాగవత నివాసంబునునై యొప్పు నద్దివ్యధామంబు
నందు.

సీ. సాంద్ర శరచ్చంద్ర చంద్రికా కర్పూర
నీహార హారాభ దేహ మమర
నిందిందిరేందీవరేంద్రనీలద్యుతిఁ
గర మొప్పు [5]మేచక కంఠ సమితి
యరుణాంశు బింబ భాసురపద్మరాగ వి
న్యస్త సహస్రోరు మస్తకములు
వివృతాననోద్గత విష ధూమ రేఖల
లీలఁ జూపట్టిన నాలుకలును
తే. గలిత సాయంతనజ్వాల జ్వాలనకుండ
ముల విడంబించు వేడి చూపులును గలిగి

1. జడలఁ = ఆకాశమునందు. 2. వారిపూరంబు = సముద్రము.
3. సహస్ర......బును = వేయిస్తంభములచే మనోహరంబు. 4. పునరావృత్తిరహిత = తిరిగిరానట్టి. 5. మేచక కంఠసమితి = నల్లని కంఠ సముదాయము.

భూరి కలధౌత గిరి నిభాకార మమరఁ
బరఁగు భోగీంద్రభోగ తల్పంబునందు. 1310

వ. సుఖాసీనుండై యున్నవాని డాయంజని యప్పుడు. 1311

సీ. సజలనీలాంబుద శ్యామాయమానాంగు
నాశ్రితావన ముదితాంతరంగు
సనకాదియోగి హృద్వనజమధ్యాళీంద్రు
ముఖపద్మరుచిజిత పూర్ణచంద్రుఁ
గమనీయ నిఖిల జగద్గిత చారిత్రుఁ
[1]ప్రత్యూష సంఫుల్ల పద్మనేత్రు
నిందిరా హృదయారవిందారుణోల్లాసు
శ్రీకర పీతకౌశేయవాసు

తే. హార కుండల కటక కేయూర మకుట
కంకణాంగద మణి ముద్రికా వినూత్న
రత్ననూపుర కాంచీ విరాజమాను
భవ మహార్ణవశోషు సద్భక్తపోషు. 1312

వ. మఱియు సునందాది పరిజన సంతత సేవితు నానందకందళిత హృదయారవిందు నరవిందవాసినీ వసుంధరా సుందరీసమేతు నారద యోగీంద్ర సంకీర్తనానందితు నవ్యయు ననఘు ననంతు నప్రమేయు నజితు నవికారు నాదిమధ్యాంతరహితు భవ విలయాతీతుఁ గరుణాసుధా సముద్రు నచ్యుతు మహానుభావుఁ బరమ పురుషుఁ బురుషోత్తము నిఖిల జగ దుత్పత్తి స్థితి లయ కారణుఁ జిదచిదీశ్వరు [2]నష్టభుజుఁ గౌస్తుభ శ్రీవత్సలక్ష్మ శంఖ చక్ర గదా పద్మ శార్ఙ్గాది దివ్యసాధను సర్వశక్తి సేవితుఁ బరమేష్ఠిజనకు నారాయణుం గనుంగొని దండప్రణామంబులు సేసి కరకమలంబులు మొగిచి భక్తిపూర్వకంబుగా [3]నభినందించిన నయ్యాదిదేవుండును

1. ప్రత్యూ...... నేత్ర=సూర్యోదయమగునపుడు వికసించు పద్మములవంటి నేత్రములు కలవాఁడు. 2. అష్టభుజున్=ఎనిమిదిభుజములు కలవానిని. 3. అభినందించిన= స్తోత్రము చేయఁగా.

వారలం గరుణావలోకనంబు నిగుడ నవలోకించి దరహాసపూరంబు
తోరంబుగా సాదరంబుగ నిట్లనియె. 1313

క. ధరణికి వ్రేఁగగు దైత్యులఁ
బొరిఁబొరి వధియించి ధర్మభావము నిలుపుటకై
ధర జనియించితి రిరువురు
నరనారాయణు లనఁగ నా యంశమునన్. 1314

క. ఆరూఢనియతితోఁ బెం|పారిన మిము నిమ్మునీంద్రు లర్థిం జూడం
గోరిన మీ రా వచ్చుటకై|[1]ధారుణిసురసుతుల నిటకుఁ దగఁ దేవలసెన్.

క. అని యా[2]డింభకులను [3]దోఁ|కొని పొండని యిచ్చి వీడుకొలిపిన వారల్
వినతులయి పెక్కువిధముల|వినుతించుచు నచటు వాసి విప్రుని సుతులన్

వ. తోడ్కొని సంప్రాప్తమనోరథులయి యబ్బాలకులఁ దత్తద్వయో
రూపంబులతోడఁ దెచ్చి యా బ్రాహ్మణునకు సమర్పించిన నతండు
సంతుష్టాంతరంగుం డయ్యె నయ్యవసరంబున. 1317

చ. అనిమిషనాథనందనుఁ డహర్పతితేజుఁడు కృష్ణుతోడఁ దాఁ
జని యచటం గనుంగొనిన సర్వశరణ్యునిఁ బుండరీకనే
త్రుని నిజధామవైభవసమృద్ధికి దన్మహనీయమూర్తికిన్
మనమున మోదమంది పలుమారును సన్నుతిఁ జేసె భూవరా.

తే. వారిజాక్షుని భక్తమందారు ననఘుఁ
గృష్ణు నఖిలేశుఁ గేశవు జిష్ణుఁ బరము
వినుతి సేయుచుఁ దత్పాదవనజములకు
వందనము లాచరించి యానంద మొందె. 1319

వ. అంత. 1320

మ. హరి సర్వేశుఁ డనంతుఁ డాద్యుఁ డభవుం డామ్నాయసంవేది భూ
సురముఖ్యప్రజలన్ సమస్తధనవస్తుశ్రేణి నొప్పారఁగాఁ
బరిరక్షించుచు ధర్మమున్ నిలుపుచుం బాపాత్ములం ద్రుంచుచుం
బరమోత్సాహ మెలర్ప భూరిశుభవిభ్రాజిష్ణుఁడై ద్వారకన్.

---

1. ధారుణీసుర సుతులను=బ్రాహ్మణ కుమారులను. 2. డింభకులను=పిల్లలను.
3. తోఁకొని=వెంటఁబెట్టుకొని.

క. జనవినుతముగాఁ బెక్కు [1]స
వనములు దనుఁదాన కూర్చి వైదికయుక్తిం
బొనరించుచు ననురాగము
మనమునఁ దళుకొత్త దైత్యమర్దనుఁ డెలమిన్. 1323

వ. అట్లు కృష్ణుండు ద్వారకానగరంబునఁ బూజ్యంబగు రాజ్యంబు సేయుచుఁ బురందరవిభవంబున [2]నిరవొంది కనకమణిమయ విమాన గోపుర ప్రాసాద సౌధచంద్ర శాలాంగణాది వివిధభవనంబు లమరు రంగదుత్తుంగతరంగడోలావిలోల కలహంస చక్రవాక కారండవ సారస క్రౌంచ ముఖజలవిహంగ విలసదుచ్చలిత గరుదనిలదరదమల కమల కుముద కల్హార సందోహ నిష్యంద మకరందరసపాన మదవ దిందిందిరకుల గాయకుల ఝుంకారనినదంబులును నిరంతరవసంత సమయ సముచిత పల్లవిత కోరకిత బాలరసాలజాల లాలిత కిసలయ విసర ఖాదనజాత కుతూహలాయమాన కషాయ కంఠ కలకంఠ కలరవమృదంగ ఘోషంబులును నిశితనిజచంచూపుట నిర్దళిత సకల జన నయనానందసుందర [3]నందిత మాకంద పరిపక్వఫలరంధ్ర విగళిత మధుర రసాస్వాదన ముదితరాజకీర శారికా నికర మృదుమధుర వచన రచనావశ్యకృత్యంబులును సమరఁ బురపురంధ్రీజన పీన పయోధర మండల విలిప్త లలిత కుంకుమపంక సంకులసౌగంధ్యాను బంధబంధుర గంధానుమోదితుండును జందనాచల సానుదేశ [4]సంజాత మంజుల మాధవీలతా నికుంజపుంజ మంజులకింజల్క రంజిత నివాసవిసర విహరమాణ శబరికా కబరికా పరిపూర్ణసురభి కుసుమమాలికా పరిమళవహుండును గళిందకన్యకాకల్లోలసందోహ పరిస్పందకందళిత మందగమనుండును నగు మందానిలవిదూషకునిచేఁ బోషితాభ్యాసితలాలిత లగు నేలాలతా నటీవితాననటనంబులచే విరాజితంబులగు కాసారతీరభాసురోద్యానంబులందును జారు[5]ఘన సార పటీర బాలరసాల సాల నీప తాపింఛ జంబూ జంబీర నింబ కదంబ ప్రముఖ ముఖ్య శాఖి శాఖాకీర్ణ శీతల చ్ఛాయా విరచిత

1. సవనములు = యజ్ఞములు. 2. నిరవొంది = స్థానముపొంది. 3. నందిత = ఆనందింపఁబడిన. 4. సంజాత = పుట్టిన. 5. ఘనసార = పచ్చకర్పూరము.

విమల చంద్రకాంతోపల వేదికా స్థలంబులందును నాదంచితపింఛ
విభాసిత బాలనీలకంఠ [1]కేకారవాకలిత కృతక మహీధరంబులందును
లలిత మణివాలుకానేక [2]పులినతలంబులందును కప్పురంపుఁదిప్పలను
గురువేరు చప్పరంబులను విరచించి దారు యంత్ర నిబద్ధ కలశ
నిర్యత్పయోధారా శీకరపరంపరా సంపాదిత నిరంతర హేమంత
సమయ ప్రదేశంబులందును నిందిరారమణుండు షోడశసహస్ర వధూ
యుక్తుండై యందఱకన్నిరూపులై లలిత సౌదామనీలతా సమేత
నీల[3]నీరదంబుల విడంబించుచు కరేణుకాకలిత దిగ్గజంబునోజ రాజి
ల్లుచు సలిలకేళీవిహారంబులు మొదలుగా ననేక లీలావినోదంబులు
సలుపుచు నంతఃపురంబునఁ గొలువున్న యవసరంబున వివిధ వేణు
వీణాది వాద్యంబులను మంజుల గానంబులను గవి గాయక సూత
వంది మాగధ జన సంకీర్తనంబులను నట నటీజన నాట్యంబును
విదూషక పరిహాసోక్తులను సరససల్లాప మృదుమధురభాషణంబులను
బ్రొద్దుపుచ్చుచు నానందరసాబ్ధి నోలలాడుచుండె నంత. 1323

మ. అరవిందాక్షు పదాంబుజాత యుగళీ ధ్యానానురాగ క్రియా
సరసాలాప విలోకనానుగత చంచత్తౌత్సుక్య కేళీరతం
దరుణుల్ నూఱుఁబదాఱువేలు మహితోత్సాహంబునం జొక్కి త
త్పరలై యొండు దలంపకుండిరిల విభ్రాంతాత్మలై భూవరా.

వ. అదియును గాక. 1325

మ. హరినామాంకిత మైన గీత మొకటాలించి మూర్ఛాత్ములై
విరతిం బొందఁగఁ జాలకుందురట యావిశ్వాత్ము నీక్షించుచుం
బరిరంభించుచు నంటుచున్ నగుచు సంభాషించుచు న్నుండు సుం
దరు లానంద నిమగ్నలౌట కిలఁ జోద్యం బేమి భూవల్లభా.

వ. అని చెప్పి మఱియు నిట్లనియె. 1327

ఉ. వారక కృష్ణుఁ డిప్పగిది వైదికయుక్తి గృహస్థధర్మ మే
పారఁగఁ బూని ధర్మమును [4]నర్థముఁ గామము నందుఁ జూపుచుఁ

1. కేకారవ = నెమలికంఠధ్వని. 2. పులినతలంబునందు = ఇసుకప్రదేశమున
3. నీరదంబులు = మేఘములు. 4. అర్థమున్ = ధనమును.

గోరిక మీఱ సజ్జనులకున్ గతి దానయుంగ నొప్పి సం
సారిగతిన్ మెలంగె నృపసత్తమ లోకవిడంబనార్థమై. 1328

సీ. హరి యిట్లు గృహమేధి యగుచు [1]శతోత్తర
షోడశసాహస్ర సుందరులకు
మును నీకు నెఱుఁగఁ జెప్పినరీతి నందఱ
కన్నిరూపములు దా నర్థిఁ దాల్చి
కైకొని యొక్కొక్క కామినీమణియందు
రమణ నమోఘవీర్యమునఁ జేసి
పదురేసి కొడుకులఁ బడసె రుక్మిణ్యాది
పట్టమహిషులకు భవము లైన

తే. నందనులలోన ధరణి నెన్నంగ బాహు
బలపరాక్రమ వినయసద్బుద్ధి శేష
మాసితాత్ములు పదునెన్మండ్రు వారి
నెఱుఁగ వినిపింతు వినుము రాజేంద్రచంద్ర. 1329

వ. అని మఱియు నిట్లను, వారలు ప్రద్యుమ్నానిరుద్ధ దీప్తిమద్భాను సాంబ బృహద్భాను మిత్రవింద వృకారుణ పుష్కర దేవబాహు శ్రుతదేవ సునందన చిత్రబాహు వరూధ కవి న్యగ్రోధనామంబులం బ్రసిద్ధులైరి, వెండియుఁ ద్రివక్రయందు సంభవించిన యుపశ్లోకుం డనువాఁడు దన జనకుండైన కృష్ణ పాదారవింద సేవావ్రతుం డగుచు నారద యోగీంద్రునకు శిష్యుండై యఖండిత దివ్యజ్ఞాన బోధాత్మకుం డగుచు స్త్రీశూద్ర దాసజన సంస్కారంబై స్మరణ మాత్రంబున ముక్తి సంభవించునట్టి సాత్వతంత్రంబను వైష్ణవ స్మృతిఁ గల్పించె నిట్లు మధుసూదన నందనులు బహుప్రజలును నధి కాయురున్నతులును ననల్పవీర్యవంతులును బ్రహ్మణ్యులు నై విఖ్యాతిం బొందిరి. వారిని లెక్కపెట్టఁ బదివేల వత్సరంబుల కైనం దీఱదు. మున్ను నీ కెఱిఁగించినట్లు తత్కుమారులకు విద్యావిశేషం

1. శతోత్తరషోడశ సాహస్ర.. లను = పదునాఱువేలు, నూఱుమంది స్త్రీలను.
2. అర్థిన్ = కోరినవాఁడై.

బుల నియమించు గురుజనంబు మూఁడు కోట్లు నెనుబదెనిమిది
వేలనూర్గు రనం గలిగియుండు నక్కుమారుల లెక్కింప నెవ్వరికి
నశక్యం బదియునుం గాక యొక్క విశేషంబుఁ జెప్పెద వినుమని
యిట్లనియె. 1330

క. నరవర దేవాసుర [1]సం
గరమున మును నిహతులైన క్రవ్యాద సము
త్కరము నరేశ్వరులై ద్వా
పరమున జనియించి ప్రజల బాధలఁ బఱుపన్. 1331

క. హరి తద్బాధాక్షమై [2]నిర్జరులను యదుకులమునందు జనియింపింపం
ధర నూటొక్కకులం బై పరఁగినవారిని గణింప బ్రహ్మకువశమే.

వ. అట్టి [3]యన్వయంబునందు మాధవునకు రుక్మిణీదేవియందుఁ బిత్రుస
ముండును సమగ్రభుజావిజృంభణుండును నై ప్రద్యుమ్నుఁడు జని
యించె నతనికి రుక్మికూఁతురు శుభాంగివలన ననిరుద్ధుం డుదయించె
నతనికి మౌసలావశిష్టుం డైన వజ్రుఁడు సంభవించె నతనికిఁ బ్రతి
బాహుఁడు పుట్టె వానికి సుబాహుండు జన్మించె నతనికి నుగ్ర
సేనుఁడు ప్రభవించె వానికి శ్రుతసేనుఁడు గలిగె నిట్లు యదువృష్ణి
భోజాంధకవంశంబులు పరమపవిత్రంబులై పుండరీకాక్ష నిరీక్షణ
శయ్యాసనానుగతసరససాలాప స్నానాసన క్రీడా వినోదంబుల [4]నని
శంబుఁ జెందుచు సర్వదేవతార్థంబు సమస్తం బైన క్రతువు లొన
రించుచుఁ బరమానందకందళితచిత్తులై యుండిరని చెప్పి వెండియు.

మ. పరమోత్సాహముతోడ మాధవుఁడు శుంభద్భల్లీలఁ బూరించు న
మ్మురళీగానము వీనులం జిలికినన్ మోదించి గోపాల సుం
దరులేతెంతు రరణ్యభూములకుఁ దద్దాస్యంబు గామించి య
క్కరుణావార్ధి భజింపకుందురె బుధుల్ కౌరవ్యవంశాగ్రణీ.

మ. మతి నెవ్వాని యమంగళఘ్న మగు నామం బర్థిఁ జింతించి స
న్నుతిఁ గావించిన విన్న మానవులు ధన్యుల్ భూరిసంసార దు

1. సంగరమున = యుద్ధమున. 2. నిర్జరులను = దేవతలను. 3. అన్వయంబునందు = వంశమున. 4. అనిశంబు = ఎల్లప్పుడు.

ప్రకృతులం ద్రోతుకు కాలచక్రమహితా✽స్త్రుం డట్టి యాకృష్ణుఁ డీ
క్షితిభారం బుడుగంగఁ జేయుటిదియే✽ చిత్రంబు భూవల్లభా.

వ. ఇవ్విధంబున గోపికామనోజాతుం డైన కృష్ణుండు లీలామానుష విగ్రహుం డై నిజ రాజధాని యైన ద్వారకాపురంబున నమానుష విభవంబు లగు సౌఖ్యంబులం బొదలుచుండె నని చెప్పి మఱియు నిట్లనియె.

మ. మనుజేంద్రోత్తమ యేను నీకుఁ ద్విజగ✽న్యాంగనాగేయమై చెప్పఁ జె
ప్పిన యీ కృష్ణకథాసుధారసము సం✽ప్రీతాత్ములై భక్తిఁ గ్రో
లిన పుణ్యాత్ములు గాంతు రిందు సుఖముల్✽ [1]నిర్ధూతసర్వాఘులై
యనయంబుం బుదిఁ గాంతు రచ్యుతపదం✽బై నట్టి [2]కైవల్యమున్.

క. అనియిట్లు బాదరాయణి। మనమున రాగిల్ల నాభి✽మన్యూజకుం జె
ప్పినవిధమున సూతుఁడుముని। జనుల కెఱింగింప వారు సమ్మతితోడన్.

క. సూతుని బహువిధములసం। ప్రీతుం గావించి మహిమ✽ బెంపారుచు వి
ఖ్యాతికి నెక్కిన కృష్ణక। థాతత్పరులైరి బుద్ధి✽ దనరఁగ భక్తిన్.

చ. సరసిజపత్రనేత్ర✽ రఘుసత్తమ దుష్టమదాసురేంద్ర సం
హారణ దయాపయోధి జన✽కాత్మభవానన పద్మమిత్ర భా
స్కరకులవార్ధిచంద్ర మిహి✽కానసుధాకరసూతి సన్నుత
స్ఫురితచరిత్ర భక్తజన✽పోషణభూషణ [3]పాపశోషణా. 1340

క. మారీచభూరిమాయా। నీరంధ్రమహాంధకార✽ నీరేజహితా
త్మారమణ వినుతపాదాం। భోరుహ మహితావతార✽ పుణ్యవిచారా.

మాలిని. శరధిమదవిరామా ✽ సర్వలోకాభిరామా
సురరిపు విషభీమా ✽ సుందరీలోకకామా
ధరణివరలలామా ✽ తాపసస్తోత్రసీమా
సురుచిర గుణధామా ✽ [4]సూర్యవంశాబ్ధిసోమా.

---

1. నిర్ధూతసర్వాఘులై = సమస్తపాపములు పోయినవారై. 2. కైవల్యమున్ = మోక్షమును. 3. పాపశోషణా = పాపములు పోఁగొట్టువాఁడా. 4. సూర్యవంశాబ్ధిసోమా = సూర్యవంశమను సముద్రమునకు చంద్రుఁడా.

గద్యము: ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేతన మంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమన్మహాభాగవతం బను మహాపురాణంబునందుఁ బ్రద్యుమ్ను జన్మంబును శంబరోద్యోగంబును సత్రాజిత్తునకు సూర్యుండు శమంతకమణి నిచ్చుటయుఁ దన్నిమిత్తంబునం బ్రసేనుని సింహంబు వధియించుటయు దానిం జాంబవంతుండు చంపి మాణిక్యంబు గొనిపోవుటయు గోపించుచుఁ బ్రసేనుని చంపి మణిఁ గొనిపోయెనని సత్రాజిత్తు కృష్ణునందు నింద నారోపించుటయుఁ గృష్ణుండు [1]తన్నిమిత్తంబున జాంబవంతునిం దొడరి మణియుక్తంబుగా జాంబవతిం గొని వచ్చి వివాహంబగుటయు సత్రాజిత్తునకు మణి నిచ్చుటయు సత్యభామా పరిణయంబును బాండవులు లాక్షా[2]గృహంబున దగ్ధులైరని విని వాసుదేవుండు బలభద్రసహితుండై హాస్తినాపురంబున కరుగుటయు నక్రూరకృతవర్మల యనుమతంబున శతధన్వుండు సత్రాజిత్తుం జంపి మణి గొనిపోవుటయుఁ దదగ్రంబా సత్యభామ కరినగరంబున కేఁగి కృష్ణునకు విన్నవించిన నతండు మరలి చనుదెంచి శతధన్వుం ద్రుంచుటయు [3]బలభద్రుండు మిథిలానగరంబునకు జనుటయు నందు దుర్యోధనుండు రామునివలన గదావిద్య నభ్యసించుటయుఁ గృష్ణుండు సత్రాజిత్తునకుం బరలోకక్రియలు నడపుటయు శమంతకమణిం దాఁచినవాఁడయి యక్రూరుండు భయంబున ద్వారకానగరంబు విడిచిపోయిన నతనిలేమి [4]ననావృష్టి యైనం గృష్ణుం డక్రూరుని మరల రప్పించుటయు దామోదరుం డింద్రప్రస్థపురంబున కరుగుటయు నర్జునసమేతుండయి మృగయావినోదార్థం బరణ్యంబునకుం జని కాళిందిం గొని వచ్చుటయు ఖాండవదహనంబును నగ్నిపురుషుం డర్జునునకు [5]నక్షయతూణీర గాండీవ కవచ రథ రథ్యంబుల నిచ్చుటయు మయుండు ధర్మరాజునకు సభ గావించి యిచ్చుటయు నగధరుండు

1. తన్నిమిత్తంబున = దానికొరకు (శమంతకము). 2. లాక్షాగృహంబున = లక్కయింటియందు. 3. బలభద్రుండు = బలరాముఁడు. 4. అనావృష్టియైనన్ = వర్షములేక పోయిన. 5. అక్షయ = నాశములేని.

మఱలి నిజనగరంబున కరుదెంచి కాళిందిని వివాహంబగుటయు మిత్రవిందా నాగ్నజితి భద్రా మద్రరాజకన్యలం గ్రమంబునఁ గరగ్రహణంబగుటయు నరకాసుర యుద్ధంబును దద్గృహంబున నున్న రాజకన్యకలం బదాఱువేలం దెచ్చుటయు స్వర్గమునంబు నదితికిం గుండలంబు లిచ్చుటయుఁ బారిజాతాపహరణంబును బదాఱువేల రాజకన్యకలం బరిణయం బగుటయు రుక్మిణీదేవి విప్రలంభంబును రుక్మిణీస్తోత్రంబును గృష్ణకుమారోత్పత్తియుఁ దద్గుణజన సంఖ్యయుఁ బ్రద్యుమ్నవివాహంబు ననిరుద్ధజన్మంబును దద్వివాహార్థంబు కుండిననగరంబునకుం జనుటయు రుక్మి బలభద్రుల జూదంబును రుక్మి వధయు నుషాకన్య యనిరుద్ధుని స్వప్నంబునం గని మోహించుటయు దన్నిమిత్తంబునఁ జిత్రరేఖ సకలదేశరాజులఁ బటంబున లిఖించి చూపి యనిరుద్ధునిఁ దెచ్చుటయు బాణాసుర యుద్ధంబును నృగోపాఖ్యానంబును బలభద్రుని ఘోషయాత్రయుఁ గాళిందీభేదనంబును గృష్ణుండు పౌండ్రకవాసుదేవ కాశీరాజుల వధియించుటయుఁ గాశిరాజపుత్రుండయిన సుదక్షిణుం [1]డభిచార హోమంబు గావించి కృత్యం బనిపి కృష్ణుపాలికి బుత్తెంచిన సుదర్శనంబుచేతఁ గృత్యను సుదక్షిణ సహితంబుగాఁ గాశీపురంబును భస్మంబు సేయుటయు బలరాముండు రైవతనగంబునందు ద్వివిదుండను వనచరుని వధియించుటయు సాంబుండు దుర్యోధనుకూఁతు రగు లక్షణ నెత్తికొని వచ్చినఁ గౌరవులతనిం గొనిపోయి చెఱఁ బెట్టుటయుఁ దద్వృత్తాంతం బంతయు నారదువలన విని బలుండు నాగనగరంబునకుఁ జనుటయుఁ గౌరవులాడిన యగౌరవవచనంబులకు బలరాముండు కోపించి హస్తినాపురంబును గంగం బడఁద్రోయ గమకించుటయుఁ గౌరవులు భయంబున నంగనాయుక్తంబుగా సాంబునిం దెచ్చి యిచ్చుటయు బలభద్రుండు ద్వారకానగరంబునకు వచ్చుటయు నారదుండు హరి పదాఱువేల కన్యకల నొక ముహూర్తంబున నందఱ కన్నిరూపులై వివాహంబయ్యెనని విని తత్ప్రభావంబు తెలియంగోరి యరుగుదెంచు

1. అభిచారహోమంబు = హింసార్థకమయిన హోమము.

టయుఁ దన్మాహాత్మ్యంబు సూచి మరలి చనుటయు జరాసంధునిచేత బద్ధులైన రాజులు కృష్ణుపాలికి దూతం బుత్తెంచుటయు నారదాగమనంబును ధర్మరాజు రాజసూయారంభమును దిగ్విజయంబును జరాసంధవధయును రాజబంధమోక్షంబును రాజసూయంబు నెఱవేర్చుటయును శిశుపాలవధయు నవభృథంబును రాజసూయ వైభవదర్శనాసహమానమానసుండయి సుయోధనుండు మయనిర్మిత సభామధ్యంబునఁ గట్టిన [1]పుట్టంబులు దడియ ద్రెళ్ళుటయుఁ దన్నిమిత్తపరిభవంబు నొంది రారాజు నిజపురి కరుగుటయుఁ గృష్ణుండు ధర్మరాజ ప్రార్థితుండయి యాదవుల నిలిపి కొన్నినెలలు ఖాండవప్రస్థంబున వసియించుటయు సాల్వుండు తపంబు చేసి హరుని మెప్పించి సౌభకాఖ్యంబగు విమానంబునడసి నిజసైన్యసమేతుండై ద్వారకానగరంబు నిరోధించుటయు యాదవ సాల్వ యుద్ధంబును గృష్ణుండు మరలిచనుదెంచి సాల్వుం బరిమార్చుటయును దంతవక్త్రవధయును విదూరథమరణంబును గృష్ణుండు యాదవబలసమేతుండై క్రమ్మఱ నిజపురంబునకు జనుటయుఁ గౌరవపాండవులకు యుద్ధంబగునని బలదేవుండు తీర్థయాత్ర చనుటయు నందు జాహ్నవీప్రముఖనదులం గృతస్నానుండయి నైమిశారణ్యంబునకుం జనుటయు నచ్చటి మునులు పూజింపం బూజితుండయి తత్సమీపంబున నున్నతాసనంబున నుండి సూతుండు దన్నుంగని లేవకున్న నలిగి రాముండు [2]కుశాగ్రంబున నతని వధించుటయు బ్రహ్మహత్యాదోషంబు గలిగెనని మునులు పలికిన సూతుం బునర్జీవితుం జేయుటయు నమ్మునులకుం బ్రియంబుగాఁ గామపాలుం డిల్వలసుతుండగు పల్వలుం బరిమార్చుటయు వారిచేత ననుమతుండయి హలధరుండు తత్సమీప తీర్థంబుల స్నాతుండయి గంగాసాగర సంగమంబునకుం జనుటయు మహేంద్రనగప్రవేశంబును బరశురామ దర్శనంబును సప్తగోదావరిం [3]గ్రుంకుటయు మఱియు మధ్యదేశంబునంగల

1. పుట్టంబులు = వస్త్రములు. 2. కుశాగ్రంబున = దర్భచివరభాగముచే
3 క్రుంకుటయు = స్నానముచేయుటయు.

తీర్థంబులాడి శ్రీశైల వేంకటాచలంబులు దర్శించుటయు సముద్ర
కన్యాదుర్గాదేవుల నుపాసించుటయు సద్బ్రాహ్మణజనంబువలనఁ
బాండవ ధార్తరాష్ట్ర భండనంబున సకల రాజలోకంబును మృతి
నొందిరని వినుటయు వాయునందన సుయోధనులు గదాయుద్ధ
సన్నద్ధులగుట విని వారిని వారించుటకై రౌహిణేయుం డచ్చట
కరుగుటయు నచట వారిచేఁ బూజితుండయి వారి నివారింపలేక
మగిడి ద్వారక కరుగుటయుఁ గొన్నివాసరంబులకు మరల నైమి
శారణ్యంబునకుఁ బోయి యచట యజ్ఞంబుచేసి రేవతియుం దానును
నవభృథం బాడి నిజపురంబున కేతెంచుటయుఁ గుచేలోపాఖ్యానం
బును సూర్యోపరాగంబునం గృష్ణుండు రామునితోఁ జేరి పురరక్ష
ణంబునకుఁ బ్రద్యుమ్నాది కుమారుల నిలిపి షోడశ [1]సహస్రాంగనా
పరివృతుండయి యక్రూర వసుదేవోగ్రసేనాది యాదవ వీరులు
తోడ రా శమంతపంచక తీర్థంబున కరిగి కృతస్నానుండయి నచ్చి
యించి యుండుటయుఁ బాండవ కౌరవాది సకల రాజలోకంబును
దత్తీర్థంబునకు వచ్చుటయుఁ గుంతీదేవి దుఃఖంబును నందయశోదా
సహితులైన గోపగోపికా జనంబులు చనుదెంచుటయుఁ గుశల
ప్రశ్నాది సంభాషణంబులును మద్రకన్యా ద్రౌపదీసంభాషణంబును
సకల రాజలోకంబును శమంతపంచక తీర్థంబున స్నాతులై రామ
కృష్ణాది యాదవవీరుల నామంత్రణంబుచేసి నిజ నగరంబులకుం
బోవుటయుఁ గృష్ణుని దర్శించుటకు మునీంద్రు లేతెంచుటయు వారి
యనుమతిని వసుదేవుండు యాగంబు నెఱవేర్చుటయు నంద యశో
దాది గోపికా [2]నివహంబుల నిజపురంబున కనిచి యుగ్రసేనాది
యాదవ వీరులుం దానును మాధవుండు పురప్రవేశంబు సేయుటయుఁ
దొల్లి కంసునిచేత హతులై బలిపురంబున నున్న దేవకీదేవి సుతుల
రామకృష్ణులు యోగమాయా బలంబునఁ దెచ్చి యామె కిచ్చు
టయు నర్జునుండు సుభద్రను వివాహంబగుటయుఁ గృష్ణుండు
మిథిలానగరంబున కరుగుటయు శ్రుతదేవ జనకుల చరిత్రంబును

1. సహస్రాంగనా = వేయిస్త్రీలతో. 2. నివహంబులన్ = సమూహములను.

సంపూర్ణము

ఓం తత్సత్ బ్రహ్మార్పణమస్తు.

శ్రీ ర స్తు

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## ఏ కా ద శ స్కం ధ ము

శ్రీ సీతాపతి లంకే
శాసుర సంహారచతుర శాశ్వతనుత వా
ణీసత్యధిభూ భవ వృ
త్రాసురరిపు దేవజాల రామనృపాలా. 1

వ. [1]మహనీయ గుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె, నట్లు [2]ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునిం గని శుకయోగీంద్రుం డయ్యా జన్మకర్మ వ్యాధివిమోచనంబునకుం గారణంబగు దివ్యౌషధంబు గావున శ్రీమన్నారాయణకథామృతంబుఁ గ్రోలుమని యిట్లనియె. 2

మ. బలవత్సైన్యముతోడఁ గృష్ణుఁడు మహాబాహాబలోపేతుఁడై
కలనన్ రాక్షసవీరవర్యుల నడంకన్ ఖండించి భూభార ము
జ్జ్వలమై యుండఁగ [3]ద్యూతకేళికతనం జావంగఁ గౌరవ్య స
ద్బలముం బాండవసైన్యమున్నడఁచె భూభాగంబు గంపింపఁగన్.

వ. అంత. 4

క. మునివరులు సంతసిల్లిరి
[4]యనయము నందాదులకును హర్షంబయ్యెం
దననిజభక్తులు యాదవ
ఘనవీరసమూహ మప్పుడు గడు నొప్పెసఁగెన్. 5

1. మహనీ.....గరిష్ఠులు = గొప్ప గుణములచే నధికులు. 2. ప్రాయో....విష్టుఁడు = మృతికై సిద్ధపడి యన్నపానాదుల వర్జించియున్నవాఁడు. 3. ద్యూతకేళి కలనన్ = జూదమాడిన కారణమున. 4. అనయము = ఎక్కువ.

మ. విదితుండై సకలామరుల్ గొలువ నుర్వీభారముల్ మాన్పి [1]దు
ర్మదసంయుక్త వసుంధరాధిపతులన్ మర్దించి కంసాదులం
దుదిముట్టన్ వధియించి కృష్ణుఁడతి సంతుష్టాత్ముఁడై యున్నచో
యదుసైన్యంబులు భూమి మోవఁగ [2]నసహ్యంబయ్యె నత్యుగ్రమై.

సీ. ఈరీతి శ్రీకృష్ణుఁ డేపారఁ బూతనా
శకట తృణావర్త సాల్వ వత్స
చాణూర ముష్టిక ధేను ప్రలంబక
దైత్యౌఘ శిశుపాల దంతవక్త్ర
కంస పౌండ్రాదిక ఖండనం బొనరించి
యటమీఁదఁ గురుబలం బడఁచి మఱియు
ధర్మజు నభిషిక్తుఁ దనరఁగాఁ జేసిన
నతఁడు భూపాలనం బమరఁ జేసె

తే. భక్తులగు యాదవేంద్రులఁ బరగఁ జూచి
[3]యన్యపరిభవ మెఱుఁగ రీ యదువు లనుచు
వీరిఁ బరిమార్ప నేఁదక్క వేఱొకండు
దైవ మిఁక లేఁడు త్రిభువనాంతరమునందు. 7

వ. అని వితర్కించి జగదీశ్వరుం డత్యున్నత [4]వేణుకాననంబు వాయు
వశంబున నొరసికొని యనలం బుద్భవంబయి దహించు చందంబున
యదుబలంబుల [5]కన్యోన్య వైరానుబంధంబులు కల్పించి హతం
బొనర్చెదనని విప్రశాపంబు మూలకారణంబుగాఁ గలంచి యదు
బలంబుల నడంచెనని పలికిన మునివరునకు రాజేంద్రుఁ డిట్లనియె. 8

క. హరి పాదకమల సేవా
పరులగు యాదవుల కిట్లు బ్రాహ్మణ [6]శాప
స్ఫురణం బేటికిఁ జెందెనొ
యరయఁగ సంయమివరేణ్య యానతియీవే. 9

---

1. దుర్మద...పతులన్ = దుష్టగర్వముగల రాజులను 2. అసహ్యంబు = ఓర్వశక్యము కానిది. 3 అన్యపరిభవము = ఇతరులవలన నవమానము. 4. వేణుకాననంబు = వెదురుగొట్లయడవి. 5. అన్యో......బంధంబులు = ఒకరిలో నొకరికి విరోధభావములు. 6. శాపస్ఫురణము = శాపోదయము.

క. అనిన జనపాలునకు ని
ట్లని సంయమికులవరేణ్యుఁ డతి మోదముతో
విను మని చెప్పఁగఁ దొడఁగెను
[1]ఘనతర గంభీర వాక్ప్రకాశస్ఫురణన్. 10

—♦ విశ్వామిత్ర వసిష్ఠ నారదాది మహర్షులు శ్రీకృష్ణదర్శనంబునకు వచ్చుట ♦—

వ. నిరుపమ సుందరంబయిన శరీరంబు ధరియించి సమస్త కర్మతత్పరుండై పరమేశ్వరుండు యదువృల నడఁగింపఁ దలంచుసమయంబున జటా[2]వల్కల కమండలు ధారులును రుద్రాక్ష [3]భూతి భూషణ ముద్రాముద్రితులును [4]కృష్ణాజినాంబరులును నగువిశ్వామిత్రాసిత దుర్వాసో భృగ్వంగిరః కశ్యప వామదేవ వాలఖిల్యాత్రి వసిష్ఠ నారదాది మునివరులు స్వేచ్ఛావిహారంబున ద్వారకానగరంబున కరుగుదెంచి యందు. 11

సీ. ఘనుని శ్రీకృష్ణునిఁ గౌస్తుభాభరణునిఁ
గర్ణ కుండలయుగ్మ ఘనకపోలుఁ
బుండరీకాక్షు నంభోధరశ్యామునిఁ
గలిత నానారత్న ఘన కిరీటు
నాజానుబాహు నిర్గత్న్యాయుధహస్తు
[5]శ్రీకర పీతకౌశేయవాసు
[6]రుక్మిణీనయన సరోజ దివాకరు
బ్రహ్మాది సురసేవ్య పాదపద్ము

తే. దుష్టనిగ్రహ శిష్ట సంతోషకరణు
గోటిమన్మథ లావణ్య కోమలాంగు
నార్తజన రక్షణైక విఖ్యాతచరితుఁ
గనిరి కరుణాసముద్రుని ఘనులు మునులు. 12

---

1. ఘన......రణన్=మిక్కిలి గొప్పవి, విశేషభావముకలవి యగు మాటల యొక్క ప్రకటనాతిశయముతో. 2. వల్కలము=నారబట్ట 3. భూతి=విభూతి. 4. కృష్ణ+అజిన+అంబరులు=లేడిచర్మములే వస్త్రములుగాఁగలవారు. 5. శ్రీకర ..వాసు=అందముఁగూర్చు పచ్చని పట్టువస్త్రము గలవానిని. 6. రుక్మి......కరు=రుక్మిణీదేవి కన్నులనెడి తామరలకు సూర్యుఁడైనవానిని.

క. వచ్చిన ముని సంఘములను
విచ్చలవిడి నర్ఘ్యపాద్య । విధు లొనరింపన్
మెచ్చుగ కనక సనముల
నచ్చుగఁ గూర్చుండి వనరు । హాక్షునితోడన్. 13

క. జనములు నిను సేవింపని
దినములు వ్యర్థంబు లగుచుఁ । దిరుగుచు నుండున్
దనువులు నిలుకడ గావఁట
వనములలో నున్న నైన । వనరుహనాభా. 14

క. [1]తరణంబులు భవజలధికి । హరణంబులు దురితలతల । కాగమముల కా
భరణంబు లార్తజనులకు । శరణంబులు నీదు దివ్య । చరణంబు లిలన్.

మత్త. ఒక్కవేళను సూక్ష్మరూపము । నొందుదీవణుమాత్ర మై
యొక్కవేళను స్థూలరూపము । నొందుదంతయు నీవ యై
పెక్కురూపులు దాల్చు నీదగు । పెంపు మాకు నుతింపగా
నక్కజం బగు చున్నదే మన । నంబుజాక్ష రమాపతీ. 16

క. శ్రీనాయక నీనామము । [2]నానాభవరోగకర్మ । నాశమునకు వి
న్నాణంబగు నౌషధమిది । కానరు దుష్టాత్ములకట । కంజదళాక్షా.

వ. అని యనేక విధంబులం బ్రస్తుతించిన మునివరులం గరుణాకటాక్ష వీక్షణంబుల నిరీక్షించి పుండరీకాక్షుం డిట్లనియె. మదీయ ధ్యాన నామస్మరణంబులు భవరోగ హరణంబులును బ్రహ్మ రుద్రాదిక [3]శరణంబులును మంగళకరణంబులు నగు ననియును నారూపంబులైన మేదినీసురుల పరితాపంబులఁ బరిహరించు పురుషుల నైశ్వర్య సమేతులంగాఁ జేయుదు ననియును [4]యోగీశ్వరేశ్వరుం డయిన యీశ్వరుం డానతిచ్చి యనంతరంబ మీరిలిచ్చటికి వచ్చిన ప్రయోజనం బేమి యనిన వారలు భవదీయ పాదారవింద సందర్శనార్థంబు కంటె మిక్కిలి విశేషం బొండెద్దియని వాసుదేవ వదన చంద్రా

1. తరణంబులు = దాటించునవి. 2. నానా.. నాశమునకు = పెక్కు జన్మములనెడి రోగములయొక్కయు, కర్మములయొక్కయు నాశనమునకు. 3. శరణంబులు = రక్షించునవి. 4. యోగి+ఈశ్వర+ఈశ్వరుడు = యోగిశ్రేష్ఠులలో గొప్పవాడు.

మృతంబు నిజ నేత్రచకోరంబులం గ్రోలి యథేచ్ఛావిహారులై ద్వారకానగరంబున కనతి దూరంబున నుండు పిండారకం బను నొక్క పుణ్యతీర్థంబున కరిగి రంత.

క. దర్పించియాదవులుతమనేర్పునసాంబునిఁ బిలిచి ॥ నెలఁతుకరూపం
బేర్పడశృంగారించియుఁగర్పూరసుగంధిపోల్కి ॥ గావించియొగిన్.

ఉ. మూఁకలు గూడి యాదవులు ॥ ముందటఁ బెట్టుక యాచె నవ్వుచుం
[1]బోకల బోవుచున్ మునిస॥మూహముకొయ్యన నేఁగి మ్రొక్కుచుం
బ్రాకటమైన యీ సుదతి ॥ భారపుగర్భమునందుఁ బుత్త్రుఁడో
యేకతమందు బాలికయొ ॥ యేర్పడఁ జెప్పుఁ డటన్న నుగ్రులై. 20

క. యదు[2]డింభకులను గనుఁగొని
మదయుతులై వచ్చి రనుచు ॥ మదిలో రోషం
బొదవఁ గనుఁగొనల నిప్పులు
సెదరఁగ హాస్యంబు చనునె ॥ చేయఁగ ననుచున్. 21

క. [3]వాలాయము యదుకులనిర్మూలకరం బైనయట్టి ॥ [4]ముసలం బొకటీ
బాలికకుదయించు నం బొం డాలస్యము లేదటంచు ॥ నటబల్కుటయున్

వ. మదోద్రేకులైన యాదవ బాలకులు మునిశాప భీతులై వడ వడ వడంకుచు [5]సాంబుని కుక్షినిక్షిప్తచేలగ్రంథి విమోచనంబు సేయు సమయంబున ముసలంబొక్కటి భూతల పతితం బయిన విస్మయంబు నొంది దానిం గొని చని దేవకీనందను సన్నిధానంబునం బెట్టి యెఱిగించిన నతం [6]డాత్మకల్పిత మాయారూపం బగుట యెఱింగియు నెఱుంగని తెఱంగున వారలం జూచి యిట్లనియె. 23

క. [7]మదినుండి కన్నగానక
మదయుతులై మునులఁ గని ॥ యాటలఁ [8]జెనయం

1. పోకలఁబోవుచున్ = పెక్కు విధముల వర్తించుచు. 2. డింభకులు = బాలురు. 3. వాలాయము = మిక్కిలి. 4. ముసలంబు = రోఁకలి. 5. సాంబుని... నంబు = సాంబునకుఁ గడుపుగా నుంచఁబడిన గుడ్డలమూటను విప్పుట. 6. ఆత్మకల్పి...పంబు = తనచేఁ గల్పింపఁబడిన మాయారూపముగలది. 7. (ప్రా)మదిసెడి కన్నులు గానక. 8. చెనయన్ = ఎదిరింపఁగా.

కడసి కులక్షయ కారణ
విదితంబగు శాప మొందు ♦ వెజ్జులు గలరే. 24

క. ధరణీసుర శాపమునకు
హరిహర బ్రహ్మాదులైన ♦ నడ్డము గలరే
నరు లనఁగ నెంతవారలు
గర మరుదుగఁ బూర్వజన్మ ♦ కర్మముఁ ద్రోవన్. 25

వ. అది గావున యతినిందాకరత్వంబున యదువంశ నాశంబగు సందియంబు లే దని పరమేశ్వరుండు వారలం జూచి సముద్రతీరంబున నొక్క [1]మహాపర్వతం బున్నయది యందు నుండు నత్యుచ్ఛ్రియ విశాల భీషణం బగు పాషాణంబున మీ భుజాబలంబు చేత నీ ముసలంబు దివిచి దీని చూర్ణంబు [2]సింధు కబంధంబులఁ గలపి రండు పొండని జగద్విభుండైన కృష్ణుం డానతిచ్చిన వారు నట్లచేసి తత్కీలితంబయిన లోహఖండంబును సరకుగొనక సాగరంబునఁ బడవైచిన నొక్క [3]ఝషంబు గ్రసించిన దాని నొక్క [4]లుబ్ధకుండు [5]జాలమార్గంబునఁ బట్టుకొని తదుదరగతం బయిన లోహఖండంబుఁ దెచ్చి బాణాగ్రంబున ముల్కిగా నొనర్చెనని తత్కథావృత్తాంతంబు సెప్పిన [6]బాదరాయణిఁ గనుంగొని రాజేంద్రుం డిట్లనియె. 26

క. చిత్తం బే క్రియ నిలుచుం । [7]జిత్తజగురు పాదపద్మ ♦ సేవ సదా య
త్యుత్తమమని వసుదేవుఁడు । చిత్తముఁ దగనిల్పె యెట్లు ♦ చెందె మునీంద్రా

వ. అని యడిగిన రాజునకు శుకుం డిట్లనియె.

—♦ వసుదేవునకు నారదుండు పురాతనంబగు విదేహార్షభసంవాదంబుఁ దెలుపుట ♦—

క. వినుము నృపాలక చెప్పెద
ఘనమై విలసిల్లు పూర్వ ♦ కథగల దదియున్

1. మహాపర్వ... దివిచి (పాఠా). మహాశిలయున్న దీముసలంబు మీ భుజాబలంబున దానిమీఁదం దివిచి. 2. సింధుకబంధంబు = సముద్రజలములు. 3. ఝషము = చేఁప. 4. లుబ్ధకుఁడు = బోయవాఁడు. 5. జాలమార్గంబున = వలమూలమున. 6. బాదరాయణి = బాదరాయణుని కొడుకు (శుకుఁడు). 7. చిత్తజగురుఁడు = మన్మథుని తండ్రి (విష్ణువు).

మును ద్వారక కేతెంచియు
నొనరఁగ నారదుఁడు కృష్ణు నొయ్యనఁ గాంచెన్. 29

వ. ఇట్లు దేవముని కృష్ణసందర్శనార్థం బరుగ దెంచి [1]తద్గృహాభ్యంతరంబున కరిగిన వసుదేవుం డమ్మునీంద్రుని నర్ఘ్యపాద్యాది విధులం బూజించి కనకాసనాసీనుం గావించి యుచితకథా వినోదంబులం బ్రొద్దు పుచ్చుచు నిట్లనియె నే నరుంతు నారాయణ చరణ సరసీరుహ భజన పరాయణత్వంబు నిరంతరంబు నొందం బుట్టినవారికి మృత్యువు సన్నిహితంబై యుండు నీ సందర్శనంబునం గృతార్థుండనైతి నచ్యుతానంత గోవిందాది నామస్మరణైకాగ్రచిత్తులైన మీవంటి పుణ్యపురుషుల సమాగమంబున లోకులు సుఖాశ్రయులయి యుండుదురు దేవతా భజనంబు సేయువారికి గీర్వాణులు ననుగ్రహింతు రట్లు సజ్జనులును దీనవత్సలులు నగువారలు పూజనాది క్రియలచే నా దేవతలను భక్తిసేయుదురు గావున శ్రీమహాభాగవత కథా సమూహంబులం గలధర్మంబు లడిగెద నేయే ధర్మంబులు శ్రవణ సుఖంబులుగా వినిన [2]దండధర కింకర తాడనంబులం బడక ముకుంద చరణారవింద వందనాభిలాషులయి పరమపద ప్రాప్తులగుదురా ధర్మంబు లానతిమ్ము తొల్లి గోవిందునిం బుత్రుంగాఁ గోరి ముక్తిమార్గం బెఱుంగ లేక దేవతా మాయం జేసి చిక్కి చిత్తవ్యసనాంధకారంబగు సంసారంబునం దగులువడి యున్నవాఁడ హరికథామృతంబు వెల్లిగొల్పు మట్టయిన సుఖంబు గలుగు ననిన వసుదేవకృత ప్రశ్నుండైన నారదుండు వాసుదేవ కథాప్రసంగసల్లాప హర్ష సమేతుండై సంతసంబంద నిట్లనియె. 30

క. నను నీవు సేయు ప్రశ్నము । జనసన్నుత వేదశాస్త్ర సారాంశంబై
ఘనమగు హరిగుణకథనము । వినుమని వినిపింపఁ దొడఁగె వేడ్క దలిర్పన్.

క. అతిపాపకర్ములైనను । సతతము నారాయణాఖ్య శబ్దము మదిలో
వితతంబుగ వర్ణించిన । చతురులఁ గొనియాడఁగ మఱి సంభవు వశమే.

వ. అట్లు గావున పరమేశ్వర భక్తిజనకంబై కైవల్యపద ప్రాప్తికరంబయి

1. తద్గృహా...రంబునకు = అతని యింటిలోపలి ప్రదేశమునకు. 2. దండధర తాడనంబులు = యమభటులచే దెబ్బలు.

యొప్పుచున్న విదేహర్షభ సంవాదంబునం బరగు నొక్క పురాతన పుణ్యకథావిశేషం బెఱింగించెద; [1]సావధాన మనస్కుండవై యాకర్ణింపుము యిట్లనియె. 33

తే. వినుము స్వాయంభువుం డను వి మనువునకును
రమణ నుదయించె నట ప్రియవ్రతుం డనంగఁ
దనయుఁ డాతని కాగ్నీధ్రుఁ డనఁగ సుతుఁడు
జాతుఁ డయ్యెను భువన విఖ్యాతుఁ డగుచు. 34

వ. ఆయాగ్నీధ్రునకు నాభి యను ప్రాజ్ఞుం డగు తనూభవుం డుదయించి బలిచక్రవర్తితో మైత్రంజేసి ధారుణీభారంబు పూని యాజ్ఞా పరిపాలనంబున నహిత రాజన్య రాజ్యంబులు స్వవశంబులు గావించుకొని యుండె; నంత నా నాభికి సత్పుత్త్రుం డయి ఋషభుండు పుట్టి యతండు హరిదాసుండై సుతశతకంబుఁ బడసె; నందగ్రజుం డయిన భరతుండను మహానుభావుండు నారాయణ పరాయణుండై యిహలోక సుఖంబులం బరిహరించి ఘోరతపం బాచరించి [2](జన్మత్రితయంబున [3]నిర్వాణ సుఖ పారవశ్యంబున) సకలబంధ విముక్తుండై వాసుదేవ పదంబు నొందె; నాతని పేర నతి వెలసిన భూఖండంబు భారత వర్షంబను వ్యవహారంబున నెగడ జగంబులఁ బ్రసిద్ధం బయ్యె. మఱియు నందుఁ దొమ్మండ్రు కుమారులు బల పరాక్రమ ప్రభావ రూప సంపన్నులయి నవఖండంబులకు నధిపతులైరి. వెండియు వారిలలో నెనుబదియొక్కండ్రు కుమారులు సత్కర్మానుష్ఠాన పరతంత్రులై విప్రత్వం బంగీకరించి రందుఁ గొందఱు శేషించినవారలు కవి హర్యంతరిక్ష ప్రబుద్ధ పిప్పలాయ నావిర్హోత్ర ద్రమిళ చమస కరభాజను లనం బరఁగు తొమ్మండ్రూర్ధ్వరేతస్కులయి బ్రహ్మవిద్యా విశారదులగుచు జగత్త్రయంబును బరమాత్మస్వరూపంబుగాఁ దెలియుచు ముక్తులై [4]యవ్యాహతగమను

1. స + అవధాన + మనస్కుఁడు = శ్రద్ధతోఁ గూడిన మనస్సు కలవాఁడు
2. నిర్వా...శ్యంబున = మోక్షసుఖము చేతనైన పరవశత్వము చేత. 3. (పాఠా) సకలంబును బరమాత్మాధిష్ఠితంబుగఁ దెలియుచు. 4. అవ్యాహతగమనులు = అడ్డులేని సంచారము కలవారు.

లగుచు సురసిద్ధ సాధ్య యక్ష గంధర్వ కిన్నర కింపురుష నాగ లోకంబులందు స్వేచ్ఛా విహారంబు సేయుచు నొక్కనాఁడు. 35

క. జగదేకనాథు గుణములు
మిగులఁగ సంస్మరణతోడ విరాజిత భక్తిన్
బగలును రాత్రియు సంధ్యలుఁ
దగిలి జితేంద్రియులు నైన తాపసులు ధాత్రిన్. 36

క. ఊహింపఁ బుణ్యుఁడైన వి
దేహుని యజ్ఞాంతమందు నేతెంచినచో
[1]గేహము వెడలి యెదుర్కొని
మోహవివర్జితులఁ బుణ్యమునిసంఘములన్. 37

తే. అర్ఘ్యపాద్యాది [2]విధులను నర్థితోడఁ
బూజ గావించి వారలఁ బొలుపు మిగుల
నుచిత పీఠంబు లందుల నునిచి యెలమి
నవ మునిశ్రేష్ఠులను భూమినాయకుండు. 38

క. వారల కిట్లను మీరలు । గారవమున విష్ణుమూర్తులై కొనిన మహా
భూరితపోధనవర్యులు । సారవిహీనంబులైన సంసారములన్. 39

క. ఏరీతిఁ గడపనేర్తురు । క్రూరులు బహుదుఃఖరోగ కుత్సితబుద్ధుల్
నీరసులు నరులుగావున । నారయ సుజ్ఞానబుద్ధి నానతి యీరే. 40

—◆ ఋషభకుమారుఁ డగు కవి విదేహునకుఁ జేయు పరమార్థోపదేశము ◆—

వ. మఱియు సకలజంతుసంతానంబుకంటె మానుషాకారంబు నొందుట దుర్లభం బంతకంటె నారాయణ చరణ యుగళ స్మరణ పరాయణు లగుట దుష్కరంబు గావున [4]నాత్యంతికం బగు క్షేమం బడుగ వలసెఁ, బరమేశ్వరుండు [5]ప్రపత్తినిష్ఠులకు [6]సారూప్యం బెట్లొసంగు నత్తెఱం గానతిం డనిన విని విదేహ భూపాలునకు హరికథామృత పానాతిపరవశు లైన మునిసమాజంబునందుఁ గవి యను మహాను

1. గేహము=గృహము. 2. విధులు=కృత్యములు. 3 అర్థితోడన్=ప్రీతితో.
4. ఆత్యంతికంబు=అత్యుత్తమము (పాఠా) "ఆధ్యాత్మికస్వరూపంబు" 5. ప్రపత్తి= నీవే తప్ప వేరు దిక్కు లేదనెడి భావము (శరణాగతి.) 6. (పాఠా) "సామీప్యంబు"

భావుం డిట్లని చెప్పం దొడంగె, [1]నరిషడ్వర్గంబునందు [2]నీషణత్రయంబుచేతం దగులువడి మాత్సర్యయుక్త చిత్తుండగు నట్టివాని కెవ్విధంబున నచ్యుత పాదారవింద భజనంబు సంభవించు విశ్వంబును నాత్మయు వేఱుగా భావించువారికి భీరుత్వం బెట్లు లే దవిద్యాంధకార మగ్నులకు హరిచింతనం బెట్లు సిద్ధించు నట్టి నరుండు తా నంటికళేబరంబు విడిచి పరతత్త్వం బెబ్భంగిం జేరు ముకుళీకృతనేత్రుండయిననరుండు మార్గభ్రమణంబునం దొట్రుపాటు వడి చనుచందంబున విజ్ఞానవిమలహృదయభక్తి భావనావశంబు లేకున్నం బరమపదంబు వీ రెవ్విధంబునం గలుగునని యడిగితివి గావునం జెప్పెద నావధానుండవై యాకర్ణింపుము. 41

క. [3]కరణత్రయంబుచేతను
నరుఁ డేకర్మంబు సేయు నయ్యైవేళన్
హరి కర్పణ మని పలుకుట
పరువడి సుజ్ఞాన మండ్రు పరమమునీంద్రుల్. 42

వ. జ్ఞానాజ్ఞానంబులందు [4]సంకలితుం డైన స్మృతివిపర్యయంబు నొందు నట్లు గావున [5]గురుదేవతాత్మకుండయి బుద్ధిమంతుం డైన మర్త్యుండు శ్రీవల్లభు నుత్తమోత్తముంగాఁ జిత్తంబునఁ జేర్చి సేవింపవలయు, స్వప్నమనోరథేచ్ఛాభిలాషలయందు సర్వసంకల్పనాశం బగుటం జేసి వానిఁ గుదియంబట్టి నిరంతరహరిధ్యానపరుం డైనవానికిం గైవల్యంబు సులభంబుగఁ గరతలామలకంబై యుండు. 43

సీ. సంతతంబును గృష్ణు సంకీర్తనంబులు
వీనుల కింపుగా వినఁగవలయు
హర్షంబుతోడుత హరినామకథనంబు
పాటలనాటలఁ బరఁగవలయు
నారాయణునిదివ్య నామాక్షరంబులు
హృద్వీథి సతతంబు నెన్నవలయుఁ

---

1. అరిషడ్వర్గము = కామక్రోధాదులు. 2. ఈషణత్రయము = దారేషణము, ధనేషణము, పుత్రేషణము. 3. కరణత్రయము = మనోవాక్కాయములు. 4. సంకలితుండు=కూడియున్నవాఁడు. 5. గురు...కుండు = గురుదేవతయను బుద్ధికలవాఁడు.

కంజాక్షులీలలు ॥ కాంతారములనైన
భక్తియుక్తంబుగాఁ ॥ బాడవలయు

తే. వెఱ్ఱిమాడ్కిని లీలతో ॥ విశ్వమయుని
నోడఁపుచును లోకబాహ్యత ॥ నొందవలయు
నింతయును విష్ణుమయ మని ॥ యెఱుఁగవలయు
భేద మొనరింపవలవదు ॥ మేదినీశ. 44

—♦ ఋషభకుమారులగు హరియు నంతరిక్షుండును సేసెడు భాగవతస్వరూపోపదేశము ♦—

వ. అనిన విదేహభూపాలుండు భాగవతధర్మం బెద్ది యేప్రకారంబునం బ్రవర్తించు వారలచిహ్నంబు లెవ్వియంతయు నెఱిఁగింప నీవయర్హుఁడవనిన నందు హరియను మహాత్ముం డిట్లనియె. 45

తే. సర్వభూతమయుండైన ॥ సరసిజాక్షుఁ
డతఁడె తన యాత్మయం దుండు ॥ ననెడువాఁడు
శంఖచక్రధరుండగు ॥ సాధుజనుఁడు
భక్తిభావాభిరతుఁడు వో ॥ భాగవతుఁడు. 46

క. వర్ణాశ్రమధర్మంబుల । నిర్ణయకర్మములఁ జెందక ॥ నిఖిలజగత్సం
పూర్ణుఁడు హరియనునాతఁడె । వర్ణింపఁగ భాగవతుఁడు ॥ వసుధాధీశా.

వ. ఇట్లు సర్వసంగపరిత్యక్తుండై నిఖిలాంతరాత్ముండైన పరమేశ్వరుండు [1]అరుణగభస్తి కిరణసహస్రంబుల లోకత్రయంబుం బావనంబు సేయు చందంబునం దన చరణారవింద రజఃపుంజంబుచేతం బవిత్రంబు సేయుచు సురాసుర జేగీయమాన సేవ్యుండైన జనార్దన పాదారవిందంబులకు వందనాభిలాషుఁడై భక్తియులవమాత్రంబునుం జలింపనీక [2]సుధాకరోదయంబున [3]దివాకరజనిత తాప నివారణం బయినభంగి [4]నారాయణాంఘ్రినఖమణిచంద్రికానిరస్త హృదయతాపుండై యాత్మీయ [5]భక్తిరశనానుబంధబంధురంబైన

1. అరుణగభస్తి = ఎఱ్ఱని కిరణములు కలవాఁడు (సూర్యుఁడు). 2. సుధాకరోదయంబునన్ = చంద్రోదయంబుచేత. 3. దివాకరజనితతాప వారణంబు = సూర్యుని కిరణములచేఁ బొడమిన వెట్టయొక్క నివృత్తి. 4. నారా...పుండై = విష్ణుపాదములయొక్క మణులబోలు గోళ్ళకాంతులచేఁ బోఁగొట్టఁబడిన మనస్తాపము కలవాఁడై. 5. భక్తి...రంబు = భక్తియను త్రాటికట్టుచే దట్టమైనది.

వాసుదేవచరణసరోరుహధ్యానానందపరవశుండగు నతండు భాగవత
ప్రధానుండని యెఱింగించిన విని విదేహుం డిట్లనియె.

క. గజరాజవరదుగుణములు | త్రిజగత్పావనములగుటఁ జేటపడంగా
సుజనమనోరంజకముగ | విజితేంద్రియ వినఁగ నాకు వేడుక పుట్టెన్.

వ. అనిన విని యంతరిక్షుండను ఋషిశ్రేష్ఠుం డిట్లనియె. 50

క. పరమబ్రహ్మ మనంగాఁ
బరతత్త్వమనంగఁ బరమపద మనఁగను నీ
శ్వరుఁడనఁ గృష్ణుఁడన జగ
ద్భరితుఁడు నారాయణుండు దా వెలుఁగొందున్.

వ. అవ్యక్తనిర్గుణపరబ్రహ్మమునందుఁ దనకు [1]విపర్యయంబుగా జననం బయి జ్ఞానంబె విష్ణుమాయ యనంబడుఁ, బరమేశ్వరుండట్టి మాయచేత జగంబు నిర్మించి నిశ్చింతుండై యుండు, నింద్రియమార్గభ్రమణంబు సేసెడు దుర్మతులకు సుషుప్త్యవస్థలు వాసన గలుగుటం జేసి పరమేశ్వరుని నొందరామి యను నొలుగవ యవస్థయుఁ గలుగు, స్వప్నంబునందు [2]గ్రాహ్యగ్రాహకగ్రాహిత్వంబులను త్రివిధభేదంబులుం గలిగియుండు నీచందంబున నవిద్యాంధకారసంవృతంబై మూఁడు విధంబులఁ బ్రవర్తించు మనోరథంబు స్వప్నావస్థయం దిఱిఁగిన క్రియఁ ద్రివిధంబగు మాయయు నాత్మయందు లీనంబగుఁ, బరమేశ్వరుండు మొదలం బృథివ్యాదిమహాభూతమయం బయిన సృష్టిఁ గలుగ జేసి యందుఁ బంచభూతాత్మకం బయిన యాత్మ నేకాదశేంద్రియంబులచేత భేదంబు పుట్టించుచు గుణంబులచేత గుణంబు లంగీకరించుచు నాత్మయందుఁ బ్రద్యోదితగుణంబులవలన గుణానుభవంబు జేయుచు నున్నవాఁడై సృష్టి నాత్మీయంబుగా భావించు దేహి కర్మమూలంబున నైమిత్తికకర్మంబుల నాచరించుచు దత్ఫలంబంగీకరించి దుఃఖైకవశుండై వర్తించుఁ, బెక్కు దుఃఖంబులం బడిన యా దేహి కర్మఫలప్రాప్తుండగుచు [3]భూతసంప్లవపర్యంతంబు పరవశుండై జన్మ

1 విపర్యయంబుగా = వ్యతిరేకముగా. 2. గ్రాహ్య...త్వంబులు = గ్రహింపదగినవి, గ్రహించునది, గ్రహించుటయనునవి. 3. భూత...తంబు = భూతములు ద్రేకించువఱకు (ప్రళయమువఱకు).

మార్గణంబులం బొరలుచుండు, నంత్యకాలం బాసన్నంబయిన ద్రవ్య గుణ స్వరూపం బగు జగంబు [1]ననాదినిధనంబగు కాలంబు ప్రకృతిం బొందించు, నటమీఁద శతసంవత్సరంబులు వర్షంబు లేమిచేత [2]నత్యుగ్ర లోకలోచను తేజంబున సకల లోకంబులు దహింపఁబడు నంత నధోలోకంబున నుండి సంకర్షణ ముఖజనితానలం బూర్ధ్వశిఖా జాలంబుల వాయుసహాయంబై దిక్కులయం దెల్లఁ బ్రవర్తించు, నటమీఁద [3]సంవర్తక వలాహకగణంబులు నూఱు [4]హాయనంబులు సలిలధారాపాతంబుగా వర్షంబు గురియు నందు [5]విరాడ్రూపంబు లీనం బగు నంత నీశ్వరుం డింధనాగ్ని చందంబున నవ్యక్తంబుఁ బ్రవేశించు తదనంతరంబ ధరణీమండలంబు వాయుహృతగంధంబై [6]కబంధరూపంబుఁ దాల్చు నా జలంబు హృతరసంబై తేజోరూపంబు నొందు నా తేజంబు తమోనిరస్తం బై వాయువం దడంగు నా గంధవహుండు స్పర్శవిరహితుం డై యాకాశంబునందు సంక్రమించు నా [7]విష్ణుపదంబును విగతశబ్దగుణంబు గలదై యాత్మయం దడంగు నింద్రియంబులును మనంబును బుద్ధియు వికారంబులతోడ నహంకారంబుఁ బ్రవేశించు నాయహంకారంబును స్వగుణయుక్తం బై పరమాత్మునిం జేరు నిట్లు త్రివర్ణాత్మకయై సర్గస్థితి లయకారిణి యగు మాయ యిట్టిది యని తత్స్వరూప మాహాత్మ్యంబులు వివరించిన నరపాలుం డిట్లనియె. 52

ఉ. జ్ఞాన విహీను లైన నరసంఘముఁ గానఁగ రాని మాయఁదా
లోన నడంచి యెట్లు హరిలోకముఁ జెందుదు రంతయుం దగన్
భూనుత సత్యవాక్యగుణభూషణ యిక్కథ వేడ్కతోడుతం
బూనికఁ జెప్పుమన్నను బ్రబుద్ధుఁడు నిట్లను గౌరవంబునన్. 53

— ♦ ఋషభకుమారులకు ప్రబుద్ధపిప్పలాహ్వయులు సెప్పెడు పరమార్థోపదేశము ♦—

వ. సూర్యోదయాస్తమయంబులం బ్రతిదినంబు నాయువు క్షీణంబు నొంద దేహకళత్రమిత్ర భ్రాతృ మమత్వ పాశబద్ధులై విడివడు

1. అనా...నంబు = ఆద్యంతములేనిది. 2. అత్యుగ్ర......తేజంబునన్ = మిక్కిలి తీక్ష్ణమైన సూర్యుని వేఁడిమిచే. 3. సంవ.....గణంబులు= ప్రళయకాలమేఘ సముదాయములు. 4. హాయనంబులు = సంవత్సరములు. 5 విరాడ్రూపంబు = పరమాత్మ. 6. కబంధరూపంబు = జలరూపము. 7. విష్ణుపదంబు = ఆకాశము.

వాసుదేవచరణసరోరుహధ్యానానందపరవశుండగునతండు భాగవత
ప్రధానుండని యెఱింగించిన విని విదేహుం డిట్లనియె.

క. గజరాజవరదు గుణములు | త్రిజగత్పావనములగుట దేటపడంగా
సుజనమనోరంజకముగ | విజితేంద్రియ వినఁగ నాకు వేడుక పుట్టెన్.

వ. అనిన విని యంతరిక్షుండను ఋషిశ్రేష్ఠుం డిట్లనియె. 50

క. పరమబ్రహ్మ మనంగాఁ
బరతత్త్వ మనంగఁ బరమపద మనఁగను నీ
శ్వరుఁడనఁ గృష్ణుఁడన జగ
ద్భరితుఁడు నారాయణుండు దా వెలుఁగొందున్.

వ. అవ్యక్తనిర్గుణపరబ్రహ్మమునందుఁ దనకు [1]విపర్యయంబుగా జననం
బయిన జ్ఞానంబె విష్ణుమాయ యనంబడుఁ, బరమేశ్వరుండట్టి మాయ
చేత జగంబు నిర్మించి నిశ్చింతుండై యుండు, నింద్రియార్థభ్రమణం
బు సేసెడు దుర్మతులకు సుషుప్త్యాద్యవస్థలు వరుసన కలుగుటంజేసి
పరమేశ్వరుని బొందరామి యను నలుగవ యవస్థయుఁ గలుగు,
స్వప్నంబునందు [2]గ్రాహ్యగ్రాహకగ్రాహిత్వంబులను త్రివిధభేదంబులుం
గలిగియుండు నీచందంబున నవిద్యాంధకారసంవృతంబై మూఁడు
విధంబులఁ బ్రవర్తించు మనోరథంబు స్వప్నావస్థయం దణంగిన
క్రియఁ ద్రివిధంబగు మాయయు నాత్మయందు లీనంబగుఁ, బరమేశ్వ
రుండు మొదలం బృథివ్యాదిమహాభూతమయం బయిన సృష్టినిగలుగ
జేసి యందుఁ బంచభూతాత్మకం బయిన యాత్మ కేకాదశేంద్రి
యంబులచేత భేదంబుపుట్టించుచు గుణంబులచేత గుణంబు లంగీక
రించుచు నాత్మయందుఁ బ్రద్యోదితగుణంబులవలన గుణానుభవంబు
జేయుచు నున్నవాఁడై సృష్టి నాత్మీయంబుగా భావించు దేహికర్మ
మూలంబున నైమిత్తికకర్మంబులనాచరించుచు దత్ఫలంబంగీకరించి
దుఃఖైకవశుండై వర్తించుఁ, బెక్కు దుఃఖంబులం బడిన యా దేహి
కర్మఫలప్రాప్తుండగుచు [3]భూతసంప్లవపర్యంతంబు పరవశుండై జన్మ

1 విపర్యయంబుగా = వ్యతిరేకముగా. 2. గ్రాహ్య...త్వంబులు = గ్రహింపదగినది, గ్రహించునది, గ్రహించుటయనునవి, 3. భూతసంప్లవంబు = భూతములుద్రేకించువఱకు (ప్రళయమువఱకు).

మార్గణంబులం బొరలుచుండు, నంత్యకాలం బాసన్నం బయిన ద్రవ్య
గుణ స్వరూపం బగు జగంబు [1]ననాదినిధనంబగు కాలంబు ప్రకృతిం
బొందించు, నటమీఁద శతవర్షంబులు వర్షంబు లేమిచేత [2]నత్యుగ్ర
లోకలోచను తేజంబున సకలలోకంబులు దహింపఁబడు నంత
నధోలోకంబున నుండి సంకర్షణ ముఖజనితానలం బూర్ధ్వశిఖా
జాలంబుల వాయుసహాయంబై దిక్కులయం దెల్లఁ బ్రవర్తించు,
నటమీఁద [3]సంవర్తక వలాహకగణంబులు నూఱు [4]హాయనంబులు
సలిలధారాపాతంబుగా వర్షంబు గురియు నందు [5]విరాడ్రూపంబు
లీనం బగు నంత నీశ్వరుం డింధనాగ్ని చందంబున నవ్యక్తంబుఁ
బ్రవేశించు తదనంతరంబ ధరణీమండలంబు వాయుహృతగంధంబై
[6]కబంధరూపంబుఁ దాల్చు నాజలంబు హృతరసంబై తేజోరూపంబు
నొందు నాతేజంబు తమోనిరస్తంబై వాయువం దడంగు నా
గంధవహుండు స్పర్శవిరహితుం డై యాకాశంబునందు సంక్ర
మించు నా [7]విష్ణుపదంబును విగతశబ్దగుణంబు గలదై యాత్మ
యం దడంగు నింద్రియంబులును మనంబును బుద్ధియు వికారంబుల
తోడ నహంకారంబుఁ బ్రవేశించు నాయహంకారంబును స్వగుణ
యుక్తం బై పరమాత్మునిం జేరు నిట్లు త్రివర్ణాత్మకయై సర్గ
స్థితి లయకారిణి యగు మాయ యిట్టిది యని తత్స్వరూప మాహా
త్మ్యంబులు వివరించిన నరపాలుం డిట్లనియె. 52

ఉ. జ్ఞాన విహీను లైన నరసంఘముఁ గానఁగ రాని మాయఁదా
లోన నడంచి యెట్లు హరిలోకముఁ జెందుదు రంత యుండగన్
భూనుత సత్యవాక్యగుణభూషణ యిక్కథ వేడ్కతోడుతం
బూనికఁ జెప్పుమన్నను బ్రబుద్ధుఁడు నిట్లను గారవంబునన్. 53

— ఋషభకుమారులగు ప్రబుద్ధపిప్పలాయనులు సెప్పెడు పరమార్థోపదేశము —

వ. సూర్యోదయాస్తమయంబులం బ్రతిదినంబు నాయువు క్షీణంబు
నొంద దేహకళత్రమిత్ర భ్రాతృ మమత్వ పాశబద్ధు లై విడివడు

1. అనా...నంబు = ఆద్యంతములేనిది. 2. అత్యుగ్ర......తేజంబునన్ = మిక్కిలి తీక్ష్ణమైన సూర్యుని వేడిమిచే. 3. సంవ......గణంబులు = ప్రళయకాలమేఘ సముదాయములు. 4. హాయనంబులు = సంవత్సరములు. 5 విరాడ్రూపంబు = పరమాత్మ. 6. కబంధరూపంబు = జలరూపము. 7. విష్ణుపదంబు = ఆకాశము.

నుపాయంబు గానక సంసారాంధకారమగ్నులయి గతాగతంబుల నెఱుంగక దివాంధంబు లగు జంతుజాలంబు భంగి జన్మజరారోగ విపత్తి మరణంబు లందియు శరీరంబ మే లనుచుఁ బ్రమోదమోహ మదిరాపానమత్తులై విషయాసక్తతం జిక్కి తమ్ముఁదా రెఱుంగక యుండి విరక్తిమార్గంబు దెలియక వర్తించు మూఢులగుజనంబుల పొంతలఁ బోవక కేవల నారాయణ భక్తిభావంబు గల సద్గురుం బ్రతిదినంబును భజియించి సాత్త్వికంబును భూతదయయును హరి కథామృతపానంబును బ్రహ్మచర్య వ్రతంబును విషయంబుల మనంబు చేరకుండుటయు సాధుసంగమంబును సజ్జన మైత్రియు వినయసంపత్తియు శుచిత్వంబును క్షమయు మౌనవ్రతంబును వేద శాస్త్రాధ్యయన తదర్థానుష్ఠానంబులును నహింసయు సుఖదుఃఖాది ద్వంద్వసహిష్ణుతయు నీశ్వరుని సర్వగతునింగా భావించుటయు [1]ముముక్షుత్వంబును జనసంగవర్జనంబును వల్కలాది ధారణంబును [2]యదృచ్ఛాలాభసంతుష్టియు వేదాంతశాస్త్రార్థజిజ్ఞాసయును దేవ తాంతరనిందావర్జనంబును [3]కరణత్రయశిక్షణంబును సత్యవాక్య తయు శమ దమాది గుణవిశిష్టత్వంబును గృహారామ క్షేత్రకళత్ర పుత్త్రవిత్తాదుల హరి కర్పణంబు సేయుటయు నితరదర్శనవర్జనంబు సేయుటయును భాగవతోత్తము ధర్మంబులని చెప్పియిట్లనియె. 54

క. హరిదాసుల మిత్రత్వము
మురరిపుకథ లెన్నికొనుచు మోదముతోడన్
భరితాశ్రుపులకితుం డై
పురుషుఁడు హరిమాయ గెల్చు భూపవరేణ్యా. 55

వ. అనిన రాజేంద్రుండు వారల కిట్లనియె, భాగవతులారా సకలలోక నాయకుండగునారాయణుండనంబరఁగిన పరమాత్ముని ప్రభావంబు వినవలతు నానతిండనినఁ బిప్పలాయనుం డిట్లనియె. 56

1. ముముక్షుత్వము = మోక్షేచ్ఛ కలిగియుండుటయు. 2. యదృచ్ఛా... సంతుష్టియు = తనంత దొరకినదానిచే తృప్తిపడుట. 3. కరణత్రయ శిక్షణంబును = మనోవాక్కాయములను నియమించుటయు.

సీ. నరవర విను జగన్నాథుని చారిత్ర
మెఱిఁగింతు నీమది కింపు మిగుల
లసదుద్భవస్థితి లయకారణంబైన
[1]దేహేంద్రియాదులఁ దిరము గాఁగఁ
జొనుపు [2]నెప్పుడు పరంజ్యోతిస్స్వరూపంబు
జ్వాలల ననలుండుఁ జననిపగిది
నింద్రియంబు నాత్మ నెనయవు శబ్దంబు
పొరయక [3]సుషిరంబుఁ బొందు సత్య

తే. మనఁగ సత్త్వరజస్తమో మయగుణంబు
మహదహంకారరూప మై మహిమ వెలయు
చేతనత్వంబు గలదేని జీవ మందు
రిదియ సదసత్స్వరూపమై యెన్నఁబడును. 57

వ. దీనికిం బైకైనది పరమాత్మగా నెఱింగి కమలసంభవాదులు నుతియింతు రట్టిపరమాత్మ స్థావరజంగమంబుల నధిష్ఠించి వృద్ధిక్షయంబులం బొందక నిమిత్తమాత్రంబునం దరులతాదులందు జీవంబు లేక తదంతరస్థుండై వర్తించు నంత సర్వేంద్రియావృతంబైన యాకారంబు నష్టంబైన మనంబునఁ బాసి శ్రుతివిరహితుండై తిరుగుచుండు నిర్మలజ్ఞానదృష్టి కలవానికి భాను ప్రభాజాలంబు తోఁచినక్రియను సుజ్ఞానవంతుండు హరిభక్తిచేత గుణకర్మార్థంబులైన చిత్తదోషంబులు భజించి భగవత్సదనంబు చేరునని విని రాజిట్లనియె. 58

—♦ ఋషభకుమారులగు నావిర్హోత్రద్రమిళులు దెలుపు పరమార్థోపదేశము ♦—

క. పురుషుం డేయేకర్మము | పరువడిఁ గావించి పుణ్యపరుఁడై మనుఁ దా
దురితములఁ దొఱఁగి మురరిపు | చరణయుగం బెట్లు చేరు సన్మునివర్యా.

వ. అనిన విని యం దావిర్హోత్రుం డిట్లనియెఁ, గర్మాకర్మవికర్మ ప్రతిపాదకంబులగు శ్రుతివాదంబులు లౌకికవర్జితంబు లట్టి యామ్నా

1. (పాఠా) దేహప్రాణంబులు. 2. ఎప్పుడు (పాఠా) వస్తువు. 3. సుషిరంబు= వాద్యవిశేషము.

యంబులు సర్వేశ్వరస్వరూపంబులుగాన విద్వాంసులు నెఱుంగ వే
ఱవి కర్మాచారంబు లనంబడు మోక్షంబు గోఱకు నారాయణ
భజనంబు పరమపావనంబు వేదోక్తంబుల నాచరింపక ఫలంబులకు
వాంఛ సేయువారలకేక జన్మాంతరంబులం బడయుదురు మోక్షంబు
నపేక్షించువాఁడు [1]విధిచోదిత మార్గంబున హరిం బూజింప వలయు
నట్టి పూజాప్రకారం బెట్టిదనినఁ బవిత్రగాత్రుండయి జనార్దనుసన్నిధిం
బూతచిత్తుండై షోడశోపచారంబులఁ జక్రధరు నారాధించి గంధ
పుష్పధూపదీప నైవేద్యంబులు సమర్పించి సాష్టాంగ దండప్రణా
మంబు లాచరించి భక్తిభావనా విశేషుండగునతండు హరిం జేరునని
చెప్పినవిని విదేహుండిట్లనియె: నీశ్వరుండే యేకర్మంబుల నాచరించె
నంతయు నెఱింగింపు మనిన ద్రమిళుం డిట్లనియె. 60

క. [2]తారకల నెన్నఁగవచ్చును। భూరేణుల లెక్కవెట్టఁగఁ బోలును ధాత్రిన్
నారాయణ గుణకథనము। లారయ వర్ణింపలేరు హరబ్రహ్మాదుల్.

వ. అట్లు గావున నాత్మసృష్టంబైన మనంబున పంచభూతనికరం బను
పురం బొనరించి యందు నిజాంశంబునం బ్రవేశించి సగుణనిష్ఠుండై
నారాయణాభిధానంబు గల ఋషీశ్వరుం డగు పరమేశ్వరుండు
వెలుఁగొందె నతని దశేంద్రియంబులచేఁ బాలితంబులైన దేహం
బులు ధరించి జగద్రక్షకత్వ సంహారకత్వాది గుణంబులు గలుగుటం
జేసి గుణనిష్ఠుండయి రజస్సత్త్వతమోగుణంబుల బ్రహ్మవిష్ణు రుద్ర
మూర్తులనం బరఁగి త్రిగుణాత్మకుం డనంబడు నారాయణాఖ్యుని
చరిత్రం బెఱింగించెద నాకర్ణింపుము. 62

క. ధర్ముండు దక్షపుత్రిక
నిర్మలమతిఁ బెండ్లియాడి నెఱిఁ బుత్త్రుని స
త్కర్ముని నారాయణఋషి
[3]నర్మిలిఁ గనె నమలు బదరికాశ్రమ మందున్. 63

తే. అట్టి నారాయణాహ్వయుండైన మౌని
బదరికాశ్రమమందు సంసార నిష్ఠఁ

1. విధిచోదిత మార్గంబున = శాస్త్రము చెప్పినచొప్పున. 2. తారలు = నక్షత్రములు. 3. ఆర్మిలిన్ = ప్రీతితో.

దపముఁ గావింప [1]బలభేది • దలఁకి మదిని
[2]మీనకేతను దివిజ కాంతినులఁ బనిచె. 64

వ. వారు నారాయణాశ్రమంబునకు నతని తపోవిఘ్నంబు సేయ వచ్చి యప్పు డవ్వనంబు సాల రసాల బిల్వ కదళీ ఖర్జూర జంబూ జంబీర చంపక పున్నాగ మందారాది వివిధవృక్ష నిబిడంబును బుష్పఫల భరిత శాఖావనమ్రతరులతా బృందంబును [3]మాధవీకుంజ మంజరీ పుంజ మకరందపానమత్త మధుకర నికర ఝుంకార రవ ముఖరిత హరిదంతరంబును గనక కమల కల్హార విలస త్సరోవిహారమాణ చక్రవాక బకక్రౌంచ మరాళదంపతీమండలమండితంబునుమృణాళ భోజనాసక్త సారసచయ [4]చంచూపుట విపాటిత కమల ముకుళ కేసర వితతప్రశస్త సరోవరంబునునై వెలయు నవ్వనంబున నిందు వదన లందంద మందగమనంబులం జెందు ఘర్మజలబిందు బృందం బులు నఖాంతంబుల నోసరించుచు డాయంజను నప్పుడు. 65

చ. మదనుని బాణజాలముల • మగ్నతఁబొందక ధైర్యవంతుఁడై
ముదితలవాఁడిచూపులకు • మోహమునొందక నిశ్చలాత్ముఁడై
హృదయమునందు నచ్యుతు రమేశు ననంతు జగన్నివాసునిన్
వదలక భక్తినిల్పికొని • వారికి నిట్లను మౌనిపెంపునన్. 66

క. జంభారిపంపునను మీ।రంభోరుహవదనలార • యరుదెంచితి రా
శుంభద్విహారవాంఛా।రంభంబునఁ దిరుగుఁడనిన • లజ్జించి వెసన్.

సీ. దేవమునీంద్ర నీ•దివ్యచారిత్రంబు
నెఱిఁగి సన్నుతిసేయ • నెవ్వఁడోపుఁ
బుత్త్రమిత్రకళత్ర • భోగాదులను మాని,
తపము కావించు స•ద్ధర్ములకును
విఘ్నముల్ చెందునే • విశ్వేశుఁ గొల్చిన
యతనికి నంతరా•యంబు గలదె

---

[1] బలభేది = ఇంద్రుఁడు. 2. మీనకేతనుఁన్ = మన్మథుని. 3. మాధవీ... తరంబును = బండిగురివింద పొదలలోని పూలగుత్తులసముదాయమందలి పూదేనె త్రాగుటచే మదించిన తుమ్మెదలగుంపు ధ్వనులచే మ్రోగింపబడిన దిక్కుల మధ్యభాగము గలదియు. 4. చంచూపుట = తొప్పలబోలు ముక్కులచే.

కామంబు క్రోధంబుఁ గల తపస్వితపంబు
[1]పల్వలోదకముల భంగిఁ గాదె

తే. నిన్ను వర్ణింప నలవియే నిర్మలాత్మ
రమణ లోఁగొను మా యపరాధ మనుచు
సన్నుతించిన నతఁడు ప్రసన్నుఁ డగుచుఁ
దనదు సామర్థ్య మెఱిఁగింపఁ దలఁచి యపుడు. 68

వ. అమ్మునీశ్వరుండు పరమాశ్చర్యనిధానంబుగా [2]నిజతనూరుహంబుల
వలనం ద్రికోటికన్యకా నివహంబుల నుద్భవింపం జేసిన గంధర్వ
విబుధ కామినీ సముదయంబులు పరమాద్భుత భయంబులు మనం
బులం బొడమ సన్నుతించి యవ్విలాసినీసమూహంబులో నూర్వశి
యనుదానిం గొని చని పాకశాసను సభాభవనంబునం బెట్టి తద్వృ
త్తాంతం బంతయు విన్నవించిన నాశ్చర్యయుక్త హృదయుండయి
[3]సునాసీరుండూరకుండె, నట్టి నారాయణమునీశ్వరు చరిత్రంబు
వినువారలు పరమకల్యాణ గుణవంతు లగుదురని చెప్పిన, 69

తే. ఋషభునకు నాత్మయోగంబు రూఢిఁ జెప్పి
యచ్యుతుఁడు భూమిభారము నడఁప నంత
సొరిది నవతారములు దాల్చి సొంపుమీఱ
రాత్రిచరులను జంపె [4]నీరసముతోడ. 70

వ. అట్టి పరమేశ్వరుని లీలాగృహీతంబులగు మత్స్య, కూర్మ, వరాహ,
నారసింహ, వామన, రామ, రఘురామ, బుద్ధ, కల్క్యాద్యవ
తారంబులు మొదలుగా ననేకంబులు గలవు. వాని నెఱింగి నుతి
యింప శేష భాషాపతులకైన నలవిగాదు. మఱియును 71

సర్వలఘుసీసము. నవ వికచ సరసిరుహ నయనయుగ నిజచరణ
గగనచర నదిజనిత నిగమవినుత
జలధిసుత కుచకలశ లలితమృగ మదరుచిర
పరిమళిత నిజహృదయ ధరణిభరణ

1. పల్వలోదకములు = చిన్న నీటిగుంటలోని జలము. 2. నిజతనూరుహంబుల వలనన్ = తన రోమములనుండి. 3. సునాశీరుండు = దేవేంద్రుఁడు. 4. ఈరసము = కోపము.

[1]ద్రుహిణముఖ సుర నికర విహితనుతి కలితగుణ
కటిఘటిత రుచిరతర కనకవసన
భుజగరిపు వరగమన రజతగిరిపతి వినుత
సతతజప రత నియమ సరణిచరిత

తే. తిమి కమఠ కిటి నృహరి ముదిత బలిని హి
తపద పరశు ధర దశ వదన విదళన
మురదమన కలి కలుష సుము దపహరణ
కరివరద ముని నర సుర గరుడ వినుత. 72

వ. ఇవ్విధంబునం బ్రవర్తిల్లిన శ్రీమన్నారాయణమూర్తి లీలా విలా
సంబు లనంతంబులుగలవు, మనోవాక్కాయ కర్మంబుల హరి
పూజనంబు సేయక విపరీతగతులం దిరుగుచుండు జడుల కెవ్విధంబున
గతిగలుగుననిన నప్పుడప్పుడమిఱేఁ డప్పరమపురుషునిం జూచి యట్టి
జనులు ముక్తినొందు నుపాయం బెట్టులంతయు నెఱింగింపుఁడనినఁ
జమసుం డిట్లనియె. 73

సీ. హరిముఖబాహూరు వరపదాబ్జములందు
వరుసఁ జతుర్వర్ణ వర్గసమితి
జనియించె నందులో సతులును శూద్రులు
హరిఁ దలంతురు కలి హాయనముల
వేదశాస్త్రపురాణ విఖ్యాతులై కర్మ
కర్తలై విప్రులు గర్వమెసఁగి
హరిభక్తి పరులను హాస్యంబు సేయుచు
[2]నిరయంబు నొందుట నిజముగాదె

తే. మృదుల పక్వాన్నభోజనములను మాని
జీవహింసకుఁ జనువానిఁ జెందు నఘము
హరి నుతింపక స్త్రీలోలుఁ డైనవాఁడు
నరకవాసుండునగుచుండు ననవరతము. 74

1. ద్రుహిణ.....కలితగుణ = బ్రహ్మ మొదలగు దేవతా సమూహములచేఁ జేయఁబడిన స్తోత్రములచేఁ బ్రకాశించు గుణములు కలవాఁడా! 2. నిరయంబు = నరకము.

వ. అట్లుగావున గృహక్షేత్ర పుత్త్రకళత్త్ర ధనధాన్యాదులందు మోహితుండయి ముక్తిమార్గంబు లప్రత్యక్షంబులని నిందించువాఁడును హరిభక్తి విరహితుండును దుర్గతింగూలుదురని మునివరుం డానతిచ్చిన విదేహుం డిట్లనియె. 75

ఆ. ఏయుగంబునందు నే రీతివర్తించు
నెట్టి రూపువాఁడు నెవ్విధమున
మను నుతింపఁబడెను ముని దేవగణముచే
విష్ణుఁ డవ్యయుండు విశ్వవిభుఁడు. 76

వ. అనిన విని యందుఁ గరభాజనుఁ డిట్లనియె ననేకావతారంబులు నానారూపంబులును బహువిధవర్ణంబులునుం గలిగి రాక్షసుల ను సంహరించి దుష్టజన నిగ్రహంబును శిష్టజన పరిపాలనంబునుం జేయుచుఁ గృతయుగంబున శుక్లవర్ణుండై చతుర్బాహుండై జటావల్కల కృష్ణాజినోత్తరీయ జపమాలికాదండకమండల ధరుండయి హరి నిర్మల తపోధ్యానానుష్ఠాన గరిష్ఠులైన పురుషశ్రేష్ఠుల చేత హంసుండు సువర్ణుఁడు వైకుంఠుండు ధర్ముం డమలుండు యోగీశ్వరుం డీశ్వరుండు పురుషుం డవ్యక్తుండు పరమాత్ముండను దివ్యనామంబులం బ్రసిద్ధి వహించి గణుతింపంబడుఁ, త్రేతాయుగంబున రక్తవర్ణుండయి [1]బాహుచతుష్క మేఖలాత్రయ విశిష్టుండయి హిరణ్యకేశుండును వేదత్రయ స్వరూపుండును స్రుక్స్రువాద్యుపలక్షణ శోభితుండు నయి విష్ణుయజ్ఞ కృపీటభవ పృశ్నిగర్భ సర్వదేవోరుక్రమ వృషాకపి జయంతోరుగాయాఖ్యల బ్రహ్మవాదులచేత నుతియింపంబడు, ద్వాపరంబున శ్యామలదేహుండును బీతాంబరధరుండును బాహుద్వయోపశోభితుండును దివ్యాయుధ ధరుండును శ్రీవత్స కౌస్తుభవనమాలికావిరాజమానుండును మహారాజోపలక్షణుండును నై జనార్దన వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధనారాయణవిశ్వరూప సర్వభూతాత్మకాది నామంబుల వెలసి మూర్ధాభిషిక్తులచేత సన్నుతింపంబడుఁ, గలియుగంబునఁ గృష్ణవర్ణుండును గృష్ణనామ

1. బాహుచతుష్క...... విశిష్టుఁడు = నాలుగుచేతులతో మూఁడు పేటల మొలనూలుతోఁ గూడినవాఁడు.

క్షుండునునై భక్తసంరక్షణార్థంబు పుండరీకాక్షుండు యజ్ఞసంకీర్త
నంబులచేతం బ్రస్తుతింపంబడు, హరి రామ నారాయణ నృసింహ
కంసారి నలినోదరాది బహువిధ నామంబులచే బ్రహ్మాదులు నైన
మునీంద్రులు నుతియింపుదురు. మఱియును, 77

తే. ద్రవిడదేశంబునందులఁ దామ్రపర్ణి
[1]సహ్యజా కృతమాలాది సకల నదుల
కెవ్వఁ డేనియు భక్తితో నేగి యచటఁ
బొదలి తర్పణ మొగిఁ జేయఁ బుణ్యుఁ డగుదవు. 78

వ. ఇవ్విధంబునఁ బ్రశంసింపందగిన [2]కావేర్యాది మహానదీపావన జల
స్నానపానదానంబులను విష్ణుధ్యానకథాసుధారసానుభవంబుల
నిరూఢులగు భాగవతోత్తములు గలిగి రేనియుం జెడనిపదంబునుం
బొందుదురని ఋషభకుమారులు [3]భగవత్ప్రతిబింబంబు లయిన
పరమపురుషులుం బోలె విదేహజనపాలునకు [4]నిశ్రేయస పదప్రాప్తి
కరంబులైన భగవద్భక్తి ధర్మంబు లుపదేశించి యంతర్ధానంబు
నొందిరి. మిథిలేశ్వరుండును జ్ఞానయోగం బంగీకరించి నిర్వాణ
పదంబునొందె. నీయుపాఖ్యానంబు వ్రాసినఁ బఠించిన వినిన
నాయురారోగ్యైశ్వర్యంబులు గలిగి పుత్రపౌత్రవంతులై సకల
కలికల్మషరహితులై విష్ణులోకనివాసు లగుదు రని నారదుండు
వసుదేవునకుం జెప్పి మఱియును. 79

సీ. కమలాక్షపదభక్తి కథనముల్ వసుదేవ
విని యఘంబులఁ బాసి వెలసి తీవు
భువనప్రసిద్ధిగాఁ బొలుపొందు సత్కీర్తి
[5]కైవల్యలక్ష్మియుఁ గలుగు మీఁద
నారాయణుండు నీ నందనుం డను మోహ
మెడలించి విష్ణుగా నెఱిఁగి కొలువు
మతఁడు నీతనయుఁడై యవతరించుటఁ జేసి
సిద్ధించె దేహ సంశుద్ధి నీకు

1. (పాఠా) ఇలను గావేరియై ప్రవహించెఁ గాన నెవ్వఁ 2. (పాఠా) కావేరి జలస్నానం. 3. (పాఠా) భగవత్ప్రతినిహితులు. 4. నిశ్శ్రే...రంబులు = మోక్ష స్థానమును బొందించునవి. 5. కైవల్యలక్ష్మి = మోక్షసంపద.

తే. సరస సల్లాప సౌహార్ద్ర ✽ సౌష్ఠవమునఁ
బావనం బయ్యె శిశుపాల ✽ పౌండ్ర నరక
ముర జరాసంధ యవనులు ✽ ముదముతోడ
వాసుదేవునిఁ జెందిరి ✽ వైరు లయ్యు. 80

క. దుష్టజన నిగ్రహంబును | [1]శిష్టప్రతిపాలనంబు ✽ సేయన్ హరి దా
సృష్టి నవతార మొందెను | స్రష్టృముఖానేకదివిజ ✽ సంఘము వొగడన్.

వ. అట్లు గావున లోకరక్షణార్థంబు కృష్ణుం డవతారంబు నొందెనని హరిభక్తి పరంబు లగు నుపాఖ్యానంబులు నారదుం డుపన్యసించిన విని విస్మితచిత్తులై దేవకీవసుదేవులు కృష్ణునిం బరమాత్మునింగా విచారించి రని శుకుండు రాజునకుం జెప్పిన, నతండు మునీంద్రా యదువుల నేప్రకారంబున హరి హరియించె సపరివారులగు బ్రహ్మ రుద్రేంద్ర దిక్పాలక మునీంద్రులు ద్వారకానగరప్రవేశం బెట్లు చేసిరి యే మయ్యె మఱియుం బరమేశ్వర కథామృతంబు వీనులలరం జవి గొనియు నింకం దనివి సనదు భక్తరక్షకుం డగు హరిచారిత్రం బేరీతిం జాఁగెఁ దద్వ్యతి వృత్తాంతం బంతయు నెఱింగింపు మనిన శుకుం డిట్లనియె. 82

—♦ బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణుని వైకుంఠమునకుఁ బిలువ వచ్చుట. ♦—

క. సురగరుడ ఖచరవిద్యా | ధరహరపరమేష్ఠి ముఖసు ✽ ధాశనులు మునుల్
సరసిజనయనునిఁ గనుఁగొన | నరుదెంచిరి ద్వారవతికి ✽ నతిమోదమునన్

క. కని పరమేశుని యాదవ | వనశోభిత పారిజాతు ✽ వనరుహనేత్రున్
జనకామిత ఫలదాయకు | వినుతించిరి దివిజు లపుడు ✽ వేదోక్తములన్.

తే. అఖిలలోకేశ సర్వేశ ✽ యభవ నీవు
నుదయమందుట భూభార ✽ ముడుపుకొఱకు
[2]బంచవింశోత్తర శతాబ్ద ✽ పరిమితంబు
నయ్యె విచ్చేయు వైకుంఠ ✽ హర్మ్యమునకు. 85

వ. అనినఁ గమలభవ భవముఖ నిఖిల సురగణంబుల వచనంబు లియ్యె

1. శిష్టప్రతిపాలనంబు=సజ్జనరక్షణము. 2. పంచ......తంబు=నూట యిరువదియైదు సంవత్సరముల పరిమితిగల కాలము.

కొని కృష్ణుండు వారలతోడ యాదవుల కన్యోన్య వైరానుబంధంబులు కల్పించి వారల హతంబు గావించి భూభారంబు బడంచి యిదె వచ్చెదం బొండని చెప్పి వీడ్కొలిపినఁ గమలాసనాది బృందారకులు నిజస్థానంబులకుఁ జని రంత.

—◆ కృష్ణుండు దుర్నిమిత్తంబులంగని యాదవులనెల్ల ద్వారకనుండి ప్రభాసతీర్థమునకు బంపుట ◆—

సీ. కాక [1]ఘూకంబులు ✤ కనక సౌధములలోఁ
బగలు వాపోయెడి ✤ బహువిధముల
నశ్వవాలములందు ✤ ననల ముద్భవ మయ్యె
నన్నంబు మొలచె మహా✤ద్భుతముగ
శుకశారికలు రాత్రి ✤ సొగసె విస్వరముల
జంతువు వేఱొక్క ✤ జంతువుఁ గనె
నొగిఁ బౌరగృహముల ✤ నుత్పల లుదయించె
బెరసెఁ గావిరి రవి✤బింబ మపుడు

తే. గాన [2]నుత్పాతములు చాలఁ ✤ గానఁబడియె
నరయ నిందుండ వలవదు ✤ యదువులార
తడయ కిపుడ ప్రభాసతీర్థమున కరుగుఁ
డనుచు శ్రీకృష్ణుఁ డెంతయు ✤ నానతిచ్చె. 87

క. నారాయణువచనముల క।పారంబగు సమ్ముదమున✤జలముతోడన్
దారసుతమిత్త్రయుతులై। వారణహయసమితితోడ✤వడి నేగిరొగిన్.

వ. అంత.

క. జ్ఞానమున నుద్ధవుఁడు దన।మానసమున నెఱిఁగి శ్రీర✤మాధిపహరి యో
దీనజనకల్పభూజ సు।ధీనాయక మాకు నీవె✤దిక్కని పొగడన్. 90

—◆ కృష్ణుం డుద్ధవునకుఁ బరమార్థోపదేశము సేయుట. ◆—

వ. ఇట్లు నుతియించి దేవా నీవు యదుక్షయంబు గావించి చనిన నే మేవిధంబున నిర్వహింతుము, నీసహచరులమై జరపిన మజ్జనభోజన శయనాసనాది కృత్యంబులు మఱవ వచ్చునే యని యుద్ధవుండాడిన

1. ఘూకంబులు = గుడ్లగూబలు. 2. ఉత్పాతములు = అపశకునములు.

వాసుదేవుం డిట్లనియె. బ్రహ్మాదిదేవతా ప్రార్థనంబునం జేసి ధాత్రీ
భారంబు నివారించితి నింక ద్వారకానగరంబు నేఁటికి సప్తమదివ
సంబున సముద్రుండు ముంపంగలవాఁడు యదుక్షయంబునుం గాఁగలఁ
యది యంతటం గలియుగంబునుం బ్రాప్తం బయ్యెడి నందు మాన
వులు ధర్మవిరహితులు నాచారహీనులు నన్యాయపరులు నతి
రోషులు మందమతులు నల్పతరాయువులు బహురోగపీడితులు
నిష్ఫలారంభులు నాస్తికులు నై యొండొరుల మెచ్చకయుందురు,
గావున నీవు సుహృద్బాంధవస్నేహంబు వర్జించి యింద్రియసౌఖ్యం
బులఁ బొరయక క్షోణీతలంబునంగల పుణ్యతీర్థంబుల నవగాహ
నంబు సేయుచు మానస వాగక్షి శ్రోత్రఘ్రాణేంద్రియగృహ్యమాణం
బగు వస్తుజాతంబెల్ల నశ్వరంబుగా నెఱుంగుము, పురుషుండు
నానార్థకామంబుల నంగీకరించి నిజగుణదోషంబుల మోహితుండై
యుండుంగావున [1]హాస్తిపకుండు [2]గంధనాగంబుల బంధించు చందం
బున నింద్రియంబులను మనోవికారంబులను నిగ్రహించి యీషణ
త్రయంబును వర్జించి మోదఖేదంబుల సముండవుగా వర్తించుచు
నీజగంబంతయు నాత్మాధిష్ఠితంబుగా నెఱింగి మాయాదు లాత్మ
తత్త్వాధీనంబులుగాఁ దెలియుచు జ్ఞానవిజ్ఞానయుక్తుండవై యాత్మా
నుభవసంతుష్టుండవై విశ్వంబును నన్నుఁగా భావించి వర్తింపవల
యునని వాసుదేవుం డానతిచ్చిన నుద్ధవుండు భక్తిభయవినయంబు
లం గరంబులు మొగిడ్చి మహాత్మా సన్న్యాసలక్షణంబు దుష్కరం
బు పామరులగువార లాచరింపలేరు నీ మాయచేత భ్రాంతులైన
సాంసారికులు భవాబ్ధిం గడచి యెట్లు ముక్తి వడయుదురు భృత్యుండ
నైన నామీఁది యనుగ్రహంబునం జేసి యానతిమ్ము, బ్రహ్మాది
దేవతా సముదయంబును బాహ్యవస్తువుల భ్రాంతులై పర్యటనంబు
సేయుదురు, నీభక్తులైన పరమభాగవతు లమ్మాయ నిరసనంబు
సేయుదురు, గృహిణీ గృహస్థుల కైన యతుల కైన నిత్యంబును
నీనామస్మరణంబు మోక్షసామ్రాజ్యప్రదంబు గావునఁ బరమేశ్వర
నీదుచరణంబుల శరణంబు నొందెదఁ గృపారసంబు నాపై నిగిడింపు
మని ప్రియసేవకుండైన యుద్ధవుండు పలికిన నతనికిఁ గంసమర్దనుం

1. హాస్తిపకుండు=మావటీఁడు. 2. గంధనాగంబులు=మదపుటేనుఁగులు.

డిట్లనియె, బురుషున కాత్మకు నాత్మయే గురువని యెఱుంగుము, కుపథంబులం జనక సన్మార్గవర్తివై పరమం బయిన మన్నివాసంబు నకుం జనుము, సర్వేశ్వరుల శక్తి సంపన్నుండ వైన నన్ను సాంఖ్యయోగపరులు నిరంతర భావంబులందుం బురుషభావంబుగా భావించి తలంచు చుందురు, మఱియు [1]నేక ద్వి త్రి చతుష్పాద బహుపాదాపాదంబులు నై యుండు జీవ జాలంబులలోన ద్విపాదంబులు గల మనుష్యులు మేలు వారలలోన నిరంతర ధ్యాన గరిష్ఠు లయిన యోగీంద్రు లుత్తములు వారలలో సందేహపరులచే నగ్రాహ్యుండ నగు నన్ను సత్త్వగుణ గ్రాహ్యునిఁగా నెఱిఁగి నిజచేతఃపంకజంబు నందు జీవాత్మపరమాత్మల నేకంబుగాఁ జేసి శంఖ చక్ర గదాఖడ్గ శార్ఙ్గ కౌమోదకీ కౌస్తుభాభరణ యుక్తుంగా నెఱుంగుచు నుందు వారలు పరమయోగీంద్రులనియును పరమజ్ఞానులనియుం జెప్పి మఱియు [2]నవధూత యదుసంవాదంబను [3]పురాతనేతిహాసంబు గలదు సెప్పెద నాకర్ణింపుము. 91

—♦ అవధూత యదు సంవాదము. ♦—

ఉ. పంకజనాభుఁ డుద్ధవుని పైఁగల కూర్మిని జెప్పె నొప్పనా
తంకుఁడు మత్పితామహుఁడు దాఁ బదునాల్గవ తాతయున్నచో
శంకరవేషధారి యగు సంయమి యొక్కరుఁడేగుదెర నే
వంకను నుండివచ్చి తని వానికి నిట్లనె నర్థి నేర్పడన్. 92

క. అవధూతుం డనె నంతటఁ
బ్రవిమల విజ్ఞాన నిపుణ భవ్యులు గురువుల్
తవిలిన నిరువది నలువురు
నవనిన్ విజ్ఞాని నైతి నని పల్కుటయున్. 93

వ. అంత యదుప్రవరుండు దేహి లోభ మోహాదుల వర్జించి జనార్దనుని నేవిధంబునం జేరవచ్చు నెఱింగింపుమనిన నతండిట్లనియె. 94

1. ఏకద్వి.....పాదంబులు = ఒకటి రెండు మూఁడు నాలుగు పాదములు కలవి, అంతకంటె నెక్కుడు పాదములుకలవి, పాదములే లేనివి. 2. అవధూత = దిగంబరసన్న్యాసి. 3. పురాతనేతిహాసంబు = పూర్వము జరిగిన కథ.

సీ. పరధనపరదార ♦ పరదూషణాదులఁ
బరవస్తుచింత దాఁ ♦ బరిహరించి
ముదిమిచే రోగము ♦ లుదయింప కటమున్న
తనువు చంచలతను ♦ దగులకుండ
బుద్ధిసంచలతచేఁ ♦ బొదలక యటమున్న
శ్లేష్మంబు గళమునఁ ♦ జేరకుండ
శక్తి యుక్తులు మది ♦ సన్నగిల్లక మున్న
భక్తిభావనచేతఁ ♦ బ్రాఘుఁడగుచు

తే. దైత్యభంజను దివ్య పాదారవింద
భజన నిజభక్తిభావనఁ ♦ బ్రాజ్ఞుఁ డగుచు
నవ్యయానందమునఁ బొందు ♦ ననుదినంబు
నతఁడు కర్మవిముక్తుఁ డౌ ♦ ననఘచరిత. 95

ఉ. దారలయందుఁ బుత్రధన ♦ ధాన్యములందు ననేకభంగులం
గూరిమిసేయుమర్త్యుఁ డతి ♦ ఘోరవియోగజదుఃఖమగ్నుఁడై
నేరుపు దక్కి చిక్కువడి ♦ నీతి వివేకవిహీనుఁడై మనో
భ్రామితో గపోతపతిభంగి నిజంబుగఁ బోవు నష్టమై. 96

వ. ఇందులకొక్క యితిహాసంబు గలదు, మహారణ్యంబున నొక్కకపో
తంబు దారసమేతంబుగా నొక్క [1]నికేతనంబు నిర్మించి యన్యోన్య
మోహాతిరేకంబునఁ గొంతకాలంబునకు సంతాన సమృద్ధిగలదియై
యపరిమితంబులయిన పిల్లలు దిరుగాడుచుండఁ గొన్ని మాసంబులు
భోగానుభవంబునం బొరలుచుండఁ గాలవశంబున నొక్క లుబ్ధకుం
డురులొడ్డిన నందు [2]దారాపత్యంబులు దగులు వడిన ధైర్యంబు
వదలి మోహాతిరేకంబునం గపోతంబు కళత్రపుత్రస్నేహంబునం
దాను నందుఁజొచ్చి యధికచింతాభరంబునం గృశీభూతంబయ్యెఁ
గావున నతితీవ్రంబయిన మోహంబు గొఱగా దట్లుగాన నిరంతర
హరిధ్యానపరుండై భూ గగనానిల జల [3]కృపీటభవ సోమసూర్య
కపోత [4]తిలిప్స శలభ మధు మక్షికాజగర ద్విరేఫ హరిణ [5]పాఠీన

1. నికేతనంబు=నివాసము. 2. దారాపత్యంబులు=భార్యయుబిడ్డలు. 3. కృపీట
భవము=అగ్ని. 4. తిలిప్సము=కొండచిలువ. 5. పాఠీనము= వేయి కొఱలచేప.

పింగళా కురర డింభక కుమారికా శరకృత్సర్ప [1]లూతా [2]సుపేశకృత్సముదయంబులు మొదలుఁగాఁగల వాని గుణంబు లెఱింగికొని యోగీంద్రులు మెలఁగుచుందురు.

క. [3]ఇవి తెలియవలయు. నీకును
బ్రవిమలమతితోడఁ దెలియఁ బలికెద వీనిన్
వివరముగ ననుచుఁ గృష్ణుఁడు
సవినయుఁడగు నుద్ధవునికిఁ జయ్యనఁ జెప్పెన్. 98

వ. ఇవ్విధంబున భూమివలన స్థైర్యము గంధవహునివలన బంధురంబగు పరోపకారంబును విష్ణుపదంబువలనఁ గాల స్పృష్టగుణాసాంగత్యంబును నుదకంబువలన నిత్య శుచిత్వంబును నగ్నివలన నిర్మలత్వంబును నిశాకరప్రభాకరులవలన నధికాల్ప సమత్వజీవగ్రహణ మోక్షణంబులును గపోతంబువలనఁ గళత్రపుత్రస్నేహంబును నజగరంబువలన స్వేచ్ఛావిహార సమాగతాహారంబును వననిధివలన నుత్సాహ రోషంబులును శలభంబువలన శక్త్యనుకూలకర్మాచరణంబును భృంగంబువలన సారమాత్రగ్రహణవిశేషంబును [4]స్తంబేరమంబు వలనం గాంతావైముఖ్యంబును [5]సరఘువలన సంగ్రహగుణంబును హరిణంబువలనం జింతాపరత్వంబును జలచరంబువలన జిహ్వా చాపల్యంబును బింగళవలన యథాలాభ సంతుష్టియు గురరంబు వలన మోహపరిత్యాగంబును డింభకువలన విచారపరిత్యాగంబును గుమారికవలన సంగత్యాగంబును శరకారునివలనం దదేకనిష్ఠయు [6]దందశూకంబు వలనం బరగృహావాసంబును [7]నూర్ణనాభివలన సంసారపరిత్యాగంబును [8]గణుందురు వలన లక్ష్యగతజ్ఞానంబై విడువకుండుటయు ననం గల వీని గుణంబు లెఱింగి మఱియుఁ గామ క్రోధ లోభ మోహ మద మత్సరములను నరిషడ్వర్గంబుల జయించి జరా మరణవిరహితంబుగా వాయువశంబు చేసి గాత్రపవిత్రత్వంబు

1. లూతా = సాలెపురుగు. 2. సుపేశకృత్ = కణుఁదురీఁగ. 3. ఇవి...... నిన్ = 'వినే యీ గుణములన్నియుఁ బ్రవిమలమతి నీకుఁ దెలియఁ బలికెద వినుమా' 4. స్తంబేరమంబు = ఏనుఁగు. 5. సరఘ = తేనెటీఁగ. 6. దందశూకము = సర్పము. 7. ఊర్ణనాభి = సాలెపురుగు. 8. కణుందురు = కణుఁదురీఁగ.

కొంఱకు షట్కర్మనిరతుండయి పుర నగర గ్రామంబులు పరిత్యజించి పర్వతారణ్యంబుల సంచరించుచు శరీరధారణార్థంబు నియత స్వల్ప భోజనుండై ఖేద మోదంబులు సరియకా భావించి లోభ మోహంబులు వర్జించి నిర్జితేంద్రియుండయి నన్నుగాని యొండెఱుంగక యాత్మనిష్ఠచేఁ బవిత్రాంతఃకరణుండైన యోగినాయందుఁ గలయుం గావున.

క. మోహితుఁడై వసుకాంతా
వాహినిలోఁ జిక్కి క్రూరవశుఁడై మనుజుం
డూహాపోహ లెఱుంగక
దేహము నలుఁగంగఁ జేయు దీనత నెపుడున్. 100

వ. ఇందుఁకుఁ బురాతన వృత్తాంతంబు గలదు సావధానచిత్తుండవై వినుము, మిథిలానగరంబునఁ బింగళయను గణికారత్నంబు గలదు దానివలనం గొంత పరిజ్ఞానంబుఁ గంటి నదెట్లనిన, నమ్మానిని ధనకాంక్షం జేసి యాత్మసఖుని మొఱంగి ధనం బిచ్చువానిం జేకొని నిజనికేతనాభ్యంతరంబునకుం గొని చని రాత్రి నిద్ర లేకుండుచుఁ [1]బుటభేదన విపణి మార్గంబులం బర్యటనంబు సలుపుచు నిద్రాలస్యభావంబున జడనువడి యర్థాపేక్షం దగిలి తిరిగి యలసి యాత్మసుఖంబుసేయు నతండె భర్తయని చింతించి నారాయణు నిట్లు చింతింప నతేని కైవల్యంబు చేరవచ్చునని విచారించి నిజ శయన స్థానాదికంబు వర్జించి వేగిరంబ వాసుదేవ చరణారవింద వందనాభిలాషిణియై దేహంబు విద్యుత్ప్రకారంబని చింతించి పరమతత్త్వంబునం జిత్తంబుఁ గీలుకొలిపి ముక్తురాలయ్యెనని యెఱింగించి.

క. దేహము నిత్యము గాదని
మోహముఁ దెగఁ గోసి సిద్ధ మునివర్తనుఁడై
గేహము వెలువడి నరుఁడు
త్స్నేహమునం జెందు ముక్తి సంపద ననఘా. 101

వ. మఱియు నొక్క విశేషబయిన పురాతన పుణ్యకథ వినుము: కనకావతీపురంబున నొక్క ధరామరుని కన్యకారత్నంబుగల దవ్వధూ

1. పుట......మార్గంబులన్ = పట్టణపు బజారు వీథులందు.

తిలకంబు రత్నసమేతంబులగు కంకణంబులు ధరియించి బంధుజనంబులకుఁ బరమాహ్లాదంబుగా నన్నంబు గావించుటకొఱకు [1]శాలితండులంబులు దంచునప్పుడు ముసలగ్రహణ ఘాతంబున గంకణంబులతిరావంబుగా మ్రోయుచుండ నప్పరమపతివ్రత యందులకు నసహ్యపడి యన్నియు డులిచి యొక్కటి నిలిపె, నట్లు గావునఁ దత్తఱపడక భగవదాయత్తంబయిన యేకచిత్తంబునఁ బ్రసన్నచిత్తులై నరులు ముక్తులగుదురుగావున నవిద్యావిద్యలు నా మాయగావిచారించి కేవలపశుమార్గులుగాక [2]షడ్గుణైశ్వర్యసంపన్నులైన యోగీశ్వరులపగిది సుఖంబు గోరక యుండువారలు ముక్తలగుదురు, సర్వంబును విష్ణుమయముగాఁ దెలియుమని యుద్ధవునికిం జెప్పిన నతండు దేవా నీరూపంబేలాగునం గానవచ్చుననిన నతండిట్లనియె: భక్తిభావన పరాయణుండై కృపారస తత్పరుండై మితభాషణుండై బొంకక కర్మంబులు మదర్పణంబుగాఁజేసిన యతండు భాగవతుం డనంబరఁగు, మత్కథలును మజ్జన్మ కర్మంబులును వినుచు మత్సేవకులైన భాగవతులంజూచి తన గృహంబునకుంగొనిపోయి మజ్జన పూజన భోజనశయనాసనాదికంబులఁబరితుష్టులంజేసిన యతండైనను భాగవతుం డనఁబడు నిట్లొంత కాలంబు జీవించు నంత కాలంబును నడపునతండు మద్రూపంబునవైకుంఠనిలయంబునొందు, నదియునుంగాక గంధ పుష్పధూపదీప నైవేద్యంబుల లక్ష్మీసమేతుండనై శంఖ చక్ర గదా శార్ఙ్గాది యుక్తుండనైన నన్ను శుక సనకాది యోగీంద్రులునంబరీష విభీషణరుక్మాంగదులు మొదలుగాఁ గల భాగవతులును నాచార శాస్త్రచోదితులుగాక భక్తి భావనా విశేషంబున నేమఱక నిత్యంబును జింతనాయత్తులై యెఱింగిరి. మధురాపురంబునకు [3]హలాయుధ సమేతుండనై యే నరుగుచో గోపికలోపికలులేక భక్తియోగంబునఁ జింతించి ముక్తులై, రిది భక్తియోగప్రకారం బని యుద్ధవునికిం జెప్పిన

1. శాలితండులంబులు=వరిబియ్యము. 2. షడ్గుణైశ్వర్యసంపన్నులు=భగవంతుని ఐశ్వర్య వీర్యాదులగు షడ్గుణములతోఁ గూడినవారు. 3. హలాయుధుఁడు = బలరాముఁడు.

క. ధ్యానం బే క్రియ నిలుచును । ధ్యానం బేరీతి దగు సుశ్వాత్తచరిత్రా
ధ్యానప్రకారమంత 1యనూనంబుగఁ జెప్పుమయ్య యుర్వీరమణా.

వ. అని యడిగిన నయ్యాదవేంద్రుం డిట్లని పలుకం దొడంగె, దారుమధ్యభాగంబున ననలంబు సూక్ష్మరూపంబున వర్తించుచందంబున నందంబై సకల శరీరులయందు 2నచ్ఛేద్యుండు 3నదాహ్యుండు 4నశోష్యుండు నైన జీవుండు వసించి యుండు ననిన హరికి నుద్ధవుం డిట్లనియె: సనకసనందనాది యోగీంద్రులకు యోగమార్గం బేరీతి నానతిచ్చితి వది యేవిధం బానతీయవే యని యభ్యర్థించిన నతం డిట్లనియె: వారలు చతుర్ముఖు నడిగిన నతండు నేనును దెలియనేరననిన వారలు విస్మయంబందుచుండ నే నా సమయంబున హంసస్వరూపుండనై వారల కెఱింగించిన తెఱంగు వినుము, పంచేంద్రియంబులకు దృష్టంబయిన పదార్థం బనిత్యం బది నిత్యదృష్టి బ్రహ్మం బని తెలియవలయు దేహి కర్మార్జిత దేహుండై సంసార మమతలు నిరసించి నిశ్చల జ్ఞానయుక్తుండై మత్పదప్రాప్తుండగు స్వప్నలబ్ధ పదార్థంబు నిజంబు గాని క్రియఁ గర్మానుభవ పర్యంతంబు కళేబరంబు వర్తించునని సాంఖ్య యోగంబును సనకాదుల కెఱింగించిన విని బ్రహ్మ మొదలైన దేవత లెఱింగిరి వారివలన భూలోకంబునఁ బ్రసిద్ధం బయ్యె నది గావున నీవు నెఱింగికొని పుణ్యాశ్రమంబులకుఁ జనుము. అస్మదీయ భక్తియుక్తులును హరిపరాయణులు నగువారల చరణరజఃపుంజంబు తనశరీరంబు సోకఁ జేయు నతండును ముద్రాధారణయును హరి దివ్యనామంబులు ధరియించువారలకు నన్నోదకంబుల నిడు నతండును వాసుదేవ భక్తులం గని హర్షించు నతండును భాగవతులని చెప్పి మఱియు సర్వసంగ పరిత్యాగంబు సేసి యుండఁజాలంగక నన్నె తలంచు మానవునకు భుక్తి ముక్తిప్రదాయకుండనై యుండుదునని యానతిచ్చిన నుద్ధవుండు జ్ఞానమార్గం బేరీతి యానతీయవలయుననిన హరి యిట్లనియె నేకాంతమానసులై హస్తాబ్జంబు లూరుద్వయంబున సంధించి నాసాగ్రంబున నీక్షణంబు నిలిపి ప్రాణాయామంబున

1. అనూనంబుగ = అధికంబుగ. 2. అచ్ఛేద్యుండు = భేదింపరానివాఁడు.
3. అదాహ్యుండు = కాల్పరానివాఁడు. 4. అశోష్యుండు = ఎండింపరానివాఁడు

